# ఆముక్తమాల్యద

## సౌందర్యలహరీ వ్యాఖ్యానం

## ద్వితీయభాగం - II

"అభినవ భారతి"

ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు

మలయకూట పబ్లికేషన్స్ హైదరాబాదు - 57

2001

# AMUKTHAMALYADA

*Published by*
**Prof. T. KoteswaraRao**

Volume - II

Copies : 1,000






Price : Rs. 500/-



*This book is published with the financial assistance of Tirumala-Tirupati Devasthanams under their Scheme*
**"AID TO PUBLISH RELIGIOUS BOOKS"**

Copies can be had from

**T. Koteswara Rao**
324-2RT, P.S.Nagar
Hyderabad -57

**Visalandhra Publications**
Hyderabad




Laser Typesetted
**ANNAPURNA GRAPHICS**
53/3, R.S. Gardens
Tirupati - 517 507
☎ : (08574) 35006

Printed at
**Sai Sreenivasa Printers**
# 6-2-967, Kaarnik Towers
Khairatabad
Hyderabad - 500 004.
☎ : 3392566.



# ఆముక్తమాల్యదా సౌందర్యం

## చతుర్థాశ్వాసము

క॥ శ్రీమందిర భుజమధ్యమ
గోమండల కర్షి వేణుగుంభన, దృప్య
ద్భౌమాహృత సురజనయి
త్రీ మణి తాటంక ! వృషగిరిస్థ ! ఖగాంకా ! 1

శ్రీ= లక్ష్మికి; మందిర= ఇల్లైన; భుజమధ్యమ=రెండు భుజాల మధ్యభాగం కలవాడా! గో= ఆలయొక్క; మండల= మందలను; కర్షి= ఆకర్షించే; వేణు=పిల్లన గ్రోవి; గుంభన= పూరించుట గలవాడా! దృప్యత్=గర్విస్తున్న, భౌమ= భూమి యొక్క కుమారుడైన నరకాసురునుండి; ఆహృత= తీసికొని రాబడ్డ; సురజనయిత్రీ=దేవమాతయైన అదితి యొక్క; మణితాటంక=మణులు పొదిగిన చెవి దుద్దులు కలవాడా! వృష గిరిస్థ=వృషాద్రి నివాసా! ఖగ+అంకా=గరుత్మంతుడు గుర్తుగా కల జెండా కలవాడా.

తా॥ లక్ష్మికి నివాసమైన వక్షస్థలం కలవాడా! మురళి పాటతో ఆలమందలను ఆకర్షించినవాడా? అహంకరించిన నరకాసురుని చంపి, అతని దగ్గరున్న అదితియొక్క మణికుండలాలను తీసికొని వచ్చి ఆమెకిచ్చిన వాడా! వృషాచల నివాసా!, గరుడధ్వజా!

వ॥ అవధరింపు మా సమయంబున 2

### విష్ణు చిత్తుని విజయము

మ॥ బలిమిం ద్రెంపఁగం బోలెఁ బాయ వడుచుం బర్యాయ భంగంబుగాఁ
గలనూలెల్లను నంటు మోవఁ దెగి రాగాఁ గొంత సేపుండి, తాఁ
బెలుచన్గంటు పుటుక్కునం దునిసి వే పృథ్వీం బడె న్జాలె, మి
న్నుల మ్రోసె న్సుర దుందుభు ల్గురి సెఁ బెన్పూవై విరు ల్ప్రేరునన్. 3

అవధరింపుము= చిత్తగించు; ఆ సమయంబునన్= మధురాచక్రవర్తికి విష్ణుచిత్తుడు శరణాగతి ధర్మోపదేశం చేసిన వేళ.

బలిమిన్=బలవంతంగా; త్రెంపగన్ పోలెన్=లాగి తెగగొట్టినట్లు; పాయ పడుచున్= త్రాడులోని

పేటలు విడిపోతూ; పర్యాయ = ఒక పేట తర్వాత మరొక పేటగా; భంగంబుగాన్= తెగడం వల్ల, కలః ఉన్న; నూలు+ ఎల్లన్=దారమంతా; అంటు మోవన్=చిట్టచివరి అంటు పోగు మాత్రము ఉండేంత వరకు, తెగి రాగాన్=తెగిపోయినాక, జాలె=సంచి; తాన్=తాను కొంతసేపు+ ఉండి=అంటు పోగు మాత్రమున్నందున కొంతసేపు అలా నిలిచి, గంటు=ముడి; పెలుచన్=హఠాత్తుగా, ఫుటుక్కనన్=ఫుటుక్కుమన్న ధ్వనితో; తునిసి=తెగి; వే=వేగంగా; పృథ్విన్+పడెన్=వరహాల మూట నేలపై పడ్డది, సురదుందుభుల్=దేవతల భేరీ వాద్యాలు; మిన్నులన్= ఆకాశంలో; మొరసెన్=మ్రోగినవి; బోరునన్=హోరుమన్న ధ్వనితో; విరుల్ =పుష్పాలు; పెన్=పెద్ద; సోనై=వర్షమై; కురిసెన్=కురిసింది.

తా॥ విష్ణుచిత్తుడీ విధంగా వాదులందరినీ జయించి రాజును వైష్ణవుని చేసినాక సభాస్థల స్తంభానికి కట్టిన వరహాల సంచిని ఎవరో బలాత్కారంగా తెంచినట్లుగా త్రాడు పాయలుగా విడిపోతూ ఉన్న దారమంతా తెగిపోయి చిట్టచివరి నూలు పోగు మాత్రం ఉన్నందు వల్ల, సంచి కొంతసేపు వ్రేలాడి ఆ గంటు కూడా తెగిపోయి పెద్ద మ్రోతతో క్రింద పడింది. ఆకాశంలో దేవ దుందుభులు ధ్వనించినవి. పుష్పాలు వానజల్లులై వ్రాలినాయి.

విశేషము : 2-85వ పద్యంలో రాజు కట్టించిన వరహాల సంచి విషయం చెప్పబడింది. అది తెగి పడటం ఇక్కడ చెప్పబడింది. బరువెక్కిన సంచి- ఉట్టి దూలానికి వ్రేలాడుతూ ఎలా తెగిపోతుందో, ఆ దృశ్యం ఇక్కడ చాలా సహజంగా అద్భుతంగా వర్ణింపబడింది. త్రాడు ముప్పేటలుగా ఉంటుంది. కనుక అందులో పాయ తర్వాత పాయ తెగిపోవటం చిట్టచివర ముడి వేసిన అంటు పోగు మాత్రం తెగకుండా ఉన్నందు వల్ల చివరకు దూలానికి అంటుకొని ఉన్న చివరి అంటుపోగు కూడా తెగి, గబాలున వస్తువు నేలపై పడటం- ఈ క్రమంగా వర్ణింపబడినందు వల్ల ఈ వర్ణన అద్భుత స్వభావోక్తి, తెగిపోవటంలోని సూక్ష్మమైన క్రమాన్ని వర్ణించటం వల్ల పర్యాయోక్తమన్న అలంకారం సంఘటితమైనది.

'బలిమిన్ త్రెంపగ బోలె' అన్నందువల్ల ఏదో అదృశ్య శక్తిచేత అలా జరిగినట్లు చెప్పడం వల్ల ఇది శ్రీవిష్ణు మహిమ అని ధ్వనిస్తుంది. 4వ ఆ॥ లో యామునాచార్యుడు శైవమతాన్ని జయించినపుడు కూడా సభాప్రాంగణంలోని రాని చెట్టు మాట్లాడిన విషయం 474 వ పద్యంగా వ్రాయబడ్డది. కనుక ఇది దైవ మహిమగా చెప్పబడ్డది. కావ్యం నిండా ఈ దైవశక్తి పరుచుకొని ఉన్నది.

శా॥ ఆవేళ న్పతి పారితోషికము లీ నందంద పంపన్, భ్రమ
 త్సేవివ్రాతముచే ద్రుతస్ఖలిత మై దీవ్య న్మణి స్వర్ణ భూ
షా వాసచ్ఛట జామదఘ్న్య యగుచు న్వంసచ్ఛతుశ్శాలికా
రై వేశ్మాంతర పద్ధతిన్ నెరసె గోత్రాచిత్రమాల్యంబనన్. 4

ఆవేళన్= ఆసమయంలో; పతి=రాజు; పారితోషికములు=బహుమానాలు; ఈన్= ఇవ్వటానికి; అందంద=అప్పుడప్పుడే; పంపన్=పంపించగా (సేవకులను); భ్రమంత్=తిరుగుచున్న, సేవి వ్రాతము=సేవకుల గుంపుయొక్క; చేన్=చేతులనుండి; ద్రుత స్ఖలిత= వేగంచేత జారిన;

దీవ్యత్=మెరుస్తున్న; మణి=రత్నాలు; స్వర్ణ=బంగారంతో చేసిన; భూషా=నగలయొక్క; వాసస్=వస్త్రాలయొక్క; ఘట=సమూహము; గోత్ర=భూదేవియొక్క; చిత్ర=రంగు రంగుల; మాల్యంబు=దండయో; అనన్=అన్నట్లుగా; సంసత్+చతుశ్శాలికా= సభామందిరముయొక్క; రైవేశ్మ=బొక్కసముయొక్క (రై=ధనము, వేశ్మము= ఇల్లు); అంతర=మధ్యనున్న; పద్ధతిన్=దారిలో; జామదఘ్ని= మోకాలిబంటి; అగుచున్= అవుతూ; నెరసెన్= ఒప్పినవి.

తా॥ విష్ణు చిత్తుని విజయాన్ని పురస్కరించుకొని పాండ్యరాజు బహుమతు లివ్వడానికి సేవకుల నాజ్ఞా పించాడు. వారు కోశాగారంనుండి రత్నాలు బంగారు ఆభరణాలు వస్త్రాలు సందడిగా మోసుకొని తెస్తున్నారు. వారు వేగంగా తెస్తున్నందువల్ల అవి జారి క్రిందపడి కోశాగార సభామందిర మధ్యనున్న మార్గమంతా మోకాలిబంటిదాకా ఆభరణాదులున్నాయి. అదెలాగున్నదంటే భూదేవి మెడలో ధరించిన రంగురంగుల పూల దండయో అన్నట్లున్నది.

విశే ॥ పారితోషికమంటే పరితోష = సంతోషము ప్రయోజనముగా గలది. 'గోత్రాచిత్ర మాల్యంబనన్' భూదేవి కావ్యనాయికయైన గోదాదేవి. ఆమె కొప్పులో ధరించిన పూలదండనే భగవంతునికి అర్పించినది కనుక ఇక్కడ కూడా కొప్పున ముడుచుకొన్న దండయనే చెప్పుకోవచ్చు. అంటే భంగ్యంతరంగా కావ్యాన్ని, కావ్యనాయికను, కావ్యనాయకుని సమావేశాన్ని ధ్వనిస్తున్నది. ఇక్కడ కావ్యనాయకుడైన భగవంతుని విజయమే విష్ణుచిత్తుని విజయము. విష్ణుచిత్తుడు కట్టిన పూలదండయే గోదాదేవి కొప్పులో ధరించింది. ప్రస్తుత మిక్కడ భగవంతుని కోసం విష్ణుచిత్తుడు వాదించినాడు. కనుక ఈ పూలదండ కూడా అనుకోకుండ ఏర్పడింది. ఎవరూ కట్టినది కాదు.

**వేదవేద్యమైన విష్ణుతత్త్వం బిట్లు**
**వాదు గెలిచి తెలిపి వసుమతీశు**
**భక్తి నోలలార్చి భగవత్ప్రపన్నుఁగాc**
**జేసి, లోకహితము సేయుటయును. 5**

ఇట్లు = ఈవిధంగా; వాదు = ప్రతివాదాలను;గెలిచి = జయించి; వేద వేద్యము = వేదాలచేత తెలుసుకోదగిన; విష్ణుతత్త్వంబు = నారాయణ స్వరూపంబు; తెలిపి = ఎరిగించి; వసుమతి+ ఈశున్ = భూనాథుని; భక్తిన్ = భక్తితో; ఓలలు+ ఆర్చి = క్రీడింప జేసి; భగవత్ = విష్ణువునకు; ప్రసన్నుగాన్ = శరణాగతునిగా జేసి; లోకహితము = జగత్కళ్యాణము; చేయుటయున్ = చేసిన తర్వాత.

తా ॥ ఇతర మతస్థులైన పండితులను జయించి వేదవేద్యమైన విష్ణుతత్త్వాన్ని రాజునకు ఎరిగించి భక్తిరసంతో ఓలలాడించి భగవంతునకు శరణాగతునిగాజేసి లోకానికి హితాన్ని చేకూర్చగా.

**శా ॥ అద్ధా వాగ్విబుధం, బహోవచన కవ్యాహార, మాహోవచ**
**స్సిద్ధం బాః, కృతతాం గతః కలి రితి, శ్రీసూక్తి విద్యాధరం,**
**బిద్ధోద్ధత్య మగాల్లయం హి కుధియా మిత్థంవద త్కిన్నరం,**
**బ ద్ధీరాగ్రణి గెల్పుటుత్సవము నందయ్యె న్నభం బంతయున్. 6**

ఆ ధీర + అగ్రణీ = ఆ పండిత శ్రేష్ఠుయొక్క; గెల్పు + ఉత్సవము నందున్ = విజయ సంబంధమైన ఉత్సవంలో; నభంబు = ఆకాశము; అంతయున్ = సమస్తము; అద్ధా = ఓహో అనే; వాక్ = మాటలనే; విబుధంబు = దేవతలు గలది; అహో = ఆశ్చర్యం; వచన = మాటలుగల; సిద్ధంబు = సిద్ధులు గలది; ఆ = ఆహా; కలిః = కలియుగము; కృతతాం = కృతయుగ లక్షణాన్ని; గతః = పొందినది; ఇతి = అనెడు; శ్రీ = అందమైన; సూక్తి = మంచి మాటలుగల; విద్యాధరులు గలది; కు = చెడ్డ; ధియాం = బుద్ధిగల వారియొక్క; ఇద్ధ = ప్రకాశించే; ఔద్ధత్యం = గర్వం; లయం = నాశనమును; అగాద్ధి (అగాత్+హి) = పొందినది కదా!; ఇతి = ఈవిధంగా; ఉత్ + న = పెద్దగా అరుస్తున్న; కిన్నరంబు = కిన్నరులు గలది; అయ్యెన్ = అయినది.

తా ॥ విష్ణుచిత్తుని విజయానికి హర్షించిన దేవతలయొక్క ఆశ్చర్యార్థక శబ్దంతో ఆకాశమంతా బూరటిల్లి పోయింది. దేవతలు 'అద్ధా' అన్నారు. పితృదేవతలు 'అహో!' అన్నారు. విద్యాధరులు 'ఆహా ! కలియుగము కృతయుగమై పోయినది కదా !' అన్నారు. కిన్నరులు ' అపండితుల గర్వము అణగి పోయింది కదా !' అన్నారు.

విశే ॥ ఈ పద్యం 1-84లో లాగా సంస్కృతంలో వ్రాయబడినది. ఇక్కడ మాటలన్నీ దేవతలన్నని వారు గీర్వాణులు గనుక సంస్కృత భాషనే ఆశ్రయించి మాట్లాడటం ఔచిత్యం.

ఇది అద్భుత రసాత్మకమైన వర్ణన. దేవతలు ఆలంబన విభావాలు, వారి మాటలు ఉద్దీపన విభావాలు. ఆశ్చర్యచకితులైనందున వారి నేత్ర వికాసాదులు అనగా పులకాంకురాదిసాత్త్విక భావాలుగా (ఇవే అనుభావాలు) ధ్వనిస్తున్నాయి. వీటి సంయోగం వల్ల విస్మయమన్న స్థాయి భావం ధ్వనిస్తున్నది. కనుక అద్భుత రసం ఏర్పడుతున్నది. తర్వాత ఇలాగే యామునాచార్య కథలోను, దాసరికథలోను 4-74; 7-23 పద్యాలలో కూడా అద్భుత రసాలే. వానివివరణ పీఠికలో చెప్పబడ్డది. ధీర = ఆత్మవేత్త; ఇది ఔపనిషదశబ్దం.

సీ ॥ సెలవులు నాకుచు వెలియంంగులు సూడ
కరిగి పాదూవాహూ నరయువారు;
తమ మ్రోల నుండు నందలముఁ గానక దాఁటి
పేరెలుంగున బెస్తఁ జీరువారు
నగరు వెల్వడు దాఁకఁ దెగిపోయి మఱి నిల్చి
తోడి విద్వాంసులఁ గూడువారు
నెదురైన తమవాని గృహకృత్య మడిగి వాఁ
డనునవి తప్ప నూఁకొనెడివారు
తే ॥ 'వాద మేమాయె ?' నన్న 'భూవరుని పక్ష
పాత మా దాసరికిఁ గల్గి బ్రతికె'; నెనడు

వారు; 'నౌ లెం డిటు విమర్శ దూరమైన
వాకిట వసించు నెవ్వఁ?' డన్వారు నగుచు. 7

సెలవులు = పెదవుల మూలలు; నాకుచున్ = నాలుకతో తాకుచూ; వెలి అరంగులు = బయటి అరుగులు; చూడక = చూడకుండా; అరిగి = వెళ్ళి; పాదూవాహులన్ = పాదుకలు పట్టుకొని యున్న వానిని; అరయువారు = వెదకేవారు; పెదవుల మూలలను తడుపుకుంటూ సభామంటపము ముందున్న అరుగులమీద తమ చెప్పులు మోస్తూ ఉన్నవారిని చూడకుండా దూరంగావెళ్లి వారిని వెతికేవారు కొందరు; తమ మ్రోలన్ = తమ ముందే; ఉండు = ఉన్న; అందలమున్ = పల్లకీని; కానక = చూడక; దాటె = దాటుకొని పోయి; పేరెలుంగు = పెద్దకేక; ఇడి = పెట్టి; బొస్తన్ = బోయను; చీరువారు = పిలిచేవారు; తమ ఎదుటనే ఉన్న పల్లకీని చూడకుండా అవతలికి పోయి గొంతెత్తి పల్లకి మోసే బోయలను పిలిచేవారు కొందరు -

విశే ॥ అందలము వికృతి, ఆందోళిక ప్రకృతి, ప్రక్కల తలుపులు లేని పల్లకి.

నగరు = సభామండపము లేదా రాజసౌధ సమూహమున్న పేట; వెలు+వడు దాకా = వెలికి (బయటికి) పోయేదాకా; తెగిపోయి = ఒకరు నొకరు విడిపోయి; మరి = తర్వాత; నిల్చి = నిలబడి; తోడి విద్వాంసులన్ = ఇతర పండితులను; కూడువారు = కలిసేవారు.

తా ॥ రాజనగరు దాటేవరకు ఎవరికి వారుగా విడిపోయి రాచనగరు ప్రాకారం దాటాక ఇతర పండిత సమూహంతో కలుసుకునేవారు కొందరు.

ఎదురైన = తమకెదురుగా వచ్చిన; తమవారిన్ = తన మనిషిని; గృహకృత్యము = ఇంటి విషయం; అడిగి = ప్రశ్నించి; వాడు అనునవి తప్ప = చెప్పే మాటలు తప్ప; ఊకొనెడివారు = ఊఁ ! అని అనేవారు.

వాదము = సభావివాదము; ఏమి ఆయెన్ = ఏమి అయినది; అన్నన్ = అని ప్రశ్నిస్తే; భూవరుని= రాజుయొక్క; పక్షపాతము = పక్షపాత బుద్ధి; ఆ దాసరికిన్ = ఆ విష్ణుదాసరికి (దాసు = దాసరి ఈ శబ్దాలు విష్ణుభక్తుడన్న అర్థంలో ఉండగా బ్రాహ్మణేతర విష్ణుభక్తులకు అన్వయించడం పరిపాటి, కనుక ఇక్కడ దాసరి శబ్దం తిరస్కారార్థంలో వాడబడ్డది); కల్గి = లభించి నందువల్ల; బ్రతికెన్ = మాచేతిలో పడకుండా తప్పించుకొనిపోయాడు; అని = అనెడి వారున్; అవు లెండు = అవును లెండి; ఇటు = ఈ విధంగా; విమర్శ = సత్యా సత్యవిచారణ; దూరము+అయిన = లేనట్టి; వాకిటన్ = గుమ్మంలో; ఎవ్వడు వసించున్ = ఎవడుంటాడు; అను వారున్ = అనే వారున్నూ; అనుచున్ = అంటూ;

తా ॥ పై విధంగా పండితులందరు కూడుకొని వస్తుంటే చూచిన వారు పండిత వాదమేమైన దని ప్రశ్నిస్తే '' ఆ ! ఏమవుతుంది, రాజు పక్షపాతము వహించి ఆ దాసరిగాణ్ణి అందల మెక్కించాడు. అందువల్ల బ్రతికి పోయాడు'' అని అంటే విన్నవారు '' ఔను లెండి, మంచి చెడు విచారణ లేని ఇలాంటిరాజుల వాకిటిలో ఎవడుంటాడు'' అనేవాళ్లు.

ఈ పద్యంలో వాదంలో ఓడిపోయిన పండితులు వర్ణింపబడినారు. క్రింది పద్యంలో విద్వాంసులు అన్నమాట ఈ పద్యానికి కూడా కర్త. పద్యమంతా ఓడిపోయిన పండితుల చేష్టలు, మాటలు,

దురహంకార లక్షణాలు, ఓడిపోయి కూడా అంగీకరించని లక్షణం చాలా చిత్రంగా చిత్రింపబడింది. వారు పొందిన భయం, తొందర, తత్తరపాటు, పరాకుతనము మొదటి నాలుగు పాదాల్లో వర్ణింపబడింది. ఆనాటి కాల వాతావరణం పద్యమందంతా అలుముకొనియుంది. యజమానులు సభలోకి వెళ్లేటప్పుడు చెప్పులు విడిచి సేవకునికి అప్పగించడం, కొంచెం హోదా ఉన్నవారు పల్లకీల్లో ప్రయాణించడం, హోదా లేనివారు కేవలం నడచిపోవడం, ఇది ఆనాటి కాలస్వరూపము.

'పేయస్' అన్న పోర్చుగీసు చారిత్రకుడు రాయల సభాగారాన్ని వర్ణిస్తూ 'లోపలికెవరూ చెప్పులతో వెళ్లరు' అన్నాడు.

పైపద్యం అద్భుత రసవర్ణన. దానికిది పోషకమైన హాస్యరసవర్ణన.

తే ॥ కలిసి యొక కొంతసేపు శృంగాటకముల
నగరిదెసఁ జూచుచునె మంతనంబు లాడి
చనిరి, విద్వాంసు లిండ్ల కజ్జనవిభుండు
రూఢి కతని మహాగజారూఢుఁ జేసి. 8

శృంగాటకములన్ = నాల్గు వీథుల కలిసిన కేంద్రాలలో (చతుష్పథం); కలిసి = ఒక కొంతసేపు కలిసికొని; నగరి దెసన్ = రాజుగారి హజారమువైపు; చూచుచునే = చూస్తూనే; విద్వాంసులు = పండితులు; మంతనంబులు + ఆడి = రహస్య సంభాషణలు చేసి (పైపద్యంలో మాటలే తమలో తాము అనుకోనటం పైకి అంటే రాజుగారు దండిస్తారు. కనుక తమలో తామే గుసగుసలాడుకొన్నారు.); ఇండ్లకున్+ చనిరి= ఇండ్ల కెళ్ళారు; ఆ జనవిభుండు = ఆ రాజు; రూఢికిన్ = ప్రసిద్ధికి; అతనిన్ = విష్ణుచిత్తు , గజ= ఏనుగుపై; ఆరూఢున్ +చేసి = ఎక్కించి;

మ ॥ 'పురి యేగించి తదీయమైన నగరంబుం జేర్పు డంచు న్బడిన్
దొరలన్ రాజకుమారులన్ బనుపగాఁ దూర్యస్వనంబు ల్నిరం
తర వందిస్తుతులుం గజేంద్రహయఘంటావారకాంతాంఘ్రి నూ
పురము ల్మ్రోయఁగ గొల్చి వారిరుగడం బో మార్గమధ్యంబునన్. 9

పురి+ ఏగించి = ఊరేగించి; తదీయము +అయిన = ఆ విష్ణుచిత్తునిదైన; నగరంబున్ = పట్టణానికి; చేర్పుడు = చేర్చండి; అంచున్ = అంటూ; బడిన్ = అతనితో పాటుగా (వెంబడి = వెను+పడి =వెంటపడిలోని పడియే ఇక్కడ ప్రయోగింపబడింది); దొరలన్ = సామంత రాజులను; రాజకుమారులను; పనుపగాన్ = పంపించగా; తూర్య స్వనంబుల్ = బాకాల ధ్వనులు; నిరంతర = ఎడతెగని; వందిస్తుతులున్ = వంది మాగధులయొక్క స్తోత్రాలు; గజ + ఇంద్ర = గొప్ప ఏనుగులయొక్క, హయ = గుఱ్ఱాలయొక్క; ఘంటా = గంటలు; వారకాంత = వేశ్యలయొక్క; అంఘ్రి =పాదాలయొక్క; నూపురముల్ = కడియాలు; మ్రోయఁగన్ = ధ్వనిస్తుండగా; వారు = ఆ దొరలు; రాజకుమారులు; ఇరు+కడన్ = విష్ణుచిత్తునకు ఇరువైపులా; కొల్చి = చుట్టుకొని, పరివేష్టించి; పోన్ = పోగా; మార్గమధ్యంబునన్ = దారి మధ్యలో

తా ॥ పాండ్యరాజు ఆవిధంగా విష్ణుచిత్తుని గజారూఢునిగ చేసి దొరలను రాజకుమారులను పిలిచి ఈ మహాభక్తుని ఊరేగించి శ్రీ విల్లిపుత్తూరునకు తీసికొని పొమ్మని ఆజ్ఞాపించాడు. వెంటనే విష్ణుచిత్తుడెక్కిన ఏనుగును ఒక ప్రక్క దొరలు, మరొక ప్రక్క రాజకుమారులు పరివేష్టించి పోతుండగా వారికి ముందు వాద్యధ్వనులు ఎడతెగని వందిస్తోత్రాలు; నర్తకుల కాలి అందెల సవ్వడులు సందడిగా ధ్వనిచేస్తుండగా పోతూ ఉంటే ఎదురుగా దారి మధ్యలో

విశే ॥ మహారాజు విష్ణుచిత్తుని గజారూఢుని చేయడానికి సభాద్వారంవరకే వచ్చాడు. తరువాతి కర్తవ్యం దొరలపై పెట్టి తాను అంతఃపురానికి వెళ్ళాడు. అంతేగాని తాను కూడా ఊరేగింపుతో పోలేదు. ఇది రాచఠీవి. రాయడువారి స్థాయి. ఇంకొకడైతే, రాజుగారు కూడా ఊరేగింపుతో కూడా వెళ్ళాడని వ్రాసి యుండేవాడు. కథలో ఈవిధంగా ఆత్మీయతాముద్ర, దేశకాల ముద్రలు ఉంటాయి. పాఠకులు జాగ్రత్తగ చూచుకోవాలి.

## విష్ణుచిత్తునకు భగవంతుడు సాక్షాత్కరించుట

ఉ ॥ ఇంగిలికంబునం దడిపి యెత్తు కసీసపు రెంటెమో యనన్
నింగి గరుత్పరంపరల నిగ్గున లేఁ దొగరెక్కెఁ; నంత వీ
చెం గలశాబ్ధి మీఁగడల జిడ్డెఱిగించెడు కమ్మగాడ్పు; నిం
డెం, గడు మ్రోఁత, పెన్దిరువడిం గని రా ఖగరాజు మూపునన్. 10

ఇంగిలికంబునన్ = రాతివంటి ఎఱ్ఱని ధాతువు (హింగుళా శబ్దభవం) కలిపి నీటిలో; తడిపి = ముంచి; ఎత్తు = పైకెత్తిన; కసీసపు = మైలుతుత్తమువంటి నీటి రంగుగల; రెంటెమో = జంటనేత వస్త్రమో, అనన్ = అనునట్లుగా; నింగి = ఆకాశము, గరుత్ + పరంపరల = రెక్కల సమూహముయొక్క; నిగ్గునన్ = కాంతిచేత;లే + తొగరు = లేత ఎరుపు; ఎక్కెన్ = పొందినది; అంతన్ = వెంటనే; కలశ+ అబ్ధి = పాల సముద్రముయొక్క; (దేవతలు రాక్షసులు సముద్రాన్ని మనం కుండలో మజ్జిగ చేసినటుల మంథర పర్వతం కవ్వంగా చేసికొని చిలికారు. కనుక కలశాబ్ధి) మీగడల జిడ్డు = మీగడలయొక్క జిడ్డువాసన; ఎరిగించెడు =తెలిపే; కమ్మగాడ్పు = కమ్మని గాలి; వీచెన్ = వీచినది; కడున్+మ్రోత = పెద్ద మ్రోత; నిండెన్= అంతరిక్షంలో వ్యాపించింది; పెన్ = పెద్ద; తిరు = శ్రీ; అడిన్ = పూజ్యపాదముగల గరుత్మంతుని; కనిరి = చూచారు; ఆ ఖగరాజు = ఆ పక్షిరాజు; మూపునన్ = వీపుపై

తా ॥ ఎర్రని ఇంగిలీకము కలిపిన నీటిలో ముంచెత్తిన నీలి జంటనేతవస్త్రమో అన్నట్లుగా ఆకాశంలో లేత ఎరుపు రంగు వ్యాపించియున్నది. దానితో పాటుగా పాల సముద్రపు మీగడల జిడ్డును విరజిమ్ముతూ కమ్మని గాలి వీచినది. ఆకాశంలో పెద్ద మ్రోత వినిపించింది. తరువాత గరుత్మంతుడు కనిపించాడు ఆయన వీపుమీద.

అలం : ఉత్ప్రేక్ష.

వస్త్రాలకు రంగులద్దే పద్ధతి దేశీయమైన కళగా నేటికీ నేతపనివారియందున్నది. అది పోలికగా చెప్పబడటం కవికి ఈ దేశీయ కళాభిమానం ఉన్నట్లు తెలుస్తున్నది. పెన్+తిరుపడి, 'పెరితిరువడి' అని గరుత్మంతునికి పేరు. శ్రీపాదుడు, పూజ్యపాదుడు అన్న వ్యవహారం నేటికీ ఉంది. నీరిలో పెద్దవాడు గనుక 'పెరియతిరు అడియ' అని ఆయనకు పేరు; 'సిరియ తిరువడి' అని ఆంజనేయునికి పేరు.

సీ ॥ చివురుఁ బొట్లపుదోయి జెందమ్మ లనఁదార్క్ష్య
హస్తోదరముల దివ్యాంఘ్రు లమర
నునుఁ గప్పుమేనఁదోఁచిన తదూర్ధ్వచ్ఛాయ
లీలఁ దాల్చు పసిండిచేల మెఱయ
వ్రాలిన యోగివర్గము నిర్మలాంతఃక
రణముల వోలె హారములు దనర
సిరికిఁ బుట్టింటి నెచ్చెలు లౌట మనవికి
డాసె నా, మకరకుండలము, లమర
తే ॥ శ్రితసితచ్ఛదవాత్యాభిహత పరాగ
వలయమండిత కల్పశాఖలొ యనంగ
శంఖచక్రాంచితో రుహస్తములు దనర
దోఁచెఁ గమలేక్షణుండు చతుర్భుజుండు. 11

చివురు పొట్లపు దోయిన్ = చివురాకుల పొట్లపు జంటలో; చెన్+ తమ్ములు = ఎర్రని తామరలు; అనన్ = అన్నట్లుగా; తార్క్ష్య = గరుత్మంతునియొక్క; హస్త + ఉదరములన్ = రెక్కల కడుపులో; దివ్య+ అంఘ్రులు = పూజ్యపాదములు; అమరన్ = ఒదిగి ఉండగా;

తా ॥ గరుత్మంతుని రెక్కలు ఎర్రగా ఉన్నందున అవి ఎర్రని చిగురాకు పొట్లాల్లాగా ఉన్నాయి. ఆపొట్లాల్లో ఎర్రని తామర పూలను కట్టినట్లుగా శ్రీవిష్ణువుయొక్క దివ్యపాదాలు వెలుగొందుతున్నాయి.

నునుగప్పు = స్నిగ్ధమైన నీల వర్ణంగల; మేనన్ = శరీరంలో; తోచిన = కనిపించిన; తత్ = గరుత్మంతునియొక్క; ఊర్ధ్వచ్ఛాయ లీలన్ = పైకి ప్రసరించిన కాంతివలె; తాల్చు = కట్టిన; పసిండిచేలః బంగారు వస్త్రం, మెరయన్ = ప్రకాశిస్తుండగా;

తా ॥ విష్ణుదేహం నీలవర్ణం, దానినిచుట్టుకొని పీతాంబరమున్నది. అది ఎలా ఉన్నదంటే గరుత్మంతుని ఎర్రని శరీరకాంతి పైకి ప్రసరించినట్లు

వ్రాలిన యోగివర్గము పైన పడిన యోగి సమూహముయొక్క, నిర్మల = స్వచ్ఛమైన; అంతఃకరణములు వోలె = మనస్సులో అన్నట్లుగా; మనోబుద్ధి చిత్తాహంకారాలు; హారములు = ముత్యాల సరులు; తనరన్ = ఒప్పారగా

తా ॥ ఆస్వామి మెడలో ముత్యాలసరాలు వ్రేలాడుతున్నాయి. అవి ఆయనపై వ్రాలిన విష్ణుచిత్తునివంటి యోగులయొక్క అంతఃకరణాల్లాగా ఉన్నవి.

సిరికిన్ = లక్ష్మికి; పుట్టింటి నెచ్చెలులు = పుట్టింటి నుండి అరణంగా వచ్చిన; చెలికత్తెలు; అగుటన్ = అయినందున; మనవికిన్ డాసెనాన్ = ఏదో మనవి చేసుకోవడానికై సమీపించినారో అన్నట్లుగా; మకరకుండలములు = మొసలి చెవిపోగులు; అమరన్ = చెవులకు అందగిస్తుంటే;

తా ॥ స్వామి చెవులకు మొసలి ఆకారపు పోగులున్నవి. అవి రత్నమయములైనందున లక్ష్మీదేవి పుట్టినింటి నుండి (సముద్రమునుండి) వచ్చిన అనుగు చెలికత్తెలు కావటంవల్ల మనవి చేసుకోవడానికి సమీపించినారో అన్నట్లుగా ఉన్నది.

శ్రిత = ఆశ్రయించిన; సితచ్ఛద = తెల్లని రెక్కలు గల హంసలు గలవి; వాత్యా = సుడిగాలిచే; అభిహత = ఎగురగొట్టబడ్డ; పరాగ = పుప్పొడియొక్క; వలయ = సుడితో; మండిత = అలంకరింపబడ్డ; కల్పశాఖలో = కల్పవృక్షపు కొమ్మలో; అనంగన్ = అన్నట్లుగా; శంఖ = పాంచజన్యము; చక్ర = సుదర్శనాయుధంతో; అంచిత = అందమైన; ఉరు = పొడవైన; హస్తములు = చేతులు; కమల = తామరలవంటి; ఈక్షణుండు = నేత్రాలున్న; చతుర్భుజుండు = నాలుగు చేతులు గలవాడు; నారాయణుడు; తోచెన్ = గోచరించినాడు.

తా ॥ విష్ణువు చతుర్భుజములతో దర్శనమిచ్చినాడు. ఆ హస్తాలలో శంఖచక్రాలు అందంగా అమరి ఉన్నాయి అతడొక కల్పవృక్షం. అడిగిన వరాలిచ్చేవాడు కనుక మహాకల్పవృక్షం. అతని చేతులు ఆ వృక్షశాఖలు లాగే ఉన్నాయి. రెండు శాఖలు క్రిందికి, రెండు శాఖలు పైకి, రెండు జంటలుగా చీలి ఉన్నాయి. పైకి సాగిన ఒక కొమ్మవంటి చేతిలో శంఖమున్నది. అది హంసవలె ఉన్నది. (పరమహంసయైన యోగి భగవంతుని ఆశ్రయించినట్లు) మరొక చేతిలో చక్రం ఉన్నది. అది సుడిగాలికి లేచిన కల్ప వృక్షపుష్పపరాగ వలయం లాగా ఉంది.

అలం : ఉత్ప్రేక్ష.

రాయలవారి ఉత్ప్రేక్షలు స్వభావోక్తి రమ్యములై ఉంటాయి తప్ప కృత్రిమం కావు అని ఇదివరకే చెప్పబడ్డది. భగవంతుడు ఎంత అందంగా ఉంటాడో ఎవరు చెప్పగలరు ! శ్రీరామకృష్ణ పరమహంస ఒకసారి శిష్యులతో అన్నారట. 'అమ్మ తన రూపాలెన్నిటినో నాకు చూపించింది. వాటన్నిటిలో ఒక్క రూపాన్ని మాత్రం నేను ఎప్పటికీ మరచిపోలేను. అంతకంటే అందమైన స్త్రీ మూర్తి ఎక్కడా ఉండదు. ఆదేవీమూర్తి 'శ్రీరాజరాజేశ్వరి' అని, ఆతల్లి తన దేహంలో బంగారు దీపమై వెలుగుతూ ఉంటే పరమహంస ముఖమండలం కాంతిలో లోపలి దీపానికి పరివేషంగా ఉండేదట. చూచినవారు సమ్మోహితులైపోయేవారట. ఇది భగవల్లక్షణం. అయినపుడు సాక్షాత్తు భగవత్స్వరూపం ఎలాగుంటుంది?

రాయలవారు కొన్నిచోట్ల ఆ సౌందర్యాన్ని రూపు కట్టించారు. ఆ జగన్మోహన సౌందర్య నిధులైన

పద్యాల్లో ఇది ఒకటి. 5-67, 7-34. ఇలాగ మొత్తం కావ్యంమీద చూచుకొంటే శ్రీవైష్ణవం ఏపురుషోత్తముని ఆశ్రయించి పుట్టినదో ఆ కళ్యాణ గుణమయమైన ఆకారవిశేషము సహృదయ పాఠకులకు భావనలో మూర్తిమంత మవుతుంది. భాగవత కర్త కృష్ణవర్ణన చేసి ఎంత ధన్యుడైనాడో ప్రస్తుతము ఈ కవీ అంతే.

కం ॥ 'ఎప్పుడు హరిగని రమరులు
ముప్పదియును మూడుకోట్ల మునిఁ గనుఁగొనువా
రప్పుడు తత్కరములతో
విప్పిన గొడుగులును మింట వేగమ మొగిడెన్. 12

ఎప్పుడు; అమరులు = దేవతలు; ముప్పదియును మూడుకోట్లు = ముప్పైమూడు కోట్లు; మునిన్ = విష్ణుచిత్తుని; కనుగొనువారు = చూచువారు; హరిన్ కనిరి = విష్ణువును చూచారో; అప్పుడు = వెంటనే; తత్కరములతోన్ = వారి చేతులతో కూడా; విప్పిన గొడుగులును = విప్పివేసికొన్న గొడుగులును; వేగమ = తటాలున; మొగిడెన్ = మూసుకొన్నవి; మింటన్ = ఆకాశంలో;

తా ॥ 6వ పద్యంలో దేవతలు విష్ణుచిత్తుని ప్రశంసిస్తూ ఉన్నట్లున్నది. కనుక వారక్కడే గొడుగులు వేసికొని ఆకాశంలో నిలబడి విష్ణుచిత్తుని చూస్తున్నారు. ఎప్పుడైతే విష్ణువు ప్రత్యక్షమైనాడో వెంటనే వారి చేతులు, చేతుల్లోని గొడుగులు ముకుళించుకొని పోయినవి. అంటే దోయిలొగ్గినారు. (గొడుగు రాజలక్షణం)

విశే ॥ అలం. సహోక్తి.

'సమ్మద దిదృక్షు ఖస్థ రక్షఃపిశాచ'
పుంజమహిభుక్పతత్త్ర ప్రభంజనములు
సోఁక వెల్లఁబాఱెఁ గళ్ళాన శూర్పవాత
ఘట్టనలఁ బాఱు పెనుబొల్ల కట్టువోలె. 13

సమ్మద = సంతోషంతో; దిదృక్షు = చూడాలన్న కోర్కెతో; ఖ = ఆకాశంలో; స్థ = ఉన్న; రక్షఃపిశాచ పుంజము = రాక్షసుల పిశాచాల సమూహము; అహిభుక్ = పాములే ఆహారముగాగల గరుత్మంతుని యొక్క; పతత్త్ర = రెక్కలయొక్క; ప్రభంజనములు = గాలులు; సోకన్ = తాకగానే; వెఱన్ = భయంతో; కళ్ళానన్ = ధాన్యపు కళ్ళంలో, శూర్ప = చేటలయొక్క; వాత = గాలియొక్క; ఘట్టనలన్ = తాకుళ్ళచేత; పాఱు = ఎగిరిపోయే; పెను = పెద్ద; పొల్లకట్టు పోలెన్ = గడ్డిగాదంలాగా; వెఱన్ = భయంతో; పాఱెన్ = పరుగెత్తి పోయారు.

తా ॥ విష్ణువునకు శత్రువులైన రాక్షసులు, పిశాచాలు కూడా దేవతలతో పాటు ఆ అద్భుతాన్ని చూస్తూ నిలబడిపోయారు. ఎప్పుడైతే నాగాంతకుడైన గరుత్మంతుని రెక్కల తీవ్రవాయువులు వచ్చి తాకినవో వారు భయపడి కళ్లంలో చేటల గాలికి గడ్డిపరకలు ఎగిరిపోయినట్లు పారిపోయారు.

అలం : ఉపమ

ఇది కర్షకవృత్తి నుండి గ్రహింపబడ్డ సొగసైన అలంకారం. రాయల వారికి ఈ దేశీయ సంపదపై మక్కువ ఎక్కువ. ఇందుకే 'దేశభాషలందు తెలుగులెస్స' అని, 'అమృతమైననుఁజవుల జాత్యన్నసమమె' అని దాసరి కథలోనూ నోరార కీర్తించాడు. కావ్యం నిండా ఈదేశీయ సౌందర్యమే పైపద్యాలుగా సంతరింపబడటం చూచుకోవాలి.

కం ॥ నీరంధ్ర కుసుమ ధారా
సారచరచ్చంచరీక సంకుల కలఝుం
కారానుకారి సంస్తవ
కారి మునిస్తోమ సామగానం బెసఁగెన్. 14

నీరంధ్ర (నిర్+రంధ్ర) = రంధ్రాలు లేని; సందులేని; కుసుమ = పువ్వులయొక్క; ధారా+ ఆసార= తెరపి లేకుండా కురిసేవానలో; చరత్ = ఎగురుతున్న; చంచరీక = తుమ్మెదల యొక్క; సంకుల = దొమ్మిగా వినిపించే; కల = అవ్యక్తమైన; ఝుంకార = ఝుం అని మోగేధ్వనిని; అనుకారి = అనుకరిస్తున్న; సంస్తవకారి = స్తోత్రాలు చేస్తున్న; మునిస్తోమ = ముని సముదాయముయొక్క; సామగానంబు = సామవేదగానం; ఎగసెన్ = విజృంభించినది.

తా ॥ దేవతలు ఎడతెరిపి లేకుండా పూలవాన కురిపిస్తున్నారు. ఆ పూలమీద దట్టముగ తుమ్మెదలు ఎగురుతున్నవి. వీటి ఝుంకార ధ్వనిని మునులయొక్క సామగాన నాదధ్వని ఒకదానితో ఒకటి ఒరుసుకొంటూ సంకుల నాదాన్ని సృష్టిస్తున్నవి.

విశే ॥ సామవేదం విష్ణుస్వరూపం. అలం : ఉపమ, వృత్త్యనుప్రాస.

తే ॥ 'అట్లు ప్రత్యక్షమైన పద్మాక్షు నంత
రిక్షమునఁ గాంచి ముని ప్రమోదాక్ష జలము
నిగుడఁ బులకించి కరటి ఘంటికలె తాళ
ములుగ నిట్లని యమ్మహాత్ముని నుతించె. 15

అట్లు = ఆవిధంగా; ప్రత్యక్షమైన = కంటికి గోచరించిన (ప్రతి+అక్షము); అక్షము = నేత్రము; ప్రతి = ఎదురుగా; పద్మాక్షున్ = తామరలవంటి నేత్రాలుగల విష్ణుని; అంతరిక్షమునన్ = రోదసీ కుహరంలో; కాంచి = చూచి; ముని = విష్ణుచిత్తుడు; ప్రమోద = ఆనంద సంబంధమైన; అక్షిజలము = కన్నీరు; నిగుడన్ = ఉప్పొంగగా; పులకించి = గగుర్పొడిచి; కరటి = ఏనుగుయొక్క; ఘంటికలె = గంటలే; తాళములుగన్ = తాళాలుగా; అమ్మహాత్మునిన్ = ఆభగవంతుని; ఇట్లని నుతించెన్ = కీర్తించినాడు.

తా ॥ ఆ విధంగా ప్రత్యక్షమైన శ్రీమన్నారాయణుని ఆకాశంలోనే చూచి విష్ణుచిత్తుడు పులకించి కన్నీరు కారుస్తూ ఆనందంతో ఏనుగు మెడలోని గంటనే తాళాలుగా చేసికొని భగవంతుని ఈ విధంగా స్తుతించారు.

విశే ॥ ఇప్పటికీ మధుర మీనాక్షి గుడి కెదురుగా దగ్గరలోని విష్ణుని కోనేల ఉన్నది. అది ఎక్కడ స్వామి, విష్ణుచిత్తునకు సాక్షాత్కరించాడో, ఆ చతుష్పథంలో గుర్తుగా రాజు నిర్మించినాడట. నేటికీ ఈ అద్భుత సంకేతంగా ఆ దేవాలయం క్షేత్రాటకులకు ఆనంద హేతువుగా భగవంతుని కీర్తిపతాకగా ఉన్నది.

ఈసందర్భాన్ని పురస్కరించుకొని విష్ణుచిత్తుడు తమిళభాషలో భగవంతుని సౌందర్యాన్ని తనివితీర వర్ణిస్తూ, ఆయనకు దృష్టిదోషం తగులకుండుగాక అని 'తిరుప్పల్లాండు' అన్న స్తోత్రగుచ్ఛమును నిర్మించాడు. అదొక దివ్యప్రబంధంగా శ్రీవైష్ణవం నేటికి గానం చేస్తూనే ఉంది

తిరుప్పల్లాండుకు బదులుగా మహాకవి దశావతార వర్ణన చేస్తున్నాడు. రాయలు కేవల వైష్ణవుడై కవి కాకుండా ఉంటే తిరుప్పల్లాండును అనువదించి ఉండేవాడు. అలాగే యామునాచార్యుడు శ్రీరంగనాథుని దర్శించినపుడు స్తోత్ర రత్నాన్ని గానం చేశాడు దాన్నీ రాయలు అనువదించలేదు. గోదాదేవి 'తిరుప్పావై' ని కూడా ముట్టుకోలేదు. ఇవీ రాయలవారిని మహాప్రతిభావంతునిగ చూచుకోవలసిన ఘట్టాలు.

దశావతార స్తుతి

కవిరాజ విరాజితము : 'జయ జయ దానవ దారణ కారణ శార్ఙ్గ రథాంగ గదాసిధరా !
జయ జయ చంద్రదినేంద్ర శతాయుత సాంద్ర శరీరమహః ప్రసరా !
జయ జయ తామర సోదరసోదర చారుపదోజ్ఝిత గాంగఝురా !
జయ జయ కేశవ ! కేశినిషూదన ! శౌరిశరజ్జలజాక్ష ! హరీ ! 16

దానవ = రాక్షసులయొక్క; దారణ = నరకడానికి; కారణ = సాధనములైన; శార్ఙ్గ = ధనుస్సు, రథ + అంగ = రథమునకు అవయవము; చక్రము = చక్రాయుధం; గద = కౌమోదకీ అన్న పేరు కలది; అసిః కత్తి (నందకము); ధరా = ధరించినవాడా !; చంద్ర = చంద్రుడు; దిన + ఇంద్ర = పగటికి రాజైన సూర్యుడు; శత = నూర్లకొలది; అయుత = పదివేలు; సాంద్ర = దట్టమైన; శరీర = తనువుయొక్క; మహః = తేజస్సుయొక్క; ప్రసరా = ప్రసరణం కలవాడా !; తామరస = తామర పూవుయొక్క; ఉదరః లోపలిభాగముయొక్క కాంతికి;సోదర = తోబుట్టువైన;చారు = అందమైన; పద = పాదాలనుండి; ఉజ్ఝిత = పైకిచిమ్మబడ్డ; గాంగఝురా = గంగాప్రవాహము కలవాడా!; కేశవ = కః+ ఈశ+వ; ఈశః = ఈశ్వరుడు; వ = వాతి పొందినవాడు; కేశవ = బ్రహ్మను బ్రహ్మనుండి శివుని కన్నవాడు; కేశినిషూదనః కేశి అన్న రాక్షసుని చంపినవాడా; శౌరి = శూరుడన్న వంశంలో పుట్టినవాడా !; శరత్ = శరత్కాలంలో (విచ్చిన); జలజ = నీటినుండి పుట్టిన పద్మం (వంటి); అక్ష = నేత్రాలు కలవాడా !; హరీ = నారాయణా!; జయ జయ = విజయుడవగుదువు గాక !

తా ॥ రాక్షస సంహారార్థం ధరించిన శార్ఙ్గ చక్ర గదా ఖడ్గాదులు గల్గినవాడా ! నూర్లకొలది (కోట్లకొలది) చంద్ర సూర్యుల కాంతితో సమానమైన దేహప్రకాశము కలవాడా ! తామ పువ్వులోపలి ప్రదేశములలోని

కాంతివంటి అందమైన పాదాలనుండి స్రవించిన గంగా ప్రవాహం గలవాడా ! బ్రహ్మ శివులకు ఆధారమైనవాడా ! కేశిరాకాసిని చంపినవాడా ! సూర్యవంశంలో జన్మించినవాడా ! శరత్కాలంలో వికసించిన తామర పువ్వులవంటి వికసిత నేత్రముల వాడా! పాపాలను హరించేవాడా ! తండ్రీ నీకు జయమగుగాక !

విశే ॥ అలంకారం - ఉత్ప్రేక్ష.

ఛందస్సు : కవిరాజ విరాజితము న జ జ జ జ జ జ వ - గణాలు. 8,7,7 యతిస్థానాలు. ఈపద్యం మనుచరిత్రలోనిది. ముగింపులో మాత్రం కొంచెం భేదం. 'శౌరిహరీ దురితాపహరా' అని మనుచరిత్ర. రాయలు ఈవిధంగా మార్చుకొన్నారు. 11వ పద్యం క్రిందినుడి పైకి ఆరోహణ గతి నాశ్రయించినది. దీని ఎత్తుగీతి నుండి ప్రస్తుత పద్యం ప్రారంభమైనది. కనుక భావం అవరోహణను పైనుండి దిగటాన్ని ఆశ్రయించింది.

## మత్స్యావతారం

మ ॥ దివిజద్వేషి నుదారవారిచరమూర్తిం ద్రుంచి చాతుర్య మొ
ప్పవడిం జేకపుఁదెల్ల కౌచుగమి దంభంబొంద మైఁదాల్చి వే
దవిశుద్ధాక్షర పంక్తిఁ గ్రమ్మఱఁగ వేధం జేర్చెదోనాఁగద
ద్భువనం బబ్ధిసితాంబు బిందు లమరం బ్రోద్యద్రుచిం దాఁటవే ? 17

దివిజద్వేషిన్ = దేవతలకు శత్రువైన సోమకాసురుని; ఉదార = మహత్తరమైన, వారిచర = నీటిలో తిరిగే చేపయొక్క; మూర్తిన్ = శరీరంతో; చించి = చీల్చి; చాతుర్యము = నేర్పు; ఒప్పన్ = ప్రకాశింపగా; వడిన్ = త్వరగా; చౌకపు = చతురస్రమైన; తెల్లకౌచుగమి = తెల్లని పొలుసుల గుంపు; దంభంబు = మిష; పొందన్ = పొందగా; మైన్ = తనువున; అక్షర పంక్తిన్ = అక్షరాల వరుసను; క్రమ్మర = తిరిగి, వేధకు = బ్రహ్మకు; చేర్చెదో నాగన్ = చేరుస్తున్నావో అన్నట్లుగా; తత్ = ఆ బ్రహ్మయొక్క; భువనంబు = సత్యలోకమునకు; అబ్ధి = సముద్రముయొక్క; సిత = తెల్లని; అంబు బిందులు = నీటిబొట్లు; అలమన్ = వ్యాపించగా; ప్ర+ ఉద్యత్ = మిక్కిలి పైకి చిమ్ముతున్న; రుచిన్ = కాంతితో; దాటవే = లంఘించవా.

తా ॥ శ్రీహరీ ! వేదాలను దొంగిలించిన సోమకాసురుని మహామత్స్యరూపాన్ని ధరించి సముద్రంనుండి సత్యలోకానికి లంఘించినావు. ఆ ఎగరటం ఎలాగున్నదంటే వేదమంత్రాలు తేజోరూపాలు గనుక ఆ విశుద్ధమంత్ర సమూహాన్ని తెల్లని పొలుసుల మిషతో తనువున ధరించి విశ్వమంతా నీటి బిందువులు వ్యాపించునట్లుగా పైకి ఎగిరి బ్రహ్మకు వేద సంపుటిని చేర్చినావు.

విశే ॥ అలం : ఉత్ప్రేక్ష. అపహ్నవంతో సమ్మిశ్రితమైన ఉత్ప్రేక్ష.

'చౌకపు తెల్లకౌచు గమి దంభంబొంద' అన్న వాక్యంలో అపహ్నుతి. చౌకపు సంస్కృత భాషలోని అక్షరాలు చతురస్రాకారములో ఉంటాయి. కనుక అవే చేపల పొలుసులుగా చెప్పబడ్డాయి. ఇది చాలా ఆశ్చర్యకరమైన కల్పనం. చేప ఎగిరే స్వభావం కలది కనుక తదాధారంగా ఇక్కడ సముద్రం నుండి సత్యలోకందాకా ఎగిరినట్లు ఉత్ప్రేక్షించడం లోకోత్తరంగా ఉంది. వేదమంత్ర సంపుటి బ్రహ్మ ఉచ్ఛ్వాస

రూపంలో వెలువడినట్లు సంప్రదాయం. ఇక్కడ ఆ మంత్రాక్షరాలు శ్రీహరికి శరీరంగా చెప్పబడటం భగవంతుడు మంత్ర తనువన్న సంప్రదాయాన్ని ఆకర్షిస్తున్నది. యజ్ఞ వరాహమూర్తి వర్ణనలాగా వేదమత్స్యావతార వర్ణనం చేయటం అనిదంపూర్వం.

రాయలవారి వర్ణనలో లోకము, శాస్త్రము, కావ్యకల్పన ఈ మూడు ముప్పేటగ పేనబడటం కన్పిస్తుంది. ఈ దశావతార స్తోత్రం అలాంటిది.

చం ॥ 'ఎలమి యుగాంతవారి కెదురెక్కుతఱిన్ వడిఁదాలు గహ్వరం
బులఁ జను నీటివెల్లిఁ బడిఁబోవు సపక్ష నగోరువాశ్చరం
బులుదనుఁదాకఁ దద్గత మ్రోయునజాండమద్దైత్య వేదపం
క్తులు గొని గూల్చినట్టి జయదుందుభిఁ జేసిలుకా మురాంతకా ! 18

మురాంతకా = మురాసురుని చంపినవాడా !; ఎలమిన్ = సంతోషంతో, యుగ+అంత+ వారికిన్ = ప్రళయకాలపు సముద్రపు నీటికి; ఎదురు+ ఎక్కుతరిన్ = ఎదురుగా ఈదేటప్పుడు; వడిన్ = వేగంగా; తాలు = దవుడలయొక్క; గహ్వరంబులన్ = గుహలనుండి; చను = పారే; నీటివెల్లి పడి = నీటివరద వెంబడి; పోవు = తేలిపోయే; సపక్ష = రెక్కలుగల; నగ = కొండలు; ఉరు = పెద్ద; వాః+చరంబులు = నీటి జంతువులు; తనున్ = తనువును; తాకన్ = కొట్టుకొన్నప్పుడు; తత్+గతతన్ = శరీరమును తాకుటను పొందినందువల్ల; మ్రోయు = మ్రోగే; అజాండమ = బ్రహ్మాండమనే; దైత్యు = సోమకాసురునియొక్క; వేదపంక్తులు గొని = వేదమంత్ర సముదాయాన్ని గ్రహించి; కూల్చినట్టి = చంపినట్టి; జయ = విజయాన్ని చాటే; దుందుభిన్ = భేరీగా, చేసిలుకా = చేసినావు కదా !

తా ॥ మురాంతకా ? నీవు చేపరూపాన్ని దాల్చి ప్రళయ సముద్రపు నీటికి ఒరసికొని సుళ్లు తిరుగుతూ వేగంగా ప్రవహించే నీటివరదలో పడి, రెక్కల పర్వతాలు తిమింగలాది జలజంతువులు నీ శరీరానికి తాకినపుడు ఆ సవ్వడి అజాండమునందు ప్రతిధ్వనించినది. అదెలాగున్నదంటే ఈ సోమకాసురుని విజయాన్ని బ్రహ్మాండమన్న దుందుభి కీర్తిస్తున్నదో అన్నట్లుగా ఉన్నది.

అలం : స్వభావోక్తి. అజాండము దుందుభిగా పరిణమించినట్లు చెప్పడం పరిణామం కూడా ఉన్నది.

విశే ॥ పూర్వం పర్వతాలకు రెక్కలుండేవని, వాటిని ఇంద్రుడు నరికివేసినట్లు ప్రతీతి. చేప క్రొత్త నీటికి ఎదురెక్కుతుంది. అందువల్ల ఇలా చెప్పబడింది. ఈ చేప రూపు అజాండమంతా నిండినట్టిది కనుక కొండలు కూడా వచ్చి శరీరానికి తాకటం తాలు గహ్వరముల మీదుగా ప్రవహించి పోవడం సహజమే.

చ ॥ 'మితి గడవం దిమింగిలత మెయ్మెయి వెంచిన నీదువాతఁ గు
త్సితపలలాశి యైనఁ జెఱుచేపది త్రెళ్ళుట నీవు మ్రింగుటే
శ్రుతులగు నూరుపుల్ మగుడఁ జొచ్చు తఱిన్ భవదేధనైధనై
ధిత జవశక్తి నీడ్చుకొని తెచ్చుట కాక తదల్పతాల్పతన్. 19

తిమింగిలత = తిమింగలాకృతిని ( ఇవాళ మనం టి.వి.లో పెద్దపెద్ద చేపలను చూస్తున్నాం గదా!) మితి గడవన్ = పరిమితి దాటగా; మెయి+మెయిన్ = తేలికగా; పెంచిన, నీరువాతన్ = నీనోటిలోకి; కుత్సిత = కుచ్ఛితపు; పలల+అశి = మాంసపు తిండి కల; రాకాశి = ఐన; చిఱుచేప = చిన్నచేప, త్రెళ్లుట = పడటం; నీవు మ్రింగుటే = నీవు మ్రింగటమా? (మ్రింగటం కాదని భావము); శ్రుతులు + అగు =వేదాలైన; ఊరువుల్ = నిశ్వాసాలు; మగుడున్ = తిరిగి; చొచ్చు తరిన్ = ప్రవేశించే వేళ; భవత్ = నీయొక్క; ఏధన్ + ఏధన = మిక్కిలిపెరగడం వలన; (మితి గడవన్); ఏధిత = పెంచబడ్డ; జవ = వేగముయొక్క; శక్తిన్ = బలమువల్ల; తత్ = ఆసోమకాసురుని యొక్క; అల్ప+అల్పతన్ = మిక్కిలి చిన్నదైన కారణంచేత; ఈడ్చుకొని = బలాత్కారంగా లాగుకొని; తెచ్చుటకాక = తీసికొని రావటంకాక (నీవు మ్రింగటం కాదని భావం).

తా ॥ నీవు తిమింగల రూపాన్ని ఇది వరకు బ్రహ్మ సృష్టిలో ఉన్న పరిమాణాన్ని అతిక్రమించి విపరీతంగా పెంచినందువల్ల ఆకుత్సితపు రాకాసి నీదగ్గర చిరుచేప అయిపోయినాడు. అందువల్ల ప్రళయ సముద్రపు వెల్లువలో పడి కొట్టుకొని పోతున్న వాని గర్భంలోని వేదరాశి నీ నిశ్వాసాలే గనుక తిరిగి, అవి నీలోనికి ప్రవేశించాయి. ఈవేగానికి ఆరాక్షసుడన్న చిరుచేప తానంతట తానే వచ్చి నీ నోటిలో పడిపోయినాడు. అంతేగాని వానిని నీవు మ్రింగడం కాదు.

అలం : అపహ్నవంతో కూడి ఉత్ప్రేక్ష

మత్స్యావతార పరిమాణం మానవమేధాశక్తికి అందేదికాదు అని చెప్పడం కోసమే 'మితిగడవన్' అని ప్రారంభింపబడింది. తెలుగు కవులు 'అవతార వర్ణనలకు' ఒక ప్రమాణం ఏర్పరిస్తే ఆ 'మితి'ని ఈవర్ణనలు దాటిపోయినవని భావించుకోవాలి. దానికి ఇది సూచనగా గ్రహించాలి.

కూర్మావతారం

మ ॥ జలపూరాప్లవమానమృణ్మయ మహీసంరక్షకై గార యీ
బలె ముక్తామణి శుక్తి శంఖనికురంబం బెల్లం జూర్ణంబుగా
బలభిద్వజ్రసదృజ్నిజోపరిపరిభ్రామ్యన్మహామందరా
చలసంఘృష్టి ఘరట్ట మైన కమఠస్వామి న్నినుం గొల్చెదన్. 20

జలపూర = నీటి ప్రవాహములో; ప్లవమాన = తేలుతున్న; మృణ్మయ = మట్టిస్వరూపమైన; మహీ = భూమియొక్క; సంరక్షణకై = రక్షణకోసమై; గారయీబలెన్ = సున్నపు గచ్చు చేయుటకో అన్నట్లుగా; ముక్తా = ముత్యాలు; మణి = రత్నాలు; శుక్తి = ముత్యపు చిప్పలు; శంఖ = శంఖాలు; నికురుంబంబు = సమూహము; ఎల్లన్ = అంత; చూర్ణంబుగాన్ = పొడియగునట్లుగా; బలభిత్ = ఇంద్రునియొక్క; వజ్ర= వజ్రాయుధంతో; సదృక్ = సదృశమైన; నిజ = తనయొక్క; ఉపరి = వీపుపై; పరిభ్రామ్యత్ = వేగంగా తిరుగుతున్న;మహా = గొప్ప; మందరాచల = మందరపర్వతము; సంఘృష్టి = రాపిడికి; ఘరట్టము = తిరగలి ఐన; కమఠస్వామిన్ = గొప్ప తాబేలును; నినున్ కొల్చెదన్ = నిన్ను సేవిస్తాను.

తా ॥ సముద్ర మథనకాలంలో ఆదికూర్మము వీపు మీద మంథరపర్వతము కవ్వమై తిరుగుతుంటే దాని క్రింద పడి ఆదికమఠం వీపు మీద సముద్రములోని మణులు, ముత్యాలు, ముత్యపు చిప్పలు, శంఖాలు ఇవన్నీ సున్నంలాగా నలిగిపోతున్నాయి. ఇది ఎలాగున్నదంటే కేవలం మట్టిరూపమైన భూమిని నీళ్ళల్లో తేలుతున్నందువల్ల కరిగిపోకుండా కాపాడడానికై దానికై సున్నపుగార పూయడం కోసమన్నట్లుగా స్వామి మకఠాకృతి దాల్చి వజ్రాయుధం వంటి కర్కశమైన వీపు చిప్పను తిరుగలి, క్రింది రాయిగా చేసి మందరాన్ని తిరుగలి పై రాయిగా చేసి ఆ శంఖాదులను విసురుతున్నట్లుగా ఉన్నది.

అలం : ఉత్ప్రేక్ష.

ఈ పద్యానికి మూలము మనుచరిత్రలో ఈ పద్యము.

*చటులకృసీటసంస్థిత రసాస్థలి ప్రీలకయుండ, గారయి*
*చ్చుటకును బోలె శంఖ మణి శుక్తి కదంబము నుగ్గుగా విశం*
*కట చరమాంగ మంథగిరి ఘట్టనఁ జేసి ఘరట్టమైన కృపా*
*పటిమ జగంబుఁ బ్రోచు నల ప్రాక్కమఠంబు నినున్ భజించెదన్.*

వరాహావతారం

చ ॥ ఒక మఱి బుడ్డగింప విలయోదకము ల్పయి కుబ్బి, చిప్ప వ్ర
చ్చుకొని, మహాభ్రవీథిఁ జన, సూకరత న్మెయి పెంచి, వెండి క్రిం
దికిఁ గయివ్రాలు తత్సలిల నిర్మలధార నధః పరిస్ఫుర
త్ప్రకృతికి నీ యజాండమునె బంగారు ముంగఱఁ గా నొనర్పవే ? 21

సూకరతన్ = పందిలక్షణంతో; మెయిన్ = తనువును; పెంచి = అపరిమితంగా పెంచుకొని; ఒక మఱి= ఒకసారి; బుడ్డగింపన్= మట్టితో కుళ్ళగింపగా; విలయోదకముల్= ప్రళయ జలము; పైకిన్= ఆకాశంలోకి; ఉబ్బి = బుగ్గలాగా పడుతూ; చిప్పన్ = బ్రహ్మాండము అనే చిప్పను (మూకుడు); వ్రచ్చుకొని = భేదించి;మహా +అభ్రవీథిన్ = విశాలమైన ఆకాశంలోకి; చనన్ = పోగా; వెండి = తిరిగి; క్రిందికిన్ = క్రింది సముద్రంలోకి; కయివ్రాలు = వంపు తిరిగి పడుతున్న; తత్ = ఆ; సలిల = నీటియొక్క; నిర్మల= స్వచ్ఛమైన; ధారన్ = ధారను; అదః = బ్రహ్మాండము కంటె; పర = అవతల; స్ఫురత్ = వెలుగుతున్న; ప్రకృతికిన్ = మూలప్రకృతియైన శక్తికి; ఈ అజాండమునే = ఈ బ్రహ్మాండాన్ని; బంగరు ముంగరగాన్= పైడి ముక్కరగా; ఒనర్పవే = చేసితివి కదయ్యా.

తా ॥ శ్రీమహావిష్ణువు వరాహస్వభావంతో శరీరాన్ని అపరిమితంగా పెంచుకొని ప్రళయసముద్రాన్ని తనముట్టెతో ఒక్కసారి కుళ్ళగిస్తే ఆ నీరు బ్రహ్మాండ కర్పరాన్ని చీల్చుకొని పైకి ఎగసి చిమ్మింది. తిరిగి ఆ జలమే వంపుగా ధారగా క్రిందకు పడుతున్నది. ఇది ఎలాగున్నదంటే బ్రహ్మాండమునకు అవలి దైన మూల ప్రకృతి యన్న తన సృష్టిశక్తికి బంగారు ముంగర చేయించినట్లుగా ఉన్నది.

అలం : ఉత్ప్రేక్ష

విశే ॥ ముంగరకు చివర ముత్యాలగుత్తి వేలాడుతూ ఉంటుంది. నీటిధార తుంపరలుగా పైనుండి వంపు తిరిగి పడుతున్నది. ఇదే ముత్యాలగుత్తి. సృష్టినంతా కన్న తల్లి కనుక ఆమె కూడా మహామూర్తి. ఇక్కడ సూకరము మహామూర్తే. ముత్యాల ముంగర కూడా అజాండమంతా నిండియుంది. మత్స్యవరాహావతారాలకూ ఒక నైపథ్యమున్నది. అది, క్రింద కేవలం సముద్రంపైన మహాకాశం సృష్టిలేదు. ఇందుచేతనే పద్యాల్లో ప్రళయోదకమని, మహాకాశమని చెప్పబడింది. ఇది భావమూర్తి. కల్పనకు నేపథ్యంగా భావించాలి

మత్స్యావతారానికి ఒకటి రెండు చోట్ల తప్ప గుడిగోపురాలు లేవు. కాని వరాహమూర్తికి చాలా వ్యాప్తి యుంది. నీటిధార తుంపరలుగా పైనుండి వంపు తిరిగి పడుతున్నది. ఇదే ముత్యాలగుత్తి వేలాడుతూ ఉంటుంది. భారతదేశమంతా అనేకచోట్ల శిల్పాలు చెక్కబడ్డాయి. ప్రతిరాజ వంశానికి వరాహమే లాంఛనం. విజయనగర చక్రవర్తులు కూడా వరాహలాంఛనులే.

వరాహము మహీరక్షకులైన మహీపతులకు ఆదిమమూర్తియైన ప్రతీక - ప్రతిమ (ARCHETYPAL IMAGE). అందుకే ఆమూర్తి శిల్పులు తనివితీరా - లోకోత్తర సుందరంగా శిల్పించారు.(చూ. వి. యస్. అగ్రవాలాగారి మత్స్యపురాణం - ఒక అధ్యయనం) క్రీ.శ.4వ శకంలో ఉత్తర భారతంలో ఉదయగిరి గుహల్లో 30 అడుగుల ఎత్తుగల మహావరాహమూర్తి శిల్పం చెక్కబడింది. అది చంద్రగుప్త విక్రమాదిత్యుడు హూణులను జయించి వచ్చినపుడు ఆ చారిత్రక ఘట్టానికి స్మృతిచిహ్నంగా చెక్కబడ్డ లోకోత్తర మూర్తి. ఆ శిలాఖండమూర్తికీ రాయలవారి ఈ శబ్దమయమూర్తికీ అత్యంత సామ్యమున్నది. ఈ పద్యం చూచి ఈ శిల్పం ఆ శిల్పాని కనుగుణంగా ఈ పద్యం వచ్చాయేమో నన్నంత సాదృశ్య సంపద ఉన్నది.

(చూ. ఈ వ్యాఖ్యాత గ్రంథం - శ్వేతచ్ఛత్రం)

## నృసింహావతారం

మ ॥ అసురేంద్రాశయ కుండికాచ్ఛరుధిర వ్యాప్తస్వకచ్ఛాయఁ గాం
చి సముద్యత్ప్రతిసింహ మత్సరమిళ చ్చేష్టా దదుద్ధామ దీ
ర్ఘసటాఝాటముఁ బెల్లగించుగతి, నాంత్రశ్రేణిఁ గిన్కన్ వెరం
జు సిత క్రూర భవన్నఖావళులు ప్రోచు న్మర్త్యపంచాననా. 22

మర్త్యపంచాననా ! = శ్రీనరసింహా (పంచ+ ఆనన = వెడల్పైన ముఖముగలది - సింహము); అసుర + ఇంద్ర = రాక్షసరాజైన హిరణ్యకశిపునియొక్క; ఆశయకుండిక = హృదయకుండంలోని;, అచ్ఛ = స్వచ్ఛమైౖ; రుధిర = రక్తంలో; వ్యాప్త = ప్రతిబింబించిన; స్వక = తనయొక్క; ఛాయన్ = నీడను; కాంచి = చూచి; సముద్యత్ = పైకి దూకుతున్న; ప్రతిసింహ = శత్రువైన సింహము అన్న; మత్సర = మాత్సర్యంతో;

మిళత్ = కూడుకొన్న; చేష్టన్ = చెయిదముగా; తత్ = అ(ప్రతిసింహముయొక్క; ఉత్ +దామ = అతిశయించిన; దీర్ఘ = పొడవైన; సటా = జాలుయొక్క; ఝూటమున్ = కుదురును (గుంపు); పెల్లగించు గతిన్ = పెల్లగిస్తున్నట్లుగా; అంత్రశ్రేణిన్ = (పేగులగుంపును; కిన్కన్ = కోపముతో; వెరంజా = లాగే; సిత = తెల్లని; క్రూర = కఠినమైన; భవత్ = నీయొక్క; నఖ = గోళ్లయొక్క; ఆవళుల్ = సముదాయము; ప్రోచున్ = రక్షించుగాక.

తా ॥ నరసింహస్వామి హిరణ్యకశిపుని గుండెయన్నకుండలోని నెత్తుటిలో వ్యాపించిన తన ప్రతిబింబాన్ని చూచి ఇదేదో ప్రతిసింహము పైకి దూకుతున్నదన్న మాత్సర్యంతో దాని జూలు పట్టుకొని లాగివైచినట్లుగా హిరణ్యకశిపుని (పేగుల గుంపును పెరికివేసిన తెల్లని క్రూరమైన పదిగోళ్ళు మమ్ము రక్షించుగాక.

అలం : భ్రాంతిమంతము.

విశే ॥ ఇది ధ్వన్యాలోక ప్రార్థన శ్లోకంలోని భావాన్ని తలపిస్తున్న పద్యము.

శ్లో ॥ స్వేచ్ఛాకేసరిణః స్వచ్ఛ స్వచ్ఛాయాయాసితేందవః
త్రాయంతాం వో మధురిపోః ప్రపన్నార్తిచ్ఛిదా నఖాః.

స్వేచ్ఛాకేసరియైన మధురిపుని స్వచ్ఛములైన చంద్రరేఖవంటి గోళ్ళు భక్తులైన మీయొక్క ఆర్తిని సమూలంగా పెరికి వేసి రక్షించుగాక. ఈశ్లోకములో వస్తు, అలంకార, రసధ్వనులున్నాయని శ్రీమదభినవగుప్తపాదాచార్యులు తమ లోచనవ్యాఖ్యానంలోనిరూపించారు. అలాగే ఈపద్యంలో కూడా చెప్పుకొనవచ్చు. భగవంతుడు సృష్టిరక్షణలో నిత్యమూ జాగ్రుతుడై యున్నాడు. మహాచక్రవర్తి ఏవిధంగా దుర్మార్గులను శిక్షించి ధర్మస్థాపనం చేస్తాడో అదే విధంగా భగవంతుడు కూడా. కనుక స్వామియందు వీర రసం ఆపాదింపబడుతున్నది.

మ॥ మునుము న్దెల్పును దూఱఁదూఱ మఱి కెంపు, న్వెండియుం దూఱఁగం
దనగాయం గలనల్పుఁ, దోఁప నఖకోణ శ్రేణిచే విక్రమం
బున వాఁ డుగ్రతఁ గొన్న యట్టి విలసన్మూర్తి త్రయీతేజముం
గొను లీల న్విదళింపవే యసురవక్షోభిత్తి, మిథ్యాహరీ ? 23

మిథ్యాహరీ = మాయా సింహమా ! (హరి = విష్ణువు, సింహము) మునుమున్ = ముందు ముందు (తొలుదొల్త) ; తెల్పును = తెల్లరంగు; వెండియున్ = ఇంకా ; దూఱఁదూఱన్ = ఇంకా లోతుకి చొచ్చుకొని పోగా ; కుఱి కెంపున్ = ఎరుపు ; కందనగాయన్ = గుండెకాయలోని; కల= ఉన్న ; నల్పును = నలుపును; తోఁపన్ = స్పష్టంకాగా ; నఖ-శ్రేణిచే = గోళ్ళ చిగుళ్ళ పంక్తులతో; వాడు=హిరణ్యకశిపుడు; విక్రమంబునన్ = శౌర్యంతో; ఉగ్రతన్ = అసాధుత్వంతో; కొన్నయట్టి = కొన్నటువంటి , విలసత్ = ఒప్పుచున్న ; మూర్తిత్రయీ = త్రిమూర్తులయొక్క; తేజమున్= తేజస్సును; కొను లీలన్ =తిరిగి గ్రహిస్తున్న రీతిగా ; అసుర = రాకాసియొక్క; వక్షోభిత్తి = రొమ్ముగోడను; విదళింపవే= పగులగొట్టవే.

తా॥ నరసింహుని గోళ్ళు ముందు తెల్లగా ఉండి, రొమ్ములోకి గ్రుచ్చినప్పుడు నెత్తురంటి ఎర్రనై ఇంకా లోతుల్లోకి వెళ్ళి గుండెకాయను చీల్చినపుడు నల్లనై ఒప్పారినవి. ఇది ఎలాగున్నదంటే ఆ రాక్షసుడు త్రిమూర్తుల తేజస్సును ( విష్ణువు తెలుపు సత్త్వగుణం కనుక, రజోగుణమూర్తి అయిన బ్రహ్మతేజస్సు ఎరుపు, ప్రళయకర్త రుద్ర తేజస్సు నలుపు. ఈ మూడు తేజస్సులను క్రమంగా గోళ్ళతో ఆకర్షించడాని కన్నట్లుగా వాడి గుండెను గోళ్ళు పెకల్చివేసినవి.

అలం : ఉత్ప్రేక్ష

సింహపుగోళ్ళు చివళ్ళు తెలుపు, మధ్యభాగంలో ఎరుపు, చేతి చర్మం దగ్గర నలుపుగా ఉండటం సహజం. కనుక ఈ పోలిక చాలా ఉచితమైనది. అంతే కాక గోరు గ్రుచ్చగానే పస, నెత్తురు, లోపం కందనగాయలుపంటివి త్రివర్ణాత్మకమైనవి.

విశే॥ నరసింహస్వామి విగ్రహాలు దేశంలో అద్భుతశిల్పాలై తాండవించినవి. రాయలవారే స్వయంగా 1528 లో విజయనగరంలో లక్ష్మీనరసింహస్వామి విగ్రహాన్ని (22 అడుగుల ఎత్తుగలది) చెక్కించారు. అది ఏకశిలా విగ్రహము. అలాగే 8వ శతాబ్ది ఎల్లోరా గుహల్లో హిరణ్యకశిపుని తన తొడల మీద అడ్డంగా వేసుకుని పొట్ట చీలుస్తున్న ఉగ్రనరసింహ విగ్రహం చాలా అద్భుతమైనది. వీరరస స్ఫోరకంగా చెక్కబడినది కనుక.

ఈ దశావతార స్తోత్రాలు అన్ని ప్రబంధాలలోనూ కనిపిస్తాయి. వాటన్నిటినీ కలిపి చదువుకోవడం ఒక పద్ధతి. మరొకటి శిల్పాలుగా చెక్కబడ్డ విగ్రహాలతో పోల్చిచూడడం కూడా నేటి పరిశోధనలో ఒక భాగం.

## వామనావతారం

మ॥ బలిదైతేయ బయాంధకారభరిత బ్రహ్మాండ గేహంబులో
పలఁ బై మండెడి తత్ప్రతాపమయ దీపజ్వాల డింద, న్గడుం
దలమై మింటికి గ్రక్కున న్నెగయు నుద్యత్తన్మహాచ్ఛాయానఁ
దల నీలాంగము శింశుమార మొరయంగాఁ బెంపవే వామనా ? 24

వామనా = పొట్టి బ్రహ్మచారి; బలిదైతేయ = బలియన్న రాక్షస రాజువల్ల; భయాంధకార = భయమన్న చీకటి చేత ; భరిత = నిండిన; బ్రహ్మాండగేహంబులోపలన్ = బ్రహ్మాండమన్న ఇంటిలో; మండెడి = వెలుగుతున్న; తత్ = ఆ బలియొక్క ; ప్రతాపమయ = తేజోమయమైన; దీపజ్వాల = దీపపు మంట; డిందన్ = మలగిపోగా; కడున్ = మిక్కిలి ;దలమై = దట్టమై; మింటికిన్ = ఆకాశం దాకా ;గ్రక్కునన్ = వెంటనే ; నెగయు= విజృంభించు; ఉద్యత్ =పైకిపోతున్న;తత్= ఆ దీపముయొక్క; మహాచ్ఛాయ = పెద్ద నీడ; నాన్ = అన్నట్లుగా;కలనీలాంగమున్ = ఇంపైన నల్లని తనువును; శింశుమారము = మొసలి ఆకారంలో ఉండే నక్షత్రసముదాయము; ఒరయంగాన్ = తాకునట్లుగా ;పెంపవే = పెంచినావు గదా !

తా॥ వామనస్వామీ! బ్రహ్మాండమన్న ఇంటిలో బలిచక్రవర్తివలన త్రిలోకాలకు కల్గిన భయమన్న పెనుచీకటి నిండిపోగా నీవు స్నిగ్ధమైన నీ నల్లని శరీరాన్ని శింశుమార చక్రం దాకా పెంచినావు గదా! అదలాగున్నదంటే బలియొక్క ప్రతాపమన్న దాపజ్వాల ముల్లోకాలకు పైన వెలుగుతున్నది. అది గుప్పుమని ఆరిపోతే దాని పెద్దనీడ ముల్లోకాలలో వ్యాపించినట్లు.

అలం : ఉత్ప్రేక్ష.

విశే ॥ భాగవతంలో 'ఇంతింతై వటుడింతయై' అన్న పద్యాల భావంతో ఈ పద్యాన్ని చూచుకోవచ్చు. అందులో బ్రహ్మాండమంత వామనుడు పెరిగినాడని వర్ణింపబడ్డాడు. ఇక్కడి శింశుమారము సూర్యాదిగ్రహాలకంటె పైన ఉన్నదని పురాణాలు వర్ణిస్తున్నవి.

వామనమూర్తి త్రివిక్రముడైన సందర్భాన్ని భారతీయ శిల్పులు దేవాలయాలలో విగ్రహాలుగా శిల్పాలుగా చెక్కారు. కాంచీపురంలో వామనాలయం ఉన్నది. ఇచట పూజా పురస్కారాలు ఉన్నాయి.

మ॥ శమిత క్షత్త్ర కళత్ర నేత్ర జలవర్షా వేళ నీ కీర్తి హం
సము క్రౌంచ స్ఫుటతావకాంబక సుషిం జాఁగంగ నీక్షించి, వ
ర్షము రా నంచలు నందనేఁడు జను నిచ్చ న్నాటి తచ్చేష్ట పా
యమిఁ; దిర్యక్తతి తా గతానుగతికం బౌఁగా కుఠారీ! హరీ! 25

కుఠారీ = గండ్రగొడ్డలి గలవాడా ; హరీ = పరశురామా! శమిత = నాశనము చేయబడ్డ; క్షత్త్ర = రాజులయొక్క ; కళత్ర = భార్యలయొక్క; నేత్రజల = కన్నీరన్న ; వర్షావేళ = వానాకాలంలో; నీ కీర్తిహంసము = నీ కీర్తియన్న హంస; క్రౌంచ = క్రౌంచ పర్వతమునందు; స్ఫుట = ఏర్పడ్డ; తావక = నీ యొక్క ; అంబకసుషిన్ = బాణం చేసిన సొరంగంలో ; చాగంగన్ = పోగా ; వీక్షించి = చూచి; వర్షమురాన్= వాన రాగా ; అంచలు = హంసలు; ఇచ్చన్ = మనస్సుతో; తత్+చేష్ట = ఆ క్రియ ( క్రౌంచపర్వత బిలంలోకి కీర్తి హంస వానా కాలంలో పోవటం); పాయమిన్ = ఆనాటి ఆ చేష్ట పోకపోవటం; నేడున్ = ఇప్పటికినీ; అందన్ = ఆ బిలం ద్వారానే ; చనున్ = పోవును; తిర్యక్+తతి = పక్షిగుంపు; తాన్ = తాను; గత+ అనుగతికంబు=ముందుపోయిన జంతువు గతి ననుసరించి గొఱ్ఱెదాటుగా పోవునది; ఔగా = అవును గదా.

తా ॥ గండ్రగొడ్డలి ధరించిన శ్రీహరీ! సంహరింపబడ్డ రాజుల భార్యలయొక్క కన్నీరన్న వర్షఋతువులో నీ కీర్తి హంస నీవు క్రౌంచ పర్వతంలో బాణంతో తొలచిన బిలం ద్వారా ఎగిరిపోవటం చూచిన నేటి హంసలు వర్షఋతువు రాగానే అప్పటి ఆ చేష్టను విస్మరించక నేటికీ ఆ బిలం ద్వారానే పోతున్నాయి. అది అంతే కదా. జంతువులు గొఱ్ఱె దాటు మంద. ముందు గొఱ్ఱె దూకటం చూచిన వెనుక గొఱ్ఱెలు కూడా దూకి పోతాయే తప్ప ఆలోచన ఉండదు. ఈ మనో లక్షణము జంతువులయందు వాసనా రూపంలో ఉంటుంది. దానినే INSTINCT అంటాము . చీమ పంచదార వాసనను బట్టి చేరుతుంది.

కుక్క వాసనపట్టి దొంగను గుర్తిస్తున్నది. ఈ వాసన తర్కానికి అందేది కాదు. మనస్సులోని జీవుల్లో నడిపించేది ఇదే. దానిని గుర్తించి కవి ఒక లోకోక్తి ప్రయోగం ద్వారా ఇలా భావకల్పన చేయడం కవిత్వం.

విశే ॥ అలంకారము - అర్థాంతరన్యాసము.

పరశురాముడు, కుమార స్వామి ఇద్దరూ శివుని దగ్గర ధనుర్విద్యాభ్యాసము చేస్తున్నప్పుడు బాణంతో క్రౌంచ పర్వతంలో సొరంగాన్ని తొలిచారట. అందుకే ఈ అంశము ఇద్దరికీ అన్వయిస్తుంది. ఆ విధంగా క్రౌంచము డొక్కలో గండి కొట్టి నందువల్ల పరశురామునకు కీర్తి వచ్చింది. ఆ కీర్తినే ఇక్కడ హంసగతిగా వర్ణించాడు. వర్షాకాలంలో హంసలు ఆ బిలం ద్వారానే మానస సరోవరమునకు పోయి తిరిగి శరత్కాలంలో అదే బిలం ద్వారా లోకం మీదకు వస్తాయట. ఈ కవి సమయమే 4-137,148 పద్యాల్లో చెప్పబడినది.

## శ్రీరామావతారం

మ॥ పవిధారాపతనంబుఁ గైకొని యపౌలస్త్యు మై సప్తధా
తువులం దూఱు పరిశ్రమంబునకు నుద్యోగించె నా; సప్త సా
లవిభేదం బొనరించి నిల్వక సలీలన్ జన్న యుష్మన్మరు
జ్జవ నాస్త్రం బొసగు న్సిరుల్ రఘుకుల స్వామీ ! రమావల్లభా! 26.

రఘుకుల స్వామీ = రఘువంశశ్రేష్ఠుడా; రమావల్లభా = లక్ష్మీనాథా; పవి= వజ్రాయుధము యొక్క; ధారా= అంచుయొక్క; పతనంబునన్ = పడటాన్ని(దెబ్బను); కైకొనని = లెక్కచేయని; ఆ +పౌలస్త్యు= ఆ పులస్త్య బ్రహ్మ మనుమడైన రావణునియొక్క; మై = దేహంలోని; సప్తధాతువులన్ = శరీర నిర్మాణ హేతువులైన ఏడు ధాతువులను (పస, నెత్తురు, మాంసం, ఎముకలలోని మూలుగ , మెదడు, శుక్రము- ఈ ఏడు ధాతువులు); దూఱు = దూరే; పరిశ్ర మంబునకున్ = అభ్యాసమునకు ; ఉద్యోగించెన్ +నాన్= పూనుకొనెనో అన్నట్లుగా; సప్తసాల = ఏడుమద్ది చెట్లయొక్క (సప్త తాల అని కూడా ఉంది. తాల = తాటి చెట్టు) విభేదంబున్ = నరుకుటను; ఒనరించి = చేసి ; నిల్వక= ఆగక ; సలీలన్ = ఆటగా; చన్న = దూసుకొని పోయిన; యుష్మత్ = నీయొక్క; మరుత్ = గాలివలె; జవనా = వేగంగల ; అస్త్రంబు = బాణము; సిరుల్ = శ్రీలను; ఒసగున్ = తప్పక ఇస్తుంది (ఇచ్చుగాక అని ప్రార్థన).

తా॥ రఘువంశ ప్రభువైన శ్రీ రామా, సీతాపతి ! వజ్రాయుధం దెబ్బను లెక్క చేయని రావణుని శరీరంలో సప్త ధాతువులను తొలచడం కోసం అభ్యాసం చేస్తున్నదో అన్నట్లుగా ఏడు తాటి (మద్ది) చెట్లను నరికి ఆగకుండా దూసుకొని పోయిన నీ మహాస్త్రం మాకు సిరులిచ్చుగాక.

అలం : ఉత్ప్రేక్ష

విశే॥ ఈ పద్యం మను చరిత్రలోనిది. పద్యాంత మందలి పిలుపులు చాలా మధురములైనవి. పెద్దనగారికి అంత సన్మానం రాయలవారు చేయడం బహుశా ఆ కవి వాగ్గతమైన మాధుర్యమే.

రామాయణంలో కిష్కింధాకాండలో సుగ్రీవునితో రాముడు స్నేహం కట్టినప్పుడు సుగ్రీవుడు శ్రీరాముని పరాక్రమాన్ని శంకించి ఏడు తాటి చెట్లను చూపించి ఒక్క బాణంతో వీటిని నరకమని పరీక్ష పెట్టగా రాముడు అలాగే చేశాడన్న కథ ఉన్నది. అదే ఆ పద్య భావానికి ఆధారం.

సీ. స్యందనస్థిత బిడౌజఃక్షత్తృ జాడ్య కృ
జ్ఝంఝామరుద్గరుజ్ఝాత్కృతములు,
క్రవ్యాశి రాడ్గాత్ర కనదసృగ్గాహన
స్ఫుటశల్య హవ్యభుక్ఫూత్కృతములు,
యోధవర్మిత హృత్పుటోత్పాదితనిజపాత
సాలాశ్మకృత ముహుస్స్వాత్కృతములు,
పతితోగ్ర రక్షః కబంధ భారభృశార్తి
భుగ్న భోగ ఫణీంద్ర పూత్కృతములు

తే॥ శ్రాంతరథ్య నిరంతర ఛాయదములు,
దివ్యతావక కార్ముకోత్ప్రేరితములు,
కలుషము లడంచుఁగాత లంకాపురాంగ
ణాంబర చలత్కలంబ కదంబకములు. 27

స్యందన = రథం మీద; స్థిత = ఉన్న; బిడౌజ = ఇంద్రునియొక్క; క్షత్తృ = సారథికి; జాడ్యకృత్= జడత్వాన్ని కలిగించే; జంఝూ = తుఫానుయొక్క; మరుత్ = గాలిగల; గరుత్=రెక్కలయొక్క; ఝాత్కృతములు= ఝాత్ అన్న మ్రోతకలవి.

ఈ పద్యానికి కర్త శ్రీరామబాణాలు. సందర్భం రామ రావణ యుద్ధం. రావణునిపై శ్రీరాముడు బాణ పరంపరతో తీవ్ర వేగంతో ముందుకు పోతున్నది. నారి నుండి విడువబడ్డ అమ్ముని నారియొక్క 'ఝాత్' అన్న ధ్వనితో పాటూ ముందుకు పోతూ ఉంటే వాటి గాలి పెను తుఫానులో ఝుంఝుంవలె రథం తోలుతున్న మాతలికి జడత్వాన్ని కల్పిస్తున్నది. అంటే రథ వేగం మందగిస్తున్నది. ( కార్లు వేగంగా పోతుంటే అవి కల్పించే గాలి వెనుకకు పరిగెత్తడం తెలిసిందే. అదే విధంగా ఇక్కడ బాణ వేగానికి మాతలి రథం పరిగెత్తడానికి విఘ్న మేర్పడుతున్నది. ఇది చాలా శాస్త్రీయమైన వర్ణన.)

క్రవ్య+ అశి = మాంసం తినే రాక్షసులయొక్క; రాట్ = ప్రభువైన రావణునియొక్క; గాత్ర = శరీరం; కనత్ = వెలుగుతున్న ( ప్రవహిస్తున్న) ; అస్పృక్ = నెత్తురిలో; గాహన = ప్రవేశించడం వల్ల; స్ఫుట = స్పష్టమైన; శల్య= బాణపు ములుకులయొక్క; హవ్యభుక్ = హవ్యభోజనుడైన అగ్ని యొక్క; ఫూత్కృతములు= 'ఫూత్' అన్న మ్రోత కలవి.

మాంసభోజనులైన రాక్షసులకు రాజైన రావణునియొక్క శరీరంలో తొణుకుతూ ప్రవహిస్తున్న

నెత్తుటులో మునగడం వల్ల బాణపు ములుకుల నిప్పు 'ఛూత్' అన్న మ్రోతను కల్గిస్తున్నది. (కాల్చిన చువ్వను నీటిలో ముంచినపుడు వచ్చే ధ్వనికి అనుకరణ శబ్దం 'ఛూత్'.)

క్రవ్యాశి అనడం వలన రావణుని దేహం బాగా బలిసినట్టిదని వ్యంగ్యం

యోధ = వీరుల; వర్మిత = కవచాలు ధరించిన; హృత్పుట = హృదయకోశాలనుండి; ఉత్పాదిత = బైటకు వెళ్ళితే; నిజ = తన; పాత = పడటం వల్ల; సాల = కోట; అశ్మ = రాళ్ళతో; కృత = చేయబడిన; ముహుః = మాటిమాటికీ; ఠాత్కృతములు = ఠాత్ ధ్వనులు కలవి; బాణాలు ప్రతివీరుల కవచాలు ఛేదించి గుండెల్లో నుండి దూరి కోట గోడల రాళ్ళకు తాకి 'ఠాం ఠా' మ్మని మ్రోగుతున్నవి

పతిత = పడే; ఉగ్ర = భయంకర; రక్షః = రాక్షసుల, కబంధ = మొండెముల; భార= బరువుకు; భృశ = మిక్కిలి; ఆర్తి = బాధతో; భుగ్న = వంగే; భోగి = పడగలు కల; ఫణి+ఇంద్ర= ఆదిశేషుని, ఫూత్కృతములు = ఫూత్కారాలు.

రాక్షసుల కబంధాలు కొండల్లాగా పడుతుంటే వాటి బరువు మోయలేక ఆదిశేషుని పడగలు క్రుంగిపోతున్నవి; ఆయన నిట్టూర్పులు విడుస్తున్నాడు

శ్రాంత = అలసిపోయిన ; రథ్యః= గుర్రాలకు; నిరంతర = దట్టమైన ; ఛాయదములు= నీడ నిచ్చేవి, బాణ పరంపర పందిరిగా ఐనందువల్ల అలసిన రథాశ్వాలకు నీడ నిస్తూ అలుపును పోగొడుతున్నవి.

దివ్య = దేవతా సంబంధమైన ; తావక = నీ కార్ముకచాపం నుండి; ఉత్ప్రేరితములు=

పైకి చల్లబడినవై (గుప్పిళ్ళుగా).

లంకాపుర + అంగణ+ అంబర = లంకానగర ప్రాంగణాకాశంలో; చరత్ = చరించే; కలంబ= బాణాల; కదంబకములు = గుంపులు; కలుషములు = పాపాలను; అడంచున్ గాత = అణగార్చుగాక.

ఈ పద్యానికి మూలమైన రామరావణయుద్ధం యుద్ధకాండ - 103 వ సర్గనుండి 111 లో రావణుడు మరణించేటంత వరకున్నది. 104,105 సర్గల్లో రామకోప తీవ్రత వర్ణితమైనది. అప్పటి రామబాణాలకు మహర్షి ప్రయోగించిన విశేషణాలు -

*తీక్ష్ణైః మహోగ్రైః వజ్రకల్పైః శితైః శరైః (104-29)*

- ఇందులో రెండో విశేషణ వ్యాఖ్యానమే పద్యంలో ప్రథమపాదం. వజ్రకల్పత్వాన్ని తర్వాతి 2,3 పాదాలు వర్ణిస్తున్నవి. తీక్ష్ణత కూడా అందులో భాగమే. దివ్యకార్ముకమన్న మాట 103 వ సర్గలోనూ రథాన్నీ దివ్యశరీరాలను ఇంద్రుడు పంపిన విషయాన్ని సూచిస్తున్నది.

పద్యమంతా రావణగత అధర్మ భావం మీద భగవంతునకు వచ్చిన క్రోధ భావాన్ని ధ్వనిస్తున్నది. ఆ రచనలోని ఓజగుణం రౌద్రరస వ్యంజకం.

బలరామావతారం

చ॥ 'క్షితిహలకృష్టిఁ బుట్టియడఁగె క్షితియందునె సీత' యంచుఁ ద
త్సతి విరహార్తిఁ బాండిమముఁ దాలిచి రామశరీర మెత్తి యా
క్షితి ఖననక్రియ న్మగుడఁ జెందఁ గక్ష గాక కళింద జాతట
క్షితిదునన్ నేటికి హలమచే మటి నీ కవశాత్మతన్ హలీ ? 28

హలీ = నాగలి ఆయుధంగా ధరించిన బలరామా। సీత= జానకి (నాగలి చాలులో దొరికినది); క్షితిన్ = భూమిలో; హలకృష్టిన్ = నాగలి దుక్కి నుండి; పుట్టి = జన్మించి; క్షితియందున్ = భూమిలోనే; అడగెన్ = అణగిపోయినది; అంచున్ = అంటూ; విరహ+ఆర్తిన్ = ఈ ఎడబాటు దుఃఖంచేత; పాండిమము = తెల్లదనమును ( దుఃఖంతో శరీరం పాలిపోతుంది కనుక); తాలిచి= ధరించి; రామ శరీరము = బలరామ దేహాన్ని ధరించి; తత్సతిన్ = ఆ పతివ్రతయైన సీతను; ఆ = పూర్వావతారంలోని; క్షితి = భూమిని; ఖనన = త్రవ్వటమన్న; క్రియన్ = చేష్టతో; మగుడన్= తిరిగి ; చెందగన్ గాక = (ఆమెను) పొందడానికి తప్ప, కళిందజా = యమునయొక్క; తటిన్= ఒడ్డున; హలముచే = నాగలితో; నీకు; అవశ+ఆత్మతన్ = వశము తప్పిన మనసుతో; క్షితిన్ = భూమిని; దున్నన్ = దున్నటం; ఏటికిన్ = ఎందుకు?

కృష్ణుని కొడుకు సాంబుడు దుర్యోధనుని కూతురైన లక్షణను పెళ్ళిచేసుకోవడానికి సాహసించి ఎత్తుకొనిపోతున్నాడు. దానికి కౌరవులు సహించక అతనిని పట్టి బంధిచారు. తనిని విడిపించుకొనిరావడానికి బలరాముడు హస్తినానగరానికి వెళ్ళి వారిని చుట్టరికంతో వదిలిపెట్టమని అడిగితే వారు కయ్యానికి కాలుదువ్వారు. దానికి బలరాముడు కోపించి హస్తినాపురాన్ని యమునలో ముంచడానికి నాగలితో నగరాన్ని యమున వైపుకు ఈడ్చితే నగరం ఒకప్రక్క క్రుంగిపోగా భీష్మాదులు వచ్చి బలరాముని ప్రార్థించి లక్షణాసహితంగా సాంబుని అతనికి అప్పగించారట . ఈ కథాధారంగా ఈ పద్యం పుట్టింది.

సీతాదేవి భూమి నుండి పుట్టి భూమిలోనే అణగారిపోయింది. ఆ విరహంచేత బలరాముడు పాలిపోయి తెల్లబడ్డాడు. ఆ విరహం వల అతడు పోయిన సీతను తిరిగి పొందడం కోసమో అన్నట్లుగా యమునా నది ఒడ్డును అవశాత్ముడై నాగలితో కుద్దాలిస్తున్నాడు.

బలరాముని సహజమైన పాండు వర్ణాన్ని విరహం వల్ల కలిగిన తెల్లదనంగా యమున ఒడ్డును నాగలితో కుద్దాలించడం మునుపు నాగటిచాలులో సీత దొరికినది. ఇప్పుడు కూడా అలాగే చేసి సీతను పొందవచ్చునన్న కోర్కెతో ఈ విధంగా చేస్తున్నాడని చెప్పబడింది. బలరాముని మద్యపాన మత్తత విరహవివశాత్మతగా చెప్పబడ్డది.

అలం : ఉత్ప్రేక్ష.

## కృష్ణావతారం

ఉ॥ ఆయతయుష్మదాకృతి కరాగ్రనగాంచలవాంతవారిధా
రాయుతచంద్రకాంత ఫలకావళిబింబితయై చెలంగ, నా
రాయణమూర్తిమత్కవచరత్నముచేఁ బరిరక్షఁ గాంచె నా
నో యదువీర వృష్టిఁ బసియూఱడఁ బ్రోవవె సప్తరాత్రముల్. 29

ఓ యదువీర = యదువంశములో పుట్టిన ఓ శ్రీకృష్ణా ! ఆయత = ఉన్నతమైన; యుష్మత్ = నీ యొక్క, ఆకృతి = మూర్తి; కర+అగ్ర = చేతి చివరయందున్న, నగ = గోవర్ధన పర్వతంయొక్క; అంచల = చివళ్ళ యందు; వాంత = వమింపబడుతున్న (కురుస్తున్న); వారిధార = నీటి ధారల యొక్క; ఆయుత = దశసహస్రములైన; చంద్రకాంత = పాలరాతియొక్క; ఫలక = పలకల యొక్క; ఆవళిన్ = గుంపులో; బింబితయై = ప్రతిబింబాలు కలదై; చెలంగన్ = ఒప్పగా; నారాయణమూర్తిమత్ = నారాయణుని ఆకారము కలదైన, కవచరత్నముచే = ఉత్తమమైన కవచము చేత (నారాయణ కవచమని స్తోత్రమున్నది); పరిరక్షన్ = చక్కని రక్షణము; కాంచెన్ నాన్= పొందెనో అన్నట్లుగా; పసిన్ = పశుగణాన్ని, సప్తరాత్రముల్ = ఏడు రాత్రులు; ఊఱడక = ఊరట పొందేటట్లుగా; ప్రోవవె = కాపాడవే !

శ్రీకృష్ణా ! ఎత్తైన నీ స్వరూపం ధరించి కొనగోట గోవర్ధన పర్వతమెత్తి ఏడు రాత్రులు వ్రేపల్లె లోని పశువులను, గోపాలకులను రక్షించినావు కదా ! ఈ కథాధారంగా నిర్మించబడ్డ వర్ణన ఇలా ఉన్నది, కొనగోట నెత్తిన గోవర్ధన పర్వతం అంచుల నుండి వేల కొలది వాన ధారలు పడుతున్నవి. ఆ ధారలలో శ్రీకృష్ణునివమూర్తి ప్రతిబింబించినది కనుక గోవులకు గోపాలకులకు చుట్టూరా వేలకొలది నారాయణాకృతులు కనిపిస్తున్నవి. ఇది ఎలా ఉన్నదంటే వారు నారాయణ కవచ పారాయణ చేస్తున్నారో అన్నట్లుగా ఆ ప్రతిబింబ సహస్రంచేత సంరక్షింపబడినారు.

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ నారాయణ కవచం భాగవతంలో ఉంది. ఈ కవచ స్తోత్రం పారాయణం ఆత్మ శరీర రక్షణార్థంగా ఈ దేశంలో బహుప్రసిద్ధి పొందింది.

మహాబలిపురంలో ఈ గోవర్ధన నగధారలు చాలా అద్భుతశిల్పంగా చెక్కబడినవి. ఈ పురాణగాథలన్నీ శిల్పచిత్రలేఖన సంగీత సాహిత్య సర్వకళలలోనూ ప్రతిబింబించాయి.

## బుద్ధావతారం

మ॥ తరుణ త్వత్సుత బాణ పంచకమునం దైత్యాబలాశ్రేణి త
ద్వరసందోహము యుష్మదాత్మక జరద్బాణం బొకంటన్నెదఁ
ద్వరఁ గావించితి వేటికో ? యహహా, బుద్ధంబయ్యె నీ భావ మ
త్తరుణీ శీలతనుత్ర మేరికి నసాధ్యం బౌటఁగా కేశవా ! 30

కేశవా = నారాయణా; తరుణ = యువకుడైన; త్వత్ = నీయొక్క; సుత = కొడుకైన మన్మథుని యొక్క; బాణపంచకమున్ = ఐదు బాణాలతో; దైత్య + అబలా = రాక్షస స్త్రీలయొక్క; శ్రేణి = సమూహము; తత్ = వారియొక్క; వరసందోహము = భర్తసమూహము; యుష్మత్+ఆత్మక = నీవె స్వరూపంగా గల; జరత్ = ముసలియైన; బాణంబు = అమ్ము; ఒకంటన్ = ఒకదానితోనే; చెడన్ = నశింపగా; త్వరకావించితివి = త్వరగా చేసితివి; ఏటికో = దేనికో ? అహహా = ఆశ్చర్యం; ఆహా; నీ భావం = నీ మనస్సు; బుద్ధంబు అయ్యెన్ = స్పష్టపడ్డది; ఆ తరుణీ = ఆ రాక్షస స్త్రీలయొక్క; శీల = శీలమన్న; తనుత్రం = కవచము (తనువును రక్షించేది); ఏరికిన్ = ఎవరికి; అసాధ్యం = సాధ్య పడనిది; ఔటన్ కాన్ = అగుట వల్ల కదా !

ఓ కేశవా ! నీవు బుద్ధావతారమెత్తి నాస్తిక మతబోధచేసి రాక్షస స్త్రీ ల సౌశీల్యాన్ని అపహరించిన వారి భర్తలను నాశనం చేశావు.

అలం : హేతూత్ప్రేక్ష.

ఈ బుద్ధావతారము పురాణాలలో నాస్తిక మతబోధకుడైన బుద్ధుని విషయంలో తప్ప గౌతమ బుద్ధుని వర్ణనకాదు చారిత్రక వ్యక్తియైన బుద్ధ భగవానుని గాథకు ఛాయారూపంగా ఈ పురాణ కథ కల్పింపబడ్డది.

## కల్క్యవతారం

శా॥ ఘోరపార మహోఘపంచకముఁ జక్కు ల్సేయంగా నేర్చునా
ధారాపంచకధావనం జెలఁగు గంధర్వంబు ద్రొక్కించు బ
ల్బీరంపున్నెఱరౌతుఁ గీకట శరాళీవారవాణీ భవ
ద్దోరుద్భ్రాంత కృపాణికాద్వితయ విద్యుద్గ్రంథి నిన్ గొల్చెదన్ 31

ఘోర = దారుణమైన; పార = పారములేని; మహా = గొప్ప; అఘపంచకమున్ = ఐదు పాపాలను; (బ్రహ్మహత్య, మద్యపానము, దొంగతనము, గురుభార్యాసంగమము - ఈ పాపాలు చేసిన వానితో సహవాసం ఇవి పంచమహాపాతకాలు; చెక్కుల్ + చేయగా = నరకటం కోసం; నేర్చు నాన్ = నేర్చుతున్నాడో అన్నట్లుగా; ధారాపంచక = ఐదు గుర్రపు నడకలయొక్క; ధావనన్ = పరుగున; (ధారా పంచకము = (1) అస్కందితం (2) ధౌరితకం (3) రేచితం (4) వల్గితం (5) ప్లుతం. వీటికి తెలుగు మాటలు : (1) రవాలు (2) జోడన (3) బవిరి (4) చౌకళింపు (5)దువాలం); చెలగు = ఒప్పు; గంధర్వంబునన్ = అశ్వాన్ని; త్రొక్కించు = దూకించు; బల్= గొప్ప, బీరంపున్ = వీరత్వం గల; నెఱ రౌతున్ = మంచి రౌతును; కీకట = మ్లేచ్ఛులయొక్క; శర= అమ్ములయొక్క; ఆళీ=సమూహమునకు; వారవాణీభవత్ = ఆపాదమస్తకము ధరించే కవచముగా వుతున్న; దోః = చేతిలో; ఉద్భ్రాంత = వేగంతో తిరుగుతున్న; కృపాణికా ద్వితయి = పట్టాకత్తుల జంట అన్న ; విద్యుత్ = మెరుపుయొక్క; గ్రంథిన్ = ముడి కలిగిన; నిన్ కొల్చెదన్

ఇది కల్క్యవతార వర్ణన. అతడు గుర్రమెక్కి దానిని ఐదు గతులలో నడిపించడం పంచమహాపాతకాలను ప్రక్కలు చేయడానికై గుర్రానికి 3 పంచగతులు నేర్పుతున్నాడో అన్నట్లున్నది మ్లేచ్ఛులు తనపై ప్రయోగించే బాణాలను తిప్పికొట్టడానికి అతడు చేతులలో రెండు పట్టాకత్తులను ధరించి తీవ్రవేగంతో త్రిప్పుతున్నాడు. ఆ వేగంతో తిరుగుతున్న కత్తుల కాంతులు విద్యద్వలయాలుగా భాసిస్తూ అతనికి ఆపాదమస్తకం కవచంగా ఏర్పడుతున్నాయి. ఆ కవచమే వారవాణి.

విశే॥ శ్రీ కృష్ణదేవరాయలు అశ్వారోహణ నైపుణీకులుడని పెద్దనాది కవులు కీర్తించారు. ఆ స్వానుభవమే ఇక్కడ పద్యంగా రూపొందినది.

అలం : ఉత్ప్రేక్ష

ఈ పద్యంతో దశావతార వర్ణన పూర్తికావింపబడినది.

**చ॥ అని వినుతింపఁగా హరి సుధాశన వర్ధకిఁ జూచి 'పాండ్యుఁ డి**
**చ్చిన ధన మిమ్ము నీశ్వరుఁ డశేషము భాగవతాస్మదీయ గే**
**హనివహ సాత్కరించి, యకటా ! కడు రిక్తత నొందు; నేతదీ**
**యనిలయ మప్పురి న్మణిమయంబును సార్థముఁ జేయు నావుడున్. 32**

అని వినుతింపగాన్ = స్తుతింపగా; హరి = విష్ణువు; సుధ + అశన = అమృతమే ఆహారంగా గల దేవతలయొక్క; వర్ధకిన్ = వడ్రంగియైన విశ్వకర్మను; చూచి; ఈ మునీశ్వరుడు = ఈ మునిశ్రేష్ఠుడైన విష్ణుచిత్తుడు; పాండ్యుడు = పాండ్యరాజు; ఇచ్చిన = సమర్పించిన; ధనము + అశేషమును = ధనమంతా; భాగవత = భగవద్భక్తుల; అస్మదీయ = తమయొక్క; గేహ = ఇండ్ల యొక్క; నివహ = సమూహానికి; సాత్కరించి = సమర్పించి; కడున్ = మిక్కిలి; రిక్తతన్ = పేదరికాన్ని; ఒందున్ = పొందును; అకటా = అయ్యో ! అప్పురిన్ = అతని నగరంలో; ఏతదీయ= ఈ విష్ణుచిత్తునియొక్క; నిలయమున్ = ఇంటిని; మణిమయంబును = రత్నమయంగాను; స + అర్థముల్ = ఐశ్వర్యముతో కూడినదిగను, చేయుము+నావుడున్ = అనగా;

అని ఈ విధంగా విష్ణుచిత్తుడు స్తుతించినాక విష్ణువు దేవశిల్పి అయిన విష్ణుకర్మను చూచి ''ఈ మునీశ్వరుడు పాండ్యరాజు తనకు సమర్పించిన ధనమంతా నా ఆలయాలకు, నా భక్తులకు సమర్పించి రిక్తుడవుతాడు. కాబట్టి ఇతని గృహమును మణిమయము, అర్థమయము చేయవలసిందిగా ఆజ్ఞాపించాడు.

విశే॥ భక్తుని గృహాన్ని సంపదత్వంగా చేయవలసిన అవసరమేమిటి ? పైగా విష్ణుచిత్తుడది కోరుకున్న వాడు కాడు. కాబట్టి ఈ పద్యభావం గోదాదేవి కథలో 5-38 వ పద్యంతో ముడిపడియున్నది. నాయిక గోదాదేవి ఆ గృహంలో జన్మింపబోతున్నది కనుక ఈ సంపద శృంగార రసానికి సంబంధించినదిగా గుర్తించాలి. అంటే కావ్యంలో ప్రధాన రసం శృంగారం ధ్వనించడం.

తే॥ విశ్వకర్మయు నట్ల కావించె; నంత
నంబుజాక్షుఁడు నమ్ముని నాదరించి,
యీక్షణా గోచరుండయ్యె; ఋషియు నేఁగి
పౌరులు భజింపఁ గానె పుత్తూరి కరిగె. 33

విశ్వకర్మయున్ = దేవశిల్పియు; అట్లు = అదేవిధంగా; కావించెన్ = చేసినాడు; అంతన్ = తర్వాత; అంబుజాక్షుడు = తామరపూవులవంటి నేత్రాలు గల హరి; ఆ మునిన్ = ఆ విష్ణుచిత్తుని; ఆదరించి = అనుగ్రహించి; ఈక్షణ = అగోచరుండు = చూపులకు కన్పించనివాడు; అయ్యెన్= అయినాడు, ఋషియున్= విష్ణుచిత్తుడును; పౌరులు = మధురా నగరవాసులు; భజింపగానె = సేవిస్తుండగనె; పుత్తూరికిన్ = శ్రీవిల్లి పుత్తూరికి; అరిగెన్ = వెళ్ళినాడు.

విశే॥ పై పద్యంలో వర్ధకి విశ్వకర్మ, విశ్వనిర్మాణం చేసేవాడు. విశ్వకర్మ వాస్తు శిల్పనిర్మాతలైన శిల్పులకు మూలరూపం, వర్ధకి – వడ్రంగి, వేదకాలంలో కట్టెతో బొమ్మను చేయడమే. శిలాలోహమూర్తి నిర్మాణం తర్వాత వచ్చింది. కనుక కుమ్మరి, వడ్రంగి వీరే ఆదిమ శిల్పులు. కుండ, దారు (కట్టె) మూర్తులే ప్రాచీన శిల్పాలు. ప్రాచీనమైన సౌధాలు కూడా దారుమయంగానే ఉండేవి.

విష్ణుచిత్తుని స్వపురప్రవేశోత్సవము

కం॥ స్థానికులు దమ్ముని దిదృ
క్షానందితు లగుచుఁ బురము గైసేసి, ప్రజ
లోఁత నడువ నాగవాసము
తో నెదురుగ నేఁగి ; రంత తూర్యము లులియన్. 34

స్థానికులు = శ్రీవిల్లిపుత్తూరు దేవాలయంలోని ఉద్యోగులు (2-95 వ పద్యంలో వీరి ప్రస్తావన వచ్చింది); తత్ + ముని = ఆ విష్ణుచిత్తుని; దిదృక్ష = చూడాలన్న కోరికతో; ఆనందితులు = సంతోషవంతులు; అగుచున్ = అవుతూ; పురమున్ = విల్లిపుత్తూరును; కైసేసి = అలంకరించి; ప్రజలు = ఊరివారు; తోన్ = కూడా; నడువన్ = రాగా; నాగవాసముతోన్ = భోగం మేళంతో కూడా; ఎదురుగన్ ఏగిరి = ఆహ్వానించడానికి ఎదురు వెళ్ళారు; అంతన్; తూర్యములు = మంగళవాద్యాలు; ఉలియున్ = ధ్వనింపగా.

తమ ఊరివాడు మధురాప్రభునాస్థానంలో వాదించి జయం పొంది వస్తున్నాడు కనుక విష్ణుచిత్తుని చూడాలని ఆనందంతో ప్రజలు వేశ్యాసమూహం వెంటరాగా స్థానికులు ఎదురు వెళ్ళి ఆహ్వానించారు. ఈ నగర వర్ణన ప్రథమాశ్వాసంలో వచ్చింది.

వ: (1) ఇట్లెదుర్కొని పట్టపవిత్ర భగవత్ప్రసాద తీర్థంబు లుపాయనంబులుగాఁ బ్రణామంబు లాచరించి లేచి, ప్రాంజలులై, ధర్మపరికర్మ వర్మితం బగు బ్రహ్మరథంబున నబ్భాగవతంసంబు నునుచుకొని పోవు సమయంబునఁ, బరస్పర సేతంబు లగు పౌరజానపదజనంబులు గలసి మెలసి నడచునెడ;

(2) మృదంగం బుపాంగం బావజంబు దండె తాళం బురమ కిన్నెర సన్నగాళె వీణ ముఖవీణె వాసెగ్రోలు డోలు మౌరి భేరి గౌరు గుమ్మెట తమ్మెటంబు డుక్క డక్కి చక్కి యయ్యంకి లోనగు నసంఖ్యాత వాదిత్ర త్రితయ పరంపరలు మొరయన్.

(3) ఎడనెడఁ బడఁతుకలు వలఁపుఁగొనఁ, బట్టణాగత గజఘట్ట ఘోట్టాణ ఘోట్టాకఘంటైకదంబఘర్ఘరఘోషంబుల కనుప్రాసంబులై, విలాసినీ మంజు మంజీరంబు లెలుఁగియ్య నల్లనల్లం జాఁగుఁతఱిన్;

(4) కెలఁకులం గనచితకుథాకర్బురలగు కరివరక రేణుకంధరలం గనకాంకుశంబులు చేఁబూని సేవించి పోవు సామాంతభీకాంతకుమార ధట్టంబులం బిట్టుగాంచి, యొండొరుఁగడవ సంభ్రమించుచు, మ్రొక్కినిక్కి చేయెత్తి యొత్తిలి నేత్రంబు లుత్తాన తరళ తారకంబులుగా మగిడి మగిడి పోదడుచుం బోవుతఱిన్;

(5) తద్రాజకదంబకం బచ్చటి పడంతుకలకుం దమకుం బురికిం జనుదెంచు నప్పుడెల్ల నెడకాంద్రగుట వేలవూఁడబోలు నా ప్రోలివేళంపుఁ గళావతుల వ్రేయు నెపంబునం గ్రామగ్రామ గ్రామణులొసంగు నారంగ మాతులుంగ జంబీర కుంద కందుకాదులం బూర్వాను భుక్తలగు నక్తంకర ముఖుల వైవ;

(6) ధళధళత్తరళతాటంకంబును నంకురితస్మితంబునుగా, నాతన్మఖప్రేంఖోళితస్ఫీత సాకూత విభ్రమాకేకరాపాంగ విలోకనంబును నాచలిత ధమ్మిల్లంబునుంగా, మొగంబులు తిగిచికొని సమ్మర్దంబునం జను మార్దంగికుల మూఁపుల మఱుంఁగుల డాఁగి యున్నాగవాసంబులు నాగర కవిలోకనంబునం జెలరేఁగి, మొగంబులు బిగించుకొని, వేదుఱెత్తిన గతి నరిదియెత్తఁ బ్రబిపదంబును మర్దలముఖావ మర్దనకుఁ గ్రుంగుటయు, బయలుపడి చేయునది లేక యాకడకు వంగిడి తఱువు దిద్దుచుఁ, దద్వారణాభినయనవత్పురాచీనకరాబ్జలై సుడివడు నెడంబొడము కర్ణకుసుమావతంస కపోలఖురళీకించిచ్ఛల నోపలక్ష్య వైలక్ష్యహాసకుందంబులు సాంద్రతర చంద్రికాకందంబులం దీటు కొలుపన్;

(7) చాటూక్తి వాచాటలగు జరతవనితలు తమకు మ్రొక్కందారు మ్రొక్క కొక్కించుక యోరమోమిడి, వారి యిరుపక్కియల నొదిఁగి తొంటియంటుఁ దలంచి తలవాంచిన, వంచనం గటాక్షించి యొకసక్కెంబునకుఁ దమచేత మ్రొక్కించుకొను వేడ్క నక్కడం బుడమిఱేఁడు లేమి సామాన్య మానవులం గైకొనక, సుమాళంబు వేద్యంబుగా విద్యావయోవృద్ధుల రగు మీరు మ్రొక్కం దారు మ్రొక్కమియెట్లు మ్రొక్కింపుం డనుటయు;

(8) గ్రక్కునన్ బొడము మొలకనగవుల మోముఁదమ్ములకు వే ఱొక్కవింత తెలివి యెక్క, మ్రొక్క కక్కడఁ గెడఁగూడి నడమతోడి చేడియల కద్దొరలకుఁ దమకుఁ దర్దయుం బొందు గల దను పెద్దఱికం బెఱుకపఱుపఁ గెమ్మోవులు మలంచి లోలోన నొయ్యనొయ్యన నుచుక్కన నక్కిలెఱింగి దక్క సొమ్మని తమ్ము నమ్ముదుసళ్ళు ముందఱికి నూకి 'యక్కక్క, మ్రొక్కవే మనపాలి వేలు' పని బుజ్జగించియు బొమలు గొని జంకించియు నెట్టకేలకు నొడంబఱచినన్,

(9) త్రపాతరళనయనలై విరళవిరళాంగుళాంజలి బంధంబుగా మ్రొక్కి, కక్కసాన నిట్లు మ్రొక్కించి, హెచ్చి, యచ్చయ్యాట మెడపడకయుండఁ జిగురుగండెలువోలె నల్లుకొని గొల్లననగు నల్లోలాంగనలఁగల్ల కోపంబునం గొట్టి కసరుఁజూప, బృంద సంఘంబుపై నిగుడ, మగుడ మఱుపడు కొమిరె హరిణలోచనల చలితకంకణసంకులక్రేంకారంబు లానా మోదమేదురాళిఝంకారంబుల బింకంబు లడంపన్ ;

(10) చెవుల సంకులు, లోవంక భుజంబులు కొంకిసిగలు, గావి దుప్పటులు, నొప్ప, నిమ్మై దెప్పరంబై వుప్పున నప్పురంబు జేరి, రసికజనబాంధవంబున బంధువియోగంబు మఱచి, గంధకలనాకుసుమస్రగ్గ్రథనాదులనాంధ్యంబులే కలరు నంధ్రదేశీయులగు గంధకారులు పాటిపాటి పద్యంపు మ్రొక్కులతో వెట్టివెట్టి కైవారంబులు గౌరుతత్తడులపై వచ్చు రాచవారిపై నాఁడువారిపై నాళువారిపైఁ జల్లగాఁజల్లఁ ; బెల్లెగసి సృష్టియెల్లను ముష్టీకరించుచు, నస్పష్టభేదయగు పరిమళసమష్టిం బెట్టు పిష్టాతకంబు నభోమండలికింజండాతకంబై చండకరకిరణంబుల మాటుపఱుపఁ, బన్నీరు నించిన తన్నీరుతిత్తులొత్త;

(11) వియత్తలంబునం బాఱికైవ్రాలు ధారల వాద్యంబులు దడిసిన విద్యోపజీవులు పుష్కరంబులు గ్రాఁప నగ్గిరోయుచుండ; నవెయ్మత్త మత్తఱి నృత్తంబుఁజూడ నిలిచి మెత్తమెత్తన నడచుచుండం మిండతండంబునుం దారు నప్పిండు పుండరీకాస్య లవకాశంబు గాంచి కాశకుసుమప్రతిఫలనపాండురంబులై పద్యాతి హృద్యపార్శ్వద్వయోద్యాన పాదపంబులకుంబాఱు చెంగలువకాలువలకుండిగ్గి, కాసరీదధి మండమాసరంబులుగాఁ బిసికి యూరంబెట్టిన నారంగశృంగ బేర భంగంబుతోఁ గట్టిన కలమాన్నంపుఁజలిది పోకపొత్తులం గుడువఁ గూర్చుండ వీక్షించి;

(12) కుక్షింభరిత్వంబున క్షుత్క్షాములై తిరిగితిరిగి వేసరి యోసరిలిన దాసరిగుంపు వారిపాల గోపాలభిక్ష భిక్షించి భక్షింపఁ దీరక్షోణుల నిలిపిన తోరంపు దివెదారి కోలల రంధ్రగోళంబుల నుత్కీలంబులై మండు ధగధగని జగజ్జ్యోతిదీపజాలంబుల మధ్య ధూప కుండికాంగారముల నీరాఱఁగ్రాఁచి, నాదుఁబరికింప వాయించు ధిమిధిమిధ్వానంబులకుం బెదరి యీవలియుపవనశుకంబు లావలి కావలి యుపవనశుకంబు లీవలికి దట్టంబుగాఁ గట్టనితోరణంబులై పఱవఁ, దలలు విసరుటయు నోరం దెఱచుటయుఁ గేలు సఱచుటయుఁ దక్క మిక్కుటం బగు నక్కోలాహలంబున నేపాటియుం బాటం వినరాక మూఁకగట్టిన భాగవతజాతంబు లేలేర ;

(13) నూరూరి సంతసంతకుం దిరుగఁ బెద్ద లింటింట సంతరించిన పిలుకువాటు గోడిగలు జావడంబులకుం బుట్టి కాల్గట్టి విడువ నెత్తంబున మెత్తని గఱిక మేసి పోసరించి మాపుమాపున మేపు సజ్జకవణంపు మేపునఁ బిడుక గొఱపంబు తోమకంబునఁ బుటపుటనై కఱియకంబడి ప్రాఁతఁ గని య్యైన నీడం గనియ్యైనం బెదరుకొదవు తట్టువగుంపు కాలికొలందికి వ్రేలు లాలుకుంచెలు గీలించిన గవ్వదంటలగంటల నలంకరించి మోలుగుమడ్డిం దోఁచి మూర కొక్కండును జేనకొక్కండునుగాఁ గుట్టిన డొల్లు టుల్లారు ల్లుసిల్లం బల్లించిన పల్లంబులపైఁ జిల్లతైలంబున్ను వాసన కొడుపులం బూసినమణుంగుఁ జంద్రికచేలలె రవణంబులుగా నెదురుగా వేడుకం జూడవచ్చిన యవ్వీటి మేటిసాలె యగసాలె పటుసాఱ

నానె వైజాతి సోఁతు లేతులకొమిరెలు తుములమ్మై వచ్చు తచ్ఛమూసామజంబులం జూచి యేచిన వెఱం దమ యెక్కిరింత లెక్కికొని నాగె లిరుగేలం గుదియంబట్టిన నిలువ కయ్యుత్సవం బీక్షింప వచ్చిన ప్రజలం ద్రొక్కుచుంబోవన్;

(14) తన్మధ్యవృద్ధవధ్వాతురాదులు దిట్ట నిట్టట్టనలేక ప్రాణంబులు పిడికిటం బట్టుకొనిపోవుచు, నవీనసవిధకేదారంబులం (దెళ్ళి) చట్టలు దిగంబడి వెడలలేకుండం దారు దిగనిమ్ము లేక బిమ్మటఁగొని నలు దెసలం జూడం, జూచి కేలుసఱచి కోహోయని గేలిసేయు గణికాకదంబంబుల చప్పటులు నిబిడ నిష్కుట విటపి ఝూటంబులం బ్రతిశబ్దంబులు పుట్టింపన్;

(15) ఇట్లనూన విభవంబు చిగురొత్తనత్తిరుపతి సొచ్చి యచ్చక్రధరు నగరి మోసల నిలచుటయు, నవ్విష్ణుచిత్తుండు దద్రధావతరణంబు చేసి, ధరణీ ధవస్థానిక సమూహంబు వెంటరా నవ్వైకుంఠు సేవించి, తత్ప్రసాదలబ్ధం బగు పరివట్టంబున నలంకృతుండై, నానాలంకారసహితంబును రత్నకాంచన సమయంబు నగు నాత్మీయభవనంబుం గాంచి విస్మితుండై పుండరీకాక్ష మహిమాభిలబ్ధమైభవంబుగాఁ దెలిసి తత్రత్యధాత్రీకళత్ర వర్గంబుల ననిపి, ప్రవేశించి, తొంటికంటె శతగుణంబుగా భాగవతపూజా ప్రవణుండై యుండె నంత.

(1) పట్ట = విష్ణుప్రసాదంగా తలకు చుట్టుకునే పట్టువస్త్రము; పవిత్రమైన = పావనమైన; భగవత్ = మన్నారు స్వామియొక్క; ప్రసాద = ప్రసాదము; తీర్థముల్ = అభిషేకజలములు; ఉపాయనంబులుకాన్ = కానుకలుగా; ప్రణామంబులు = నమస్కారాలు; ఆచరించి = చేసి; లేచి= నిలబడి; ప్ర+ అంజలులై = దోసిల్ళు పట్టి; భర్మ = బంగారంతో చేసిన; పరికర్మ = అలంకారాలతో; వర్మితంబు = కవచంగా తొడగబడ్డ; బ్రహ్మరథంబునన్ = బ్రాహ్మణులు మోసే వాహనం మీద; ఆ భాగవత = ఆ భక్త; వతంసంబున్ = శ్రేష్ఠుని; ఉనుచుకొని = కూర్చుండబెట్టుకొని; పోవు సమయంబునన్ = పోయేటప్పుడు; పరస్పర = అన్యోన్యం; సమేతంబులు = కలసిన, పౌర = నగరవాసులయొక్క; జానపద = పల్లెటూరివారైన; జనంబుల్ = ప్రజలు, కలిసి మెలిసి = సమ్మేళనం పొంది; నడుచు+ ఎడన్ = సమయంలో,

పై పద్యంలో చెప్పబడ్డ స్థానికుల, ప్రజలు కలసి విష్ణుచిత్తుని ఎదుర్కొన్నప్పుడు ఆ దేవాలయాధికారులు విష్ణుచిత్తునకు కానుకలుగా స్వామి తలకు చుట్టిన పట్టు వస్త్రాన్ని ఆయన తలకు చుట్టి భగవత్ప్రసాద తీర్థాలను కానుకలుగా పెట్టి సాష్టాంగ పడి లేచి బంగారు అలంకారాలతో కూర్చిన బ్రహ్మరథంలో ఆయనను కూర్చుండ బెట్టుకొని పోతున్నప్పుడు పౌరజానపదులు కలిసిమెలిసి తోడనే నడుస్తున్నారు. అప్పుడు -

(2) మృదంగంబు = మద్దెల; ఉపాంగంబు = శ్రుతి చేసే తిత్తి; వజము = రుంజ; దండె = తుంబుర; తాళంబు = కంచుతో చేసిన తాళాలు; ఉరుమ = జానపద వాద్య విశేషం; కిన్నెర = ఒక రకమైన తంత్రీ వాద్యం; సన్నగాలె = కాహలి; డోలు; మౌరి= నాదస్వరం; భేరి= దుందుభి; గౌరు= పెద్దబాకా, గుమ్మెటంబు= డప్పు, డక్క, డక్కె, చక్కి - ఇవన్నీ జానపద వాద్యవిశేషాలు; చుయ్యంకి= తాళము;

అసంఖ్యాక = లెక్కలేనన్ని, వాదిత్ర = వాద్యాలయొక్క; త్రితయం= మూటి యొక్క; పరంపరలు= సమూహాలు; మొరయన్= ధ్వనిస్తుండగా.

ఈ వచనంలో అనేక జానపద వాద్యవిశేషాలు చెప్పబడ్డాయి. 'త్రితయ' మంటే నృత్తగీత వాద్యములు ఈ వాద్యవిశేషాలన్నీ 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం' వంటి గ్రంథాలలో, బొమ్మల్లో చూపబడినవి.

(3) ఎడనెడన్= నడుమ నడుమ; పడతుకలు = స్త్రీలు; మలపు గొనన్= మలుపు తిరిగి; నటనం చేస్తుండగా; పట్టణాగత= నగరం నుండి వచ్చిన; గజఘట్ట= ఏనుగుల సమూహముయొక్క; ఘోట్టాణ ఘోటక = ఘోట్టాణదేశపు గుర్రాలయొక్క; ఘంటాకదంబ= గంటలసమూహాల యొక్క; ఘర్ఘర ఘోషంబులకు = ఘర్ఘర అన్న సవ్వడులకు; అనుప్రాసంబులై = సమాననాదం కలవై; విలాసిని= సానికత్తెలయొక్క, మంజు మంజీరంబులు= మధురమైన కాలి అందెలు; ఎలుగు= ధ్వని; ఈయన్= ఈయగా; ఒల్లనల్లనన్= నెమ్మది నెమ్మదిగా; వాగు తటిన్= సాగే సమయంలో.

మధ్యమధ్య నాట్యకత్తెలు నిలబడి వెనుకకు తిరిగి నాట్యం చేస్తున్నారు. పట్టణం నుండి వచ్చిన ఏనుగుల, గుర్రాల గంటల సవ్వడులకు అనుకూలంగా నటిస్తున్న నట్టువ రాండ్రయొక్క బంగారు అందెల సవ్వళ్ళు, అనుకూలంగా ధ్వనిస్తుండగా నెమ్మది నెమ్మదిగా జనం గుంపు పోతున్న సమయంలో.

(4) కెలంకులన్ = ప్రక్కలందు అటూ ఇటూ; కవచాలుగా చేయబడ్డ; కుధా= ఏనుగుల అంబారీపై పరిచే రత్నకంబళ్ళచేత, చిర్బిరయి= రంగుల రంగులు కలవి; అగు= అయిన; కరివర= మగ ఏనుగులయొక్క; కరేణు= ఆడ ఏనుగుల యొక్క, కంధరలన్ = కంఠాలలో; కనక+ అంకుశంబులు = బంగారు అంకుశములు; కేలంబూని = చేతితో పట్టుకుని; సేవించి = భజించి; పోవు = పోయే; సామంత కుమార ఘట్టంబులన్ = సామంతులైన రాజకుమారుల గుంపు; బిట్టు= మిక్కిలి; కాంచి= చూచి, ఒండొరున్= ఒకరినొకరు; కడవన్ దాటిపోవడానికి; సంభ్రమించుచున్ = తొట్రుపడుతు, మ్రొక్కి= నమస్కరించి, నిక్కి = కాళ్ళ పై సాగి నిలబడి; చేయెత్తి = చేతులెత్తి; ఓసరిల్లి = ఒత్తిలి = ఒదిగి; నేత్రంబుల్ = కళ్ళు, ఉత్తాన = విప్పారిన; తరళ= చంచలించే; తారకంబులుగాన్ = కనుపాపలు కలవి అయినట్లుగా, మగిడి మగిడి = వెనుకకు తిరిగి తిరిగి; పొగడుచున్ = స్తుతిస్తూ.

జనసమూహం మెల్లగా సాగుతుండగా దానికి అటూ ఇటూ రత్నకంబళ్ళతో చిత్రవర్ణాలు కలవైన ఆడమగ ఏనుగుల మెడలపై కూర్చున్న బంగారు అంకుసాలను చేతిలో పట్టుకొని సేవించిపోతున్న సామంత రాజ కుమార సమూహాన్ని చక్కగా చూచి వారిని సమీపించడానికి ఒకరినొకరు త్రొక్కుకుంటూ తొట్రుపడుతూ నమస్కరించి నిక్కి చేతులెత్తి ఒదిగి ఒదిగి కళ్ళు పైకెత్తి కనుగ్రుడ్లు విప్పార్చిచూస్తూ మాటిమాటికి ప్రశంసిస్తూ పోయే సమయంలో.

ఈ వచనంలో ఏనుగుల పై కూర్చొని తమతో బాటు వస్తున్న రాకుమారులను చూడ్డం కోసం వేశ్యలు తొట్రుపడటం చెప్పబడింది దీనికి కారణంగా క్రింది వచనం వస్తున్నది.

(5) తత్ = ఆ; ఆ రాజకదంబకంబు = రాకుమారుల సమూహం; అచటి = విలిపుత్తూరులో నున్న; పడంతులకున్ = స్త్రీ లకూ; తమకున్ = తమకు; పురికిన్ = విలిపుత్తూరుకు; చనుదెంచునప్పుడు+ఎల్లన్ = వస్తున్నప్పుడెల్ల ; ఎడకాండ్రు = తార్పుగాళ్ళు; అగుటన్ = కావడం వల్ల; మేలంపు కళావతులన్ = మేళపు స్త్రీలను; వైచునెపంబునన్ = వేసేమిషగా; గ్రామగ్రామణుల్ = ప్రతి ఊరి గ్రామాధిపతులు; ఒసంగు = కానుకలుగా ఇచ్చిన; నారంగ = నారింజ; మాతులుంగ = మాదీఫలాలు; జంభీర = నిమ్మపండ్లు; కుందకందుకాలు = మొల్లపూల బంతులు మొదలైన వాని చేత, పూర్వానుభుక్త = పూర్వం భోగింపబడిన; నక్తంకర ముఖులన్ = చంద్రబింబము వంటి ముఖాలు కలవారిని; (నక్తం = చీకటి, కరుడు = చేసేవాడు) వైవన్ = కొట్టగా.

ఆరాజుకుమారుల సమూహానికి విలిపుత్తూరు వేశ్యలకు సంబంధమున్న కారణంగా రాకుమారులు వారితో మేలమాడుతున్నట్లుగా తమకు ఆ యా గ్రామాధిపతులు కానుకగా సమర్పించిన పండ్లను పూలబంతులను వేశ్యలపైన విసరివేస్తున్నారు. ఈవచనంలో 'ఎడకాండ్రు' అన్నమాట 'మిండకాండ్రు' అన్న అర్థంలో ప్రయోగింపబడింది.

6) ధళధళత్ = తళతళమని, తరళ = మెరిసే; తాటంకంబులున్ = చెవికమ్మలు కలవి; అంకురిత = మొలకెత్తిన; స్మితంబును = చిరునవ్వులు కలవి; కాన్ = కాగా; ఆ తన్ముఖ = ఆరాకుమారులు ముఖాలదాక; ప్రేంఖోళిత = ముందుకు వెనకకు దూకుతున్న; స్ఫీత = విశాలమైన; సాకూత = సాభిప్రాయమైన; విభ్రమ = తొట్రుపడే; ఆకేకర = ఓరచూపులుకల; అపాంగ = కడకండ్లయొక్క; విలోకనంబును = చూపులు కలది

ఆ వేశ్యలు రాకుమారులను చూస్తున్న పద్ధతి ఇందులో వర్ణింపబడ్డది. వారి పెదవులపై చిరునవ్వులు, చెవికమ్మల తళతళతో పోటీపడుతున్నవి. ఇక కడగంటి చూపులు రాజకుమార సంగమాపేక్ష కలదై ఓరగా వారివైపునకు దూకుతున్నవి. ముందుకు వెనకకు ఉయ్యాలలై చలి స్తున్నవి.

7) ఆచలిత = మిక్కిలి కదలుతున్న; ధమ్మిల్లంబునన్ = కొప్పులు కలవి; కాన్ = అవుతున్నట్లుగా; మొగంబులు = ముఖాలు; తిగిచికొని = పక్కకు తిప్పుకొని; సమ్మర్దంబునన్ = గుంపులో; చను = పోతున్న; మార్దంగికుల = మద్దెల వాయించే వారి యొక్క; మూపుల మరుగునన్ = భుజాలచాటున; దాగి = దాక్కొని; ఆ నాగవాసంబులు = ఆ వేశ్యలు; నాగరక = నగరవాసులయొక్క; విలోకనంబునన్ = చూపులచేత; చెలరేగి = మిక్కిలి ఉత్సహించి; మొగంబులు బిగించుకొని = ముఖాలను ముడుచుకొని; వేదఁబొత్తిన గతిన్ = పిచ్చిపట్టినట్లు; అరిది+ఎత్తన్ = ఆశ్చర్యమైనట్లుగా; ప్రతిపదంబును = ప్రతిఅడుగును; మర్దలముఖ = మద్దెలముఖముయొక్క; అవమర్దనకున్ = వాయించడానికి; క్రుంగుటయున్ = వంగడం వల్ల; బయటపడి = బయల్పడి; చేయునది లేక = ప్రతిగా చేసేదేమి లేనందున; ఆకడకున్ = ఆచివరకు; మగిడి = తిరిగి; తురుమున్ = కొప్పును, దిద్దుచున్ = అమర్చుకుంటూ; తత్ = ఆ పూలబంతుల పండ్లయొక్క; వారణ = నివారించుకోవడంలో; అభినయవత్ = అభినయముగా అవుతున్న; పరాచీన =

అడ్డము పెట్టిన, కర+ అబ్జులు = తామరపూలవంటి చేతులు కలవారై; పుగివడునెడన్ = తొట్రుపడుతున్న సమయంలో; పొడము = కన్పించే; కర్ణ = చెవిలో; అవతంస = అలంకారపుష్పాలు; కపోల = గండస్థలమున్న; కురళీ = గరిడీలయొక్క; చలన = కదలికతో; ఉపలక్ష్య = గోచరించే; వైలక్ష్య = ఆశ్చర్యం కల; హోసకుందంబులు = నవ్వులన్న మొల్లపువ్వులు; దీటుకొల్పన్ = పోలుతుండగా.

రాకుమారులు తమ మీదకు విసరే పండ్లు, పూలబంతులు దెబ్బలకు వేశ్యలు మార్దంగికుల చాటున ఒదిగినారు. అపుడు నాగరికులైన విటకాంద్రయొక్క చూపులు వారిపై ప్రసరిస్తే చెలరేగి ముఖాలు బిగించుకొని పిచ్చిపట్టినట్లుగా అయినారు. అంటే విటుల చూపులకు కామావేశం పొందినందువల్ల మార్దంగికుల మూపుల చాటునన ఒదగలేకపోయినారని భావం. ఇంతలో మార్దంగికులు మాటిమాటికి మృదంగం వాయించడానికి వంగినందువల్ల చాటున నున్న వేశ్యలు బయట పడ్డారు. ఇక చేసేదేమీలేక రాకుమారులవైపుకు తిరిగి కొప్పులుదిద్దుకుంటూ వారు విసిరే ఫలాదులను వారించడం కోసం చేతులడ్డుపెట్టుకొన్నారు. అదొక అభినయ విశేషంగా భాసించింది. ఆసమయంలో వారి చెవి పూలకాంతులకు కపోలస్థలాలు గరిడీస్థలాలైనవి. అంటే వారి చెక్కిళ్ళలో పూలకాంతులు ప్రతిఫలిస్తున్నవి. పెదవులపై కించిత్తుగా చలిస్తున్న ఆశ్చర్యంతో కూడిన చిరునవ్వులు మొల్లలు పూచినట్లు అంకురించి దట్టమైన వెన్నెల కాంతులతో పోటీపడుతున్నవి

8) చాటు+ఉక్తి = అందమైన మాటలతో; వాచాలులు= ఎక్కువగా మాట్లాడేవారు; జరఠ వనితలు = ముసలిస్త్రీలు; తమకు = రాకుమారులకు; మ్రొక్కన్ = నమస్కరిస్తే; తారు = పూలచెండ్లదెబ్బలు తిన్న యువతులు; మ్రొక్కక = దండము పెట్టక; ఒక్కింతుక = ఒక్కింతగా; ఓరమోమిడి = ప్రక్కకు ముఖము త్రిప్పి; వారి = జరఠ వనితలయొక్క; ఇరుపక్కియలన్ = రెండు ప్రక్కలా; ఒదిగి = దాగి; తొంటి = పూర్వపు; అంటు = సంబంధం; తలంచి = ఆలోచించి; తలవాల్చినన్ = తలవాల్చగా; వంచనన్ = కపటంతో; కటాక్షించి = కడగంటచూచి; ఎకసక్కెమునకున్ = నవ్వులాటకు; తమచేతన్ = యువతులచేత; మ్రొక్కించుకొను వేడ్కన్ = దండంపెట్టించుకోవాలన్న కోర్కె; పుడమిఱేడు = రాజు; లేమిన్ = లేకపోవడం వల్ల; సుమాలంబు = మనసులోని ఉత్సాహం; వేద్యంబుగాన్ = స్పష్టంకాగా; విద్యావయోవృద్ధులకు = విద్యలోను వయస్సులోను పెద్దవారు; మీరు = ఆ జరఠ వనితలైన మీరు; మ్రొక్కగా = మ్రొక్కితే, తారు = ఆ వయస్సుకత్తెలు; మ్రొక్కనియొట్లు = నమస్కరింపక పోవడమెలాగా? ; మ్రొక్కింపుడు = దండం పెట్టించండి

ఈ వచనంలో రాకుమారులకు ముసలిస్త్రీలకు మధ్యజరిగిన విషయం వర్ణింపబడ్డది. ఆముసలిభోగపు స్త్రీలు చక్కగా మాట్లాడటంలో నేర్పరులు. వారు రాకుమారులకు నమస్కరించారు. యువతులు మాత్రం నమస్కరించలేదు. ముసలిస్త్రీలకు అటు ఇటుగా సిగ్గుచేత ఒదిగి దాక్కున్నారు. ఆ సిగ్గునకు కారణం తమకు రాకుమారులకుపూర్వమున్న సంబంధం. రాకుమారులకేమో వారిచేత నమస్కరింపచేసుకోవాలని కోరిక. అందువల్ల రహస్యంగా వాళ్ళను చూస్తూ స్పష్టంగా పెద్దవారితో అన్నారు. అన్నివిధాలా పెద్దవారైన మీరే మాకు నమస్కరించారు కదా ! ఈయువతులచేత కూడా మ్రొక్కించండి

అని అన్నారు. ఈసన్నిష్టమైన సంభాషణ వైఖరి అక్కడ రాజు లేనందువల్ల జరిగిందని వ్రాయడం గొప్ప ఔచిత్యం.

గ్రుక్కునన్ = వెంటనే; పొండము పుట్టే; మొలకనగవులన్ = లేతనవ్వులవల్ల; మోముదమ్ములకున్ = తామరపూల వంటి ముఖాలకు; వేరొక్క = మరియొక, వింత = అద్భుతమైన; తెలివి = వన్నె; ఎక్కన్ = కలిగినందువల్ల; మ్రొక్కక = నమస్కరించకుండ; కెడగూడి = ప్రక్కలకు ఒదిగి; నడచు = నడిచే; తోడిచేడియలకు = కూడావస్తున్న చెలికత్తెలకు; అద్దొరలకున్ = ఆరాకుమారులకు; తమకున్ = యువతులకు; తర్దయున్ = మిక్కిలి; పొందు = సంబంధము; కలదు = ఉన్నది; అను = అన్న; పెద్దరికంబు = పెద్దతనము; ఎఱుకబరుపన్ = తెలియపర్చగా; కెమ్మోమ్మోవులు = ఎర్రని పెదవులు; మలంచి = లోపలకు మడచి; లోలోన = లోపల లోపల; ఒయ్యనొయ్యనన్ = క్రమక్రమంగా; ఉచుక్కునన్ = అనాదరింపుగా; అక్కిలు = ఆరహస్యం; ఎఱింగి = తెలిసి; దక్కెను = లభించింది; పొమ్ము + అని; తమ్మున్ = యువతులను; ఆముదుసళ్ళు = ఆ జరఠ వనితలు; ముందరికిన్ నూకి = ముందుకు త్రోసి; అక్క+అక్క = అమ్మమ్మా; మనపాలి వేలుపు = మనపాలిదేవుడని; బుజ్జవించన్ = బుజ్జగించి; బొమ్మలుగొని = భ్రుకుటి ముడిచి; జంకించియు = బెదరించి; ఎట్టకలకున్ = తుట్టతుదకు; ఒడంబరచినన్ = అంగీకరింపచేయగా;

రాకుమారులు పై విధంగా అనడం విని యువతులు చిరునవ్వు నవ్వారు, ఆ నవ్వులకాంతో ముఖానికి ఒక వింత అందం చేకూరింది. తమ ప్రక్కనే తమతో పాటూ నడస్తున్న చెలికత్తెలకు తనుకు ఆ రాకుమారులకు సంబంధమున్నదని స్పష్టం చేసారు . అది విన్న ముదుసలి స్త్రీలు గుట్టు తెలిసిందని వాళ్ళను ముందరకు నెట్టి బ్రతిమాలి బెదరించి నమస్కరించడానికి వారి నంగీకరింపచేసారు.

(9) త్రపాతరళనయనలు = సిగ్గిచేత చలించే నేత్రాలు కలవారు; విరళ విరళ = పలుచని; అంగుళీబంధంబుగాన్ = వ్రేళ్ళకూడిక కలుగున ట్లుగా; మ్రొక్కి = నమస్కరించి; కక్కసానన్ = బలవంతంగా; మ్రొక్కించి = మ్రొక్కేటట్లుచేసి; ఆ చయ్యాటము = ఆ ప్రేమకలాపం; ఎడపడక = దూరం కాకుండా; ఉండగాన్ = ఉండేటట్లుగా; జిగురు గండెలుగాన్ = పిట్టలు పట్టుకోవడానికి జిగురుపూసిన కట్టెపుల్లల వోలె; అల్లుకొని = క్రమ్ముకొని; గొల్లవన్ = గొల్లుమని; నగు = నగుతున్న; ఆలోలాంగనలన్ = ఆ వృద్ధవేశ్యలను; కల్లకోపంబునన్ = తెచ్చిపెట్టుకొన్న కోపంతో; కొట్టి = యువతులు దెబ్బవేసి; కసరుచూపు = కోపపుచూపు; ఆ రాజ సంఘంబు మీదన్ = ఆరాకుమారుల గుంపుపై; నిగుడన్ = వ్యాపించగా; మగుగన్ = తిరిగి; మరుపడు = చాటునకు వెళ్ళే; కొమరె = వయసుకల; హరిణలోచనల = లేడికన్నులవంటి కన్నులు కల స్త్రీలయొక్క; చలిత = కదిలే; కంకణ = కడియాలయొక్క; సంకుల = దట్టమైన; క్రేంకారంబులు = క్రేం అన్న ధ్వనులు; ఆనన = ముఖాలయొక్క; మేదుర = దట్టమైన; అళి = తుమ్మెదలయొక్క; ఝుంకారంబుల = ఝుంఝుం అనే ధ్వనులయొక్క; బింకంబుల్ = గర్వములు; అడంపన్ = అణగార్చగా.



వృద్ధస్త్రీలు పైవిధంగా యువతుల నంగీకరింపచేసి నంతట వీరి నేత్రాలు సిగ్గుతో చలించిపోయినవి. వ్రేళ్లను ఎడమెడంగా కూర్చిన అంజలిబంధాలతో బలవంతాన నమస్కరించారు. వీరిమధ్యనున్న సంబంధాన్ని దూరం కాకుండా ఎగదోస్తున్నట్లుగా వృద్ధాంగనలు గొల్లుమని నవ్వారు; వారిని యువతులు తెచ్చిపెట్టుకున్న కోపంతో కొట్టి రాజకుమారుల పైకి కషాయదృష్టులను ప్రసరింపచేస్తూ మరల వారు వృద్ధస్త్రీల చాటునకు వెళుతున్నారు. అప్పుడు వాళ్ళ చేతి కడియాల ధ్వనులు ముఖపరిమళాలకు ముసరే ఝుంకారగర్వాలను అణచివేస్తూ మ్రోగాయి.

నాల్గు నుండి ఇక్కడి దాకా రాకుమారులకు నట్టువరాండ్రకు నడుమ నడచిన సయ్యాటలు వర్ణింపబడినవి.

(10)చెవులు సంకులు = చెవులకు శంఖాల; లోవంక భుజంబులు = లోపలకు వంగిన మూపులు, కొంకి సిగలు = వంకర జుట్టు ముళ్ళు; కావి దుప్పటులు = కాషాయవస్త్రాలు; ఒప్పన్ = ప్రకాశింపగా; ఇమ్ము = తమ నివాస స్థానము; దెప్పరంబు = అధికము; ఐ = కాగ, ముప్పునన్ = ముసలితనంలో; అప్పురంబు = ఆ నగరం; చేరి = చేరుకొని; రసికజన బాంధవంబునన్ = రసజ్ఞులైన విలి పుత్తూరు జనుల సాంగత్యమువలన ;బంధువియోగంబు = చుట్టాల ఎడబాటు, మరచి = విస్మరించి; గంధకలన = పరిమళద్రవ్యాలను నిర్మించటం; కుసుమస్రక్ = పూలదండలు; గ్రధన = కట్టటం; ఆదులన్ = మొదలైన వాటితో; ఆంధ్యంబులేక = గ్రుడ్డితనం లేని; ఆంధ్రదేశీయులు = ఆంధ్రదేశ నివాసులు, గంధకారులు = పరిమళద్రవ్యాలు లమ్ముకొనేవారు; పాటి పాటి = చిన్న చిన్న, పద్యంబు = పాటలతో కూడిన; మ్రొక్కులతోన్ = నమస్కారాలతో; వెర్రి వెర్రి = అసందర్భములైన, కైవారంబులున్ = స్తోత్రంచేసే (ఆంధ్రదేశీయులైన గంధకారులు), గౌరుతత్తడులపైన = ఏనుగులపై,గుర్రాలపై; వచ్చు = వస్తున్న, రావారిపైన్ = ఇందాక చెప్పిన రాకుమారులపై; ఆళువారిపైన్ = విష్ణుచిత్తునిపైన్, ఆడువారిపైన్ = ఆడవారి మీద, చల్లగాన్ = చల్లనగునట్లుగా; చల్లన్ = చిలకరించగా, పెల్లు = మిక్కిలి; ఎగసి = వ్యాపించి; సృష్టి+ ఎల్లన్= సర్వసృష్టిని; ముష్టీకరించుచున్ = పిడికిట బట్టుకుంటూ; అస్పష్టభేదయగు = భేదం తెలియరానట్టి, పరిమళసమష్టిన్ = సుగంధద్రవ్యాల మొత్తంలో; పెట్టు = ఉంచు; పిష్టాతకంబు = బుక్కాయ ( రంగురంగుల కుంకుమలు) నభోమండలికిన్ = ఆకాశమండలానికి; చండాతకంబై = చల్లాడముకాగా, చండకర = సూర్యునియొక్క, కిరణంబులన్ = కిరణాలను; మాటుపరుపన్ = మాటుమణిగేటట్లుగా; పన్నీరు నించిన = పన్నీటితో నింపిన; తత్ = ఆ; నీరు తిత్తులు = నీరుపోసిన తోలుసంచులను; ఒత్తన్ = వత్తితే; వియత్తలంబునన్ = ఆకాశంలోకి; పారి = ప్రసరించి, కైవ్రాలు = ఏటవాలుగా పడే; ధారలన్ = ధారలలో; వాద్యంబులు = పైనచెప్పిన చర్మవాద్యాలు; తడిసినన్ = నానిపోగా, విద్యోపజీవులు = సంగీతవిద్యమీద బ్రతికేవారు; పుష్కరంబులు = మద్దెల మొదలైన వాని ముఖాలను (నల్లగా ఉండే భాగాలను కన్నులు అంటారు). కాపన్ = వెచ్చబెట్టడానికి (వేడిచేయడానికి); అగ్గిన్ = నిప్పును; రోయుచుండన్ = వెతుకుతూ ఉండగా

ఈ పద్యంలో ఆంధ్రదేశస్థులయిన విలిపుత్తూరులో నివసించే తెలుగువారి వర్ణన చాలా అద్భుతంగా

వేయబడినది వారు పరిమళ ద్రవ్యాలు తయారుచేసి విక్రయించే వృత్తినాశ్రయించి బ్రతుకుతున్నారు. మూపులు రోపలకు దిగబడి యున్నవేమో ! లేదా రొమ్ము మీదకు వంగియున్నవేమో ! వంకర కొప్పులు, కావి దుప్పట్లు కలిగియున్నారట . జన్మస్థలం దూరమై ఆ ఊరు చేరి రసిక జనుల సమూహంతో మిట్టాల ఎడబాటును మరిచిపోయినారు. ఈ రసజ్ఞులకు తాము పరిమళద్రవ్యాలు, పూలదండలు విక్రయిస్తున్నారు కనుక గంధకారవృత్తితో జీవిస్తున్నారు. అలాంటి తెలుగువారు ఏనుగులపై, గుర్రాలపై వస్తున్న రాకుమారులను వెర్రిమొర్రి పాటలు కట్టి పాడుతూ వారిపై ఆళ్వారుపైన, ఆడువారిపైన (భోగస్త్రీలు) ఒకసారి పరిమళద్రవ్యాలన్నీ కలపిన బుక్కాముపొడిని ఆకాశంలోకి చల్లారు అందువల్ల ఏదేదో తెలియనంతగా కన్పించకుండా పోయింది. మధ్యాహ్నపు టెండలను మరుగుపరిచే పన్నీటితిత్తులనొత్తేసరికి అది ఆకాశంలోకి లేచి మరలా క్రిందికి వానధారలై కురిస్తే చర్మవాద్యాలన్నీ అతడికి నానిపోయాయి. అందుకని వాద్యగాళ్ళు తమ వాద్యాలను వేడిచేసుకోవడానికి నిప్పుకోసం వెదకుతున్నారు.

(11) అమ్మొత్తము = ఆ గుంపు; అత్తఱిన్ = ఆ సమయంలో, నృత్యంబున్ = నాట్యను; చూడన్ = చూడటానికి, నిలిచి = ఆగి, మెత్తమెత్తనన్ = నెమ్మదినెమ్మదిగా, నడచుచుండు = నడుస్తున్న; మిండతండబునన్ = మిండగాళ్ళగుంపు; తారున్ = తామున్న ( ఆ దాసరులు); అప్పిండు = ఆ గుంపు; పుండరీక+ ఆస్యలు = తామరపూలవంటి ముఖాలవారు (పైన చెప్పిన భోగంవారు), అవకాశంబు = సమయము, కాంచి = కనిపెట్టి; కాశ = రెల్లు, కుసుమ = పువ్వు; ప్రతిఫలన = ప్రతిబింబించడం వల్ల; పాండురంబులై = తెల్లనివై; పద్య+అతిహృద్య = బాటలయొక్క మిక్కిలిమనోహరమైన,పార్శ్వద్వయ= రెండుప్రక్కల యందున్న; ఉద్యాన = తోటలోని, పాదపంబులకున్ = చెట్లకు; పారు = ప్రవహించే; చెంగలువ కాలువలకున్ = ఎర్ర కలువలు విచ్చిన కాలవలో; దిగ్గి = దిగి; కాసర = గేదెలయొక్క; దధిమండ= పెరుగుమీగడలతో; మూసరంబులగాన్ = దట్టంగా, పిసికి = కలిపి; ఆరంబెట్టిన = ఆరబెట్టిన, నారంగ = నారింజ(నిమ్మ) పండ్లయొక్క; శృంగబేరి = అల్లముయొక్క, భంగంబులతోన్ = ముక్కలతో; కట్టిన= మూటకట్టిన; కలమ+అన్నంపు చలిది = మంచి వరి అన్నపు చలిదిని; పోకపొత్తులన్= పోకచెట్ల పొత్తులతో, కుడువన్ = తినడానికి; కూర్చుండగన్ = ఆమిండతండము కూర్చోగా; వీక్షించి = దాసర్లు చూచి

జనసమూహం నాట్యం చూస్తూ నెమ్మదిగా నడుస్తున్నది. ఆ జనసమూహములో విటులున్నారు. వారుప్రక్కనే ఉద్యానవనాలకు ప్రవహించే కాల్వలు రెల్లుపూలు ప్రతిబింబించడం వల్ల తెల్లగానున్న నీళ్ళతో పారుతున్నవి. ఆకాల్వలలో ఎర్రకలువ లున్నవి. అవి దారికటూ ఇటూ తోటలకు పారుతున్నవి. ఆ కాలువల ప్రక్కకూర్చొని తమతో తెచ్చుకున్న చద్దిని పోకపొత్తుల్లో పెట్టుకొని తింటున్నారు. ఆచద్ది మంచి మీగడపెరుగులో పిసికి ఆరబెట్టిన నిమ్మకాయముక్కలు, అల్లపుముక్కలు కలిపి కట్టినదాన్ని భుజిస్తుంటే దాసర్లు ఆసక్తితో చూస్తున్నారు.

(12) కుక్షింభరత్వమునన్ = కడుపునింపుకోవాలన్న కోర్కెతో; క్షుత్ = ఆకలిచేత; క్షాములై = విక్కిపోయినవారై, తిరిగి తిరిగి = పలుచోట్లకు తిరిగి; వేసరి = విసిగిపోయి, ఓసరిలిన = ప్రక్కకు ఒదిగియున్న; దాసరిగుంపు = పంగనామాలు పెట్టుకొని భిక్షాటన చేసే విష్ణుదాసర్ల సమూహము;

చరిపాలన్= చద్ది అన్నం తింటున్నవారి దగ్గర; గోపాలభిక్షన్ = గోపాలకుడైన శ్రీకృష్ణునకు అర్పించే భిక్ష భక్షించి = అడుగుకొని; భక్షింపన్ = తినడానికి; తీరక్షోణులన్ = కాల్వ ఒడ్డుల యందు; నిలిపిన = ఉంచిన, తోరంపు = పెద్ద; దివెదారికోలలు = దీపాలస్తంభాల యొక్క; రంధ్రగోళంబులన్ = గుండ్రని రంధ్రాలలో, ఉత్తంబులు = పైకిమండె జ్వాలలు కలది. ధగధగని మండు = ధగధగాప్రకాశించే; జగజ్జ్యోతి = ఆపేరుతో ప్రసిద్ధమైన, దీపజాలంబులు మధ్యన్ = దీపాల గుంపుల నడుమ ( జగజ్జ్యోతి నూనెలో తడిపిన గుడ్డపీలికలను వేసి వెలిగించే దీపాలు); ధూపకుండిక = పరిమళద్రవ్యాలు పొగవవేసే పాత్రలో; అంగారంబులన్ = నిప్పుల్లో; నీరు+ఆరన్ = తడి ఆరిపోయేటట్లుగా; క్రాచి = వేడి చేసి; నాదు = నాదం; పరికింపన్ = పరీక్షించడానికి; వాయించు = పై వచనంలో చెప్పిన పన్నీటిజల్లుకి తడిసిపోయిన వాద్యాలను వారు మ్రోగించే; ధిమిధిమి ధ్వానంబులకున్ = మద్దెల మొదలైన చర్మవాద్యాల చప్పుళ్ళకు; బెదరి = భయపడి, ఈవలి = ఇటుప్రక్కనున్న; ఉపవన = తోటల్లోని; శుకంబులు = చిలుకలు; ఆవలికిన్ = అప్రక్కకు; ఆవలి ఉపవన శుకంబులు; ఈవలికిన్ = ఇటుప్రక్కకు; దట్టంబుగాన్ = ఒత్తుగా; పచ్చనితోరణంబులై = గుచ్చని మామిడాకుల తోరణాలై; పరవన్ = పరిగెత్తగా; తలలు విసరుటయు = మద్దెల మ్రోగించేవారు తలలు విసరటం; నోరు తెరవటం; మద్దెలపైకేలు = చేయిచరటం; వ్రేయడం; తక్క = తప్ప, మిక్కుటంబు+అగు = అధికమైన; ఆకోలాహలంబునన్ = సందడిలో; ఏ పాటియున్ = ఏ కొంచెమును; పాట = గేయము, వినరాక = వినిపించక; మూకగట్టిన = గుంపులుగా ప్రోవుపట్టి; భాగవతజాతంబులు = భక్తుల సమూహం; ఏతేరన్ =రాగా.

దాసర్లు కడుపు నింపుకోవడం కోసం చద్దిని భుజిస్తున్న వారి దగ్గర తిరిపె మెత్తుకుంటున్నారు. అందుకోసం చేతుల్లోని దీపస్తంభాలను కాల్వల ఒడ్లపై పెట్టారు. వాటి రంధ్రాలలో నుండి దీపాలజ్వాలలు పైకి వస్తున్నాయి వాటితో తడిసిపోయిన తమ వాద్యాలను వెచ్చబెట్టుకుంటూ వాద్యాలను మ్రోగిస్తుంటే ఆ చప్పుళ్ళకు ఇవతలి తోటల్లో నున్న చిలుకలు అవతలి తోటల్లోకి అటుప్రక్కనున్నవి. వాద్యాలను భాగవతులు పాడుతున్నారు. ఆ సందడిలో పాట మాత్రం వినిపించడం లేదు కాని భక్తులు గుంపులు ఎక్కువై వస్తున్నారు. వినడానికి భాగవతులు మూగుతున్నారు. కాని వాయించేవారు తలలు విసరటం, చేయివిరచటం మాత్రం కనిపిస్తున్నది.

(13) ఊరి ఊరి = ప్రతియూరి; సంత సంతకున్ = ప్రతిసంతకు; తిరుగన్ = తిరగడానికి; పెద్దలు = పెద్దవారు; ఇంటింటన్ = ప్రతి ఇంట్లో; సంతరించిన = పెంచుకున్న; పులుకు వాటుగోడిగల= పిల్లలను కనే, బాడబంబులకున్ = ఆడుగుర్రాలకు; పుట్టి = జన్మించి; కాలుగట్టి విడువన్ = త్రాళ్ళతో కాళ్ళుకట్టి వదిలిపెడితే, నెత్తంబునన్ = ఊరి రచ్చలో; మెత్తని; గఱిక = గడ్డిని; మేసి = తిని; పోసరించి= వర్ధించి, మాపుమాపునన్ = ప్రతిసాయంకాలము; మేపు = మేపే; సజ్జకవణంపు మేపునన్ = సంజెవాణా మేతవేళ, పిడుక = పేడపిడుకలు; గొరపంబు = గుర్రాలను తోలుసాధనం; తోమకంబునన్= తోమడం వల్ల, ఫుటఫుటనై = నిగనిగమంటు;కరియ = నల్లని; కంబడిపాతన్ = గొంగళిపేలికలు; కనియైనను = చూచినా, బెదరు = భయపడే; కొదమ = బలిసిన; తట్టువగుంపు = గుర్రాలసమూహం; కాలికొలందికిన్=

కాలిపొడవునా; వ్రేలు = వ్రేలాడే; లాలు = ఎర్రని, కుంచెలు = కుచ్చులు; కేలించిన = గుచ్చిన; గవ్వదంటలన్ = గవ్వదండలతో; గంటలన్ = గంటలతో; అలంకరించి = సింగారించి; మోలుగుమడ్డిన్ = నల్లచాయచెక్కలు; కాచి = తీసిన నల్లని మడ్డిలో; తోచి = నానబెట్టి; మూరకున్ = మూరకు; ఒక్కండున్ = ఒకటియు; జేనకు ఒక్కండునుగా = జానకు ఒక్కడుగా; కుట్టిన; డొల్లుటుల్లారులు = వ్రేలే జాలర్లు; ఉల్లసిల్లన్ = శోభిస్తుండగా; పల్లించిన = పన్నిన; పల్లంబులపైన్ = జీనులపై; చిల్లతైలంబు = ఇందుప గింజల నూనె; వాసనకొడుపులన్ = వస్త్రాలకు వాసనపట్టించే కుంచెలతో; పూసిన = పట్టించిన; మణుంగు చంద్రిక చేలలే = ఉతికిన తెల్లని వస్త్రాలే; రవణంబులుగాన్ = అలంకారాలుగా; ఎదురుగాన్ = వెళ్ళుతున్న గుంపుకు అభిముఖంగా; వేడుకన్ = సంబరాన్ని; చూడవచ్చిన = చూడటానికి వస్తున్న, ఆవీటి = విలిపుత్తూరుయొక్క; మేటి = గొప్ప; సాలె = నేత బట్టలు నేసేవారు; అగసాలె = కంసాలులు; పటుసాలె = పట్టునేసే సాలెలు; వాని = ఒక కోమటిజాతి; పైజాలు = పలు పవాండ్రు సాతులు = పెరికలు(గోనె సంచులు నేసేవారు); ఏతుల = చాపలల్లేవారు; కొమరులు = ఈ జాతుల యువకులు; తుములమై = గుంపులు కట్టి, వచ్చు = వస్తున్న; తత్ + చమూ = ఆ సేనలోని; సామజంబులనొ = ఏనుగులను; చూచి; ఏచిన=ఎక్కునైన, వెరన్ = భయంతో; తమ ఎక్కిరింతల్ = తమ వాహనాలు; ఎక్కికొని = ఎక్కి, వాగెలు = పగ్గాలు; ఇరుగేలన్ = రెండు చేతులతో; కుదియంబట్టినన్ = బిగబడితే; నిలువక= ఆగకుండా; త్రొక్కుచున్ + పోవన్ = త్రొక్కుతూపోగా;

(14) తన్మధ్య = ఆ ప్రజల నడుమ; వృద్ధ = ముసలివారు; వధూ = స్త్రీ లు; ఆతుర = రోగులు; ఆదులు = మొదలైనవారు; తిట్టన్ = తిట్టగా; ఇట్టు అట్టు అనలేక = ఏమీ అనలేక; ప్రాణంబులు; పిడికిటన్ = గుప్పిట్లో, నవీన = క్రొత్త, సవిధ = దగ్గరలోని; కేదారంబులన్ = వరిపొలాల్లో; పడి; దొరలి = దొర్లి; చట్టలు = తొడలు; దిగంబడి = చేలో దిగబడి; వెడలలేకుండన్= పైకి రాలేకపోయిన; తారు = గుర్రాలపై ఎక్కినవారు; దిగుటకు; ఇమ్ము = తగినచోటు; లేనందున = లేకపోవడంచేత; పిమ్మటగొని = జాలిపడి; నలుదెసలన్ = నాలుగైదు దిక్కులు; చూడన్ = పేదచూపులు చూస్తుండగా; చూచి = వేశ్యలు చూచి; కేలుసరచి = చేతులు చరచి; ఒహో అని; గేలిచేయు = గేలిచేసే ; గణికాకదంబముల = వేశ్యాసమూహం యొక్క; చప్పటుల = చప్పట్లు; నిబిడ = దట్టమైన; నిష్కుట = తోటల్లోని; విటపి = చెట్ల యొక్క ; ఝూటంబులన్ = గుంపుల్లో; ప్రతిశబ్దంబులు = ప్రతిధ్వనులు; పుట్టింపన్ = కలిగిస్తే

(15) ఇట్లు, అనూన = అధికమైన; విభవంబు = వైభవము; చిగురు + ఒత్తన్ = చిగురించగా; త్తిరుపతిన్ = ఆ విలిపూత్తూరు; సొచ్చి = ప్రవేశించి; అచ్చక్రధరు = ఆ విష్ణువు యొక్క, నగిరిమోసలన్ = దేవాలయము యొక్క, ముఖశాలలో, నిలుచటయున్ = నిలబడగా, ఆ విష్ణుచిత్తుండు; తద్రథావతరణంబుచేసి = ఆ రథాన్ని దిగి; ధరణీ ధవ = రాకుమారులు; స్థానిక = దేవాలయాధికారులు; సమూహంబు; వెంటరాన్ = వెంబడించి రాగా; అవ్వైకుంఠున్ = ఆ మన్నారు స్వామిని; సేవించి = కొలిచి; తత్ప్రసాదలబ్ధంబగు = ఆయన ప్రసాదముగా లభించిన; వరిపట్టంబున్ = తలకు చుట్టుకొనె వస్త్రంతో; అలంకృతుండై = అలంకరింపబడ్డవాడై; నానా = అనేక విధాలైన; అలంకార సహితంబుల్ =

వస్త్రంతో, అలంకృతుండై = అలంకరింపబడ్డవాడై; నానా = అనేక విధాలైన; అలంకార సహితంబుల్ = సింగారాలతో కూడికొన్న; రత్నకాంచనమయంబును = మణులు; బంగారంతో నిండిన; ఆత్మీయభవనంబును = తన ఇంటిని; కాంచి = చూచి; విస్మితుండై = ఆశ్చర్య పడ్డవాడై; పుండరీకాక్ష = తామరపూల వంటి నేత్రాలు కల విష్ణువుయొక్క; మహిమ = మాహాత్మ్యంతో; అభిలబ్ధ = చక్కగా లభించిన, వైభవంబుగాన్ = సంపదగా; తెలిసి = గ్రహించి; తత్రత్య = అక్కడున్న; ధాత్రీకళత్ర = రాజుల యొక్క, వర్గంబున్ = సమూహాన్ని; ఆసిపి = వెనకకు పంపి; ప్రవేశించి = ఇంట్లోకి వెళ్ళి; తొంటికంటె = ఇదివరకు కంటె; శతగుణంబుగాన్ = నూరు రెట్లుగా; భాగవత = భక్తులయొక్క; పూజ = పూజల్లో; ప్రవణుండై = తత్పరుడై, ఉండెన్ = ఉన్నాడు.

ఈ వచనం కవికున్న లౌకిక ప్రజ్ఞానేత్రం ఎంత విశాలమైనదో లోతైనదో తెలుపుతున్నది. ఇంత ప్రత్యక్షంగా, సూక్ష్మంగా ఆశ్చర్యకరమైన బొమ్మగా నాటి సామాజిక రూపాన్ని మన కళ్ళముందు నాటక రంగం మీద పాత్రల్లాగా నిర్మించిన రాయల వారి ప్రతిభ ఎల్లోరా గుహలు తొలిచి కైలాసనాధ దేవాలయం నిర్మించిన వాస్తుశిల్పి ప్రతిభకు సమానమైనది. ఈ విషయం మహాచక్రవర్తి కెలా పరిచితమైనదనాలి ? ప్రతిభాదర్శనం తప్ప. అనుభవంలోనిదేనన్నా వర్ణనా శక్తి మాటేమిటి?

మ॥ **ఉలుపా ల్పట్టిన యిండ్ల మజ్జన నృపార్హోదార భుక్తి క్రియో**
**జ్జ్వలులై, రే హరికోల్వునన్ వివిధలాస్యస్పర్ధిసుభ్రూభ్రుకుం**
**సులవాదు ల్సరిదేర్చి పుచ్చి, మణివాసోభూషణగ్రామమున్**
**జలజాతాక్షునకున్ సమర్పణము నిష్ఠం జేసి యన్వేకువన్.** 36

ప్రభువులు = తరువాతి పద్యంలో నున్న ప్రభువులు; ఈ పద్యానికి కర్త; ఉలుపాలు = బహుమానాలు, పట్టినయిండ్లన్ = సమర్పించిన గృహాలలో; మజ్జన = స్నానము; నృప = రాజులకు; అర్హ = తగిన, ఉదార = ఉన్నతమైన, భుక్తి క్రియా = భోజన వ్యాపారంచేత, ఉజ్జ్వలులు = ఆనందించినవారు; రే = రాత్రి, హరికొల్వునన్ = మన్నారు స్వామి గుడిలో జరిగే నృత్య సేవలో; వివిధ = అనేక; లాస్య = నాట్యాలలో, స్పర్ధ = స్పర్ధతల; సుభ్రూ = అందమైన కనుబొమలు కల స్త్రీలు; భ్రుకుంసుల = నర్తకుల; వాదుల్ = తగవులు, సరితేర్చి = సమంజసముగా నిర్ణయించి, పుచ్చి = పంపించి; జలజాతాక్షునకున్ = విష్ణుమూర్తి మన్నారు స్వామికి, మణివాసభూషణ = రత్నాలు, వస్త్రాలు, నగలయొక్క; గ్రామమున్ = సమూహం, నిష్ఠన్ = భక్తితో, సమర్పణము చేసి = అర్పించి, అన్వేకునన్ = ఆ తెల్లవారి.

విష్ణుచిత్తుని సాగనంపడానికి వచ్చిన రాకుమారులు కానుకలతో ఆహ్వానించిన రాజోద్యోగుల గృహాలలో రాజోచితమైన స్నానభోజనక్రియలతో సంతోషించి ఉజ్జ్వల వేషధారులై ఆ రాత్రి మన్నారుస్వామి గుడిలో స్పర్ధతో నాట్యం చేసినవారి వాదులు తీర్చి స్వామికి రత్నవస్త్రభూషణాదులు సమర్పించి తెల్లవారినపిదప.

విశే ॥ మన సంస్కృతి ప్రధానంగా దేవాలయ సంస్కృతి. కళాప్రదర్శనలు కూడా జరిగేవి. ఇక్కడ దేవాలయాల్లో జరిగే నాట్యప్రదర్శన చెప్పబడినది. రాజు కళావిశారదుడని సూచింపబడింది. ప్రభుత్వం

ఉత్రిపు ఏ-పోషకం కావాలి తప్ప అన్యం కాకుడదు. ఉలుపాల్ పట్టిన యిండ్లు = జహల్లక్షణ - ప్రయోగవైచిత్రి భాసించాలి బహునూనం పెట్టిన ఇండ్లవారు ఉలుపా - ఇది హిందుస్థానీశబ్దం. పద్యం దీనితో ప్రారంభింపబడడం వలన ఎత్తుగడలో ఒకకొత్త తళుకు వచ్చినది. పద్యగమనమంతా రాజోచితంగా ఉంది యతిస్థానాలు నిబిడంగా ఉన్నందువల్ల సంధిబంధాలు (కీళ్ళు) దృఢంగా ఉన్న వస్తాదులగా పద్యం భాసిస్తున్నది.

తే॥ ప్రభువు లరిగిరి క్రమ్మఱ బాండ్యనగరి,
కమ్మునియు నట్లు వైష్ణవాభ్యర్చనంబు
దన చిరంతన తులసికాదామకరణ
దాస్యమును జేసికొనుచు దత్పరత నుండె 37

ప్రభువులు = దొరలు; క్రమ్మఱన్ = తిరిగి; పాండ్యనగరికిన్ = మధురాపురికి, అరిగిరి = వెళ్ళారు; అమ్మునియున్ = ఆ విష్ణుచిత్తుడును, అట్లు = ఆ విధంగా, వైష్ణవ = విష్ణుసంబంధమైన, అభ్యర్చనంబున్= ఆరాధనను, తన = తనయొక్క, చిరంతన = మొదటనుండి చేస్తున్న; తులసికాదామకరణ = తులసిదండలు కట్టి( భగవంతునికి); దాస్యమును = సేవను, చేసికొనుచు = చేసికొంటూ; తత్ = భగవంతునియందు; పరతన్ = భక్తితో ; ఉండెన్

సాగనంపవచ్చిన రాజులు తిరిగి మధురకు మరలిపోయారు. ఇక విష్ణుచిత్తుడు తాను మొదటినుండి చేసే విష్ణుపూజయైన తులసిదండలు కట్టడం, వైష్ణవభక్తులు ఆతిథ్యాలతో కాలం గడుపుతున్నారు.

విశే॥ కథ ఇక్కడ ముగిసిపోతున్నది. ఈ ముగింపులో మహోదారమైన పౌరాణికధోరణి యున్నది పూర్వకాలం శ్రోతలు వినేవారు నేటికాలంలో పాఠకులు ఆనాడు శ్రోతలు నేటికి పల్లెలో హరికథలు చెప్పబడుతున్నవి. ఆ ముగింపు భక్తిమయంగా ఉంటుంది. ఇక్కడ కూడా ఆ లక్షణముంది. కథాప్రారంభాంతాలు పద్యప్రారంభాంతాలులాగేనే సాంద్రసుందరంగా చేయబడడం మహాకవులకు మాత్రమే చేతనైన విద్య. విల్లిపుత్తూరు వర్ణనతో ప్రారంభమైన ఈ కథ ఇక్కడ ముగిసింది. ఆ ముగింపు శౌర్యంతో పాటూ ఉదాత్తత ఉన్నది ఇదే ఐతిహాసిక లేదా పౌరాణికమైన ముగింపు.

కథలు అనేక రకాలుగా చిత్రచిత్రంగా విష్ణుచిత్తుడు కట్టే తులసి ఆకులదండవలె గుచ్ఛబడటం మాడదగ్గ విషయం కనుక పాఠకులు వీటిని జాగ్రత్తగా గుర్తించాలి

వ॥ ఒక్కనాఁడు మధ్యాహ్నసమయ మాలికా సమారోపణానంతరంబున మందిరంబునకుఁ బోవునతనిఁ బ్రసాదమందస్మిత సుందర వ లక్షంబగు కటాక్షంబున వీక్షించి పక్షిపుంగవకేతనుండు పుండరీకనికేతన కిట్లనియె. 38

ఒక్కనాడు = ఒక్కరోజు; మధ్యాహ్నసమయ = పగటి నడిమి కాలంలో; మాలికా = తులసి దండ; సమారోపణ = చక్కగాఅర్పించిన; అనంతరంబునన్ = తర్వాత; మందిరంబునకున్ = ఇంటికి,

పోవు = పోతున్న; అతనికిన్ = విష్ణుచిత్తుని; పక్షిపుంగవకేతనుండు = పక్షులకు రాజైన గరుత్మంతుడు జెండా పై గుర్తుగా కలవాడు; ప్రసాద = ప్రసన్నమైన; మందస్మిత = లేత నవ్వుతో; సుందర = అందమైన; వళక్షంబు = తెల్లని; కటాక్షంబున = కడగంటిచూపుతో; వీక్షించి = చూచి; పుండరీక = తెల్లని తామరపువ్వు; నికేతనకున్ = నివాసమైన లక్ష్మితో; ఇట్లనియెన్ = ఇట్లు అనియెన్.

విశే॥ పక్షి - కేతనుండు - ఎందుకన్నట్లు ? పెరియాళ్వారు పెరియ తిరువడి అవతారమని సంప్రదాయం.

ఈ చిన్నవచనం రాబోయే కథకు నాంది. జరిగిన కథను రాబోయే కథను చక్కగా కలిపే అతుకు ఈ వచనం. ఈ కథ రాబోయే కథకు వక్త శ్రీమన్నారాయణుడు కాగా శ్రోత లక్ష్మీదేవి. ఈ దృష్టితోనే ఈ కథ చదవాలి. జరిగిపోయిన కథకు వక్త కవి. ప్రస్తుత కథకు కవి నిర్మించిన పాత్ర. కనుక రెండింటి నిర్మాణాలు వేరువేరుగా ఉండాలి

## భావోన్మేషం

### I

క్రీ శ.1123 - 46 నడుమ చోళదేశపాలకుడు రెండవ కుళోత్తుంగుడు శైవుడైనందున చిదంబర దేవాలయంలో నున్న గోవిందరాజ స్వామి విగ్రహాన్ని పీకి పారవేయించి శివాలయాన్ని మరమ్మత్తు చేయించాడట. ఆ విగ్రహాన్ని సముద్రంలో పారవేయించినట్లు చరిత్ర. తర్వాత శ్రీరామానుజాలు తిరుపతిలో గోవిందరాజస్వామి ఆలయాన్ని నిర్మింపచేసి ఆ స్వామి కింత నిలువ నీడ కల్పించినాడు.

ఈ కథలో శైవుడైన పాండ్యరాజు జీవుడే రెండవ కుళోత్తుంగుడు కావచ్చు.

### II

ఆళ్వార్లు 12 మంది కాగా ఆచార్యులు అర్గురు. వారిలో ప్రథములు నాథముని యామునాచార్యులు.

లక్ష్మీనాథ సమారంభం నాథ యామునమధ్యమామ్,
అస్మదాచార్య పర్యంతాం వందే శ్రీగురుపరంపరామ్.

అన్న వైష్ణవ ప్రసిద్ధశ్లోక మీ సంప్రదాయాన్నే వ్యక్తీకరిస్తుంది కనుకనే కథలో వృషశైల ధురవారి - పద్యంలో నాథముని స్తుతింపబడినాడు.

విష్ణుచిత్తుడు ఆళ్వారు. యామునుడు ఆచార్యుడు.

ఆళ్వార్లలో శిఖరం గోదాదేవి. కనుక ఈ కథానిర్మాణంలో శ్రీ వైష్ణవమత దృష్టి యిది.

### III

ఈ కథలో అధర్మ - ధర్మ ప్రభుత్వ స్థాపన ప్రధాన విషయం కనుకనే రాజనీతి గ్రథనావశ్యకత ఏర్పడినది. ఇందుకే ఈ కథ శ్రీకృష్ణదేవరాయలకు ఆత్మస్థానీయం. దీనికి శ్రోత శ్రీదేవి. కనుక

కథనంలో హేలా లక్షణమున్నది. దాసరికథకూ - దీనికీ వక్త భగవంతుడు. కానీ శ్రోతలు వేరు కావడం వల్ల కథాస్థాయుల్లో భేదం. అక్కడ గాంభీర్యం. ఇక్కడ హేల.

తే॥ 'యామునాచార్యుఁడొక్కఁడు నీ మహాత్ముఁ
డొక్కఁడును గాదె మన్మతం బుద్ధరించి
రస్మదీయ కృపాతిశయమున', ననిన
నిందిరాదేవి తన భర్త కిట్టు లనియె. 39

యామునాచార్యుడు; ఒక్కడు = ఆయనొకడు అని వ్యవహారంలో ఒక వ్యక్తి గొప్పతనాన్ని చెప్పేటప్పుడు ఇలా అనడం నేటికీ ఉంది; ఈ మహాత్ముడున్ = ఈ విష్ణుచిత్తుడు ఒక్కడును, కాదె = కాదా; మన్మతం = నా మతాన్ని (విశిష్టాద్వైత మత సిద్ధాంతము); ఉద్ధరించిరి = పైకి తెచ్చారు; అస్మదీయ = నాయొక్క; కృప+అతిశయమున = ఎక్కువ దయచేత; అనినన్ = అంటే; ఇందిరా దేవి = లక్ష్మీదేవి; తన భర్తకున్ = తన భర్తతో; ఇట్టులనియెన్.

విష్ణువన్నాడు ''యామునాచార్యుడొకడు ఈ మహాత్ముడొకడు కదా ! నా దయవల్ల నా మతాన్ని దర్శనమని సారాంతరం ఉద్ధరించారు'' అని అంటే ఆవిడ ఇలా అన్నది.

విశే॥ యామునుడు ఆచార్యుడు. విష్ణుచిత్తుడు ఆళ్వారు. ఆళ్వారులు విష్ణువును దర్శించి గానం చేస్తే ఆచార్యులు ఆళ్వారుల అనుభవాలను ఆధారంగా చేసుకొని విశిష్టాద్వైతమన్న వేదాంత శాస్త్రాన్ని నిర్మించారు. ఈ నిర్మాతలలో ప్రథముడు, ప్రధానుడు యామునాచార్యుడు. అందుకని ఆచార్యశబ్దమే ప్రయోక్తమైనది.

'నా దయవల్ల' అన్నమాట చాలా ముఖ్యం. శ్రీవైష్ణవమత దృష్ట్యా భగవంతుడు సర్వానికే కర్త. అంతర్యామి రూపుడై సర్వజీవులను ఆ యా కర్మలందు నియోగిస్తున్నాడు. విష్ణుచిత్తుని ఆ కర్మలో నియోగించినది తానే. అలాగే ఈ కథలో కూడా జరగబోతున్నది. అందుచే భగవంతుని దయ చాలా ప్రధానమైనది. ఇందుకే విష్ణుచిత్తునితో మధుర పొమ్మని ఆనతిచ్చినప్పుడుకూడా 2-38 లో 'సత్కృపన్' అనే ప్రయోగింపబడినది. కనుక జగదుద్ధరణకు మూలం భగవత్కృప. ఇది శ్రీవైష్ణవమత సిద్ధాంతం. కాబట్టి కవి శబ్దప్రయోగంలో జాగరూకత వహిస్తున్నాడని తెలుస్తున్నది కదా !

క॥ 'ఇతనికథ యెఱిఁగినది కా,
యతఁడేమి యొనర్చె?' ననిన నబ్జాక్షుండా
శతపత్త్ర నిలయ కిట్లను
'నతివ, కలం డొకఁడు మత్పదాశ్రితుఁడాదిన్. 40

ఇతని కథ = విష్ణుచిత్తునికథ; ఎఱిగినది కా = తెలిసిందే కదా; అతడు = యామునాచార్యుడు; ఏమి యొనర్చెన్ = ఏమిచేసినాడు; అనినన్ = అంటే; అబ్జ+అక్షుండు = తామరనేత్రాలవాడు; ఆ శతపత్త్ర

సంయుతున్ = నూరురేకుల పద్మమే ఇల్లుగా కల; లక్ష్మితో; ఇట్లు+ అనున్ = ఈ విధంగా అంటున్నాడు: పలికె = దేవుడు; ఒదిన్ = పూర్వం, మత్పద = నా పాదాలను; ఆశ్రితుడు = ఆశ్రయించినవాడు; ఒకండు ఉండు - ఒకడున్నాడు

ఈ పద్యంలో విశేష మేమంటే 'భర్తకు తెలిసిన కథ భార్యకు తెలియదా?' ఇలాంటి ప్రశ్నలు సామాన్యంగా పురాణాలలో కనిపిస్తాయి. వాటి తాత్పర్యం లోకానికి చెప్పడంకోసమే. అయినా ఇక్కడ అలా కాదు ఇక్కడ ఇదొక శృంగార క్రీడ. తెలిసిన విషయాన్నే తెలియనట్లుగా ప్రశ్నించడం ఒక శృంగార సంభాషణగా సాహిత్యదర్పణాదుల్లో చెప్పబడినది. ఆ ఉదాహరణ తాత్పర్యమిది. 'నాథా ! నా మెడలోని ఈ ముత్యాలు 'ఏ చెట్టుకు కాసిన పండ్లు' ? ఇక్కడ ముత్యం చిప్పలో దొరికే వస్తువని తెలిసే ఆవిడ అమాయకంగా ప్రశ్నిస్తోంది ఇది ' లీల అన్న నాయికా శృంగార చేష్టగా ఆలంకారికులు చెప్పారు. అంటే ప్రేమకి శృంగారానికి సంబంధించిన విషయమన్న మాట.

అతఁడు చిఱుతనాఁడె యాచార్యకులమున
వేదశాస్త్రముఖ్యవిద్య లభ్య
సించుచుండ, నపుడు చెలువ యిప్పటి పాండ్య
నృపతి పూర్వవంశ్యుఁడే యొకండు. **41**

అతఁడు = యామునాచార్యుడు, చిఱుతనాడె = చిన్ననాడె; ఆచార్యకులమున = గురువుల ఆశ్రమంలో, వేదశాస్త్రముఖ్యవిద్యలు = వేదాలు నాలుగు, శాస్త్రాలు; ఆరు దర్శనాలు మొదలైన విద్యలు; లభ్యసించుచుండన్ = నేర్చుకుంటున్నపుడు; చెలువ = లక్ష్మి; ఇప్పటి = నేటి; పాండ్యనృపతి = పాండ్యరాజు (విష్ణుచిత్తునికథలో రాజు), పూర్వవంశ్యుడే = పూర్వుడైన వంశంవాడు, ఒకండు = ఒకడున్నాడు.

పద్యం నాల్గోపాదాన్ని బట్టి ఈ కథ విష్ణుచిత్తుని కథకంటే ముందే జరిగినట్లన్నట్లు చెప్పబడుతున్నది, కానీ చరిత్ర ప్రకారం మతవిశ్వాసప్రకారంగా కూడా తర్వాత జరిగింది. కానీ ఇలా ఎందుకు చెప్పాడంటే కావ్యనిర్మాణ సంబంధమైన కథారససూత్రాదులకు అనుగుణంగా చెప్పడంకోసం. చారిత్రక సత్యం వేరు; కావ్యసత్యం వేరు; కనుక రెంటిని కలిపి చూడకూడదు.

తే ॥ వెఱ్ఱిశైవంబు ముదిరి మద్వినుతి వినఁడు
నతి యొనర్పఁడు మామక ప్రతిమలకును,
హరుఁడె పరతత్త్వమను, మదీయాలయముల
నుత్సవంబుల కులుకు, నెయ్యురును నట్లె. **42**

వెఱ్ఱిశైవంబు = పిచ్చిశైవం; ముదిరి = ముదిరిపోయి, మత్ + వినుతిన్ = నా స్తుతిని వినడు; మామక ప్రతిమలకును = నా విగ్రహాలకు; నతి యొనర్పడు = నమస్కరించడు; పరతత్త్వము = పరమాత్మ; హరుఁడె = శివుడే, అనున్ = అంటాడు; మదీయ = నాయొక్క; ఆలయముల = గుడిలో జరిగే; ఉత్సవంబులకున్ = వేడుకలకు, ఉలుకున్ = భయపడతాడు; స్నేహితులు కూడా; అట్లే = వాడిలాగానే.

ఈ రాజు వీరశైవుడు కనుక విష్ణునామ సంకీర్తనమన్నా, విష్ణునమస్కారమన్నా వైష్ణవ ఉత్సవాలన్నా కక్కసించుకుంటాడు. వేదశైవము వేరు, వెఱ్ఱిశైవం వేరు శివుడే పరతత్త్వమనడం వేదకాలం నాటికే ఉన్నది కానీ అక్కడ శివుడు విష్ణువు కంటే వేరైనవాడు కాడు. వెఱ్ఱిశైవం అలాకాక భేదాన్ని కల్పించుకున్నది. అందుచేత విష్ణుదేవాలయాదులను పరిహరించిన శైవం కనుక వెఱ్ఱిశైవమన్నాడు కనుక సనాతన శైవం కానిది వెఱ్ఱిశైవం.

## పాండ్యప్రభుని వీరశైవము

సీ॥ అశ్రాంత జంగమార్చాసక్తి వర్తిలు
 వేదవిద్ద్విజపూజ వీటఁగలిపి
భౌమవారపు వీరభద్ర పళ్లెర మిడు
 గృహదైవతంబు లిఱ్ఱింకు లింక;
షణ్ణవతిశ్రాద్ధచయ మారఁ బెట్టు సం
 కరదాస మయ్య భక్తప్రతతికి;
నాద్యంబు లైన దేవాలయంబులు వ్రాల
 నవని నిరాశ మఠాళి నిలుపు;
తే॥ జందె ముత్తర శైవంబుఁ జెంది త్రెంచుఁ;
బలితు లారాధ్య దేవళ్లె ప్రాప్యు లనుచు
నుపనిషత్తులు వారిచే నుబ్బి వినుచు,
వెండి యేజంగమెత్తిన వెఱఁగు పడును 43

అశ్రాంత = ఎల్లప్పుడు, జంగమ+ అర్చాసక్తిన్ = జంగమాలను పూజించే కోర్కెతో, వర్తిల్లున్ = ప్రవర్తిస్తాడు, వేదవిత్+ ద్విజ = వేదవేత్తలైన పండితులు; పూజన్ = పూజలను, వీటి గలిపి = వ్యర్థం చేసి ( వీటిబుచ్చి).

గృహదైవతంబులు, ఇలువేల్పులు, ఇఱ్ఱింకులు ఇంకన్ = నైవేద్యంలేనందున గుక్కిళ్ళు మింగుతూవుంటే, భౌమవారపు వీరభద్రపళ్ళెరము ఇడున్ = మంగళవారం నాడు వీరభద్రుని పళ్ళెమెత్తుతున్నాడు. (ఇదొక వీరశైవాచారం)

సంకరదాసమయ్య భక్తప్రతతికిన్ = శివభక్తులకు; షట్+నవతి = తొంబదియారు; శ్రాద్ధచయము= తిథులు; అద్యంబులైన = ప్రాచీనములైన; దేవాలయంబులు = గుళ్ళు; వ్రాలన్ = శిథిలమౌతుండగా, అవనిన్ = దేశంలో; నిరాశమఠాళి నిలుపు = జంగాలకు మఠాలను స్థాపిస్తాడు; ఉత్తరశైవంబు = వేదసమ్మతంకాని శైవమతాన్ని; చెంది = పొంది, జందెమును, త్రెంచున్ = వీరశైవులీవైదికాచారాన్ని తెంచుకొన్నారు. ( నిరాళ అన్న తెగల వారి మఠాలని లేదు.)

పతితులు = వేదబాహ్యులు; ఆరాధ్యదేవళ్ళ = ఆరాధ్య శాఖవారే; ప్రాప్యులు = పూజింపదగ్గవారని; ఉపనిషత్తులు వారు చెప్పగావింటూ, ఏజంగమ్మైనా; ఎత్తినన్ = స్తుతిసే, శ్రుతులు చెబితే; వెఱంగు = ఆశ్చర్యం.

వేదబాహ్యమైన మతాన్ని నిరసించడం ఆరాధ్యశైవం ఆంధ్రలో పండితారాధ్యులు ఏర్పాటు చేసింది. వీరశైవం బసవనిసృష్టి . ఈ దృష్టి కవికున్నట్లు ఎత్తుగీతి చెబుతున్నది. కానీ ఆరాధ్య శైవంలో జందెం పూజ్యమే తప్ప, త్యాజ్యం కాదు.

కం॥ శివలింగముఁ దాల్చిన జన
నివహం బేమైనఁ జేయనిది పాపము దా
నవుఁ గా దనఁ; డా సమయము
నవు నను విప్రులక యగ్రహారము లిచ్చున్. 44

శివలింగమున్ = లింగకాయను; తాల్చిన = ధరించిన; జన నివహంబు = జనసమూహం; చేయనిది= చేయునట్టిది, పాపము = ఏ పని అయినా నిర్భయంగా చేయవచ్చునన్నమాట; తాన్ = తాను (రాజు); అవున్ = మంచిది కాదు = చెడు, అనడు = పలకడు; ఆ సమయమున్ = ఆ ఆచారాన్ని, అవున్ = మంచిదే, అను = అనే; విప్రులక = బ్రాహ్మణులకే, అగ్రహారములు + ఇచ్చున్ = ఇస్తాడు

శివలింగం తాల్చినవాడు నిర్భయంగా ఏపనైనా చేయవచ్చు. అది రాజు చూచి మంచి చెడు నిర్ణయం చేయడు వారు చేసిందే గొప్ప ఆచారమని చెప్పే బ్రాహ్మణులకే అగ్రహారాలిస్తాడు. శైవంలో జంగాలు - బ్రాహ్మణులు అని రెండు తెగలున్నారు. బసవని శాఖలో ఈ భేదం లేదు. కాని రాయలనాటి కున్నట్లున్నది.

విశే॥ అగ్రహారాలు బ్రాహ్మణ పండితులకు ఆనాటి రాజులు దత్తం చేసేవారు. ఆ గ్రామం మీద వచ్చే పన్ను రాజుకు కట్టనక్కరలేకుండా బ్రాహ్మణులే అనుభవించేవారు.

తే॥ అతఁడు రాజ్యంబుఁ బాలించు నవసరమునఁ
దన వశం బైన యట్టి యత్తామ్రపర్ణిఁ
గలుగు నలపుట్టరాని ముక్తామణీ కు
లంబు మాహేశ్వరుల కంధలకును దీఱె. 45

అవసరమున్ = కాలంలో; తన వశంబైన యట్టి = తనకు లోబడినట్టి, అత్తామ్రపర్ణిన్ = ఆ తామ్రపర్ణీనదిలో; కలుగు = పుట్టే; లం పుట్టరాని = ఇతరత్రా పుట్టనటువంటి; ముక్తామణికులంబు = ముత్యాల సమూహం; మాహేశ్వరుల = శివభక్తుల; కంధలకున్ = మెడలకే; తీఱెన్ = సరిపోయెను (కంధరకునని పాఠాంతరం)

ఆ రాజు ఏలుబడిలోనే తామ్రపర్ణి నది ఉన్నది. అందులో ఎక్కడా పుట్టని ముత్యాలు సంభవిస్తాయి. అవన్నీ శివభక్తుల మెడలకే సరిపోతున్నాయి.

తే॥ అప్పు డిచ్చకులగుచు, బ్రాహ్మణులు కొంద
ఱాత్మజనిభూమి విడువలే కలికభూతి
గడ్డముల నాన రుదురాక లిడ్డ సంది
సూతసంహిత లిఱికించి చొరఁ దొడఁగిరి. 46

అప్పుడు = ఆ సమయంలో; ఇచ్చకులు = శైవమతాభిమానం కలవారు; అగుచున్ = అవుతూ; కొంద రు బ్రాహ్మణులు; ఆత్మజనిభూమిన్ = తము పుట్టిన దేశాన్ని; విడువలేక = వదిలిపెట్టలేక; అలికభూతి = నుదుట విభూతి; గడ్డములన్ +ఆనన్ = గడ్డములదాకా వ్యాపించగా; రుదురాకలు = రుద్రాక్షలు; ఇడ్డ = కట్టిన; సందిన్ = చంకలో; సూతసంహితలు = ఆపేరుగల గ్రంథాన్ని; ఇఱికించికొని = పెట్టుకొని; చొరన్ +తొడగిరి = రాజాస్థానం ప్రవేశింపసాగినారు.

శైవపక్షపాతంగా పరిపాలిస్తున్న కాలంలో తద్విరుద్ధ మతావలంబనం చేస్తే దేశబహిష్కార శిక్షపడుతుంది కనుక జన్మభూమిని వదలలేని బ్రాహ్మణులు శైవమతాన్ని పుచ్చుకొని నుదుటపూసుకొన్న విభూతి గడ్డం మీదకు జారగా సూతి సంహితలు చంకలో ఇరికించుకొని రాజాస్థానం ప్రవేశిస్తున్నారు. (పాఠాంతరం - ఇచ్చకులగు బ్రాహ్మణౌఘు మెల్ల).

కం॥ శీలముఁ బట్టియు గంజా
హాల లుపాంశువన భుజించు నధముల బైటం
జాలఁడు వైవఁ, విప్ర
స్ఖాలిత్యము బైలు కనుగిఱపు సభఁ. 47

శీలము = శైవమతాచారాన్ని; పట్టియున్ = అనుసరించడం వల్ల; ఉపాంశునన్ = చాటున; గంజా = గంజాయి; హాలలు = సారాయి; భుజించు = సేవించే; అధములన్ = నీచులను; బైటన్ వైవన్ = బైటపెట్టడానికి; చాలడు = సమర్థుడు కాడు; విప్రస్ఖాలిత్యమున్ = బ్రాహ్మణులు చేసిన పొరపాట్లను; సభన్ = సభలో; బైలు = ప్రకటించి; కనుగిఱపున్ = కన్నుగీటుతున్నాడు.

శైవులైతే చాలు వారు చాటున గంజాయి,సారాయి త్రాగినా ఏమీ అనలేని రాజు బ్రాహ్మణులు చిన్న పొరపాటు చేస్తే సభలో వారిని బయటపెట్టి శైవులవైపు చూచి వేడకగా కన్నుగీటుతాడు. (విప్రులు = శైవులు కానివారు.)

విశే॥ 'రాజానుమతో ధర్మః' అన్నమాటకు ఈ పరిపాలన ఉదాహరణ. విజయనగరసామ్రాజ్యంలో రాజైనవాడు సర్వమతాలను సమరసభావంతో రక్షించడం జరిగేది. దానికి విరుద్ధంగా ఇక్కడ ధర్మపాలన అంతరించింది. ధర్మపాలనకు బదులుగా మతపాలన ఎక్కువకావడం వల్లనే భవిష్యత్తులో యామునాచార్యుల రూపంలో భగవంతుడు వచ్చి శైవమతఖండనం చేసి ధర్మపరిపాలనను స్థాపన చేసాడు. అంతేకానీ కవి వైష్ణవుడైనందున కాదు.

కం॥ ఆ రాజుమహిషి నియతి మ
దారాధనపరత నుండు; నట్లుండియు దు
ర్వార వ్యథకుం గానదు
పారము, విభుఁ డస్మదంఘ్రి భక్తుఁడు గామిన్. 48

ఆ రాజు మహిషి = ఆరాజు పట్టపుదేవి, ఏనిన్ = అయితే; మత్ = నాయొక్క, ఆరాధన పరతన్ = సేవాసక్తితో; ఉండున్, అట్లుండియును = అలా ఉంటూ; విభుడు = భర్త; అస్మత్ = నాయొక్క; అంఘ్రి = పాద; భక్తుడు = సేవకుడు; కామిన్ = కానందున; దుర్వార = తొలిగించరాని; వ్యథకున్ = మనోబాధకు; పారము కానదు = ఒడ్డును చూడలేదు. ( అంతు కానదు)

ఆ రాజు భార్య అయితే నా భక్తురాలు కనుక తన భర్త అలా కానందున నిత్యం దుఃఖిస్తూ ఉండే ది

వ॥ మఱియు సప్పురంధ్రీరత్నంబు. 49

ఆ పురంధ్రీరత్నంబు = ఆ శ్రేష్ఠురాలైన కుటుంబిని ( ఉత్తమ ఇల్లాలు అన్న వ్యవహార ప్రయోగానికి సమానం)

సీ॥ వింగడం బై నట్టి ముంగిట నెలకొన్న
బృందావనికి ముగ్గు వెట్టుఁదాన;
దశమినాఁ డేకభుక్తము సేసి, యపలినాఁ
డోర్చి జాగరముతో నుండు నిద్ర;
బారసి పోనీదు, పైనిద్రఁ బాఱుట
క్కలు పాడు మత్పుణ్యకథలఁ ద్రోయు;
నేమంపు మూన్నాళ్లు హామింపి దధినాధు;
మఱునాఁడు కన్నును మనసుఁ దనియ

తే॥ నారజపువన్నెఁ బ్రియు సెజ్జ కరుగుఁ గూర్మి;
నరుగుచో నాథిఁ దుడిచి కప్పురపు నాథిఁ
బెట్టు; నిట్టుల మద్భక్తి పుట్టియును ని
జేశు నెడ భక్తి చెడదు మదిష్ట మగుట. 50

వింగడంబు = అందము; ముంగిటన్ = ప్రాంగణంలో, నెలకొన్న = ఉన్న, బృందావనికిన్ = తులసికోటకు, తాన = తానె, ముగ్గువెట్టు = రంగవల్లి ఘటించును.

తాను రాణి అయినప్పటికీ ముంగిట్లో ఉన్న అందమైన తులసికోట ముందు ముగ్గులు పెడుతుంది

దశమినాడు = దశమితిథి రోజున; ఏకభుక్తము = ఒంటిపూట భోజనము; చేసి = చెల్లించి,, అవలినాడు = ఆ మరునాడు అంటే ఏకాదశిరోజున; ఓర్చి = ఆకలికి ఓర్చుకొని, జాగరముతోన్ = మేల్కొని, నిరు = కేవలం ఉపవాసం, ఉండును = ఉంటుంది

బారసి = ద్వాదశి (బార = పన్నెండు); పోనీదు = మానుకోదు, పైన్ = తర్వాత, సద్రస్, పాటుబక్కలు = బ్రాహ్మణస్త్రీలు, (పాఱు+ టుగాగమం); పాడు = పాడే; మత్ = నాయొక్క, పుణ్యకథలన్ = పవిత్రగాథలను వినడంలో; త్రోయు = గడుపుతుంది.

దశమినాడు ఒంటిపూట భోజనం చేస్తూ ఏకాదశినాడు శుష్కోపవాసంతో పాటుగా జాగరణచేస్తుంది. ద్వాదశినాడు వ్రతం పాటిస్తూ బ్రాహ్మణస్త్రీలు పాడే పాటలు వింటూ నిద్రను నిరసిస్తుంది.(అంబరీషోపాఖ్యానం కథ ఈ ద్వాదశి కథే)

నేమంపు = నియమపూర్వకంగా; ఉండే మూన్నాళ్ళు = ఉండే మూడురోజులు(దశమి, ఏకాదశి, ద్వాదశి); కన్నును మనసున్ తనియన్ = కన్ను మనసు తృప్తిపడేటట్లుగా; ఆరజపువన్నెన్ = మనోహరమైన సొగసుతో, ప్రియుసెజ్జకున్ = భర్తశయ్యకు; అరుగున్ = వెళుతుంది; కూర్మిన్ = ప్రేమతో, ఒరుగుచున్ = వెళ్ళేసమయంలో; నాభిన్ = కస్తూరిని; తుడిచి = చెరిపి; కప్పురపు నాభిన్ = కర్పూరతిలకం, పెట్టున్ = ధరిస్తుంది (కస్తూరి వైష్ణవుల బొట్టు. కర్పూరం విభూతిలాగా ఉంటుంది కనుక భర్త శైవుడు కనుక అది తుడిచి ఇది పెట్టుకొంటుంది); ఇట్టులన్ = ఈ విధంగా; మద్భక్తి = నాయందున్న భక్తి, పుట్టియున్ = ఉన్నా; నిజ = తనయొక్క, ఈశు = భర్తయొక్క; ఎడన్ = విషయంలో, భక్తి చెడదు = ప్రేమను పోగొట్టుకోదు, మత్ = ఇష్టము; అగుటన్ = అది నాకిష్టం కనుక.

నియమం పాటించే మూడునాళ్ళు భర్తను సమీపింపక త్రయోదశినాడు అతని కన్ను మనసు తృప్తిపడేటట్లుగా సింగారించుకొని భర్త అంతఃపురానికి వెళుతుంది. ఈ వెళ్ళేసమయంలో వైష్ణవమైన కస్తూరిని తుడిచి విభూతి వంటి కర్పూరపు బొట్టు ధరిస్తుంది. ఈ విధంగా నాయందు భక్తియున్నా భర్తయందు భక్తిని కోల్పోదు. ఎందుకంటే అది నా ఇష్టంకనుక.

ఈ పద్యమంతా పై వచనంలోని ఉత్తమ ఇల్లాలివర్ణన.

రాజు, రాణి - వేర్వేరు అంతఃపురాల్లో ఉంటారు. కనుక ఆమె అతని దగ్గరకు వెళ్ళటం రాయల లంత పురకథనం చరిత్ర ప్రసిద్ధి.

కం॥ **వనజ రుద్రాదులు మ**
**త్తనువుల; తత్పూజనంబు తథ్యము మత్పూ**
**జనము; తదీప్సిత ఫల దా**
**తను నేన; యట్లైనఁ గలవు తరతమ వృత్తుల్.** 51

వనజ = బ్రహ్మ (వన= నీరు; జ = పుట్టినది -పద్మం,జ = పద్మంనుండి పుట్టినవాడు బ్రహ్మ); రుద్ర = ప్రళయకారకుడైన శివుడు; ఆదులు = మొదలైనవారు; మత్ = నాయొక్క; తనువులె = శరీరాలే; నిజము;

తత్ = ఆ, ఈప్సిత = కోరిక; ఫల = ప్రయోజనాన్ని; దాతను = ఇచ్చేవాడిని; నేనే; అటు + అయినన్ = అట్లైన; తరతమవృత్తుల్ = తారతమ్యాలు; కలవు = ఉన్నాయి.

సృష్టికర్త బ్రహ్మ, ప్రళయకారకుడు శివుడు- నాకు శరీరస్థానీయులు. కనుక ఆపూజ నాకే చెందుతుంది. ఎందుకంటే పూజించినవారికి ఫలదాతను నేనే కనుక. అలాగైనా తారతమ్యం ఉంటుంది.

విశే ॥ ఈ పద్యంలో తను శబ్దం విశిష్టాద్వైతంలో చాలా అర్థవంతమైనది. ఆత్మస్వరూపుడు నారాయణుడే. మిగిలిన దేవతలు, జీవులు అందరూ ఆయనకు శరీరం. శరీరం అంటే ఆత్మ అయిన యజమానికి పనులుచేసిపెట్టే సాధనం మాత్రమే. కనుక ఈ పద్యంలో శ్రీమన్నారాయణుడు తానే పరమాత్ముడు అని చెప్పుకుంటున్నాడు. ఈ విషయమే మొదటి పాండ్యరాజు ఆస్థానంలో విష్ణుచిత్తుని ద్వారా భగవంతుడు తన మతాన్ని స్థాపించుకున్నట్లు చెప్పబడింది. అక్కడి విష్ణుచిత్తుడు ఇక్కడి యామునాచార్యుడు ఆత్మస్థానీయుడైన నారాయణుని శరీరస్థానీయులు. ఇందుచేతనే ఈ కావ్యంలో నాయకుడు భగవంతుడు.

కం ॥ కేవల శరీర దృష్టిన
దేవతల న్వేఱ కలుగఁ దెలిసిన జడులన్
నా వాసుదేవతా స్థితి
భావింపని పూజసాంత ఫలమై త్రిప్పున్. 52

కేవల = ముఖ్యమైన; శరీర = దేహసంబంధమన; దృష్టిన = దర్శనం చేతనే; దేవతలన్ = ఇతరదేవతలను; వేఱ = ప్రత్యేకంగా; కలుగన్ = ఉన్నట్లు; తెలిసిన = ఎరిగిన; జడులన్ = మూర్ఖులను; నా; వాసుదేవతాస్థితిన్ = వాసుదేవభావాన్ని; భావింపని = తలచని; పూజ; సాంతఫలమై = అంతముతోకూడిన ప్రయోజనం కలదై; త్రిప్పున్ = సంసారచక్రంలో క్రిందికి మీదికి తిప్పుతుంది.

ఇతరదేవతలకు శరీరాలున్నందున వారికి వేరువేరుగా దేవతాస్థితి యున్నదని అనుకొని ఆరాధించే మూర్ఖులకు నా వాసుదేవతా స్వరూపము తెలియదు. అలాంటివారి పూజ మోక్షదాయకము కాదు. తాత్కాలిక ప్రయోజనాలను నెరవేరుస్తుంది. అంతే.

విశే॥ వాసుదేవుడు = తేజో లోకంలో ఉంటూనే సమస్తంలోనూ ఉండేవాడు. తనలో సమస్తం ఉన్నది. సమస్తంలో తాను ఉన్నాడు. ఇది వస ధాతువునుండి పుట్టిన శబ్దం. ఉన్నది. ఉన్నవాడు అని అర్థము. వేదాంతంలో ఇదే 'సత్' శబ్దం చేత చెప్పబడినది. అదే వసుదేవునకు కుమారుడై జన్మించినది.

భగవద్గీతలో కూడా ఇతర దేవతారాధన తాత్కాలిక ఫలసిద్ధి కలిగించేదే తప్ప మోక్షదాయకం కాదని ఖండితంగా చెప్పబడింది.

వ ॥ మఱియు నీ రహస్యంబుఁ దెలియ కబ్బ్రాపతి తామసుండై, మామకీనంబులగు జనంబుల సామాన్యబుద్ధిం జూచుచుఁ, దద్వృత్తులకగు నుపద్రవంబుల నుపేక్షించుచు, రక్షావిముఖుండై యుండ వీక్షించి కలియుగంబున

ద్రవిడ మండలంబునఁ గృతమాలా తామ్రపర్ణీతటంబుల మద్భక్తులు తఱచగుటను, తద్దేశంబున కొడయుండతండగుటను, రక్షణశిక్షణంబులు రాజముఖంబునం గాక నేన సాక్షాత్కరించి చేయమియు, దద్రక్షణేచ్ఛ యస్మ దాభిముఖ్యంబునం గాని పొడమమియు నా యాభిముఖ్యంబుసంవాదంబునం గాని పుట్టమియు, నే విచారించి; తదాభిముఖ్య కరణార్థంబుగ నాస్థానం బెక్కి వాదిజయంబు సేయవలయు ననుం తలం పవ్విప్రకువమారునకుం బుట్టింప; నతండేఁగి నానాదేశాగత దీనానాథ వృద్ధ భూసురకుటుంబంబులకు ధాన్యాజినపటాదులు, వటువులకుం బెండ్లిండ్లకనుపనీతుల కుపనయనంబులకుఁ, బంగ్వంధబధిరాదులకు సౌరభేయాదియానంబులు; మఱియుఁ జెఱువు గడమడియె ననియు, బేదగుడులకుఁ బూజ నడువ దనియు, నెడవునం జలిపందిరిడియెద వనియుఁ, దిథిచిక్కుననియుఁ, దీర్ఘయాత్రఁ జనియెద మనియును, వ్రతోద్యాపన కనియును, వ్యాధిమాన్పుకోననియును జెప్పి పంప, నా రాణివాసంబు గుప్తాగుప్త ప్రకారంబులం బంపు ద్రవ్యంబుఁ దెచ్చి యిచ్చు ముదుసళ్లగు వర్షధరులచేతులకుం గ్రందుకొని చేసాఁచిన పందిటితోరణంబులై తోఁచు నేకదండి త్రిదండి బ్రహ్మచారుల యున్నమితదండంబుల విండారు కషాయకద్రువస్త్ర కౌపీన పరంపరలం గ్రమ్మి, కావళ్ళ పడగల జాడఁ గొని, కేవల కార్పణ్యంబ విద్యగాఁ దక్కిన విద్యలెఱుంగక నేఁడు నీదృగ్విధానేక ప్రాణుల కాధారంబగు పడమటి ద్వారంబుఁ జేరి; ప్రతిదినాస్మత్పాదభజన కథాశ్రుత పూర్వయగు నా యుర్వీధవు దేవి కాశీర్వచనాక్షతంబులు దౌవారికముఖంబునం బంపి; ''వైదేశికుండ వైష్ణవ వటుండ, వాది గలిగిన విష్ణుతత్త్వంబె పరతత్త్వం బని వాదించి గెలిచెద, వసుధావరుండు విష్ణుభక్తి విముఖుండు, గావున వైష్ణవుని మనవి విన్నవింప పంపితి; నీ విభుఁడు నీకు విధేయుండు, విన్నవించి నన్ను రప్పించి వాదంబు సేయింప నోపుదేని వాదించి గెల్చి, 'నీదుభర్తకు భగవద్భక్తిఁ బుట్టించి కృతార్థుం గావించెద' నని విన్నవింపం బంచిన,'' 53

ఈ రహస్యంబున్ = పై పద్యంలో చెప్పిన రహస్యం ( తత్త్వము గుప్తమని దాన్ని చెప్పే విద్య గుప్తవిద్య అనీ అంటారు); అభ్భూపతి = ఆరాజు; తామసుండై = అజ్ఞానియై; మామకీనంబులగు నీకుసంబంధించిన; జనంబులన్ = భక్తులను; సామాన్యబుద్ధిన్ = వైష్ణవులుకాని భక్తులతో పాటుగా; చూచుచున్ = పరికిస్తూ; తత్+భృతులకు = వారి జీవనాధారాలకు; అగు = కలిగే; ఉపద్రవంబులన్ = ఆపదలను; ఉపేక్షించుచు = పట్టించుకోకుండా; రక్షావిముఖుండై + ఉండన్ = రాజుబాధ్యతయైన రక్షణను ఏమరచి ఉండగా; వీక్షించి = చూచి;

ఈ వాక్యం చాలా ప్రధానమైనది. అన్ని మతస్థులవారిని ఒకే రీతిగా పాలించడం ఆదర్శచక్రవర్తి లక్షణం. ఆ ధర్మం నుండి ఇతడు భ్రష్టుడైనాడు కనుక భగవంతుడు ఇక్కడ జోక్యం చేసుకున్నాడు. ( రాజు తనకు ప్రతినిధి కనుక)

కలియుగంబునన్ = కలియుగంలో; ద్రవిడమండలంబునన్ = తమిళదేశంలో; కృతమాల, తామ్రపర్ణితటంబులన్ = ఆ పేర్లుగల నదులతీరప్రదేశాలలో; మద్భక్తులు = నా భక్తులు; తరచు = సాంద్రము; అగుటన్ = అయినందువల్ల; తత్+దేశంబునకున్ = ఆ దేశానికి; ఒడయుండు = రాజు; ఆతండు = అతడే; అగుటను = అయినందువల్ల; రక్షణశిక్షణంబుల్ = రక్షించడం, శిక్షించడం;

రాజముఖంబునన్ గాక = రాజుద్వారానే తప్ప; నేన్ = నేనే; సాక్షాత్కరించి = లోకంలో ప్రత్యక్షమై; చేయమియున్ = చేయకపోవడం; తత్+రక్షణేక్ష = రాజధర్మం కాపాడాలన్న కోర్కె; అస్మత్ = నాయొక్క; ఆభిముఖ్యంబునన్ = అభిముఖంచేత; కాని = తప్ప; పొడమమియున్ = సంభవించకపోవడము; నా అభిముఖ్యంబు = నాకు ఉన్ముఖమైన మనస్సు; సంవాదంబునన్ గాని = వాదం వల్లతప్ప; పుట్టమియున్ = పుట్టకపోవటం; విచారించి = ఆలోచించి; తత్+అభిముఖ్యకరణార్థముగా = అతనిని నాకు భక్తునిచేసుకోవడంకోసం; ఆస్థానంబు+ ఎక్కి= కొలువుకూటంలో ప్రవేశించి; వాదిజయంబు = పండితులను జయించటం; చేయవలయున్= ఆవశ్యకర్తవ్యం; అను తలంపు = అన్న ఆలోచన;

అవ్విప్రకుమారునకున్ = ఆబ్రాహ్మణబాలకుడైన యామునాచార్యునకు (చూ.47పద్యం); పుట్టింపన్ = కలిగింపగా; అతండు; ఏగి = వెళ్ళి; నానాదేశాగత = అనేకదేశాలనుండివచ్చే; దీన = దీనులు; అనాథ = రక్షణలేనివారు; వృద్ధ = ముసలివారు అయిన; భూసురకుటుంబాలకున్ = బ్రాహ్మణకుటుంబాలకు; ధాన్య+అజినపట+అదులు = ధాన్యము, లేడిచర్మాలు, వస్త్రాలు మొదలైనవి; వటువులకున్ = బ్రహ్మచారులకు; పెండ్లిండ్లకు = వివాహాలకు (బ్రహ్మచారుల వివాహాలకు); అనుపనీతులకు = ఉపనయనం కానివారికి; ఉపనయనంబులకున్= ఉపనయనంబులు చేసుకోవడానికి; పంగు = కుంటి; అంధ = గుడ్డి; బధిర = చెవిటి; ఆదులకున్= మొదలైనవారికి; సౌరభేయ = ఎడ్లు; అది = మొదలైన; యానంబులు = వాహనంబులు (వికలాంగులకు ఎడ్లబండ్లు దానంచేయటం), మరియు = ఇంకా; చెఱువు = పంటల కాధారమైన జలాశయాలు; కడవంబడగన్ = త్రవ్వకముపూర్తికాలేదు; అనియున్ = అని; పేదగుడులకున్= ఆదాయంలేని దేవాలయాలకు; పూజ నడువదు = పూజలు జరగడంలేదని; అనియున్ = అని; ఎడవునన్ = ఎడారివంటి ప్రదేశంలో (దగ్గరలో ఊళ్ళులేని ప్రదేశాలలో); చలిపందిరి = ప్రప; ఇడియెదము = నిర్మిస్తాము; అనియున్ = అని(2-58,59 చూ.); తిథి = చిక్కున్; శ్రాద్ధకర్మతప్పిపోవును (4-275చూ); వ్రత+ ఉద్యాపనకున్ = వ్రతసమాప్తికి; అనియున్ = అని; చెప్పిపంపన్ = వార్తాహరులద్వారా; ఆ రాణివాసం = పురంధ్రీరత్నమైన ఆ రాణిగారి అంతఃపురం; గుప్తాగుప్త ప్రకారంబులు = రహస్యంగా, బట్టబయలుగా; పంపు = పంపించే; ద్రవ్యంబు = ధనాన్ని; తెచ్చి+ ఇచ్చు = తీసుకొనివచ్చి; వారికిస్తున్న; ముదుసళ్ళు = ముసలివారు; వర్షధరులు= హెగ్గడికాండ్రయొక్క; చేతులకున్ = హస్తాలకు; క్రందుకొని = మూగి; చేసాచినన్ = చేయిచాచగా; పందింటితోరణంబులై = ఆ హెగ్గడికాండ్ర బాహువులకు గట్టిన తోరణాలు అన్నట్లుగా; తోచు= కనిపించే; ఏకదండి = ఒకేకర్రచేతిలోగల సన్న్యాసి; త్రిదండి = మూడు దండములుగల సన్న్యాసులు; మొదటివాడు అద్వైతసన్న్యాసి, రెండవవాడు ద్వైతసన్న్యాసి; బ్రహ్మచారులు = వటువులయొక్క; ఉన్నమిత = పైకెత్తిన; దండంబులన్ = కర్రలయందు; నిండారు = దట్టంగానున్న; కాషాయ = కావిరంగు; కద్రు = బంగారువన్నెకల; వస్త్ర = వస్త్రాలు; కౌపీన = గోచిగుడ్డలయొక్క; పరంపరలన్ = గుంపులతో; క్రమ్మి = కప్పి (హెగ్గడికాళ్ళు ధనం పంచుతుంటే సన్న్యాసులు కాషాయం పసుపువన్నె వస్త్రాలు పీలికలు కలిగిన తమ తమ కోలలు చాచినపుడు; ఆ వస్త్రాలపీలికలే హెగ్గడికాళ్ళు సందిట తోరణాలై వ్రేలాడుతున్నాయి. ఇది చాలా అద్భుతమైన అలంకారము);

కావళ్ల = కావలివారియొక్క; పడగల = జండాలయొక్క; జాడనుకొని = జాడతేలిసి; కేవలకార్పణ్యంబు = కేవల దారిద్ర్యం మాత్రమే; విద్యగా = చదివిన చదువుగా; తక్కిన విద్యలు = ఇతర విద్యలు; ఎఱుంగక = తెలియక; వేడు = ప్రార్థించి; ఈ ధృక్+విధ = ఇలాంటి; అనేకప్రాణులకు = అనేకమందికి; ఆధారంబు +అగు = జీవనాధారమైన; పడమటిద్వారంబు చేరి = వెనక వాకిలి సమీపించి (తూర్పువాకిలి గుండా రాజుగారి కోసం శైవులు వస్తున్నారు. దిక్కులేనివారంతా వెనక వాకిలిగుండా వస్తున్నారు. ఇప్పటికి గృహయజమాని కోసం వచ్చేవారు యజమానురాలికోసం వచ్చేవారు ఇదే పద్ధతి అవలంబిస్తున్నారు.)

(పారిజాతాపహరణం వంటి కావ్యాలలో రాయలవారి అంతఃపురసౌధమైన మలయకూటం చుట్టూ యాచకజనులు తామరపూవుమీద మూగే తుమ్మెదలలాగా మూగుతూ ఉంటారని చెప్పిన ఈ పద్యాన్ని స్మరించాలి.)

శ్రీసదనలోచనాబ్జ ద ! యా సార మరంద పోషితార్థ భ్రమరో
ల్లాసగుణ ! మలయకూట ! ప్రాసాద నివేశ ! కృష్ణరాయమహీశా ! (2-1)

ప్రతిదిన = ప్రతిరోజు; అస్మత్ = నాయొక్క; పాదభజన = పాదసేవలయొక్క; కథాశ్రుతపూర్వం = ముందే విన్నకథలు కలది; ఉర్వీధవుదేవికిన్ = రాజుగారి భార్యకు; ఆశీర్వచనాక్షతముల = ఆశీస్సులతో కూడిన అక్షింతలు; దౌవారికముఖమునన్ = ద్వారపాలకులద్వారా; పంపి = యామునాచార్యుడు పంపించి; వైదేశికుండ = ఇతరదేశస్థుడను; వైష్ణవవటుండను = వైష్ణవబ్రహ్మచారిని; వాది = వాదము; కలిగినన్ = ఏర్పాటైతే; విష్ణుతత్త్వంబె= విష్ణుమతమే; పరతత్త్వము = పరమేశ్వరతత్త్వము; వసుధావరుండు = రాజు, విష్ణుభక్తి విముఖుండు = విష్ణుభక్తికి వ్యతిరేకి; కావునన్ = కాబట్టి;వైష్ణవుని మనవి = వైష్ణవులైన మాబోటివారి మనవి; విన్నవింపన్ = రాజుగారికి విన్నవింపగా; ఎవ్వారు = ప్రతివారు; వెఱతురు = భయపడుతారు; పరాయణము = ఆధీనమైన మనస్సుకలదానవు; పతిహిత+ ఆచారపు = భర్తయొక్క మేలుకోరే నడవడి కలదానవు; నీ విభుడు = నీభర్త; విధేయుడు = అనుకూలుడు; నన్ను రప్పించి = సభకు నన్ను వచ్చేటట్లు చేసి; వాదంబు = పండిత వివాదము; చేయింపన్ = ఏర్పాటుచేయడానికి; ఓపుదు + ఏనిన్ = సమర్థురాలవైతే; కృతార్థున్ + కావించెదన్ = ధన్యుణ్ణి చేస్తాను.

తే ॥ గ్రీష్మసమయ నిరుత్సాహ కేకిరమణి
నవ ఘనధ్వని కలరుచందమున నలరి
యేకతమ నర్మగోష్ఠిఁ బ్రాణేశుతోడ
నతని విధ మెఱింగింప, నిట్టట్టు వడమ. 54

(గ్రీష్మసమయ = వేసవికాలంలో; నిరుత్సాహ = ఉత్సాహంలేని; కేకిరమణి = ఆడునెమలి; నవ = క్రొత్త; ఘన = మేఘంయొక్క; ధ్వనికి = ఉరుముకు; అలరుచందమునన్ = సంతోషించే విధంగా; అలరి= సంతోషించి; ఏకతమ = ఏకాంతంలో; నర్మగోష్ఠిన్= విలాసగోష్ఠిలో; ప్రాణేశుతోడ= ప్రాణమునకు అధిపతి అయిన భర్తతో; (ప్రాణపతి, ఆత్మపతి వంటి మాటలు గొప్ప అర్థమున్నట్టివి); అతని విధము =

యామునాచార్యుని విషయం; ఎఱింగింపన్ = తెలపగా; ఇట్టు+అట్టుపడుచున్ = తత్తరపాటుతో క్రిందుమీదవుతూ.

50వ పద్యంలో చెప్పినట్లుగా ప్రియుసెజ్జ చేరినపుడ రాణిభర్తకు యామునాచార్యుని సంగతి వివరించింది. యామునాచార్యుని వార్త విన్న ఆడునెమలితో ఉపమింపబడటం చాలా అందముగా ఉంది. ఈ ఆశ్వాసంలోనే వర్షఋతువు వర్ణనలో 112,115,135 వంటి పద్యాలు చూడాలి.

కం ॥ భూవల్లభుఁ డెట్టెట్టూ !
తా వాదము సేసి శివమతంబు జయింపం
గా వచ్చెనొ ? చూతముగా,
'రావింపు' మటన్న నాఁటిరాత్రి చనంగన్. 55

భూవల్లభుడు=రాజు; ఎట్టు+ఎట్టు = ఏమిటేమిటి?; తాన్ = ఆ వటుడు; వాదముచేసి= వాదించి; శివమతంబున్ = శైవాన్ని; జయింపగాన్ = జయించడంకోసం; వచ్చెనో = వచ్చాడా?; చూతముగా= చూద్దాంకదా !; రావింపుము = రమ్మను; అటన్నన్ = అంటే; నాటి రాత్రి; చనంగన్=తెల్లవారగా.

ఇది చిన్నపద్యమైనా రాజు ఇట్టుట్ట పడడాన్ని నాటకీయంగా రూపిస్తున్నది. 'ఎట్టెట్టూ, తా, వాదం సేసి, శివమతంబున్, జయింపంగావచ్చెనో' అన్న మాటలన్నీ ప్రతిది నొక్కినొక్కి పలికితే తప్ప అతని తబ్బిబ్బు పాఠకులకు అబ్బురంగా కన్పించదు. రెండవపాదం 'తాన్ వాదము', మూడవపాదం గా 'వచ్చెనో' ఇలా విడిపోవడం, నాల్గవపాదంలో 'రావింపుము' అని మొదలుకావడం ఇదంతా అతడు పడ్డ ఆశ్చర్యాన్ని ధ్వనించే రచనాసంవిధానకం. నాల్గవపాదం రావింపుము అని తెగవేసి చెప్పినట్లుగా ప్రారంభించడం అతడు తప్పక ఓడిపోతాడని రాజు నమ్మకాన్ని ధ్వనిస్తుంది.

వ ॥ ప్రభాతంబునం బరిమితజనం బగు నా స్థానంబునం గొలువున్న భర్త ప్రోలం దానుండి యయ్యిందువదన యతని యనుమతిం బ్రతిహారిచేతఁ బిలువఁ బంచిన, న భూనిలింప కుమారుఁడు 56

ప్రభాతంబునన్ = ప్రొద్దున్నే; పరిమితజనంబు = కొద్దిమంది మాత్రమే; ఉన్న; ఆస్థానంబునన్ = కొలువుకూటంలో; కొలువున్న = సభతీర్చిన; భర్తప్రోలన్ = భర్తదగ్గర; తాన్= రాణికూడా; ఉండి; ఆ యిందువదన = ఆ చంద్రముఖి; అతని +అనుమతిన్ = రాజాజ్ఞతో; ప్రతిహారి = ద్వారపాలకుడు; అభూనిలింపకుమారుండు = ఆ బ్రాహ్మణవటుడు.

పరిమితజనం గల కొలువు కనుక, వారు చాలా ఆంతరికులైనవారన్న మాట కనుకనే రాణికూడా ఉన్నది. రాణితో పాటూ రాజు కొలువుతీరడమన్న సంప్రదాయం బహుశా మహమ్మదీయ ఆగమనం తర్వాత మనకు పోయినట్లున్నది. పురాణకథలో రాజు రాణితో పాటుగా కొలువుదీర్చినట్లు వర్ణింపబడటం మనకు కన్పిస్తుంది.

## యామునాచార్యుఁడు పాండ్యుని కొల్వునకు రావటం

కం ॥ ద్వారంబు సొచ్చి, కీలిత
గారుడమహి వజ్ర వేదికం జవురులఁ గెం
పారునొక పిప్పలముఁ గని
యా రావి న్వాదసాక్షికై వలగొనుచున్. 57

ద్వారంబు = రాజద్వారము; సొచ్చి = ప్రవేశించి; కీలిత = పొదుగబడ్డ; గారుడ = గారుడపచ్చలుకల; మహిన్ = నేలపై; వజ్రవేదికన్ = వజ్రాలతో నిర్మించిన అరుగుమీద; చివురులన్= చివురుతో; కెంపారు = ఎర్రనైన; పిప్పలమున్ = రావిచెట్టును; కని = చూచి; ఆ రావిన్ = ఆ రావిచెట్టును; వాదసాక్షికి = జరగబోయే వాదనలో సాక్షిగా చేసుకొని; వలగొనుచున్= ప్రదక్షిణంచేసి (కుడిచేతిమీదగా తిరగడం ప్ర+ దక్షిణ=వలగొని).

సభకు, రాజద్వారానికి మధ్య ఒక రావిచెట్టు ఉన్నది. అది ఎర్రని చివుళ్ళతో అందంగా ఉన్నది. దాని చుట్టూ వజ్రాలు పొదిగిన అరుగు ఉన్నది. దారంతా గరుడపచ్చలు పొదిగి ఉన్నది. రావిచెట్టు విష్ణుస్వరూపం. వృక్షాలలో నేను అశ్వత్థాన్ని అని గీతలో కృష్ణుడన్నాడు. శ్వ=రేపు స్థ ఉండేది. న = కానిది= రేపటికి ఉండనిది అని అర్థము. విశ్వంలో ప్రతిపదార్థము ప్రతిక్షణం పరిణామం పొందుతుంటుంది. ఈ పరిణామ స్వరూపమైన విశ్వానికి రావి ప్రతీక. రావి శైవుడైన లేదా ఉపేక్షించి ఉండాలి.

సీ ॥ పసిఁడి గచ్చమర సోపానముల్ మూఁటఁ దుం
గిత విశాలితయుఁ జిత్రితయునైన
సభ మహాకుధముపై శార్దూల చర్మకం
ధావృతుల్ జటిలులు నైన జరఠ
మాహేశ్వరులు చుట్టిరా, హార సంధి రు
ద్రాక్షాయుతముఁ దాల్చి యలికభూతి
సురఁటి గాడ్పుల రాల, నరుణాయతాక్షుఁడై
కుఱుగద్దెబిల్లఁ బ్రకోష్ఠ మునిచి,
నంది ముద్రితపాణియందుఁ జెక్కూఁది యా
గమములు వినుచు, హేమ్రము పొదివిన,



తే ॥ యలఁతి రుదురాకగమి కుట్టులందు మెఱయ,
వెలి తపారంబు మించ దువ్వలువ గప్పి
యడపమును వాఁడివా లొ క్కయతివ దాల్ప
భార్య వింజామరిడ, నొప్పు పాండ్యుఁ గనియె. 58

పసిడిగచ్చు = బంగారు మొలాంవేసిన గచ్చు; అమరన్ = ఒప్పుతూ ఉండగా; సోపానముల్ మూటన్ = మూడు మెట్లపైన; తుంగిత = ఎత్తైనది; విశాలిత = వైశాల్యంకలది; చిత్రిత = చిత్రించిన బొమ్మలు గలది; అయిన సభన్ = అయినట్టి కొలువుకూటంలో; మహాకుధముపై= రత్నకంబళిమీద; శార్దూలచర్మఖండ = పులితోలు ముక్కలతో; ఆవృతుల్ = శరీరాన్ని కప్పుకొన్నవారు; జటిలులు = జడలు గలవారు; జరఠమాహేశ్వరులు = వృద్ధులైన శైవుల; చుట్టున్= తనచుట్టూ; రాన్ = ఉండగా; హారసంధిన్ = ముత్యాలహారాలమధ్య; రుద్రాక్ష+ అయుతము = పెక్కు రుద్రాక్షలను; తాల్చి = ధరించి; సురటిగాడ్పులను = వింజామర గాలులకు; అళికభూతి= నుదుటి విభూతి; రాలన్ = రాలుతూ ఉండగా; అరుణ+ ఆయత + అక్షుడు = ఎర్రని వెడల్పైన కళ్ళుకలవాడు; కుఱు గద్దెన్ = చిన్నపీఠం మీద; బిల్లన్ = గుండ్రని దిండుపై; ప్రకోష్ఠము = మోచేతిని; ఉనిచి = ఆనించి; నందిముద్రితపాణిన్ = నందీశ్వరుని బొమ్మగల ఉంగరములేదా ముంజేతికడియం కలచేతిలో; చెక్కు+ ఊది = చెక్కిలి ఆనించి; ఆగమములు = శైవతంత్రాలు; వినుచున్ = వింటూ; హేమము పొదివిన = బంగారముకప్పిన; అలతి రుద్రాక్షగమి = చిన్నరుద్రాక్షల గుంపు; కుట్టులందున్ = చెవులతమ్మలందు; మెఱయన్ = వెలుగుతుండగా; వెలితపారంబు = తెల్లని తలపాగా; మించన్ = అతిశయించేటట్లు; దువ్వలువ = సన్నని దుప్పటి; కప్పి = కప్పుకొని; అడపమున్ = తాంబూలంపెట్టె; వాడి వాలు = పదునైన కత్తి; ఒక్క అతివ = ఒకస్త్రీ; తాల్పన్ = ధరింపగా; భార్య = పత్ని; వింజామర + ఇడన్ = వీచోపులిడగా, ఒప్పు; పాండ్యున్ = పాండ్యరాజును; కనియెన్ = చూచినాడు.

మూడు మెట్లపై ఎత్తుగా విశాలంగా చిత్రాలుకల కొలువుకూటంలో రత్నకంబళిపైనున్న ఒక చిన్నగద్దెపై రాజున్నాడు. ఆయన చుట్టూ వ్యాఘ్రచర్మాంబరులైన జటాధరులైన వృద్ధ శైవాచార్యులు కూర్చున్నారు. రాజు మెడలో ముత్యాలహారాల నడుమ ఎక్కువగా గ్రుచ్చబడిన రుద్రాక్షలు ఉన్నాయి. వీచోపుల గాడ్పులకు నుదుటినుండి విభూతి రాలుతున్నది. ఎర్రని విశాలనేత్రాలవాడు చిన్నగద్దెపైనున్న గుండ్రని తలగడపై మోచేయి పెట్టి నందిప్రతిమగల ఉంగరాల చేతిలో ఒక చెక్కిలి ఆనించి శైవాగమాలు వింటున్నాడు. చెవులకు బంగారుతో పొదిగిన రుద్రాక్షలు వ్రేలాడుతున్నాయి. ఆపాదమస్తకము సన్నని దువ్వలువ కప్పుకొన్నాడు. తెల్లని తలపాగా మాత్రం కనిపిస్తున్నది. ప్రక్కనున్న చేటిక తాంబూల కరండాన్ని, వాడి వాలూ ధరించి ఉన్నది. ప్రక్కన కూర్చున్నభార్య సన్నగా వింజామర వీస్తున్నది. ఇలా రాజఠీవితో నిండుగానున్న శైవచక్రవర్తిని యామునాచార్యుడు చూచాడు.

విశే॥ ఇందులో ఒక మహాచక్రవర్తియొక్క మూర్తి చాలా వాస్తవికంగా అద్భుతంగా చిత్రింపబడ్డది. 2-75లో మొదటి పాండ్యరాజు వర్ణనతో దీన్ని పోల్చుకొని చూస్తే ఒక చక్రవర్తియొక్క మూర్తి చిత్రణలో గాంభీర్యము, వైవిధ్యము తెలుస్తుంది. మొదటి వర్ణన నడుస్తున్న రాజుది. ఇక్కడ కూర్చున్న రాజుది. 'ఈ గతిస్థితులలో ఒక మహారాజెలా ఉంటాడు ?' అన్న ప్రశ్నకు ఇదొక అక్షరచిత్రణ. అజంతా మొదలైన చిత్రాలలో, శిల్పాలలో రాజులు, ఆచార్యులు ఆదర్శరూపాలు లేదా భావరూపాలు చెక్కబడియున్నాయి. వాటితో దీన్ని పోల్చుకొని చూడవచ్చు. ఇది ఒక శైవమతస్థుడైన రాజరూపవర్ణన. రాజు కూర్చున్న గద్దె

మూడు సోపానాలపై ఉన్నది అన్నమాట బహుశా మూడు అంతస్థులపైన ఉన్నదని అర్థం కావచ్చు. మూడంతస్థులున్న వేదిక కావచ్చు. 'పేయస్' భువనవిజయసభామంటపంలో శ్రీకృష్ణదేవరాయలను చూచినాడు. ఆవిషయం చరిత్రలో ప్రసిద్ధం.

ఈ కావ్య పీఠికలో వింధ్యపర్వతంలో దాగిన గజపతి వర్ణన. ఈరెండు వర్ణనలు చక్రవర్తి స్వరూపచిత్రణ రేఖామాత్రంగా చేస్తున్నవి. అలాగే విష్ణుచిత్తుని యామునాచార్యుని దాసరివర్ణనలు మూడుచోట్ల చేయబడ్డాయి. అలాగే బ్రహ్మరాక్షసుని రూపవర్ణన. ఈ విధంగా ఆచార్యులవర్ణనలు స్వభావోక్తులు తప్ప ప్రతీకలు కావు. వర్ణనల్లో శ్రీకృష్ణదేవరాయలు అతిశయోక్తులకంటే స్వభావోక్తులనే ఎక్కువ ఆదరించినట్లు స్పష్టము.

వ ॥ కని వినీతుండై చేర నరిగి యజ్ఞోపవీతంబు గాను కిచ్చి కూర్చున్న నాదరింపక సంరంభియై యవ్విశ్వంభరాభర్త యిట్లనియె. 59

బ్రహ్మచారి కనుక ఆస్తిపాస్తులు లేనివాడు. కనుకనే తనకు చితమైన యజ్ఞోపవీతం కానుకగా సమర్పించటం జరిగింది. రాజు జందెం త్రెంచుకున్న శైవుడు కనుక వటుని ఆదరించలేదు. పైగా తొట్రుపడ్డాడు. ఈ జందె మివ్వటం నాటి ఆచారం కాబోలు. వైష్ణవుడైనందున కోపమూ వచ్చింది.

తే ॥ 'సంగతియె యోయి, యిసుమంత ఠింగణావు,
తత్త్వనిర్ణయవాదంబు దరమె నీకు ?
నోడి తేనియుఁ బట్టి మొఱ్ఱో యనంగ
లింగమును గట్ట కుడుగ, మెఱింగి నొడువు. 60

ఓయి; సంగతియె = ఉచితమా; ఇసుమంత = కొంచెమంత; ఠింగణావు = చిన్నవాడివి; నీకు = వటుడైన నీకు; తత్త్వనిర్ణయవాదంబు = పరమాత్మయొక్క స్వరూపనిర్ధారణ చేసే తర్కం; తరమె = శక్యమా ? ఓడితి + ఏనియున్ = ఓడిపోయినావో; పట్టి = పట్టుకొని;మొఱ్ఱో +అనంగన్ = మొరపెట్టినా; లింగమునున్ = శివలింగాన్ని; కట్టక = మెడలో బంధింపక; ఉడుగము = ఊరుకోము; ఎఱింగి = విచారించి; నొడువు = చెప్పు.

తా ॥ ఓయి చూస్తే వ్రేలెడులేవు. తత్త్వాన్ని స్థాపిస్తావా ? ఆలోచించుకొని చెప్పు. ఓడిపోయినావో మెడలో లింగాన్ని కట్టకుండా వదలిపెట్టను.

విశే ॥ ఠింగణా - ఠాంక్విన్ అన్నదేశంనుండి దిగుమతి అయ్యే పొట్టిగుఱ్ఱము. దాన్ని బట్టి ఇతర జంతువులకు, మనుష్యులకు ఈ శబ్దం నేటికీ వాడబడుతూనే ఉంది.

'సంరంభియై' అన్న పైవచనాన్ని 'సంగతియె' అన్న పద్యప్రారంభం దాన్ని ధ్రువపరుస్తున్నది. యజ్ఞోపవీతాన్ని చూసి తొట్రుపడ్డ రాజునోటినుండి మొదటగా వచ్చిన మాట ఇది నీకుచితమా ?

తే ॥ వాదుల మటంచుఁ జెప్పించి వత్తు; రోట
మైన దయ నీరె యేమైన నని విలజ్జ
జూటుఁదనమున సభ లెక్కుచౌరవకాండ్రు;
పాఱువారలసుద్ది సెప్పంగ నేల?' 61

పాఱువారల = బ్రాహ్మణుల (శైవేతరులైన వారు బ్రాహ్మణులు); సుద్ది = మాట; చెప్పంగన్+ఏల = వేరే ఏమిచెప్పాలి; వాదులము+అటంచున్ = శాస్త్రవాదం చేస్తామంటూ; చెప్పించి = మధ్యవర్తులతో సిఫారుసుచేయించుకొని సభలలో ప్రవేశిస్తారు; ఓటమి = అపజయము; అయినన్ = అయితే; దయన్ = దయతో; ఏమైనన్ = ఏదో ఒకటి; ఈరె = ఇవ్వరా ? అని; విలజ్జన్ = సిగ్గులేకుండా; జూటుదనమునన్ = మోసంతో; సభలు+ ఎక్కు = సభాప్రవేశం చేసే; చౌరవకాండ్రు = మంచిచౌరవ తీసుకునేవారు.

బ్రాహ్మణుల సంగతి వేరేచెప్పడం దేనికి ? వారు సిగ్గులేకుండా మోసంతో సభలలోచౌరవతో ప్రవేశిస్తారు. మేము శాస్త్రవాదం చేస్తామని సిఫారుసు చేసి వస్తారు. ఓడిపోతే రాజు ఏదో ఒకటి ఇస్తాడు కదా ! అని.

విశే॥ జూటు - 'ఝూటా' శబ్ద భవమేమో (జూట్ = అబద్ధం) చెప్పించి 'రెకమెండేషన్' అన్నమాట. రాయలవారు ఈ చౌరవకాండ్రను ఎంతమందిని చూచియున్నాడో కదా !

వ ॥ అని పలికి దరహాసంబుతో దేవి దెసఁ జూచి యిట్లనియె. 62

దరహాసంబుతోన్ = చిరునవ్వుతో; దేవిదెసన్+చూచి = భార్యవైపుచూచి; ఇట్లు అనియెన్.

కం ॥ అస్మన్మతస్థుఁ డోడిన
భస్మము రుద్రాక్షములును బాసి యితనిచే
విస్మయముగ సాప్తము ముర
ఘస్మర చక్రాంకితుండఁ గాఁ గలవాఁడన్. 63

అస్మత్+ మతస్థుడు = నామతస్థుడు; ఓడినన్ = ఓడిపోతే; భస్మమున్ = విభూతి; రుద్రాక్షములును = రుద్రాక్షలు; పాసి = వదలి; ఇతనిచేన్ = ఈ బ్రహ్మచారితో; విస్మయముగన్ = ఆశ్చర్యంగా; సాప్తము = ఆప్తులైన నా శైవులతో పాటుగా; మురఘస్మర = మురాసురుని సంహరించిన విష్ణువుయొక్క; చక్ర = చక్రముయొక్క; అంకితుండన్ = గుర్తుకలవాడును; కాగలవాడన్ = అవుతాను.

నామతస్థులే ఈ విభూతి రుద్రాక్షలు వదలి నా ఆప్తులైన శైవులతో పాటుగా ఇతనితో చక్రాంకితం చేయించుకొంటారు.

తే ॥ ఉవిద, యీ నీదు విద్వాంసుఁ డోడెనేని
నీకు నితని కేనన్న పూనికయు' యన్న,

'నొప్పితిమి దేవ రానతి దప్పకున్నఁ
జాలు మఱి పంచభూతముల్ సాక్షిగాఁగ'. 64

ఉవిద = దేవీ!; ఈ; నీదు = నీయొక్క; విద్వాంసుడు = పండితుడు; ఓడెన్ + ఏని = ఓడిపోతే; నీకున్ = నీకు; ఇతనికిన్ = నీ విద్వాంసునకు; ఏను = నేను; అన్న = అన్నట్టి; పూనికయే= ప్రతిజ్ఞయే; అన్నన్ = అంటే; ఒప్పితిమి = అంగీకరించాము; దేవర != రాజా !; ఆనతి = ఆజ్ఞ; తప్పకున్నన్ = తప్పకపోతే; చాలున్ = మంచిది; మఱి = దీనికి; పంచభూతముల్ = ఈ ఐదు భూతాలు; సాక్షికాగన్ = సాక్షి అవునట్లుగా (ఒప్పించితిమి అని అన్వయము.)

రాజన్నాడు 'దేవీ ! నీ విద్వాంసుడోడిపోతే అతనికి నీకు మా శైవచిహ్నాలు మీరు ధరించాలి'. అది విన్న రాణి అన్నది 'రాజా ! తమరుచేసిన ప్రతిన తప్పకుండా ఉంటే చాలు దీనికి పంచభూతాతే సాక్షి' అని.

వ ॥ అని పలుకు నయ్యిరువుర ప్రతిజ్ఞ లాకర్ణించి 65

తే ॥ అతఁడు మృగకత్తి పెళపెళ యనఁగఁ, బసుపు
గోఁచి కట్టిన మోదుగుఁగోల నెగయఁ,
బ్రాంజలి వినీతుఁడై విన్నపం బటంచు
నర్ధముక్తాసనత నిట్లు లనియెఁ బటికి. 66

అతడు = యామునాచార్యుడు; మృగకత్తి = లేడిచర్మము; పెళపెళ యనగ = పెళపెళమని ధ్వనిస్తూ ఉండగా; పసుపుగోచి = పసుపుపచ్చని గుడ్డపేలిక; మోదుగుకోం = సన్న్యాసిధరించే దండం; నెగయున్ = పైకి రెపరెపలాడగా; ప్ర+ అంజలి = కేలుమోడ్చినవాడు; వినీతుడు = వినయవంతుడు; విన్నపంబు +అటంచునన్ = వినతి అనుచు; అర్ధముక్త = సగము వదలిన; ఆసనతన్ = పీఠముకలవాడై; ధృతిన్ = ధైర్యంతో; ఇట్టుల + అనియెన్.

యామునాచార్యుడు రాజు రాణిచేస్తున్న ప్రతిజ్ఞలు విని కొంచెము ఆసనమునుండి పైకిలేచి వినయముతో నమస్కరించి ''రాజా! విన్నపములు చిత్తగింపవలెను'' అన్నాడు. అతడు ఆసనమునుండి పైకిలేస్తున్నపుడు నల్లని లేడి చర్మము పెళపెళమని మ్రోగింది. మోదుగుకోలపైన పసుపుకాని వస్త్రఖండఁ కూడా పైకిలేచింది.

విశే ॥ అర్ధముక్తాసనత = రాజభక్తిని సూచించేది.

నల్లలేడిచర్మం పెళపెళమనడం, పసుపుగోచి పైకిలేవడం, అర్ధముక్తాసనత నుండి పుట్టిన కదలికవల్ల జరిగిన పనులు. ఈ వర్ణన నాటకీయంగా ఉంది.

కం ॥ దేవా, యిట్లని యానతి
యీ వల, దేఁ గడుపుఁ గూటి కిట రా, నాడ
బ్బేవారిఁ బ్రోన భిక్షా
జీవిక వర్ణికిని విధి సృజించెనె గాదె ? 67

దేవా = దేవర; ఇట్లని = ఈవిధంగా; ఆనతి ఈవలదు = ఆజ్ఞ చేయవద్దు; ఏన్ = నేను; ఇటన్ = ఈసభకు; కడుపుకూటికిన్ = నా ఒక్క కడుపునింపుకోవడానికి; రాన్ = రావలసిన అవసరములేదు; ఆ డబ్బు = ఆ ధనం; (నాడంబు =నావేషం అని వేదం వారి పాఠం); ఏ వారిన్= ఎవరిని; ప్రోవన్ (కాపాడుకోవటానికి) పోషించటానికి; వర్ణికిని = బ్రహ్మచారికి; విధి = బ్రహ్మ; భిక్షాజీవికన్ = భిక్షమెత్తుకోవడమన్న బ్రతుకు తెరువు; సృజించెనె కాదె = సృష్టించియున్నాడు కదా !

ప్రభూ ! నేను ఒంటరి బ్రహ్మచారిని. నా ఒక కడుపుకోసం జూటుదనమున సభలెక్కు చౌరవతో పనిలేదు. అలా సంపాదించిన ధనంతో పోషించడానికి నాకెవరున్నారు కనుక ? పైగా భిక్షాటన సన్న్యాసులకు బ్రహ్మవిధించియే ఉన్నాడు కదా !

తే ॥ ఎవ్వఁడే సర్వభూతస్థుఁ డీత్తెఱంగు
నకును బ్రేరేఁచె, నతని యానతియె తెచ్చె,
నెఱిఁగినవి నాల్గు నొడువ నేమేని లెస్స,
యతఁడ బొంకిన నేమి సేయంగ వచ్చు ? 68

ఎవ్వడేన్ = ఎవ్వడో ఒక; సర్వభూతస్థుడు = పంచభూతాలలో ఉన్నవాడు (అంతర్యామి అయిన భగవంతుడు); ఈతెరంగునకున్ = ఈ పద్ధతికి; ప్రేరేచెన్ = ప్రేరెపించెనో; అతని ఆనతియె= అతని ఆజ్ఞయే; తెచ్చెన్ = నన్ను ఇక్కడకు తీసుకొని వచ్చింది; ఎఱిగినవి నాల్గు = తెలిసిన నాలుగుమాటలు; నొడువన్ = చెబితే; ఏమైనన్ = ఏమైనప్పటికిని; లెస్స = మంచిదే; అతడ బొంకినన్= ఒకవేళ అతడే అబద్ధమాడితే; ఏమిసేయంగన్ వచ్చున్ = చేయడానికి ఏమున్నది?

సర్వభూతాలలో ఉన్నవాడెవ్వడో నన్ను ప్రేరేపించి ఇక్కడకు తీసుకొని వచ్చినాడు. తెలిసిన నాల్గుమాటలు చెప్పనందువల్ల ఏ ఫలితం కలిగినా మంచిదే. అతడే అబద్ధమాడితే మనమేం చేయగలం? 63వ పద్యంలో రాజు అన్నమాటకు ఇది సమాధానం. ఈ కథాప్రారంభంలో భగవంతుడు తానే యామునాచార్యుని ప్రేరేపించినట్లు సూచించినాడు. కనుక అంతర్యామి స్వరూపుడన ఆ భగవంతుని ప్రేరణచే తాను ఈ సభకు వచ్చినట్లు యామునాచార్యునకు తెలుసు. ఈ కథలో నాయకత్వం యామునాచార్యునిది కాదు. అంతర్యామి అయిన శ్రీమన్నారాయణునిదే అని ఈ పద్యం స్థాపిస్తున్నది.

తే ॥ పంతమైనను గానిమ్ము పార్థివేంద్ర !
యుక్తులను నిగ్రహస్థాన మొదవనేని,

యమ్మ దెచ్చిన విద్వాంసుఁ డనఁగ వలవ,
దెట్లు గావింపవలయు నట్లట్ల చేయు. 69

పార్థివేంద్ర = రాజోత్తమా!; పంతము+ అయినను =నీవు చేసిన ప్రతిజ్ఞయే నిజమైతే, కానిమ్ము = అలాగే; ఉక్తులను = మాటలలో; నిగ్రహస్థానము = పరాజయకారణము; ఒడవెనేని= కలిగితే; అమ్మ తెచ్చిన విద్వాంసుడు = రాణిగారు తెచ్చినపండితులు; అనగ వలవదు = అని కనికరించవద్దు; ఎట్లు కావింపవలయున్ = ఎలా చేయాలో; అట్లట్ల చేయు = ఆ విధంగానే చేయవచ్చు.

మహారాజా ! మీరు చేసిన ప్రతిజ్ఞకు నేను బద్ధుడనై ఉన్నాను నా వాదనలో పరాజయ కారణాలు కనిపిస్తే అమ్మగారి పండితుడనని దయ తలచవద్దు. తమరు ఏం చేయాలనుకుంటున్నారో అది చేయవచ్చు.

విశే ॥ నిగ్రహస్థానము = గౌతమ మహర్షి న్యాయ దర్శనంలో వాదంలో ఈ పండితుడు ఓడిపోయినాడు అనడానికి గుర్తులు కొన్ని చెప్పాడు. ఆ పరాజయసూచనలే నిగ్రహస్థానాలు. ఒకే విషయాన్ని రెండు మూడుసార్లు చెప్పడం ఒక నిగ్రహస్థానము.

వ॥ అని యులుకు విడి పలికి, మగుడం గూర్చుండి, యతని యనుమతి వాదంబునకుం
దొడంగి. 70

ఉలుకు = జంకు; మగుడన్ = తిరిగి; (పైమాటలు అర్ధముక్తాసనమునుండి పలికినవి అన్నమాట) అనుమతిన్ = అజ్ఞతో; తొడంగి = పూనుకొని.

## ఇతర మత ఖండనము

సీ ॥ అందులో నొకమేటి కభిముఖుండై యాతఁ
డనిన వన్నియును మున్ననువదించి;
తొడఁగి యన్నిటి కన్ని దూషణంబులు వేగ
పడక తత్సభయొడఁబడఁగఁ బల్కి;
ప్రక్కమాటల నెన్నకొక్కొక మాటనే
నిగ్రహస్థాన మనుగ్రహించి,
క్రందుగా రేఁగినఁ గలఁగ కందఱఁ దీర్చి
నిలిపి; యమ్మొదలివానికినె మగిడి;

తే ॥ మఱి శ్రుతిస్మృతి సూత్రసమాజమునకు
నైకకంఠ్యంబు గల్పించి, యాత్మమతము
జగమెఱుంగఁగ రాద్ధాంతముగ నొనర్చి
విజితుఁ గావించి దయ వాని విడిచిపెట్టి, 71

3-6పద్యమే ఇక్కడ తిరిగి వ్రాయబడింది. కనుక అక్కడ చేసిన వ్యాఖ్యానమే ఇక్కడ అన్వయించుకోవాలి. అలాగే తర్వాతి పద్యానికి కూడా.

### యామున విజయము

కం ॥ 'నీ వేమంటివి రమ్మం'
చావలివానికిని మగిడి యట్లనె వానిం
గావించి, యొకఁడొకఁడు రా
నా విప్రుఁడు వాదసరణి నందఱ గెలిచెన్. 72

వ ॥ ఇట్లు జయించి విష్ణుదేవుండె పరతత్త్వం బనియు విశిష్టాద్వైతంబ మతంబు
నగుటయుం బ్రతిష్ఠించిన. 73

పరతత్త్వంబు = పరమత స్వరూపము; విశిష్టాద్వైతంబు = శ్రీవైష్ణవ సిద్ధాంతము; మతంబు = గొప్పమతము; ప్రతిష్ఠించినన్ = స్థాపించినంత.

3వ ఆశ్వాసంలో విష్ణుచిత్తుడు చేసిన వర్ణనంతా ఇక్కడ అన్వయించుకోవాలి.

కం ॥ ఆయెడను నొక్క పలు కెదు
రై యుండెడు పిప్పలమున నాయెను విన, 'నో
హో, యిది నిక్కము, నృప, నా
రాయణుఁడె పరంబు, కొల్వు మతని' నటంచున్. 74

ఆ యెడను = ఆ సమయంలో; ఒక్కపలుకు = ఒక్కమాట; ఎదురైయుండెడు = ఎదురుగా ఉన్న; పిప్పలమునన్ = రావిచెట్టునుండి; వినన్ + ఆయెను = వినిపించింది; ఓహో నృప = ఓ రాజా !; ఇది నిక్కము = ఇది సత్యము; నారాయణుండె పరంబు = అందరికంటె శ్రేష్ఠమైన తత్త్వం నారాయణుడే; అతనిని కొల్వుము = అతనిని సేవించుము; అటంచున్ = అంటూ;

ఇది అద్భుత రసాత్మకమైన పద్యం. 4-6 పద్యంలాగా ఈ పద్యంలోకూడా దేవతావాక్యమే ఆచార్యుడు చెప్పిన వాక్యాన్ని సత్యమని ధ్రువీకరించింది కనుక ఈ పద్యం రసదృష్టితో ప్రధానమైనది. ఆ రసం ధర్మవీరం (చూ. పీఠిక)

### రాజు యామునాచార్యున కర్ధరాజ్యంబిచ్చుట

వ ॥ అప్పలుకులు విని ఖిన్నంబై యుక్కాఁడినపాషండ షండంబు దల వంచుకొని పోయిన నాయుర్వీధవుండు నతని మాహాత్మ్యంబునకు సంతోషించి సాష్టాంగ మెఱఁగి, హర్షాద్భుతరసోత్తరంగితాంతరంగుండై, భుజగశయన చరణకుశేశయభక్తి వొడమి కృతార్థతం బొంది, పాండ్యమండలమునకు భాగినేయుండ పట్టార్హుండు గావునఁ బాత్రంబని బ్రహ్మచారి యగునతనికిఁ దన

కడగొట్టుచెలియలింబరిణయంబుసేసి, యరణంబుగ నమ్మహాత్మునకు ధారాపూర్వకంబుగా నర్ధరాజ్యం బిచ్చి, యువరాజుంజేసి, యధీతసాంగవేదుండగు నతనికి నథర్వశిరస్సభ్యస్తం బని యెఱింగి, యందు దివ్యాస్త్ర మంత్రంబుల కలిమియుం దెలిపి, యమ్మహాత్మున కెచ్చరించి దుస్సాధంబగు విరోధియూథంబు సాధింపుమని దండయాత్రంబనిచిన, నయ్యామునుండును సన్నద్ధుండగుతఱిఁ దత్పురోహిత ప్రధానమంత్రివర్గంబు సన్నిహితంబులగు నివ్వార్షిక దినంబులు గడిపి శరత్సమయంబున విద్విషత్సంహారంబునకు విజయంబు సేయు మనుటయు, నత్తెఱంగు రాజున కెఱింగించి తత్సమ్మతంబున నిలిచె నంత. 75

ఖిన్నంబై = దుఃఖపడి; ఆ కూడిన = ఆ సమావేశమైన; పాషండషండంబు = వేదబాహ్యస్థుల సమూహం; తలవంచుకొని పోయినన్ ; ఆ యుర్వీధవుండు = ఆ రాజు; మాహాత్మ్యంబునకున్ = మహత్తునకు; సంతోషించి; సాష్టాంగము + ఎఱఁగి = సాష్టాంగపడి (రెండు కాళ్ళు), రెండు చేతులు ముఖము, ఉరఃస్థలము, నుదురు, రెండు భుజాలు భూమికి తాకేటట్లుగా నమస్కరించటం); హర్ష + అద్భుతరస+ ఉత్తరంగిత+ అంతరంగుండై = సంతోషంతో అద్భుతరసము అలలుగా లేచిన హృదయముకలవాడై; భుజగశయన = పామే సెజ్జగా గల విష్ణువుయొక్క; చరణకుశేశయ = పాదములనెడి కమలములపై; భక్తిపొడమి = భక్తికలిగి; కృత+ ఆస్థత = కలిగిన స్వస్థత; పాండ్యమండలమునకున్ = పాండ్యరాజ్యానికి; భాగినేయుండ +సోదరీపుత్రుడు; పట్ట+ అర్హుండు = పట్టాభిషేకమునకు; పాత్రంబు = తగినవాడని; బ్రహ్మచారి +అగు+ అతనికిన్ = వటుడైన యామునాచార్యునకు; కడగొట్టు = చివరి; చెలియలిన్ = చెల్లెలనను; పరిణయంబు = పెండ్లి; ధారాపూర్వకంబుగా = జలధారమున్నుగా; అధీత = చదువబడిన; స+ అంగవేదుడు = షడంగములతో కూడిన వేదములుకలవాడు; అథర్వశిరస్సు = అధర్వవేదం; అభ్యస్తంబ = తెలిసినదే; దివ్య+ అస్త్ర మంత్రంబుల కలిమి = ఆ వేదభాగంలో అస్త్రాలకు సంబంధించినమంత్రముఖలయొక్క యునికి; దుస్సాధంబు = అసాధ్యమైన; విరోధి యూథంబు = శత్రుసమూహము; సాధింపుము = జయింపుము; సన్నద్ధుండు = సిద్ధపడినవాడు; సన్నిహితంబులు = దగ్గరపడిన; వార్షికదినంబులు= ఈ వానాకాలం; విద్విషత్ = శత్రువులయొక్క; సంహారంబునకున్ = నాశనానికి; విజయంబు సేయుము = పూనుకొనుము.

## భావోన్మేషం

### ప్రావృట్సౌదామని

సుకము ఫాలమునందు వ్రాసుకొని యెవరు
పుట్టిరో వారికి వసంతము సుమనోజ్ఞ
మైన కానిమ్ము నాకు నీవన్న మేము
జలదరించున ఓయి ఆషాడజలద ! (గిరికుమారుని ప్రేమగీతాలు)

వాల్మీకిమహర్షి కిష్కింధకాండలో శ్రీరామ ముఖంగా వర్షాశరద్వర్ణన చేస్తే ఆముక్త కవి కూడా మన్నారుస్వామి ముఖంగా వర్షాశరద్వర్ణన చేయటం చూస్తే ఏదో పంతగించి చేసినట్లు స్ఫురించకపోదు.

పాత్రముఖంగా చేసినందున వాల్మీకి వర్ణన అరణ్యానికే పరిమితమైపోయింది. ఏనుగులు-నెమళ్ళు-నదులు- సెలయేళ్ళు - అడవులు - కప్పలు - పక్షులు - వృక్షాలు - తుమ్మెదలు - కొండలు-మబ్బులు - మెరుపు - వాన - ఇలా ఉంటుంది వస్తుప్రపంచం.

హరివంశంలో వర్షవర్ణనమున్నది. సగం కవిచేసింది. మిగిలినది కవి నిర్మితపాత్ర బలరాముడు చేసింది. ఈ వర్ణనకు హద్దు బృందావనము. కాళిదాసు ఋతుసంహారమున్నది కదా. శూద్రకుడు - మాఘుడు మొదలైన కవులూ వర్ణించారు. కానీ ఆముక్త కవిలో కన్పించే వస్తువైవిధ్యం నాన్యతో దర్శనీయం. ఒక్క వాల్మీకి - ఒక్క వ్యాసుడు - చేసిన వర్ణనలే ఈ ప్రస్తుత వర్ణనలకు సమానంగా కన్పిస్తాయి. ఈ వర్ణనలు సహజమైనవి తప్ప కృత్రిమ ఊహాలోక సంజాతములు కావు. శూద్రకుని మృచ్ఛకటిక నాటకంలోనూ ఈ వర్ణనలోని జీవకళ కన్పిస్తుంది.

''మబ్బులు సూర్యుని మ్రింగే నల్లగా కానుగుచెట్ల ఆకుల్లాగా ఆర్ద్రంగా ఉన్నాయి. బాణాల దెబ్బలు తిని ఏనుగులు ఘీంకరించినట్లుగా పుట్టలు వానధారులకు సిమసిమలాడుతూ కరిగిపోతున్నవి. విద్యుత్తు ప్రాసాదసంచారిణియైన కాంచనదీపిక లాగా ఉంటే వెన్నెల మేఘాల మాటున కప్పుపడిపోయి దుర్బలుడైన భర్తగల వనిత లాగా ఉన్నది.

ఈ సజీవకళ రాయల వర్ణనలకు ప్రాణకళ. ఇదంతా వాల్మీకి పెట్టిన భిక్ష. ఐనా ఇంకా రెండు మెదుకులు సొంతంగా సంపాదించుకొన్నవే కలుపుకొన్నారు.

(1) రాయలసృష్టి - మబ్బు - మెరుపు - వాన - వానకాళ్ళు - రవి - గాలి - పక్షులు - పచ్చికలు-నెమళ్ళు - మృగాలు - కప్పలు - కొండలు - కేతకులు.

(2) ఉరుములు - కరకలు - పరివేషం - ప్రతిసూర్యబింబం - ఇంద్రధనుస్సు - ఆర్ద్రపురుగులు-కాకులు - మశకములు - పుట్టగొడుగు - కృషీవలులు - పూరిండ్లు - పాకప్రయత్నాలు - హాలికుల శృంగారం - రెడ్ల - రాకుమారుల స్థితులు.

ఇదంతా మానవ ప్రపంచం.

వర్ణనమంతా ఒక విచిత్ర తన్మయతాదశనుండి పుట్టినట్లుంది.కనుకనే పాఠకునికీ అదే అనుభవం-వానలో మునిగి తడిసిపోయినట్లు.

ఈ వర్ణనలో ప్రత్యేకత మరొకటి. ఒక ప్రణాళిక ప్రకారం వర్ణించటం. వాల్మీకి ఏనుగులు, ఆబోతులు- భృంగాలు - వర్షర్తువులోనే ఉన్నట్లు వర్ణిస్తే, రాయలు శరదృతువులోకి మిగుల్చుకొన్నాడు. మరీ భృంగాల వర్ణన వసంతంలోనే చేయటం. ఇది ఇతర కవుల్లో ఈ ప్రత్యేకత కన్పించదు.

ఈ వర్ణన - వసంత వర్ణనలాగా గ్రహాగతిని ముందు వర్ణించి, తర్వాత దాని కార్యమైన ఋతువర్ణన చేయటం. ఇతర ఋతువర్ణనల్లో ఈ పద్ధతిలేదు. ఆషాడంలో పడే ఉబ్బచినుకులతో ప్రారంభమై శ్రావణం వచ్చే సరికి జడివానలు మొదలైనాయి. ఈ క్రమవిన్యాస మొకటి చాలా సొగసైనది.

సన్నిహితంబులగు (చూ 75 వచనం) వానకాలమప్పుడే ప్రారంభమైన దనటాని కిది సూచన. తర్వాత క్రమంగా ముమ్మరమైనది. ఈ దశాపరిణామం పద్యాల్లో భావించవచ్చు. వర్ణనం సొగసు ఉదాహరణకు అడవులను వర్ణించటం ప్రారంభిస్తే అక్కడి జంతువులూ - చెట్లూ చేమలనే వర్ణించటం.తర్వాత ఊరు - పొలాలు - ఇలా ఉంటుంది. తర్వాత మరొక విషయం.

గ్రీష్మం హఠాత్తుగా వస్తే - వర్షఋతువు దశలమీదుగా పరిణమించింది. 77 నుండి 85 దాకా క్రమోన్మీలన సౌందర్యం చూచుకోవాలి. 91వ పద్యంలో చివరివాక్యం సౌధాగ్రశిఖరమైతే పద్యమంతా దానికి కట్టిన మెట్లుగా సంభావించాలి.

ఈ దృష్టి ఈ వర్ణనకు కుంచెకోల.

### వర్షాకాల వర్ణనము

ఉ॥ కర్కశుఁ డంట కోర్వ, కుదకంబులు వాఃపతిగూర్చినట్లు న
య్యర్కుఁడుఁ దానుఁగూర్చి, మఱి యా సలిలాధిచిహ్న వాహతం
బేర్కలగంగ నాతఁ డెలమి న్మకరస్థితిఁ గన్న నీర్ష్య, దాఁ
గర్కటకస్థుఁ డయ్యెననఁ, గర్కటకస్థితిఁ గాంచె నత్తఱిన్. 76

అత్తఱిన్ = ఆ వానకాలంలో;అర్కుడు = సూర్యుడు; కర్కశుడు = కఠినుడు; అంటకున్= లోకులు అనడానికి; ఓర్వక = సహింపక; ఉదకంబులు = నీళ్ళు; వాఃపతి = నీటికి అధిదేవత- వరుణుండు; కూర్చినట్లు = సమకూర్చినట్లుగా, తానున్ = ఆ సూర్యుడున్; కూర్చి= సేకరించి; మఱి = ఇంక; ఆ సలిలాధిప = ఆ నీటికి అధిపతియైన వరుణినియొక్క; చిహ్న = గుర్తైన; వాహతన్ = వాహనం కలిగియుండుట; పేర్ కలగంగన్ = పేరు పొందిన గంగయందు; ఎలమిన్ = సంతోషంతో; మకరస్థితిన్ = మొసలితనమును; కన్నన్ = పొందగా; ఈర్ష్యన్ = వరుణునిపై అసూయతో; తాన్ = సూర్యుడు; కర్కటకస్థుడు = ఎండ్రకాయరాశియందున్నవాడు; అయ్యెన్= అయినాడు; అన్నన్ = అన్నట్లుగా; కర్కటస్థితిన్ = కర్కటరాశియందుండడం; కాంచెన్= పొందెను.

ఎండకాలములో సూర్యుడు కర్కశుడన్న అపఖ్యాతిపొందినందువల్ల దానికి కంటగించి జలనాథుడైన వరుణుడు చల్లనివాడు అన్న పేరున్నది కనుక ఆ పేరు తానుతెచ్చుకోవాలని అత డేవిధంగా జలాలు కూడబెట్టుకుంటాడో అలాగే తానూ సమకూర్చుకొని ఇంకా పోటీగా ఆ వరుణునకు గంగావాహనమైన మొసలి,భర్తయైన వరుణునకు వాహనమైనది. సూర్యుడు కూడా అలాగే తాను కర్కాటకమును వాహనంగా చేసికున్నాడో అన్నట్లుగా ఆ రాశియందు ప్రవేశించినాడు.

విశే॥ సూర్యుడు మకరరాశిలో నుండి కర్కాటకరాశిలోకి ప్రవేశించాడు. అంటే వర్షాకాలం ఆరంభమైందని తాత్పర్యం. ఇది చాలా క్లిష్టమైన కల్పన.

తే॥ వనతతి వరాహ వాహారి వాయుభుగ్వి
రోధివారణ వర్షాభులాధిఁదొలఁగె

నెండ్రి రవిచేర; మూఁడవ యెడకుఁ జేర
తరణి ధరణిం బ్రమోదసంధాయి గాఁడె ? 77

ఎండ్రిన్ = కర్కాటకరాశి; రవి = సూర్యుడు; చేరన్ = చేరగా; వనతతి = అడవుల గుంపులు; వరాహ = పందులు; వాహ+అరి = గుర్రాలకు శత్రువులైన దున్నలు; వాయుభుక్ = గాలిని తినే పాములకు; విరోధి = శత్రువు; వారణ = ఏనుగులు; వర్షాభులు = కప్పలు; ఆధిన్ = మనోవ్యాధిని; తొలఁగెన్ = విడిచిపెట్టెను; ధరణిన్ = లోకంలో; మూడవ+ ఎడకున్ = జన్మరాశినుండి మూడవరాశిని చేరే; తరణి= సూర్యుడు; ప్రమోద = సంతోషం; సంధాయి = కూర్చేవాడు; కాడె = అవునుకదా !

వనము మొదలైన వానియొక్క జన్మరాశియైన వృషభమునకు మూడవదైన కర్కాటకములో సూర్యుడు ప్రవేశించినంతనే వాని మనోవ్యాధి తీరిపోయింది. జన్మరాశికి మూడవరాశిలో ఉండే సూర్యుడు శ్రేయస్సును కలిగిస్తాడు కదా !

విశే ॥ జన్మనక్షత్రం తెలియనపుడు దానికి బదులుగా నామనక్షత్రాన్ని అవలంబించడం జ్యోతిశ్శాస్త్రంలో ప్రసిద్ధమైన విషయం. జన్మరాశికి మూడవరాశిలో సూర్యుడుంటే మేలు జరుగుతుందని అదే శాస్త్రం చెబుతుంది. కర్కాటకరాశి వృషభానికి మూడవది. మొదటి అక్షరము 'వ'. ఇది రోహిణి నక్షత్రము ఇది వృషభరాశిలోనిది. దీనిపై ఆధారపడి కల్పించిన క్లిష్టకల్పన. ఈ రెండూ జ్యోతిశ్శాస్త్రాధారంపై చేసిన కల్పనలే.

తే ॥ వనధిగమనజగర్భార్కజనిత ఘృణులు
మఱి ప్రసూతికి నతని ధామంబుఁ జేరె;
ఘనతఁ జొచ్చినయిండ్లను దనయ లుండి
కాన్పునకుఁ బుట్టిని ల్చేరు క్రమము గనమె ? 78

వనధి = సముద్రునియొక్క; గమన = పొందడం వల్ల; జ =జన్మించిన; గర్భ = మూలుకలది అయిన; అర్క = సూర్యునివల్ల; జనిత = పుట్టిన; ఘృణులు = కిరణాలు; మఱి = మరల, ప్రసూతికిన్ = కాన్పుకు (వర్షించడానికి); అతని = సూర్యునియొక్క; ధామంబు = ఇంటిని; చేరెన్ = చేరినాయి; ఘనతన్ = ఘనంగా; మేఘత్వంచేత; చొచ్చిన యిండ్లన్ = మెట్టిన ఇళ్ళలో; ఉండి = నివసించి; కాన్పునకున్ = ప్రసూతికి; పుట్టినిల్లు = కన్నవారిల్లు; చేరుక్రమము = చేరేపద్ధతిని; కనమె = ఎరుగమా ?

సూర్యకిరణాలు సముద్రాన్ని ప్రవేశించి నీరు త్రాగడమే గర్భం ధరించడం. ఆ కిరణాలు తిరిగి సూర్యుని ప్రవేశించడమే ప్రసూతికి పుట్టినిల్లు చేరడం. అంటే సూర్యుడు సముద్రజలాలను త్రాగి వర్షిస్తున్నాడని భావము. (సూర్యకిరణం సముద్రజలం త్రాగి మేఘమై నింగికెగసిందన్న భావమే ఇలా కల్పింపబడినది ఈ మేఘరూపార్థంలోనే ఘనతన్ - అనబడినది. (క్రింది పద్యంలో ద్విజతన్ లాగా)

అలం : అర్థాంతరన్యాసము.

తే ॥ ఉర్విc గాదంబినుల యల యుమ్మనీరు
దొరుఁగఁ గేకులు కేకులు తోన సేసె,
ద్విజత నారణ్యకధ్వని వినఁగఁ జేసి
గర్భము సుఖచ్యుతము సేయఁ గడఁగె ననఁగ. 79

ఉర్విన్ = భూమిపై; కాదంబినుల = మేఘాలయొక్క; అల = ప్రసిద్ధమైన; ఉమ్మనీరు = మావినీరు (ఉబ్బనీరు); తొరుగన్ = స్రవించగానే; కేకులు = నెమళ్ళు; ద్విజతన్ = తాము పక్షులు కావడంవలన (బ్రాహ్మణులు కావడం వల్ల); ఆరణ్యకధ్వనిన్ = ఆరణ్యకములు అన్న వేదభాగాంయొక్క; (మంత్రధ్వని), వినగన్ చేసి = విన్నందువల్ల; గర్భము = మేఘాల చూలు; సుఖచ్యుతమున్ = సుఖంగా జారినదిగా; చేయన్ = చేయడానికి; కడగెన్ + అనగన్ = పూనుకొనెనో అన్నట్లుగా; తోన = వెంటనే; కేకలు చేసెన్ = సంతోషంతో కేకలు వేసినవి.

మేఘాలు ఉబ్బనీరు స్రవించినంతనే నెమళ్ళు కేకలు వేయడం ప్రారంభించాయి. ఇది ఎలా ఉన్నదంటే వేదభాగాలైన ఆరణ్యకాలు ద్విజులు (కేకులు) చదివినందువల్ల సుఖప్రసవం జరిగినట్లున్నది.

విశే ॥ అరణ్యాల్లో చదివేది కనుక ఆరణ్యకమని అర్థము. వాటిని ఇళ్ళలో చదవరు. ఎందుకంటే ఆరణ్యక ధ్వని వల్ల స్త్రీలకు గర్భస్రావమవుతుందట. ప్రసవం కాని సందర్భాలలో ద్విజులు ఆరణ్యాకలను పరిస్తే సుఖప్రసవం కలుగుతుందని సంప్రదాయము. ప్రసవ ప్రారంభంలో మావిసంచి నుండి ఉమ్మనీరు కారడమన్నది లోక సహజమైన విషయం. ఈ అర్థంలో ఉమ్మ- ఉబ్బ శబ్ద భావము. మావి అని అర్థం.

వర్షాప్రారంభంలో వేసవికాలం చివర ఉబ్బ (ఊష్మభవం) చినుకులు పడటం సర్వసాధారణం.

''పొనపొన పది ఉబ్బ చినుకులు పడి రేపుకారాలు మిరియాలు నూరిపోసే'' (తెలుగు బుతువులు)

దీర్ఘగ్రీష్మానంతరం నాలుగు ఉబ్బచినుకులు పడేటప్పటికి నెమళ్ళు కూయడం ప్రారంభించాయి. ఆ కూతలే ఆరణ్యక ధ్వనులు.

అలం : ఉత్ప్రేక్ష.

మ ॥ అల పర్జన్యుఁడు భానుఁ డన్కొలిమిలో 'నభ్రంపుఁ బెన్కొప్పెరన్
జల మాఁగన్ బిడుగుక్కు జాత్యపు టయస్కాంతపు నత్తున్కలో
పలఁ జూపన్ మహిమీఁదిలోహరజముల్ పైఁబర్వెనా, లేచె వా
త్యలఁ బ్రాగ్దావమసు ల్మొగి ల్మొదల గ్రద్దంతై దివిన్ లేచినన్. 80

పర్జన్యుడు = దేవేంద్రుడు (కమ్మరి); భానుడన్ = సూర్యుడన్న; కొలిమిలో = కొలిమిలోపల; అభ్రంపున్+ పెన్+కొప్పెరన్ = ఆకాశమన్న పెద్ద గంగాళానికి; జలము+ ఆగన్ = నీటిని నిలువచేసుకోవడానికి; పిడిగు+ఉక్కు = పిడుగన్న ఉక్కును; జాత్యపు = జాతికలదైన; అయస్కాంతపు = సూదంటురాయియొక్క; అతున్కన్ = ముక్కన్; లోలపన్ = గంగాళము లోపల; చూపన్ = తాకించగానే,

మహిమీంది లోహరజముల్ = భూమిపైనున్న ఇనుపరజము; పైన్ = పైకి; పర్వెన్‌నాన్ = వ్యాపించినదో అన్నట్లుగా; మొగిల్ = మబ్బు; మొదలన్ = ముందు; గ్రద్ద+ అంతయ్యై = గ్రద్ద అంతగా; దివిన్ = మింటిపై; లేచినన్ = లేవగానే; వాత్యలన్ = సుడిగాలుల్లో; ప్రాక్ = మునుపటి (వేసవికాలంలో); దావ = కార్చిచ్చుయొక్క; మష్యల్ = మసిలు; లేచెన్.

సూర్యుడుండగానే గ్రద్దంత మబ్బు ఆకాశంలో ఏర్పడింది. వెంటనే గాలి వీచింది. దానివల్ల వేసవి కార్చిచ్చులో కాలిపోయిన అడవుల మసి ఆకాశమంతా క్రమ్మింది. ఇది ఎలాగున్నదంటే సూర్యుడొక ముద్దకొలిమి గుండం. ఆకాశం పర్జన్యదేవత నీరు నిల్వ చేసుకొనే పెద్ద గంగాళం. ఆ గంగాళం తుప్పుపట్టి చిల్లు పడిపోయింది. అందుకని సూర్యుడన్న కొలిమిలో ఆ గంగాళాన్ని పెట్టి పిడుగన్న సూదంటురాయి ఉక్కుముక్కను అతికించాడు. వెంటనే భూమి మీదనున్న ఇనుపరేణువులు ఆ సూదంటురాయికి ఆకర్షింపబడి పైకిలేచినట్లున్నవి.

అలం : ఉత్ప్రేక్ష.

తే ॥ ఇలకు డిగి, చుట్టిచుట్టి, దుమ్మెత్తి, యెగసి
పోయి, తము ముంచు సుడిగాలి పుష్కరములఁ
గడలి నీ రభ్రకలభముల్గ్రాఁసె, ధరణి
నభ్రకరిశిక్ష దివిఁ గాంచినట్టి కరణి. 81

ఇలకున్ = నేలకు; డిగి = దిగి; చుట్టిచుట్టి = చుట్టలుగా చుట్టుకొని; దుమ్ము = రజస్సు; ఎత్తి = పైకెత్తి; ఎగసిపోయి = పైకిలేచిపోయి; తమున్ = మేఘాలన్న గున్న ఏనుగులను; ముంచు = ముంచే; సుడిగాలి పుష్కరములన్ = సుడిగాలి అన్న ఏన్గుతొండములయొక్క చివళ్ళతో; అభ్రకలభముల్ = మేఘాలన్న గున్న ఏనుగులు; దివిన్ = ఆకాశంలో; అభ్రకరిశిక్షన్ = స్వర్గలోకమందలి ఐరావతముయొక్క; (శిక్షణ పొందినట్లుగా); ధరణిన్ = నేలపై; కడలి నీరు = సముద్రపు నీరు; క్రాసెన్ = గ్రక్కెను.

సుడిగాలి ఏనుగుతొండాల చివరిభాగాలు. వాటితో మేఘాలన్న గున్న ఏనుగులు సముద్రపు నీటిని త్రాగి భూమిపైకి చిమ్ముతున్నవి. ఇది చూస్తే స్వర్గలోకంలో ఐరావతాది గజముల దగ్గర మంచి శిక్షణ పొందినట్లుగా ఉన్నవి. సుడిగాలి దుమ్మును చుట్లు చుట్లుగా పైకి తీసుకొని పోతున్నది. పైనుండి మబ్బులు వర్షిస్తున్నాయి. ఈ దృశ్యం స్వాభావికమైన విషయము. ఏనుగు నీటిని తొండంతో పీల్చుకొని వీపు మీద చిమ్ముకుంటుంది. మరలా మట్టిలో పొర్లుతుంది. ఇదే గజస్నానమంటే. ఈ స్వాభావికాంశం ఆధారంగా ఈ కల్పన వచ్చింది.

అలం : ఉత్ప్రేక్ష.

తే ॥ కృత పయఃపాన నవమేఘపృథుకములకు
రాలె నొయ్యన వడగండ్ల పాలపండ్లు

మఱి బలాకాద్విజాళి సంప్రాప్తి గలిగెఁ
బెరుఁగఁ బెరుఁగంగ ధ్వనియు గంభీర మయ్యె. 82

కృత = చేయబడ్డ; పయఃపాన = పాలు ( నీరు) త్రాగటం; నవ = కొత్త; మేఘ = మబ్బులన్న; పృథుకములకున్ = పిల్లలకు; ఒయ్యనన్ = క్రమంగా; వడగండ్ల పాలపండ్లు = వడగండ్లన్న లేతవయస్సులో దంతాలు; రాలెన్ = ఊడిపోయాయి; మఱి = ఇంక; బలాకాద్విజ+ ఆళి = బెగ్గురుపక్షులన్న దంతాలయొక్క; సంప్రాప్తి = లాభము; కలిగెన్; పెరుగన్+ పెరుగంగన్ = క్రమంగా పెరిగినకొద్ది; ధ్వనియున్ = శబ్దము కూడా; గంభీరము + అయ్యెన్ = పెద్దదైనది.

వర్షాకాలం కనుక వడగండ్లు రాలుతున్నాయి. ఆకాశంలో బెగ్గురు పక్షుల బారులు ఎగురుతున్నాయి. క్రమక్రమంగా మబ్బులు, ఉరుములు ఉరమడం ప్రారంభించాయి. ఇది సహజమైన దృశ్యం. ఇది ఎలా ఉన్నదంటే పిల్లమబ్బులకు క్రమంగా పాలపండ్లు రాలిపడిపోయి మరలా కొత్తపళ్ళవరుస వచ్చినట్లున్నది. ఈ రెండవపండ్ల వరుస బలాకలు. పాలపండ్లని ఒక అడవిజాతి పండ్లుకూడ ఉన్నాయి. అవి వానకాలం లోనే వస్తాయి. దీనినే కవి ఉత్ప్రేక్షిస్తున్నాడు.

అలం : రూపకం.

మ ॥ తనతోయంం బినరశ్మి లెత్త, నిల వాత్యారేణు మూర్తిన్ మహేం
ద్రునకుం జెప్పఁగ, ముచ్చుఁబట్ట దివమందు న్విల్ఘటింపం భయం
బునఁ దద్రశ్మిసహస్రము ల్వెసదిగెంబోఁడాఁగి వేఁగుమ్మరిం
ప, ననం ధారలు దోఁచె మించు వెలిగింప న్మబ్బులన్ వెల్లిపై. 83

ఇల = భూమి; తనతోయంబు = తనయొక్క నీరు; ఇనరశ్మిలు = సూర్యకిరణాలు; ఎత్తన్ = ఎత్తుకొనిపోగా; వాత్యారేణుమూర్తిన్ = సుడిగాలి కెగిరిన మన్నురూపంతో; (నేలమట్టి కనుక): మహేంద్రునకున్ = రాజైన దేవేంద్రునకు; చెప్పగన్ = నివేదించగా; (ఆ ఇంద్రుడు); ముచ్చున్ + పట్టన్ = దొంగను పట్టుకోవడానికి; దివమందు = ఆకాశంలో; విత = ధనుస్సును; ఘటింపన్ = ధరిస్తే; భయంబునన్ = భయంతో; తత్+రశ్మిసహస్రముల్ = ఆవేయికిరణాలు; వేన్ = వడిగా; క్రుమ్మరింపన్ = ఒకేసారి బోర్లించగా; డాగి = దాగుకొని; దిగెన్+ పో = నేలపైకి దిగెను సుమా; అనన్ = అన్నట్లుగా; మబ్బులన్ = మబ్బులచాటునుండి; మించున్ = మెరుపును;వెలిగింపన్ = వెలిగించగా; వెల్లిపైన్ = నీటిమీద; ధారలు = నీటి ధారలు; తోచెన్ = కనిపించాయి. (ఎత్తన్ = ఎత్తుకోవటం - తీసుకోవడమన్న అర్థంలో రాయలసీమ మాండలికం)

లోకంలో దొంగతనం జరిగితే రాజుగారికి ఫిర్యాదు చేయడం, ఆ రాజు దొంగను పట్టుకోవడానికి ఆయుధం ధరించిపోవడం, అది తెలిసి దొంగ ఎవరికీ తెలియకుండా దొంగలించిన ధనాన్ని ఏ ఇంటియందు తెచ్చాడో ఆ ఇంటిలోనే పడవేయడం అప్పుడు యజమాని దీపం వెలిగించగానే దొంగ తెల్లమొఖం వేయడం ఇదంతా లోకవిషయం. నేలమీదున్న నీటినంతా సూర్యకిరణాలు దొంగలించాయి

భూదేవి మట్టిరూపంలో సుడిగాలికి లేచి పైకిపోయి రాజైన దేవేంద్రునితో మొరపెట్టుకోగా, ఆ దొంగను పట్టుకోవడానికి రాజు తన ధనుస్సును ఎక్కుపెట్టాడు. అది చూచిన కిరణాలు రహస్యంగా మబ్బులలో దాగి దొంగలించిన నీటినంతా ఒకేసారి క్రుమ్మరిస్తున్నాయి. వెంటనే మెరుస్తున్న దీపం వెలిగింది. నేలంతా నీటివెల్లువమయంగా ఉన్నదని భావము. ఈ భావము రాయలవారిలో ఉన్న ధర్మరక్షణరూపమైన ప్రభుత్వాన్ని వ్యక్తీకరిస్తున్నది. రాజు మనసునుండి పుట్టిన భావమన్నమాట. ఈ విధంగా ఆత్మీయవ్యక్తిత్వం ఈ కావ్యంలో పద్యభావం మాటున దాగి ఉండటం చాలాచోట్ల కనిపిస్తున్నది.

తొలి చినుకులు పడగానే సుడిగాలి లేవడం, దుమారం రేగడం, ఇంద్రధనుస్సు కనిపించటం, మెరుపులు మెరవటం, ఆ మెరుపుల్లో వానధారలు తళుక్కని మెరవడం చాలా స్వభావోచితక్రమంలో సంఘటించబడుట రమణీయంగా ఉంది. (80వ పద్యం మొదలుగా)

చ ॥ తొలి తొలి వచ్చుధారల నెదుర్కొని, తచ్ఛటఁ దీఁగచుట్టుగా
నలముచు, ధాత్రి లేచి, పొలుపారె మలీమసబాష్పవల్లు ల
త్తొలి తొలిధారకే వెఱచి, తోన ఘనౌఘము వానకాళ్లకుం
బలరిపుఁ డా లయాభ్రముల భంగినె సంకెల లూన్చెనో యనన్. 84

మలీమసబాష్పవల్లులు = దుమ్ముకొట్టుకున్న ఆవిరి కన్నీటితీవలు; ధాత్రిన్ = భూమిపైలేచి; తొల తొలి = మొట్టమొదటిగా; వచ్చుధారలన్ = దిగుతున్న ధారలు; ఎదుర్కొని = లేచి ఎదురుగావెళ్ళి; తత్ = ఆధారల; ఛటన్ = గుంపును; తీగచుట్టగాన్ = తీగచుట్టినట్లుగా; అలముచున్ = అలముకొంటూ; బలరిపుడు = దేవేంద్రుడు; (బలుడన్న రాకాసిని చంపినవాడు); ఆ తొలి తొలి ధారకే = మొట్టమొదటి ధారలకే; వెఱచి = భయపడి; తోనన్ = వెంటనే; ఘన = మబ్బుల; ఓఘము = గుంపుయొక్క; వానకాళ్ళకున్ = వర్షధార లన్నకాళ్ళకు; ఆ = ప్రసిద్ధమైన; లయ+అభ్రముల = ప్రళయకాలమేఘాల; భంగినె = విధంగా; సంకెలలు = ఇనుప సంకెళ్ళు; ఊన్చెనో = తగిలించినాడో; అనన్ = అన్నట్లుగా; పొలుపారెన్ = అందగించెను

మబ్బులనుండి మొట్టమొదటి చినుకులు నేలకు జారగానే నేలనుండి నల్లని ఆవిరి పైకిలేచి ఆ వర్షధారల అడుగులకు తీగలు చుట్టుకొన్నట్లు చుట్టుకొన్నవి. ఇది ఎలా ఉన్నదంటే ప్రళయకాలంలో మేఘాలు కురిసి లోకాన్ని ముంచివేస్తాయి. అలా జరగకుండా ఇతరకాలాల్లో ఇంద్రుడు వాటికి సంకెళ్ళు వేసి బంధిస్తాడు. అలాగే ఇప్పటి మేఘాలు కురిసిన మొదటి నీటిధారలకే భయపడి ఇంద్రుడు మేఘాలకు సంకెళ్ళను తగిలించినట్లుగా ఆవిరిచుట్టలు పడిన వానధారలకు చుట్టుకొంటున్నవి. ఇవే సంకెళ్ళు.

విశే ॥ మొదటి చినుకు పడగానే ఆవిరిలేవటం చాలా సహజమైనఅంశము. దానిపై కట్టిన ఉత్ప్రేక్ష ఇది.

చ ॥ ఎడపక మున్ను మింటిపయి నే తగులంబును లేక మూకతన్
వెడలెడు చోఁ గఠోర ఘనబృందము లడ్డము పడ్డ, వానిమే
యిడియ జవోష్మఁ బాఱెడు రవీందుల దట్టపు బండికండ్ల చ
ప్పుడు గతి, మ్రోసె రేపగలు భూరి భయంకర గర్జ లత్తఱిన్. 85

ఎడపక = ఎడతెగకుండా; మున్ను = పూర్వము; మింటిపయిన్ = ఆకాశంలో; ఏ తగులంబును = ఏ అడ్డమున్నూ; లేక = లేకుండా; మూకతన్ = నిశ్శబ్దంగా; వెడలెడుచోన్ = వెళ్ళేటపుడు; కఠోర = కఠినమైన; ఘన = మబ్బులు; బృందములు = గుంపులు; అడ్డము పడ్డన్ = అడ్డుపడగా; వానిమే = వానిశీరాలు; ఇడియన్ = చీలిపోయేటట్లుగా; జవ = వేగముయొక్క; ఊష్మన్ = వేడిమితో; పాఱెడు = పరుగెత్తే; రవి+ ఇందుల = సూర్యచంద్రుల; దట్టపు = దృఢమైన; బండికండ్ల = బండిచక్రాల; చప్పుడు = ధ్వని; గతిన్ = వలె; భూరి = అతిశయమైన; భయంకర = భయాన్ని కలిగించే; గర్జలు = గర్జనలు (ఉరుములు); అత్తఱిన్ = ఆ సమయంలో; రేవగలున్ = రేయింబవళ్ళు; మ్రోసెన్ = మ్రోగాయి.

పూర్వం (ఎండకాలంలో) ఆకాశంలో రవీందుల రథచక్రాలకు అడ్డులేదు. ఏకధాటిగా పరుగెత్తేవి. అలాంటివాటి కిప్పుడు కఠినమేఘాలగుంపు అడ్డుపడటం వల్ల వాటిని చీల్చుకొంటూ పరుగెత్తుతుంటే వచ్చే ధ్వనుల్లాగా భయంకర గర్జనలు రేయింబవళ్ళు విన్పిస్తున్నాయి. అవే బడబడమనే ఉరుముల చప్పుళ్ళు.

అలం : వస్తూత్ప్రేక్ష

విశే ॥ జవ + ఉష్మన్ = వేగంతో రాపిడినుండి పుట్టేది వేడిమి. అదే మెరుపు. రథచక్రాల వేగంనుండి పుట్టేది ఉరుము

చ ॥ దినముల వెంబడిం జడనిధి న్మును గ్రోలిన నీటిలోనఁ బే
రిన లవణంపు ఘట్టముల దృప్యదిరమ్మద దావము ల్తవు
ల్కొని పెటిలించునార్బటు లొకో, యనఁగా సతటిద్భయంకర
స్తనితముల౯ సృజించె నతిసాంద్రఘనాఘనగర్భగోళముల్. 86

అతి = మిక్కిలి; సాంద్ర = దట్టమైన; ఘనాఘన = మేఘాలయొక్క; గర్భగోళముల్ = గోళములవంటి కడుపులు; దినముల వెంబడిన్ = రోజులవెంట (దినక్రమంగా); మును = ముందు; జడనిధిన్ = సముద్రంలో; గ్రోలిన = త్రాగిన; నీటిలోనన్ = నీటిలోపల; పేరిన = పేరుకొన్న; లవణంపు = ఉప్పు; ఘట్టములన్ = అచ్చులను; దృప్యత్ = విజృంభిస్తున్న; ఇరమ్మద = మేఘాలలోని; దావముల్ = కార్చిచ్చు; తవుల్కొని = అంటుకొని; పెటిలించు = ఫెడిలుమని పగిలిపోయేటట్లుచేసే; ఆర్బటులు = ధ్వనులు; ఒకో = ఔనా!; అనన్ = అన్నట్లుగా; సతటిత్ = మెరుపుతో కూడిన; భయంకర = భయానక; స్తనితములన్= ఉరుములను; సృజించెన్ = సృష్టించాయి.

మిక్కిలి దట్టమైన మబ్బులు గోళాలవంటి కడుపుల్లోపల పటపటమన్న చప్పుళ్ళతో ఏవో పగులుతూ కాంతులీనుతున్నట్లు వెతలు విన్పిస్తున్నాయి. ఆ కాంతులు విద్యుత్తు మెరుపు. ఆ ధ్వని ఉరుము. వీటికి హేతువు లేమిటి ?

''క్రమంగా ప్రతిరోజూ మబ్బు సముద్రంనీరు త్రాగుతున్నది. ఆ నీరు మబ్బుల్లో పేరుకొని పోయి ఉప్పు అచ్చులుగా తయారైనవి. ప్రక్కనే మబ్బుల కడుపులో కార్చిచ్చులవంటి విద్యుదగ్నులున్నాయి.

ఈ ఉప్పుపెళ్ళలు ఈ నిప్పులో పడి పటపటమని ప్రేలిపోతుంటే, వెలుగులు బయటకు దూసుకొని వస్తున్నవేమో అన్నట్లుగా ఉరుములు, మెరుపులు వస్తున్నవి.

అలం : హేతూత్ప్రేక్ష = ఉప్పుటచ్చులు హేతువుగా చెప్పినందువల్ల

విశే ॥ అందమైన వర్ణన. మెరుపుతో పాటు వచ్చే ఉరుము లక్షణం. ఉప్పు నిప్పులో ప్రేలటం లాగా ఉంది.

మ ॥ ఇనరశ్ముల్ తృష వార్ధిఁజేరి జల మొక్కిం తాన, నాత్మోష్మఁజు
యుని వెంటం బొగ ముంచికో నెగసి, వాతాధూత తత్సంధులం
గన నొచుం గళదశ్రులై వడకురేఖం దిక్తట ప్రోత్థిత
స్తనయిత్నుచ్ఛటఁ జంచల ల్మెఱసె నాసారంబు దోరంబుగాన్. 87

దిక్తట = దెసలన్న బండ్లపై; ప్ర+ ఉత్థిత =పై కి వ్యాపించిన; స్తనయిత్నుచ్ఛటన్ = మబ్బులగుంపుల్లో; చంచలల్ = మెరుపులు; ఆసారంబు = జడివాన; తోరంబుకాన్ = ఎక్కువకాగా; మెఱసెన్ = ప్రకాశించాయి; ఎలాగంటే - ఇనరశ్ముల్ = సూర్యకిరణాలు; తృషన్ = దప్పికతో; వార్ధిన్ = సముద్రం; చేరి = కలిసి; జలము = నీరు; ఒక్క+ఇంత = కొంచెము; ఆనన్ = త్రాగితే; ఆత్మ = తమలోని; ఊష్మన్ = వేడికి (విద్యుదగ్నికి); చుయ్+అని = చుయ్‌మంటూ (వేడివస్తువు నీళ్ళలో ముంచితే వచ్చే ధ్వని కనుకరణ శబ్దం. ఇది 1-82లో చుయ్యని నాదారని కూరగుంపు అన్నచోట వచ్చింది); వెంటన్ = అనుసరించి; పొగ; ముంచికోన్ =క్రమ్ముకోగా; ఎగసి = పైకిలేచి; వాత+ అధూత = గాలికి బాగా చెదరగొట్టబడిన; తత్ = ఆ మేఘాల; సంధులన్ = సంధుల్లో; గళత్ = స్రవించే; అశ్రులై = బాష్పాలు కలవై; వడకురేఖన్ = వణికిపోతున్న విధంగా; కనన్ + అయ్యెన్ = కన్పిస్తున్నాయి.

క్రమంగా వానలు ముదురుతున్నవి. దిగంచలాల్లో మేఘాలగుంపులు త్రివిక్రమునిలాగా అంతా వ్యాపించాయి. వాటి కడుపుల్లో మెరుపులు తీవ్రంగా మెరవటమెలా ఉందంటే తమను క్రమ్ముకొన్నవి. ఇంతలో పెనుగాలి వీచింది. మబ్బులు చెదిరిపోయినవి. వాటి సంధుల్లో ఏడుస్తూ, కన్నీళ్ళు కారుస్తూ, వణికిపోతూ కన్పించాయి.

అలం : ఉత్ప్రేక్ష.

విశే ॥ చంచల - చలించేది = సూర్యకిరణాలు సముద్రజలాలను దొంగతనంగా త్రాగాయి కనుక మబ్బుల నడుమ వణికిపోతూ తప్పుచేసామన్నట్లు కన్నీరు కారుస్తూ తోచాయి. ఈ భయంతో వణకటం మెరుపులోని చంచలత్వం. మెరుపుల్లో వానధారలు కురవటం. అవి కార్చే కన్నీళ్ళు.

ప్రోత్థిత = శబ్దమే ఆకాశమంతా వ్యాపించిన మేఘాల భయంకర లక్షణాన్ని ధ్వనిస్తున్నది. స్తనయిత్ను = ఉరిమే మేఘం.

వాస్తవిక దృశ్యాన్ని భావనాలోకంలో ఫోటో తీయటం.

మ ॥ ఇలకుం గల్గిన జీవనంబుల నిజానిష్టోగ్రమార్తండ మం
డలమానం, దన వైరి వైరి సఖుఁడౌటం దద్రవిం బీల్చి, య
య్యిల కొక్కుమ్మడిఁ గ్రుమ్మరింపఁ దగుఁదా నెంతైన, నంతైన మం
డలమున్ రాహు పొసంగ దాల్చుగతి మింటం బర్వెఁ గాలాభ్రముల్. 88

ఇలకున్ = భూమికి; కల్గిన = సంభవిల్లిన; జీవనంబులన్ = నీళ్ళను; నిజ = రాహువునకు; అనిష్ట = శత్రువైన; ఉగ్రమార్తండ = సూర్యుని; మండలము = బింబం; ఆనన్ = త్రాగగా (త్రాగితే); తనవైరి = తనకు (రాహువునకు) శత్రువైనవానికి; వైరి = శత్రువు; సఖుండు + ఔటన్ = స్నేహితుడైనందున (రాహువు= కర్తృవాచకం) తత్ +రవిన్ = ఆ సూర్యుని; పీల్చి = త్రాగి; ఆ + ఇలకున్ = ఆ భూమికి; ఒక్క + ఉమ్మడిన్ = ఒకేసారిగా; క్రుమ్మరింపన్ = క్రుమ్మరించటానికి; ఎంత + ఐనన్ = ఎంత పెరిగితే; తగున్ = తగునో; అంత + ఐన = అంతగా పెరిగిన; మండలమున్ = బింబం; పొసంగన్ = తగునట్లు, తాల్చుగతిన్ = ధరించిన విధంగా; కాలాభ్రముల్ = నల్లని మబ్బులు; మింటన్ = ఆకాశంలో; పర్వెన్ = క్రమ్ముకొన్నవి.

ఆకాశమంతా నల్లని మబ్బులు అలముకోవటంచూస్తే రాహుమండలం పెరిగి పెరిగి గగనమంతా ఆక్రమించినట్లున్నది. ఎందుకంటే 'తన శత్రువునకు శత్రువు మిత్రు'డన్న రాజనీతి ప్రకారం తనకు శత్రువైన రవికి శత్రువు భూమి తనకు మిత్రురాలు. కనుక ఆమెకున్న సంపదయ్యైన నీటిని రవి అపహరిస్తే ఆ రవి పీల్చిత్రాగిన నీరునంతా ఒకేసారి క్రక్కించటానికై అలా పెరిగాడో అన్నట్లున్నాయి నల్లని మబ్బులు.

అలం : ఉత్ప్రేక్ష.

విశే ॥ 85,86 పద్యాలు ఉరుము వర్ణనలు. 87 - మెరుపులు, 88-కాలాభ్ర వర్ణనలు. ఈ క్రమం కవిభావనా విన్యాసాన్ని అభివ్యక్తీకరిస్తున్నది. ఒకే జాతి, భావన కల పద్యాలివి. భావం నుండి భావం క్రమవృద్ధి పొందే లక్షణం చెబుతున్నాయి. ఒక కవి ఊహాచక్రాన్ని చదవగలగడమే ఉత్తమ పాఠకలక్షణము.

85,86 చంపకమాల కాగా 87,88 మత్తేభాలు.

ఈ రెండు జంటల ఎత్తుగడలు (85,86) ఒకేరకంగా కాగా; 87,88 మరోరకం సమానంగా కన్పిస్తాయి. ఈ రూపసామ్యత భావసామ్యతకు చిహ్నం.

ఈ కవిలో ఈ పద్ధతి చాలాచోట్ల కన్పిస్తుంది.

తే ॥ పుట్టువెడలి నభోభిత్తిఁ బట్టు శక్ర
కార్ముకపుఁ బెద్ద పలువన్నెకట్ల జెట్టి
దైన నడచెడి కాళ్ళగుం పనఁగ, గాలి
గార్కొని దిగంతముల వానకాళ్ళు నడచె. 89

పుట్టన్ = వల్మీకమును; వెడలి = త్యజించి; నభోభిత్తిన్ = ఆకాశమన్నగోడను; పట్టు = పట్టుకొని; శక్ర = ఇంద్రుని; కార్ముకపు = విల్లనెడు; పెద్ద + పలువన్నెకట్ల జెట్టీ = అనేకరంగులుకట్లుగా కల జెట్టీయొక్క, నడచెడి = నడుస్తున్న; కాళ్ళగుంపు = చరణసమూహము; అనఁగన్ = అన్నట్లుగా; గాలి = వాయువు; కార్కొని = క్రమ్ముకొని; దిగంతములన్ = దిక్కులచివరకు; వానకాళ్ళు = వర్షధారలు; నడచెన్ = నడిచాయి.

దిగంతాలకు వానకాళ్ళు వేగంగా నడచిపోవటం చూస్తే పుట్టనుండి బయటకు వచ్చి ఆకాశమన్న గోడకు పట్టిన నడిచే వన్నెవన్నెల కట్లు మేనపై గల పెద్దరాకాసి జెట్టీకాళ్ళగుంపులాగా ఉన్నాయి.

అలం : రూపకాలంకారంతో కూడుకొన్న ఉత్ప్రేక్ష.

విశే ॥ ''వల్మీకాగ్రాత్ ప్రభవతి హి ధనుః ఖండ మాఖండలస్య'' అన్న మేఘసందేశ శ్లోకభావమే పద్యంలో మొదటి పాదంగా వచ్చింది. పుట్టనుండి ఇంద్రధనుస్సు పుట్టడమేమిటని ఆక్షేపిస్తే సాతప మేఘమే వల్మీకమన్నారు (ఎండతో కూడుకొన్న మేఘమని తాత్పర్యం), రాయలవారు వల్మీకార్థాన్ని గ్రహించి, అది ఇంద్రకార్ముకమన్న వన్నెల జెట్టీ అని ఉత్ప్రేక్షించినందువల్ల ఆక్షేపం నుండి బైటపడ్డాడు. (మేఘసందేశశ్లోకానికి ఈ రెండు రకాల అర్థాలున్నట్లు వ్యాఖ్యాతలు చెప్పారు. పుట్టనుండి ఇంద్రధనుస్సు పుట్టదు. ఈ ఆక్షేపంరాగా, **సాతపోమేఘః**, అని మరొక వ్యాఖ్యానం. కనుక రాయలవారు వల్మీకమంటే పుట్ట అని గ్రహించటం తప్పు అనటానికి వీల్లేదని భావము.

దిగంతాలకు వానకాళ్ళు నడవటం ఒడలు పులకించే దృశ్యము. ఆ వానకాళ్ళు ఆతపకాంతిలో, నీలమేఘాల కాంతితో కూడుకొన్న వెలుగులోనడుస్తున్నాయి. కనుక జెట్టీ కాళ్ళు ఈ భావనవల్ల రాయలవారు వల్మీకమంటే సాతపమేఘమన్న అర్థాన్నే గ్రహించారని తాత్పర్యము.

వానకాళ్ళు గాలివల్ల కంపిస్తూ నడుస్తాయి. ఇది వాస్తవిక దృశ్యమే. అలాగే జెట్టీకాళ్ళున్నూ, ఈ రెండురకాల కాళ్ళు గుంపుగా కన్పిస్తాయే తప్ప వేర్వేరుగా కనిపించవు. కనుక గుంపు అనటం సొగసు. చాలా అద్భుతమైన వర్ణన.

చ ॥ ఒక చినుకు న్ససస్య యగు నుర్వికి డిగ్గఁగ నీవు మూఁగి చా
తకము లటంచు లోఁ గనలి దట్టముగా నల మేఘుఁ డాడుచుం
డక చన నూఁదఁగాఁ దొరఁగు నాళపుటుండలు వోలె రాలెఁ ద
క్కక పడు వర్షధారల ముఖస్థములై కరకానికాయముల్. 90

మేఘుడు = పర్జన్యదేవత; చాతకములు = వానకోయిలలు; ససస్యయగు = పంటలన్న గర్భాన్ని ధరించిన; ఉర్వికిన్ = భూదేవి పైకి; ఒక చినుకున్ = ఒక్కచిన్కునుకూడా; డిగ్గఁగనీవు = దిగనివ్వవు; అటంచున్ = అంటూ; లోన్ = లోపల హృదయంలోనే; కనలి = కోపించి; ఆడుచున్+ ఉండక = (వానకోయిలలు) ఎగరకుండా (పిట్ట ఆడటం లేదు - పిట్టలాడే వేళ - అని వ్యవహారం); చనన్ = తొలగిపోగా; ఊదగాన్ = నోటితో ఊదితే; తొరగు = పడు; నాళపు+ ఉండలు = గొట్టపుటుండలు (గొట్టంనుండి ఊదే మట్టి

ఉండలు); పోలెన్ = వలె; తక్కక = ఎడతెగక; పడు = పడుతున్న; వర్షధారలు = వానధారలయొక్క; ముఖస్థములై = ముఖమందుండి; కరకానికాయముల్ = వడగళ్ళగుంపులు; రాలెన్ = రాలాయి.

ఆకసంలో చాతకపక్షులు మూగిపడే వానధారలను త్రాగుతూ వాటిని క్రిందికి పడనివ్వనంతగా గుంపులై మూగాయి. భూదేవి సస్యగర్భాన్ని ధరించి వర్షాని కెదురుచూస్తున్నది. ఇది చూచి మేఘుఁడు వానకోయిలలను చెదరగొట్టడానికి నాళపు ఉండలను ఊదుతున్నాడేమో అన్నట్లుగా వర్షధారలు ముఖాలనుండి వడగళ్ళు రాలుతున్నాయి.

వడగళ్ళు నాళపుటుండలు. నాళం = వానధార; మేఘుఁడు = వేటకాడు; ఇదొక రకమైన పక్షి వేట.

లోకంలో వేటకాడు పిట్టలను చంపుతున్నాడు. ఇక్కడ మేఘుడు ఆర్ద్రహృదయుడు కనుక వాటిని చెదరగొట్టే ప్రయత్నమే దప్ప, కూల్చే ప్రయత్నంకాదు- కనుకనే ఆడుచుండన్ చనన్- అన్నాడు కవి. భావాన్ని కట్టడంలో కవి తీసుకొనే జాగ్రత్త గమనించాలి. జాలిగుండెగల వ్యక్తిగా మేఘుని చిత్రించటంలో ఇది వ్యక్తమౌతున్నది. వేట నాధారంగా చేసుకొని కల్పించిన భావము.

సీ ॥ ఎలగోలుజల్లు మున్నెళపెళ నేట వా
ల్పడి గాలి నట్టిండ్లయు దడిపి చనఁగ;
నట్టైతో వడగండ్ల కట్టావులు దుమార
మాపులు రేఁచి రెండవదియుఁ జన;
మఱి మూఁడవది నిల్చి మెఱసి బిట్టుఱిమి శీ
కరవారి సృష్టిఁ జీఁకటిగ నలమ,
నుయ్యేలచేరుల యోజఁ బైపై వెండి
జల్లుపై జల్లుపెల్లల్లుకొనఁగ;
తే ॥ భూభిదాపాది దుర్భరాంభోభరంపు
వడి మరుజ్ఝంఝఁ దెరలక కడవ వంచి
నట్లు హోరని ధారౌఘ మైక్య మొంది
విన్ను మన్నును నొకటిగా వృష్టి బలిసె. 91

ఎలగోలు జల్లు = ముందుగా వచ్చినవానజల్లు; ఎలగోలు మూక= సేనలో ముందున్న గుంపు పెళపెళమంటై (ధ్వన్యనుకరణం); ఏటవాల్పడి = ఏటవాలుగా పడి (జల్లుపడటం వ్యవహారంలో ప్రయోగమే); గాలిన్= గాలివల్ల; నట్టిండ్లన్ = (నడు+ ఇల్లు = నట్టిల్లు) గృహాంతర్భాగాలను కూడా; తడిపి = తడిచేసి; చనఁగన్ = పోగా.

ఒక ఎలగోలు జల్లు ముందుగా వచ్చింది. గాలికూడా వెంటబెట్టుకొని, ఆ గాలి దీన్ని ముందుగా ఏటవాలుగా ఈడ్చుకొని నట్టింట్లో ప్రవేశించింది. ఇంకేముంది ? అంతా తడి

రెండవదియున్ = రెండోజల్లు కూడా; అట్టితోన్ = ఆ మొదటిదానితో పాటుగానే; వడగండ్ల = వడగళ్ళు, కట్టావులు = (కడు + ఆవులు) =మిక్కిలి ఆవిరులను; దుమారమున్ = దుమ్మును; ఆవులన్ = నేలపై చినుకురాగానే వచ్చే ఆవిరులను; రేచి = రేగగొట్టి; చనన్ = పోగా.

మొదటిజల్లు పోయిందో లేదో రెండోజల్లు రాలిన వడగళ్ళ ఆవిర్లా, దుమ్ము - దుమారమూ నేల ఆవిర్లకు రేపుకొంటూ పోయింది.

మఱి మూడవది = ఇక మూడవదంటే; నిల్చి = నిలబడి (పై రెండూ నిలబడక వచ్చిపోయాయి), మెఱసి = మెరుపులు ప్రకాశింపజేసి ; బిట్టు + ఉఱిమి = గట్టిగా ఉరిమి, శీకరవారిన్ = తుంపర్ల నీరు; సృష్టిన్- సృష్టించి;(సృజ్- స్రవింపజేయటం, లోపల ఉన్నదాన్ని బహిర్గమింపచేయటం); చీకటిగన్ = చీకటికాగా; అలమన్ = క్రమ్మగా, (సృష్టిన్ = విశ్వాన్నంతా తుంపర్ల వాన చీకట్లు క్రమ్మింది).

మూడోది చనక నిలబడి మరీ మెరుపులతో, ఉరుములతో, వానధారలతో చీకట్లు క్రమ్మింది.

వెండి = మరలా= వెండివంటి;జల్లు పై జల్లు = జల్లు మీద జల్లు గా; ఉయ్యేల చేరుల యోజన్= ఉయ్యాల వెండి గొలుసుల్లాగా; పైపైన్ = మీద మీద; పెల్లు = అధికంగా; అల్లుకొనఁగన్ = అల్లుకోగా.

ఇంక తర్వాత వెండిజల్లులు పైపై క్రమ్మి ఉయ్యేల వెండి గొలుసుల్లాగా ఒక దానితో మరొకటి పెనవేసుకున్నవి.

భూ = నేలను; భిదాపాది = చీల్చే, దుర్భర = భరింపరాని; అంభోభరంపు = నీటి బరువు; వడిన్= వేగంతో; జడిన్ = జడివానతో; మరుత్+ ఝుంఝున్ = వేగవంతమైన గాలిలో; తెరలక = ఆగకుండా; కడవ వంచినట్లుగా ; హోరు+ అని = హోరుమంటూ; ధారా+ఓఘము = ధారల సమూహం; ఐక్యమొంది= కలిసిపోయి; మిన్ను మన్నునున్ = భూమ్యాకాశాలు; ఒకటిగా = ఏకమైనట్లుగా; వృష్టి = వాన; బలిసెన్ = వృద్ధిపొందినది.

భూమినము చీల్చే భరింపరాని నీటి బరువుయొక్క వేగంతో కడవ వంచినట్లు వానధారలు అన్నీ ఏకమై హోరుమంటూ కురుస్తున్నవి. అప్పుడు భూమ్యాకాశాలు విడిగానుండటం కన్పించక ఏకమైనట్లు వానలు బలిసిపోయాయి.

**అలం :** స్వభావోక్తి

**విశే॥** అద్భుతవాస్తవిక వర్ణన. వానలో మునిగిపోయిన అనుభవాన్ని కల్గించటం వల్ల భావికాలంకార మనీ చెప్పవచ్చు.

వర్షాభివృద్ధిలో నాల్గంచెలు చెప్పబడటం 1-2-3 జల్లు; 4.వ పాదంలో జల్లులు - మెరుపుల వర్ణించి, ఎత్తుగతిలో వర్షం బలవటం చెప్పటం చిత్రంగా ఉంది.

మ॥ అల పర్జన్యుఁడు కేకిపాత్రములగుం పాడించుచో మేఘమం
డలపుఁ మద్దెల గ్రుంగి లేవను, మరున్మార్దంగికుం డర్థి నొ
త్త లలిన్ నేలకు వ్రాలుచు న్నెగయుచుం దారాడున త్తెల్లజ
ల్లులుఁ గెంగుచ్చులు నయ్యె, ధారలును దల్లోలేంద్రగోపంబులుఁ. 92

అల = ప్రసిద్ధుడైన; పర్జన్యుడు = వర్షాదేవత; కేకి = నెమళ్ళన ఆడించుచోన్ = ఆడిస్తున్నప్పుడు (నటింపచేసేవేళ); మేఘమండలపున్ మద్దెల = మబ్బుల గుంపున్న మద్దెలను; మరుత్ = గాలి అన్న; మార్దంగికుఁడు = మృదంగవాద్యకాడు; క్రుంగిలేవను = క్రిందికి వంచి పైకి లేచినట్లు; అర్థిన్ = ఆసక్తితో; ఒత్తన్ = ఒత్తగా; ధారలునున్ = వానధారలూ; తత్ = ఆధారల్లో; లోల = ఆసక్తికలదైన; ఇంద్రగోపంబులున్ = ఆర్ద్రపురుగులూ; లలిన్ = అందంగా; నేలకున్ = భూమిపైకి, వ్రాలుచున్ = వ్రాలుతూ; నెగయుచున్ = పైకిలేస్తూ; తారాడు = తారట్లాడు; ఆ తెల్లజల్లులు = పైన చెప్పిన వెండిగొలుసులవంటి జల్లులు, కెంపు+కుచ్చులు = ఎర్రని ఊలుకుచ్చులు; అయ్యెన్ = ఐనవి.

ఇంద్రుడన్న సూత్రధారుడు నెమళ్ళన్న నటులను ఆడిస్తున్నాడు. ఆ నాట్యానికి వాయుదేవుడే మద్దెల వాద్యకాడు. మద్దెల మేఘమండలం. కురిసేవానధారలు మద్దెలకున్న జాలర్లు. వానధారల్లో నుండి రాలే ఆర్ద్రపురుగులు జాలరులకున్న కెంపు పట్టుకుచ్చులు. మార్దంగికుడు ఆటకు దగ్గట్లు వంగుతూ లేస్తూ ఉంటే మద్దెలకూడా అలాగే ఉంది. మేఘమండల మొకసారి క్రిందికివచ్చి మరొకసారి పైకి పోవటం. సొగసుగా ఉత్ప్రేక్షింపబడినవి. నాటి నాట్యక్రీడ ఈ వర్ణనకు భూమిక.

ఉ॥ ఓహరిసాహరిం బ్రథమ మొల్కెఁడు ధారల గాడ్పు లేటవా
ల్గా హతి నీడ్చి, వీఁగుప్రజలం గలఁప, న్మొగి లొందె నంబుభృ
ద్వాహచలద్రథత్వము, మొద ల్మెఱుఁగఁ ధ్వజ మెత్తనొటగా
నాహదనం జెలంగుజన మాంతము నూళ్లకుఁ బోన రామియుఁ. 93

ఓహరిసాహరిన్ = తండోపతండంగా (నేను నేనని అహంకారంతో ముందుకు దూకటం), ప్రథమము = మున్ముందుగా; ఒల్కెడు = కారు; స్రవించు; ధారలన్ = వానధారలను; గాడ్పు = గాలిని; ఏటవాల్గాన్ = ఏటవాలుగా (ఐమూలగా); హతిన్ = దెబ్బతో; ఈడ్చి = ధారలను లాగి; వీఁగు ప్రజలన్ = దాగిన జనులను; కలపన్ = కలత చెందించగా; మొగిలు = మేఘం; అంబుభృద్+వాహ = నీటిని ధరించే మేఘమే వాహనంగా కల ఇంద్రుని; చలత్ = కదులుతున్న; రథత్వము = రథలక్షణము; ఒందెన్ = పొందినది; మొదలన్ = మొదటే; మెఱుగన్ ధ్వజమున్ = మెరుపన్న జెండాను; ఎత్తనొటగాన్ = ఎత్తినందువల్లనో అన్నట్లు; ఆహదనన్ = ఆ సమయంలో; చెలంగు = ఉన్నట్టి; జనము = ప్రజలు, అంతము = చివరిదాకా (వాన వెలిసేటంతవరకు); ఊళ్లకున్ = స్వగ్రామాలకు; పోవన్ = పోవటానికి; రామియున్ = వీలులేకపోవటం (ఒందెను).

ముందుగా ముంపు జడివాన జల్లు గుంపు తండోపతండంగా వస్తున్నది. దాన్ని గాలి ఏటవాలుగా కొట్టి ఈడ్చింది. చాటుమాటునదాగిన జనంకూడా కలతపడ్డది. ఈ వాస్తవిక దృశ్యమెలా ఉందంటే - మేఘం ఇంద్రునివాహనం = రథం. దానికి టెక్కెము మెరుపు. ధ్వజస్థాపనం చేసి ఇంద్రరథాన్ని వానధారలన్న త్రాళ్ళతో వంగబడి ప్రజలు లాగుతున్నట్లున్నది. రథంగుడిలోకి చేరేంతవరకు ప్రజలు పోరాదు కనుక వాన వెలిసేటంత వరకూ వారలాగే ఒదిగి ఉన్నారు. వీగుజనులు రథయాత్రలో త్రొక్కిసపడుతున్నట్లున్నారు.

అలం : రూపకోత్ప్రేక్ష. మేఘం - రథం, మెరుపు = టెక్కెము. ధారలు - (త్రాళ్ళు, ఇది రూపకం.

విశే ॥ శ్రీవిరూపాక్షస్వామికి ఏడాది కొకసారి రథోత్సవం జరగటం, ప్రక్క ఊళ్ళనుంచి జనం తండోపతండాలుగా రావటం; వచ్చిన ప్రతిమనిషి రథం త్రాళ్ళు లాగాలన్న నియమం ఉన్నందువల్ల చేయివేయడం.

ఈ దృశ్యం - కవి చూచినదే, ఇక్కడ సాలంకారమై కావ్యోపస్థితి పొందినది. లోక కావ్య భేదం గమనించాలి.

ఇంద్రోత్సవం వ్యవసాయ ఋతుప్రారంభంలో జరపటం ప్రాచీనకాలం నుండి వస్తున్నది. ఈ ఉత్సవం వాత్స్యాయన కామసూత్రాల్లో చెప్పబడింది.

తే ॥ మిగుల నామనిఁ బచ్చ చాంపేయకముల
నమ్మి, కడపటఁ దము వైచినాఁడు మగుడ
నాసపడువారి నవ్వునట్లల్లవిచ్చెఁ
గలయ మూతులు కేతకీ గహన తతులు. 94

ఆమనిన్ = వసంతఋతువులో; పచ్చ = పసిమిపచ్చని; చాంపేయకముల = సంపంగి పువ్వులను; మిగులన్ = మిక్కిలి; నమ్మి = విశ్వసించి (మనిషి); తమున్ = తమను; కడపటన్ = తోటలచుట్టూ కంచెల్లో (కడపళ్ళ = అని వావిళ్ళ పాఠం); వైచినాడు = పారవేశాడు; మగుడన్ = (వానకారు రాగానే); ఆసపడువారిన్ = తమను ఆశించేవారిని; నవ్వునట్లు = నవ్వుతున్నవో అన్నట్లు; అల్లన్ = క్రమంగా; కేతకీ = మొగిళ్ళ; గహన = పొదల; తతులు = గుంపు; కలయన్ = చుట్టూరా (అంతటా); విచ్చెన్ = వికసించాయి.

వసంతఋతువులో సంపెంగలను శాశ్వతమని నమ్మిన మనిషి ఆ తోటలకు కంచెలుగా నాటిన మొగిలిపొదలు విరగబూచాయి. అదెలాగున్నదంటే - వానకారు రాగానే తమను కోరుకొంటున్న మనిషిని చూచి నవ్వుతున్నట్లున్నాయా అన్నట్లున్నాయి.

అలం : ఉత్ప్రేక్ష.

మొగిలి డొంకలు బంగారు రేకుల్లాగా ఉన్న పూలరేకులతో వికసించినంతనే మిన్నాగులు క్రొత్తపూల వాసనలను విడువలేక లుబ్ధములై పూల పొట్లాలను చుట్టుకొన్నవి. అవి నిత్యము స్వర్గంలోని

నందనవనంలో ఉండే మెరుపులు వర్షంతో మబ్బుల పాటుగా క్రింది కి దిగివచ్చి ఈ కేతకీగంధలుబ్ధములై పరుగెత్తలేక బందీలై చిక్కుపడ్డట్లున్నాయి.

విశే ॥ మొగలిపొదలు ఊరి చివర కాల్వగట్లపై ఉండటాన్ని కవి ఇలా ఉత్ప్రేక్షించటం సొగసుగా ఉంది. ఈ ఋతువర్ణనల్లోని ఉత్ప్రేక్షలున్నూ సహజాతిసహజంగా, అనుభవదఘ్నంగా ఉంటాయి.

చ ॥ అనయము నందనంపు దివియందునె యుండి, ప్రసూనవాసనల్
గని, పఱతెంచిపోవు నల కారుమెఱుంగులె పోవరాక చి
క్కెనొ నవగంధ లుబ్ధభుజగీ పరివేష్టన నా, మొగళ్ళ పిం
డునఁ జెలఁగెం బసిండితగడుం దెగడుం బువురేకు మొత్తముల్. 95

అనయమున్ = నిత్యము; నందనంపు = నందనవనమన్న; దివియందునె = స్వర్గంలోనే; ఉండి; ప్రసూన వాసనల్ = పూలవాసనలు; కని = చూచి; పఱతెంచిపోవు = పరుగెత్తిపోయే (దొంగతనం చేసినందువల్ల పట్టుబడతామేమోనని); నవగంధ = నూత్నపరిమళాలపై; లుబ్ధ = లోభపడిన; భుజగ = ఆడుత్రాచుపాముల,పరివేష్టనన్ = చుట్టుకోవటం వల్ల; పోవరాక = పోలేక, అల = ప్రసిద్ధ; కారుమెఱుంగులె = వానకారుమెరుపులే; చిక్కెనొ = బందీలై చిక్కుపడ్డవో; నాన్ = అన్నట్లు; మొగళ్ళపిండునన్ = మొగలిపొదల గుంపులో; పసిండి = బంగారు; తగడున్ = రేకును; తెగడున్ = తిట్టే (పరిహసించే);పువురేకు మొత్తముల్ = పూలరేకులగుంపు; చెలగెన్ = విజృంభించి వికసించాయి.

మొగలి డొంకలు బంగారు రేకుల్లాగా నున్న పూలరేకులతో వికసించినంతనే మిన్నాగులు క్రొత్తపూల వాసనలను విడవలేక లుబ్ధములై పూలపొట్లాలను చుట్టుకొన్నవి. అవి నిత్యము స్వర్గంలోని నందనవనంలో ఉండే మెరుపులు. వర్షంతో మబ్బులతోపాటుగా క్రిందికి దిగివచ్చి ఈ కేతికీ గంధలుబ్ధములై పరుగెత్తలేక బందీలై చిక్కుపడ్డట్లున్నాయి.

అలం : ఉత్ప్రేక్ష

వి ॥ చౌర్యకర్మపై, ఆధారపెట్టి ఊహను నిర్మించేపద్ధతి ఈ కవిలో ధారాళంగా ఉంది. (83,87- ఇలాంటి వాటితో పోల్చిచూచుకోవాలి.) పోల్చు - 2-65

చ ॥ బలుసెక నించువిల్లడుగుఁబట్టినదే యిపు డాకు బూది గెం
పులఁ ద్రిరుచిత్వ మూఁది మరు ముష్టిబిగీ దివిఁ గ్రాయు, మౌక్తికం
బుల జడి జుమ్మనం దొరఁగుఁ బో; యిది యింద్రుని దేని పుట్టరా
గెలసమొ నాఁగ బోల్విలుజిగిం గరకాస్రుతి నొప్పె మేఘముల్. 96

బలు = గొప్ప; సెకన్ = సెగలో (వేసవిలో); ఇంచువిల్లు = తీయని చెఱకు విల్లు; అడుగుపట్టినదే = కాళ్ళుపట్టుకొన్నదే; (నేలపై పడ్డదే); ఇపుడు = తిరిగి; ఆకు = పచ్చనివన్నె; బూది = కణుపులపై బూడిదరంగు; కెంపులన్ = ఎరుపువన్నెలలో; త్రిరుచిత్వము = మూడురంగులతనం; ఊది = పొంది;

మరు = మన్మథుని; ముష్టిబిగిన్ = బిగిపిడికిలిపట్టుతో; దివిన్ = ఆకసంలో; క్రాయు = తొరగు; మౌక్తికంబుల = ముత్యాల; జడిన్ = ముంపు వానలో; జమ్ము+ అనన్ = జుమ్మనేటట్లుగా ( ధ్వన్యనుకరణం); తొరగున్+పో = స్రవిస్తున్నది పొమ్ము; ఇది = ఈ ఇంద్రధనుస్సు; ఇంద్రునిది + ఏనిన్ = ఇంద్రునిదే అయితే; పుట్టన్+ రాన్ = పుట్టనుండి రావటానికి; కెలసమె = పనేమి?; నాఁగన్ = అన్నట్లు; పోల్ = పోలెడి; విలుజగిన్ = వింటిరంగులతోను; కరకాస్రుతిన్ = వడగండ్లు రాలటం వల్ల; మేఘములు = మబ్బులు; ఒప్పెన్ = పోలినవి.

వేసవిలో నరికిన చెఱకు మ్రోడై నేలబారుగా ఉండి ఇప్పుడు చినుకు పడగానే పచ్చని ఆకులు తొడిగి, బూడిద కణుపులు పొదుగుకొని, చర్మం ఎర్రగా నిగనిగలాడుతుండగా, మూడు వన్నెల జిలుగుతో చెన్నారుతున్నది. దానిని బిగిపిడికిట పట్టి ఎక్కుపెట్టాడు మదనుడు. కణుపుల కడ విరిగి లోని ముత్యాలజల్లులను జుమ్మని స్రవిస్తున్నట్లుగా ఉన్నది. లేకపోతే ఈ విల్లు ఇంద్రునిదే అయితే పుట్టనుండి ఎలా జన్మిస్తుంది అన్నట్లుగా వడగళ్ళు రాలుస్తున్న మేఘాలందగించాయి.

అలం : సాపహ్నవోత్ప్రేక్ష.

విశే॥ మేఘం, వాన, ఇంద్రధనుస్సు, కరకలు - ఇది వాస్తవము- వేసవిలో చెరకు నరకబడటమూ వాస్తవమే. రెంటినీ కలిపి కట్టిన రమణీయమైన భావన. చెఱుకు = ఇంద్రధనుస్సు, వడగళ్ళు = ముత్యాలు; మేఘం = పుట్ట.

పుట్టవదలి 89వ పద్యంలో ఈ విషయమే ప్రస్తావితం. పుట్ట = వల్మీకం కాదు. సాతప మేఘమన్న అర్థాన్నే రాయలవారు గ్రహించినట్లు స్పష్టం.

చ॥ అతిజల మబ్ధిఁ గ్రోలె నితఁ, డంతయు రా నతివృష్టి దోష మౌ;
మితి నిపు డబ్దతం బరిణమించిన తోయమె చాలుఁబంట; కు
న్మతి నల ధాత గట్ట గగనంబున, వర్తులత న్సమంతతో
వృతి యగు సేతుమండలము శ్రీపరివేషము సుట్టె భానునిన్. 97

ఇతఁడు = ఈ మేఘుడు; అబ్ధిన్ = సముద్రంలో; అతిజలము = ఎక్కువ నీరు; క్రోలెన్ = త్రాగినాడు; అంతయున్ = ఆ త్రాగిన నీరు; రాన్ = వర్షిస్తే; అతివృష్టి = ఎక్కువ వాన; దోషమౌన్ = ఈతిబాధ; ఒకటి ఔతుంది (చూ. 2-43); మితిన్ = హద్దులో; ఇపుడు = ఇప్పుడు; అబ్దతన్ = మేఘంగా; పరిణమించిన = పరిణామం పొదిన; తోయమె = నీరే; పంటకున్ = పంటకు; చాలున్ = సరిపోతుంది; అన్+ మతిన్ = అన్న ఆలోచనతో; అల = ప్రసిద్ధుడైన; ధాత = సృష్టికర్త; కట్టన్ = నిర్మించగా; గగనంబునన్ = ఆకాశంలో; వర్తులతన్ = గుండ్రని; అగు = అయిన; సేతుమండలము = ఆనకట్ట; శ్రీ = శుభమైన; పరివేషము = గాలిగుడి; భానునిన్ = సూర్యుని; చుట్టెన్ = ఆవరించినాడు.

సముద్రంలో మేఘుడు నీరెక్కువగా త్రాగినందువల్ల అదంతా కురిస్తే అతివృష్టి దోషమౌతుందని బ్రహ్మ భావించి సూర్యుని గుండ్రని ఆనకట్ట కట్టినాడో అన్నట్లుగా గాలిగుడివేసింది. (వరదగుడి)

అలం : ఉత్ప్రేక్ష.

తే ॥ గగన రంగస్థలంబున మిగులఁ బ్రౌఢి
మమునఁ గాళిక నిల్చి కోలము నటింపఁ
బోరి మొగంబున రాలు నిప్పుక లనంగ
గుంపులై రాలె మహి నింద్రగోపకములు. 98

కాళిక = నల్లని గుంపు (అదే కాళిక); గగన = ఆకాశమన్న; రంగస్థలంబునన్ = నాట్యరంగప్రదేశంమీద; నిల్చి = నిలిచి; మిగులన్ = తీవ్రమైన; ప్రౌఢిమమునన్ = గంభీరంగా (నేర్పుతో); కోలము = కోలాటమన్న దేశీయనృత్యం; నటింపన్ = ఆడగా; పొరిన్ = క్రమంగా; మొగంబునన్ = ముఖంనుండి; రాలు = పడే; నిప్పుకలు = నిప్పు రవ్వలు; అనంగన్ = అన్నట్లుగా; మహిన్ =నేలపై; గుంపులై = గుంపులుగా; ఇంద్రగోపకములు = ఆర్ద్రపురుగులు; రాలెన్ = రాలినవి.

నల్లని మబ్బుల గుంపునకు కాళిక అన్న పేరున్నది. కనుక ఆ గుంపే ఇక్కడ కాళిక. ఆమె నాట్యప్రౌఢ (ప్రళయకాలంలో కోపాతిశయంతో తాండవించే మహాకాలస్వరూపిణి కనుక), ఆకాశమన్న నాట్యరంగస్థలం పైన దేశీయనృత్య విశేషమైన కోలాట నృత్యం చేస్తున్నది. (నల్ల మబ్బులన్న నీలి చీరదాల్చినందున కన్పించటం లేదు) ఆమె కోపాతిశయంవల్ల ముఖంనుండి నిప్పులు రాలుతున్నాయో అన్నట్లుగా ఇంద్రగోపసమూహం రాలుతున్నది.

అలం : రూపక సహితోత్ప్రేక్ష.

విశే ॥ కోలము - కోలలతో చేసే నృత్యవిశేషం. ఇవి దేశీయ నృత్యవిశేషాలుగా నృత్తరత్నావళివంటి గ్రంథాలభివర్ణిస్తున్నవి. నీలి కోలమన్న పాఠం వేదం వారిది. ఆ అర్థం దానికెలా కుదురుతుంది? కనుక 'నిల్చి' అన్న వావిళ్ళ పాఠం శ్రేష్ఠం.

కం ॥ ద్యుమణికరాళి మొగిళ్లయి
యమవస శశి గలయఁ గూర్చి హదనౌటయు, న
య్యమృతపుబిందులె క్రమ్మఱ
నుమిసెడు నన గరక లుడుగక రాలెన్. 99

ద్యు = ఆకాశంలో; మణి = రత్నమైన సూర్యునియొక్క; కర+ ఆళి = కిరణ సమూహం; మొగిళ్లు + అయి = మబ్బులై; అమవసన్ = అమావాస్యనాడు; శశి = చంద్రుడు; కలయన్= తమను కలిస్తే; కూర్చి= (మొగిళ్లైన కిరణాలు) కూర్చుకొని; హదను = సమయం; ఔటయున్ = కాగా; ఆ యమృతపుబిందులే= ఆ చంద్రుని నుండి సంగ్రహించిన సుధాబిందువులే; క్రమ్మఱన్ = తిరిగి; ఉమిసెడున్ = వెళ్ళగ్రక్కుతున్నాయో; అనన్ = అన్నట్లుగా; కలయన్ = అంతటా, కరకలు = వడగండ్లు; ఉడుగక = ఆగక; రాలెన్ = రాలినవి.

అమావాస్యనాడు సూర్యునితో చంద్రుడు ప్రవేశిస్తాడు. దాన్ని 'దర్శ' అంటారు ( దర్శః సూర్యేందుసంగమః అమరం.) కాబట్టి ఈ శాస్త్రోక్తి ననుసరించి చేసిన కల్పన. సూర్యకిరణాలు శశిని ప్రవేశించగానే అవి మొగిళ్ళైనవి కనుక చంద్రునిలోని అమృతబిందువులు సంగ్రహించి నిలువచేసికొని వర్షఋతువురాగానే వాటినే వెళ్ళగ్రక్కుతున్నవో యన్నట్లు వడగండ్లు రాలుతున్నవి.

అలం : ఉత్ప్రేక్ష

విశే ॥ కవి శాస్త్రవచనానుసారంగా చేసిన కల్పన. ఇతరత్రలోకభూమికపై కట్టిన కట్టడం - ఈ రెండు కవుల భావనకు ఆధారాలు. మూడవది కేవల ప్రతిభ - (దర్శనం ) నుండి పుట్టే భావన.

చ ॥ స్ఫురణ మొగిళ్లపై మొదలఁ బొల్చి, జల స్రుతి నాఁడు నాఁటికిం
గరఁగుచుఁ బుట్టుచుండు మణికార్ముక రక్తిమ యెల్ల వెల్లిఁగె
న్నురుగులు గట్టినట్టుల గనుంగొన నయ్యె సురేంద్రగోపముల్
గరఁగిన విండ్ల యప్పసరుఖైవడిఁ దెట్టెలు పెట్టు పచ్చికన్. 100

మణికార్ముక = ఇంద్రధనుస్సుయొక్క (సప్తవర్ణాత్మకత వల్ల భిన్న మణులతో చేసినట్లున్నందున); రక్తిమ = ఎరుపు; ఎల్లన్ = అంతా; స్ఫురణన్ = కాంతితో; మొగిళ్ళపైన్ = మబ్బులపై; మొదలన్ = మున్ముందు; పొల్చి = అందంగా ఉండి; జల = నీటియొక్క; స్రుతిన్ = కారటంచేత; నాడునాటికిన్ = రోజురోజుకూ; కరగుచున్ = కరగిపోతూ, పుట్టుచున్ + ఉండు = తిరిగి జన్మిస్తూ ఉన్న (మణికార్ముకరక్తిమ); వెల్లిన్ = వాన (వానవరదల్లో); కెన్+నురుగులు = ఎర్రని నురుగుల; కట్టినట్టుల = కట్టిన విధంగా; తత్+ ఇంద్రగోపముల్ = ఆ ఆర్ద్రపురుగులు; కనుంగొనన్ = చూడగా; ఒప్పెన్ = అందగించాయి; కరగిన = కరిగిపోయిన; విండ్ల = ధనుస్సుల; ఆ+పసరుఖైవడిన్ = ఆ ఆకుపచ్చపసరు విధంగా; పచ్చికన్ = పచ్చికబయళ్ళలో; తెట్టువగట్టున్ = తెట్టులు కడుతున్నవి.

వానకాలంలో ఆర్ద్రపురుగులు కెంపు రత్నాలముక్కలుగా బయళ్ళలో పచ్చని పచ్చికలో అందంగా నున్నాయి. వాటిని చూస్తుంటే ఏమనిపిస్తుందంటే = ఇంద్రధనుస్సుమణి రోజురోజుకు నీళ్ళలో ఉండి కరిగిపోయి ఎర్రని మరుగదొబ్బలైనట్లుగా ఆర్ద్రపురుగులు వింటి పచ్చదనం పసరై బయళ్ళలో పచ్చికగా తెట్టెలు కట్టినట్లుంది

అలం : ఉత్ప్రేక్ష

చ ॥ ఫెళఫెళ మబ్బుబిట్టుఱుము, భీతి విదూర శిలాంకుర చ్ఛటో
త్పులకినియై ప్రియున్నిదురవోవు హరి న్వడిఁ గౌఁగిలింపఁగాఁ;
దలరి ధరిత్రి సోఁచు గఱు దాల్చినఁ గేల్లనఁ గంకణంపు మ్రోఁ
తలఁ బులు దేల వండు పయిఁ దాల్చి నదు ల్వెసఁ జొచ్చె వారిధిన్. 101

మబ్బు = మేఘం; ఫెళఫెళమని; బిట్టు = పెద్దగా; ఉఱుమన్ = ఉరిమినంతనే; ధరిత్రి = భూదేవి (విష్ణుపత్ని - పీఠికలో రెండవ పద్యము చూడు); విదూర = వైడూర్య; శిల = మణులయొక్క; అంకుర = మొలకల యొక్క; ఛట = సమూహముయొక్క; ఉత్ + పులకినియై = మిక్కిలిగా పులకించినదై; నిదురపోవు = చాతుర్మాస్యంలో నిద్రపోతున్న; హరిన్ = విష్ణువును; ప్రియున్ = భర్తను; వడిన్ = త్వరగా; భీతిన్ = భయంతో; కౌగిలింపఁగాన్ = కౌగిలించుకోగా; తలరి = ప్రయత్నించి; చాచు = చాచిన; గఱు = గగుర్పాటు; తాల్చిన = పొందిన; కేళ్ళనన్ = హస్తములో అన్నట్లు; కంకణంపు = ఏటిపక్షాన నీటిపక్షులు; భూదేవి పక్షాన గాజులు; మ్రోతలన్ = ధ్వనులతో; పులు = గడ్డి (గగుర్పాటు); తేలన్ = పైకి కన్పిస్తుండగా; నీటిపై తేలగా; వండు = బురద (నదీ) భూదేవత పక్షంలో గంధపుపూత; పయిన్ = మీద; తాల్చి = ధరించి; నదుల్ = ఏళ్ళు; వెసన్ = త్వరగా; వారిధిన్ = సముద్రమును; చొచ్చెన్ = ప్రవేశించాయి.

వేసవిలో పాపం నదీ కాంతవిరహిణి కనుక (చూ.2-52) త్వరగా వానలతో ఉప్పొంగి భర్త సముద్రం ఉరుకులతో పరుగులతో చేరుకోవడం వర్ణితాంశం.

ఫెళఫెళ మబ్బురిమింది. ఏకాంతంలో కాంత భూదేవికి భయం కలిగింది. (4-435చూ). ప్రక్కనే ఉన్న భర్త గాఢంగా నిద్రిస్తున్నాడు. భయం పోగొట్టుకోవడం కోసం భర్తపై చేయిచాచినట్లు నదులు దీర్ఘంగా సాగాయి. నదిలో క్రొత్తనీరు కదా గడ్డీగాదం తేలుతున్నది. నీటి దొబ్బలు, పక్షులు తేలుతున్నవి. భూదేవి శృంగారభావోద్రేకంతో (మబ్బురుమటం ఉద్దీపనం కనుక) పులకించింది హస్తం. గాజులు మ్రోగేటట్లు హస్తం చాచింది. ప్రియుని కౌగిలింతలో భయం పోగొట్టుకోవటమే కాక సంయోగ శృంగారమూ సంభావిత మౌతున్నది. ఈ భయం కౌగిలింత అన్న అనుభావ (చేష్ట) ముఖంగా వ్యక్తమైనందున నిదురపోయే వారికి ఉద్దీపనం.

వేసవి నదీవర్ణనలో విరహశృంగారం ఇక్కడ సంయోగం. రెండూ పవిత్రదాంపత్య శృంగార వర్ణనలే కాని జుగుప్సాకరమైనవిగా చేయబడలేదు. రాయల కావ్యశృంగారం ఈ జాతిలోది.

కావ్యంలో ప్రధానరసం శృంగారం. భూదేవి అవతారమైన గోదాదేవి నాయిక. శ్రీరంగేశ్వరుడు నాయకుడు. కనుక ఆ ప్రధానరస స్ఫురణకోసం అక్కడక్కడ వర్ణనలు తన్ముఖంగా మలచబడడం భావుకలోక రమణీయంగా ఉంటాయి.

చాతుర్మాస్యం - ఆషాఢశుద్ధ ఏకాదశినుండి కార్తికశుద్ధ ఏకాదశిదాకా 4మాసాలు వర్షబుతువు.

తే ॥ కేకి షడ్జంబె దక్కఁ గోకిలపుఁ బంచ
మం బఱుటఁ, దోయి పదరులు మఱి పొసఁగమి,
నదియుఁ బ్రియుఁ గూర్పనదులచో నమృత మయ్యెఁ
బ్రోషితల చేరువకు నంపు బోటివోలె. 102

కేకి = నెమలి; షడ్జంబె = షడ్జమస్వరపుకేక; తక్కన్ = తప్ప; కోకిలపున్+ పంచమంబు = కోకిల పంచమస్వరం (వసంతంలోది కనుక); అణుటన్ = నశించిపోవటం వల్ల; తోయి = తోయం (నీరు) కలది = మేఘం; పదరులు = గద్దింపుమాటలైన ఉరుములు; మఱి పొసగమిన్ = కుదరనందున; అదియున్ = ఆ ఉరుమే; నదులచోన్ = నదీకాంతయెడల; ప్రియున్ = సముద్రుడైన ప్రియుని; కూర్పగాన్ = సంఘటించటానికి; ప్రోషితలన్ = విరహిణులైన వారిని (భర్తలు దేశాంతరం పోయిన వారి భార్యలు); చేరువకున్ = ప్రియుల దగ్గరకు; అంపు = పంపే, బోటి = కుంటెన కత్తె; పోలెన్ = వలె; అమృతము +అయ్యెన్ = ఆ ఉరుమే అనృతమైనది.

ప్రస్తుతం వర్షాకాలం కనుక =కేకి కేకాధ్వనులే విన్పిస్తున్నాయి. తప్ప వసంతం గతించినందున కోకిల పంచమస్వరాలు అడుగంటాయి. ఇప్పుడు మరి నదీకాంతలను సముద్రుని కడకు చేర్చే బోటి ఉరుమే. అది గద్దించేది తప్ప నయాన చెప్పేది కాకపోయినా అదే దిక్కు. ప్రోషిత భర్తృకలను ప్రియునిండ్లకు తీసుకొనిపోయే చెలికత్తెలాగా ఉరుమే అమృతమైనది.

అలం : ఉపమ.

నదులు ప్రవహిస్తున్నవి కోకిల మూగపోయింది. ఉరుములకు కేకులు కేకారవాలు చేస్తున్నవి. (ఇది వానకాల సామగ్రి)

**తే ॥ తత తనువు రాహు సోమామృతంబు మ్రింగఁ**
**జక్రి దునిమిన మెడగంటి చాయఁ బొలిచె,**
**నసిత మేఘస్థమణిధను వాసుదర్శ**
**నం బనఁగ నింగిఁ బ్రతిసూర్యబింబ మలరె. 103**

తత తనువు =విస్తారమైన దేహముకల; రాహు = రాహువు (వు =లోపల); సోమ = చంద్రుని; అమృతంబున్ = సుధను (అమృతమథనం కథావేళ); మ్రింగన్ = మ్రింగగా; చక్రి = చక్రాయుధం కల విష్ణువు; తునిమిన = నరికిన; మెడ = మెడపై; గంటి = గాయం; చాయన్ = వలె; పొలిచెన్ = ఒప్పినది; అసిత = నల్లని; మేఘ = మేఘంలో, స్థ = ఉన్న; మణిధనువు = వక్రాకారంలోనున్న ఇంద్రధనుస్సు; ఆ సుదర్శనంబు = ఆ చక్రం; అనఁగన్ = అన్నట్లు; నింగిన్ = ఆకాశంలో; ప్రతిసూర్యబింబము = సూర్యునికి ప్రతిగా మరొక బింబము, అలరెన్ = ప్రకాశించినది.

వానకాలంలో నల్లని విస్తారమైన మేఘం క్రమ్మింది. దానిపైన ఇంద్రధనుస్సు వేసింది. ప్రతిసూర్యబింబం కన్పించింది. ఈ దృశ్యమే కావ్యభాషయైన సాలంకారోక్తిగా చెప్పబడ్డది. ఆ మేఘం రాహువు. వాడు మారువేషంతో సుధను త్రాగాడు. గొంతు దిగకముందే మోహిని రూపంలోని చక్రి వాడి గొంతు నరికాడు. ఆ గాయంలాగా మేఘాల్లోని ఇంద్రధనుస్సున్నది. ఆ సుదర్శనమే ప్రతిసూర్యబింబము.

అలం : ఉపమ

విశే ॥ చూ ప్రతిసూర్యబింబ లక్షణము వేదం వారి వ్యాఖ్య.

చ ॥ స్వరుఖరతాబ్రసాహిరిపుజాలమదాచిరరుక్శిఖిప్రభా
కరకబకాతివాఃస్రుతికిగా లవణేక్షుసురాజ్యదధ్యుదా
కరములు దుగ్ధశుద్ధజలకంధులు నాఁ గల యట్టి సప్తసా
గరములు మేఘుఁ డానెనొకొ కాయనఁగాఁ గనుపట్టె వీనిచేన్. 104

లవణ = ఉప్పు; ఇక్షు = చెఱుకు; సుర = కల్లు; ఆజ్య = నేయి; దధి = పెరుగు; ఉదాకరములు = ఉద, ఉదకముయొక్క; ఆకరములు = నిలయములైన సముద్రాలు; దుగ్ధ = పాలు; శుద్ధ = స్వచ్ఛమైన; జల = నీరున్న; కంధులు = సముద్రాలు; (కం - నీటికి; ధిః నిధి) నాన్ = అన్నపేర్లతో; కలయట్టి = ఉన్నట్టి; సప్తః ఏడు; సాగరములు = సముద్రాలు; మేఘుఁడు = పర్జన్యుడు; ఆనెన్ ఒకొ = త్రాగినాడా ఏమి? అన్నట్లు; కనుపట్టెన్ = కన్పించింది; వీనిచేన్ = వీనివల్ల (అవేవి?); స్వరు = పిడుగుయొక్క; ఖరతా = తీక్ష్ణత; అప్ = నీటియొక్క; రస = రుచి; అహిరిపు = పాములకు శత్రువైన నెమళ్ళు; జాల = గుంపుయొక్క; మద =గర్వము; అచిరరుక్ = మెరుపు(కొంచెంసేపు మాత్రమే ఉండే కాంతి); శిఖి = అగ్నియొక్క; ప్రభా = కాంతి; కరక = వడగళ్ళు; బక = తెల్లకొంగలు; అచ్ఛ = స్వచ్ఛ; వాః = నీటి; స్రుతులకై = స్రవించటం కోసం.

మేఘుడు సప్తసాగర జలాలు త్రాగినట్లు కన్పించింది. ఎలాగంటే పిడుగు మొదలైన వానిని స్రవించడం వల్ల.

ఉప్పుః పిడుగు తీక్ష్ణత; అబ్రస = ఇక్షుసముద్రం; నెమళ్ళ ఉబ్బు = సుర; మెరుపు = నేయి; కరక = దుగ్ధం; అచ్ఛవాః స్రుతి = శుద్ధోదకం- ఇలా సప్తసముద్రలక్షణాలు కల వస్తువులు మేఘుఁడు కురిసినందువల్ల ఈ ఊహకు వీలేర్పడినది.

అలం : యథాసంఖ్యం.

పైగా చెప్పినట్లుగా ఆయా సముద్రాల లక్షణాలతో ఆయా వస్తువులు పుట్టటం ఒక క్రమాన్వయంలో చెప్పటం. ఇది వాక్యనిర్మాణ విషయకమై అందం కనుక ఇదొక అలంకారం.

న్యాయంగా ఉపమానోపమేయభావముంటేనే అలంకారం చెప్పాలికదా! ఉపమేయమంటే ప్రస్తుత కావ్యార్థం. ఉపమాన మంటే అప్రస్తుతమైన లోకవిషయం. క్రమాలంకారంలో ఇవి లేవు కనుక అలంకారం కాదు పొమ్మన్నాడు. రాజానక కుంతలాచార్యులు, తన వక్రోక్తి జీవితంలో ఈ విషయమన్యత్ర కూడా చెప్పబడినది.

మ ॥ తనిమం బచ్చ మెఱుంగు గోఁచియు మణీధన్వోజ్జ్వలాషాఢముం
గొని, పుట్టం గొడుగబ్బ నెమ్మిపురి యాకు ల్విప్పి శబ్దంబు మిం

చ. నతస్ఫారరజో బలిత్వమున నుచ్చస్ఫూర్తి మిన్నన్ని వే
ఘననీలాంగుఁడు గాంచెఁ బాదపలితౌఘంబుఁ మరుత్స్పృష్టముఁ. 105

ఘన+ నీల+ అంగుడు = మేఘంవలె నీలవర్ణం కల దేహమున్న శ్రీవామనమూర్తి (ఘన = మంచి, గొప్ప); తనిమన్= చిన్నతనంవల్ల (శ్రీమహావిష్ణువు వామనుడు - పొట్టివాడు కావడం వల్ల); పచ్చ = మొగలిరేకువంటి బంగారు వన్నె (పసిడీ = పసిమివన్నె); మెఱుంగు = మెరుపన్న; గోచియున్ = గోచియు; మణీధను+ ఉజ్జ్వల = ఇంద్రధనుస్సన్న; ఉజ్జ్వల = పైకి కాంతులు చిమ్మే -(కాంతిమంతమైన); ఆషాఢమున్ = మోదుగుకర్ర (చూ. 4-16, బ్రహ్మచారి లక్షణం); పుట్టన్ = పుట్టగానే; గొడుగు = తాటాకుల గొడుగు; అబ్బన్ = లభ్యంకాగా (పుట్టంగొడుగు = పుట్టగొడుగే తాటాకు గొడుగుగా లభించగా); నెమ్మిపురి = నెమలిపింఛమన్న; ఆకుల్ = తాళపత్రాలగ్రంథం; విప్పి = విడిలునట్లు చేసి; శబ్దంబు = ఉరుముధ్వని (వేదం); మించన్ = ఎక్కువకాగా; నత = అణగార్చబడ్డ; స్ఫార = అధికమైన; రజః = దుమ్ము-రజోగుణంకల; బలిత్వమునన్ = బలిచక్రవర్తి కలిగి యుండటంతో (బలంకలిగియుండటంతో); ఉచ్చస్ఫూర్తిన్ = ఉన్నతమైన విక్రమణంతో (విస్తారంగా వ్యాపించటంతో); వేన్ = వేగంగా; మరుత్ = గాలిలో; బ్రహ్మాదిదేవతలతో; స్పష్టమున్ = స్పృష్టింపబడ్డ; పాద = పాదాలపై వానకాళ్ళుగా; పతిత = పడిన; సలిల = నీటి; ఓఘంబున్ = ప్రవాహాన్ని; కాంచెన్ = పొందెను.

మేఘుడన్న విష్ణువు వామనుడై క్రమక్రమంగా ఆకాశమంతా వ్యాపించి త్రివిక్రమమూర్తి అయినాడు. మేఘం విష్ణువుతో రూపింపబడినందున ప్రతిశబ్దమూ రెంటికీ అన్వయించాలి. రూపం చిన్నదైనందున మెరుగన్న (గోచి)- కాషాయ కౌపీనం ధరించి, ఇంద్రచాపమన్న మోదుగుకోల దాల్చి, పుట్టగొడుగే గొడుగు కాగా (వామనుడు కనుక చిన్న గొడుగు), నెమలిఫింఛమన్న వేదతాళపత్రగ్రంథాన్ని విప్పి, ఉరుమన్న శబ్దమే వేదగానం కాగా, దుమ్మన్న బలిని అణగార్చి విక్రమించి విజృంభిస్తే గాలి వేగంతో ధారలు వానకాళ్ళై పడ్డాయి. అవి బ్రహ్మాది దేవతలు పైకి సాగి మిన్నంటిన తృతీయపాదాన్ని దివ్యగంగాజలంతో అభిషేకించారన్నట్లున్నాయి.

భాగవతంలో వామనకథలో బలితో వడుగు - *''గొడుగో, జన్నిదమో, కమండలువో నాకున్ ముంజియో దండమో వడు గేనెక్కడ ?''*- ఇత్యాది అన్నాడు. ఈ పద్యంలో కావ్యనాయక స్ఫూర్తి ఉన్నది

అలం : సమగ్రరూపకం (సావయవరూపకం)

కం ॥ ఘనవృష్టికతన ఫణు లే
పున నల వల్మీక రంధ్రములు మూయఁగ నె
త్తిన గొడుగు లనఁగ ఛత్రా
క వికాయం బవని నెల్లకడలం బొడమెఁ. 106

ఘనవృష్టి = గొప్పవాన; కతనన్ = వలన; ఫణులు = పాములు; ఏపునన్ = మిక్కిలిగా; అల = ఆ; వల్మీక = పుట్టల, రంధ్రములు = బొరియలు; మూయగన్ = మూయటం కోసమై, ఎత్తిన = వేసుకొన్న;

గొడుగులు+ అనఁగన్ = గొడుగులేమో అన్నట్లు; అవనిన్ = భూమిపై; ఎల్లకడలన్ = అన్నిచోట్లా; ఛత్రాక = పుట్టగొడుగుల; నికాయంబు = గుంపు, పొడమెన్ = పుట్టినది.

వానకాలంలో ఎక్కడచూచినా పుట్టగొడుగులు గుంపులు గుంపులై పొటమరించినవి. ఇది ఎలా ఉన్నదంటే - వానలు పెల్లుగా కురియుటం వల్ల పాములు పుట్టల్లో దూరి వానధారలు రాకుండా ఉండటం కోసమో అన్నట్లు రంధ్రాలపై గొడుగులు విప్పికొని లోపల కూర్చున్నవి.

అలం : ఉత్ప్రేక్ష.

105వ పద్యంలో పుట్టగొడుగు శబ్దం ఈ పద్యాన్ని కన్నతల్లి అందమైన ఊహ బహుశా పుట్టగొడుగన్న పేరును సమర్థించిన కవి రాయలేనేమో ? పై పద్యోహ దివ్యం. ఈ పద్యోహ మర్త్యం. కవికి రెండూ సమానమే

ఉ ॥ సారెకు మింట మేఘుఁడు నిజస్ఫురణం బలరఁ గ్రూరమౌ పురోం
గారకయోగ మూఁది తిరుగ, స్సకుటుంబముఁ దద్గ్రహంబు నెం
తే రుష ద్రొబ్బ నంతలును నింతలునై పడు తన్నభశ్చ్యుతాం
గార శిశుప్రతానములకై వడి రాలె సురేంద్రగోపముల్. 107

మేఘుఁడు = మబ్బు, మింటన్ = ఆకసంలో; సారెకున్ = మాటిమాటికి; నిజ = తన; స్ఫురణంబు = ఎం ప్రకాశం, బలసన్ = విశంపగా; క్రూరమౌ = ఉగ్రమైన, పురోంగారక యోగము = ఆ పేరుగల గ్రహయోగం; ఊది = అవలంబించి; తిరుగన్ = ఎదురుగా సంచరిస్తుంటే; సకుటుంబమున్ = కుటుంబంతో పాటుగా; తత్= ఆ, గ్రహంబున్ = అంగారక గ్రహాన్ని; ఎంతేన్ = మిక్కిలి; రుషన్ = కోపంతో, ద్రొబ్బన్ = పడద్రోస్తే; అంతలును+ ఇంతలునునై = పెద్దవి చిన్నవిగా; పడు = రాలే; తత్ = ఆ, నభ = ఆకాశంనుండి, చ్యుత = జారే; అంగార = ఆ గ్రహముయొక్క; సురేంద్రగోపముల్ = ఆర్ద్రపురుగులు, వడిన్ = వేగంగా; రాలెన్ = పడ్డాయి.

నేలంతా ఆర్ద్రపురుగులు ప్రాకటం చూస్తే అంగారక గ్రహయోగం వల్ల ఆగ్రహం మేఘుని విజృంభణను అరికట్టడం కోసము ఎదిరిస్తే కోపంతో మేఘుడు ఆ గ్రహాన్ని కుటుంబంతోసహా క్రిందకు అంగారక శిశుసమూహంలాగా రాలిపడుతున్నవేమో అన్నట్లున్నాయి.

అలం : ఉత్ప్రేక్ష.

ఆర్ద్రపురుగులు అగ్నిగ్రహంయొక్క ముక్కలులాగా ఉన్నాయని తాత్పర్యము.

పురోంగారకప్రయోగం వల్ల వానలు రావు కనుక ఈ కల్పన జ్యోతిశ్శాస్త్రాధారంగా వచ్చింది

కం ॥ కాకోదరాహితుల ప
ట్కీకంబులఁ దూర్చె మెఱసి మేఘుం, డని గుం

పై కనగొని పొగడె ననన్
భేకధ్వను లెసఁగె వృత్తభేదానుకృతిన్. 108

కాకోదర = పాములన్న, అహితులన్ = తమ శత్రువులను; మేఘుండు; మెఱపి = మెరుపులన్న ఆయుధంతో దండెత్తి; వల్మీకంబులన్ = పుట్టల్లో; దూర్చెను = దూరేటట్లు చేసాడు. (శత్రువులు పారిపోయి మరుగున దాగినట్లుగా); అని = అని చెప్పి; గుంపై = గుంపులుగా చేరి; కనగొని = జంటలుగా ఎదురుబొదురుగా కూర్చొండి; పొగడెన్ + అనన్ = స్తుతిస్తున్నాయో అన్నట్లుగా; వృత్తభేద+ అనుకృతిన్ = భిన్నఛందస్సులను అనుకరిస్తూ; భేకధ్వనులు = కప్పల అరుపులు; ఎసగెన్ = విజృంభించినవి

కప్పల బెకబెకలతో వానకారు అందగించటం ఎలా ఉన్నదంటే - తమ శత్రువులైన పాములను మేఘుడు పరాక్రమంతో దండెత్తి మెరుపుల ఆయుధాలతో వాటిని పుట్టల్లో దూరేటట్లు చేసాడు. కనుక ఆ మేఘుని ప్రశంసిస్తున్నవో అన్నట్లు ఛందోభేదాలతో జంటలుగా చేరి గానం చేస్తున్నవి.

అలం : ఉత్ప్రేక్ష

విశే ॥ వేదంలో భేకసూక్తాలున్నవి వాటి పరమార్థమేమిటో మనకు తెలియలేదు. కాని అర్థము మాత్రము వానలు వచ్చి తమ కానందం కల్గించాయని మేఘుని ప్రశంసిస్తున్నవన్నంతవరకు తెలిసింది. వేదంలో చాలా ఛందస్సులు ప్రయోగింపబడ్డవి.గాయత్రి; ఉష్ణిక్ వంటివి. ఛందమేమంటే వేదం కనుక వృత్తభేదమన్న మాటతో వేదంలోని భేకసూక్తాలను సూచిస్తున్నట్లున్నాడు కవి.

భేకసూక్తం వసిష్ఠ ఋషిః త్రిష్టుప్ ఛందస్సు. ముందు అనుష్టుప్. మండూక దేవతలు. ఇది 10 మంత్రాల సూక్తము. (23-8-103). ఉదాహరణకు ఒక మంత్రభావం. అతిరాత్రమన్న పేరుగల సోమయాగంలో బ్రాహ్మణులు చుట్టూ కూర్చుండి మాటాడుకొంటున్నట్లు మండూకాలు సరస్తీరంలో అరుస్తున్నాయి. హేమండూకాల్లారా ! ఈ సంవత్సరదిన ప్రారంభాన్ని మరువకండి. ఇదే పర్జన్యప్రారంభదినం. (చూ. అనుబంధం)

తే ॥ మొగిలు మైచీఁకటుల నెక్కు జిగిమెఱుఁగులఁ
బగలు రాతిరి రాతిరి పగలు చేసె;
సకలమును నిద్రపుచ్చు కేశవుని నిద్ర
పుచ్చు ఘనునకు నిట్టి దద్భుతమె తలఁప ? 109

మొగిలు = మబ్బు; మై = శరీరం; చీకటులన్ = నల్లని కాంతులతో; ఎక్కు = అతిశయించే; జిగి = స్నిగ్ధమైన; మెఱుగులన్ = మెరుపులన్న ప్రకాశంతో; పగలు రాతిరిగా; రాతిరి పగలుగా; చేసెన్; సకలమును = సర్వసృష్టినీ; నిద్రపుచ్చు = నిద్రింపచేసే; కేశవుని = విష్ణుని; నిద్రపుచ్చు = నిద్రపోయేటట్లుచేసే; ఘనునకున్= గొప్పవానికి మేఘునకు, ఇట్టిది = ఇలాంటిది; తలంపన్ = ఆలోచిస్తే; అద్భుతమె = ఆశ్చర్యమా?

మబ్బు తన చల్లని మేని కాంతులతో పగటిని రాత్రిగా, మెరుపులతో రాత్రిని పగలుగా చేస్తున్నది. సృష్టినంతా నిద్రపుచ్చే విష్ణుని నిద్రపుచ్చే వానికి ఇదేమీ అద్భుతం కాదుగదా !

అలం : కావ్యార్థాపత్తి.

విశే ॥ విష్ణువున కిది యోగనిద్రాసమయం. ఇదే చాతుర్మాస్య ఉత్సవాలు చేసే కాలం.

బుద్ధదేవుడు వానకాలంలో కొండ గుహలో నుండి వానకాలం కడచన్నాక లోకసంచారం చేసేవాడట. బహుశా ఇదే సన్న్యాసుల చాతుర్మాస్య వ్రతహేతువు కావచ్చు. ఆ కాలంలో మఠాధిపతులు సంచారం మాని ఒకేచోట ఉంటారు యుద్ధ సంరంభం లేని రాజుల్లాగా.

తే ॥ ధూళి యడఁగిన మఱి మింట దోఁచె శంప
జలధరద్రోణి మన్ను పర్జన్యుఁ డెత్తి
ఖనది శ్రీ విభూషేచ్ఛఁ గడుగ మెఱయు
మృదుమమహీగతవసురజోరేఖ యనఁగ. 110

ధూళి = దుమ్ము, అడంగినన్ = అణగారిన; మఱి = తర్వాత; మింటన్ = ఆకాశంలో; శంప = మెరుపు; తోచెన్ = ప్రకాశించింది (బయటపడ్డది); పర్జన్యుడు = మేఘుడు; జలధర = మేఘమన్న; ద్రోణిన్ = బొచ్చెలో (ఇనుప బొచ్చెల్లో నేటికీ పనిచేస్తున్నారు); మన్నున్ = మట్టిని; ఎత్తి = పైకితీసి; ఖనదిన్ = ఆకాశగంగలో; శ్రీ = ఆకాశలక్ష్మి; విభూష+ ఇచ్ఛన్ = నగలకోర్కెతో; కడుగన్ = కడిగితే; మృదు = మెత్తని; మహీగత = మట్టిలోనున్న; వసు = బంగారముయొక్క; రజః = పొడియొక్క; రేఖ = గీత, చార, అనఁగన్ = అన్నట్లుగా; మెఱయున్ = ప్రకాశిస్తున్నది.

వానకు ముందుగా గాలివచ్చి దుమ్ము నెగమీటింది. తర్వాత, మబ్బుల్లో మెరుపుచాలు మెరసింది. ఇదెలా ఉన్నదంటే - ఆకాశలక్ష్మి తన నగలకోసం కోరితే, బంగారుకోసం, మేఘమన్న దొన్నెపట్టి ఇంద్రుడు ఆకాశగంగలో మట్టిని కడిగితే అందులో బయల్పడ్డ బంగారు రజను చాలులాగా మెరుపు మెరసింది.

అలం : ఉత్ప్రేక్ష.

లోకంలో పేదవాడు కంసాలివదలి వేసిన మట్టిని తెచ్చి నీటితో కడగటం. అందులో బంగారు రజను దొరకటం, అమ్ముకోవడం పరిపాటి.

ఇది ఆధారంగా వచ్చిన ఊహ ఇది. మెరుపు - మట్టినుండి బహిర్గమించిన బంగారు రజోరేఖ. ఈ దృశ్యసాదృశ్యాన్ని భావించాలి. చాలా రమణీయమైన ఊహ ఇది.

మృచ్ఛకటికంలో చారుదత్తునింటికి కన్నం వేసినపుడు లోనున్నదీపకాంతి కన్నంలో నుండి బయటకు రావటం - ఒరిపిడి రాయిపై బంగారం గీటు పెట్టినట్లున్నదన్న అలంకారం జాతివే ఇవన్నీ.

వసుశబ్దం విచిత్రార్థభావనకాధారమౌతున్నది. ఇది రాజనీతికి సంబంధించిన మాట. (చూ. శ్వేతచ్ఛత్రం)

తే ॥ స్థూల పరిపక్వ కాననోదుంబరాగ్ర
రంధ్రముల వాననీరు సొరంగ వెడలె

మశకపంక్తులు దావధూమంబు లడఁగ
రచ్చ సేయంగ వెడలె విశ్రాంతి కనఁగ. 111

స్థూల = బలిసిన; పరిపక్వ = బాగాపండిన; కానన = అడవి; ఉదుంబర = మేడిపండ్ల; అగ్రరంధ్రములన్ = పైనున్న రంధ్రాలలో; వాననీరు; చొరంగన్ = ప్రవేశిస్తే; మశకపంక్తులు = దోమలగుంపులు; దావధూమంబుల = కార్చిచ్చు పొగలు; అడఁగన్ = అణగారినాక; విశ్రాంతికిన్ = సేదదీరటానికై, రచ్చసేయుంగన్ = సభచేయటానికై; వెడలెన్ +అనగన్ = బయులుదేరినవో అన్నట్లు; వెడలెన్ = బయులుదేరాయి

బాగా బలిసి పండిన అడవిమేడి పండ్లపై రంధ్రాలనుండి వాననీరు లోనికి పోగా, అది వరకే అక్కడనున్న దోమలగుంపులు బయటకు చాళ్ళుగా రావటం ప్రారంభించాయి. ఆ దృశ్యమెలా ఉన్నదంటే వేసవిలో కార్చిచ్చు అణగారిపోయాయి. కనుక విశ్రాంతిగా రచ్చచేయటం కోసం బయలు దేరినవో అన్నట్లుగా ఉంది

అలం : ఉత్ప్రేక్ష

విశే ॥ మేడి పండు చూడ మేలిమై యుండును
పొట్టవిప్పిచూడఁ బురుగులుండు (నుకనుక)

వేసవిలో కార్చిచ్చు పొగకు దోమలు పండ్లలోనే ఇరుక్కొని కూర్చున్నవి. ఇప్పుడు వాననీరు ప్రవేశిస్తే వాటికి తెలిసింది వేసవి గతించినదని. అందుకని విశ్రాంతిగా బయట రచ్చచేసుకోవటానికి బయలు దేరాయన్నట్లు బయటకు వస్తున్నవి. చూ. 2-70 చీమలవర్ణన

అల్పవస్తువర్ణన ఈ కావ్యంలో మెండు కవిదృష్టి యోగదర్శనం కనుక ఉచ్చనీచభేదముండదు. రమణీయ వస్తువర్ణనం ప్రతివాడూ చేస్తాడు. కానీ నీచవస్తువర్ణన చేసేవా రరుదు.

స్రగ్ధర : గ్రావాలం గేతకీ కోరక కుటజ రజోరాజి దూర్వాంకుర శ్రీ
తో వీక్షింపన్ దినానుత్రుటిన్ మఱుపడుచుం దోఁచు, చిట్లౌ తిరోభా
వావిర్భావంబులం బాయక పొరయ నభస్యాభ్రముల్గప్పి, పైనెం
తే విప్పి పింఛికల్ బర్హిణులు దిరుగఁ బెల్లింద్రజాలంబుఁజూపెన్. 112

గ్రావాలన్ = కొండలపై; కేతకీ = మొగలి; కోరక = మొగ్గలు, కుటజ = కొండమల్లె; రజోరాజి = పుప్పొడి చారలు; దూర్వ+అంకుర = లేతగరికపోచల; శ్రీ = కాంతిసంపద, తోన్; వీక్షింపన్ = చూడగా; దిన+అనుత్రుటిన్= పగటి ప్రతిక్షణం; మఱుపడుచున్ = అదృశ్యమౌతూ; తోచుచున్ = కన్పిస్తూ; ఇట్లు, ఔ; తిరోభావ = అదృశ్యం, ఆవిర్భావంబులన్ = కన్పించటమూ; పాయక = విడువక; పొరయన్= కలుగుతుంటే; నభస్య = శ్రావణ మాస; అభ్రముల్ = మేఘాలు, కప్పి = ఆచ్ఛాదించి;పైన్; బర్హిణుల్ = నెమళ్ళు, పింఛికల్ = పింఛాలు, ఎంతేన్ = చాలా; విప్పి = విస్తరించి; తిరుగన్ = సంచరిస్తే; ఇంద్రజాలంబున్, చూపెన్

వానకాలంలో మేఘం, నెమలి, కొండలపై పూలు - గరిక, విస్తరించాయి. కొండలపై మొగలి, గిరిమల్లె పూలరజస్సు గాలిలో వ్యాపించింది. క్రింద నేలమీద గరిక పచ్చనికాంతులు. ఇవి మేఘాల ఏకల్లలో కన్పించటం లేదు. మెరసినప్పుడు కన్పిస్తున్నవి. చూస్తే ఇదేదో ఇంద్రజాలంగా ఉంది. కొండలపై పింఛాలు విప్పుకొని నెమళ్ళు తిరగడం ఇంద్రజాలికుడు పింఛంతో త్రిప్పటం లాగా ఉన్నది. మబ్బులు నీటితెరగా ఉంది.

అలం : రూపకము.

తే ॥ గిరులఁ దట జంబుతరువులఁ దొరఁగు పండ్లఁ
బుట్టె జంబూనదులు; గానఁ బొదువు మొగిలు
మేన నవి సోఁకు నెడలు గామిడి దటిచ్చ
లంబునను శుద్ధజంబూనదంబు లయ్యె. 113

గిరులన్ = కొండలపై; తట = దరులందు; జంబు = నేరేడు; తరువులన్ = చెట్లనుండి; తొరగు = రాలే; పండ్లన్ = పండ్లవల్ల; జంబూనదులు = నేరేళ్ళ పళ్ళు; పుట్టెన్ = జన్మించాయి; కానన్ = కాబట్టి; పొదువు = క్రమ్మిన; మొగిలు = మబ్బు; మేనన్ = శరీరంపైన; అవి = ఆ పండ్లు; సోకు = తాకిన; ఎడలు = చోట్లు; గామిడిన్ = గొప్పగా, తటిత్ = మెరుపు; చలంబునను = మిషతో; శుద్ధ = స్వచ్ఛమైన; జంబూనదంబులు = బంగారములుగా; అయ్యెన్ = అయినవి.

కొండలకొమ్ములందున్న నేరేడుచెట్ల పండ్లు రాలి జంబూనదులు ఏర్పడినవి. మేఘాలు ఆ కొండకొమ్మలపై వ్రాలినపుడు వాటి మేనులకు జంబూ ఫలాలు తాకిన చోట్లు బంగారమైనట్లు మెరుపులు మెరుస్తున్నవి.

అలం : కైతవాపహ్నుతి.

గామిడి = శ్లేషార్థకంగా వేదంవారి పాఠం వారు కల్పించుకొన్నదే. వావిళ్ళప్రతిలో = ఎడలుగా- చోట్లుగా; మితిన్ = మేరదప్పక అని వ్యాఖ్యానించారు.

తే ॥ సురభిబడిఁ జన్న సప్తలాశోక కమల
కువలయామ్రాలికిఁ గదంబ కుటజ నీప
కకుభ యూథిక లను సాయకములు మరుని
కేను గల్గి గేదఁగిసురె యెక్కు డయ్యె. 114

మరునికిన్ = మన్మథునకు; సురభిబడిన్ = వసంతఋతువు వెంబడి; చన్న = గతించిన; సప్తలా = నిరజాజి; అశోక = అశోకము; కమల = తామర; కువలయ = కలువ; ఆమ్ర = మామిడి; ఆళికిన్ = సమూహానికి ( ఇవి మరుని పంచబాణాలు); కదంబ= కడిమి; కుటజ = కొండమల్లె; నీప = చీకటిచెట్టు;

(కదంబ , నీప పర్యాయపదాలుగా కొందరు; మరికొందరు వేరుగా పేర్కొన్నారు); కకుభ = మద్ది; యూధికలు = అడవిమొల్లలు; అను = అన్న (ఐదు);సాయకములు = బాణాలు; ఏను = ఐదు; కల్గి = వానకాలంలో ఏర్పడి; గేదగిసురె = మొగలి చురకత్తి; వసంతంలోని పంచసాయకాలకంటె మిగిలి ఆరవదైనది.

*అరవిందం అశోకం చ చూతం చ నవమల్లికా*
*నీలోత్పలం చ పంచైతే పంచబాణస్య సాయకాః (అమరకోశం).*

మరునకు వసంతంలో పూచే ఈ ఐదు పోగా, వానకాలంలో వీటికి బదులుగా, కడిమి ఇత్యాదులు ఐదు లభించటమే కాక ఆరవదిగా మొగలి పూవన్న చురకత్తె ఎక్కువైనది.

విశే ॥ పంచబాణములు వసంతంలోను, తామర, కలువలు శరత్తులోనే ఉంటాయి తప్ప వర్షర్తువులో వీటిల్లో ఏదీ ఉండదు కదా. మరి మరున కాయుధా లేవి ? కనుక ఈ ఋతువులో ఐదు, అదనంగా మరొకటి చెప్పటం ప్రాచీన కవి సమయానికి మరొక కల్పన చేర్చటమే. పంచబాణాలు ఋతువు ననుసరించి మారవలసిందే కాబోలు.

కం ॥ నటన పర కేకి పాత్ర
స్ఫుట యవనిక లన మొగిళ్లు పాదివెఁ భూభృ
త్తటుల, నవి యాకు దిను చిట
పాటరవము సెలంగెఁ దాళముల చప్పుడు నాన్. 115

నటన = అభినయంలో; పర = ఆసక్తికల; కేకి = నెమళ్ళనెడు; పాత్ర = నటులకు; స్ఫుట = స్పష్టమైన; యవనికలు = తెరలు; అనన్ = అనగా; మొగిళ్ళు = మబ్బులు; భూభృత్ = కొండలయొక్క; తటులన్ = తరులను; పాదివెన్ = క్రమ్మినవి; అవి = ఆ మబ్బులు; ఆకున్ = ఆకులను; తిను = తినే; చిటపాట రవము =చిటపటమనే ధ్వనులు; తాళముల = సంగీత తాళముల; చప్పుడు = ధ్వనులు; నాన్ = అన్నట్లు; చెలంగెన్ = వ్యాపించాయి.

మబ్బులు, కొండ శిఖరాలను, దరులనూ క్రమ్ముకొని ఉంటే నెమళ్ళు పార్శ్వాలపై మూగి సంచరిస్తున్నాయి. మబ్బులాకులను తింటూ ఉంటే చప్పుళ్ళు విన్పిస్తున్నాయి చిటపటమని. ఇదెలా ఉందంటే కొండ పార్శ్వాన నెమళ్ళు మబ్బుల యవనిక లేవగా నటిస్తున్నట్లున్నవి.

ప్రాచీనకాలంలో కొండగుహలు, దరులను ఆధారంగా చేసుకొని నాట్యం ప్రదర్శింపబడేది. దీనికి శాసనాధారాలున్నాయి. రామాయణకాలం నాటి నుండి పద్ధతి ఉన్నట్లు అందులోనే సాక్ష్యాధారాలున్నాయి.

*మత్తకోకిల సన్నాదైః నర్తయన్నివ పాదపాన్*
*శైలకందరనిష్క్రాంతః ప్రగీత ఇవ చానిలః(కిష్కింధ)*

కొండగుహలనుండి వచ్చేగాలి గీతమై, చెట్లను నర్తింపచేస్తుంటే కోకిలలు వాద్యాలు మ్రోగిస్తున్నవి.

ఈ సాలంకారోక్తి ఆనాటి సామాజికమైన నాటకరంగాన్ని ధ్వనిస్తున్నది. మబ్బు ఆకు తినటమేమిటన్న ప్రశ్నకు సమాధానంగా వేదం వారి వ్యాఖ్యానం చాలా అందమైన సమాధానం చెప్పింది. ఆటనికులు, విస్తళ్ళు తెచ్చి అమ్ముకొనేవేళ వానకాలంలో అవి చిల్లుపడివుంటే, కొనేవా రదేమని అడిగినప్పుడు - వారంటా రట -

''బాబూ ! వానకాలం కదా - మబ్బులు తిన్నాయని'' చిత్రమైన మాట. రాయలవారి కవిత్వంలో ఇలాంటి అపూర్వమైన విషయాలు - ఎక్కడా విన్నవీ, కన్నవీ కానట్టివి ఎన్నో ! కవి సమ్రాట్టు విశ్వనాథంతటి వారన్నారు. ''ఆయన కంటె బహుశ్రుతుడు మరొకడుండడు. ఆయన మహాచక్రవర్తి కనుక, ఎన్ని విన్నాడో, కన్నాడో ఆయన. ఆస్థానాని కెంత మంది పండితులు రాలేదు'' అని. కాబట్టి ఆయన అనుభవవైశాల్యమూ, లోతూ, మన ప్రమాణాల కందేవి కావు.

కొబ్బరి కాయలో కొబ్బరి ఉండకపోతే వెన్నెల మేసింది అనటం లాంటిదే ఈ ఆకు తినటం.

చ ॥ జలధర ముప్పుతోఁ బులు పొసంగు రసం బని యప్పయోధి నిం
పొలయఁగఁ గ్రోలి, పై దధిపయోధియుఁ గ్రోలఁగఁ, బ్రాఁచి దౌటఁ బె
న్పులుసుఁ గరుళ్ళు గ్రాయ, నవివో వడగండ్లన రాలెఁ, గానిచో
నిలఁబడ వానిఁ దిన్నయపుడే చలిపండ్లు వడంగ నేటికిన్. 116

జలధరము = మబ్బు, ఉప్పుతోన్ = ఉప్పుకలిపిన; పులుపు = పులుసు; రసంబు = రుచి; ఒసంగును = ఇస్తుంది; అని = తలచి, అ+పయోధిన్ = ఆ ఉప్పునీటి సముద్రంలో నీరు; క్రోలఁగన్ = త్రాగితే; పైన్ = ఆ తర్వాత; దధి పయోధియున్ = పెరుగు సముద్రం; క్రోలగన్ = త్రాగితే, ప్రాచిది+ ఔటన్ = (ఆ పెరుగు సముద్రము) నిలువయున్న అతిపురాతనమైనదికావటం వల్ల; పెన్+పులుసున్+ కరుళ్ళు = పెద్దపులుపుగడ్డలు; క్రాయన్ = క్రక్కగా; అవివో = అవే సుమా, వడగండ్లు + అనన్ = వడగళ్ళు అన్నట్లుగా, రాలెన్ = పడ్డాయి; కానిచోన్ = కాకపోతే; ఇలన్ = నేలపై; పడన్ = పడగా; వానిన్ = ఆ వడగండ్లను; తిన్నయిపుడే = తినగానే; చలిపండ్లు పండగన్ = చలిలో బిగుసుకొని పోవడం; ఏటికిన్ = దేనికట.

వింతపండు, ఉప్పుతో పాటుగా రుచించినట్లు మేఘం దీనికోసం ఉప్పుసముద్రాన్ని, పులిసిన పెరుగుసముద్రాన్ని త్రాగినందువల్ల కడుపులో త్రిప్పి మేఘుడు పులిసిన పెరుగుదొబ్బలు కక్కినాడన్నట్లుగా వడగండ్లు రాలాయి. లేకపోతే పడినవాటిని తినగానే పళ్ళు పులవటం దేనికి ?

అలం : ఉత్ప్రేక్ష.

విశే ॥ లోకంలో చల్లని వస్తువులు తిన్నప్పుడు పులిసినట్లు 'అబ్బా' అనుకోవట మున్నది కదా ? అదే పండ్లు పులవటం - చలిపండ్లు అని జనవ్యవహారం.

తే ॥ అపుడసల్లకు దిగక మేఘాలి పొదువు
నచలముల పైనె దొడ్డికట్టగు మృగాళి

జాడ చూపట్టె మీఁది పర్జన్యధన్వి
నృపున కగు తెర వేఁట యాయిత మనంగ. 117

అపుడు = ఆ వానకాలంలో; అసలు (ళ్ళు) = బురదలుగా (నైన నేలకు); దిగక = దిగకుండా; మేఘ+ ఆళి =మబ్బులగుంపు, పొదుపు = క్రమ్ము; అచలములపైనె = కొండలపైనే; దొడ్డికట్టు + అగు = దొడ్డిలో కట్టివేసినట్లులైన; మృగ+ ఆళి = జంతువుల గుంపు; జాడ = పద్ధతి; మీది = పైనున్న; పర్జన్యధన్వి = మేఘుడన్న విలుకాడైన; నృపునకు = రాజునకు; అగు = అయిన; తెరవేట = ఆ పేరుగల వేట; ఆయితము = సిద్ధపడటం; అనంగన్ = అన్నట్లు; చూపట్టెన్ = కన్పించింది.

వానకాలం రాగానే మృగపంక్తి బురదైన నేలపై తిరగటం ఇష్టంలేక కొండపైనే గుంపులు కట్టి నిలబడటం చూస్తే ఎలా ఉన్నదంటే- ఇంద్రుడన్న విలుకాడైన రాజునకు తెరవేటకోసం సిద్ధమైనట్లున్నది.

లలం : ఉత్ప్రేక్ష.

విశే ॥ తెరవేట = జంతువులను మందలుగా ఒకచోటికి తోలి వేటాడటం రకరకాల వేటల్లో ఇది ఒకటి. జంతువులు కొన్ని బురదలో అడుగుపెట్టవు.

చ ॥ తడి తల డిగ్గి ముంప, జడతం దుదఱెప్పలఁ గన్ను విప్పి, పు
ల్పొడుచును నీరు ముంగఱల పోలిక ముక్కునఁ గూడ, నోటఁ గొం
తొడియుచుఁ గూఁటి కఱ్ఱ సగ మొత్తుచు ఱెక్క విదుర్పు మున్నుగా
వడఁకుటె గాక చేష్టుడిగె వక్షము పక్షులు జానువుల్ చొరఁ. 118

పక్షులు =వానకాలంలో పక్షులస్థితి; తడి = నీరు; తలడిగ్గి = తలనుండి జారి; ముంపన్ = కన్నుదలను ముంచగా; జడతన్ = జడత్వం వల్ల; తుదఱెప్పలన్ = రెప్పలచివళ్ళనుండి; కన్ను = నేత్రము; విప్పి = కన్నువిప్పి; పుల్‌పొడుచుచున్ = ''కన్నులు పులకరించుచు'' వావిళ్ళ, ''ఱెప్పవేయక చూచుచు'' (వేదం) - నీళ్ళున్నందున కన్నులను విప్పి రెప్పవేయకుండా చూస్తూ; నీరు = వానబిందువులు, ముంగఱలపోలిక = ముత్తెపు బులాకిగా; ముక్కునన్ = ముక్కులందు; కూడన్ = కూడుకోగా, నోటన్ = నోటిలో; కొంత = కొంచెంనీటిని; ఒడియుచున్ = మ్రింగుతూ; గూటికఱ్ఱన్ = గూటిపుల్లలకు; సగము = సగమునీటిని; ఒత్తుచున్ = రాస్తూ; ఱెక్కవిదుర్పు = రెక్కలు విదల్చటం; మున్నుగాన్ = మొదలుగా; వడకుటె గాక = వణకటమే కాకుండా; జానువుల్ = మోకాళ్ళు; వక్షమున్ = రొమ్మును; చొరన్= జొనిపి, (చొప్పునట్లు చేసి); చేష్ట = చేష్టలను; ఉడిగెన్ = కోల్పోయినవి, నిశ్చేష్టములైనవి.

వాననీరు తలనుదిగి శరీరమంత ముంచినది. పక్షులు జడత్వం పొం రెప్పల తుదలతో తను కండ్లను విప్పార్చి (నిండిన నీరు పోగొట్టుకోవటానికి) చూస్తూ, ముక్కులనిండిన నీటిబొట్లు ముక్కులకు ముంగరలు కాగా, నోటిలోనికి ముక్కులు నిండిన నీరు జారగా కొంత త్రాగి, మరికొంత నీటిని గూటిపుల్లలకు రాస్తూ కణకటం తప్ప. సర్వచేష్టలనుడిగినవి. చలిపోగొట్టు కోవటానికై మోకాళ్ళను రొమ్ములోనికి కూర్చుకొని ముణగదీసుకుని వున్నవి.

అలం : స్వభావోక్తి

ఒక పక్షి వానలో ఎలావున్నదీ చిత్రించినతీరు లోకాద్భుతము ప్రకృతి చిత్రణ ఇంతకంటే ఎలా ఉంటుంది ! పాశ్చాత్య సహజచిత్రణ తీరుగా ఉందీ పద్యభావం.

కం॥ చెందు నెఱసంజ కుంకుమ
క్రందునఁ గెంపెక్కు దివికిఁ గాశ్మీరత రా,
నిందు శిలాత్వము రవి గని
యెం; దోయముఁ గురియ నేల యిటురాకున్నన్. 119.

చెందు = పొందే, ఎఱసంజ = ఎర్రనిసంధ్యా, కుంకుమ క్రందునన్ = కుంకుమ (పువ్వు) యొక్క సాంద్రతవల్ల, దివికిన్ = ఆకసమునకు, కాశ్మీరతరాన్ = కాశ్మీరదేశలక్షణం రాగా, రవి = సూర్యుడు, ఇందు శిలాత్వము చంద్రకాంత శిలా లక్షణాన్ని, కనియెన్ = పొందినాడు, అటుగాకున్నన్ = అలాకాకపోతే, తోయము = నీరు, కురియన్ = వర్షించటం, ఏల = ఎందుకు?

ఎర్రని సంజ కుంకుమ వర్ణసాంద్రత వల్ల ఆకాశం కాశ్మీరదేశంకాగా, సూర్యుడు చంద్రకాంతశిలయైనాడు. లేకపోతే అతడు వర్షించటం కుదరదు కదా ! పగలంతా వానకురియటం వల్ల రవిచంద్రకాంత మణియైనాడని కల్పన. సంజవేళల్లో మాత్రం ఆకాశం కుంకుమ వర్ణశోభితమైనదని తాత్పర్యము.

కుంకుమ కాశ్మీరంలో పుడుతున్నందున దానికి కాశ్మీరమని పేరు వచ్చింది. కాశ్మీరశబ్ద నిర్వచనం చెప్పటం వల్ల నిరుక్తి అలంకారము.

తోయస్రావానికి, హేతువుకాని రవి ఇందు శిలాత్వంమందటమన్నది హేతువుగా చెప్పటం వల్ల హేతూత్ప్రేక్ష.

చ॥ అలజలరాశినీటఁ బగ లర్కకరావలి చూలు దాల్పఁగా
నలమిన యీర్ష్య రాత్రి ధవళాంశుకరావళి తాము దాల్పఁ, ద
జ్జలముల నాన మూఁగికొనుచాడ్పున నాడి వహించెఁ జూలు మ
బ్బుల నిల మంచునీలఘనపుంజమువల్ల బలాకమాలికల్. 120.

పగలు = పగటిపూట, అర్క = సూర్యుని, కర+అవళి = కిరణశ్రేణి, అల = ఆ, జలరాశి నీటిన్= సముద్రోదకంతో, చూలు = గర్భం, దాల్పగాన్ = ధరిస్తే, రాత్రిన్ = రాత్రిలో, అలమిన = కల్గిన, ఈర్ష్యన్ = అసూయతో (సవతి భావంతో), ధవళ = తెల్లని, అంశు = కిరణాలు కల చంద్రుని, కర +అవళి = కిరణాలగుంపు, తామున్ = తామున్నూ, తాల్పన్ = ధరించటం కోసమా, తత్= ఆ మేఘాల, జలములన్ = నీళ్ళను, ఆనన్ = త్రాగటానికై, మూగికొను = క్రమ్ముకొను, బాడ్పునన్= విధంగా, బలాకమాలికల్ =

బెగ్గురు పక్షుల గుంపులు, మబ్బులన్ = మబ్బులతో, ఇలన్ = భూమిని, ముంచు = ముంచెత్తే, నీల = నల్లని, ఘన = మేఘాలయొక్క, పుంజము = సమూహం, వల్ల = వలన, ఆడి = మబ్బులపై ఆడుతూ, చూలు = గర్భము, వహించెన్ = ధరించాయి.

'గర్భాధవక్షణపరిచలనూబద్ధమాలాః
సేవిష్యంతే నయన సు భగం చే భావంతం బలాకా (మేఘసందేశం)

సూర్యకిరణాలు పగలే చూలు ధరిస్తే రాత్రి చంద్రకిరణాలు తాము చూలాండ్రు కావాలని నేలవల్లా ముంచే మబ్బులపై ఆడుతూ బలాకల మిషతో మేఘోదకం వల్ల చూలు ధరించాయా అన్నట్లు రేబవళ్ళు ఒకటే వాన.

కం॥ ఉఱుము విని యలకకై దివి
వెఱఁ బఱచుమరాళపటలి విడిచినఁ బడున
క్కఱచిన బిసలవవిసరము
తెఱఁగున వడగండ్లు ధవళదీధితి రాలెఁ. 121

వడగండ్లు = వడగళ్ళు, ఉఱుము విని, అలకకై = అలకాపట్టణానికి, దివిన్ = ఆకాశంలో, వెఱన్= భయంతో, పఱచు = పరుగెత్తే, మరాళ = హంసల, పటలి = సమూహం, విడిచినన్ = జార్చిన, పడు = రాలే, ఆకఱచిన = ముందు నోటకరచుకొన్న, బిసలవ = తామరతూడ ముక్కల యొక్క, విసరము = గుంపు, తెఱఁగునన్ = విధంగా, ధవళ = తెల్లని, దీధితులన్ = కాంతులతో, రాలెన్ = రాలాయి.

తెల్లని వడగండ్లు రాలటం చూస్తే, వానకాలానికి భయపడిన అంచల గుంపు ఆకాశంలో అలకానగరానికై పరుగెత్తుతూ వుంటే నోటిలో కరచుకొన్న తామరతూడముక్కలు రాలుతున్నట్లున్నవి.

అలం : హేతూత్ప్రేక్ష.

విశే॥ హంసలు వానకాలంలో మానస సరస్సుకు పోవటం మరలా శరదృతువులో లోకం లోకిరావటమన్నది కవి సమయం. ఈ కవి సమయానికి అర్థం యోగశాస్త్రంలో వుంది.

హంస = ప్రాణశక్తి (ప్రాణవాయువు కాదు) క్రౌంచ బిలం = కంఠం. అది విశుద్ధి చక్రస్థానము. ప్రాణశక్తే హంస మానససరస్సు అంటే సహస్రార కమలం. విశుద్ధచక్రభేదనమే క్రౌంచపర్వతాన్ని కుమారస్వామి భేదించిన కథ పరమార్థం. కవి సమయాలన్నీ ఇలా ఏర్పడ్డవే.

మూ. 4-137. శరద్వర్ణన ప్రారంభము.

కం॥ తటిదుత్సారితఫణభృ
త్పటిలి నిరన్నంబు లయ్యెఁ దక్కువు బర్హుల్

నటన; మతిహర్షహేతూ
త్కటలాభం బిడునె మది క్షుధ న్నీర్వట్టుల్ ? 122

బర్హుల్ = నెమళ్ళు, తటిత = మెరపుచేత, ఉత్సారిత = తరుమబడ్డ, ఫణభృత్ = పడగలు కలవి పాములు, సంతతి = సమూహంతో, నిర్+అన్నంబులు = అన్నంలేనివి, అయ్యున్ = అయికూడా, నటనము = నర్తనను; తక్కవు = వదలవు, అతి = మిక్కిలి, హర్ష = సంతోషమన్న, హేతు = కారణంగా, ఉత్కట = అధికమైన, లాంఛంబు = లబ్ధి, మదిన్ = మనస్సులో, క్షుధన్ = ఆకలిని, నీర్వట్టున్ = దప్పికను, ఇడునె = కల్గిస్తాయా।

నెమళ్ళకాహారమైన పాములు, మెరుపులకు భయపడి పుట్టల్లో దూరినవి. కనుక నెమళ్ళ కాహారం లేదు. లేకపోయినా తమ ఆటను మాత్రం వదలలేదు. అంతేకదా ! సంతోషాతిశయం కలిగినపుడు మనస్సుకు ఆకలిదప్పులు తెలియవు కదా !

అలం : అర్థాంతరన్యాసం.

సీ॥ రవిఁ జూచి కుడుచునారలకును గృకలా స
మ్ములకుమ దృష్టి మిన్నులనె నిలిచె;
సంధ్యార్ఘ్యదాయి ద్విజశ్రేణి కిలు సేరు
మొదవులకును భ్రాంతి మది జనించె;
హలజీవి సందోహములకు బలాకికా
విసరంబులకు మంచి వెదలు దొరకె;
నెలమిఁ బొల్పగుయూథికలకు, సంతలకూట
ములకును, మఱి విచ్చు మొగ్గలొదవె;

తే॥ నతిథి సంఘంబునకు, నీవినట్టియెనుప
కడుపులేఁగలగమికి, వాకట్టు లెసఁగె;
మట్టిమిద్దెలవారికి, మరపనులకు,
నెలఁతఁ బాసినవారికి నిదుర చెడియె. 123

రవిన్ - సూర్యుని, చూచి = దర్శించినాకనే, కుడుచు = తినే, వారలకును = వాళ్ళకూ, కృకలాపములకును= తొండలకున్ను, దృష్టి = చూపు, మిన్నులనె = ఆకసంపైనే, నిలిచెన్ = నిలిచింది.

తొండలు వానకాలంలో కొండలెక్కి చెట్లెక్కి పైకి చూడటం సహజం అది మంచివానలు వస్తాయని సూచిస్తుంది. (తూనీగలాడినా అంతే) కనుక వాటి దృష్టి సూర్యదర్శనమైనాకనే భోజనంచేసే వ్రతంకలవారికీ చూపులు ఆకాశంపైనే నాటుకున్నవి.

(2) సంధ్య = సంధ్యాకాలంలో, అర్ఘ్యదాయి = అర్ఘ్యమిచ్చే, ద్విజ = బ్రాహ్మణ, శ్రేణికిన్= సమూహానికి, ఇలు = ఇల్లు, చేరు = చేరే, మొదవులకున్ = ఆలమందలకు, మదిన్ = మనస్సులో, భ్రాంతి = భ్రమ, జనించెన్ = కల్గింది.

సంధ్య కన్పించనందున సంజనార్ఘ్యే బ్రాహ్మణునకు, ఆలమందలకు - ( ఇంటికి మళ్ళటం కోసం) సంధ్యాభ్రాంతి కల్గింది.

(3) హలజీవి = నాగలితో బ్రతికేవారు - రైతులు, సందోహముకున్ = సమూహామునకు, బలాకికా = తెల్లకొంగల, విసరంబులకున్ = గుంపులకు, మంచి = చక్కని, వెదలు = గింజలు చల్లటం (రైతు), పశుపక్ష్యాదుల సంగమం (కొంగలు), దొరకెన్ = లభించాయి.

వ్యవసాయదారులకు విత్తులు చల్లుకోవటానికి, బొగురు పక్షులకు సంగమ కాలం, మంచికాలం ప్రాప్తించింది.

(4) ఎలమిన్ = వికాసంతో, పోల్చు+ అగు = అందమైన యూధికలకున్, అడవి మొల్లలకు, సంతలన్ = సంతల్లో, కూటములకున్ = సమావేశాలకు, మఱి = ఇక, విచ్చు మొగ్గలు = చెదరిపోవటం (సంత కూటమయుల పక్షం) మొల్లలకు = మొగ్గలు విచ్చుకోవటం, ఒదవెన్ = కల్గినది.

అడవిమొల్లల మొగ్గలు వికసించటంతో సంతల్లో జనుల కలయికలకు చెదరుపాటు సంభవించింది (చూ 4-131)

(5) లతిథి సంఘంబునకున్ = అతిథి సమూహానికీ, ఈనినట్టి, ఎనుపకదుపు = గేదెలగుంపుల, లేగల = దూడల, గమికిన్ = శ్రేణికి, వా = నోరు, కట్లులు = బంధనం ఎసగెన్ = ఎక్కువైనాయి.

వానలో అతిథులు గృహస్థుల ఇండ్లకు పోలేనందున వారి నోళ్ళు, ఈనిన గేదె దూడలకు పాలు సమృద్ధిగా లేనందున మూతులకు, బంధమేర్పడినది. లేదా లేగదూడలకు అప్పుడే ఈనిన ఎనుముపాలు (ముర్రుబాలు) త్రాగితే జబ్బు చేస్తుంది కనుక మూతులకు చిక్కాలు కట్టినందువల్ల, వాకట్టు కలిగింది.

(6) మట్టిమిద్దెల వారికిన్ = మట్టితోకట్టిన మిద్దెల్లో వున్నవారికీ, మరుపనులకన్ = మన్మథకార్యములకు, నెలతన్ = స్త్రీని, పాసిన = లేని (ప్రవాసం వెళ్ళిన పురుషులగు వారికిన్ = వారికి, నిదురచెడియెన్ = నిద్రలేదు. (చూ. 129వ పద్యం).

మట్టిగోడలపైన ఆకులు కొమ్మలు పేర్చి మట్టితో కప్పిన ఇల్లు మట్టిమిద్దె. అది వానకు కరిగిపోతుంది కనుక నిద్రలేదు. ప్రవాసులకు భార్యలు దూరమైనందున నిద్రలేదు. అది వర్షాకాలం కావడం వల్ల భరింపరాని విరహం వల్ల నిద్రలేదు.

అలం : తుల్యయోగిత

ప్రతిపాదంలో క్రియాప్రయోగవైచిత్రి గమనింపదగ్గది. మనిషికీ, జంతువునకూ ఒకే క్రియ.

మహత్-అమహత్ వాచకాలకు ఒకే క్రియాన్వయ ప్రయోగం ఒకేరకమైన కారకవైచిత్రిగా కుంతలాచార్యుడన్నాడు.

మొదటిపాదంలో కృకలాస విషయం బృహత్సంహితలో వున్నదని వేదంవారు శ్లోకనుదాహరించారు. జంతువులకు దూరదర్శనశ్రవణదిశక్తులున్నాయి కనుక, జనజీవనంలో జంతువులకూ, కీటకాలకూ భాగస్వామ్యమున్నది. ఇది పల్లీ జీవన సమన్వయం.

ఉ॥ కాలునిదున్న నందినయి గంటలు దున్నక మంటి నా, మహో
కాలుని నంది దున్న నయి కర్దమమగ్నత లేక మంటి నా,
హాలికులెన్నఁడుం దెగనియౌరులచేలును, జాకుమళ్లుమం,
గా, లలి వేరు సాఁగి రిలఁ గల్గుపసింగొని పేద మున్నుగన్. 124

కాలునిదున్న = యముని వాహనం, గంటలు = అవురు దుబ్బులు కల మెట్టచేలు, దున్నక = దున్నకుండా, మంటిన్ నాన్ = బ్రతికిపోయాడన్నట్లుగా, మహాకాలుని = శివుని, నంది = వృషభం, దున్నను-అయి = దున్నపోతునైనందున, కర్దమమగ్నత = బురదలో పొర్లటం, (లేక) మంటినాన్, హాలికులు = కర్షకులు, పేదమున్నుగన్ = పేదవారు మొదలుకొని, ఇలన్ = లోకంలో, కల్గు = ఉన్న, పసింగొని= పసరాలను గైకొని, ఎన్నడున్ = ఏ కాలంలోనూ, తెగని = నరుకుతదని, ఔరులచేలునున్= అవురు గంతలకల మెట్టపొలాలు, చేకుమళ్ళునున్ = చవిటిపల్లపు చేలు, కాన్= అగునట్లుగా, లలిన్= సంతోషంతో, ఏరుసాగిరి = ఏరువాకసాగినారు.

దున్నలకు మెరక దుక్కి ఎడ్లకు దమ్ముదుక్కి కష్టము కనుక యముని దున్న నంది కానందువల్ల ఔరుగంటలు గల మెరకచేలు దున్నే పని తప్పిందని సంతోషిస్తే, శివుని వాహనం నంది దున్నకానందున దమ్ము చేసే పని తప్పినదని సంతోషించేటట్లు, ఎన్నడూ దున్నని బీళ్ళు సైతం వానలకు వ్యవసాయ యోగ్యత పొందినవి. కనుక లోకంలో వున్న పసినిగొని పేద సాదా దగ్గరనుండి కర్షకులు ఏరువాక సాగారు.

ఎడ్లతో దమ్ము ( నీరు పెట్టి బురదైన చేనును చదును చేయటం) చేయరు. అది దున్నలతోనే చేయిస్తారు. కనుక నందికా బాధ తప్పింది యముని వాహనానికిది ఆనందం. బురద లేక పదును పొరని బీడు - ఔరుగంట్లు పొదలతో వున్నదానిని దున్నే బాధ్యత తప్పిందని సంతోషించింది.

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ మహారాజుకా వ్యవసాయ పద్ధతులు తెలియటం చిత్రం కదా !

ఈ వర్షాసమృద్ధి యామునుని ధర్మపరిపాలనకు చిహ్నమని శ్రీవేదంవారన్న మాట చాలాగొప్పది. ఆ ధర్మచక్రవర్తి పాలనను స్తుతిస్తూ ప్రాచీనమహాకవులు వ్రాసిన వ్రాతలన్నీ దీనికి సాక్ష్యమే.

''నెలమూడు వానలు నింగి కురిసె'' - (మనుచరిత్ర)

రాయలవారిపాలనను గురించి చేసిన ఈ వర్ణనయే భాగ్యంతరంగా యామునపాలనలో వచ్చింది.

కం॥ వరఁజుబడి రొండిఁ ద్రొక్కం
జరణంబులఁ జుట్టి పసిఁడి చాయకడుపులం
బొరి నీరుకట్టె లమరిను
బిరుదులు హాలికులు దున్నఁ బెట్టిరొ యనఁగన్. 125

హాలికులు = హలం (నాగలి) తో జీవించేవారు, దున్నన్ = దున్నితే, బిరుదులు = పాండిత్యసూచకములైన గండపెండేరములు, పెట్టిరో = పెట్టారో, అనఁగన్ = అన్నట్లుగా, వరజు= గనిమ, (పొలంగట్టు) పడి = వెంట, రొంజిన్ = బురదను, త్రొక్కన్ = తొక్కగా, చరణంబులన్= కాళ్ళకు, చుట్టి = చుట్టుకొని, పసిడివాయ = బంగారువన్నె, కడుపులన్ = పొట్టలున్న, నీరు కట్టెలు = నీరుపాములు (నీటికొయ్యలని వ్యవహారం), పోరిన్ = చక్కగా, అమరెన్ = అమరినవి.

వ్యవసాయవృత్తిలో పండితులైన కర్షకులు పెండేరములు ధరించినారేమో అన్నట్లుగా, వారు దుమ్ముచేస్తూ గట్ల వెంట బురదను త్రొక్కుతుండగా కాళ్ళకు నీటిపాములు చుట్టుకొన్నవి. అవి బంగారు కడుపుతో మెరుస్తున్నవి. కనుక అవి బంగారు కాలి అందెలట్లున్నవి.

పతభాషికులకు ప్రభుత్వం బహుమతిలిచ్చి సత్కరించటం నాటికే ఉన్నట్లుంది.

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ గట్లవెంట కత్తవ అన్న వ్యవసాయ సాధనంతో త్రొక్కటదం పద్యంలో చెప్పబడ్డది. ఇది తడిసిన పొలాన్ని దుమ్ము చేసే సమయంలో గట్లనుత్రొక్కుతారు. దాన్ని గట్టుతొక్కటమనే అంటారు. అందుకే పద్యంలో రొంపద్రొక్కన్ అన్న క్రియ వాడబడటం విశేషంగా వున్నది. కవి గొప్పతనంలో క్రియాప్రయోగమొకటి ప్రధానాంశము.

కం॥ నాని శిఖి వంటచెఱకుల
చే నఱ, నవి వెండి వంటచెఱకులె యగుటం
బోనంబు ప్రజకు జక్కుల,
బోనంబులె మయ్యెఁ బ్రొయ్యి పొగయమి వృష్టిన్. 126

వృష్టిన్ = వానవల్ల, శిఖి = అగ్ని, నాని = తడిసి, వంటచెఱకులచేన్ = కట్టెలతో, అఱన్ = ఆరిపోగా, అవి = కట్టెలే, వెండి = మరలా, వంట చెఱకులె = కట్టెలే, అగుటన్ = కావడం వల్ల, ప్రజలన్ = జనులకు, బోనంబు = భోజనం, ప్రొయ్యి పొగయమిన్ = రాజుకోనందువల్ల, జక్కులబోనంబు ఐనది = జక్కులవాళ్ళు కొందరి వివాహాల్లో వట్టి అరివేణుకుండలు నెత్తినదాల్చి బోనాలో బోనాలో అని అరుస్తారు.

వానవల్ల వంటచెరుకు నానిపోగా ప్రజలకు ఆహారం జక్కుల బోనాలైనది.

అలం : నిరుక్తి.

సీ॥ ఇల్లిల్లు దిరుగ నొక్కిం తబ్బు శిఖి; యబ్బె
నే నింటిలోఁ బూరి యిడి విసరక
రాఁజదు; రాఁజిన రవులుకో ల్వాసాలఁ
గాని కల్గదు; మఱి దానఁ గలిగె
నేని కూడగుట మం; దైనఁ బెన్పొగ సుఖ
భుక్తిసేకూర; దా భుక్తి కిడనఁ
బ్రాగ్భోక్తలకె తీఱు బహుజనాన్నము; దీఱ
నారుల కొదవుఁ బునఃప్రయత్న;

తే॥ మాజ్యపటముఖ్యలయ మెన్న; రాలయాంగ
దారులయ మెన్నరంతిక; కారజనిక
పచన నాంధోగృహిణి రామిఁ బడుక మరుఁడు
వెడవెడనె యార్ప నొగిలి రజ్జడిని గృహులు. 127

అజ్జడిన్ = ఆ వానలో, గృహులు = గృహస్థులు, నొగిలిరి = బాధపడ్డారు, శిఖి = నిప్పు, ఇల్లు+ఇల్లు= ఇంటిటికీ, తిరుగన్ = తిరుగ్గా, ఒక్క+ఇంత = ఒక కొంచెం, అబ్బున్ = లభిస్తుంది, అబ్బెన+ఏనిన్= ఒకింతదొరికితే, పూరి = గడ్డి, ఇడక = పెట్టక, రాజయ = రాజుకోదు, రాజినన్ = రాజుకొన్నా, రవులుకోల్ = రగులుకోవటం, వాసాలుగాని = మూరు వాసాలవల్లకానీ, కల్గదు, మరి = ఇంకా, దానన్ = దానితో, కలిగిన + ఏనిన్ = కలిగితే, కూడు+అగుట = బియ్యం ఉడకటం, మందు = గహనం, వినన్ = ఒకవేళ ఒనగూడినా, పెన్ = పెద్ద, పొగన్ = పొగవల్ల, సుఖభుక్తి = రుచి గల భోజనం, చేకూరదు = లభించదు, ఆ భుక్తికిన్ = ఇడినన్ = ఆ సుఖము లేని భోజనాన్ని వడ్డించినా, బహుజన+అన్నము = ఎకర్కువమందికి వండిన అన్నము, ప్రాక్+భోక్తలికి = ముందు తిన్నవారికే, తీఱున్ = సరిపోతుంది, తీఱన్ = అయిపోగా, పునఃప్రయత్నము = తిరిగి పాకప్రయత్నం, నారులకున్ = స్త్రీలకు, ఒదవున్ = కల్గుతుంది, అంతకకున్ = ప్రొయ్యిలోనికి, ఆజ్య = నెయ్యి, పట = వస్త్రము, ముఖ్య = మొదలైన, లయము = నాశనము, ఎన్నరు = ఎంచరు, అలయ = ఇంటి, అంగ = వివిధ అవయవముల, దారు = కట్టెల, లయమున్ = నాశనం, ఎన్నరు = ఎంచరు, ఆ రజనిక = రాత్రిదాకా, పచనన్= వంటప్రయత్నంలోవున్నందున, న+ అంధస్ = అన్నంలేనట్టి, గృహిణి = భార్య, దగ్గరకు రామిన్ = రానందున, మరుఁడు = మన్మథుడు, వెడవెడనె = బగ్గరగా, పెద్దగానే, ఉర్వన్ = అరవవగా, నొగిలిరి.

వానకాలంలో నిప్పుదొరకదు, దానిక్నోం ఇల్లిల్లూ తిరగాలి, ఒకవేళ దొరికినా నిప్పురాజుకోవాలంటే గడ్డీగాదం కావాలి. అదీ తడిసిపోయింది. కనుక ఎలాగో విసిరి రాజుకోవాలంటే వాసాలపుల్లలు పెట్టాలి. కాస్త నుండిందికదా అనుకొంటే అన్నముడకదు. నానుబ్రాయి పడిపోయింది. ఎలాగోవండి వార్చితే అది పదిమందికి రావలసింది ముందు తినేవారికే చాలలేదు. ఇంక మళ్ళీ స్త్రీలకు పాక ప్రయత్నం తప్పదు.

దానికై నెయ్యిగుడ్డలు ఎంత ఖర్చయిపోతున్నవో, కప్పువాసాలు ఇంటి కొయ్యలు ఎన్ని ఖర్చయిపోయాయో ఒన్న విచారమం లేదు. వంటచేయటంలోనే నిమగ్నమైన ఇల్లాలు వంట ఇంటికే అతుక్కొని పోయింది తిని పడకపై దొర్లే మగరాయళ్ళకు మన్మథుని పోరు ఎక్కువైనది.

అలం : స్వభావోక్తి.

డచ్ చిత్రకారులు సామాన్య గృహాంతర్భాగాలు, పనివారు, భార్య చేసే కాయకష్టమూ, పిల్లల అల్లరి, ఇలాంటివన్నీ గృహవాతావరణ చిత్రణంలో భాగాలుగా గ్రహించి చిత్రించారు. ఆ కళలలో వాసి నేర్పాయి. ఈ పద్యమూ అలా వున్నది.

ఇంతగా జనజీవన విధానాన్ని వర్ణించిన కవులరుదు. కథలో రాజులు, ఆచార్యులు, భక్తులు రాగా వర్ణనల్లో సామాన్య జనజీవనం తాండవిస్తుంది. ఆయల వారి కావ్యనిర్మాణ రహస్యాల్లో ఇదీ, కథా వర్ణనల్లో పాత్రనిరూపణ రహస్యమూ లేదా కథల్లో ఆస్థానాలు, భగవంతుడూ చిత్రంపబడితో ఇక్కడ దైనందిక జీవిత చిత్రణయున్నది. ఈ భేధం గుర్తించాలి.

చ॥ పిడుగుల కళ్కిలోఁ దొలఁచి భీరులు కంచముఁ జల్లుదీధితు
ల్గడపల వెళ్ళిరాఁ, బొగలకావిరి గ్రుంగెడు పుల్గృహంబు లె
ల్లెడఁ గనుపట్టె నీళ్ల నిలయెల్లను ముంచి రసాతలంబుపై
విడియఁగ దండు డిగ్గిన సవిద్యుదురు స్తనయిత్నులో యనఁగ. 128

భీరులు = భయస్వభావులైన గృహిణులు (స్త్రీలు), పిడుగులకున్ = పిడుగు పాటు ధ్వనికీ, అళ్కి= భయపడి, కంచమున్ = కంచాలు లోన్ = ఇంట్లోనే, తొలిచి = నీళ్ళుదొర్లించి కడిగి, చల్లుదీధితుల్= నీటిని బైటికి చల్లేటప్పుడు కంచము కాంతులు నీటిజల్లు కాంతులు, (మెరుపుతో ప్రతిఫలించిన కంచం నీరుకాంతులు) కడపలన్ = గడపల నుండి, వెళ్ళిరాన్ = బయటకు వెళ్ళి వెనకకురాగా, పొగలకావిరి = పొగలకావిళ్లలో, గ్రుంగిన = మునిగిపోయిన, పుల్గృహంబులు = పూరిండ్లు, ఎల్లెడలన్ = అంతటా, కనుప, నీళ్ళన్ = నీటిల్ = నీటితో, జలమెల్లగన్ = భూమినంతా, ముంచి= ముంచెత్తి,రసాతలంబుపైన్ = పాతాళంమీదికి, విడియగన్= దండెత్తగా, దండు = సేనలు, డిగ్గిన= విడిసిన, స+విద్యుత్= మెరుపుతోడి, ఉరు = పెద్ద, స్తనయి = త్నులో = ఫెళఫెళ ఉరిమే మేఘాలో, అనన్= అన్నట్లుగా, కనుపట్టెన్= కన్పించాయి

గృహిణులు భీరువులై బయటకు పోగా వెరచి కంచాల్లో ఇంట్లోనే ఎంగిలినాళ్ళతోనే తొలిచి నీరుగడపం మీదుగా బయటకు చల్లారు. ఆ నీటిలో మెరుపులు పడి మారురెట్లుగా మెరిసింది పొగల కావిళ్లు (కావి రంగు) క్రమ్మినందు వల్ల పూరిళ్ళు మబ్బుల్లాగా వున్నవి. కంచం నీరు వాన, కంచం కాంతి మెరుపులు కాగా భూమినంతా ఆక్రమించిన పర్జన్య దేవత రసాతలం మీదికి పోతూ దండు విడిసిన విద్యుత్తుతో మెరుస్తు పిడుగుల ధ్వనులతో కూడుకొన్న మేఘాల్లాగా వున్నాయి.

అలం : ఉత్ప్రేక్ష

విశే॥ ఒక పూరింటిని అంత ఎత్తునకు తీసుకుని పోయి వర్ణించటం చాలా స్తుతింపదగ్గది.

సిజానేయన్న పాశ్చాత్య చిత్రకారుడున్నాడు. 19 వశకంలో అతని బిరుదు - ''ఆధునిక చిత్రకళా పితామహుడు'' నేటి చిత్రకళకతడే సృష్టికర్త. (వాస్తవిక సహజ వాదాల నుండి కొత్త మార్గాలకు మళ్ళించినవాడు). అతడొక ఇంటిని బొమ్మగా గీస్తే, చిత్రకారులు ఇంటిని, బొమ్మ ఫోటోను ప్రక్క ప్రక్కనే బొమ్మలో ప్రదర్శించి కళకూ లోకానికీ వున్న భేదసాదృశ్య విచారణం చేసారు బొమ్మలో E.MOTION వుందనీ, అసలు వాస్తవికగృహంలో అది వుండదనీ (లేదనీ) అన్నారు.

ఇదే వక్రత అంటే. ఈ పూల్లు ఏడంతస్తుల భవనం కంటె లోకోత్తరం, భావ ప్రపూర్ణమైనందున.

గొడు గులగాలిఁ గూల్చి, మఱికోలలతోడనె పాఱ, నాన్చెఁ జే
డ్పడ జడి మేఘుఁ; డ ట్లకట పాంథులపైఁ దన కెంత వైరమో
తడిసిన మేన నింకి యది దారవియోగ జవహ్నిఁగొంత కొం
తుడిపె, విధాత రక్ష విషమొక్కకమాటమృతం బుసే యఁగాన్. 129

(సేయుటన్ పాఠాంతరము)

మేఘుడు; జడిన్ = వానలో; పాంథులపై = బాటసారుల మీద; తనకు = మేఘునకు; ఎంతవైరమో = ఎంతపగయో కానీ; గొడుగులన్ = (తాటాకు) గొడుగులను, గాలిన్ = గాలితో, కూల్చి = చించి, మఱి = ఇంక, కోలలతోన్ = (పైనున్నతాటా కుగొడుగును కూల్చినాడు కనుక మిగిన) కఱ్ఱలతో; పాఱన్ = పరుగెత్తగా; నాంచెన్ = వానలో నాన బెట్టినాడు; చేడ్పడన్ = చేష్టలుడిగే టట్లు (నాంచెన్) అట్లు = ఆవిధంగా; అకటా = అయ్యో; తడిసిన మేనన్ = నానినా తనువులో; ఇంక = లోపలకుదిగి; అది = ఆతడి; దారవియోగజ = భార్యా వియోగం వల్ల పుట్టిన; వహ్నిన్ = నిప్పును, కొంత కొంత = కొంచెం కొంచెం; ఉడిపెన్ = ఉపశమింప చేసింది; విధాత = సృష్టి కర్త; రక్ష= కాపుదల; ఒక్కొక మాటు = ఒక్కొక సారి; విషమును = విషమును, అమృతంబు = సుధను, చేయఁగన్= చేయటం వల్ల (పై కార్యం జరిగిందని తాత్పర్యం).

ప్రవాసులు ప్రయాణంలో గొడుగులను వేసి కొని పోతున్నారు. కానీ ఈ మేఘున కెందు కో వారి పై వైరమున్నట్లున్నది. అందుకే వారి గొడుగులను గాలి తోచించి చెండాడితే వారు కర్రలతోనే పరుగె త్తుతున్నా వదలక వానలో వారిని నాంచిమరీ పగదీర్చు కొన్నాడు. కానీ భగవంతుని అను గ్రహముంటే విషమే అమృత మౌతుంది కదా ! కనుక నే వారి శరీరాల్లోకి పాకినతడి భార్యా వియోగ వహ్నిని ఆర్పింది.

అలం : అర్థాంతరన్యాసం. చివరివాక్యం

మొదటి రెండుపాదాలలో వ్యాఘాతం. 3,4 పాదాల్లో విచిత్రం.

విశే॥ గొడుగులు చిరిగి పోగా కర్రలతోనే పరు గెత్తుతున్న ఈ దృశ్యం గాలివానలో గొడుగులతో పరుగెత్తే బౌద్ధ సన్యాసుల చిత్ర యొకటి జపాన్ చిత్రకళలో ఉంది. రెంటికి పోలికలున్నాయి. దృశ్యం సహజమే. విత్తివమయ్యే సరికి హాస్యరసాత్మక మౌతుంది.

తే॥ దవ్వులఁజల్లని దూఱ నంతక మునుపటి
జల్లునీ రూని వచ్చునాజల్లు, మొదలి
గాలి యెలగోలుచేఁ గొమ్మ గదలి, జల్లు
వలపడకమున్న, వంగుళ్లఁ దడిపెఁ దరులు. 130

దవ్వులన్ = దూరంగా, జల్లు+ అని = వానజల్లు వస్తుందని చూచి, దూఱన్ = చెట్టు క్రింద దూరగా, అంతకమునుపటి = అంతకు ముందటి; జల్లునీరు + ఊని = పోయిన జల్లు నీరు దాల్చిన (చెట్టు కొమ్మలన్నియం) వచ్చు = దూరాన వస్తున్న, ఆజల్లు మొదలి = ఆజల్లు ముందున్న, గాలి యెలగోలుచేన్ = గాలిముందు వచ్చే పిల్ల గాలిముకతో, కొమ్మకదిలి = పాంథులు దూరిన చెట్టు కొమ్మకదలగా; జల్లు = దూరం నుండి వచ్చేజల్లు, తంప డకమున్న = రాక ముందే, తరులు = చెట్లు, వంగు ళ్లన్ = చెట్టుపై ఉన్న నీటి బొట్లలో, తడిపెన్ = తన క్రింద దూరిన వారిని తడిపినవి

తా॥ దూరాన వచ్చే జల్లును చూచి చెట్ల క్రిందకు పోయినక్కినారు బాటసారులు. కాని ఆచెట్ల కొమ్మల్లో అంతకుముందే వచ్చి పోయిన జల్లు నీరున్నది కనుక అది రాబో యే వాన జల్లు ముందు వచ్చిన గాలికి కొమ్మలు కదిలినీళ్లు రాలినవి. ఆవంగుళ్లకు జనం తడిసి పోయారు.

అలం : స్వభావోక్తి.

విశే॥ వంగుళ్లు = కొమ్మలనుండి చూరునండి కారే నీటిబొట్లు. వాటినే నట్బొట్లు అనికూడ అంటారు. ఆము: 2-46లో 4వ పాదం. చాలా చిన్న చిన్న విషయాలు కూడ కవికి వస్తువులే, నిజానికి సమదర్శనం కవనానికి చిన్న - పెద్ద భేదం లేదు.

వంగాళ్లు = 2-96 లో వచ్చింది

రయమున వృష్టి కై యొడిఁగి రచ్చలపై, విధియింతు రుగ్రతన్
హయపతి మీఁద దంతి పతినా తని పై నృపతిం గజాదిని
ర్ణ యముల మొత్తులాడు దురు, మ్రబ్బొక యించు కవిప్పవిచ్చుమొ
గ్గయి మఱి పాఱి పోదురు సమస్తది శా గతులైన యధ్వ గుల్. 131

సమస్త దిశా+ ఆగతులైన = సకల దిక్కుల నుండి వచ్చిన, అధ్వగుల్ = బాట సారులు ( అధ్వం = బాట; గమనం పొందినవారు - వడి చేవారు) వృష్టికై = వాన వచ్చినందున, రయమునన్ = వేగంతో, రచ్చలపైన్ = పచ్చి వాకిళ్లలో, ఒదిగి = దాగి, ఉగ్రతన్ = తీక్షణంగా, హయము = అశ్వపతులు బహ్మనీసుల్తానులు; మీదన్ = పైన, దంతిపతిన్ = గజపతిని, ( ఒరిస్సా రాజు) అతనిపైన్ = అతని మీద; నృపతిన్ = విజయనగర రాజులను, విధియింతురు = తరతమ భేదాలను ఆపాదిస్తారు, గజ+ఆది = ఏనుగు, గుఱ్ఱం, కాల్బలం సంఖ్యను ఎంతెంత అన్న, నిర్ణయములన్ = సంఖ్యానిర్ణయంలో, మొత్తులు+ ఆడుదురా = కొట్లాడు కొంటారు. మబ్బు + ఒక+ ఇంత = కొంచెంమబ్బు; విప్పన్ = విచ్చిపోగా; విచ్చు మొగ్గ+అయి = ఎవరి వారిని వారుచెదరి; పారిపోదురు= పారిపోతారు.

నాలుగు దిక్కుల నుండి వచ్చి చేరిన బాటసారులు వాన రాగా రచ్చ చావళ్లలో మూగి ఊరు కోక తీవ్రంగా వాదించు కొంటారు. ఏమని? బహ్మనీ సుల్తాను గొప్ప అని ఒకడు; మరొకడు కాదు గజపతి అంటే ఇంకొకడు మన విజయనగర ప్రభువేనంటాడు ఆరాజుల కున్న సేనావివరాలపై కొట్లాడు కొంటారు. ఇంతలో మబ్బు విచ్చింది. ఎవరి దారిన వారు నెత్తిమీద గుడ్డలు కప్పుకొని పరుగెత్తుకు పోతారు (మరల వాన రావచ్చునని)

అలం : స్వభావోక్తి

విశే॥ విజయ నగర సామ్రాజ్య మున్న రోజులలో కృష్ణకు పశ్చిమాన మహమ్మదీయులు పంచ బహ్మనీ సుల్తానులున్నారు అదే కృష్ణకు తూర్పున గజపతులు ఇవతల విజయనగరం వారిమధ్య జరిగిన భీభత్సమే ఆనాటి చరిత్ర అంతా. ఈ నేపథ్యం నుండి ఈ భావం సహజ సుందరంగా కల్పితమై భావితమైనది.

నేడు నలుగురు మనుషులు కలిస్తే హోటళ్లలో. బస్సులో నగరకేంద్రాలలో రాజ కీయాలే లేక దామాట్లాడు కొనేది. ఆనాడూ అంతే.

ఈ చరిత్రాంశం యామున కథలో దూర్చటం వల్ల కాలివిపర్యయ దోషమని నావిళ్ల ప్రతి పీఠికలో ఉంది. కాని కావ్యౌ చిత్యం లేదు. లోక దృష్టివేరు. ఇక్కడ వక్త భగవంతుడు యామునాచార్యులు రాయలకు 400 ఏండ్ల పూర్వుడు. కానీ భగవంతునకు భూత భవిష్యత్తులు వర్తమానమే కనుక ఈ దోషం లేదు.

ఇది వక్త్రౌ చిత్యం - చెప్పే వాడి దృష్ట్యా - చూడ దగ్గది తప్ప విషయౌ చిత్యం కాదు. విషయ దృష్ట్యా కాదు. కవీ సహృదయపాఠకుడై వ్రాసాక ఆలోచిస్తాడు. ఉచితమైతే ఉంచి కాకపోతే మారుస్తాడు.

తనరె బలిభుక్తతులు నిం
డిన గ్రామశ్రీల కటీతి నీలముల గుటం
గనియెఁ దృణ గ్రాహిత ననఁ
గొనుకసవులఁ జైత్యతరుల గూం డ్లిడుభ్రమణన్. 132

బలిభుకే = బలినితి నేవి కాకులు, తతులు = గుంపులు, నిండిన = ఎల్లెడ లవున్నె; గ్రామశ్రీలకున్= గ్రామలక్ష్మలకు, అటీతి = కంఠాలకు; నీల ములు = నీలమణులు, అగుటన్ = కావడం చేత, తృణ గ్రాహితన్ = గడ్డిపరకలను, ఆకర్షించుటను, కనియన్ = పొందినవి; అనన్ = అనగా, చైత్యతరులన్= వీధులయందున్న చెట్లపై, గూండ్లు+ ఇడు = పెట్టు కోవడానికై, కొను = గ్రహించిన, కసవులన్ = గడ్డితో, భ్రమణన్ = తిరగటంవలన, తన రెన్ = అందగించాయి.

తా॥ ఊళ్లల్లో, వీధుల్లో, చెట్లపై, గూళ్లు పెట్టు కోవడానికై కాకులు కాళ్లతో ముక్కులతో కసవు తీసికొని ఎగురుతున్నవి ఇదెలా వున్నదంటే - గ్రామశ్రీలు ధరించిన కంఠనీలము లవలె కాకులున్నవి. అవి ఆకర్షించే కసవులలాగ కాకులు తీసుకొని పోయే గడ్డీ గాదమూ ఉన్నది

అలం : స్వభావోక్తి - చాల అందమైన సహజ దృశ్యం.

విశే॥ గ్రామశ్రీ = ఆనాదు గ్రామం - నగరం పరమేశ్వర రూపాలుగా రాజ్యశ్రీలు గా భావించబడేవి జనపద (గ్రామం) కళ్యాణి (భద్రతకలది) అని పేర్లు (జనపద కళ్యాణి) ఆడవారు పెట్టు కొనే వాడ (చూ. శ్వే తచ్ఛత్రం) ఇది భారతీయ రాజనీతిలోనిది.

పాండు చ్ఛాయోప వన వృతయః కేతకై స్సూచి భిన్నైః (చూ. మేఘసందేశం)

కాకిని పట్టుకొని ఇంద్రనీల మన్న కవి మనస్సు ఎంత మహోదారమనాలి!

మ॥ వసతుల్ వెల్వడి, వానకై గుడిసెమోవన్ రాక తా నాని యే
పసగా నిల్చిన జమ్ముగూడఁ బోల మంబ ళ్లొత్తి యుచుం బట్టి పె
న్ముసురం దీఁగెడు కాఁపు గుబ్బెతల పెన్గు బ్బల్పునాస ల్వెలిం
బిసికిళ్లుం బిసికిళ్లుహాలి కులకర్పించెన్న భస్యంబునన్ 133

నభస్యంబునన్ = వర్ష ఋతువున; వసతుల్ = ఇళ్లు, వెల్వడి = (బయటపడి) వెడలి+ అంబళ్మోయుచున్ = అంబళ్లు నెత్తి పైపెట్టు కొని, వానకై = వాన నుండి రక్షించు కోవటం కోసం; గుడిసెన్ = పొలంలో వేసి కొన్న చొప్పగూడు, మోవన్ = (లోపలికి పోయేటప్పుడు నెత్తి పై ఉన్నది గనుక) అంటుకోగా; తాను = జమ్ముగూడ; ఆనియే = ఆనుకొనే, రాక = లోపలికి మనిషితో బాటు రాక (ద్వారానికి తగు ల్కొని నిలబడిపోగా) పసగాన్ = చక్కగా, నిల్చిన = నిలబడ్డ; జమ్ముగూడన్ = వాన కాలంలో జమ్ముగూడను (కర్షకులు ధరించే గొడుగువంటి సాధనం); పట్టి = తాల్చి; పైన్ = పెద్ద; ముసురున్ = జడిని; నీఁడు = నిస్తరించు; కాపు = కర్షకుల; గుబ్బ+ ఎతలన్ = గుబ్బలు కలజవరాం (డ యొక్క; పెన్ = పెద్ద; గుబ్బల్ = చన్నులు, పునాసల్ = పునర్వసు కార్తెలో చల్లిన పైరు; వెలిన్ = బైట; పిసికిళ్లున్ = (స్తనములన్న అర్థంలో) మర్దించటం; పిసికిళ్లు = (పైరన్న అర్థంలో) కంకులు నలపటం; హాలికులకున్ = కర్షకులకు; అర్పించెన్ = ఇచ్చినవి.

తా॥ వర్షాకాలంలో కాపు గుబ్బెడలు జమ్మిగూడను ధరించి అంబ్లను మోసుకొంటూ పొలాలలో కాపలా ఉన్న భర్తల కోసం వెళ్లారు. ఆ పొలంలో ఉన్న గుడిసెలో దూరేటప్పుడు జమ్ముగూడ గుడిసె ద్వారానికి తగులుకొని తలుపువేసినట్లు కాగా లోపల కర్షకులకు భార్యల గుబ్బలు మర్దించటానికి బయట కంకులు నలుపుకోవటానికి అవకాశమేర్పడింది.

అలం : స్వభావోక్తి.

విశే॥ ఇదీ తర్వాత పద్యం కర్షక జీవనసౌందర్యాన్ని చిత్రించేవి. గొడుగునకు బదులు జమ్ముగూడ ధరించటం పేదవారికి వీలయినదికాక అంబళ్లు మోసుకొనిపోవటానికి గొడుగైతే చేతులు రెండూ మోయవలసివస్తుంది. జమ్మగూడనైతే నెత్తికి తగిలించుకొంటే సరి. పట్టుకోనక్కర లేదు. దాని మీద కుదురుపైన అంబటికుండ ఉంటుంది. చేతులాడించుకొంటూ పోవచ్చు.

మ॥ గురుగుం జెంచలిఁ దుమ్మి లేఁదగిరిసాకుం దంత్రిణీపల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ గట్వావి కుట్టారికో
గిరముల్మెక్కి, తమిం బసుల్పొలము వోఁ గ్రేపుల్మెయిన్నాక, మే
కెరువుం గుంపటి మంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్ల జ్జడిన్. 134

ఆజడిన్ = ఆ ముసురులో, రెడ్లు = కాపులు, ప్రభుత్వ+ఏక+ఆప్తిన్ = (గృహానికి యజమానులైనందున) అమూల్యమైన పెద్దరికం కల్గటం వలన, గురుగున్ = గురుగు ఆకు, చెంచలి ఆకు, తుమ్మి ఆకు, లే = లేత తగిరిస ఆకున్నూ, తింత్రిణీ = చింత, పల్లవ = చిగురు, ఉత్కరమున్ = మొత్తముతో, కూడన్ = కలిపి, నూనియలతోన్ = నూనెలతో; పొరంటి ! ఆకుతడి ఆరిపోగా ఇగురపెట్టి; కడు+ఆవిరి = మిక్కిలి ఆవిర్లు, త్రక్క, కుట్టారిక+ఓగిరమున్ = చిన్న ఆరిక బియ్యపు అన్నం; మెక్కి = గొంతు దాకా తిని: పసుల్ = పశువులు, పొలము పోన్ = పొలాలకు పోగా, క్రేపుల్ = దూడలు; మెయిన్ = శరీరమును, నాకన్ = నాకుతూ ఉంటే, మేక+ఎరువున్+కుంపటి = దోమలకోసం, వెచ్చదనం కోసం, వేసిన మేక ఎరువు కుంపటి పెట్టుకొని, తమిన్ = ఆసక్తితో (హాయిగా) మంచము+ఎక్కి నిద్రించారు.

తా॥ ఆ ముసురువానలో రెడ్డి యజమానులు గొంతుకాన ఆయా ఆకుకూరలు చింత చిగురుతో కలిపి నూనెతో వ్రేల్చిన కూరతో ఆవిర్లు కక్కే - కుట్టారికల అన్నం గొంతు దాకా తిని గొడ్డూ గోదా పొలాలకు తోలి (పిల్లా పెద్దా పొలాలకు పోగా) మేకెరువు కుంపటి పెట్టుకొని చావళ్లలో దూడలు తమ శరీరాలు నాకుతూ వుండగా గుర్రు పెట్టారు.

అలం : స్వభావోక్తి.

విశే॥ ఇక్కడ కర్షకజీవన సౌందర్య చిత్రణకు ప్రధానం తప్ప రెడ్లను హేళనం చేయుటం కాదు. రాయలవారంత క్షుద్ర మనసతత్వం కలవాడు కాదని ఆయన రాజనీతిలోనూ, రాజుల పాత్రల చిత్రణలోనూ స్పష్టం. పైగా రెడ్డి అంటే నేటి కులవాచకం కాదు. గ్రామణి లేదా గ్రామాధికారి (మున్సిఫ్) అని అర్థం. మనుచరిత్రాదుల్లో గజపతి భార్యలు అడవులపాలైనారు అన్నట్లు వర్ణిస్తే రాయల పరాక్రమ ప్రశంసాపరంగా రాయలవారు గజపతి పారిపోయినాడని చెప్పారు. (చూడు పీఠిక) ''కచసక్తఫణికంచుకము'' అంత ఉదాత్త ప్రకృతియైన మహాప్రభువు ఒక జాతిని అపహాస్యం చేస్తాడా !

తరువాత పద్యం రాజువర్ణన వస్తున్నది. ఇక్కడ రెడ్ల వర్ణన. రాజు రెడ్డి అన్న సామెతలో రాజ్యానికి రాజొకడు. గ్రామానికి రాజు రెడ్డి కాగా ప్రభుత్వయంత్రాంగమున్న నిచ్చెనకు పై మెట్టు రాజు. క్రింద మెట్టు రెడ్డి. ఇది రాజోద్యోగ సూచకపదం తప్ప కులవాచకం కాదు. సామెతలోనూ ఇంతే. ఇదే అర్థంలో 6-83 చూడు.

సీ॥ మణి యష్టిఁగేలి బ్బర్షిణ షడ్జసుధ వీను
లోలాడఁబ్రొద్దెక్కి మేలు కాంచి,

గముగమవత్సుమ గంధ రాజాంగ మ
ర్దనపైఁ జిరోష్ణమ జ్జనములాడి
మిసిమి దువ్వలువ బన్న సరంబు మొగిలిఱే
కులు దాల్చి జామెక్కి కొలువొసంగి,
జాంగలామిషముతోఁ శాల్యన్న మధిక పై
యంగవీనంబుగా నారగించి

తే॥ మృగమదము మించు తములంపుటిరులు మోవి
దళముగా సాగరు హసంతి వెలుఁగ, సౌధ
శిఖర వాతాయనాగతాచిరరుగంశు
నతదృగవరోధములతోడ నగిరి నృపులు. 135

నృపులు = రాజులు; మణియష్టిన్ = మణులస్తంభం మీద, కేలిబర్హిణ = క్రీడా మయూరాలు (పెంపుడు నెమళ్లు), షడ్జ = షడ్జంలో చేసే కేకారావం, సుధ = అమృతం, వీనులు = చెవులు, ఓలాడన్ = జలకాలాడగా, ప్రొద్దు+ఎక్కి = బారెడు ప్రొద్దు తిరిగినా, మేలు కాంచి = మేలుకొని:

తా॥ రాజులు పెంపుడునెమళ్లు కూస్తే ఆ సంగీత ధ్వనిచెవుల కభిషేకం చేయగా బారెడు ప్రొద్దెక్కి మేల్కొని (అక్కడ రెడ్లు క్రేపులు మెయినిసాక నిద్రించారు)

గముగమవత్ = ఘుమఘుమలాడే; సుమగంధరాజ = పూలవాసనలు చిమ్మే శ్రేష్ఠమైన పరిమళ ద్రవ్యం (కస్తూరి మొదలైనవి కలిపిన సున్ని పిండిముద్దలాంటిది). అంగమర్దన = అవయవాలకది మర్దించి; పైన్ = పిదప, చిర+ఉష్ణ = బాగా కాగిన (నీటితో), మజ్జనములు = స్నానాలు, ఆడి = చేసి.

తా॥ ఘుమఘుమలాడే సుమగంధరాజమన్న పిండిముద్దతో శరీరాన్ని మర్దించి ఆ మీద బాగా కాగిన నేడివేడి నీళ్ళతో స్నానాలు చేసి (బహువచనం ఆధిక్యసూచకం). వానకాలం కనుక.

మిసిమి దువ్వలువ = మిసమిసలాడే (మెరిసే) సన్నని వలువ, బన్నసరంబు= పంచసరము - ఐదు పేటల ముత్యాలహారం (పేటలను బట్టి పేరుమార్పు). వేయి పేటల ముత్యాలహారాలూ వుండేవట.) మొగలిరేకున్ = ఆ ఆకారంలో చేసిన బంగారు ఆభరణం (బహుశా తలపాగాలో పై పెట్టుకొనే నెమలిపింఛం వంటి ఆభరణమేమో. లేదా కేతకీపుష్పమూ కావచ్చు. వానకాలంలో వస్తాయి కనుక) తాల్చి = ధరించి; జాము+ఎక్కి = ఒక జాముప్రొద్దు కడచన్నాక; కొలువు+ఒసంగి = కొలువును తీర్చి.

తా॥ సన్నని జరీ యంచులు = బంగారుపూలు కుట్టిన మెరిసిపోయే వలువలు (రాయలవారి దుస్తుల వర్ణన ఇలాగే పేయస్ చేసినాడు గనుక) దాల్చి, ముత్యాలహారాలు దాల్చి, మొగలిరేకులు పెట్టుకొని జామెక్కినాక కొలువు తీర్చి;

పై పద్యంలో రెడ్ల ప్రభుత్వ ఏకాప్తి - వారి పరిధిలో వారిదీ ఐశ్వర్యమే. ఈ పరిధి విశాలం కావచ్చుగాక.

జాంగల = అడవి; ఆ మిషముతో = మాంసంతో శాలి+అన్నము = రాజనాల బియ్యపు అన్నముతో, అధిక = ఎక్కువ, హైయంగవీనంబుగాన్ = అపుడే కాచిన ఆవునేతితో, ఆరగించి = భుజించి;

తా॥ అడవిమృగాల మాంసంలో ఆవునేయి వేసికొని సన్నబియ్యపు అన్నం తిని.

అక్కడ రెడ్ల భోజనం కట్టారికుట్టారికోగిరం - ఆకుకూరలు

మృగమదము = కస్తూరి, మించు = ఎక్కువైన తములంపు = తాంబూలపు; ఇరులు = చీకట్లు (నలుపు) మోవినిన్ = పెదవిపై; దళముకాన్ = దట్టముకాగా, సాగరు హసంతి= అగరు ధూపపుకుంపటి; వెలుగన్ = రాజుతుండగా; సౌధ = మేడల; శిఖర = పై అంతస్తుల్లో; వాత+ఆయన = (గాలివచ్చేమార్గం) కిటికీలనుండి; ఆగత = వచ్చిన; అచిరరుక్ = (క్షణం మెరిసేది కనుక) మెరుపు; అంశు = కాంతికి, నతదృక్ - వాల్చిన చూపులు గల; అవరోధములతోడన్ - అంతఃపురాంగనలతో, నగిరి = నవ్వారి.

తా॥ కర్పూర తాంబూల కాంతి మోవిస్తే చీకట్లు క్రమ్మగా అగరుకుంపటి పొగ పారే సౌధాగ్రభాగంలో కిటికీల నుండి మెరుపులు చిమ్మే కాంతులకు భయపడిన కళ్లు వాల్చే కాంతలను చూచి నవ్వారు. (పైపద్యంలో రెడ్ల మేకెరువు కుంపటి ఇక్కడ సాగరుహసంతి)

కస్తూరి వేడి చేస్తుంది కనుక వానకాలంలో ఎక్కువ వేసికోవటం. కాక పురుషుల తాంబూలంలో కస్తూరి పాళ్లెక్కువ. స్త్రీల తాంబూలంలో కర్పూరపు పాళ్లెక్కువ. (చూడు. మృగ మద సౌరభ విభవ ద్విగుణిత ---- మనుచరిత్ర.)

ఈ పద్యం రాజోచిత శైలికలది. ఆ గాంభీర్యం శైలిలోనూ భావం లోనూ ద్యోతకమవుతుంది. భావం తెలుస్తుంది గాని శైలిని అనుభవించడం కష్టం. అది సిద్ధించిన వాడినే సహృదయుడన్నది.

వ॥ ఇట్లు సాంద్ర సలిలధారాసారమాసరబులగు వార్షిక వాసరంబులు ప్రశాంతంబగుటయు; దదనంతరంబ. 136

సాంద్ర = దట్టమైన; సలిలధార = నీటిధారలు కల, ఆసారం = జడివానలుపడే; మాసంబులు = నెలలు, అగు = అయిన;మాసరంబులు = అతిశయమైన; వార్షిక వాసరంబులు = వానకాలం; ప్రశాంతంబు = ముగిసిన; తత్+అనంతరంబు = ఆ తర్వాత.

## భావోన్మేషం

### శరచ్చంద్రిక

జలం ప్రసన్నం, కుముద ప్రభాసం
క్రౌంచస్వన శ్శాలివిపనం విపక్వం

మృదుశ్చ వాయుః విమలశ్చ చంద్రః
శంసంతి వర్షవ్యపనీతకాలం (రామాయణం)

శ్రీరామచంద్రుడు హేమధాతు విభూషితమైన పర్వతాగ్రాన ఆసీనుడై పరిసరాలను పరిశీలిస్తే ఆ కన్నుల్లో శరత్తు ప్రసన్నంగా ప్రతిఫలించింది. అడవిలో ఎక్కడ చూచినా శారదిక విభూతి. నిన్న వాన కారున చూచిన ప్రకృతే నేడూ కన్పించింది. కానీ ఎంత మార్పు!

నిన్న నల్లగా మబ్బు నేడు తెల్లగా ఉంది. నిన్నటి కడిమి - మద్ది చెట్లకు బదులుగా నేడు పర్వతసానువుల్లో వేగిసలు - బంధుజీవములు - శ్యామములు. సప్తచ్ఛదాలు - వెర్రిగా పూచాయి. ఒక జ్యోత్స్నలోకమా వర్ణన. ఆ సౌందర్యం సప్తపర్ణశాఖల్లో, తారా చంద్ర రవికాంతుల్లో - మదగజ క్రీడల్లో త్రిధావిభక్తమై సమృద్ధిగా ప్రకాశించింది.

తర్వాత కాళిదాసు - భారవి మొదలైన వారీవర్ణన చేసారు భారవి వర్ణనకూ రాయల వర్ణనకూ కొంత సారూప్యం తోస్తుంది.

'శాలిక్షేత్రాలలో శోభించే గ్రామసీమలు - ఎగిరేచేపలను కమల నేత్రాలతో చూచే సరోవరలక్ష్మి - ప్రవాహాలు క్షీణిస్తుంటే నీటి తరగల రేఖలతో అందగించే సైకతాలు - దధి మథించే గోపికలు - కర్ణావతంసంగా ఉత్పలాలు దాల్చిన శాలి క్షేత్ర పాలికలు - ఎడ్ల కుమ్ములాటలతో సందడిగా ఉండే ఏటి ఒడ్లు - వరికంకులను నోట గరుచుకొని ఎగిరే చిలుకల గుంపులు - ఇలా శరద్సౌందర్యం పరుచుకొని దర్శనమిస్తుందీ భారవిలో.

## వస్తువైవిధ్యం

రాయలవారిలో వస్తువైవిధ్యంతో పోల్చదగ్గది వాల్మీకమే. మహర్షి చిత్రించిన వస్తుప్రపంచం - సంధ్య - మబ్బు - గాలి - కొండ - నదీ - సరస్సు - వనము - నెమలీ - తుమ్మెద - నిశ - సాము - ఏన్గు - చెట్టు - ఔల్లు - వాపి.

రాయలు గీసిన శరచ్చిత్రంలో వన్నెలు - వర్ణాలు -

మన్ను - మిన్ను - మబ్బు - ఏడాకుల అరటి - ఔల్లు - వరి - అగస్త్యోదయం - హంస - చెరువు - తామర - నీటిబొట్టు - నాచుతీగ - తుమ్మెద - ఎడ్లు - ఏన్గులు - మొగిల్పిరి యెండలు - చిల్కలు - పొలం కాపర్లు - వెన్నెల - నెమలి - ఏళ్ళు.

మహర్షి శరద్వర్ణనలో చేర్చిన నూత్నవస్తువులు - సరస్సులు - సర్పం - ఔల్లు - నిశ - సంధ్య - మిగిలినవన్నీ వర్షా వర్ణనలోవే.

రాయలవారలాకాదు. ఒక్క నెమలి - ఏరూ - వదలితే మిగిలిన సృష్టి అంతా నవీనమే. ఒక ఋతువులో స్పృశించిన వస్తువును మరలా ముట్టుకొనే అలవాటాయనకు లేదు.

వాల్మీకి అనేక విషయాలను మాలకరి దండను గ్రుచ్చినట్లు - ఒకే శ్లోకంలో అనేక పుష్ప విషయాలను గుదిగ్రుచ్చే అలవాటు కలవాడు.

వ్యభ్రం నభః శస్త్ర విధే తవర్ణం తృశ ప్రవాహాని నదీజలాని
కల్హారశీతాః పవనాః ప్రవాంతి తమో విముక్తాశ్చ దిశః ప్రకాశాః

మబ్బుల్లేనిమిన్ను కడిగిన కత్తిలాగా వుంది. నదీప్రవాహాలు తీసినవి. గాలులు కల్వల వాసనలతో వీస్తున్నవి. దిశలు తమోల్యను విడి ప్రకాశిస్తున్నవి.

రాయలు దేనికిదాన్ని ప్రత్యేకంగా పెద్దబొమ్మ గీస్తాడు. 181లో ఒక వయయార మెంతదీనరమణీయంగా చిత్రితమైనది;

శరదృతువు

ఉ॥ రాజమరాళలబ్ధ గిరి రంధ్రము, శాలివనీశరావలీ।
వైజననంబు, యజ్వహుతవాజహుతాశము, భాస్వదిందిరాం
భోజసమాగమం బుదితబోధ భుజంగ శయోపచారరానీ
రాజనపుల్లహల్లక సరం బుదయించె శరద్దినం బిలన్. 137

(1) శరత్ దినంబు = శరత్కాలం, రాజమరాళము = రాజహంసలతో; లబ్ధ = పొందబడిన; గిరి=క్రౌంచ పర్వతము యొక్క, రంధ్రము = సొరంగముకలది;

(2) శాలివనీ = వరిచేలకు; శర+ఆవలీ = రెల్లు పొదల గుంపులకు; వైజననంబు = సూతికా మాసం - ఈనే నెల;

(3) యజ్వ = యాజ్ఞికులతో, హుత = హుమము చేయబడిన; వాజహుతాశము = అన్నము కలదైన అగ్ని కలది; (4) భాస్వత్ = ప్రకాశమానమైన; ఇందిరా+అంభోజ = లక్ష్మికి - కమలానికి; సమాగంబు = సమావేశం కలది; (5) ఉదిత = కలిగిన; బోధ = మెలకువకల; భుజంగశయ = ఆదిశేషునిపై పవ్వళించిన హరికి; ఉపచార = పూజకొఱకు; నీరాజన = హారతియైన; పుల్ల = వికసించిన, హల్లక = ఎర్రకల్వల, సరంబు = సరస్సులు కలది; ఉదయించెన్= ఉదయమైనది.

తా॥ శరత్కాలం వచ్చినట్లు పంచలక్షణాలు చెప్పాడు.

(1) రాజహంసలు మానస సరస్సు నుండిలోకం మీదకు రావడానికి క్రౌంచబిలంలో ప్రవేశించటం; (2) వరిపొలం = రెల్లు పొద వికసించటం (3) యజమానులు వాజపేయ యాగం చేయటం. (4) లక్ష్మి-తామరపువ్వు కలుసుకోవటం; (5) చాతుర్మాస్యం గతించినది కనుక విష్ణువు యోగనిద్రనుండి మేల్కొన్నాడు. కనుక అతని కోసం ప్రకృతి పట్టిన నీరాజనమో అన్నట్లు ఎర్ర కల్వల పూలతో సరస్సులు అందగించటం.

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ 1-2-5 విశేషణాలు సంప్రదాయప్రబోధకాలు.

ఎంతో తెలిస్తే తప్ప వ్రాయలేదు ప్రత్యేకించి మూడవది భారతీయ సంస్కృతిలో విశేషమైనది. ఈ యజ్ఞవిశేషాలు మనకీనాడు తెలియకుండాపోయినవి. వాటి వినియోగం జీవితంనుండి ఉద్వస్తమైపోయినది. శరద్వాజపేయము ప్రసిద్ధము. ఆగ్రయణేష్టి చేసారని అర్థం. (ఈ వివరణ వావిళ్ల వారి టీక లోనిది )

సరంబు = సరస్సు శబ్దంలో సకార లోపం లేదని బాలవ్యాకరణం. కనుక సరము-మాల అని అర్థం చెప్పుకోవచ్చు. లేదా సరస్సులు సకారలోపం రాని సథిలంగా గ్రహించవచ్చు.

కం॥ సరము పొగరెక్కె నంబర,
మురు విద్యుద్దీపకళిక లుమిసిన ధూమ
స్ఫురణం బొగచూరె ననఁగా
హరిమణి జంబూఫలాసితామలరుచున్. 138

అంబరము = ఆకాశం, ఉరు = గొప్ప, విద్యుత్ = మెరుపన్న, దీపకళికలు = దీపపు మొగ్గలు; ఉమిసిన = వెళ్ళగ్రక్కిన, ధూమస్ఫురణన్ = పొగలచాలుచేత; పొగచూరెన్ - పొగవారినది; అనగా= అన్నట్లుగా; హరిమణి = ఇంద్రనీలము, జంబూఫల = నేరేడు పండ్లు; అసిత = నల్లని; అమల= స్వచ్ఛమైన, రుచులన్ - కాంతులతో, కరము = ఎక్కువ; పొగరు+ఎక్కెన్ = నల్లనైనది - మదించినది.

తా॥ శరత్తులో ఆకాశంలో మబ్బులు లేవు గనుక తన సహజనైల్య కాంతితో ప్రకాశించటం దేనివల్లనంటే మెరుపులనే దీపాలు ఆరిపోయినవి గనుక అవి ఊసిన పొగలతో పొగచూరి నట్లు = ఇంద్రనీలమణుల కాంతితో నేరేడు పండ్ల వన్నెతో స్వచ్ఛమైననీల కాంతులతో ప్రకాశిస్తున్నది.

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ పొగరెక్కె - గడుసు ప్రయోగం. లోకంలో గర్వించు అన్న అర్థంలో ఉండగా దానితో పాటిక్కడ నైల్యార్థంలో ప్రయోగించటం

తే॥ సాంధ్యరాగలహరి సామిరంజితములై
తిరిగె మింట నిదుర దెలిసినట్టి
యిందిరాధిపతికి నెత్తు కర్పూరనీ
రాజనములన శరద్ఘనములు. 139

శరత్+ఘనము = శరత్తులోని మబ్బులు; సాంధ్యరాగలహరిన్= సంజల ఎర్రదనాల కాంతితో; సామి = సగము, రంజితములై - ఎర్రబడినవై; నిదుర తెలిసినట్టి = నిద్రనుండి మేల్కొన్న, ఇందిర+అధిపతికిన్= లక్ష్మీభర్తయైన హరికి; ఎత్తు = ఎత్తిన; కర్పూరనీరాజనములనన్ = కర్పూర హారతులన్నట్లుగా; మింటన్= ఆకాశంలో, తిరిగెన్ = తేలిపోతున్నవి

తా॥ ఆకాశంలోని అంచుల్లో సాంధ్యరాగంప్రతి బింబించగా ఎఱ్ఱబడి నడుమనీల కాంతికలిగిన మబ్బులు పెరటం చూస్తే - అప్పుడే నిద్రతెలిసిన శ్రీహరికి ప్రకృతి కర్పూర నీరాజనమిస్తున్నట్లున్నది.

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ కర్పూరం = తెల్లమబ్బు; మంట = అంచుల్లోని సాంధ్యరాగం శ్రీహరినిద్రమేల్కొన్న కాలం పూజార్థం కనుక ఉత్సవాలు చేయటం పరిపాటి. ఆపండుగను సూచించే వర్ణన. కావ్యనాయక సూచన కలది. అంతటా ఇలాగే చూచు కోవాలి. ప్రకృతి వర్ణన భగవత్పరంగా చేయటానికి కారణం శ్రీకావ్యనాయకత్వ స్థాపన; మత దృష్ట్యా- సర్వప్రకృతికీ - జీవుల కూ అతడే సూత్రాత్మ. కనుక కావ్యాత్మా అతడే.

**మ॥ అళిగరుదంచ లామల తదంత రబింబిత యయ్యెఁబాకని**
**ర్దళిత మహాఫలౌ ఘహరితచ్ఛదకర్కటికావనాలినాఁ**
**గలమవన భ్రమచ్ఛుకనికాయము లోపల సాంధ్యరక్తిమం**
**బలఁతిగఁ దాల్చి మింటఁగననయ్యె విపాండుపయోదఖండముల్. 140**

విపాండు = స్వచ్ఛములైన; పయోగ = మబ్బుల; ఖండముల్= శకలాలు (ముక్కలు) మింటన్= ఆకాశంలో; కలమవన = వరిపొలంలో; భ్రమత్ = విగిరే; శుక = చాలుకల; నికాయము = గుంపు; లోపలన్ = నడుమనడుమ; సాంధ్యరక్తిమంబు = సంజ ఎఱ్ఱదనం; తాల్చి = వహించి; పాక = పక్వమై; నిర్దళిత = పగిలిన; మహాఫల = పెద్దపెద్ద పండ్లు; బాఘ = గుంపు; హరిత = పచ్చని; ఛద = ఆకులతో; కర్కటి కానన + ఆళి = దోసతోటల వరుస; ఆళి = తుమ్మెద; గరుత్ = రెక్క; అంచల = చివళ్ల; అమల = నిర్మలమైన; తత్ = ఆ; అంబర = ఆకాశంలో; బింబితమయ్యెన్ = ప్రతిబింబించినది; అనునట్లు, కనన్ + అయ్యెన్ = కనిపించాయి.

తా॥ ఆకాశంలో జీరాడే తెల్లని మబ్బులముక్కల క్రింద వరిపొలాలపై పరుగెత్తే చిలుకలగుంపులు; నడుమన డుమ సంజవన్నెలు తాల్చి ఎలాగున్నాయంటే - పచ్చనాకులు పండి పగిలిన కాయలుగల దోసతోటలు తుమ్మెద రెక్కల అంచులనైగనిగ్యంతో ప్రకాశించే వినీలాకాశంలో ప్రతిబింబించి నట్లున్నాయి.

ఉపమాన సౌందర్యభావన చాలక్లిష్టమయినది - తెల్లని మేఘశకలాలు నైపథ్యంలో ఉన్నాయి. వాటికి క్రిందుగా పచ్చని చిలుకలు గుంపు వరిపొలాలు, నడుమనడుమ సంధ్యారాగ కంతులు - ఉపమేయం. పచ్చనాకులు, పగిలిన దోస పండ్లుకల దోస తోటలు ఉపమానం. హరిత = ఆకు పచ్చని; పసుపు పచ్చన, రెండర్థాలు, ప్రస్తుతం పచ్చనాకులు - చిలుకల రెక్కలు; పసుపు పచ్చని ఆకులు - వరిపొలాలు - పండిన దోసపండ్లు సాంధ్యరక్తిమ అలమిన మేఘశకలాలు ఇందుకే శకలమనటం.

అలం : ప్రౌఢోపమానం ప్రాణంగా గల ఉత్ప్రేక్ష. ఇక్కడ ఉపమానోపమేయాలు రెండూ ప్రస్తుతాలే.

విశే॥ వ్యావసాయక ప్రాణమైన భావన గాథాసప్తశతిలో ఈ భావం కన్పిస్తుంది. సప్తశతికీ ప్రాణ భూమిక పల్లీ సీమేకనుక

కం॥ ఘుణగణ విహరణఁ జివికిన
మణి ధనువునఁ దొరఁగు నుసి సమానములై ద
ర్పణనిభనభమునఁ బరిణత
శణకణహరిణములు జలదశకలము లొలసెన్. 141

దర్పణ = అద్దం; నిభ = వంటి; నభమునన్ = ఆకాశంలో, పరిణత = బాగా ముదిరిన; శణ = జనుము; కణ = ముక్క, హరిణములు= తెల్లనివైన; పాండు = తెల్లని, జలదములు = మబ్బులు; బలసెన్ = వ్యాపించాయి.

ఇది ఉపమేయాంశం - ప్రస్తుతం.

ఉపమానం :- ఘుణ = చెట్టుతొలిచే నుసిపురుగుల; గణ = గుంపు; విహరణన్ = తిరగటంవలన; చివికిన = ఎకిపోయిన, మణిధను వున్నన్ = ఇంద్రచాపంనుండి; తొరగు = రాలే, నుసి = పొడి; సమానములై = సదృశయులై

తా॥ ఇంద్రచాపంలో పురుగులు దూరి తినేస్తుంటే రాలేనుసిలాగా అద్దంలా గా వ్ను ఆకాశంలో తేలాడే తెల్లని నార పీచుల్లాగా ఉన్న మేఘాలు వ్యాపించాయి.

నారపీచుల్లాంటి మబ్బుల ముక్కలు నీలాకాశం - సంధ్యాకాంతి ముప్వన్నెలున్నాయి. మణి ధనువులో ఇంద్రనీలం = కెంపు - వజ్రం మూడు రత్నాల కాంతులు కలనుసికి పోలిక. చూ. 4-96లో త్రిరుచిత్వశబ్దం మణిధనువు వానకారులో ఎన్నో రీతులుగా పోల్చబడటం అనుసంధించు కోవాలి.

కం॥ రవి శశి ము కురములు శర
ద్యువతి మె ఱుఁ గుఁబెట్టు భూతి యోయన ఁ బర్వెన్
బవ నాహ తసప్తచ్ఛద
నివహప రాగంబు దివికి నిర్మల కాంతిన్. 142

శరద్యువతి = శర త్కాలాంగన; ( శరత్కాలమే స్త్రీ) రవి = సూర్యుడు; శశి = చంద్రుడు ముకురములు - అద్దాలకు; మెరుగుపెట్టే = స్వచ్ఛతకోసం మెరుగుపెట్టే; భూతియో బూడిదయో, అనన్ = అన్నట్లు; పవన+ ఆహత = గాలికి ఎగరగొట్ట బడ్డ; సప్తచ్ఛద = ఏతాకుల అరటి; నివహ = సమూహము యొక్క; పరాగంబు = రజస్సు; దివికిన్ = ఆకాశానికి; నిర్మల = స్వచ్ఛ; కాంతిన్ = వన్నెతో; పర్వెన్ = వ్యాపించింది.

తా॥ అద్దాలకు బూడిదతో మెరుగు పెట్టటం సహజం. కనుక శరత్కాల యువతి సూర్యచంద్రులన్న అద్దాలకు మెరుగు పెట్టే బూడిదలాగా ఏడాకుల అరటి తోటలనుండి రజస్సమూహం స్వచ్ఛకాంతితో ఆకాశమంతా వ్యాపించింది.

అలం : ఉత్ప్రేక్ష

విశే॥ గ్రీష్మర్తువులో దుమ్ము = ధూళి వర్ణనలతో పోల్చుకో వచ్చు. అలాగే 4-110 3-4 పాదాల రచనా సౌందర్యం భావం. పవనాహత- నష్టచ్ఛద; - నివహ పరాగంబు - ఈ విరుపుల్లో అందంభావించదగ్గది.

స్రగ్ధరః సంభూతజ్ఞప్తివాతాశనశయనము విశ్వంభరుం డూఁది లేవం
గంభీరప్రక్రియా మగ్నత డిగు జగతిం గ్రందుగాఁ దోచు వర్షా
దంభోళి స్థూల రంధ్రోద్గతసితపృథు పాతాళజాతాంబు ధారా
స్తంభంబు ల్పోలె నెన్నుల్ధవళరుచి శరస్తంబపంక్తింజనించెన్. 143

శరస్తంబ = రెల్లుకాడల; పంక్తిన్ = పొదలలో; ఎన్నుల్ = పూలు; ధవళరుచిన్ = తెల్లని కాంతితో; జనించెన్ = పుట్టినవి. - ఇది ఉపమేయం.

ఉపమాన వర్ణన :- సంభూత = కల్గిన; జ్ఞప్తిన్ = మెలకువ చేత; విశ్వంభరుండు = లోకమంతా ధరించిన వాడు హరి కనుక చాలా బరువుగా ఉన్నాడని; వాత+అశన = గాలి అన్నంగా కలది పాము = (ఆదిశేషుడు అన్న) శయనము = పరుపు; ఊఁది = నొక్కి; లేవన్ = నిద్రలేవగా; గంభీర= లోతైన; ప్రక్రియా = పద్ధతి; మగ్నతన్ = మునిగి నందు వలన; డిగు = క్రిందికిపోయే; జగతిన్= లోకంలో; (భూమిలో) క్రందుగా = దట్టంగా; తోచు = కన్పించే; వర్షా = వానకాలంలో; దంభోళి= పిండిపాటునైన; స్థూల = పెద్ద; రంధ్ర = కన్నాలనుండి; ఉద్గత = పైకిపొంగే; పృథు = పెద్ద; పాతాళ జాత = పాతాళ లోకం నుండి; జాత = పుట్టే; అంబుధారా = నీటిధారల; స్తంభంబుల్ = కంబాల, పోలెన్ = వలె.

తా॥ విశ్వంభురుడు మే ల్కొని బూరుగు దూది పరు పైన ఆదిశేషుని పై మోచేతితో నొక్కిలే చేసరికి ఆ భూమి క్రిందకుదిగి పోయింది. ఆభూ మినిండా వానకాలంలో పిడుగు పాటు తో పడ్డ పెద్దపెద్ద రంధ్రాలున్నాయి. పాతాళలో కంలో నీరు ఆరంధ్రాల నుండి పైకి ధారాతుంత్రం (ఫౌంటెన్) లాగా చిమ్మి కొట్టింది. ఆతెల్లని నీటి ధారల్లాగా రెల్లు వెన్నులు తెల్లగా కాడలై విచ్చాయి.

అలం : ఉత్ప్రేక్ష. ( ఉపమబలంగా ఉంది)

విశే॥ అద్భుత భావన. ఆంధ్రభాషలో ఇంతగాఢ భావుకుడు మరొకడు లేడన్నది అతిశయోక్తి కాదు.

స్రగ్ధరా లక్షణం :– మ-ర-భ-న-య-య.య.జ్ఞప్తి వాతాశనశయనము విశ్వంభరం -1-8-8 యతులు గంభీరవృత్తం. భారావహమైన భావం లేక పోతే వృత్త గమనం శోభించదు. ఛందోగమనం - భావం రెండూ సమానంగా తూగు తున్న పద్యమిది. అలాగే వర్షర్తువులో వచ్చిన స్రగ్ధర కూడ.

తే॥గీ॥ నీర జేక్షణుఁడ వ్వేళ నిదుర దెలిసి
యడుగుఁదన మీఁద మోపనో యవని రమణి
కంటకిత గాత్రి యయ్యె నాఁగా, విపాక
పరుష కంటక శాలి మంజరులు పొలిచె. 144

నీరజ+ ఈక్షణుడు = తామర పూవు వంటి నేత్రాలు కలవాడు శ్రీహరి; ఆ+వేళ = ఆసమయంలో; నిదుర తెలిసి= నిద్రమేల్కొని; అడుగు = పాదం తన మీదన్ మోపెనో = తన పైన మోపినందున నేమో; అవని రమణి = ఆభూదువి; కంటకిత = పులకించిన; గాత్రి = గాత్రము (శరీరం) కలది; అయ్యెన్ = ఐనది, నాగాన్= అన్నట్లుగా; విపాక = బాగాపండిన; పరుష = తీక్ష్ణ; కంటక = ముండ్లు గల; శాలిమంజరులు = వరివెన్నులు; పాలిచెన్ = అందగించాయి.

తా॥ భగవంతుడు (నాయకుడు) నిద్రలేచి పాదం తన మీద మోపినందువల్ల కాబోలు భూదేవి కావ్యనాయిక - (గోదాదేవి) శరీరం పులకించినట్లు - పండబారిన సూక్ష్మమైన ముండ్లు కల వరి వన్నెలు దిగినవి.

అలం : ఉత్ప్రేక్ష. ఉపమానం - వరిగింజల చివళ్ల ముండ్లు కల వెన్నులు. ఉపమేయం - గగుర్పాటు పొందిన శరీరం

రెండూ ప్రస్తుతాంశాలే. భూదేవి నాయిక కనుక కావ్యంలో ప్రధానమైన శృంగార రసం ధ్వనిస్తున్నది. ఇది కావ్యం మొత్తానికి అన్వయించే విషయం. శరద్వర్ణన ప్రస్తుతాంశం. ఈ ఘట్టానికే అన్వయించేది.

విశే॥

కం॥ కిటియై కౌగిటఁ జేర్చెను
వటుఁడై వర్ధిల్లి కొలిచెనడిఁ గృష్ణుండై
యిట పద చిహ్నములిడెఁగ్రిం
దటి బాముస నేమి నోచితమ్మ ధరిత్రీ !

మం॥ అశ్వాక్రాంతే రథాక్రాంతే
విష్ణుక్రాంతే వసుంధరే !
త్వాం శిరసాధార యిష్యామి
రక్షస్వ మాం పదే పదే.

మహానారాయణోపనిషత్తులోని ఈ మంత్రం భూదేవి ప్రార్థన.

అశ్వం, రథం, విష్ణుపాదాలతో ఆక్రమింపబడిన తల్లీ ! నీకు నమస్కారం. ప్రతిపదమూ నన్ను కాపాడు - అని మనిషి నిద్రలేచి కాలు భూమిపై మోసేటప్పుడు చదివే మంత్రం. ఆముక్తమాల్యద అంటే భూదేవిప్రార్థనే. శరణాగతి ప్రధానమైన శ్రీవైష్ణవప్రార్థన. కనుక ఈ పద్యం చాలా ప్రధానమైనది. ఫెళఫెళమబ్బు చిట్టుడుము . . . . . . 101లోనూ ఈ నాయికా నాయక శృంగారమే.

మ॥ స్ఫుట భూయోహ్నుతి శంక వార్ధి నినర శ్మల్మిన్నుచేర్పం, దటి
చ్చట లౌర్వంబుగఁ గారుకొంచు, ఘనమై, క్ష్మాదీర వర్షింప, న
చ్చొటనుండోచి గ్రసింపఁ బోలుఁ గలశీసూనుండు గాకున్న నో
క్కొటఁ దారా గ్రహ భాస్కరేందుమణి శుక్తుల్వ్యక్తమై తోఁచునే. ? 145

స్ఫుట = స్పష్టమైన; భూయః = మరల, హృతి = అపహరణ, శంకన్ = సందేహంతో; ఇనరశ్ముల్= సూర్యకిరణాలు; వార్ధిన్ = సముద్రాన్ని; తటిత్ = మెరుపులు; ఘటలు = సమూహం; ఔర్వంబుగన్ = బడబాగ్నికాగా, మిన్ను = ఆకాశం; చేర్పన్ = చేర్పగా; కారుకొంచున్ = నల్లబారి; ఘనమై = మేఘమై; తీఱన్ = జలమంతా వట్టి పోగా; క్ష్మన్ = భూమిపై; వర్షింపన్ = వానకురిస్తే, అచ్చోటనున్ = ఆ ఆకాశంలో కూడ; తోచి = అవతరించి; కలశీ సూనుండు = చెంబు నుండి పుట్టినవాడు = అగస్త్యుడు; గ్రసింపన్+పోలున్ = త్రాగివైచినాడు కాబోలు (సముద్రాన్ని) కాకున్నన్= కాకపోతే, ఒక్కొట = ఒక్కసారే; తారా - నక్షత్రాలు, నవ = నవగ్రహాలు, భాస్కర = సూర్యుడు, ఇందు = చంద్రుడన్న, మణి = మణులు; శుక్తుల్ = ముత్తెపుచిప్పలు; వ్యక్తమై = బహిర్గతమై; తోచునే = కన్పిస్తాయా ?

తా॥ అగస్త్యుడు జలమంతా మరలా తాగుతాడేమో నన్న శంకతో సముద్రాన్ని సూర్యకిరణాలు మిన్నుపైకి చేర్చి దాచిపెట్టాయి. ఆ సముద్రపునీటిలో నున్న బడబాగ్ని మెరుపులై నల్లబారి మేఘాలై ఆ సముద్రాన్ని వాన రూపంలో కురియటంవల్ల నక్షత్రాలు గ్రహాలు సూర్యచంద్రబింబాలు స్పష్టంగా ప్రకాశించాయి.

అలం : ఉత్ప్రేక్ష

విశే॥ అగస్త్యనక్షత్రోదయం రావటంతోనే శరదారంభం జరుగుతుంది. కనుక ఇలా చమత్కరించాడు కవి. సముద్రంలో మణి-శక్తులుంటాయి కనుక నీరు పోగా బైట పడ్డాయి.

పురాణకథ : కాలకేయులన్న రాక్షసులు సముద్రమే ఇల్లుగా చేసికొని దేవతలను బాధిస్తే వారు అగస్త్యులతో మొరబెట్టుకొన్నారు నీరంతా త్రాగమని. ఆయన ఒక్క పుడిసిలిగా చేసికొని సముద్రాన్ని త్రాగేస్తే రాక్షసులు బైటపడ్డట్లు - దేవతలు వారిని సంహరించిన కథ అనుసంధేయం.

కలశీ సూనుడు చెంబు - కుండ - జన్మనిస్తాయా ? పురాణకథ ప్రతీక తప్ప వాస్తవం కాదు. సముద్రం విశ్వసృష్టికి సంకేతం. కలశాదిపాత్రలు వ్యక్తిసృష్టికి సంకేతం.

**చం॥ అలమలయాద్రి కుంభభవుఁడన్కతకంబు శరత్తు కుండమం**
**డలి ప్రతిబింబ కైతవమునం దమకిచ్చిన వారి దేవత**
**ల్తొలఁకుల కేలఁ దాప నిడితోమఁ గలం కడఁగెం, దదీయత**
**త్ఫలతకు హ్రస్వమౌటె కరి, తారక లంబువుఁదేర్చునే యనన్. 146**

అల = ప్రసిద్ధమైన; మలయ+అద్రి = మలయ పర్వతం; కుంభసంభవుఁడు = అగస్త్యుడు, అన్ = అన్న; కతకంబు = చిల్లగింజను; వారి దేవతలు = జలదేవతలు; శరత్తులో; కుండయుందలి = సరస్సుల సమూహంలో; ప్రతిబింబ = ప్రతిఫలించిన; కైతవమునన్ = మిషతో; తమకున్ = వారిదేవతలకు; ఇచ్చినన్ = ఇస్తే; వారి దేవతలు = జలదేవతలు; తొలకులకేలన్ = కెరటాలన్న చేతులతో; తాపన్ = మెట్లుపై; ఇడి = పెట్టి; తోమన్ = అంగ తీస్తే; తదీయ = అగస్త్య నక్షత్రముయొక్క; తత్ఫలతకున్ = ఆ ఫలమైనందున, కరి = సాక్ష్యం, హస్వంబు = చిన్నది; ఔటన్ = కావటమే (సాక్ష్యం), తారకలు - చుక్కలు; అంబువు = నీళ్లను, తేర్చునే = తేటపడేటట్లు చేయగలవా ? అనన్ = అన్నట్లుగా, కలంకు = జలకాలుష్యం, అడగెన్ = అణగారిపోయింది.

తా॥ అగస్త్యనక్షత్రోదయంకాగానే భూమిపై పడ్డనీరంతా తేటపడింది. దీనికి కారణమేమంటే మలయాద్రి తన మీద ఫలించిన అగస్త్యుడన్న చిల్లగింజను వారి దేవతలకు - సరస్సుల్లో ప్రతిబింబించిన ఆ నక్షత్రం రూపంలో ఇవ్వగా వారాగింజను అలల చేతులతో మెట్లపై ఆ గింజను అరగదీసారు. అందువల్ల కాలుష్యం పోయింది తప్ప - అగస్త్య నక్షత్రోయం వల్ల కాదు. దానికి గుర్తేమంటే ఆ గింజ అరిగి పోవటమే. అంటే నీళ్లలో ప్రతిబింబించిన నక్షత్రం చిన్నది కదా.

అలం : కైతవాపహ్నవం (ప్రతిబింబ కైతవ మన్నచోట)

విశే॥ నక్షత్రం అలలపై ప్రతిబింబించుట మెట్లపై అరగతీయుటంగా ఉత్ప్రేక్షింపబడింది.

చం॥ ఇలకు సుధా సమత్వమురహింప శరజ్జల జాక్షి కుండమం
డలి సలిలంబుఁ గల్మషమడంగ మొగి ల్విరి యెండఁ గాఁచు చోఁ
జిలుకు నిశారజః పటలి చెన్ను వహించెఁదరంగపంక్తిపై
దళదరవింద కైరవ కదంబ కడార పరాగ పూరముల్. 147

దళత్ = వికసించే, అరవింద = తామర, కైరవ = కలువపూల; కడార = బంగారు; పరాగ = రజస్సు; పూగముల్ = సమూహం; తరంగ పంక్తిపైన్ = అలల గుంపులపై; శరత్ = శరత్కాలమన్న; జలజ+ అక్షి = తామరలవంటి నేత్రాలున్న యువతి; ఇలకున్ = భూమికి; సుధాసమత్వము = అమృత సాదృశ్యం, రహింప = కల్గించటానికి, కుండమండలి = సరస్సుల సమూహం లోని; సలిలంబు = నీళ్లు; కల్మషము = కాలుష్యం, అడంగన్ = అనూరిపోగా; మొగిల్ = మబ్బు; విరి = విరిసిన; ఎండన్ = ఆతపం; కాచుచోన్ = కాగబెడుతూ; చిలుకు = చల్లే, నిశారజఃపటలి = పసుపుపొడి మొత్తముయొక్క; చెన్ను = అందం, వహించెన్ = పొందినది.

తా॥ సరస్సుల్లో తామరలు కలువలు వికసించినందున వాటి పరాగరాశి గాలికి లేచి తరంగాలపై వ్యాపించింది. ఇదెలా వుందంటే - శరత్కాంత భూమిని దేవతాలోకం చేయాలని సంకల్పించి సరస్సుల్లో నీళ్ల మొగిలు విరిసిన యెండలన్న పొయ్యిమీద కాస్తూ కాలుష్యం పోవటానికై పసుపుపొడి చల్లి నట్లుంది.

అలం : ఉత్ప్రేక్ష

విశే॥ నీరు తేటపడి త్రాగటానికి తీయగా ఉన్నాయి. మొగిలు విరియోడ = మబ్బు తీయగా విడిసిపడే యెండ. శరత్తులో విప్పారినతామరలే సుశరత్కాంతా నేత్ర సంపద. ఆ పూలతో ఆమె కనులు విప్పి చూస్తున్నట్లుంది.

ఉ॥ హెచ్చిన మైత్రిం బద్మినుల కెల్ల ఘనాత్యయకారుకుండు సొ
మ్మచ్చుపడంగఁ జేయుటకు నై యల క్రౌంచనగంబు పేరి క
మ్మచ్చున నీడ్చు శర్వగిరి యందలి వెండి శలాక పిండునా
వచ్చి మరాళ మాలికలు వ్రాలెఁగొలంకులఁ జక్ర ఝుంకృతిన్. 148

ఘన+ అత్యయ = మేఘములకు విశ్రాంతిని; కారుకుండు = కల్గించినవాడు; ఘనాత్యయము =. మేఘకాలంపోగా వచ్చిన శరత్కాలమనే; కోరుకుండు = కంసాలి (శిల్పి) హెచ్చిన = అధికమైన; మైత్రిన్ = ప్రేమతో; పద్మినులకున్+ఎల్లన్ = తామరపూలన్న కాంతలకు; (పద్మినీజాతి స్త్రీలకు) సొమ్ము = నగ, అచ్చుపడంగన్ = అమరేటట్లుగా; చేయుటకునై = చేయటం కోసం; అల = ఆ పురాణ ప్రసిద్ధమైన; క్రౌంచనగంబు పేరి = క్రౌంచపర్వతమన్న పేరుగల; కమ్మ+అచ్చునన్ = బెజ్జాలు కల ఇనుప అచ్చులో; ఈడ్చు = లాగు; శర్వగిరి = హిమాలయం (ఈశ్వరుని నివాసమైన కొండ) అందలి = అందున్న; వెండి శలాక పిండునాన్ = వెండి తీగల గుంపులాగ, మరాళమాలికలు=హంససమూహాలు, వచ్చి = హిమాలయం నుండి వచ్చి కొలంకులన్ = సరస్సులో; చక్రఝుంకృతిన్ = గుండ్రంగా ఎగురుతూ ఝుమ్మన్న రెక్కల చప్పుడుతో, వ్రాలెన్= ఒకుమ్మడిగా వ్రాలినవి.

తా॥ శరత్కాలమన్న విశ్వకర్మ పద్మినులకు (పద్మతీగలకు) ప్రేమతో సొమ్ములు చేయటానికై క్రౌంచపర్వతరంధ్రమన్న కమ్మచ్చులో నుండి హిమాలయంలోవున్న అంచలగుంపన్న వెండి తీగల గుంపు బలంగా ఈడ్చాడట. ఆ లాగటంతో వలయాకారంగా చుట్టలు చుట్టుకొంటూ; ఝుమ్మని రెక్కల చప్పుడుతో సరస్సుల్లో ఒకుమ్మడిగా వాలాయి.

అలం : ఉత్ప్రేక్ష. అలంకార భావసాధనం. కవితా సామగ్రిలో ఒకటి. కనుక పేరు తెలియటం నిర్వచనం చెప్పటం కాదు ముఖ్యం. శాస్త్రీయంగా అలా తెలిసికోవటం దేనికంటె కలిగిన అనుభవాన్ని వ్యాఖ్యానించుకోవటానికి. కనుక అలంకార వివేచనకు అనుభవం సాధనం.

కంసాలి కమ్మచ్చును కాళ్లతో నొక్కిలావు పాటి వెండి-బంగారం తీగలను సన్నగా చేయటానికి వాటిని కమ్మచ్చు రంధ్రాల్లో దూర్చి పట్టుకారుతో లాగితే రంధ్రం ఈవలకు వచ్చే ఆ తీగ చుట్టలు చుట్టుకొని ఝుంకార శబ్దంతో వస్తుంది. ఈ సాదృశ్యం లోకానుభవం.

శరత్కాలంలో హంసలు క్రౌంచగిరి రంధ్ర ద్వారా లోకం లోకి రావటం కవి సమయం. ఈ విషయం పూర్వమే ప్రస్తావితమయ్యెనది. యోగశాస్త్రరహస్యమని చెప్పబడినది. చూ. 4-121. (హంస ప్రాణశక్తికి ప్రతీక. క్రౌంచ రంధ్రం = కంఠస్థానంలో వున్న విశుద్ధి చక్రం. మానస సరస్సు - వికసించిన మనస్సే సరస్సు = సహస్రారం) చాలా అందమైన ప్రౌఢభావన. పక్షులు వ్రాలటంలోని సూక్ష్మతానుకృతి ఈ పద్య భావం.

తే. గీ. కుంభజుఁడు వార్ధితోఁగ్రోలి కుక్షినున్న
మించుముక్తాచ్ఛటలె క్రుమ్మరించె ననఁగ
జలజ దళములఁ దేటలుఁ జవులు నయిన
యంబుకణములు వొలిచెఁ బద్మాకరముల. 149

కుంభజుడు = అగస్త్యుడు; వార్ధితోన్ = సముద్రముతో పాటుగా; క్రోలి = త్రావి; కుక్షిన్ = కడుపులో; ఉన్న+మించు = మెరిసే; ముక్తాచ్ఛటలె = ముత్యాలసమూహమునే; క్రుమ్మరించెన్= వెలిగ్రక్కినాడు;

అనగన్ = అన్నట్లుగా; పద్మాకరములన్ = తామరలకునిలయాలైన సరస్సులలో; జలజదళములన్ = తామరలరేకులపై; తేటలు = స్వచ్ఛములు, చవులు = రుచులు కలవి అయిన = అయినట్టివి, అంబుకణములు = నీటిబొట్లు; పొలిచెన్ = ప్రకాశించాయి.

తా॥ సరస్సులో విచ్చిన తామరపూలరేకుల మీద నీటి బొట్లు - (వాన కురిసి వెలిసిపోయింది కాబట్టి) స్వచ్ఛంగా, చవులూరిస్తూ నిలిచినవి. అని సముద్రం నీరు త్రాగి కడుపులో నున్న ముత్యాలను అగస్త్యుడు వెలికి క్రక్కినట్లున్నాయి

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ అగస్త్యుడు - సరస్సు - పద్మం - నీటిబొట్లు వీటి చుట్టు ఎన్ని రకాల ఊహాలల్లబడ్డాయో చూస్తే కవి భావుకత తెల్లమవుతుంది.

చం॥ కెరలు స్రవంతిఁ బైయిసుక క్రిందగువేళ నినుండు మేఘపుం
దెర సనఁ జల్లఁగా విరహదీప్తకరప్లుత మౌ సజీర కో
త్కర గుడమట్ల పద్మినులఁ గ్రమ్ము సకేసరమాధ్వి పొల్చెఁ, బైఁ
గర మరుదారెఁ దేంట్లు సెకఁగందిన ముత్తెపుసేసలో యనన్. 150

ఇనుండు = సూర్యుడు (వరుడు); కెరలు = పొరలికలుపెట్టే, స్రవంతిన్ = నదిలో, పై = నీటిపై తేలు ఇసుక. క్రిందు+ అగువేళన్ = క్రిందికిదిగిన సమయంలో (పూర్వం ఇసుక గడియారాలుండేవి. డమరుకం ఆకారంలో మధ్యనున్న బెజ్జం ద్వారా ఇసుకపై నుండి క్రిందికి దిగితే అది ఒక జాము కాలంగా పరిగణించేవారు. మరలా క్రిందన ఇసుకవైపుభాగాన్ని త్రిప్పి పైకి వచ్చేటట్లు పెట్టేవారు. ఇదే ఇసుక గడియారం.) మేఘుపున్= తెల్లని మబ్బన్న; తెర = వధూవరులకు మధ్యను పట్టిన గుడ్డ; చనన్ = తీస్తే; చల్లగాన్ = చల్లగాకావటం కోసం పైన పోయగా); విరహదీప్త = విరహాగ్నితో; వేడిగానైన; కర = చేయినుండి; ప్లుతము+ ఔ = ద్రవించిజారే; స+ జీరక+ఉత్కర = జీలకర్ర మొత్తంతో కూడిన; గుడము = బెల్లం; అట్లన్ = వలె; పద్మినులన్ = పద్మాలను (పద్మినీ జాతిస్త్రీ- రవికి ఈ పద్మం భార్య కనుక) క్రమ్మి = ఆవరించే; సకేసర = కేసరాలతో కూడిన; మాధ్వి = మధుధార, పొల్చెన్; పైన్ = పద్మినులపై; కరము = మిక్కిలి, తేంట్లు = తుమ్మెదలు; సెకన్ =వేడితో; కందిన = కమలిన; ముత్తెపు = ముత్యాల; సేసలో అనన్ = అక్షతలో అనునట్లు, అరుదారెన్ - (అరుదు+ఆరెన్) = వింతగానున్నది.

తా॥ పద్మాలు విచ్చాయి. కనుక వాటి కేసరాలనుండి మధుధారలు స్రవిస్తున్నవి. దాని కోసం తుమ్మెదలు మూగాయి. ఇది వాస్తవిక దృశ్యమైన ఉపమేయం.

**ఉపమానం :** పద్మినీ సూర్యులకు వివాహం జరుగుతున్నది. ఆ సమయం ఏటిలో ఇసుక క్రిందైన వేళ - (శరత్తు) - గడియారంలో పై ఇసుక క్రిందికి జారిన వేళ - అదే ముహూర్తం కాగా ఇనుడు తన విరహాగ్నితో వేడిగా ఉన్న హస్తంతో కరిగి జారే బెల్లంతో కలిసిన జీలకర్ర ముద్ద పద్మిని తలపై వుంచినట్లుగా ఉన్నది.

తుమ్మెదలు విరహాగ్నిలో క్రాగే తలపై ముత్యాల తలంబ్రాలో అన్నట్లున్నాయి. అవి సెతకు నల్లబడిపోయాయి.

విశే ॥ వివాహాచార క్రియాధారంగా కల్పించిన భావం. కవితాభావ మొకటి చెబితే దాని చుట్టూ ఒక దేశీయాచారమో, సంప్రదాయమో - శాస్త్రమో పెట్టటం ఈతరహా కవుల శైలి. ఆనలినాక్షు గోడ గడియారములన్ - అని పారిజాతంలోని మాట. ఇక్కడ ఇసుక గడియారం.

చం॥ జలజ దళస్థ తోయములు సందుల క్రిందులఁదోఁచు మింటినీ
డలుఁ గనుపట్టె నత్తఱిఁ దటాకములన్ లఘిమంబు రెంటిలోఁ
దెలియ ఁదరంగఁబై కెగయు తేఁటుల చేరులఁ దూన్పఁ దోయముల్
పలుచనఁ దేలె; మిన్నడేగు వట్టె ఁగడుం దళమౌటనో యనన్ 151

జలజ = నీటిలో పుట్టినది=పద్మం; దళస్థ = రేకులమీద ఉన్న, తోయములు= నీరు, (ముందు పద్యంలో చెప్పాడు) సందులన్ = అవిలేని ప్రదేశాలలో; క్రందునన్ = దట్టంగా; తోచు = కన్పించే, మింటి = ఆకాశం; నీడలు = ఛాయలు; కనుపట్టెన్ కన్పించాయి; అత్తరిన్ = ఆసమయంలో; తటాకములన్ = సరస్సులలో; రెంటిలోన్ = ఆకాశంనీరు రెంటిలో; లఘిమంబు = తేలిక (ఏదో) తెలియన్ = తెలిసికోవటానికి; తరంగ = అల; పైకిన్ ఎగయు = లేచే; తేటులచేర్లు = తుమ్మెదల చాలన్నత్రాళ్లతో, తూన్పన్ = తూచగా; తోయమున్ = నీరు; పలుచనన్ = తేలిక తనంతో; తేలెన్ = పైకి తేలాయి; కడున్ = మిక్కిలి, దళము = బరువు; ఔటనో యనన్ = అయినందువల్లనో అన్నట్లుగా; మిన్ను = ఆకాశం; అడుగుపట్టెన్ = అడుగునకుమునిగింది.

తా॥ పద్మదళాలతో నీరు స్వచ్ఛంగా మెరుస్తున్నది. నది అడుగున నీలా కాశం ప్రతిబింబించింది. దీన్ని అలంకారభాషలో చెబు తున్నాడు - నీరు తేలికా? ఆకాశం తేలికా? అని శరత్తు తెలుసు కోవడానికి అలలన్న పసిబ్బెలలో పెట్టి పద్మాలపై మూగే తుమ్మెదల చేర్లలో తూస్తే నీళ్లు పలుచన కనుక పైకి తేలాయి. ఆకాశం బరువు కనుక క్రిందికా పోయింది.

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ రెండో పాదంలో డ - ట యతి విశేషం. నిత్యసమానయతి. తట+అకం. ''అ'' కు ''డ'' కు యతిలేదు. కనుక తటాకం నిత్య సమానంగా గ్రహించాలి. (వేదం) అప్పకవీయంలో ఈ యతి ఇలా చెప్పబడింది.

తే॥ ఒక్క సమసనమున శబ్దయుగము కూడి
పదము లేర్పాటుగా గాన బడని ప్రాణ
సంధులకు నిత్యసమసన శ్రాంతులును న
ఖండ విశ్రమములునన రెండుఁ జెల్లు. (3-135)

కార్ణటాదిశబ్దాలలో కర్ణ+అట అనిసంధి ఛ్చేదం చేస్తే యతి వేయ వచ్చు లేదా చేయ కుండా హల్లు కూవే యవచ్చు. మొదటిది అఖండయతి. రెండోది నిత్యసమాస విశ్రాంతి.

మ॥ ఇలకున్ వ్రేఁగుగ ఁ బండి తీరవన పుండ్రే క్షుచ్ఛటల్ దీపుల
గ్గలమై వ్రాల, నురుస్వనంబు లెసఁగంగాఁద్రి ప్పు రాట్నంపు గుం
డ్రలు నాఁ దేనెకొలంకులం బొరలి పాఱన్ విచ్చు పంకేరుహం
బుల నా డె ందొలు సంజ ఁదేఁటి వల యంబుల్తార ఝుంకార ముల్ 152

ఇలకున్ = భూమికి, వ్రేగుగన్ = బరువగునట్లు గా; పండి = చెరువుల ప్రక్కన నున్న చెరుకుచేలు; తీర = ప్రక్కనే ఉన్న, వన = తోటలైన; పుండ్ర+ ఇక్షు+ ఛటల్ = నామాలు చెరుకుగడలు; తీపులు = రసం; అగ్గలమై = ఎక్కువై, విచ్చు = వికసించే, పంకేరుహంబులన్ = పద్మాల్లో; తేనె = మధువు; కొలంకులన్ = సరస్సుల్లో పొరలి = పొంగి; పారన్ = కారగా; తార = ఉచ్చై స్స్వరంలో; ఝుంకారముల్ = ఝుమ్మన్నధ్వనులతో; తొలు = మొదటి, సంజన్ = సంధ్యలో; తేటివలయంబుల్ = తుమ్మెదల వలయాలు; ( ఎలా ఉన్నాయంటే) ఉరు = బిగ్గరయైన, స్వరంబుల్ = చప్పుడులు; ఎసంగగాన్ = ఎక్కువకాగా, త్రిప్పు = త్రిప్పే, రాట్నంపు = చెరుకుగానుగ; గుండ్రేలునాన్ = గానుగు గుండ్రనికుండలన్న ట్లుగా; ఆడెన్ = ఆడినవి (గానుగాడడంలో ఆడుక్రియ)

తా॥ చెరువుల్లో పద్మాలు మధువును స్రవిస్తున్నాయి. వాటిపై తేంట్లు ఝుంకారధ్వనులతో ఎగురుతున్నవి. చెరువుల ప్రక్క చెరుకుతోటలున్నాయి. అవి బాగాపండి రసంతో బరువెక్కి చెరువుతోకి వ్రాలాయి. క్రింద తామరాలున్నాయి. ఈ తామరలు చెరుకును గానుగాడు తుంటే గాను గుకం చానికి చుట్టూ వుండే చెక్క లొట్టెల్లా వున్నవి. పైన తేంట్లు చేసే ధ్వనులు గానుగాడే టప్పురడు వచ్చే కిర్రామని ధ్వని. చెరుకురసం తమ్మిపూలలో తేనె. ఈ దృశ్యమంతా ప్రాంతః సంధ్యాసౌందర్యం.

శా :- (పోల్చు) ప్రాత ర్వేళల నట్టి వెట్టపాగ్సై పాటిల్లెన్ . (2-55)

2-70 లో ఇక్షుయంత్రం వచ్చింది.

సీ॥ హాలనమత్కదళకందాభ తిర్యఙ్నతా
ప్యమున ఁ గొమ్మొకటి మో సనఁగఁ గ్రుంగఁ;
గటముల డిగి చిబుక మున రే పేరిన
మదమంజన గ్రంథ మాడ్కి మెఱయ;
ఛిద్రోత్థిత హాత వలత్క్ర ద్రూజమనఁ జుట్టి
తో విప్పు తో దరిం దొండ మాడ;
ఱెల్లుఁబె ళ్లలు నీటఁద్రెళ్లి ఫేనము, వం డు;
న యి, పునః ప్రాప్పదాశయము నొసఁగ

తే॥ ఘన రజోవృష్టికై మీఁదిక న్నుమొగుడఁ
గటి దెసలు నిక్క, బరితోలు గదలఁ గీలు
మదముతిక్తత నదుల కీఁదదను కృద్ధ్వ)
షాలితోఁ దేంట్లు పఱవఁ, గోరాడెఁ గరులు. 153

హల = నాగలితో; నమత్ = వంగుతున్న; కదళ = అరటి, కంద = దుంప; ఆభ = వలె; తిర్యక్ = ప్రక్కకు; నత = వంగిన; ఆస్యమునన్ = ముఖంలో; కొమ్ము = దంతం; ఒకటి; మోసు = మొలక; అనంగన్ = అన్నట్లుగా; క్రుంగన్ = నాటుకోగా,

తా॥ దున్నుతుంటేగడ్డతోపాటు విరుగుతున్న అరటి దుంప లాగా ప్రక్కకు త్రిప్పివంచిన ముఖంలో ఒక దంతం అరటి దుంప మొలకలాగా క్రిందకు గుచ్చుకోగా.

ఉపమేయం - వంచిన ఏనుగు తల. చాలుకుప్రక్కన తిరుగ బడ్డ అరటిదుంప

ఉపమానం మోసు = ఒక దంతం. - సొగసైన సాదృశ్యం

కటములన్ = దవళ్లయందు; డిగి = జారి; చిబుకమునన్ = గడ్డం చివర; రే = రాత్రి; పేరిన = చిక్కబడిన, మదము = మద ద్రవం; అంజనగ్రంథి = కాటుకముద్ద; మాడ్కిన్= వలె; మిఱయన్ = ప్రకాశింపగా.

తా॥ రేయెల్ల కారిన మదం పేరుకొని గడ్డం చివర నంటిన కాటుక ముద్ద కాబోలు అన్నట్లుగా ప్రకాశిస్తున్నది.

ఛిద్ర = రంధ్రంనుండి; ఉత్థ = లేచిన; హత = కొట్టబడిన; వలత్ = చుట్టచుట్టుకుంటున్న; కద్రూజము = పాము (కద్రువ సంతానం) అనన్ = అన్నట్లు; చుట్టుతో=గుండ్రంగాచుట్టిన చుట్ట; అనన్ = అన్నట్లు; చుట్టుతో = గుండ్రంగా చుట్టిన చుట్ట; విప్పుతో = ఆ చుట్టను విప్పటంతో; తరిన్ = ఒడ్డున, తొండము+ఆడన్ = తొండముకదలగా.

తా॥ నది యొడ్డుక్రింద ఏన్గుకోరాడుతున్నది. తైకి తొండం చుట్టటం కన్పిస్తున్నది. (ఏనుగు తల కన్పించటం లేదు) అది రంధ్రంలో నుండి పైకి వచ్చేపామును కొడితే అది చుట్టుగా చుట్టుకోవడం విప్పుకోవటం లాగా ఉంది. (తొండం)

ఱొల్లు పెల్లలు = రెల్లు దుబ్బులతో బాటు మట్టి ఉండలు; నీటన్ = నీటిలో; త్రెళ్లి = పడి; ఫేనము = నురుగు; పండును = బురద; అయి; పునః = తిరిగి; ప్రావృట్ = వానకాలం; ఆశయమున్ = ఊహ, ఒసగన్ = కలిగింపగా.

తా॥ ఏనుగు ఆటవల్ల ఱొల్లు పెళ్లనీటిలో పడి నురుగు - బురద, కావటం వల్ల వానకారు మరలా వచ్చినదన్న తలంపును కలిగింపగా; (వానకు నదికి వరదముంపు కల్గిందన్న దృష్ట్యా)

ఘన = అధికమైన, రజస్సు = ధూళి; వృష్టికి+అయి = ధారకై; మీది = పై, కన్ను; మొగుడన్ = మూసుకోగా;

కటిదెసలు = పిరుదు (ప్రక్కలు); నిక్కన్ = పైకి ఉబ్బగా; బరితోలు= ప్రక్కతోలు; కదలన్ = చలింపగా; కీలు = ఓడకీలు, మదము = దానజలము; (ఓడలకు పూసే తారువంటిది కీలు. మదజలం అలా వుంది) అది; నదులకున్ = ఏళ్లకు; తిక్తతన్ = ఒగరును; ఈన్ = కల్గింపగా; తద్ అనుకృత = ఆ ఏనుగులను వెన్నాడే; వృష+ అలితోన్ = ఆబోతులతో; తేంట్లు = తుమ్మెదలు; పరవన్ = పరుగెత్తగా; కరులు= ఏన్గులు; కోరాడెన్ = దంతాలతో మట్టిని కుళ్లగిస్తూ క్రీడిస్తున్నవి.

తా॥ కోరాడుతుండగా మట్టిపడుతూ ఉంటే ప్రక్కనున్న కన్నుమూసుకొంటూ (తలప్రక్కకు తిప్పి ఉన్నది కనుక ఒక కన్ను క్రింది ప్రక్కకు మరొకటి పై ప్రక్కకు ఉన్నవి.) పిరుదుల ఇరు ప్రక్కలు పైకి ఉబ్బగా (ఆయా ఉద్రేకాలు కల్గినపుడు జంతువుల శరీరాల్లో మార్పులు రావటం సహజం.) పార్శ్వాల్లో వ్రేలాడే తోలు కదులుతుండగా నదులకు కీలు వంటి మదము ఒగరు రుచినిస్తుండగా ఆ ఏన్గులను వెన్నాడే ఎడ్లతో మద వాసనకు మూగిన తుమ్మెదలు పరుగెత్తగా ఏటి ఒడ్డున కోరాడు తున్నవి.

అలం : సీసంలో ఉత్ప్రేక్ష ఎత్తుగీతిలో స్వభావోక్తి.

విశే॥ లోకోత్తర మైన వర్ణన. ప్రతి సూక్ష్మాంశమూ చిత్రితం కావటం - ఏన్గుక్రీడను చూచినవాడు కనుక నతాస్యం దగ్గర నుండి - పిరుదుల కదలిక దాకా ఏన్గులు ఆటనంత గంభీర సుందరంగా వర్ణించినవారు కన్పించరు. ఒక మహోన్నత జంతువును దాక్షిణాత్య దేవాలయనిర్మాణం లాగా- ప్రత్యంగుళం వ్యర్థం కాకండా శిల్పభంగిమతో చెక్కినట్లు- అంత ప్రేమగా వర్ణించటం - భక్తితో ఆ దేవాలయాన్ని కట్టినట్లుగా ఎంత ఆశ్చర్యంగా వుంది !

రాయలవారి అంతఃపురంలో నేటికీ మిగిలిన గజశాల గుర్తుకు తెచ్చుకొని అందులో ఏన్గులు సంధ్యాకాలంలో తుంగభద్రకు పోయినపుడు చేసే ఈ క్రీడావిశేషాలను భావించుకోవాలి.

గౌ॥ గండద్వంద్వ గళత్కరాళ మదరేఖల్ పుల్ల సప్తచ్ఛదా
ఖండ క్షోద సితప్రకీర్ణకములై కర్ణ ద్వయి న్మించఁగాఁ
గొండల్ద్రవ్విన మన్ను కత్తుల గతిం గొమ్ముంగొనల్ముంప, వే
దండంబు ల్చవుదంతు తౌటఁదెలిపెం, దం డెత్తి భూపాలికిన్. 154

గండ = చెక్కిళ్లు; ద్వంద్వ = జంట; గళత్ = స్రవించే; కరాళ = సాంద్రమైన; మద = మదజల; రేఖల్ = చారలు; పుల్ల = వికసించిన; సప్తచ్ఛద = ఏడాకుల అరటి; అఖండ = విస్తారమైన; క్షోదః రజస్సుతో; సితల్ = తెల్లనైనవి; ప్రకీర్ణకములై = చామయరాలై; కర్ణద్వయిన్ = రెండుకళ్లనూ, మించగా = అతిక్రమిస్తే, కొండల్ = కొండలను; త్రవ్విన = తవ్విపోసిన; మన్ను = మట్టి; కత్తుల గతిన్ = కత్తుల్లాగా; కొమ్ముంగొనల్= దంతాల చివళ్లను; ముంపన్ = ముంచగా; వేదండంబుల్ = ఏన్గులు, దండు+ఎత్తన్ = దాడిగా పోగా, భూపాళికిన్ = రాజుల సమూహానికి, చవుదంతులు = ఐరావతములు (నాల్గుదంతాలు కలది) ఔటన్= కావటం, తెలిపెన్ = స్పష్టంచేసాయి.

తా॥ మదజలం రెండు దవడలనుండి స్రవిస్తున్నది. ఆచారలకు ఏడాకుల అరటి తెల్లని రజస్సు అంటుకొని నేత్రాలదాకా వ్యాపించుటయే గాక కన్నుల జంటను దాటి పోయినది. ఈ చారలు రెండు దంతాల్లాగా కన్పిస్తున్నవి. దంతాగ్రభాగాలు కొండలను త్రవ్విన మన్నంటుకొన్నది కనుక ఏన్గులు నాల్గుదంతాలు కల ఐరావతాలై రాజులను దండెత్తమంటూ ప్రబోధిస్తున్నట్లుగా ఉన్నాయి. ఇరు ప్రక్కల అంటుకొన్న ఏడాకుల అరటి రజస్సు చెవుల కదలికతో వింజామరలుగా భ్రాంతికలిగిస్తున్నవి. మరి రెండు దంతాల కంటుకొన్న మన్ను కత్తుల జంటగా వుంది కనుక ఈ రెండు కత్తులు రెండు దంతాలు కలిసి చవుదంతులన్నట్లున్నవి.

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ ఇక్కడ దండెత్తే విషయంభంగ్యతరంగా ప్రస్తావితమై యామును జైత్రయాత్రను సూచిస్తున్నది. ఆ రోజుల్లో శరత్కాలం దండయాత్రలు చేసే సమయం. కనుక ఈ వర్ణన దానికి సూచన. యుద్ధగజాలంకరణం పద్యంలో కలిసిపోయింది. వింజామరలు కత్తులు దంతాలకు కట్టటం యుద్ధ సంరంభ సంబంధమైనది.

రచనా విశేషాలు : శైలీ సౌభాగ్యం భావించాలి. మొదటి పాదంలో గాంభీర్యం, చిక్కదనం; ''ండ'' ప్రాస ఏన్గు గాంభీర్యాన్ని ధ్వనించేవి. పై సీసంలో తెలుగు మాటలు ఎంత సరళములో సమాసాలంత చిక్కనివి.

తే॥ అప్పు డన్యోన్య విజిగీషులైన దొరల
కవ దొనల నుండి లబ్ధ లక్ష్యతబడసిన
స్వకులశరపాళిచేఁ గీర్తి చాలఁగనెనో
యనవనాళిఁ బ్రఫుల్లశ రాళి మెఱసె. 155

అప్పుడు = ఆ శరత్కాలంలో, అన్యోన్య = పరస్పరం; విజిగీషులు = జయించాలన్న కోరిక కలవారు ఐన; దొరల = రాజుల, కవదొనలనుండి = రెండమ్ముల పొదులనుండి; లబ్ధ = పొందిన; లక్ష్యతన్ = గమ్య లక్షణాన్ని; పడసిన = పొందిన; స్వకుల = తమ కులస్థులైన; శరపాళిచే = రెల్లుకాడల గుంపుతో; కీర్తిన్ = యశస్సును; చాలన్ = ఎక్కువ; కనెనో అనన్ = పొందినవో అన్నట్లు; వనాళిన్ = తోటల్లో; ప్రఫుల్ల = బాగా విచ్చిన; శర+ ఆళి = రెల్లు పొదల గుంపులు; మెఱసెన్ = వెలుగొందినవి.

తా॥ ఒకరినొకరు జయించాలన్న కోర్కెకల రాజులు అమ్ముల పొదుల జంటలో ఉన్న రెల్లు కాడలు చివళ్ల కల బాణాలు పోయి లక్ష్యాన్ని ఛేదించాయి (అంటే శత్రువులను చంపాయి) అవిచూచి రెల్లువనాలు గర్వించినట్లు తోటల్లో తెల్లని పూలతో మెరసి పోతున్నవి (తమకులపువారైన బాణాల కున్న రెల్లుకాడ లేకదా ఈ విజయానికి కారణమైనట్లు)

అలం : ఉత్ప్రేక్ష.

తే॥ దరుల తడవండు పొదువు మూఁపురములంటు
తెల్లు గంటల నాఁబో తులుల్లసిల్లె

గిరుల మోరుల నవి సముద్గీర్ణ సలిల
జలధర చ్ఛేదములు వ్రాల మెలఁగు కరణి. 156

దరులన్ = ఏటి ఒడ్లపై; తడివండు = వండుబురద; పొదువు = అంటు కొన్న; మూపురములు= మూపురాలు; అంటు = అంటిన; తెల్లగంటలన్ = రెల్లుపూల రెమ్మలతో; ఆబోతులు = ఆంబోతులు; గిరులమోరులసవిన్ = కొండశిఖరాలో అన్నట్లు; సముద్గీర్ణ = కురిసిన; సలిల = నీరుకల; జలధర = మబ్బుల; ఛేదములు = ముక్కలు; వ్రాలన్ = దిగగా; మెలగు కరణిన్ = తిరిగినట్లు; ఉల్లసిల్లెన్ = ప్రకాశించాయి.

తా ॥ ఏటి ఒడ్డపై వృషభరాజులు తిరుగాడుతున్నవి. వాటి మూపురాలకు తడి వండంటినది. దానికి రెల్లుపూలకాడలంటినవి. ఇదెలా వుందంటే - కొండ శిఖరాలపై మేఘశకలాలంటు కొన్నట్లున్నాయి.

అలం : ఉత్ప్రేక్ష

విశే॥ ఆంబోతులు కొండల్లాగా ఉన్నాయనీ తడివండు లేకపోతే రెల్లగంటలు అంటుకోవని - రెల్లుపూలుశరన్మేఘాల్లాగా ఉన్నాయని భావం.

తే॥ గగనలక్ష్మి నిజోరు నక్షత్రమాలి
కలు, వియన్నది జలముల (గడుగఁబిసుక
నెఱయు కుంకుడుఁబండుల నుఱువులనఁగఁ
బలపలని పాండురాంబుద పంక్తు లమరె. 157

గగనలక్ష్మి = ఆకాశమన్నస్త్రీ; నిజ = తన; ఉరు = పెద్ద; నక్షత్రమాలికలు = చుక్కల గుంపన్ననగలను; వియత్+నది = ఆకాశ గంగ; జలములన్ = నీళ్లలో; కడుగన్ = క్షాళించటం కోసం; పిసుకన్ = పిసికితే, నెఱయు = వ్యాపించే; కడిగే కుంకుడు పండువుల నురుగు లేమో నన్నట్లు; పలపలని = పలుచని; పాండుర= తెల్లని; అంబుద = మబ్బుల; (అంబు = నీరు, దః ఇచ్చేవి) పంక్తులు = గుంపులు; అమరెన్ = అమరినవి.

తా॥ తెల్లని పలుచనైన మబ్బులగుంపులు ఆకాశమన్నస్త్రీ తన నగలైన చుక్కలక సమూహాన్ని శుభ్రపరచుక కోవడానికి పిసికే కుంకుడు కాయల నురుగు దొబ్బల్లాగ ఉన్నాయి.

అలం : ఉత్ప్రేక్ష.

విశే ॥ (1) నక్షత్రమాల = ఇరవైయేడు ముత్యాలహారం; నక్షత్రాలు 27కనుక హారానికాపేరు వచ్చింది. బహుశా 27పేటలు కావచ్చు. లేక పోతే లక్ష్మి - సంపన్నురాలైన స్త్రీ శబ్దం వ్యర్థం. అలాగే ఉరు విశేషణమూ అనవసరమే.

(2) పలపలని = పలుచగా - దట్టంగా - అక్కడక్కడ - ఎడమెడముగా -నని అర్థం.

(3) కుంకుడు కాయలనురుగుతో నగలు తోము కోవటం నేటికీ వున్నది.

శా॥ అప్పుల్ వారిధి చేతఁబుచ్చి కొని, కార్యం బైన మున్గొన్న య
య్యప్పుల్ దౌ చనియు న్సవృద్ధి కముగా నవ్వార్ధికే తీర్పఁగా
నప్పుణ్యాతి విశుద్ధ జీవులు నిజాచ్ఛాంగంబులం దోఁచున
ట్లొప్పారెన్ శశి బింబ గర్భితములై ద్యోచారి శుభ్రాభ్రముల్ 158

ద్యోచారి = ఆకాశంలో సంచరించే; శుభ్ర = తెల్లని; అభ్రముల్ = మబ్బులు; శశిబింబ = చంద్రబింబ; గర్భితములై = కడుపుల్లోకలవై; ఒప్పారెన్ = సొగసు గానున్నవి; ( ఎందుకంటె ఆమబ్బులు వానకాలంలో) అప్పుల్ = ఋణం, నీళ్లు; వారిధిచేతన్ = నీటి కిల్లయిన సముద్రంనుండి ( నీరు) అప్పుగా పుచ్చుకొని (రత్నాకరమూ అదే కనుక డబ్బు అప్పుగా పుచ్చుకొని) ; కార్యంబు = పని; ఐన = తీరినంత; ఆ+అప్పుల్ = నీళ్లు - ఋణం; దౌ = చాలదూరం; (కాలం గడిచినాక వానకారు పోయి శరత్తుంగా) చని యున్ = పోయినా; సవృద్ధికంబుగాన్ = వడ్డీతో సహా; అవార్ధికే = ఆసముద్రానికే; తీర్పగాన్ = చెల్లించినందున; నిజ= తమ; అచ్ఛ = నిర్మలమైన అంగంబులందున్ = అవయవాలలో; ఆ+పుణ్య = ఆపుణ్యంచేత; అతి =మిక్కిలి, విశుద్ధ = పరిశుద్ధమైన; జీవులు = జీవాత్మస్వరూపులు; తోచునట్లు = కన్పించేటట్లు; ఒప్పారెన్ = ప్రకాశించాయి.

తా॥ సముద్రం నుండి మేఘాలు అప్పులు తీసికొని తమపని గడిచినాక తిరిగి వడ్డీతో సహాకాలంగడిచి పోయినా ( ఎగగొట్టక) తీర్చినారు గనుక వారుపుణ్యాజీవులైనారు. వారి అంగాలద్వారా అదే ప్రకాశిస్తున్నట్లు మబ్బుల్లో నుండి చంద్ర బింబం ప్రకాశిస్తున్నది.

అలం : శ్లేషసహిత ఉత్ప్రేక్ష.

విశే ॥ నాటి నత్త కాలపుమానవుల విశుద్ధజీవన విధానం వ్యక్త మౌతున్నది. అప్పుతీసి కొని ఎగ గొట్టటం పాపం. తీర్చటం పుణ్యం. ఆజీవులు పుణ్యులు. కనుక చంద్రబింబం లాగా ప్రకాశిస్తున్నారు. ఇదే కావ్యంలో బోధాంశం. రసానుభవంతో పాటు మనిషిని ధార్మిక మానవునిగా సమాజంలో పరిశుద్ధప్రవర్తన కలవానిగా చేయుటం కళాప్రయోజనం. ఆబోధ కావ్యభావన ద్వారా కల్గించటం కవిత్వం తప్ప ప్రత్యక్షంగా ప్రబోధించటం కాదు.

చం॥ విశద పయోదపుం బొరల వేష్టనచే నొకమ్మై నభోమణిన్
లశున పటంబు లొందుట మనంబున నారసి, కాంచి, విష్ణుఁడ
య్యశివతకై పదంబు వలయంబునఁబాపి, యవస్తు లోభ క
ర్కశత ఁ బ్రబోధ మొంది, సిరి గాంచి చెలంగెఁ బయః పయోనిధిన్. 159

విష్ణుడు = నారాయణుడు; నభోమణిన్ = సూర్యుడన్నపద్మరాగ మణిని; విశద = స్వచ్ఛమైన; పయోదపుంబొరల = మబ్బుపొరల, వేష్టనచేన్ = కప్పటం వల్ల; ఒకమ్మైన్ = ఒకప్రక్క; లశున పటంబులు = రత్నదోషాలు; పొందుట = కలగటం; మనంబునన్ = మనస్సులో; ఆరసి = చూచి; ఆ అశివతకై = ఆఅశుభాన్నిపోగొట్టు కొనటానికి; పదంబు = విష్ణుపాదమైన ఆకాశంలో; వల యంబునన్ = గావిసుడి (వానకాలంలో సూర్య - చంద్రుల చుట్టూ ఏర్పడే పరివేషం - వరదగుడి - గావిసుడి) అన్న అందెను;

పాసి = తీసి; అవస్తులోభ = వస్తువునందున్న లోభగుణం లేకపోవట మన్న; కర్కశతన్ = కాఠిన్యం త్యజించట మన్న; ప్రబోధంబు = తెలివి; (మేల్కొవటం) ఒంది = పొంది; సిరిన్ = లక్ష్మిని; కాంచి = పొంది, పయఃసమోనిధిన్ = పాలసముద్రంలో; చెలంగెన్ = సంతోషించినాడు.

తా॥ శరత్తురాగానే ఆకాశంలో సూర్యుని పరివేషరి పోయింది. అతనిపై తెల్లని పల్చని మబ్బులు అలము కొన్నాయి. విష్ణువునిద్ర లేచి సిరిని పొంది అత్తగారింట్లో హాయిగా వున్నాడు. దీనిపై కల్పిన - సూర్యుడన్న మణికి లశున పటలన్న దోషాలు కలిగాయి.

అది మనస్సులో గ్రహించాడు శ్రీహరి ( నిద్రలేవ కుండానే అని) తన ఆకాశపాదాని కున్న నభోమణి అన్న అందెలోని మణికి పట్టిన దోషం పోగొట్టుకోవడానికి వలయమన్న ( గిలిసుడి) అందెను పార వేసాడు అందువల్ల లపంగళ దోషరితొలగి పోగా మాంగల్యస్వరూపిణియైన లక్ష్మి లభించింది.

అలం : రూపకం.

పాలుపై బోయ గనుపడు డాలది లశునంబు, చిద్రుపలైన రీతిచే, బటలం బడి శోకకారణంబు- ( వాణీవిలాస వనమాలిక)

లశున, పటల, త్రాసభిన్న, కర్కశ, నీల, స్వరములు ఈ 'అ' రత్న దోషాలని రత్నశాస్త్రీ.

విశే॥ పూర్వవ్యాఖ్యానాల్లో లశనపటంబు అన్న దొకే దోషంగా చెప్పబడ్డది. కానీ అవి రెండు పాలుపైఁబోయ గనుపడు డా లది లశునము చిద్రుపలైన రీతిచేఁబటలంబు - (వాణీ విలాసవనమాలిక)

కనుక అవిరెండు దోషాలూ పాలు పోసిన రీతి; మబ్బుల పొరలు - పగిలినట్లు ఉండటం- మబ్బుల జీరలు. కనుకలశున పటంబు లొందుట అని చదవాలి. భావం మెలికలు తిరిగి ముప్పేటన పేనిన త్రాడులాగా ధృఢంగా కర్కశంగా వుంది. బరువైన భావన.

ఉ॥ అంబర వాసులగ్నిఁ గ్రియకై ద్యుమణి స్ఫటికోపలంబునం
దుం, బడ యన్ శరజ్జల ద తూలపరంపర గొంత పై ఘటిం
పం, బెలుచంజనించి, యొక పట్టున నిల్వక యా క్రమించె గాఁ
కం, బరి తాప మూన, నన గాసె మొ గిల్విరి యెండ లత్త టిన్. 160

అంబరవాసులు = ఆకాశవాసులైన దేవతలు; క్రియకై = యజ్ఞం కోసం; అగ్నిన్ = నిప్పును; ద్యుమణి= సూర్యుడన్న, స్ఫటికవలయంబునందున్ = స్ఫటికపు రాతిపై; పడ యన్ = పొందగా; శరత్+ జంద= శరన్మేఘమాల అన్న; తూలపరంపర = దూదిరాశిని; కొంత పైఘటింపన్ = కొంచెం పైన పెట్టగా( రాతిపై) పెలుచన్ = హఠాత్తుగా; జనించి = పుట్టి; ఒక మట్టునన్ = ఒక మేరలో; నిల్వక= ఆగక కాకన్ = వేడితో; పరితాపము = మిక్కిలి తాపము; ఊనన్ = పొందగా; ఆక్రమించెన్+ అనన్ = ఆక్రమించిందో అన్నట్లు; మొగిల్ విరి యెండలు = మబ్బు తీసిన ఎండలు; ఆతటిన్= ఆపమయంలో; కాసెన్ = కాసినవి.

తా॥ మొగిలి విరి యెండలు లోకానికి తాపం కల్గిస్తూ కాయటం ఎలా వుందంటే - దేవతలు యజ్ఞం కోసం అగ్ని కావాలని సూర్యుడన్న స్ఫటిక శిలమీద తెలి మబ్బులన్న దూది పింజలను పెట్టటం వల్ల హఠాత్తుగా అపరిమితమైన అగ్నిపుట్టి లోక కన్యాప్తమైనదో అన్నట్లున్నాయి.

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ సూర్యకాంత శిల ఎండకు మండుతుంది. చంద్రకాంతశిల వెన్నెల్లో ద్రవిస్తుంది. మొగిలువిరియెండ ఈ ప్రయోగం తొలిగా ఎర్రనగారి హరివంశంలోకన్పిస్తుంది. ''మొగుడు చచ్చినముండ మొగిలి తీసినయెండ'' అని సామెత.

కం॥ కంజ హితాస్తో దయముల
సంజ, కడల; నడుమఁ గప్పు; సంధిల, మిన్నొ
ప్పెం జూడఁ బ్రకృతి శబరీ
గుంజానాసావిభూష కొమరు భజింపన్. 161

కంజ = నీటి నుండి పుట్టినది - పద్మం; దానికి ప్రియుడైన సూర్యుని యొక్క, అస్త+ ఉదయములన్ = క్రుంకే - ఉదయించే వేళల్లో; మిన్ను = ఆకాశం; కడలన్ = చివళ్లపై; సంజ = సంధ్యాకాంతి; నడుమన్ = మధ్యలో, కప్పు = నలుపు, సంధిలన్ = కూడగా; చూడన్ = చూడగా; ప్రకృతి శబరీ = మూలిప్రకృతి యన్న యడవిజాతిస్త్రీ; గుంజా = గురివిందగింజ తోచేసిన; నాసావిభూష = ముక్కునగ; కొమరు = అందం, భజింపన్= స్థానరదువల్ల; ఒప్పెన్ = అందంగా ఉంది.

తా ॥ ప్రకృతి యేశబర కాంత (గిరిజన స్త్రీ), ఆమెముక్కునకు గురిగింజ ఆగింజకుచివళ్ల-నలుపుచుట్టూ - ఎరుపులాగా - ఆకాశాంచలాల్లో సంధ్యా కాంతి వ్యాపించి వుంది. మొదటి రెండు పాదాలు ఉప మేయం ప్రస్తుతాంశం. దాన్నిచూస్తే - భావిస్తే మనస్సులో పడిన బొమ్మ శబరి నాసావి భష- ఉపమానం.

అలం : ఉత్ప్రేక్ష. దానికి రూపకం ప్రాణం.

ప్రకృతి - ఈ విశ్వమంతా ఏ మూలశక్తి పరిణామ రూపమో ఆ ప్రధాన తత్త్వం మూలప్రకృతి. అదే - భగవచ్ఛక్తిగా - దేవిగా పురాణాలు వర్ణించాయి.

విశే॥ సంధ్యాకాలంలో ఆకాశం చివళ్ల అరుణకాంతిని, నడుమ నలుపునూ చూడటానికి నేత్రాలు చాలవు. ఆ అందమే పద్యమైనది.

పోల్చు.: 4-143. పద్యం నాసాభరణం. ఆకాశమేనికి గురివిందగింజ అయితే ఆమూలప్రకృతి త్రివిక్రమమూర్తి కావాలి.

తే॥ గూండ్ల కై శాలిమంజరుల్ గొనుచు మూఁగి
యంబరంబునఁ బఱచు కీరాళి వొలిచెఁ

బసరు టొంటొంటి యాకుతోఁ బండఁ బాఱి
ఛేద భయమున నెగసిన చేలనంగ. 162

శాలిమంజరుల్ = వరివెన్నులు; కొనుచున్ = ముక్కున కరచుకొంటూ; గూండ్లకై = గూండ్ల కోసం; మూగి = గుంపులుగానై; అంబరంబునన్- ఆకాశంలో; పఱచు = పరుగెత్తే, కీర+ ఆళులు= చిలుకల గుంపు; పసరు=పచ్చని; ఒండు బంతి యాకుతో = ఒకొక్క యాకుతో; పండబాఱి = బంగారువన్నె తిరిగి పక్వమై; ఛేదభయమునన్ = కోస్తారన్న భయంతో; ఎగసిన = పైకి ఎగిరే; చేలు+ అనన్ = పొలాలో అన్నట్లు; ఒప్పెన్ = అందంగా ఉన్నాయి.

తా॥ ముక్కున వరివెన్నులు కరచుకొని గుంపులుగా ఆకాశంలో పరుగెత్తే చిలుకలగుంపులు చాల అందంగా ఉన్నాయి. అవి పసరాకు లొకటి రెండుండి పండబారిన బంగారు రంగు చేలు తమను రేపో మాపో కోస్తారన్న భయంతో పైకెగిరి పోతున్న వన్నట్లుగా వున్నాయి.

అలం : ఉత్ప్రేక్ష (రెండవ సగంలో) మొదటి సగం - స్వభావోక్తి.

పసరు ఆకులు = చిలుకల రెక్కలు; వరివెన్నులు = చేలు.

విశే॥ శరీరం పులకించేటంత తెనుగు మాగాణి అందాలు కుప్పగా నైన పద్యమిది. ఇలాంటి వనేక పద్యాలు తెలుగు పల్లెటూళ్లు - పొలాలు = వాటి అందాలు వర్ణించిన చోట్లు కావ్యంలో అనేకం. వాటినన్నింటినీ ఒకచోట కుప్పగా పోసి చూచుకొంటే మనదేశ సౌందర్యమంతా మనస్సుల్లో ముద్రితమవుతుంది కవి దేశభక్తి ఇలాగే ఉంటుంది. ప్రాచీన కవి అంత దేశభక్తుడు. ఈ అందమంతా గాథాసప్తశతి జాతిది.

సీ॥ శ్రీలు దారొట నా శ్రిత పద్మ కర్ణికా
కృతిఁ జెవుల్కమల కర్ణికల మెఱయ,
నతనుసారథ్య కృద్రతిరేఖ మంచెపై
నదలించు రొదచిల్క పదుపుఁబఱవఁ;
దొగ మొగ్గలను వైవ దూరమేఁగమిఁ బెట్టు
చప్పట్ల జన్నులు జడలు గదల,
వెడత్రోవ మును చెప్పి; వడినవ్వ దిరుగున
ధ్వగు కొలందినె యపత్రపయు మరల
తే॥ గీ॥ నధర రదన ప్రసాదంబు నడుగనోరు
దెఱచె ననఁబండి వ్రీలి ముత్తెములు తోఁచు
చెఱకు, జంఘలఁ బోలమి శిరసు వాల్చు
రాజనము, cగాచుగోపి కారాజి వొలిచె. 163.

చెవుల్ చెవులు; కమలకర్ణికలన్ = తమ్మిపూ దిమ్మల అలంకారాలతో; శ్రీలు = లక్ష్ములు; తారు =

చెవులు, ఔటన్ = అయినందున ఆశ్రిత = ఆశ్రయించబడ్డ; పద్మ కర్ణిక = తామరపూల దుద్దుల; ఆకృతిన్ = రూపంతో; మెరయన్ = ఒప్పారగా.

తా॥ చెవులు తాము లక్ష్మీ స్వరూపిణులైనందున తామర పూల నడిమి దిమ్మల పీఠాలపై కొలువు దీరినట్లు చెవులు తామర దిమ్మల ఆకారాలతో శోభిస్తున్నవి. కాపు వనితలు తామరలతో చెవుల నలంకరించుకొన్నారు. అది ఈ విధంగా ఉత్ప్రేక్షితమయినది.

అతను = మదనునకు; సారథ్యకత = సారథ్యంచేసే; రతిరేఖన్ = రతీదేవిలాగ; మంచెపై = మంచెలపైనుండి; అదలించురొద = చెదర గొట్టటానికి చేసే ధ్వనులు; చిల్కపదుపున్= చిలుకల గుంపును, పదిపన్ = పారగొట్టగా.

తా॥ మదనుని వాహనం చిలుక. ఆ రథానికి సారథ్యం చేస్తున్నది రతి. కాపెతలు రతుల వలెనున్నారు. కనుకనే రొదలతో ముంచెలపై నుండి అదిలిస్తూ చిలుకలను పారగొడుతున్నారు వారు మన్మథుని రథసారథ్యం చేసే రతి వలె నున్నారు. మంచెరథం చిలుక గుఱ్ఱమన్నమాట. (వడిసెలపగ్గం - ఊహ్యం)

తొగమొగ్గలను = కల్వపూ మొగ్గలను; వైనన్ = విసరగా; దూరము = దూరంగా, ఏగమిన్= అవిపోనందున; షెట్టుచప్పట్లన్ = పెట్టే చప్పట్లతో; చన్నులున్ = స్తనాలును; జడలున్నూ, కదలన్ = చలించగా

తా॥ పిట్టలపై కల్వ మొగ్గలు - చెవులలో అలంకారంగా పెట్టు కొన్నది వేస్తే అవి దూరంగా పోనందున చన్నులు - జడలు కదలుతుండగా చప్పట్లు పెడుతున్నారు.

పెడత్రోవన్ = తప్పుదారి; మును చెప్పి = ముందు చెప్పి; వడినఖ = వారటుమ ళ్లినంతనే; నవ్వన్ = కాపెతలు నవ్వితే; తిరుగు = వెనుకకుతిరిగే; అధ్వగులకొలందినె = బాటసారి మరలి వెనుకకు రావటటంతో పాటుగా; అపత్రపయున్ = సిగ్గు, మఱలన్ = వెన్కకురాగా,

తా॥ దారినే బాట పారులు పోతూ దారి అడిగితే తప్పు దారి చెప్పి వారటు పోతుండగా నవ్వారు. ఆనవ్వు చూచి వారు వెనుకకు మరలినంతనే వారి వెడ సిగ్గు కూడ వెనుకకు వచ్చి తమను చేరింది. సిగ్గుపడ్డారని భావం. అపత్రప = ఇతరుల వల్ల కలిగే సిగ్గు.

అధర = పెదవి, రదన = పండ్లు, ప్రసాదంబు = ప్రసన్నత (దయ) అడుగన్ = అర్థించగా; నోరు; తెఱచెన్ = తెఱచెనో, అనగన్ = అన్నట్లు పండి = పకవమై, ప్రీలి = పగలి, ముత్తెములు = ముత్యాలు, తోచు = ప్రకాశించే; చెఱకు = చెఱకు (తోట); జంఘలన్ = పిక్కలను; పోలమిన్ = పోలికగా రాలేనందున, శిరసువాల్చు = తలలను సిగ్గులతో వ్రాల్చే, రాజసమున్=వరిచేలను, కాచు = కాపాడే, గోపికా రాజి = కాపుయువతుల సమూహం, పొలిచెన్= ఒప్పారినది.

తా॥ వరి పొలాలు పండి కంకుల బరువుతో పంగ టమెలా వుందంటే తమకు కాపుదలగా వున్న గోపికల పిక్కల అందాలకు సరిపోలనందున సిగ్గుపడుతున్నవో అన్నట్లున్నాయి. ప్రక్కనే ఉన్న చెఱ కు చేలు గడలు పగిలి ముత్యాలు వెలిగ్రక్కు తున్నవి. అవి యెలా వున్నాయంటే గోపికల పెదవి - పన్ను - కన్నులను అడగటానికి నోరు తెరిస్తే కన్పిస్తున్నట్లున్నవి.

అలం :1,2 పాదాలలో, ఎత్తు గీతిలో ఉత్ప్రేక్ష. 3-4 పాదాల్లో స్వభావోక్తి,1-65; 2-57,58,59 - ప్రస్తుత పద్యం ఈ జాతిస్త్రీల అందాలు - స్వభావసారళ్యం. అమాయకత్వమూ చిత్రించేవి.

తే॥ నింగి యత్త ఱిం దా మహానీలమైన
గరిమకుం,దగ బహుతృణ గ్రాహియయ్యె
ననఁగఁ, బరిణత కల మాది యవసరాశి
తతులు గిరులన నభ్రంక షతఁ జెలంగె 164

నింగి = ఆకాశం; అత్తఱిన్ = ఆసమయంలో (శరత్తులో) తాన్ = నింగి; మహానీలము = గొప్ప ఇంద్రనీలమణి; ఐన = ఐనట్టి; గరిమకున్ = విశాలమైన గొప్ప దనానికి; తగన్ = తగినట్లుగా, బహు = అనంత, తృణ గ్రాహి = గడ్డిని గ్రహించినది, అయ్యెన్ = అయినది; అనగన్ = అన్నట్లు; పరిణత = పండిన; కలమ = ఆ పేరు కలవరి; ఆది = మొదలయినవాని; యవసరాశిః గడ్డివాములు; తతులు = గుంపులు; గిరులు+అనన్ = కొండలో యన్నట్లు; అభ్రంకషతన్ = ఆకాశాన్ని ఒరుసు కొంటూ చెలంగెన్ = ఒప్పారినవి.

తా॥ శరత్తులో పొలాలు నూర్చి గడ్డి వాములువేసారు. అవి ఆకాశాన్ని తాకు తున్నాయి. ఆకాశం నీలం గా ప్రకాశిస్తున్నది. ఇది ప్రస్తుతాంశం. ఇదేలావుందంటే ఆకాశం విశాలమైన ఇంద్రనీలమణి గనుక అంతటి వైశాల్యానికి తగ్గట్లుగా తృ ఇరాశిని అకర్షించిందో అన్నట్లు గడ్డి వాములా కాశాన్ని విరుసుకొంటున్నవి. అలం : ఉత్ప్రేక్ష.

మ॥ అయనిష్ఠన్ ధవళాతపత్రి దగు నయ్యాగంబు సాగంగ, నం
దు, య మిశ్రేణులు రాఁగఁబుంగవకకుత్స్థుం డల్లవర్షాదినా
త్యయరాముండు సలక్ష్మణుండే నుస కోజోనాప్తిగా, విల్లు ని
ర్ద యతంద్రుంప బ్రభగ్న శాల్యవని సేతాలబ్ధి గా కుండునే. 165

ఈ పద్యం శరత్తును - రామాయణక థను శ్లేషాలంకారంలో వర్ణిస్తున్నది. కనుక రెండర్థాలు చెప్పుకోవాలి.

శరత్తుపక్షాన :- అతు = శుభకాలంలో, నిష్ఠన్ = నియమంగా; ధవళాతపత్రి, ది = తెల్లని తామరపూలే గొడుగులుగా కలది; అగు = అయిన; అయ్యాగంబు = (చూ 4-137) వాజపేయయాగం; సాగంగన్ = నెర వేరటం కోసం; అందున్ = ఆయాగానికి; యమి = హంసల, శ్రేణులు = గుంపులు; రాఁగన్ = రాగా; పుంగవకకుతస్థుండు = శ్రేష్ఠుడయిన మూపురం గల వృషభ రాజు (4-156) వర్షాదిన = వానకాల; అత్యయ = అంతం; రాముడు = శరదృతువన్న శ్రీరాముడునీలా కాశరూపంలో; స+లక్ష్మణుండు = తెల్లకొంగలతో పాటు; ఇనునకున్ = సూర్యునకు; ఓజః = కాంతి, అవాప్తి = లబ్ధి; కాన్ = కాగా, విల్లు = ఇంద్రచాపం, నిర్దయతన్ = అందమైన దన్న ఆలోచన - జావ, లేక; జద్రుంపన్ = విరిస్తే; ప్రభగ్న =

కోసిన, శాలి+ అవనిన్= వరిపొలాలలో; సీతాలబ్ధి = నాగేటిచాలు ఏర్పడటం; కాకుండునే = జరగకుండ ఉంటుందా?

**తా ॥** శుభముహూర్తంలో శ్రీహరి యోగ నిద్రనుండి లేచిన ఉత్థాన ఏకాదశి - కార్తీక ఏకాదశి తెలి తామరగొడుగులతో యజమానియై రాజులాగా వాజపేయయాగం చేస్తున్నాడు. దాని కాహూతులై అంచలు - వృషభాలు రాగా శరత్తు అన్న శ్రీరాముడూ, బెగ్గురు పక్షులన్న లక్ష్మణుని తోబాటు వచ్చి ఇంద్రచాపాన్ని (వానకాలం) త్రుంచితే సూర్యునకు ఎండలతీక్ష్ణత ఎక్కువ కాగా, వరి పొలాలు కోసి తిరిగి నా గేటి చాలు ఏర్పడింది

**రామాయణ పక్షాన :-**

ధవళ - ఆతపత్రి = తెల్లగొడుగు మహా రాజలక్షణంగనుక జనకమహారాజు; ఆ యాగంబు సాగనన్ = యాగంచేయటానికి నిశ్చయింపగా; యమిశ్రేణులు = విశ్వామిత్రాదిఋషులు, రాగా= రాగా; పుంగవ = శ్రేష్ఠుడైన; కకుత్+స్థుండు = కకుత్ =మూపురం; స్థుండు = కలవాడు; కాకుత్స్థ శ్రేష్ఠుడు = (శరత్తన్న) శ్రీరాముడు; సలక్ష్మణుండై = లక్ష్మణుని తో కూడుకొని; ఇనునకున్ = వంశకర్త సూర్యున కు; ఓజః = కీర్తి కాంతి; అనాప్తికాన్ = కలుగగా; విల్లు = శివునివిల్లు; సతాలబ్ధి= సీత దొరకటం.

**తా॥** జనకమహా రాజు చేసిన యజ్ఞానికి యములతో పాటు శ్రీరాముడు వచ్చి సీతను వివాహం చేసి కొన్న కథను అను సంధించు కోవాలి

అలం : శ్లేష.

ఇంత క్లిష్ట కల్పన చేయటానికి నాయకత్వస్ఫూర్తిని కల్గించటమే ప్రయోజనం. వర్షర్తువులో త్రివిక్రమ, వామనావతార వర్ణన ధ్వనించే 'తనిమం పచ్చ మెఱుంగు గోచియున్'- లాంటిదే - ఇదీన్నీ. పోల్చు కొని చదువు కోవాలి.

**భావభేదం కోసం :-** 162-163-164-165- భావ క్రమంభావించాలి. చేలు పండటం (162) వాటిని రక్షించటం (163) మార్చటం (169) తిరిగి దున్నటం 165.

కాలక్రమంలో జరిగే వ్యవసాయ విషయమే ఈ క్రమపరిణామ సౌందర్యం

కం॥ మొగిలు విరియెండ వెండి యు
నిగుడ, శుక శ్రేణి పసరు నింగి న్నిండన్
బెగడె ప్రజ, హరిత వాజుల
గగనమణిస్యందనంబు గవిసెనొ యనుచున్. **166**

మొగిలు = మబ్బు; విరి = విరిసినంత; ఎండ వేడిమి = ఆతప ఉష్ణత; నిగుడన్ = ఎక్కువ కాగా; ప్రజ = జనులు; బెగడన్ = భయ పడ్డారు. శుక శ్రేణి = చిలుకల గుంపు; పసరు = పచ్చదనం; నింగిన్ =

ఆకాశంలో; నిండన్ = నిండేసరికి; గగన మణి = సూర్యుని; హరిత = పచ్చని; వాజులు= గుఱ్ఱాలు; స్యందనంబు = రథం; కదిసెనొ = సమీపించిందా? అనుబున్ = అనుకొంటూ; బెగడెన్= భయపడ్డారు.

మొగిలు విరి యెండలు గగనంలో పరుగులెత్తే చిలుకల దండు విరివికాగా - ప్రజలు పచ్చని గుఱ్ఱాల సూర్యుని రథంభూమికి దగ్గరగా వచ్చింది కాబోలు నని భయపడ్డారు.

అలం : అతిశయోక్తి.

సూర్యాశ్వాలు పచ్చని పని కవులందరూ అన్నారు.

తే॥ భువి సరః కైరవ శ్రేణి పోవఁ దోల
దివి గనద్గ్రహనక్షత్ర దీప్తి దఱుమఁ
గృష్ణ పక్షపు వాసి లేకిరులు దన దు
నలుపు నను గూడె నన నై ల్య మొనసె నభము 167

భువిన్ = భూమిపై; సరః = చెరువుల్లోని; కైరవశ్రేణి, కల్వల గుంపు; పోవన్ = చెదరి పోగా; తోలన్ = అదిలిస్తే; దివిన్ = ఆకాశంలో; కనత్ = ప్రకాశించే; గ్రహ = నవగ్రహాల; నక్షత్ర = చుక్కల; దీప్తి = కాంతి; తఱుమన్ = వెంటబడి తరిమితే; ఇరులు = చీకట్లు, ఆకాశము యొక్క; నలుపునను = నల్ల దనంలో, కూడెన్ = కలిసిపోయింది; అనన్ = అన్నట్లుగా; నభము= ఆకాశం, నైల్యమున్ = నల్లదనం; ఒలసెన్ = పొందినది.

తా॥ ఆకాశం మహా నీలంగా ఉండటం చూస్తే - కృష్ణపక్షపు చీకట్లు లోకంలో లేకుండా పోయి ఆకాశంలో లీనమైనట్లున్నది. ఎలా పోయాయట చీకట్లు, అంటే - భూమి మీద తెల్ల కలువలు తరిమి కొడితే గగనం నుండి గ్రహనక్షత్ర కాంతులు పారదోలితే ఇరులకు నిలువనీడ లేక పోయి ఆకాశంలో కలిసి పోయినవి.

అలం : హేతూత్ప్రేక్ష.

కం॥ క్రేపుఁదలఁచి పసిమేయుచుఁ
జేపిన పాల్గ లయ నెండ చేఁబాంథజనుల్
దూ పింపమి కజుఁ డంపిన
యా పాగా యనఁగ నదుల నంచలు మెఱసెన్ 168

పసి = ఆలమంద; మేయుచున్ = మేస్తూ; క్రేపున్ = ఆలదూడలను; తలచి = మనస్సులో భావించి; చేపినపాలు = పాదుగు చేపి కార్చిన పాలు; కలయన్ = నీటిలో కలిసి పోగా; అజుడు = బ్రహ్మ; పాంథజనుల్= బాటసారులు; దూపింపమికిన్ = దప్పికచే బాధపడకుండా వుండటానికి; అంపిన= పంపిన; అపాగా = అశ్వశాల = గుర్రపుతబేలా, అనగన్ = అన్నట్లుగా; అంచలున్ = హంసలు; నదులన్ = నదులలో; మెరసెన్= ఒప్పారినవి.

తా ॥ నదీ తరంగాలపై హంసలు గుంపులై వుంటం ఉత్ప్రేక్షింపబడుతున్నది. ఏటి యొడ్లపై చక్కగా పట్టిన పచ్చిక మేస్తూ ఇండ్ల దగ్గరున్న దూడలను భావించుకొని ఆవులు పాలు స్రవించాయి. అవి నదుల్లో కలిసి పోయాయి. ఆ నీరు తాగితే రోగాలు వస్తాయి కనుక బాటసారులపై దయదలచిన బ్రహ్మ ఆ పాలు త్రాగటానికై తన గుఱ్ఱాల తబేలానంతా పంపించాడో అన్నట్లుగా అంచల గుంపులు కొలువుతీరినవి.

అలం : ఫలోత్ప్రేక్ష.

విశే॥ పాలు కలిసిన నీళ్లు ఆరోగ్యహాని కలిగిస్తాయన్న వైద్యశాస్త్ర మాధారంగా ఈ ఊహ కల్పితం. కవికీ శాస్త్రంతో పరిచయమున్నదనడానికి చూ. 4-230.

తే॥ వెద మొదవు కూడఁ బోలేని వెచ్చ(గ్రొవ్వు
స్వల్పమెడ చాఁప వెడలె నోయనఁగ, నెట్ట
కేలకును గ్రుంగి తెచ్చు ఱంకెలు నిగుడగ
మందగతి గున్కి వృషభము ల్మంద పిఱుఁద. 169

వృషభముల్ = ఎడ్లు; వెదమొదవున్ = వెద అయిన ఆవు వెనుక; కూడన్ = కవియటానికి; పోలేని = పోలేనందున; వెచ్చకున్ = వేడిమికి; క్రొవ్వు స్వల్పము = కొంచెం క్రొవ్వు, ఎడసూపన్ = సందు చూపగా (ఇది వానిళ్ల పాఠం కల్ప = కరిగించగా; మెడచాపన్ = మెడను దీర్ఘరించగా, వేదంవారి పాఠం) వెడలెనో = బహిర్గతమైనదా ఏమి ? అనగన్ = అన్నట్లు; ఎట్టకేలకున్ = తుట్టతుదకు అతికష్టం మీద; క్రుంగి = తలవాల్చి; తెచ్చుకొన్న; ఱంకెలు = ఎడ్ల అరుపులు, నిగుడన్ = వ్యాప్తంకాగా; మందగతిన్ = నెమ్మది నడకలతో; మంద పిఱుందన్ = ఆలమందల వెనక; గున్కెన్ = పరుగు కాని నడకలతో వెంటపడ్డవి. ('గునుకు పరుగనివ్యవహారం' Jogging.)

తా ॥ పద్యంలో ముసలి ఎడ్ల చేష్టలు సొగసుగా వర్ణింపబడుతున్నవి. ఆలమందల వెనుక గునుకు నడకలతో-దాని రంకెలతో అనుగమిస్తున్నవి. అదెలా వుందంటే - ఋతువులో ఉన్న ఆవును సంగమింపలేని బాధకలిగించిన పరితాపంతో - క్రొవ్వు కొంచెంగా ఎడమైనందున ఈ బాధ ఏర్పడింది. ప్రయత్నించి అతి కష్టంగా మెడవంచి రంకె వేస్తూ ఆలమందల వెంటపడ్డవి.

అలం : స్వభావోక్తి.

తే॥ శరధి జల మెల్లరిత్తగా గురియు, నుప్పు
డొక్కఁ బేరిన, నత్తెల్పు చిక్కి మీఁద
గాననగు చున్న దచ్చత చే నసంగ
బఱచు శరదభ్రముల మేని పాండువమరె. 170

పఱచు = పరుగెత్తే; శరత్ = శరత్కాల సంబంధమైన; అభ్రముల = మబ్బుల; మేని = శరీరం; పాండువు = తెలుపు, అమరెన్ = అందగించినది, శరధిజలము = సముద్రపునీరు; ఎల్లన్ = అంతా; రిత్తగాన్ =

వట్టిపోగా; కురియన్ = కురిస్తే; ఉప్పు = సముద్రములోని ఉప్పు; డొక్కన్ = (మబ్బుల) కడుపుల్లో; పేరినన్ = పేరుకోగా; ఆ+తెల్పు = ఆ ఉప్పు లావణ్యమే; చిక్కి = మిగిలి; మీదన్ = వర్షంకురిసాక; అచ్చుతచేన్ = తెల్పుచేత; కానన్ +అగుచున్నది = కన్పిస్తున్నది; అనగన్= అన్నట్లుగా;

తా॥ సముద్రం నీరంతా కురిసాక ఆనీటిలోని ఉప్పు మబ్బుల డొక్కలలో పేరుకోగా ఆతెలుపే కన్పిస్తున్నదో అన్నట్లు శరత్కాలమేఘాల తెల్లదనం ప్రకాశిస్తున్నది. (పోల్చువర్తర్తువు 86వ పద్యం)

అలం : హేతూత్ప్రేక్ష

కం॥ శరనిధి మును గ్రోలిన ని
ర్భరజలములు గురిసి మేఘభావం బఱి య
క్కరములు కరములెకా, జిగి
నొరిమె నవన్ర వి యు మెఱసె నుడిగెను మొయిలున్ 171

శరనిధిన్ = సముద్రంలో; మును = పూర్వం, క్రోలిన = త్రాగిన; నిర్భరజలములు = మిక్కిలి నీరు; కురిసి = వాన రూపంలో స్రవించి; మేఘ భావంబు = మేఘత్వం; అఱి = పోగా; ఆకరములు=ఆ సూర్యకిరణాలు; కరములె కాన్ =కిరణాలుగా నే మిగిలితే; రవియున్ = సూర్యుడు; జిగిన్ = కాంతిని; ఒరిమెన్ = తీక్ష్ణంగా పొంది నాడు; అనన్ = అన్నట్లు; మెఱసెన్ = ప్రకాశించినాడు; మొయిలున్ = మేఘము; ఉడిగెన్ = నశించినది.

తా ॥ సూర్య కిరణాలు వానకాలంలో మేఘాలై వానగా సముద్రంలో నీరంతా కురిసి కేవలం కిరణాలుగా మిగిలి పోయినందున అవి ఒరిపిడి పొందిన కాంతితో మెఱుస్తున్నాయి. మేఘాలు వెనుక బట్టినవి.

అలం : హేతూత్ప్రేక్ష

కం॥ ప్రాశించిన నీరంతయుఁ
బో, శరద భ్రములు మగుఁడ ం బూరింపఁగ నా
వే శించెఁ గొలంకుల ననఁ
గాశప్రతిబింబ పటలి కడు నొప్పారెన్. 172

ప్రాశించిన = త్రాగిన; నీరు, అంతయు, పోన్ = పోగా, మగుడన్ =తిరిగి; పూరింపగాన్ = నింపగా, కొలంకులన్ = సరస్సులలో; ఆవేశించెన్ = పై కొన్నవి; అనంగన్ = అనగా, కాశ = రెల్లు, ప్రతిబింబ= ఛాయారూపాల; పటలి = గుంపు, ఒప్పారెన్ = అందగించింది.

తా॥ సరస్సులలో ప్రతి బింబించిన రెల్లుగుంపులు శరత్కాల మేఘాలు వర్షాకాలంలో త్రాగిననీరంతా క్రుమ్మరించాయి గనుక తిరిగి త్రాగాలని సరస్సులను ఆవరించినట్లున్నాయి.

అలం : ఉత్ప్రేక్ష

విశే॥ రెల్లుపువ్వులు ప్రతిబింబించటం మేఘాలు ఆవహించినట్లు చెప్పబడటం చాలా సహజంగా ఉంది.

తే॥ కొలనఁ గరిదంపతులు పద్మకలిక లొకటి
కొకటి యీ నెత్త, మకరంద మొలుక, నమరె
నల శరత్పద్మనిలయకు నెలమి తోడ
గవల నభిషేకమున కెత్తు కడప లనఁగ 173

కొలనన్ = సరస్సులో; కరి దంపతులు = ఏనుగులజంట; పద్మకళికులు = తామర మొగ్గలను, ఒకటికిన్ ఒకటి = ఒక దానికి మరొకటి; ఈన్ = ఈయడానికి; ఎత్తన్ = ఎత్తగా, మకరందము= తేనె; ఒలుకన్ = కారగా; అల = ఆ; శరత్పద్మనిలయకున్ = శరత్కాలంలోని పద్మమే గృహమైన లక్ష్మికి; ఎలమి తోడన్ = సంతోషంతో; అభిషేకమునకున్ = అభిషేకించటానికి; ఎత్తు = ఎత్తే; కవల = జంట, కడపలు = కడవలు; అనంగన్ = అన్నట్లు; కనగన్ = ఆలోచిస్తే; అమరెన్ = ఒప్పాయి.

తా॥ సరస్సులలో గజదంపతులు ఒక దానికి మరొకటి తామర మొగ్గల నివ్వటానికై తొండంతో పైకెత్తాయి. ఆపూలనుండి మకరంద ధారలు స్రవిస్తున్నాయి. ఇది పద్మాలయయైనలక్ష్మీ దేవిని అభిషేకించటం కోసం ఎత్తిన జంట కడవలో అన్నట్లున్నాయి.

అలం : ఉత్ప్రేక్ష

విశే॥ గజలక్ష్మి బొమ్మలు చూస్తున్నాంకదా. అదే ఇది.

తే ॥ పంక మడుగంటి తేఱిన బావు లెల్లఁ
బంకములె చేసెఁ గ్రమ్మఱఁ బంకజములు
గళితమకరందయుతరజః కర్దమమునఁ
గారణగుణంబు గలుగదే కార్యములను. 174

పంకము = బురద, అడుగంటి = అడుగునకుదిగి; తేరిన = నిర్మలములైన; బావులు = నూతులు; ఎల్లన్ = అన్నింటిని; క్రమ్మరన్ = తిరిగి, పంకజములు = తామరలు; గళిత = ఓడుతున్న; మకరంద = తేనెతో; యుత = సమ్మిశ్రితమైన; రజః = పరాగమన్న; కర్దమమునన్ = బురదతో; పంకములె = బురదలే; చేసెన్ = చేసాయి; కార్యములను = ఫలితాల్లో; కారణగుణంబు = హేతులక్షణం; కలుగదె = కలుగుతుంది కదా !

తా॥ కారణ గుణం హేతులక్షణం. కార్యమునను సాధ్య మందు కలుగదే - ''బురద అడుగంటి బావులు స్వచ్ఛంగా తేరుకొన్నవి కాని విచ్చిన పద్మాలు ఓడుతున్న తేనెతో రజస్సు కలిసి పోయి మరల బురద ఏర్పడినీ ళ్లన్నీ బురద లైపోయాయి. ఇందులో కొత్తేమీలేదు. ఎందుకంటె కారణ గుణమేకదా కార్యంలో సంక్రమించేది.

అలం : అర్థాంతరన్యాసం

కం॥ ఒసగి రగస్త్యా ర్ఘ్యములం
గొసరి జను ల్వార్ధి నీరు గ్రో లితి వీవీ
సస్యకై మా కిమ్మని క
న్కిసరుడుగం గావ నప్పగించెడు కరణిన్ 175

జనులు = ప్రజలు, ఈవు = నీవు, వార్ధినీరు = సముద్రంనీరు, క్రోలితివి = త్రాగావు, ఈ నీరొ= ఈ కొంచెం నీరు; సస్యకై = పైరుల కోసం, మాకున్ ఇమ్ము, అని = అన్నట్లుగా; కన్+కిసరు = దృష్టిదోషం; ఉడుగన్ = పోగా, కావన్ = కాపాడ టానికై; అప్పగించెడు కరణిన్ = అర్పిస్తున్నట్లుగా, కొసరి = కోరి, అగస్త్య+అర్ఘ్యములన్ = అగస్త్యునకు అర్ఘ్యము; ఒసంగిరి = ఇచ్చారు.

అగస్త్యనక్షత్రోదయంగా గానే అర్ఘ్యమివ్వటం చూస్తే - నీవు సముద్రాన్నిత్రాగిన ఘనుడవు. ఈ కొంచెం నీరయినా మాపంటల కోసం మిగిలించమని ఆయనకు పోవటానికి సమర్పిస్తున్నట్లుగా ఉంది.

అలం : ఫలోత్ప్రేక్ష.

విశే ॥ అగస్త్యునకు అర్ఘ్యమివ్వటం పురాణ ప్రసిద్ధం. దానికి ఫలం విష్ణులోక ప్రాప్తి. ( దీనికి సంబంధించిన శ్లోకాలను రాజమార్తాండం నుండి వేదం వ్యాఖ్య ఉదారించింది)

అగము = కొండను, స్త్య = స్తంభింపచేసినవాడు కనుక అగస్త్యుడు.

కం॥ పరుషాతపతప్తంబగు
ధరణీపాత్రమునఁ బడుట దళమయ్యెఁ జుమీ
పరిపక్వంబై, యనఁగా
శరదిందు జ్యోత్స్న రేల సాంద్రత ఁగాసెన్. 176

శరత్ = శరత్కా లంలో; ఇందుజ్యోత్స్న = చంద్రకాంతి; రేలన్ = రాత్రులందు, కాసెన్ = కాసినది, దానికి హేతువు - పరుష = తీక్ష్ణమైన; ఆతప = ఎండవల్ల; తప్తంబు = కాగిపోయిన; ధరణీపాత్రమునన్ = భూమి అన్నపాత్రలో; పడుటన్ = పడటంవల్ల; పరిపక్వంబై = బాగాకాలినదై ( అట్టులాగా) దళము = సాంద్రము; అయ్యెన్ +చుమీ = అయినదిసుమా.

తా॥ శరత్కాలంలో రాత్రులందు వెన్నెల కాంతులు ఇనుమడించి కాస్తున్నవి. దానికి కారణం - పగలు మొగిలు విరి యెండల వల్ల భూమి యన్న పెనం బాగానే వేడెక్కింది దాని మీద పడ్డ పిండివంటి వెన్నెల బాగా కాలి దట్టమైనట్లున్నది

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ చూ. 2-60లో వెన్నెల వేసవిది. 5-138 లో వసంతంలో వెన్నెల

ఇది అన్నిఋతువులలో నూ ఉన్నదే. మనిషి అనుభవించటం శీతోష్ణపరిస్థితుల ప్రాబల్యం వల్ల తేడాలు వస్తున్నాయి. చూడగలవాడి కంతా అందమే.

తే॥ వృష్టితతిఁ నిడ్డ జెనఁ ద్రావఁ గ్రింద నుండి
తేట నదినీటఁ దన వెంట దేలుమీల
తళుకుతో నాచులత దోఁచె వెలికి జమిలి
వెండి మీ లెక్కు వెంద్రుక విల్లువోలె. 177

నాచులత = నాచుతీగ; వృష్టి తతిన్ = వానకాలంలో; ఇడ్డ = పెట్టిన; జెనన్ = గ్రుడ్లను; త్రావన్ = చేపలే త్రాగితే; క్రింది నుండి = అడుగు నుండి; తేరు = నిర్మలమైన; నదినీటన్ = ఏటినీటిలో; తన వెంటన్ = నా చులతతోబాటు; తేలు = ఈ దులాడే; మీలన్ = చేపల; తళుకుతోన్ = ధాళ ధళ్యముతో; వెలికిన్ = బయటకు, తోచెన్, వెండిమీలు = వెండి చేపలు; ఎక్కు= ఎక్కుతున్న; వెంద్రుకవిల్లు = వెంద్రుకలతో చేసిన విల్లు, పోలెన్ = వలె; తోచెన్ = అనిపించినది.

తా॥ వర్షాకాలంలో చేపలు గ్రుడ్లు నాచుతీగల గుంపులో పెట్టి శరత్కాలంలో భక్షిస్తాయి. అలా ఆజెనను త్రాగడానికి నాచుతీగల గుంపులో తేలు తూవున్నవి. ఆనది నీరు స్వచ్ఛంగా ఉంది. కనుక అడుగున చేపల భ్రమణం తళుకుకన్పిస్తున్నది. ఆతీగల వెంట ఆ తెల్లని మీలు తిరగటం వెంద్రుకవిల్లు ఎక్కుతున్న వెండిమీలు లాగ ఉంది.

అలం : ఉత్ప్రేక్ష

విశే॥ జమిడిక = అనేవాద్యం వెంట్రుకతో చేయబడుతుంది. దానికి వెండి చేపలుంటాయి. దానిని వాయిస్తుంటే ఆ చేపలు క్రిందికి మీదికి కదులుతుంటాయి. నాచులత వెంట తిరిగే చేపలు - స్వచ్ఛజలం వాల అందమైన దృశ్యం. పోలిక చాలా నవీనం.

కం॥ హంసము క్రౌంచము తొలి రా,
మాంసలరుచి వచ్చెఁ దాను మలయము శిఖఁ; బాల్
హంసవిఱువ; నీర్విఱిచెను,
హంసమున కగస్తి పరమహంసం బగుటన్. 178

క్రౌంచము తొలిన్ = ఆ పర్వతం రంధ్రం ద్వారా; హంసము = అంచ; రాన్ = రాగా, పరమహంసము = పరమహంస శ్రేష్ఠుడు; తాను అగస్తి = అగస్త్యుడు, మలయము శిఖన్ = మలయ పర్వతశిఖరము నుండి, హంస (పాల్ విరువన్ = పాలను వేరుచేసే శక్తి), పరమహంసంబు= మహాముని; అగుటన్= అయినందున; అగస్తి = అగస్త్యుడు; నీర్ = నీటిని; విఱిచెన్ = స్వచ్ఛంగా చేసింది.

తా॥ శరత్కాలం రాగానే భువికి హంసలు వచ్చాయి. దివిపై అగస్త్య నక్షత్రోదయమయింది. ఒకటి పాలు వేరు చేస్తే రెండోది పరమహంస కావడం వల్ల నీటిని విరిచింది. (బురద నుండి వేరుచేసింది)

తే॥ క్రౌంచ మొక కొన్ని గ్రుడ్లులు గాంచె మింట
నవి యహంసచ్ఛదాచ్ఛాదనానుభూతి

హంస తతులయ్యెఁ; గా దన్న నరుణచూడ
గుప్త భుజగాశనాండము ల్గుఱులు గావె. 179

క్రౌంచము = ఆ పర్వతము, ఒక కొన్ని = నుడికారం కొన్ని అనడానికి; గ్రుడ్డులు; మింటన్ = ఆకాశంలో; కాంచెన్ = పెట్టింది, అవి; అహంస = హంసలు కాని ఇతర పక్షులు; ఛద = రెక్కలతో; ఆచ్ఛాదన్ = కప్పటమన్న; అనుభూతిన్ = = అనుభూతివల్ల; అవి; హంసతతులు = హంసల సమూహం, అయ్యె = అయినవి; కాదు+ అన్నన్ = కాదంటే; తామ్రచూడ = ఎర్రని సిగ గల కోడి; గుప్త = పొదిగిన; భుజగ+ అశన = పాములే ఆహారంగా గలవి నెమళ్ల అండముల్ = గ్రుడ్లు, గుఱుతు = చిహ్నం; కాదె = కాదా.

తా॥ క్రౌంచబిలం నుండి వస్తూ పోతూ ఉన్న అంచలు కొన్ని గ్రుడ్లు పెట్టాయి. వాటిని ఇతర పక్షులేవో పొదిగితే హంసలైనాయి. ఇదేలా కుదురుతుందంటే - నెమలి గ్రుడ్లను కోడి పొదిగితే నెమలి కావటం లేదా ?

అలం : అర్థాంతరన్యాసం.

విశే॥ నెమలిగ్రుడ్లు కాంచినవి. అనటానికి క్రౌంచమే కర్తగా చెప్పబడటం లక్ష్యార్థ విశేషం. ఆకాశం నిండా గొడుగులే; పందిట్లో వేయి విస్తరులు అన్నచోట్ల గొడుగులు - విస్తళ్లు అంటే వేసుకొన్న- తిన్న మనుష్యులను చెప్పకుండా ఇలా అనటం లక్ష్యార్థ విశేషాలుగా చూచుకోవాలి.

చం॥ కలయఁగ వార్ధి దేవతలు గాంచుసరోవరదంభదర్పణం
బులపయి దట్టపుంజిలుము వోవఁగఁ దా రల కంచు గీయఁగా
బలె నలువంకలం గలయఁ బాయక తేలుచు బద్మరేణువు
ల్కెలఁకులఁబాసి పోఁజెలఁగెఁ గ్రేంకృతు లిచ్చు మరాళమాలికల్. 180

వారిదేవతలు = జలదేవతలు; కాంచు = చూచుకొనే, సరోవర = చెరువుల, దంభ = మిషగాకల; దర్పణంబులుపైన్ = అద్దాలపై; కలయన్ = అంతటా, దట్టపుంజిలుము = దట్టంగా పట్టిన కిలుము; పోవఁగన్ = పోగా; తాము = జలదేవతలు, కంచు గీయగా బలెన్ = కంచుటద్దాలను గీస్తున్నట్లు; (వాడి మొనలుగల వస్తువులతో రాయటం); నలువంకలన్ = నాలుగు దిక్కులా; కలయన్ = అంతటా; తేలుతున్ = తేలుతూ, పాయగన్ = పోవటానికై పద్మరేణువులన్ = తామరల పుప్పొడులు; కెలఁకులన్ = ప్రక్కలకు, పాసిపోన్ = చెదరిపోగా; మరాళమాలికల్ = హంసలగుంపులు; చెలఁగి = చెలరేగి; క్రేంకృతుల్ = క్రేంకారాలు; ఇచ్చెన్ = ఇచ్చినవి.

తా॥ జలదేవతలు రోజూ తాము చూచుకొనే చెరువులన్న (మిషగా ఉన్న) అద్దాలను కిలుముపోగొట్టుకోవడానికై గీస్తున్నట్లుగా హంసల గుంపులు క్రేంకారాలు చేస్తున్నవి. గాలికి ఎగిరే తామరలపుప్పొడి చెదరి నీళ్ల అంతటా కిలుములాగా తేలుతున్నది.

హంసల క్రేంకారాలు కంచు గీస్తున్న మ్రోతలు కాగా పుప్పొళ్లు చిలుము రేణువులుగా చెరువులన్న అద్దాలపై ప్రక్కలకు చెదరిపోతున్నది. చెరువులు స్వచ్ఛజలాలతో అద్దాల లాగ ఉన్నవి.

అలం : సరోవర దంభదర్పణములు = కైతవాపహ్నవం. ఇతరత్రా ఉత్ప్రేక్ష.

విశే ॥ స్వచ్ఛజలాలున్న చెరువులు అద్దాలు

సీ॥ అర్కమండలి కభ్ర మడ్డ మైనంతనె,
యెరమాని మోము బిట్టెత్తి చూచి;
ఘుమఘుమధ్వని గాలి గుహఁ జొరఁ, బురి యొకిం
చుక విచ్చి కని తలంచుకొని వంచి;
నిష్పుష్ప కేతకి నేత్రాంబు వొత్తి, భే
కపుఁదెంకి, పడియచోఁ గర్ణ మొగ్గి,
కేకకుఁ ద్ర్యవనత గ్రీవమై రాక యొ
క్కిం తార్చి, వాత నేమేమొ కమిచి;

తే॥ వెడలు బీఱెండకును శరద్వృత్త ముడిగి
వార్షికమె యెక్కి, త్రోటి నిర్వంకఁ బక్ష
తులను నివురుచు, వెఱ్ఱిచూపుల నురంబు
కెలఁకులఁ గనుంగొనుచుఁ గాన గేకులుండె. 181

కానన్ = అడవిలో; కేకులు = నెమళ్లు; అర్కమండలికిన్ = సూర్యమండలానికి; అభ్రము = మబ్బు; అడ్డము = ఆవరణ; అయినంతనె = కాగానే; ఎఱ = ఆహారము; మాని = వదలి; మోము = ముఖం; బిట్టు = మిక్కిలిగా; ఎత్తి = పైకెత్తి, చూచి.

తా॥ సూర్యబింబానికి మబ్బు అడ్డం రాగానే నెమలి ముఖం పైకెత్తి చూస్తున్నది వానకాలం వచ్చిందేమోననే ఆశతో -

గాలి; ఘుమ ఘుమ ధ్వనిన్ = ఘుమ ఘుమ మను ధ్వనితో; గుహన్ = గుహలోనికి; చొరన్ = ప్రవేశిస్తే; ప్రవేశిస్తే; పురి = పింఛం; ఒక+ఇంచుక = ఒక కొంచెం (నుడికారం) ఎత్తి = తిప్పి; కని = చూచి; తలంచుకొని= ఆలోచించుకొని; వంచి = వాల్చి.

తా॥ గాలి గుహలోన్నికి ప్రవేశిస్తూ చేసే ధ్వనిని విని ఉరుమని భ్రమపడి పురికొంచెం విప్పి చూచి ఉరుముకాదని మరలా పురిని వాల్చి.

నిష్పుష్ప = పూలులేని; కేతకిన్ = మొగలిపొదకు; టెంకి=ఉండేచోటు; పడియచోన్=నీటి దొరువువైపు; కర్ణము = చెవి; ఒగ్గి = ఓరగా పెట్టి

తా॥ పూలు లేని మొగలి పొదకు కన్నీటిని రుద్దుకొంటు కప్పలుండే నీటి దొరువు వైపు చెవిపెట్టి- మొగలి - కప్ప వానలో సంతోషించేవి కనుక వాటిని చూస్తున్నవి నెమళ్లు. కన్నీటిని ఒత్తటం - చెవి యొగ్గటం చాలా గొప్పగా నెమలి దైన్యాన్ని చిత్రిస్తున్న క్రియలు.

కేకకున్ = కేకాధ్వనికి; త్రి+అవనత = మూడుభంగులుగా వంచిన, గ్రీవమై = కంఠము కలదై; రాక = రానందున; ఒక్క ఇంత = కొంచెం; అర్చి = ధ్వనించి; వాతన్ = నోటితో; ఏమేమొ = ఏదేదో; కమిచి= తిని

తా॥ క్రేంకారం చేయటానికై మూడువంపులుగా గొంతు వంచి కొంచెం అరచి ఏమేమొ తిని వెడలు = వెళ్లే; బీరు+ఎండకున్ = మిడి ఎండకు; శరత్+వృక్షము = ఏడాకుల అరటిని, ఈగి = వదలి; వార్షికమె ఎక్కి = వర్షాకాలంలో పెరిగే గుమ్మడి చెట్టు పైకెక్కి; త్రోటిన్= ముక్కుతో; ఇరువంకన్ = రెండువైపుల పక్షతులన్ = రెక్కలను; నిమురుచున్ = నిమురుతూ; వెఱ్ఱిచూపులన్ = పిచ్చిచూపులతో; ఉరంబున్ = వక్షము; కెలంకులన్ = పార్శ్వాలను; నిమురుచున్= నిమురుకొంటూ; కనుంగొనుచున్ = చూస్తూ; కానలో కేకులున్నాయి.

తా॥ మధ్యాహ్నపు మిడిసిపా టెండలకు ఏడాకుల అరటికి నీడ వుండదు. కనుక పదలి గుమ్మడిచెట్టుపైకెక్కి (వానవస్తే పుష్పించేది కనుక - స్నేహంతో) ముక్కుతో రెక్కలను నిమురుకొంటూ తలవాల్చి రొమ్ము చూచుకొంటూ ప్రక్కలకు చూస్తూ దీనంగా గడుపుతున్నవి.

విశే ॥ ఒక దీనకేకి చిత్రణ అద్భుతంగా వుంది.

అలం : స్వభావోక్తి.

కం॥ వెలుతు రసలంటి యెండియు
లలి విప్పమిఁ, జెడక, శిఖికలాపము వని వ
ర్తిలెఁ బర్జన్యుఁడు నటన
మ్ములమెచ్చి మెఱుంగుఁగాసె ముద్రించె ననన్. 182

వనిన్ = అడవిలో, శిఖి = పింఛం కలది నెమలి, కలాపము = పింఛం; అసలు = బురద (వానకాలంలో అంటుకొన్నది శరత్తురాగానే) వెలుతురు = మొగిలు విరియెండ; అంటి = తాకి (బురదను); ఎండియున్ = ఎండిపోయి, లలిన్ = సంతోషంతో; విప్పమిన్ = (బిగుసుకొని పోయిన ఆ పింఛాన్ని) విప్పనందున, చెడకి = చెడిపోక (అందం) ఉండటం, పర్జన్యుడు = వర్షదేవత ఇంద్రుడు; నటనమ్ములన్ = దాని నాట్యానికి; మెచ్చి = ఆనందించి, మెఱుంగు = ప్రకాశించే; కాసెన్ = కాసెకొంగును, ముద్రించెన్ = రాజముద్రవేసినాడో అనన్ = అన్నట్లు; వర్తిలెన్ = ఉన్నది.

తా॥ అడవుల్లో నెమళ్లు పురివిప్పి ఆడకపోవటం ఉత్ప్రేక్షింపబడుతున్నది. వానకాలంలో పురికి బురద అంటుకొని శరత్తులో ఎండలకు బిగుసుకుపోయింది. ఇదెలా వున్నదంటే, - వర్షదేవత నెమలి నటనకు మెచ్చి జరీయంచుగల కాసెకోకను రాజముద్ర వైచిన్నట్లున్నది. ముద్రను లక్కపై ఒత్తుతారు గనుక లక్క బురద. అది కరగాలంటె నిప్పుండాలి. అదే వెలుతురు.

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ ముద్ర వేసింది చెడకుండా ఉంటుంది కనుక నెమలి సౌందర్యం భద్రంగా వుండటానికో అన్నట్లు పర్జన్యుడిలా చేసాడు (చూ. 2-4-7.)

సీ॥ చక్రస్తవ ప్రకాశమునకు ఫేనంపుఁ
గొంగిడి గొన గొనఁ గోళ్ల గొణఁగి
యశ్మనితంబంబు హంసహారమును, బ
రాగ రేఖా స్వర్ణ రశనముగను
జలశాటి పులినంపు జఘనంబు పై జాఱ
వ్యస్తవేత స భుజస్వస్తిక మిడి
తనిమతో వెచ్చనై తటశర ప్రతిబింబ
హాసాళిబాష్పలుచ్ఛ్వాసములకు.

తే. గీ॥ నగుచుఁ జెందొవ కంటను నలిగి, తమ్మ
లంటు కైయెత్తు పదనతి నలరి, కువల
మధులహరి నబ్ధిఁజెంది పై మగతనముల
నొక్కడలఁ గూడుచు స్రవంతు లుబ్బి పెనఁచె. 183

స్రవంతులు = నదులు, చక్రస్తన = చక్రవాకములట్టి చన్నుగల; ప్రకాశమునకున్= ప్రకటనకు; ఫేనంపుఁగొంగున్ = నురుగన్న పైటకొంగును; ఇడి = వేసుకొని, గొనగొనన్ = గునగునమంటూ అని వ్యవహారం (చెవిలో రహస్యంగా చెప్పటం) కోళ్లన్= నీటికోళ్ల (అరుపులతో) గొణగి = అస్పష్టంగా పలికి.

తా॥ నదీకాంతకు చక్రవాకపక్షులే స్తనాలు. ఫేనమే చీరకొంగు. నీటికోళ్లే గొంతు; ఆస్తనావరణకు నురుగు కొంగును కప్పుకొని నీటికోళ్ల గొంతుతో ఏవో అస్పష్టంగా అంటున్నవి.

అశ్మనితంబంబు - రాళ్లే కటిచక్రం; హంసహారమును = హంసలే ముత్యాలదండ, పరాగరేఖ= పుప్పొడి చాలు; స్వర్ణ = బంగారు; రశన = మొలత్రాడు; కాన్ = కాగా

తా॥ నీళ్లు లీసినందున బైటపడ్డ పెద్దపెద్ద రాళ్లే నితంబాలుగా; హంసలే హారాలుగా; పుప్పొడిచాలే బంగారు మొలత్రాడు కాగా (నాడు స్త్రీలకు మొలత్రాళ్లు ఉండటం శిల్పాల్లోనూ కన్పిస్తుంది.) నేడు కూడా ఒడ్డాణం స్థానంలో జరీపటికా కట్టుకొంటూనే ఉన్నారు.

జలశాటి - నీరన్న చీర; పులినంపు = ఇసుక తిన్నె అన్న; జఘనంబు = నితంబ ప్రదేశం, పైన్ = మీద; జాఱన్ = జారిపోగా, వ్యస్త = అడ్డదిడ్డంగా ఉన్న; వేతస = నీటి ప్రబ్బలి అన్న; భుజ = చేతులతో; స్వస్తికము = స్వస్తిక బంధము; ఇడి = వేసి.

తా॥ పులినతల మన్న జఘనం నుండి నీరన్న చీర క్రమంగా జారుతున్నది. నీరు తగ్గుతూ ఇసుక తిన్నెలు బైటపడుతున్నవి. (వాల్మీకి మహర్షికూడ శరద్వర్ణనలలో ఇలా అన్నాడు.

శ్లో॥ ''అహో రాగవతీ సంధ్యా జహాతి స్వయమంబరం''

ఎర్రని - ప్రణయవతియైన సంధ్యాంగన - స్వయంగా ఆకాశాన్ని వదులుతున్నది. ప్రణయవతి తానై చీరను తొలగిస్తున్నది.) అలా బయట పడుతుంటే చేతులతో స్వస్తికబంధాన్ని వేసి

తనిమతోన్ = కోర్కెతో; వెచ్చనై = విరహంతో కాగిపోయి; (ఆ నీరు పలచబడటంతో నదికాగి పోతున్నది). తట = ఒడ్డుపైనున్న; శర = రెల్లుయొక్క; ప్రతిబంబ = ప్రతిఫలనమన్న, హాస = నవ్వులతో, అళి = తుమ్మెదలే, బాష్పలు = కన్నీరు కలవి, ఉచ్ఛ్వాసములకున్ = కలుజులన్న నిట్టూర్పులకు, అగుచున్ = ఔతూ;

తా॥ నీరు పలచనైనందున వెచ్చ నౌతూ విరహంతో వేగిపోతే ఒడ్లపై విచ్చిన రెల్లుపూలే నవ్వులుగా, అళులే కన్నీటిబొట్లుగా నీరు పోయే తూములే నిట్టూర్పులు కాగా

చెన్ను+తొవ = ఎర్రని కలువపూవు; కంటన్ = కంటితో; అలిగి = కోపించి (కోపం వస్తే కళ్లెర్రనౌతున్నవి. కనుక నదీకాంతకు చెందొవలే కోపంతో ఎరుపెక్కిన నేత్రాలు).

తమ్ములు = తామరలు, అంటు = తాకే; కై = సముద్రపు పోటు అన్నచేతితో ఒత్తు = పిసికే; పదనతిన్ = పాదాలపై పడటంతో; అలరి = సంతోషించి;

తా॥ నదీకాంత కోపం పోవడానికి భర్త సముద్రుడు అలలన్న చేతులతో తామరలన్న పాదాలను తాకుతూ, ఒత్తుతూ పాదాలపై పడ్డాడు. ఆమెకు కోపం పోయింది.

కువల = కలువపూల; మధులహరిన్ = తేనెవాకతో; అబ్ధిన్ = సముద్రము, చెంది = పొంది; పై = మీద; మగతనములన్ = పురుషాయితరతి(తో; ఒక్క+ఎడలన్ = కొన్నిచోట్ల; కూడుచున్ = సంగిమిస్తూ; ఉబ్బు = అతిశయమన్న పొంగును; పెనిచెన్ = పెంపు చేసినని.

విశే॥ నదులు కృశిస్తున్నవి. కాని కొన్ని కొన్ని స్థలాలలో లేని ఓపిక తెచ్చుకొని సముద్రునిపైకి వ్యాపిస్తున్నవి. ఇదే పురుషాయిత క్రీడగా విశేషాలతో అద్భుతంగా వర్ణిస్తున్నాడు. ఇది లోకోత్తరమైన భావన.

చక్రవాకస్తనాలు ప్రకాశిస్తున్నవి. ఫేనపు కొంగుతో కప్పుతూ పక్షికూతలన్న మణితధ్వనులతో అస్పష్టకూజితం చేస్తున్నది ఇది మొదటి పాదం ఇక్కడ స్త్రీ, పురుషుని వక్షంపై వాలి యున్నదని విస్మరించరాదు. ఆ దృష్ట్యా అన్వయించాలి.

శాటి జారిపోవడంతో భర్తను కౌగిలించుకోవటమే స్వస్తికబంధం.

హాసం - బాష్పం - ఉచ్ఛ్వాసం. ఇవన్ని రతిస్థాయికి వ్యభిచారులు. ఆనందపారవశ్య సూచకాలు.

కువల మధులహరి - వీర్యశోణితములు కాయా పరిమళాలు చెప్పబడ్డవి కనుక ఇక్కడిలా చెప్పటం

చూ. 2-52లో కేవలం నీరు లేని వేసవిలోని విరహం. ఇక్కడ శరత్తు గనుక సంగం మూర్తిగా పోని స్థితి. 2-61లో సంయోగవర్ణన.

## యామున ప్రభుని దిగ్విజయము

వ. ఇట్లు శరత్సమయం బెసంగిన నంగీకృత క్షత్రధర్ముండు గావున దిగ్విజయ యాత్ర ధర్మంబని యానీతబలి షట్కంబుగా నా కృష్ట సామంత రాట్కంబుగా వెడలె. 184

శరత్ సమయంబు = శరత్కాలం, ఎసంగినన్ = విజృంభించగా; అంగీకృత = అంగీకరింప చేయబడ్డ; క్షత్రధర్ముండు = క్షత్రియధర్మం స్వభావంగా కలవాడు; కావునన్ = కాబట్టి, దిక్+విజయయాత్ర = దిక్కులను జయించటానికి చేసే యాత్ర; ధర్మంబు+అని = రాజధర్మమని; అనీత = కూర్చబడిన; బలషట్కంబుగాన్ = ఆరు బలాలు కలవాడై; ఆకృష్ట = కూర్చుకొన్న; సామంతరాట్ = సామంతులైన దొరలు కలవాడై వెడలి = దండువెడలి.

తా॥ శరత్తు దండయాత్రలకనువైన కాలం కనుక యామునాచార్యుడు రాజైనాడు కాబట్టి రాజధర్మంగా సామంతరాజుల నాజ్ఞాపించి కూర్చుకొని దండయాత్రకు బయలుదేరి. రాజధర్మం కనుక దండయాత్ర జయార్థం గాని అధికారం కోసం కానేకాదని అల్లెండరు ప్రపంచాధిపతి కావాలని భారతదేశాదులను జయించినట్లు కాదు. ఇక్కడ ధర్మపరిపాలన. అక్కడ వ్యక్తి ఇచ్ఛా మూలం.

### బలషట్కము

మూల = మూలబలం; ప్రధానబలం. రాజునకత్యంత విశ్వాసపాత్రమైనట్టిది.

భృత్య = రాజునకు ప్రీతిపాత్రులయిన సేవకులు.

సుహృత్ = స్నేహితులు-

శ్రేణి = గుంపు హద్దు ఆపూ లేనిది. దోచుకోవటానికి వచ్చేది. దీనికి విరుద్ధమైన సంహతిబలం. నాయకుడున్నది.

ద్విపద = అశ్వగజాది జంతువులకు సేవకులకు కావలసిన వైద్యులు.

ఆటవికులు = సేనలో ఇదొక భాగం. చూ. రాజనీతి 4-223-24-25-26.

మహాస్రగ్ధర :

గజఘోటస్యందనాళీకబళితధరణిం గాద్ర వేయాది రాణ్మా
ర్గజరత్నశ్రేణులంతర్మణుల సవతులై మ్రగ్గఁ బాదాతకుంత
ధ్వజవాతాఘాతఘూర్ణద్ద్వనధుల రవము ల్వాద్యముల్మీఱఁగాఁ ద
ద్ద్విజ రాజన్యుండు విద్విడ్విదళన మనిఁ గావించె దిగ్జైత్రయాత్రన్. 185

గజ = ఏనుగులు; ఘోట = అశ్వం; స్యందన = రథాలు; ఆళీ = సేనా సమూహంతో కబళిత = ఆక్రాంతమైన; ఆక్రమించిన, ధరణిన్ = భూమిపై; కాద్రవేయ = కద్రువ సంతానమైన పాములకు; అధిరాట్ = రాజైన

ఆదిశేషుని, మూర్ధజ = తలపై పుట్టిన; రత్నశ్రేణులు = రత్నరాసులు; అంత్యః లోపలి (భూమిలోని) మణుల = రత్నాలకు, సవతులై = స్పర్ధగలవై; మ్రగ్గన్ = చతికలపడగా, పదాతి = కాల్బలం; కుంత = ఈటెలకున్న; ధ్వజ = జెండా; వాత+ఆఘాత = గాలి దెబ్బలకు; ఘూర్ణత్ = సుడిపడుతున్న; వనధుల = సంద్రాల; రవముల్ = ధ్వనులూ; వాద్యముల్ = భేరీ-పటహాదియుద్ధ వాద్యాలు; మాఱగాన్ = అతిశయింపగా; తత్ = ఆ ద్విజరాజన్యుడు = రాజర్షి (ద్విజ = బ్రాహ్మణ, రాజన్యుడు = రాజశ్రేష్ఠుడు.) అనిన్ = యుద్ధంలో; జైత్రయాత్రన్= విజయయాత్రలో; విద్విట్ = శత్రువులను; విదళనము = చీల్చి చెండాడటం, కావించెన్ = చేసినాడు.

ప్రౌఢవృత్తం - యుద్ధోచితం.

విశే॥ రాయలవారీ పద్యంలోనే జైత్రయాత్రను సూచించారే తప్ప వర్ణించలేదు. వర్ణిస్తే. కవి బ్రహ్మకున్న పేరు వసివాడేది కారణం స్వయంగా జైత్రయాత్రలు సేనాగ్రంలో వుండినడిపిన అనుభవ సంపన్నుడు కావటమే.

వర్ణించకపోవటానికి కారణం - భారత మహాచక్రవర్తి యుద్ధవీరుడు కాడని చెప్పటమే. తాను చెప్పబోయే రాజధర్మ వక్తకు కావలసిన చిత్తభూమికకిది నిదర్శనం; సూచన. కాగా ఈ కథలో ధర్మవీరం రసం.

తా॥ ఆ రాజర్షి జైత్రయాత్రలో ఏనుగులు-రథాలు-గుఱ్ఱాలు, కాల్బలం నడిస్తే భూభారం వహిస్తున్న ఆదిశేషుని తలలు కృంగిపోయాయి. ఈ విషయాన్ని భంగ్యంతరంగా వర్ణించినాడు కవి. ఆదిశేషుని తలపైనున్న మణులు భూమిలోపలి మణులపై సాపత్న్యం వహించి మ్రగ్గతిలబడ్డవని - కాల్బలం ఈటెలకు కట్టిన జెండాల గాలి దెబ్బలకు సముద్రాలు సుడివడి ధ్వనిస్తే ఆ ధ్వనులను వాద్యాలధ్వనులు అతిశయించాయి. ఈ విధంగా చేసిన యుద్ధాలలో శత్రురాజులు పాదాక్రాంతులయినారు.

అలం : అతిశయోక్తి.

కం॥ జన్నములు చేసి, దానము
లన్నానాదేశ విప్రులం దనుపుచు సం
పన్నత ననిశము బహుభో
గోన్నతుడై, యాదమఱచి యుండె నశంకన్. 186

జన్నములు = యజ్ఞములు; చేసి; దానములన్ = జలపూర్వకంగా చేసే దానాలతో; నానా = అనేక; దేశ = దేశాలనుండి వచ్చిన; విప్రులన్ = బ్రాహ్మణులను; తనపుచున్ = సంతృప్తిపరుస్తూ; అనిశమున్= నిత్యమూ; సంపన్నతన్ = సంపదకలవాడై; అనేక భోగ = అనేక అనుభవాలతో; ఉన్నతుడై = అధికుడై; అనేక భోగ = అనేక అనుభవాలతో; ఉన్నతుడై = అధికుడై; ఆదమఱచి = నిర్భయంగా; అశంకన్ = శంక లేక; ఉండెన్= ఉన్నాడు.

విశే॥ మధురానగరరాజ వర్ణన 2-102 లో దానవిషయమున్నదే కాని జన్నములు లేవు. ఆ రాజు భౌతిక చక్రవర్తి తప్ప ఆధ్యాత్మిక చక్రవర్తి కాడు. ఇక్కడ రెండింటికి సమన్వయ మున్నది. ఇతడు రాజర్షి. రాబోయే రాజనీతిని ఇతడు చెప్పింది. అది రాజర్షి ధర్మం తప్ప నీతికాదు. రాజనీతి భౌతిక భద్రతాపాదకం. ఇందుకే భారతంలో భీష్ముడు - నారదుడు - ధర్మరాజునకీ బోధ చేసారు. అది రాజధర్మం తప్ప రాజనీతి కాదు.

రాబోయే రాజనీతిలో ఇది స్పష్టపడుతుంది. భోగోన్నతుడై - ఇది రాజువేషం కట్టిన వాని లక్షణమే. చూ. 3-64.

**వ॥ మఱియు నతని రాజ్యంబునఁ గసవుగు గఱచి చేయెత్తి మొఱవెట్టుట కరుల యంద; యట్లునిట్లువడ మెడఁబట్టి త్రోయుట వెడవెడం బోవు పల్లవులం బండువ తలంటులకు నింటికిం దెచ్చు పణ్యాంగనాభ్రాతల పరిహాస చేష్టలయంద; సున్నమెత్తుటయుంబట్టు కారులంబట్టుటయు సౌధ సౌవర్ణభూషాది నిర్మాణంబుల యంద; కాసెట్టుటయుఁ గత్తి దాల్చుటయుఁ గృకవాకుల కలహంబులయంద, యతుల్యతులనాదిఘర్షణాది దోషంబులు జాంబూనద పరీక్షాదుల యంద, యేదేనియుుంగన్నువేయుట మృదంగాదివాదిత్రంబుల యంద; ధాతువాదంబులు తఱచగుట శాబ్దికులయంద, కాక యితర స్థలంబుల లేకుండ రాజ్యపరిపాలనంబు చేయుచుండె.**

**187**

(1) కసవు = గడ్డి; కఱచి = తిని; చేయెత్తి = హస్తమెత్తి; మొఱవెట్టుట = ఆక్రందనం చేయటం; కరులయంద = ఏనుగుల విషయంలోనే.

తా॥ ఓడిపోయిన వారు నోట్లో గడ్డి పెట్టుకొని చేయెత్తి రక్షించమని మొరపెట్టటం ఏనుగుల విషయంలోనే తప్ప మానవులయందు కాదని. - ఏన్గుల చేష్ట సహజం.

(2) అట్లు+వడన్ = అటునిటుపడగా; వెడవెడబోవు = ఎడప తడప పోయేం; పల్లవులన్=విటులయందు; పణ్య+అంగన = వెలయాలు; భ్రాతల = సోదరుల; పరిహాస చేష్టలు= నవ్వులాటలు

తా॥ మెడపట్టి నెట్టటం విరోధంలో ఉన్నట్టిది. ఇక్కడ వేశ్యల భ్రాతలు విటులను మెడపట్టి పండుగరోజుల్లో తలంట్లకై త్రోసుకొని వస్తున్నారు. ఇక్కడ స్నేహంలో ఉంది.

(3) సున్నము+ఎత్తటయున్ = సున్నం మోయించటం ఒక రకమైన శిక్ష. పట్టుకార్లను బట్టుట= ఒక శిక్ష. సౌధ = మేడ; సౌవర్ణభూష = బంగార నగ; నిర్మాణంబులయందు = చేయటంలోనే;

తా॥ సున్నమెత్తటం మేడలు కట్టటంలోనూ; పట్టుకార్లతో పట్టుకోవటం నగలు చేయటంలోనే తప్ప ఆ శిక్షలు లేవు.

(4) కాసెకట్టుట = నడుముకు పటకాకట్టటం; కత్తి పట్టటం; కృకవాకు = కోళ్ళ, కలహంబులు = పందాలు.

తా॥ కత్తిపట్టి - కాసె కోక చుట్టి కలహించుకోవటం లేదు. కోడిపందాల్లో మాత్రమే అవి ఉన్నాయి.

(5) అతుల్యతులన+అది = సమానంగా లేని వానిని సమానంగా చేయటం లాంటిది; ఘర్షణ = ఒరిపిడి పెట్టటం; ఘర్షణపడటం; జాంబూనద = బంగారం.

తా॥ బంగారం పరీక్ష చేయటంలోనే ఘర్షణ. సరిపోయినంత బంగారం తూకంవేసి తీసికోవటం స్వర్ణకార వృత్తిలోనే మిగిలివున్నవి తప్ప ఇతరత్ర లేవు.

(6) కన్నువేయుట = ఆసక్తిగా చూడటం; మృదంగ+ఆది = మద్దెల మొదలైన; వాదిత్రంబులు= వాద్యాలు.

తా॥ ఇతర వస్తువుల నపహరించటానికి కన్నువేయటం లేదు గాని మద్దెల ప్రక్కలను సరిచేసుకోవటం వాయించటం మాత్రమున్నది. మద్దెలను వాయించే స్థానం పేరు కన్ను.

(7) ధాతువాదంబులు = శబ్దక్రియావాదముల మూలాలు; మోసాలు; శాబ్దికులు = వైయాకరణులు.

తా॥ ధాతువాదాలు (మోసాలు) లేవు. కాని వైయాకరణులయందున్నవి.

విశే॥ రాజ్యపాలన భద్రంగావుంది. ప్రజలు సుఖిస్తున్నారనటానికిది ప్రతీకా రూపవర్ణన. నెల మూడు వానలు కురవటం - దున్నకుండా పండింది వంటి మాటలు పెద్దనాదుల కావ్యాలలో కన్పిస్తాయి. అవీ ప్రతీకా వాక్యాలే.

మధురాచక్రవర్తి వర్ణనలో: పాటీరగిరివననాటి - పద్యంతో పోల్చు.

తే॥ తత్పితామహుండైన నాథముని శిష్యుఁ
డైన శ్రీపుండరీకాక్షు ననుఁగు శిష్యుఁ
డైన శ్రీరామమిశ్రాఖ్యుఁ డార్తిఁదనదు
పరమగురు పౌత్రునకు నిట్టి బంధమెట్లు ? **188**

తత్ = ఆ యామునాచార్యులకు; పితామహుడు తాత; ఐన = అయినట్టి; నాథముని శిష్యుడు ఐన శ్రీపుండరీకాక్షుని యొక్క అనుంగు = ప్రియమైన; శిష్యుడు ఐన శ్రీరామమిశ్రుడన్న ఆఖ్యుడు=పేరుగలవాడు; ఆర్తిన్ = దుఃఖంతో; తనదు = తనయొక్క; పరమగురు = గురువు గురువు పౌత్రుడు = మనుమడైన యామునాచార్యుడు; బంధము = రాజ్యపాలన.

తా॥ యామునాచార్యులకు తాతగారు నాథముని అతని శిష్యుడు పుండరీకాక్షుడు. ఆయనకు

శ్రీరామమిశ్రుడు శిష్యుడు. ఇతనికి యామునాచార్యుడు మతాచార్యుడు కాకుండా విష్ణుభక్తుడు కాకుండా ఇలాగయి పోయాడని బాధ.

విశే॥ మతాచార్యత్వం యోగసామ్రాజ్య పట్టం. భూలోక సామ్రాజ్యాధిపత్యం రెంటికీ స్పర్థ. రెంటికీ సమన్వయం భారతీయ రాజధర్మం. కనుక భగవంతుడే యామునుని రాజుగా చేసి ఆ ధర్మప్రభుత్వాన్ని స్థాపించి ఆ పని తీరినాక ఈ రామమిశ్రుని రూపంలో తిరిగి మతాచార్యపదవి నధిరోహించటానికి ప్రబోధిస్తున్నాడు.

వ॥ యోగసామ్రాజ్యంబు మఱచి సామ్రాజ్యంబునం దాసక్తుడయ్యె; నట్టి మహాత్ము వంశంబునం బుట్టినట్టి యితండిట్లగుట యతివ్యతిక్రమంబు. **189**

యోగసామ్రాజ్యంబు = మోక్షసాధనమైన యోగసామ్రాజ్యము, వ్యతిక్రమము = వైరుధ్యము.

సీ॥ వృషశైలఝురవారిఁ ద్రిషవణస్నానంబు
నిష్ఠఁగావించి యాహ్నికముఁ దీర్చి,
యేకాంతగుహా, తత్తటీ కుశాసనమున
నుండి లక్ష్మీశాంఘ్రి పుండరీక
మంకురత్పులక హర్షాశ్రువై; ద హరపు
ష్కరమున భావించి, సవిత దిరుగ
యజ్ఞోపవీత పద్మాక్షమాలికలతో
యోగపట్టికఁగూడి యురము మెఱయ

తే॥ శౌరిఁదద్ధరణీధ్రవాస్తవ్యుఁ గొలిచి
సతియు నాలర్కశాక మంచితము వండ
నిల్మికుందున కర్పించి, వేల్మిఁదీర్చి;
యిట్లు తను యాత్ర నడుపుమున్నితని తాత. **190**

మున్ను = పూర్వం; ఇతని = యామునుని తాత నాథముని; వృషశైలము = అలఘర్ క్షేత్రమందలి కొండ; ఝుర = సెలయేటి; వారిన్ = తీర్థంలో; త్రి+సవనస్నానంబు = మంత్రపూర్వకంగా మూడు పూటల చేసే స్నానం; నిష్ఠన్ = నియమంగా; (దైనందిన చర్య కాకుండా) పవిత్రంగా; కావించి = చేసి; ఆహ్నికము = వైష్ణవులు పగలు చేసే దైవోపాసనలు; (సంధ్యావందనాదికం) తీర్చి = చెల్లించి

2-71 లో వృషగిరి మధురానగర సమీపంలో ఉన్నదని చెప్పబడినదే ఇది. క్షేత్రంలో సుందరబాహుస్వామి గుడి కొండల మధ్య ఉన్నది. ఆ కొండల్లో ఒక సెలయేరే కొలనుగా ఏర్పడింది. అది స్నాన తీర్థం. అందులో నాథముని త్రిషవణమంత్ర పూర్వకంగా స్నానం చేసి ఆహ్నికం చెల్లించి

ఏకాంతగుహా = జన సంచారం లేని గుహలున్న; తత్ = ఆ వృషశైల; తటీ = దరుల యందు; కుశ+ఆసనమునన్ = దర్భచాపపై; ఉండి = కూర్చుండి; లక్ష్మీ+ఈశ = శ్రీహరియొక్క; అంఘ్రి = పాద; పుండరీకము = పద్మము, అంకురం = మొలుస్తున్న; పులక = పులకలు (రోమాంచం) హర్ష+అశ్రు = సంతోషబాష్పంతో; దహర పుష్కరమునన్ = హృదయపుండరీకంలో; భావించి = రూపకల్పన చేసి ధ్యానించి;

సవిత = సూర్యుడు; తిరుగన్ = పడమటికి తిరుగగా

యజ్ఞ+ఉపవీత = యజ్ఞదీక్షకై ధరించిన సూత్రం; జందెం, పద్మ+అక్షమాలిక= తామర గింజలతో చేసిన దండ; తోడి = తోపాటుగానున్న; యోగపట్టిక = యోగబంధం; కూడి= కూడిన; ఉరము = వక్షం; మెఱయెన్ = ప్రకాశిస్తుంటే

2-3-4 - ఆ వృషగిరిపై ఏకాంతగుహల్లో ఉంటూదరులందు దర్భాసనం మీద కూర్చుండి శ్రీహరి పదకమలాలను పులకలు - హర్షబాష్పాలు అంకురిస్తూ వుండగా హృదయాకాశంలో ఏకాగ్రంగా ధ్యానిస్తూ, యజ్ఞోపవీతం - తామర గింజల దండ - యోగపట్టము కల వక్షస్స్థలం కాంతితో భగవంతుని ఉనికిని చాటుతూ మెరుస్తూవుంటే - సూర్యుడు పశ్చిమానకు తిరిగిన వేళ.

తత్ = ఆ; ధరణీ+ధ్ర = కొండ; వాస్తవ్యున్ = నివాసంగా గల, శౌరిన్ = శ్రీసుందరబాహుస్వామిని; కొలిచి = సేవించి; సతియున్ = భార్య; అంచితము = లేలేత (చక్కని) అలర్క శాకము = ముండ్ల ముస్తె కూర, వండన్ = వండితే; ఇల్ = ఇంటి ముకుందునకు = హరికి; అర్పించి = నైవేద్యమర్పించి; వేల్మిన్ = అగ్నిహోత్రం, తీర్చి = చేసి; ఇట్లు = ఈ విధంగా; తను యాత్రన్ = జీవితయాత్రను; నడుపున్ = చెల్లిస్తూ ఉండేవాడు.

తా॥ ఆ క్షేత్ర స్వామిని సేవించి (ధ్యానానంతరం గుడికి వెళ్లి సేవించి) భార్య లేతముండ్లముస్తె కూర వండగా అది గృహదేవతకు నైవేద్యంగా అర్పించి, అగ్నిహోత్రం చేసి - ఇలా తన జీవితయాత్రను నడిపే వాడు కదా.

విశే॥ ఒక పరమ భాగవతోత్తముడైన శ్రీవైష్ణవుని దినచర్యను అభివర్ణిస్తున్న అద్భుత పద్యం. ప్రాతఃకాలంలో లేచి కొండపై సెలయేటి స్నానం చేసి గుహల ప్రాంతాలలో కుశాసనం పరచుకొని కూర్చుండి ఏకాంతంలో శ్రీహరిధ్యానం సూర్యుడు పడమటికి తిరిగేంత వరకు చేసి ప్రకాశిస్తున్న వక్షస్సుతో కొండదిగివచ్చి దేవాలయానికి వెళ్లి స్వామికి నమస్కరించి ఇంటికి రాగానే భార్యవండినది గృహదేవతకు నివేదనం చేసి - హోమం చేసి, ఒక క్రమంలో దృశ్యం తరువాత దృశ్యంగా - పగలంతా చేసే శ్రీవైష్ణవ దినచర్యను వర్ణించిన విధానం అద్భుతంగానే కాదు పవిత్రంగా వుంది. ఆ తాతగారికి మనుమడు విరుద్ధంగా కన్పించేసరికి తట్టుకోలేకపోయినాడు శ్రీరామమిశ్రుడు.

అలం : స్వభావోక్తి

విశే॥ చూ. 4-127. రాజు దినచర్య. పద్యంలో ఝరి పేరు నూపురగంగ. సతియు అన్నమాట పద్యంలో

వాలా ముఖ్యం. శ్రీవైష్ణవం గార్హస్థ్య ధర్మాన్ని ప్రధానంగా అంగీకరించింది. కనుక ఆ మాట లేకుండా వ్రాయడు. దహరపుష్కరము = అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరో అస్మిన్ అంతరాకాశః తస్మిన్ యదంతః తదన్వేష్టవ్యం తద్వావ విజాజ్ఞాసితవ్యమితి (ఛాందో. ఉ. 8-1) బ్రహ్మపురమైన శరీరంలో హృదయ పద్మసౌధమున్నది దానిలోనున్న తత్త్వాన్ని అన్వేషించాలి.

కం॥ తొడికబడి విషయాతురు నవి
విడుమని యెడు కంటెఁ గలదె వేఱే పగ ? నే
ర్పడరఁ గథాదుల నొక వెం
బడి దోఁపల బలికి మైత్రిఁ బాపుట యొప్పున్. 191

తొడబడి = తొందరపడి; విషయ = ఇంద్రియాలు అభిలషించే వాటిపై; ఆతురున్ = ఆసక్తి కల వానిని; అవి = వాటిని; విడుము = వదలి పెట్టు; అని యెడుకంటెన్ = అనటం కన్నా; వేరే పగకలదే; నేర్పు = చాతుర్యం అడరన్ = ఏర్పడేటట్లు; కథ+ఆదులన్ = కథలు మొదలైన వాటితో; ఒక వెంబడిన్ = ఒక పద్ధతిలో; మైత్రిన్ = స్నేహంగా; పలికి = చెప్పి; పాపుట = విషయాసక్తిని పోగొట్టుట; ఒప్పున్ = మంచిది.

తా॥ తొందరపడి విషయాలపై వ్యామోహం కలవాడితో ''ఇది మంచిది కాదయ్యా. వదిలిపెట్టు'' మని చెప్పటం కంటె వేరే పగ ఏముంటుంది ? కాబట్టి నేర్పుతో కథలల్లి స్నేహంతో పగా మార్గం నుండి మళ్లించాలి.

వి : ఇంద్రియ గోచరమయ్యేది, శబ్ద - స్పర్శ - రూప - రస - గంధాదులు-5.

కం॥ వసుధం బుత్రాదికదు
ర్వ్యసనము సైతమును దంద్రి వారించుటకున్
వసపడదట మరి రాజ్య
వ్యసనము వారింప నెంతవాఁ డెవ్వాఁడున్. 192

వసుధన్ = లోకంలో; పుత్ర+ఆదిక = కొడుకులు మొదలైన వారిని; దుర్+వ్యసనము = చెడ్డవ్యసనాలను; సైతమున్ = కూడ; వారించుటకున్ = నివారించటానికి; తండ్రికిన్ = తండ్రికి కూడ; వసపడదట = శక్యం కాదట. మరి = ఇక; రాజ్యవ్యజనము = రాజ్యాధికారమన్న వ్యసనము; వారింపన్ = వద్దనటానికి; ఎవ్వాడున్ = ఎవ్వడైనా; ఎంతవాడు = సమర్థుడు ?

తా॥ లోకంలో కొడుకుల దుర్వ్యసనాలను నివారించటానికి తండ్రికే సాధ్యపడదే. ఇక రాజ్యవ్యసనం మాన్పించటానికి ఎవడైనా ఎంత సమర్థుడు ? ఎవడికి శక్యం కాదని తాత్పర్యం.

విశే॥ వ్యసనాలు = త్రాగుడు - స్త్రీ - వేట - పరుషంగా మాట్లాడటం; సొమ్ము వ్యర్థంగా ఖర్చుపెట్టడం, జూదం; కఠినశిక్ష. ఇవి సప్తవ్యసనాలు. వీటన్నికంటె గొప్పది రాజ్యాధికార వాంఛ.

అలం : కావ్యార్థాపత్తి.

ఆ॥ వె॥ నల్లఁ గ్రోల నిచ్చి మెల్లనె చివ్వంగి
నోటి జింకఁ దివియు నేరుపొదవు
వేటకాఁడు వోలె విషయాళివలనఁ ద
త్తృష్ణఁ దీరనిచ్చి త్రిప్పుటొప్పు. 193

నల్లన్ = నెత్తురును; క్రోలన్+ఇచ్చి = త్రాగనిచ్చి; మెల్లన్ = మెల్లగానే; చివ్వంగి = సివంగి (యొక్క) నోటి జింకన్ = నోటిలో చిక్కిన జింకను; తీయు = తీసే; నేరుపు = చాతుర్యం; ఒదవు = కల; వేటకాడు వోలెన్ = వేటకాని వలె; విషయ+ఆళివలనన్ = విషయసమూహం నుండి; తత్ = ఆ; తృష్ణ = ఆసక్తి; తీరన్+ఇచ్చి = తీరిన తరువాత త్రిప్పుట = మనస్సును మరలించుట; ఒప్పున్ = మంచిది.

తా॥ వేటకాడే విధంగా చివ్వంగి నోటిలోని జింక మెడను కొరికి రక్తం త్రాగనిచ్చి జింకనివతలకు లాగినట్లు మనిషి కూడ వ్యామోహాల ననుభవింప చేసిన తర్వాత మనస్సును మళ్లించాలి. ఇదే పై 191 చెప్పిన నేర్పు.

అలం : ఉపమ

ఈ వేటసాదృశ్యం కవి మనస్సునకు సంబంధించినది తప్ప పాత్రయొక్క మనస్తత్వానికి ఒదిగేది కాదు. అతనికీ గొడవలు తెలియటం కష్టం కనుక.

వ. కావున, నట్లయిన నితనినింక నుపేక్షింపరా దుపాయంబునఁ జొచ్చి యొక్క రీతిం ద్రిప్ప వలయు; నుర్వినాహారదోషంబు విజ్ఞాన నాశనంబునకు మూలంబని వితర్కించి. 194.

ఉపేక్షింపరాదు = వదలిపెట్టరాదు; ఉపాయంబునన్ = ఉపాయంతో; ఆహార దోషము = అన్నదోషం; విజ్ఞాన నాశనంబునకు = వివేకనాశనానికి.

కం॥ ముల్లుదలకొనని నవకపుఁ
బల్లవముల తోడ ముక్తిభామచెవులకుం
బల్లేరు పువ్వులగు పువు
లుల్లసిలు నలర్కశాక మొదుగుగఁ గొనుచున్. 195

తే॥ తెచ్చి, యొక వైష్ణవుఁడు గాను కిచ్చె, ననుచు
బానసపు బాడబములచేతఁ బంపుటయును
నతఁడు ప్రియ వడి వండించి యారగింప
దెచ్చు నిచ్చఁ గొన్నాళ్లిట్లు తెచ్చుచుండ. 196

ముల్లు తలకొనని = ముల్లు లేని; నవకంపు = లేత; పల్లవములతోన్ = చిగుళ్లతోన్, ముక్తిభామ= మోక్షలక్ష్మి; చెవులకున్, పల్లేరుపువ్వులు = పల్లేరుపువ్వులువంటి; పువ్వులు = చెవిపోగులు; ఉల్లసిలు= అందగించే; అలర్క శాకము = ముండ్లముస్తెకూర; ఒదుగఁగన్ = అధికంగా;

**తా॥** ఆకూర ముండ్లముస్తె కూర. అలాంటి దానికి ముల్లు ఇంకా వాడి తేరలేదు. దాని పువ్వులు మోక్ష లక్ష్మికి పల్లేరు పువ్వులన్న పేరు గల చెవిపోగుల్లాగ ఉన్నాయి. అలాంటి కూరను చేతికి తగినంత తీసుకొని;

**అలం :** రూపకం.

**విశే॥** పల్లేరు పువ్వులు - ఒక శ్రవణాభరణం. ఇది మోక్షలక్ష్మిది. అనటం దివ్యము.

తెచ్చి బానసపు బాడబములచేతన్ = వంటబ్రాహ్మణులతో; పంపుటయున్ = పంపుటవల్ల; అతడు = రాజు; ప్రియపడి = ఆసక్తితో; వండించి, ఆరగింపన్ = తినగా.

**తా॥** ఆ కూరను వంటబ్రాహ్మణులతో ఒక వైష్ణవుడిచ్చాడని చెప్పి వంట శాలకు పంపించాడు. రాజు కూడ ఆసక్తితో వండించుకొని తిన్నాడు. ఇలా కొంత కాలం గడిచింది.

వ. ఒక్కనాడతండు భోజన సమయంబున సకల శాకాస్వాదనంబు సేయుచు వచ్చి, తచ్ఛాకంబు నంజుచుం దలంచుకొని ''యేత దానేత యగు భాగవతు భోజనాసం తరంబ మమ్ముంగాన్పింపుం'' దని పలికి పాణిపాద ప్రక్షాళననాచమనానంతరంబ గాన్పించుకొని నమస్కరించి వచ్చిన ప్రయోజనం బడుగుటయునతండిట్లనియె. 197

భోజన సమయంబునన్ = తినేవేళ; సకల = అన్ని; శాక = కూరలు; ఆస్వాదనంబు సేయుచున్= రుచిచూస్తూ; తత్+శాకంబు = ఆ ముళ్లముస్తె కూర; నంజుచున్ = ఆస్వాదిస్తూ; తలంచుకొని= ఆలోచించి; ఏతత్ = ఈ; ఆనేత = (కూర) తెచ్చే; భాగవతున్ = భక్తున్ని; భోజన+ అనంతరము= అన్నం తిన్న తరువాత; మమ్మున్ = మమ్మల్ని; (రాజుమాటాడే వైఖరి. మహాభక్తులు ''నేను'' అని కూడ అనక తమను తాము ప్రథమపురుషలో సంబోధించుకొంటారు) కాన్పింపుడు = దర్శింపచేయుమనండి; పాణి = చేయి;; పాద = కాళ్లు; ప్రక్షాళనము = కడుగు కోవటం; ఆచమన+అనంతరంబ = పుడిసిలితో మూడు మార్లు నీరు త్రాగటం (చూపుడు వేలు నిగిడించినపుడిసిలి) అతనింగాన్పించుకొని = అతనికి దర్శనమిచ్చి.

కం॥ మీ పెద్దలు గూర్చిన ని
క్షేప మొకటి సహ్యజాత సింధు జలాంత
ర్ద్వీపమున నుండ నీకుం
జూపంగా వచ్చితిని వసుమతీనాథా! 198

మీ పెద్దలు = మీ పూర్వులు; కూర్చిన = కూడబెట్టిన, నిక్షేపము = నిధి ఒకటి, సహ్యజాత = సహ్యపర్వతంలో పుట్టిన; సింధు = నది (కావేరి) జల+అంతర్+ద్వీపమున = నీటి నడుమలంకలో; ఉండన్ = ఉండగా, నీకున్ చూపఁగాన్ = నీకు చూపుటకు; వచ్చితిని = వచ్చితిని, వసుమతీనాథా= రాజా.

వసువు = బంగారము కలది; వసుమతి = భూమి. దానికధిపతి రాజు కనుక ఈ నిధి రాజుది. అది మీ పూర్వులు కూర్చి పెట్టినది. కావేరిమధ్య ద్వీపంలో ఉంది. మీ కది చూపించాలని వచ్చాను.

కావేరి రెండు పాయలుగా చీలిన లంక శ్రీరంగక్షేత్రం. అందచేత ద్వీపం.

కం॥ నాకేటికి నిక్షేపము
నాకు నిధియు నాకరంబు నరనాథుల సొ
మ్మే కాన విన్నవించెద
నాకర్ణింపుము తదీయ మగు విధమెల్లన్. 199

నిక్షేపము = నిధి; నాకున్+ఏటికిన్ = నాకెందుకు ? నాకు = అనకు; నిధియున్, ఆకరంబు = గని; నరనాథుల సొమ్మే = రాజుల సొమ్మే; కాన = కాబట్టి; ఆకర్ణింపుము = వినుము, విన్నవించెదన్= మనవిచేస్తాను; తదీయము అగు విధము ఎల్ల = దాని విధానమంతా.

తా॥ ఈ నిధులు - గనులు నాకెందుకయ్యా; అంటే రాజా ! అవి రాజుల సొమ్ము గనుక దాని సంగతి పూర్తిగా వివరిస్తాను వినండి.

సీ॥ స్ఫటల మణుల్ క్రాల శాంతమై శ్వేతమై
నట్టి త్రాఁచొక్కటి చుట్టి యుండు.
రక్షోగృహీత మన్ప్రథ తొల్లి గల, దది
పాలయ దందేఁడాఱు నెలలు గాని;
యేపాటి బలియైనఁ జేపఁడుఁ బ్రాణిహిం;
సాదిపూజనముల కాసపడదు.
తన వెలుం గొగి నిరంజనదృష్టికినె లక్ష్య
మై యుండు నయ్యు నింతింత గాదు.
తే॥ రత్నమొక్కటిపై నపూర్వంబు మెఱయుఁ
గలదు పద్మంబు శంఖంబు, పలుకు లేటి
కక్షయమనంత మాద్య మేకాంతమందు
భూప; నీ కొక్కనికె కాక చూపరాదు''. 200

శ్రీరంగేశ్వరునకు - నిధికి శ్లేష.

1 స్ఫటలన్ - పడగలపై; మణుల్ = రత్నాలు; క్రాలన్ = ప్రకాశింపగా; శాంతమై = ఉద్రేకాలు లేనిదై;

శ్వేతము = తెల్లనిది; ఐనట్టి = అయినటువంటి; త్రాచు = పాము, ఒకటి, చుట్టియుండున్= చుట్టచుట్టుకొని యుంటుంది; - నిధిని రక్షిస్తూ పాముంటుందని జన శ్రుతి.

తా॥ ఆ నిధిని రక్షిస్తూ పాముంటుంది కాని అది పరమశాంతమూర్తి. తెల్లనిది. దాని పడగలపై మణులు వెల్లులారబోస్తూ వుంటాయి. ఆదిశేషునిపై స్వామి వున్నాడు.

స్ఫటలు = బహువచనం. రాజునకది అసామాన్య సర్పమన్న సూచన చేస్తున్నది.

తొల్లి = పూర్వం, రక్షోగృహీతము = రాక్షసునిచే గ్రహింపబడి నట్టిది; అన్న = అన్న; ప్రథ= వాడుకమాట; కలదు, అది, అందున్ = అక్కడ, ఏడు ఆరు నెలలు గాని= ఏడాదికో, ఆర్నెల్లకో కానీ. పొలయదు = సమీపించదు.

తా॥ రాక్షసుడక్కడుంటాడనే వాడుక వకటి పూర్వంనుండి వుంది. కాని అది ఏడాదికో ఆర్నెల్లకో వచ్చి పోతుంది. అంటే శ్రీరంగనాథుడు లంకేశ్వరుడైన విభీషణునకు శ్రీరామచంద్రుడిచ్చాడని పురాణవచనం.

ఏపాటి బలియైన = ఏ కొంచెం పూజకైన; ( బలి = దేవాలయాలలో బలిపీఠాలుంటాయి. అన్నాదులక్కడ నైవేద్యంగా సమర్పిస్తారు- పూజార్లు, బలి = జంతువుల బలి జాతర్లలో ఉంది. సాత్త్వికదైవం కనుక కొంచెం బలిచాలు)

ప్రాణిహింస = జంతుబలి, ఆది = మొదలైన పూజనకములకున్ = పూజలకు, ఆసపడదు = ఆశించదు

తన వెలుంగు = తనకాంతి; ఒగిన్ = సొగసుగా నిరంజన = కాటుక లేని, దృష్టికిన్= చూపుకీ, లక్ష్యము = గమ్యం, ఐ+ఉండున్; అయ్యున్ = ఐనా, ఇంత+అంత కాదు.-

నిధి కన్పించటానికి. అంజనం రాసుకోవాలంటారు. ఈ నిధికి అంజనం పనికిరాదు.

పైన్ - పైన, అనర్ఘంబు = అమూల్యమైన, రత్నము = మణి; మెఱయున్ = ప్రకాశిస్తుంది.

కౌస్తుభరత్నం పైనున్న రత్నం. అంటే శ్రీరంగస్వామి శయనమూర్తి కనుక పైన - అనటం.

పద్మంబు - శంఖంబు - నిధుల పేర్లు. స్వామి నాభిలో పద్మం - చేతిలో శంఖం.

అక్షయం = నాశనం లేనిది, అనంతము = అంతము లేనిది. ఆద్యము= అన్నిటికి మొదలు, ఏకాంతము = ఒంటరిగా, భూప = రాజా !

దాని వెలుగు అంజనరాసుకొంటే కన్పించదు. పైనొక అపూర్వరత్నం పద్మం శంఖాలున్నవి. (నవనిధుల్లోని) అనంతం నాశనం కానిది, అన్నింటికిమొదలైనవి. ఏకాంతంలోనికే చూపాలి.

వ॥ అని విన్నవించిన సంతోషించి సేనాసమేతుండై యతడు మున్నుగా శ్రీరంగాన కరిగి కావేరీ చంద్ర పుష్కరిణులఁ దీర్థంబాడి రంగనాథు సేవించి సాభిప్రాయంబుగా నతనిం గటాక్షించిన నతండిట్లనియె.

సంతసించి = సంతోషించి, సేనాసమేతుఁడై = సేనతో కూడుకొని; అతండు మున్నుగాన్= రామమిశ్రుడు ముందు నడువగా, పుష్కరిణి = కోనేరు; తీర్థంబాడి = స్నానమాడి; స+ అభిప్రాయంబుగా = అభిప్రాయము కలవాడై, కటాక్షించినన్ = చూస్తే; అతండు = రామమిశ్రుడు.

కం॥ ''మీ పెద్దలు గూర్చిన ని
క్షేపమ్మిది గొ'' మ్మటంచు శ్రీరంగపతి
శ్రీపదయుగ్మముఁజూపిన
నా పృథివీపతి హఠాదపాస్తభ్రముడై. 202

మీ పెద్దలు = (మీ తాత నాథమునులు) మీ పూర్వులు; నిక్షేపము+ ఇది = ఈ స్వామియే ఈ నిధి; కొమ్ము = తీసుకో; అట+ అంచున్ = అని చెబుతూ; శ్రీపద = దివ్యపాదముల; యుగ్మమున్= జంటను; చూపినన్ = చూపిస్తే; ఆ పృథివీపతి = ఆ రాజు, హఠాత్ = హఠాత్తుగా= వెంటనే; అపాస్త = పోయిన; భ్రముడై = భ్రాంతికలవాడై.

తా॥ మీ పూర్వులు సంఘటించి పెట్టిన నిధి ఇదే స్వీకరించు అని శ్రీరంగనాథుని శ్రీపాదాలను చూపించేసరికి రాజునకు భ్రమవ్యామోహం తొలగిపోయింది

విశే॥ భ్రమ = తన రాజ్యపాలన - వైభవాల మీద వ్యామోహం.

192లో రాజ్యవ్యసనం తొలగించటం కష్టమన్నాడు. ఇక్కడ వెంటనే తొలగి పోవటం యామునాచార్యుని పరిపక్వ హృదయాన్ని సూచిస్తుంది.

వ॥ గ్రక్కునఁ దన పూర్వదశఁ దలంచి యిన్నాళ్లు దన ప్రమాదంబు నకుం బరమ నిర్వేదన నొంది 'నీ వెవ్వండ వనుటయు, 'నే మీ పితామహుండగు నాథముని ప్రశిష్యుండ; నయ్యోగివరుండు భావి భవజ్జన్మం బెఱింగి భాగవతవతంసంబ వగు నీ చేత నిర్విశిష్టాద్వైతంబు సకల భూతహితంబుగా వెలయం గలయది యని నిశ్చయించి, నీకు ద్వయం బుపదేశింపుమని, తన శిష్యుఁడగు పుండరీకాక్షున కుపదేశించిన, నతండు బోగాసక్తుండ వైననిన్నుపాయంబున! దెలిపి, నీ కుపదేశింపు మనుటయుఁ, బనివింటి, 'ననిన, సాష్టాంగంబుగా బ్రణమిల్లి, యతని చేతం బంచ సంస్కార సంస్కృతుండై, యంత నిలువక తురీయాశ్రమంబునకు రాఁగలవాఁడై స్కంధావారంబునకు మగిడి వచ్చి, కుమారునందు రాజ్యభారంబుఁ బెట్టి, బంధుమిత్త్రామాత్య సమేతం బగు బలచతుష్టయం బును బ్రకృతి వర్గంబును నతని కొప్పగించి యట్లనియె. 203.

గ్రక్కునన్ = వెంటనే; పూర్వదశన్ = తొల్లింటి దశను; తలంచి = స్మరించి, ప్రమాదంబునకున్= దైవ విస్మృతి రూపమైన పొరపాటునకు; నిర్వేదన = దుఃఖం; పితామహుడు = తాత; ప్రశిష్యుడు= శిష్యునకు శిష్యుడు, యోగివరుడు = యోగిశ్రేష్ఠుడు; (చూ. 190 పద్యం) భావి = భవిష్యత్తులో; భవత్ = నీ; జన్మము = జన్మము; ఎఱింగి = తెలిసి; భాగవత వతంసము = వైష్ణవభక్తశ్రేష్ఠుడు; భూతహితంబుగా =

జీవులకు మోక్షదాయకమగునట్లుగా; వెలయం గలయది = ప్రకాశించగలదు; ద్వయము = మంత్రవిశేషము; భోగాసక్తుడు = రాజ్యభోగాలలో నిమగ్నుడైనవాడు; పనివింటి= ఆజ్ఞను పాలించాను; పంచ సంస్కారయుతుండు = ఐదు సంస్కారాలు కలవాడై (తాప- మంత్ర- నామ - ఊర్ధ్వపుండ్ర యాగాలు) తురీయా+ఆశ్రమంబు = చివరి ఆశ్రమంసన్యాసం. స్కంధావారంబు = మంత్రులు; బలచతుష్టము = నాలుగురకాల సేనలు ( రథ - గజ - అశ్వ - పదాతిబలాలు)కలచోట; ప్రకృతివర్గంబు = ప్రజలు.

## రాజధర్మపర్వం

( మహాభారతం తర్వాత ఇక్కడే రాజధర్మం విస్తృతరూపం చెప్పబడ్డది. అక్కడ వక్త భీష్ముడు. ఇక్కడ యామునుడు పరిపక్వత - అనుభవం దీనికాధారం - అక్కడ. శ్రీకృష్ణద్వైపాయనుడు - ఇక్కడ శ్రీకృష్ణదేవరాయల స్వానుభవపాండిత్యాలు. నేపథ్యంలో వున్నాయి. దీని తర్వాత రాజధర్మం రాలేదు. భారత చక్రవర్తీ - కేంద్రప్రభుత్వమూ పోయాయి. కాగా భారతరాజధర్మగ్రంథాలన్నీ ఇక్కడ తొంగిచూస్తాయి )

కం॥ ఏపట్టున విసువక ర
క్షాపరుఁడవు గమ్ము ప్రజలచక్కిఁ; విపన్ను
ల్గూ పెట్టిన విని తీర్పుము;
కాపురుషుల మీద నిడకు కార్యభరం బుల్. **204**

ఏ పట్టున+ఐనన్ = ఎలాంటి సమయంలోనైనా; విసువక = విసుగు లేక; రక్షాపరుడవు = కాపాడేవాడవు; కమ్ము = కావాలి సుమా; ప్రజల చక్కిన్ = ప్రజల విషయంలో; విపన్నుల్ = ఆపదలలో నున్నవారు, కూ = మొఱ; పెట్టినన్ = పెడితే; విని = ఆలించి; తీర్పుము = తీర్చు; కార్యభరంబుల్ = భారమైన పనులు, కాపురుషులపై = దుర్మార్గులపైన; ఇడకు = పెట్టకు.

తా॥ ఏ సమయంలోనైనా ప్రజలను విసువుకోక కాపాడాలి. ఆపదలలో మునిగినవారు మొఱపెడితే విని తీర్చు. కార్యభారం చెడ్డవారిమీద పెట్టబోకు.

విశే॥ క్రియలన్నీ విధులను బోధించేవి. ఆజ్ఞారూపాలన్న మాట. తండ్రి సన్యసించబోతూకొడుకునకు రాజ్యాభిషేకం చేసి రాజధర్మం బోధిస్తున్నాడు. మనసా సన్యాసియై చెప్పిన ధర్మం కనుక నిస్వార్థమైన - విశ్వజనీనమైన ధర్మం. వక్తస్థాయి భారతంలో భీష్మ స్థాయి.

వర్ణాశ్రమ వ్యవస్థలో క్షత్రియుడు - లేదా రాష్ట్రవ్యవస్థ వానప్రస్థాశ్రమ స్థానంలోనే వుంటుంది. భర్త- భార్య ఇద్దరే వున్న స్థితి. లోకయాత్ర చేసి బాధ్యతలన్ని కొడుకున కప్పగించి వనానికి పోయి దంపతులిద్దరూ గడిపే జీవనం వానప్రస్థం. తర్వాత సన్న్యాసం. అక్కడ భార్య కూడ లేదు. మమతల వ్యామోహాలన్ని తెగగోసిన భూమిక ఇది. ఇదే వర్ణవ్యవస్థలో విప్రుడు. వి+ప్ర = రెండూ శ్రేష్ఠతావాచకాలైన విసర్గలే గనుక. మనః పరిణితికలవాడు విప్రుడు.

రాయలవారు తెల్లవారు జామున గుర్రపుస్వారీ చేసేటప్పుడు ప్రజలు వచ్చి తమ బాధలు చెప్పుకొనేవారని న్యూనిజ్ వ్రాసాడు. కాళిదాసాది కవులు నిరూపించిన ప్రభులక్షణాలివే.

తే॥ రాష్ట్రవర్ధన మెదఁ గోరు రాజు మేలు
రాష్ట్రమును గోరు; దానఁ గార్యమె యనంగ
రాదు; బ్రహ్మోత్తరము లైన ప్రజల యేక
ముఖపుఁ గోర్కిఁ దదంత రాత్ముం డొసఁగఁడె ? 205

రాష్ట్ర = జనపదము; వర్ధనము = పెంపు; ఎదన్ = మనస్సులో; కోరు = కోరే; రాజుమేలు = రాజు అభ్యుదయం, రాష్ట్రమును కోరు = ప్రజాసమూహం కూడ కోరుకొంటుంది, దానన్ = దానితో; కార్యమె = ప్రయోజన మేమిటి ? అనంగిరాదు = అనకూడదు; బ్రహ్మ+ఉత్తరములు = ధర్మస్వరూపమైన సత్పదార్థమే (పరబ్రహ్మమమే), అగ్రమందు కల ప్రజావ్యవస్థ ప్రజలయొక్క, ఏకముఖపుకోర్కిన్ = అందరు కలిసి కావాలనుకొన్న; అభిలాష = ముక్తకంఠంగా కోరుకొన్నది; తత్ = ఆ ప్రజల; అంతరాత్ముడు = హృదయంలోపల వున్న పరమాత్ముడు; ఒసంగడె = ఇవ్వడా?

తా॥ ప్రజలు మేలు కోరుకొనే రాజు మేలు వారూ కోరుకొంటారు. వారు పాలితులు కదా. నాకు వారి కోర్కెవల్ల ఒనగూడేదేమిటి అనవచ్చు. ఎందుకంటె 2-33లో చెప్పినట్లు ప్రజావ్యవస్థలో అగ్రమందు బ్రాహ్మణులు కలది కనుక వారి ఆత్మలందున్న భగవంతుడే వారి ఏకముఖపు కోర్కె తీర్చడా ?

విశే॥ బ్రహ్మ+ఉత్తరము = రాజనీతి - రాజ్యపాలనలో ప్రాచీన కవులంతా వాడిన మాట.

భీష్మపాలన వర్ణిస్తూ ఇట్లు బ్రహ్మోత్తరంబుగా పాలించుచుండన్ - అని నన్నయగారు (చూ. ఆదిపర్వం.3ఆ )

బ్రహ్మమే లేదా వేదమే లక్ష్యంగా కలిగి - అనీ చెప్పవచ్చు. రాజ్యపాలనలో అధర్మ- ఆధికారిక చక్రవర్తులిద్దరుంటారు. మొదటివారు ధర్మరాజు; శ్రీరాముడు; మొ॥వారు. రెండవ వాడు దుర్యోధనుడు మొ॥ వారు ఆ ధర్మచక్రవర్తి పాలనలో ప్రజలు బాహ్య భౌతిక మృత్పదార్థాలు కారు. ఆత్మకు ఆకృతి. లేదా ప్రతి శీర్షకం (Mask) కథాకళిలో తలకు ధరించే తొడుగు.

మొదటి పద్యంలో పాలన ఇలా వుండాలని చెప్పి ఈ పద్యంలో సుఖించే ప్రజల వల్ల రాజునకు సుఖం కలుగుతుంది. ఆ సుఖం భగవంతుడిచ్చే ఆనందం. అని చెప్పటం వల్ల ఈ రాజధర్మానికి ఉదాత్త భూమిక సంతరించినట్లయినది. ప్రాచీన కాలంలో స్త్రీలకు జనపదకల్యాణి అని పేర్లుండేవి. భద్రత కల రాష్ట్రమని అర్థం. అదే సుభద్ర అన్నా. జనపదకల్యాణం రాజు లక్ష్యమన్నమాట.

కం ॥ దయఁ బ్రజరక్షించుటకు నె
నయె ? తపమునధ్వరములు నరవర ! దానన్
జయమును లక్ష్మియునుం గీ
ర్తియు సుగతియుఁగలుగు వసుమతీ నాథునకున్ (శాం. 2-30)

ఆ॥వె॥ ఆజ్ఞవలయు నృపతి, కాభీర భిల్లాది
కంప కోల నూల నాజ్ఞ చెల్లు
నంట; సార్వభౌముఁ డైన భూపతి యాజ్ఞ
కెల్లవారుఁ దల్లడిల్ల వలదె ? 206

నృపతికిన్ = రాజునకు; ఆజ్ఞ = ఆనతి; కావాలి; ఆభీర = గొల్లలు, భిల్ల = కోయవారు; ఆదిన్ = మొదలైన గణాలకు; అంపకోలన్ = బాణం కెట్టతోనూ; నూలన్ = దారం పోగుతోనూ; ఆజ్ఞ = ఆనతి; చెల్లున్+ అంట = సాగుతుందటు; సార్వభౌముడైన = చక్రవర్తి యైన; భూపతి = రాజు; ఆజ్ఞకున్ = ఉత్తరువునకు; ఎల్లవారున్ = అందరూ; తల్లడిల్లవలదె= భయపడవలదా.

తా ॥-లోకంలో అడవి గొల్లలు - కోయలూ గుంపు నాయయకుడైనావాడు ఒకబాణం కర్రనో - నూలు పోగునో అభయహస్తచిహ్నంగా ఇస్తే వారికి ఆగణాలనుండి భయంరాదు. ఐనపుడు మహాచక్రవర్తి ఆజ్ఞకు అందరూ భయపడవలదా ?

విశే॥ రాజు ఆజ్ఞాస్వరూపుడు. లోకాని కతి చనువిస్తే అలుసుగా తీసికొని ధర్మపాలనకు విఘ్నాలు కల్పిస్తారు. కనుక భయాన్ని భయాన్ని కల్పించే నటన చేయాలి. ఇది రాజు భూమిక దాల్చిన వానికి తప్పదు. ఇది నటన తప్ప స్వభావం కాదు.

కం॥ తనవారు పెద్ద సేయని
మనుజేశు నరాతి జనులు మదిని సరకుగా
గొనరది భూప్రజ కొప్పదు
విను, కావునఁ బతికిఁ బ్రజలు వెఱచుట యొప్పున్. (శాం. 2-261)

కం॥ దుర్గము లా ప్తద్విజవ
వర్గమునకై యిమ్ము; దుర్గవ త్తత్తతి క
త్యర్గళ ధరాధి రాజ్య వి
నిర్గత సాధ్వసత పొడమ నిలుపకు కొలఁదిన్. 207

ఆప్త = ఆప్తులైనవారు; (తన హితం కోరేవారు) ద్విజవర్గము = ద్విజులు; దుర్గవత్ = దుర్గాధిపత్యం గల; తత్+తతికిన్ = ఆ సమూహానికి; అతి+ అర్గళ = అడ్డులేని; ధర+అధిరాజ్య = అధికరాజ్యప్రదానం చేత; సాధ్వసత = భయం; పొడమన్ = కలుగగా; కొలదిన్= మితిని; నిలుపకు = విధించకు.

తా॥ దుర్గాధిపత్యము ఆప్తులైన బ్రాహ్మణులకే ఇవ్వు. వారికి సర్వాధికారాలు ఇవ్వు. దుర్గాలపై ఆధిపత్య మీయకపోతే శత్రురాజులకు భయం కలుగదు. వారిని భయపెట్టేటంత రాజ్యాధికారాలనివ్వు. దీనికి మితి కల్పించకు.

విశే॥ ద్విజ = బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్యులైనా ప్రధానంగా బ్రాహ్మణులకే అన్వయించటం పరిపాటి. రాయలువారు బ్రాహ్మణులైన అప్పాజి - వారి తమ్ముడు గోవింద రాజు, అల్లుళ్లు అప్పమంత్రి; గోపన్నమంత్రులకే ఆయా దుర్గాధిపత్యాల నిచ్చినట్లు చరిత్ర.

ఆ॥ మొదలఁ బెనిచి, పిదపఁ గుదియింప, నెవ్వాండుఁ
దనదు తొంటిహీన దశఁ దలంపఁ,
డలుగుఁ; గాన శీల మరయుచుఁ గ్రమవృద్ధిఁ
బెనిచి, వేళవేళఁ బనులు గొనుము. 208

మొదలన్ = తొలుత; పెనిచి = పెద్దచేసి; పిదపన్ = తరువాత; కుదియింపన్ = కుదిస్తే; (తగ్గిస్తే) ఎవ్వాడున్ = ఎవడూ కూడ; తనకు = తన యొక్క; హీనదశన్ = తొలుతటి నీచస్థితిని; తలంపడు=ఆలోచింపడు; అలుగున్ = కోపగిస్తాడు. కానన్ = కాబట్టి; శీలము = ప్రవర్తన; అరయుచున్ = విచారిస్తూ; క్రమవృద్ధిన్ = క్రమాభివృద్ధితో; పెంచి = పెద్దగాచేసి; వేళవేళన్ = ప్రతిసమయంలో; పనులు గొనుము = సేవలను స్వీకరించుము.

తా॥ ముందుగానే ఎవరినీ పెద్దగాచేసి తరువాత తక్కువ వానిగా చేయవద్దు. లోకంలో ఎవడైనా అలా చేస్తే సహించడు. కోపం పెట్టుకొంటాడు. కనుక వాడి శీలాన్ని చూస్తూ క్రమంగా ఉద్యోగాభివృద్ధి కల్పించు. అప్పుడే వాడు భక్తితో పనులు చేస్తాడు. అలా పనులను చేయుంచుకోవాలి.

ఆ॥ అనభిజాతుఁ, గీకటాలయు, నశ్రుతు,
నలుకు మాని బొంకు పలుకు వాని,
నాతతాయి, గడుసు, నన్యదేశ్యు, నధర్ము,
విడుము విప్రు నేల వేఁడితేని. 209

విప్రున్ = బ్రాహ్మణుని; ఏలన్ = పోషించాలిన; వేడితి+ఏన్ = కోరితే; న+అభిజాతున్ = మంచి పుట్టుక లేని వానిని; కీకట+ఆలయున్ = కోయపల్లెల్లో నివసించేవానిని (నిగమశర్మలాంటి వాడు.) అశ్రుతున్ = చదువురాని వానిని; అలుకుమాని = నిర్భయంగా; బొంకు పలుకు వానిన్ = అబద్ధాలాడే వానిని; ఆతతాయిన్ = దుర్మార్గుని; గడుసున్ = క్రూరుని; అన్యదేశ్యన్ = విదేశీయుని; అధర్మున్ = ధర్మబుద్ధి లేని వానిని; విడుము = త్యజించు.

తా॥ బ్రాహ్మణుడైనా ఈ గుణాలు కలవానిని ఆదరించకు. 207లో సామాన్యధర్మం. ఇందులో విశేషధర్మం. భారతనీతిలో బ్రాహ్మణ సంరక్షణ చెప్పబడ్డది. రాను రాను వచ్చిన పరిణామానుసారంగా ఈ మాట రాయల వారి స్వానుభవం నుండి పుట్టింది.

గోలకొండ తురక గోవుల భక్షించు
కొండవీటి విప్రకులము నెల్ల

బాచమరసు చేరి భక్షించు చున్నాడు
తురక మేలో ! బాచ మరసు మేలో !

ఈ పద్యం అప్పకవీయం లోది. రామకృష్ణుడీ పద్యం వ్రాసి రాయల వారి కంపితే వారు విచారించి శిక్షించినట్లొక కథనం.

కం॥ తక్కుము మిగులఁ బథిచ్యుత
పక్కణ వర్ధితులఁ; దొల్లి భ్రష్టగు విప్రుం
డొక్కండలుగఁడె ప్రోచిన
కొక్కెరపై నొక్కపూఁట కూటికిఁ గాఁగఁ ? 210

మిగులన్ = మిక్కిలి; పథచ్యుత = మార్గభ్రష్టుడు; పక్కణ = బోయపల్లెలో; వర్ధితున్ = పెరిగిన వానిని; తక్కుము = త్యజింపుము; తొల్లి = పూర్వం, భ్రష్ట+అగు = చెడిపోయిన; విప్రుడు = బ్రాహ్మణుడు; ఒక్కండు = ఒకడు, ప్రోచిన = తననుకాపాడిన; కొక్కెరపైన్ = కొంగపై

తా ॥ భ్రష్టాచారుడై అటవిక జీవనానుగుణంగా జీవించే బ్రాహ్మణు నైనా నిర్దయగాత్యజించు. పూర్వం భ్రష్టుడైన బ్రాహ్మణుడొకడు తనను కాపాడిన కొంగను ఒక పూట తిండికోసం చంపడా? శాంతి 3వ అ.లో నాడీ జంఘునికథ.

అలం : అర్థాంతరన్యాసం.

విశే ॥ నాటి చరిత్ర కారులు బ్రాహ్మణులు విశ్వాస్యులు కనుక రాయలవారు వారి నాదరించి ఉన్నత పదవులనిచ్చినట్లు చెప్పారు. 207లో దుర్గాధిపత్యమాప్త ద్విజవర్గమున కిమ్మని 208లో దానికి మితిని కల్పించి తర్వాతి రెండు పద్యాల్లో, 207లోని ద్విజశబ్దార్థ నిర్ణయించేసాడు. అంటే కేవలం జన్మతో వచ్చిన బ్రాహ్మణ్యం కాదనటం గమనించాలి. ఈ క్రమోన్మీలనం సంభావ్యం కదా !

చదివి అధర్మ భీతి నృపశాస్త్రవిధిజ్ఞతలన్ వయస్సు డె
బ్బదిటికి లోను, నేఁబదికి బాహ్యమునై, యరుజాన్వపూర్వులై
మదమఱి రాజు ప్రార్థన నమాత్యతఁ గైకొని తీర్పు పాఱువా
రొదవిన నంగముల్ మిగుల నూర్జితమౌటకుఁ బూటచాలదే 211

చదివి = శాస్త్రలన్ని గురువులదగ్గర చదివి; అధర్మభీతిన్ = అధర్మమువలని భయంతో; నృపశాస్త్ర = రాజనీతి శాస్త్ర; విధిజ్ఞతలన్ = అనుశాసనం తెలిసి; వయస్సు డెబ్బదిటికి= ఏబదికి; బాహ్యమునై = పైబడి; అరుజాన్వరూపులై = తనవంశంలో పూర్వమెవరికీ సాంక్రామిక రోగాలు లేనివారుగా; మదము +అరి = గర్వంలేక; రాజు ప్రార్థనన్ = రాజు మిక్కిలిగా అర్థిస్తే; అమాత్యతన్ = మంత్రిత్వాన్ని; కైకొని = అంగీకరించి; తీర్పు = దిద్దితీర్చే; పాఱువారు = బ్రాహ్మణులు; ఒదవినన్ = లభిస్తే; అంగముల్ = రాజు మొదలగు సప్తాంగములు, మిగులన్ = మిక్కిలి; ఊర్జితము = బలిష్ఠం; ఔటకున్ = కావటానికి; పూట = ఒకజాము; చాలదే = చాలదా !

తా॥ మంత్రి లక్షణా లేమంటే; (1) చదివి, (2) అధర్మమంటే భయం కలిగి, (3) రాజధర్మవేత్తయై; (4) వయస్సు 50-70 మధ్య వుండి; (5) వంశపరంపరగా వచ్చే రోగాలు లేనివాడై; (6) రాజు ప్రార్థిస్తేనే అంత బరువైన అమాత్య పదవినంగీకరించగల బ్రాహ్మణోత్తముడు లభిస్తే - సప్తాంగాలు ఒక్క పూటలో పుష్టమౌతాయి.

విశే॥ ఈ పద్యం అప్పాజీకి ఎత్తిన నీరాజనం. అప్పటి కాయన వయస్సు 60-70 సంవత్సరాల ప్రాంతం. రాయలవారి తండ్రికే ఆయన మంత్రి గనుక. అగస్త్య బాల భారతానికి వ్యాఖ్యానం వ్రాసిన పండితుడు తిమ్మరుసు. సకలాగమ పారావారపారీణుడన్న బిరుదు కలవాడు. కనుక చదివినవాడు. రాజు ప్రార్థన - రాయలవారు ప్రార్థిస్తే అమాత్యత కంగీకరించియుంటాడు అప్పటికాయన వయస్సు మళ్లినవాడు గనుక, ఆయన రాజధర్మ విధిజ్ఞత లోకవిదితం. ఆయన సర్వశిరః ప్రధాని, నేటి ప్రధానమంత్రి. ఇతరులు కేవలం మంత్రులు. మంత్రి ఎలాంటి వాడన్న చర్చ భారతం - అర్థశాస్త్రం వంటి చోట్ల దీర్ఘంగా చేయబడింది. అది చూచిన తర్వాత చెప్పబడ్డ విషయం గనుక ఈ పద్యమొక సూత్రం లాగా కుదించి అనంత విషయాన్ని గంభీరంగా చెప్పినది. (వివరాలు చూడు - పీఠిక.)

శాస్త్రరచన పద్యంలోకి పరిణమింపచేసిన ఘనత తిక్కన గారిదే. తరువాత దానికి పట్టాభిషిక్తుడాముక్త కవియే.

వ॥ అట్టి మంత్రి వర్గంబు దొరకదేని 212

పైన చెప్పిన మంత్రిమండలి సమకూడకపోతే.

శా॥ నీతిం దాన తలంచి చేయుఁ బని గానీ కాకపోనీ, బల
వ్రాతార్థాఢ్యత నెమ్మి నుండ కొరుఁ బ్రోవ న్మంత్రి యందుం గుణా
తీతుం, గుమ్మడి కాయ యంత యగుము త్తెంబై మనం బేర్చ, న
ట్లే తానాతని చేతిలో బ్రతుకువాఁడే యౌఁజుమీ మీఁదటన్. 213

నీతిన్ = పాలన సూత్రాన్ని, తాన = తానై (రాజు) తలంచి = ఊహించి, చేయన్ = చేయటం, పని = అవశ్యకర్తవ్యం; కానీ - కాకపోతే = ఆ పని పైనా కాకపోయినా; బలవ్రాతము = చతురంగబలాలు; అర్థం = ధనం; ఆఢ్యతన్ = కలిమిచేత; నెమ్మిన్ = హాయిగా; ఉండక = ఉండకుండా; ఒరున్ = అన్యుని; గుణ+అతీతుడు = తనకంటె మించిన గుణాలు కలవానిని; మంత్రి అంచున్ = మంత్రి అంటూ; ప్రోవన్ = పదవిలో నియమించి పోషిస్తే; గుమ్మడికాయ అంత ముత్తెంబై = జాతీయం, మనంబున్ = మనస్సును; ఏర్చన్ = దహింపగా; అట్లే = అదే రీతిగా; తాను = రాజు, ఆతని చేతిలోన్ = గుణాధిక్యుడయిన మంత్రిచేతిలో; మీదటన్ = ఇక మీదట; బ్రదుకువాడే = బ్రతికే వాడే; ఔన్+చుమీ = ఔనుసుమా.

తా॥ అందరికి తిమ్మరుసు వంటి వారు లభించరు కదా. మరి గతేమిటి ? అంటే రాజు తానై నీతిని ఊహించి అమలు పరచాలి. అంటే తన కంటె గొప్పవాడై వాడు కదా అని ఏవడినో ఒకడిని నియమిస్తే గుమ్మడికాయంత ముత్యాన్ని ధరించినవాడు మోయలేక బాధ పడినట్లు తాను బాధపడక తప్పదు.

అలం : రాజులు మూడు విధాలు.

(1) స్వాయత్త సిద్ధి - తానే నీతిని తలంచి అమలు జరిపెవాడు.

(2) సచివాయత్త సిద్ధి - మంత్రి చెప్పింది చేసేవాడు.

(3) ఉభయాయత్త సిద్ధి - మంత్రి - రాజు కలిసి ఊహించి చేసేవాడు.

రాయలవారీ కోవలోని వారు. ముద్రారాక్షస నాటకంలో రాజు చంద్రగుప్తుడు సచివాయత్త సిద్ధి.
ఈ రెండు పద్యాలు ప్రధాన మంత్రి విషయం.

కం॥ ఒక్క నివిరివికినె దొర
లెక్కండ్ర, నొక్కనొకని వెంబడి ననుఁగు
లెక్కండ్ర నిలువఁ బను లగుఁ;
గక్క సము గుదింపఁ; బెంపఁగాఁ గాకుండున్. 214

ఒక్కని విరివికిన్ = ఒకని కిసరి పడే ఉద్యోగ పరిధిలో; దొరల్ = రాజోద్యోగులు; లెక్కండ్రు+ ఏన్= అనేకమంది అయితే; ఒక్కని ఒకని = ప్రతివాని వెంట ప్రత్యేకించి; అనుగుల్ = వాని చెలిమికాండ్రు; పెక్కండ్రు = అనేకమంది; నిలువన్ = నిలబడితే; పనులు అగున్ = కార్యాలవుతాయి. కుదింపన్ = తక్కువ మందిని నియమించటం; కక్కసము = కష్టము; పెంపగాన్ = పెంచటానికే; కాక+ ఉండన్ = కక్కసముకాకుండునా ?

తా॥ ఒక అధికారి చేసే కార్యపరిధిలో ఎక్కువ మందిని నియమించవలసివస్తే వానికి స్నేహితులైన వారినో, బంధువులనో నియమించు అప్పుడు పనులు సక్రమంగా నెరవేరుతాయి. అలాకాకపోతే సంఖ్యను తగ్గిస్తే - కోశాగారంలో డబ్బులేదని పనులు కావటం కష్టం. సంఖ్యను పెంచావో అదీ కష్టమే. కాబట్టి దేనికైనా మితి వుండాలి తప్ప ''అతి'' పనికిరాదు. సమయాను సారంగా వ్యవహరించాలని అర్థం. లేదా - కాక+ఉండునన్న మాటకు కక్కసముకాకుండునన్న అర్థాన్ని పూర్వవ్యాఖ్యాతలిచ్చిన దానిననుసరించి - సంఖ్యను పెంచటమేనన్న భావం వస్తుంది.

కం॥ ధనముఖ్యము కేవలమే
పనికిఁ రా, దాస్థ గలిగి పలువురు ప్రభువుల్
పని సేయక, తద్వశ్యం
బునకు నలోభాన్నృశంస్యముల్ బుతముఁ జెలుల్. 215

ఆస్థ = శ్రద్ధ; కలిగి = ఉండి; పలువురు = అనేకులైన; ప్రభువులు = అధికారులు; (దొరలు పైపద్యంలోనిది); పనిసేయక = కార్యనిర్వహణకు పూనుకోకపోతే; ఏపనియున్ = ఏదీ; కేవల ధనముఖ్యము = ధనమే కేవలం ముఖ్యంగా ; పనికిరాదు; తత్ = ఆదొరలు; వశ్యంబునకున్ = లోబరచు

తే॥ బాహు జాంఘ్రిజ ముఖ విడంబునకు నయినఁ
గొలిచి మను విప్రధర్మంబు దెలిసి యైన,
బూని సంకటముల నిల్చుఁ గానఁ దఱచు
బ్రాహ్మణునిఁ బ్రభుఁ జేయుట పతికి హితము. 217

బాహుజ = విరాట్పురుషుని బాహువుల నుండి పుట్టిన క్షత్రియులు; అంఘ్రిజ = పాదాల నుండి పుట్టిన వారునాలవజాతివారు, ముఖ = మొదలయిన; విడంబన కున్+ అయినన్ = ఎగతాళికైనా; కొలిచి = సేవించి; మను = బ్రతికే, విప్రధర్మంబు = బ్రాహ్మణధర్మం; తెలిసియైనన్ = తెలిసి ఐనా, పూని = పూనుకొని; సంకటమున్ = రాజునకు వచ్చే విపత్తుల్లో; నిల్చున్ = అండగా ఉంటాడు; కానన్ = కాబట్టి; తఱచున్ = ఎప్పుడూ; బ్రాహ్మణుని = విప్రుని; ప్రభున్ = అధికారిని, చేయుట; పతికి = రాజునకు; హితము = మేలు.

తా॥ బ్రాహ్మణునే అధికారిని చేయటం రాజనీతి, ఎందుకంటే మను ధర్మం తెలిసి యైనా లేదా క్రింది వర్ణాలైన క్షత్రియ-వైశ్యాదులు ఎగతాళి చేస్తారనైనా రాజోపద్రవాల్లో బాసటగావుంటాడు కనుక.

విశే॥ పురుషసూక్తంలో విరాట్పురుషుని ముఖం బ్రాహ్మణుడు కాగా భుజాలనుండి క్షత్రియులు; ఊరువుల నుండి వైశ్యులు పాదాలనుండి నాలవ జాతివారు జన్మించారని వేదం

ఈ వర్ణన సమష్టిమానవజాతి యొక్క మూల భావ వర్ణన.

ఉ॥ ఆయతికాని కీకు మమరాలయ ముఖ్యము, లాతఁ డర్థతృ
ష్ణాయుతుఁడై నిజోర్వి నగునష్టికిఁ దద్ధనముం దొరల్చి, రా
జాయతనంబుఁ జేర్చు; మఱి యట్టిదపథ్యము, కాన నొంటిగాఁ
డే యధికారి గావలయు, నించుక తిన్నను వాడె రూపఱుఁ. 218

అమర+ ఆలయముఖ్యలు = దేవాలయాలు మొదలైనవి; ఆయతికాని కిన్ = ఆ దాయ శాఖాధికారికి; (రెవెన్యూకలెక్టర్) ఈకుము = ఈయవద్దు. అతడు = ఆ అధికారి; అర్థతృష్ణాయుతుడై; అర్థ = ధనం; తృష్ణ = కోరికతో; ఆయుతుడు+ ఐ = సహితుడై; నిజ+ ఉర్వికిన్ = స్వరాష్ట్రానికి; అగు = కలిగే; నష్టికిన్ = నష్టానికి; తత్ = ఆదేవాలయ; ధనమున్ = డబ్బును; దొరల్చి = మరల్చి; రాజ+ ఆయతనము = రాజుబొక్కసానికి; చేర్చున్ = చేరుస్తాడు; మఱి/ అట్టిది/ అపథ్యము = కూడదు; కానన్ = కాబట్టి; ఒంటికాడే = సన్యాసియే; అధికారి = దేవాలయాధికారి; కావలయున్ = కావాలి; ఇంచుక తిన్నను = కొంచెం తిన్నా; వాడే, రూపు+ అఱున్=నశిస్తాడు.

తా॥ ఆయతి కానికి దేవాలయాలపై అధి కారమీయరాదు. ఎందుకంటె అతడు రాజ్యానికి సంభ వించే నష్టానికి ఆధనాన్ని రాజ సౌధానికి - కోశాగారానికి చేరుస్తాడు. మరి అలాంటి పనికూడనిది. కాన ఒంటి గాడినే దానిక ధికారిని చేస్తే కొంచెం తిన్నా వాడే నశిస్తాడు. కోశాగారానికి దైవద్రవ్యం చేరిస్తే రాజ్యం నశిస్తుంది.

విశే॥ ఆయతి కాడు = నేటికల్టెక్టరు దేవాలయాశాఖను వేరు చేసి దాని పైన సన్యాసిని అధికారిని చేయటం మంచిది

ఒంటి కాడు = ఒంటరివాడు - ఏకాకి - ఒంటర్లు - సుంకర్లు. కులాలు ఈ ఇంటి పేర్లున్న వారు నేటికి కాపుకులస్థుల్లో వున్నారు. ఈ ఒంటికాడు దానికి సంబంధించినదా?

ఇది భారత రాజనీతిలో లేదు.రాయలవారి స్వానుభవం నుండి వచ్చిందను కోవాలి.

ఆ యతి కాడువలయు నర,
నాయకునకు వాని కెల్ల నరులుం జేటుం
జేయం దలంతురు - 2-363

తమిళకవి తత్త్వ ప్రకాశుడనే వాడు తిరువారూర్ దేవాలయంలోఅర్చకులు దుర్నీతిపరులు కాగా వెంబా వృత్తాల్లో రాయలవారి కొక లేఖ వ్రాస్తే ప్రభువు దానిని చక్క బెట్టాడట. మరలా కవి అతని ధర్మ సంస్థాపనను కీర్తిస్తూ పద్యాలు వ్రాసిపంపినట్లు చరిత్ర. బహుశా ఇలాంటి అనుభవాల్తో ఈ పద్యం పుట్టి ఉండవచ్చు.

చ॥ మును దనసీమ చేసికొని, ముల్లిడి గుద్దట వెండి చేనిమె
త్తనకయి వేరు వెల్లఁకియుఁ ద్రవ్వెడు కర్షకునట్లు, శత్రుతో
నెనసియు నైన దుర్గబలమే కొని యైన నిజాత్మ చింతలే
క నెగడఁజేసి, లోన మఱి కంటకశోధనఁ జేయు టొప్పగుఁ. 219

మును = ముందుగా, తనసీమ = తనపొలం చేసికొని; ముల్లు = కంచె; ఇడి = పెట్టి; వెండి = తరువాత; చేని = పొలము యొక్క; మెత్తనకున్ + అయి = మెత్తదనం కోసం; గుద్దటన్ = గుద్దలితో, వేరువెల్లకియున్ = వేళ్లు, మోళ్లు; త్రవ్వు +ఎడు = త్రవ్వే; కర్షకున్ = రైతు; అట్లు = వలె; శత్రుతోన్ = పగవానితో; ఎనసియొ+ ఐనన్ = సంధిచేసి కొనియైనా; దుర్గబలమె = వాని దుర్గాలను; బలాలను; కొనియొ+ ఐనన్ = జయించి అయినా, నిజ+ ఆత్మన్ = తనమనస్సులో; చింత = దిగులు; లేక = లేకుండా; నెగ ఉన్+చేసి = వృద్ధి పొందించు కొని; మఱి = ఆ తరువాత; లోనన్ = స్వరాష్ట్రంలో; కంటకశోధనన్ = ముండ్ల (అంత శ్శత్రువులను) ఏరివేయటం; చేయుటః చేయుటం; ఒప్పు = మంచిదా; అగున్ = ఔను.

తా॥ కర్షకుడు ఏవిధంగా ముందుగా ఇది నాదను కొని చుట్టూ కంచెనాటి తర్వాత చేను పదును కోసం గుద్దలితో వేరు - వెల్లకి త్రవ్వినట్లుగా రాజుకూడా సరిహద్దు రాజు బలవంతుడైతే సంధి చేసి కొని, వాడుబలహీనుడైతే వాని దుర్గసేనలను ఖయించి మనస్సులో చింత పోగొట్టు కోవాలి. ఆతర్వాత తన రాజ్యంలో శత్రువులెవరో (గూఢచర్యంద్వారా) తెలిసి కొని త్రవ్వి పార వేయాలి.

అలం : ఉపమ.

ఉపమేయం :- రాజు - రాజ్యం-గడిసీమ (సరిహద్దు) కంటకులు. ఉపమానం :- కర్షకుడు - పొలం -

కంచె - వేరు వెల్లంకి. కర్షకజీవనం నుండి తెచ్చిన అందమైన సా దృశ్యం. 'వేరూ-వెల్లంకి' జాతీయం. 'నగా నట్రా' లాగ. వెల్లంకి ఒక తీగ.

కం॥ మొదలనె యొరుదలకానిం
జెదరంగా నీడ కాత్మఁజింతింపు; పదిం
బదిగ, మృష యేని మఱి విడు
ముదస్తుఁగాఁక యుండ నొక్క మతమునన్. 220

మొదలనె = ముందుగానే; ఒరుదల కానిన్ = కొండె కానిని; ( ఒరు = మరొక, తలకాడు = తల దగ్గరచేరే వాడు) చెదరంగా = చెదరి పోయేటట్లు; ఆడన్ = ఏమీ అనక; పదిం+బదిగ = పదికిపదిసార్లు(వందసార్లు) చింతింపుము = తలంపుము(వాడు చెప్పిన దానిని గురించి) మృష+ ఏనిన్ = అబద్ధమైతే; మఱి = ఇక; ఒక్కమతమునన్ = ఒక దృష్టితో; ఉదస్తుగాన్ +కాక = ఉద్యోగం పోయిన వానినిగా చేయకుండా; ఉండన్ = ఉండేటట్లు; విడుము = విడిచిపెట్టుము.

తా॥ కొండె కాండ్రుంటారు వారు చెప్పిన దంతావిని వెంటనే అమలుపరచకు ఒక వేళ అబద్ధమైతే విన్నదంతా చెప్పినవానిని ఉద్యోగంనుండి తొలగించకు. వాని నుండనివ్వు. ఒక పక్షంగా వాడూ పనికి వస్తాడు

చూ॥ మధురానగర రాజ వర్ణన - 2-40.

'ఒరుం డొరు తలన్ వినిపించిన మాట డెందముం జెంద ముదంబు దక్కిచెడఁ జేయ డొరున్.' ఇదే విషయం ప్రస్తుత రాజనీతి సూత్రంగా వచ్చింది. ఇది రాయల వారి రాజనీతి. ఇదే పై పద్యంలోని కంటకశోధన.

కం॥ ధరణి నసాధ్యనగాటవు
లిరవుగ భూపీడ సేయు నెఱుకుల పొరుగూ
ళ్ళెరవగు నస్థితి శూరుల
కెరవుగ నిచ్చునది. మిథము నెట్లయి నురున్. 221

ధరణిన్ = రాష్ట్రంలో; అసాధ్య = సాధించటానికి వీలు లేని; నగ = కొండలు; అటవులు = అడవులు; ఇరవుగన్ = నెలవుగా చేసికొని; భూపీడ = రాష్ట్ర ఉపద్రవం; చేయన్ = చేసే; పొరుగు+ ఊళ్లు = ప్రక్క సరిహద్దుగ్రామాలను; అస్థితి = స్థితిలేని; ( ఆస్తి పాస్తులు లేని) శూరులకున్ = శౌర్యం కలవారికి; ఎరవుగాన్ = జీవ నోపాధిగా; ఇచ్చునది = ఇవ్వాలి; ( ఆదేశించటం) మిధము= రెండూ; (ఎరుకులు+శూరులు) ఎట్లు+అయినన్ = ఎలా అయినా (వారిలో ఎవరునశించినా లేక ఇద్దరునశించినా) ఉరున్ = మంచిదే.

తా॥ దేశంలో అసాధ్యమైన కొండలు-అడవులూ నివాసం గ చేసి కొని ఎరుకులు రాష్ట్రానికి ఉప ద్రవము కలిగిస్తారు. వారికి పొరుగునున్న ఊళ్లను స్థితిలేని శూరులకు పాలికి ఇవ్వు. ఇద్దరిలో ఎవరు ఎట్లా అయినా మంచిదే.

విశే॥ నాగనా-నేడూ అడవులు నివాసంగా చేసికొని గజ దొంగలు భూపీడ చేయుటం కద్దు. అదే ... ప్రస్తావితం. రాజనీతి రహస్యమేమంటే ఎక్కడా నిలకడ లేని శూరులకు ఆ అడవులకు ... గ్రామాలపై ఆధిపత్యమిస్తే వారికి ఆధారం చూపినట్లా అవుతుంది. ఎలుకుల పీడా ...ట్లా ఉంటుంది

... ప్రతాపరుద్రగజపతి కొడుకు వీరభద్రగజపతి. అతడు కొండవీటికి పాలకుడు. కొండవీటిని ... ప్రాణాంతో బంధించి తెచ్చి మలయబెన్నూరు సీమకు అధిపతిని చేసినట్లు చరిత్ర. ... అదే విషయం ఈ రాజనీతిసూత్రానికి నేపథ్యం కావచ్చు. (చూ.2వ ఆశ్వాసాంత పద్యం)

ఉ॥ విశేషించియు నప్పార్వతీయబలంబు లోనం గుడుకున్న రాజు నకు బ్రజాబాధ దఱుఁగ దెట్లేని ... వారలం జేకూర్చు కొనవలయు; నవిశ్వాసంబును విశ్వాసంబును, నలుకయు నెలమియు, నతివైరంబును, నత్యానుకూల్యంబును, నల్పులగుట నల్పంబునన యగు : నెట్లంవేని. 222

...షించియున్ = ప్రధానంగా, ఆపార్వతాయబలంబు = పర్వతవాసులైన గుంపు; లోనన్ = తనబలంలో; ...యున్న = కలియకపోతే; ప్రజాబాధ = ప్రజలు బాధ; పీడ; అవిశ్వాసం = నమ్మకం లేక పోవటం; ... కోపం, ఎలమి = సంతోషం; అతివైరము= ఎక్కువ పగ; అతి+ ఆనుకూల్యము = మిక్కిలి ..., అల్పము = తేలిక

...పాయిలు కనుక శత్రుత్వం మిత్రత్వాదులు తేలికగా వారికి కల్గటం వారిని లోబరుచు ... చేసిన

సీ॥ విల్లుం దానును భిల్లుడొక్కఁ డరుగ, న్విం దింట దుగ్ధాన్నముం
భిల్లుం డన్యుడు పెట్ట; నారయుడుక న్వీక్షించి, దొబ్బంచు వాఁ
డెల్ల న్వమ్ముగఁ జేసి, తన్ననుప రా, నెందేఁ దెగం జూడఁగా
నుల్లంబై 'చననంపు నార చెడు' నా, నూహించి పోనంపడే ! 223

... భిల్లుడు = ఒక అటవికుడు; విల్లున్ = విల్లూ; తానూ అరుగన్ = పోగా; అన్యుండు = మరొక, ... = ..., ఇంటన్ = తన ఇంట్లో; విందున్ = అతిథి భోజనం; దుగ్ధాన్నమున్ = (పాల ...) ..., పెట్టన్ = పెట్టగా; నార+ ఉడుకన్ = పొయ్యి మీద గోగునార ఉడుకుతుండగా; ... అతిథిగా వచ్చిన ఆ భిల్లుడు చూచి; దొబ్బ+అంచున్ = (అది) మాంసమనుకొని; వాడు = ... భిల్లుడు; ఎల్లన్ = ఆతిథ్యమంతా; వమ్ముగన్=వ్యర్థంగా; చేసి = భావించి; తన్నున్ = ... = (భోజనం పెట్టిన మిత్రుడు) పంపించగాటానికై వెంటరాగా; ఎందేన్ = ఏదో ఒక ... చూడన్ = చంపాలని, ఉల్లంబై = మనస్సులో భావించి; చనన్ = పోగా; అంపు = పంపుము; ... = నార చెడి పోతుందంటే; ఊహించి = తలంచి; పోన్+అంపడే = పంపించడా ?

తా॥ ఒక అటవికుడు విల్లుతో పాటుగా మరొక భిల్లునింటికి చుట్టపు చూపుగా పోతే, వాడు సంతోషించి పరమాన్నం పెట్టాడు పొయ్యి మీద నార ఉడుకుతూ తెర్లుతూంది. అది ఎర్రగా ఉంది. అది మాంసమను కొని ''అరే ! వీడు తన కోసం మాంసం వండుకొంటూ నాకు పరమాన్నం పెడతాడా ? అని అతిథి మర్యాదనుల్లంఘించి మైత్రిని పోనాడి ప్రయాణమైనాడు. విందిచ్చిన మిత్రుడు తోడుగా కొంత దూరం రాగా దారిలో వానిని చంపాలనుకొన్నాడు. ధానుష్కుడైన భిల్లుడు. వాడన్నాడు ''దిగబడతానయ్యా పొయ్యి మీద నార పెట్టి వచ్చాను. అది చెడిపోతుంది కనుక పంపించు'' అనగా వాడది విని ''ఓహో ! అది దొబ్బకాదా . నారా. సరే. పోయిరా'' అన్నాడు.

విశే॥ ఇంత భావాన్ని ఆ పద్యం బస్తాలో కుక్కేసరికి ఛందస్సు పిగిలి పోయింది. ఇది పార్వతీయుల మనస్సు తేలికదనానికి ఉదాహరణంగా చెప్పింది. విల్లూ తనూ వెళ్లటం- ఈ పలుకుబడి లక్ష్యార్థ పరిధిలోనిది. విల్లు వెళ్ళింది - అంటే అజహల్లక్షణ. విల్లు దాల్చినవాడన్న అర్థం లక్ష్యార్థంలో ఆ ప్రయోగం ప్రౌఢం ''ఉలుపాల్ పట్టిన యిండ్లు''-4.36 లో ఇండ్లలోని గృహస్థులు అని అర్థం. ఇది జహల్లక్షణ.

కం॥ ఆ పాలకూటనే నిజ
మే పాటియుఁ దప్ప రాడిరే; నెరసునఁగొం
తేపాటి గన్న నలుగుదు;
రీపని యెం తనక వెడఁగుటెద నాటవికుల్. 224

ఆటవికుల్ = అడవిలో నివసించేవారు; పెడఁగు+ఎదన్ = మందబుద్ధి వల్ల (అల్పబుద్ధితో) ఆ పాలకూటినే = ఆ దుర్గాన్నంతోనే; ఆడిరేన్ = మాట ఇస్తే; నిజము= సత్యము; ఏపాటియున్ = ఏ మాత్రమూ; తప్పరు = ఉల్లంఘించరు; ఏపాటి = ఏ కొంచెం పాటి; నెరసునన్ = దోషంతో; కన్నన్ = చూచినా; ఈ పని = ఈ విషయం; ఎంత+అనక = ఎంతటిది వెన్నునక; అలుగుదురు= కోపగిస్తారు.

తా॥ వారి బుద్ధులు స్వల్ప ఉద్రేకాలకే లోబడి పోతాయి. ఆ పాలబువ్వతోటే ఏ మాత్రం మాట ఇచ్చినా తప్పరు ఏ మాత్రం నెరసు కన్పించినా క్షమించరు ఇదెంత విషయం. స్వల్పమే కదా అని అనుకోరు - తెగజూస్తారు.

ఈ మూడు వాక్యాలూ అటవికులకు సంబంధించినవి. అటవికులు లోబడక పోతే పాలన కష్టమని తాత్పర్యం.

తే॥ ఆటవికవశ్యకలన సత్యమున, వైరి
మనుజపతిమైత్రి, దూత సమ్మానమునను,
గూర్మి దటి భృతిఁ గాల్బురకును, సపారి
తోషికపు సేవ నెలమి రౌతులకుఁ గలుగు. 225

సత్యమునన్ = నిజం చెప్పటం వల్లనే; ఆటవిక = చెంచులు మొదలైన ఆటవికులను; వశ్యకలన = వశం

చేసికోవటం; (2) వైరిమనుజపతి = శత్రువైనరాజు; మైత్రి = స్నేహం; దూతసమ్మానమునను = దూతను సమ్మానించటం వల్లనే; (3) కొల్వురకును = కొల్చలం వారికి; తఱి = సమయాని కిచ్చే; భృతిన్ = జీతంతోనే; కూర్మి = ప్రేమ (4) రౌతులకున్ = అశ్వికులకు; సపారితోషికపు సేవన్ = బహుమానంతో కూడిన పోషణనే; ఎలగున్ = సంతోషం, కలుగున్ = కల్గును. ఇది నాల్గు వాక్యాలకు అన్వయించుకోవాలి.

తా॥ ఆటవికులను వశం చేసుకోవడానికి సత్యమేసాధనం. శత్రురాజు స్నేహం అతని దూతను సమ్మానించటం వల్లనే సాధ్యం = సమయానికి పదాతులకు జీతమివ్వటం వల్ల వారి కూర్మిని పొందవచ్చు. అశ్వికులకు వారి జీతాలతో బాటు పారితోషికాలిస్తే ప్రేమతో రాజును సేవిస్తారు.

విశే॥ విదేశ రాయబారులను రాయలు ప్రేమతో ఆదరిస్తాడని పేయస్ సాక్ష్యమిస్తున్నాడు.

కం॥ మేలగు ఘోటకమును శుం
డాలంబును నాప్త సుభటునకె యిమ్ము; తఱి
న్మే లగు మేపున మందురఁ
బాలింపుము; దొరలపాలు పఱుపకు మెపుడున్. 226

ఆప్తభటునకు = నీ హితం కోరే శూరునకే; మేలు+అగు = ఉత్తమజాతిదైన; శుండాలంబును = ఏనుగును; ఘోటకమున్ = గుర్రాన్ని; ఇమ్ము = ఇవ్వు; తఱిన్ = వేళకు; మెలపునన్ = నేర్పుతో; మందురన్ = అశ్వశాలను; పాలింపుము = ఏలుకో; దొరలపాలు = రాజోద్యోగుల వశం; పఱపకు= చేయకు.

తా॥ ఉత్తను గజాశ్వాలను ఆప్తుడైన శూరునకే అప్పచెప్పు. నేర్పుతో తబేలాను కాపాడుకో. వాటిని రాజోద్యోగులకు అప్పగించకు.

విశే॥ గజాశ్వబలాధిపత్యం వల్ల రాజునకెదురు తిరుగవచ్చు. లేదా ఉపద్రవాలను కలిగించవచ్చు. లేదా అంతశ్శత్రువులు కావచ్చు. కనుక రాజాధీనంలోనో ఆప్త శూరాధీనంలోనో ఉండాలి. ఇది గజాశ్వసేనాధిపత్య విషయం.

తే॥ కార్య మొక్కఁడు గనిన మాత్సర్యమున నొ
కండు గాదని ఖండించుఁ; గన్నెఱింగి,
యిరువురను గా దనక కొల్వు విరిసి, మీఁద
నల్లవాఁ డెన్నినది సేయ నగు శుభంబు. 227

ఒక్కఁడు = ఒకడు; కార్యము = యంత్రాంగం; కనినన్ = చెప్పినంత; మాత్సర్యమునన్ = అసూయతో; ఒకండు = మరొకడు; కాదు+అని = ఇది తప్పని; ఖండించున్ = దోషనిరూపణం చేస్తాడు; కన్ను = రహస్యం, ఎఱింగి = తెలిసి; ఇరువురన్ = ఇద్దరి మాటలను; కాదు+అనక; కొల్వు = సభను; విరిసి = ముగింపచేసి; మీదన్ = ఆ తర్వాత; అల్లవాడు = ఆ మొదటివాడు; ఎన్నినది = ఎంచినది; చేయన్ = చేస్తే; శుభంబు+అగున్ = మేలు అవుతుంది.

తా॥ రాజ్యాంగమంత్రాలోచన వేళ సభలో ఒకడు ఒక ఉపాయం చెప్పగా మరొకడు మాత్సర్యంతో దాన్ని ఖండిస్తాడు. అది మాత్సర్యము పలుకని తెలిసినా ఇద్దరినీ కాదన కుండా సభానంతరం ఆలోచించి మొదటివాడు చెప్పిందే చేయటం శుభావహం ॥ (ఖండించుకన్ను = తప్పెన్నేరహస్యం అనీ చెప్పవచ్చు.)

కం ॥ పగ వెలిఁగొని, లో దస్యులఁ
జిగిరింపఁగఁ జేసి, నృపతి చిక్కువడఁబను
ల్దెగి సేయక, తారే ది
క్కుగ, నడతు రశంక నల్లుకొని, దుస్సచివుల్. 228

దుస్సచివుల్ = చెడ్డమంత్రులు; వెలిన్ = బయట; (స్వదేశంబయట) పగన్ = పగతుని; కొని = అంగీకరించి; లోన్ = స్వరాష్ట్రంలో; దస్యులన్ = దొంగలను; చిగురింపగచేసి = అంకురింపగచేసి; నృపతి = రాజు, చిక్కుపడన్ = చిక్కుల్లో పడితే; పనుల్ = మంత్రాంగాన్ని; తెగి = విజృంభించి; చేయకుండ; తారే = తామే దిక్కుగన్ = ఆశ్రయంగా; అశంకన్ = నిర్భయంగా; అల్లుకొని = అంతటా తామే అయి; నడుతురు = ప్రవర్తిస్తారు.

తా॥ దుష్టమంత్రులుంటారు. వారు సరిహద్దు రాజులతో మంతనాలాడి తమ రాజునకు శత్రువులను చేసి రాష్ట్రంలో దొంగలను - దొంగతనాలను అల్లర్లను అంగీకరింపచేసి తామే శరణ్యమంటూ అన్నిటా వుంటూ రాజకార్యాలు చేయరు.

విశే॥ ఈ అల్లర్లను సృష్టించటం నేటికీ సత్యమే.

కం॥ ఇప్పింతు రాత్మ పశులకుఁ
దప్పింతురు పరుల, కాడి తప్పింతురు, రా
జి ప్పగిది వాఁడె' యని వే
చెప్పినఁ బెఱవారు నమ్మి చేరక యుండన్. 229

(రాజుచేత) ఆత్మవశులకున్ = తమకు లోబడి ప్రవర్తించేవారికి; ఇప్పింతురు = ఆయాపదవులను ఇప్పిస్తారు; పరులకున్ = ఇతరులకు, తప్పింతురు = ఇప్పించరు; ఆర్చి = త్రిప్పిత్రిప్పి; తప్పింతురు= పదవినుండి తప్పిస్తారు; రాజు, ఈపగిదివాడే = ఇలాంటి వాడే; అని వే = వెంటనే; చెప్పినన్ = చెప్పగా; పెరవారు = ఇతరులు; నమ్మి = విశ్వసించి; చేరకయుండన్ = చేరకుండా ఉండగా.

తా ॥ తమవారికి రాజుగారితో ఉద్యోగాలిప్పించి ఇతరులకే మో్త్రిప్పిత్రిప్పి ఇప్పించ కుండా చేసి రాజు ఇలాంటి వాడే నయ్యా అని పదవులు రానివారిని తమవైపున కాకర్షించి రాజునందు విరోధం కల్పిస్తారు.

విశే॥ (1) దుర్మంత్రులు కుటిల వాక్యములకు లోను గాక. శాంతి. 2-285.

(2) కలహము తెచ్చుట, ప్రమాదగతి, ఉద్ధతి --''

అని మంత్రుల సప్తవ్యసనాలను 'కామందకం' వివరించింది. కాని రాయల వారు దుస్సచివుల

చేష్టావర్ణన చేయుటం అనుభవ సారమేననకతీరదు. ఇది ప్రయోగసరళి.అది శాస్త్రసరణి. భారతం తావన్మాత్రమే చెప్పింది.

ఆ॥వె॥ వాఁడిఁ బొదలు జఠర దైశ్వానరుఁడు గఫ
ప్రముఖ దోషయుక్తి బలిమి చెడిన
వెలి మహౌషదంబు బల మిచ్చుగతిఁ, బ్రతి
సేయు, వారి మదముఁ జెఱుచుఁ బరుఁడు. 230

వాడిన్ = తీవ్రంగా, పొదలు = అభివృద్ధి పొందే; జఠరవైశ్వానరుడు = జఠరాగ్ని; కఫ = కఫము (శ్లేష్మము) ప్రముఖ = మొదలైన; దోషయుక్తిన్ = అనారోగ్యకారణంగా, బలిమి = బలం; చెడినన్= కోల్పోతే; వెలి = బయట, మహా+ ఔషధంబు = గొప్పమందు; బలము = జఠరాగ్ని కిబలము; ఇచ్చుగతిన్ = ఇచ్చేరీతిగా; ప్రతి = ప్రతిగామరొకని; చేయన్ = పదవిలో నియమిస్తే; ఆసమర్ధుడైన ఇతరుడు, వారి = దుస్సచివుల మదమున్ = గర్వాన్ని; చెఱుచున్ = చెడగొట్టగలడు

తా॥ తీవ్రంగా ప్రజ్వలించే జఠరాగ్ని కఫాధి దోషాల వల్ల బలహీన పడితే ఔషధం బయట నుండి సేవించి జఠరాగ్నిని పెంపొందింప చేసి కొంటున్నట్లు సమర్ధుడైన బయట వానిని తెచ్చి వారికి ప్రతిగా పెట్టు. వాడే వారి కోరలను పీకేస్తాడు.

అలం : ఉపమ

విశే॥ ఇది వైద్య శాస్త్రాధారంగా కల్పించ బడిన ఉపమ. ఎందుకీ ఉపమ తేవాలి అంటే చూ 4-270.

వ॥ వారి మిగిలి ప్రతి సేయ నెట్లంబేని. 231

మిగిలి = అతిక్రమించి; ప్రతిసేయన్ = ఎదురు తీర్చుట; ఎట్లు+అంటె+(వి) ఏనిన్ = ఎలా గంటే

కం॥ భండారముతో హయమద
శుండాల ఘటాళి దనదు సొమ్మై పాగా
నుండిన నాతడ వాయదె
పండితుఁడును బిరుదునైన పతికిని బయలై. 232

భండారముతో = కోశాగారముతోబాటుగా; హయ = గుర్రం; మదశుండాల = మదగజ; ఘటాళి= సమూహం; తన దు = తన యొక్క; సొమ్మై = వశమై; పాగాన్ = అశ్వశాలలో; (తబేలా) ఉండినన్ = ఉంటే; ఆడ = ఆపద; పండి తుడునున్ = రాజనీతి వేత్త; బిరుదును = వీరుడునునైన; పతికిన్ = రాజునకు; బయలు+ఐ = వెలిదై; పాయదె= విచ్చిపోదే.

తా॥ రాజనీతి వేత్త, మహావీరుడునైన రాజు స్వాధీనం లో కోశాగారం- చతురంగబలాలుండాలి. ఉంటే దుస్సచివుల ఆట కట్టు.

విశే॥ ఈ ప్రతి నిధానం భారతం లోనూ - కామందకంలో నూ కన్పించనందున ఇది రాయల స్వానుభవమను కోవాలి.

పైపద్యంలో ఇక ఉపాయం ఈ పద్యంలో మరొక వుపాయంతో ఆదుస్సచివుల ఆటకట్టు

కం॥ కడుపున నొక కడి దఱిఁగినఁ
జెడఁ జూచుటె కాక పతికిఁ జెలియుం గలఁడే ?
యి డనని విడువంజెల్లునె?
నడప వలయు నేర్చినట్లు నమ్మకయె కృపఁ. 233

కడుపునన్ = కడుపులోనికి; ఒక కడి = ఒక ముద్ద; తఱిగినన్ = తరిగితేచాలు; చెడన్ చూచుటె కాక = చెడిపోయేటట్లు ప్రయత్నించటమే గాక; పతికిన్= రాజునకు; చెలియున్ = స్నేహితుడు; కలడే = ఉన్నాడా? ఇడను = ఇవ్వను (వాడునాకు చెలికాడు కాడని) అని+విడువన్ = త్యజించటానికి; చెల్లునే = కుదురుతుందా? నమ్మకయె = నమ్మకుండానే; కృపన్ = దయతో; నేర్చినట్లు = తన కు తెలిసినట్లు; నడపవలయున్ = మంత్రాంగాన్ని ప్రవర్తించేయాలి

తా॥ కడుపు న కొక ముద్ద తరిగితే రాజును చెరపాలనే వాడేతప్ప రాజునకు చెలికాడు లేడు. అని చెప్పివిడచి పుచ్చనూరాదు. నేర్చినట్లు నడుపుకుపోవటమమే కర్తవ్యం.' ''ఇడనని విడువంజెల్లునె!'' వావిళ్ల పాఠం. పాఠాంతరాన్ని వారూ సూచించలేదు.వేదంప్రతి పాఠాంతరంగా ''యొుడిదండవి డువఁ జెల్లునె?'' ప్రక్కనే యుండి చేతిని విడిచిపుచ్చ వచ్చునా అని అర్థం చూపింది కానీ వావిళ్ల పాఠంలో వున్న సులభాన్వయం ఇక్కడ లేదు.

చ॥ ఒకటికి రొయకుంటఁగను మున్నవియుం, ద్రుపదుండు మారణే
ష్టికిఁ బసిఁ జూపి వేఁడ మునిసింహుఁ డొకండు తమన్న వేల్చుఁ? బం
• డొకఁ డపవిత్ర భూమిఁగని యొల్లక యేఁజన దా గ్రహించె రో
యకనియెఁ ; దాన నట్లె ఱుఁగ నొఁ జను, సర్వముఁగాన శక్యమే ! 234

ఒకటికిన్ = ఒకదానికి; రోయక = అసహ్యపడక; ఉంటన్ = ఉండటం వల్ల; ఉన్నవియున్ = మిగిలినవి; కనువు = చూడువు; ద్రుపదుడు = ద్రౌపది తండ్రి. మారణ+ ఇష్టికిన్ = సంహారం కోసం చేసేయజ్ఞమునకు; పసిన్ = పశువులను; చూపి = చూపించి (దక్షిణ గా ఇస్తానని) వేడన్= ప్రార్థిస్తే; ముని సింహుండు ఒకండు = ఒక మునిశ్రేష్ఠుడు; తమ+ అన్న = తన అన్నయైన యాజుడు; వేల్చున్ = హోమం చేయగలడు; (ఎందుకంటే) అపవిత్ర భూమిన్ = పవిత్రంకాని నేలపై, ఒకపండున్ , కని = చూచి; ఒల్లక = అంగీకరించక, ఏన్ = ఏను; (మునిసింహుడు) చనన్ = పోతే; తాన్ = మా అన్న; గ్రహించెన్ = తీసికొన్నాడు; రోయన్ = ఏ వగొంచు కోక; అనియెన్ అన్నాడు; తానన్ = దాని తో- ఈ ఉదాహరణవలన; అట్లు+ ఎఱుగన్ + ఔన్+చుమి = అలాతెలుసు కోవాలిసుమా, సర్వమున్ = అన్నిటిని, కానన్ = చూడటానికి, శక్యమే = సాధ్యమా.

తా॥ రాజు సర్వమూ తానై చూచి సత్యా సత్యనిర్ధారణ చేయలేడు గనుక ఒక దానిని అసహ్యించుకోక ఒకడు గ్రహిస్తే దాన్ని బట్టే వాడి సర్వస్వాన్ని గ్రహించ వచ్చు ఎలాగంటే - ద్రుపదుడు ఒక సంహారయజ్ఞం చేయటానికి ప్రయత్నించి ఒక ముని శ్రేష్ఠునికి ఒక లక్ష గోవులనిస్తానని చెప్పి యజ్ఞం చేయించమంటే - అతడన్నాడు. ''దీనికి మా అన్నతగును ఎందుకంటే మేమిద్దరం ప్రయాణం చేస్తూండగా దారిలో ఒక పండు కన్పిస్తే అది అపవిత్ర భూమి అని గ్రహించకుండా నేనువెళితే వాడు తీసుకొన్నాడు. కనుక నీకతడే పనికి వస్తా''డన్నాడు

చూ. ఈ కథకోసం చూడు భారతం ఆదిపర్వం సప్తమాశ్వాసం. ద్రుపదుడు ద్రోణాచార్యుని చంపటానికి కావలసిన కుమారుని కనటానికి ఒక యజ్ఞం చేయించమని ఉపయాజుని కోరగా అతడా పండు కథ చెప్పి తమ అన్న యాజుడు నీకీ యజ్ఞం చేయిస్తాడని చెప్పిన కథ ఇక్కడ రాజనీతి కన్వయింప బడటం విశేషం

అలం : అర్థాంతరన్యాసం.

కం॥ వీఁ డెడరునఁ గీ డెన్నిన
వాఁడని, జయ మైన, హింస వదలి కొనుము శ్రీ
పోఁడి; మహి యేమి గొఱ బ
ల్వాఁడి సెడిన, నట్టి దయకు వైరియు నమ్మన్. 235

వీడు = ఈ రాజు; ఎడరునన్ = ఆపదలో (నాకు) కీడు+ ఎన్నినవాడు+అన్ని = కీడుతల పెట్టినాడని; జయము+ ఐనన్ = వాడితో చేసిన యుద్ధంలో గెలుపుకలిగినాక; హింస = క్రౌర్యం; వదలి = విడిచి; శ్రీపోడి(మిన్) = అఖిలైశ్వర్యాన్ని, కొనుము = తీసుకో; చెడినన్ = నశిస్తే; ఏమి+కొఱ = ఏమిచేస్తుంది?; అట్టిదయకు = అలాంటి కృపకు; వైరియున్ = అలాంటి శత్రువు; నమ్మన్ = నిన్నువిశ్వసిస్తాడు.

తా ॥ వాడు నా కాపదసమయంలో కీడు తలపెట్టి నాడని నీకు చేజిక్కినపుడు దయతో విడిచిపెట్టు, వాడి సంపదనంతా తీసుకో అప్పుడు వాడు కోరలు పీకిన పాములాగా ఏమీ చేయలేక పోగా నీదయను విశ్వసించి నిన్నాశ్రయించి జీవిస్తాడు.

అలం : దృష్టాంతం పగవానిసంపద - పాము కోరకూబింబప్రతి బింబభావం.

తే॥ దేశ వైశాల్య మర్థ సిద్ధికిని మూల,
మిల యొకింతైన, గుంటకాల్వలు రచించి,
నయము పేదకు, నరిఁగోరునను, నొసంగి,
ప్రబల జేసిన నర్థధర్మములు పెరుఁగు. 236

దేశవైశాల్యము = రాష్ట్రవిస్తృతి; అర్థసిద్ధికినిన్ = ఐశ్వర్యానికి; మూలము = ఆశ్రయము; ఇలా= భూమి; ఒక+ ఇంత+ ఐనన్ = ఒక కొంచెమైతే; గుంట, కాల్వలు = చెరువులు; కాల్వలు-రచించి= త్రవ్వించి;

పేదకున్ = పేదరైతుకు; అరిన్ = డబ్బురూపంతో చెల్లించే పన్నులో; కోరునన్ = పంట రూపంలో చెల్లించే పన్నులో; నయమున్ = సౌలభ్యాన్ని; ఒసంగి = ఇచ్చి; ప్రబలన్ చేసినన్= వృద్ధిచేస్తే; అర్థధర్మములు= ధర్మార్థాలు రెండూ; పెరుగున్ = వృద్ధికా గలవు.

తా ॥ రాష్ట్ర విస్తృతి అర్థానికి మూలం. ఒకవేళ రాజ్యం చిన్నదైతే చెరువులూ, కాల్వలూ త్రవ్వించి పేదరైతుకు పన్నులభారం తగ్గిస్తే ధర్మానికిధర్మం- అర్థాని కర్థం లభిస్తాయి.

విశే॥ రాయలవారు తుంగభద్రపై అడ్డుకట్టలు కట్టించి కాల్వలు త్రవించినట్లు చెరువులు నిర్మించినట్లు చరిత్ర. నేటికీ అవి వ్యవసాయానికి ఉపయోగపడు తూనే ఉన్నాయి. రైతుకు పన్నుల భారం తగ్గించటం పరిపాలనలో ముఖ్యాంశం.

తే॥ ప్రజ నవసి చిన్నఁ బిలువ, కప్పసులఁ గొలుచు
నమ్మి, యిండ్లింధనంబుల కాయె, ననెడు
కలని నక్కైన యధికారి గల నృపతికి
నేడు దీవులు గొన్న సమృద్ధి లేదు. 237

ప్రజ = ప్రజలు; నపసి = క్షీణించి; చన్నన్ = గామాలు వదలిపోగా; పిలువక = వెనుకకు పిలువక; ఆపసులన్ = వారి పశువులను; కొలుచున్ = పంటను; అమ్మ = విక్రయించి; ఇండ్లు । ఇంధనంబులకున్ = కట్టెలకు; ఆయెన్ = ఐనవి కదా; అనెడు = అని సంతసించే; కలనినక్క = యుద్ధంలో నక్క; ఐనట్టి; అధికారి కలనృపతికిన్ = ఆదాయాధి కారికల రాజునకు; ఏడు దీవులన్= సప్తలోకాన్నీ; కొన్నన్ = పొందినా; సమృద్ధి = ఐశ్వర్యం; లేదు = చాలదు.

తా ॥ ప్రజలు పన్నులభార మెక్కువై ఊళ్లువదిలిపెట్టి వెళ్తే వెనుకకు పిలిచి పన్నులు తగ్గించి భూమి ఇవ్వాలి. తప్ప వాడు వదలి పెట్టిన పశువులూ-పంటలూ అమ్మి వాళ్ల ఇండ్లు పడ గొట్టి ఇంధనానికి వాడుకో వచ్చునని సంతోషించే అధికారి ఏ రాజు కుంటాడో ఆరాజుకు ఏడు దీవులు కల విశాల ప్రపంచం లభించినా తృప్తి ఉండదు.

అలం : లోకోక్తి

విశే॥ కలనినక్క = యుద్ధంలో అందరి చావు కనిపెట్టుకొని ఆహారం కోసం ఎదురుచూచేనక్క

1512లో 'క్రొత్త చెరు' వన్న గ్రామంలో అధికారి పన్ను లెక్కువ వసూలు చేయగా తెలిసిన రాయలు రద్దుచేసినట్లు శాసనమున్నది. శ్రీమూష్ణమన్న గ్రామం పన్నులొత్తిడికి నిర్మానుష్యం కాగా రాయలవారు 1513లో చిన్నప్ప నాయకుని పంపి పన్నులు రద్దు చేసి ప్రజలను వెన్కకు పిలిపించి నట్లు చరిత్ర.

మ.స్ర. ఉరవేచాగంబు భోగం బుభయము నొక పాలుగ్రసేనా వనార్థం
బిరువా ల్పిండారు బండారిలు చొర నొక పాలిట్లుగా నాయ మొప్పం,
జర దృష్టిన్ వైరి పక్షేక్షణము సచివపక్షస్వపక్షేణంబుం
ధరణీ నాథుం డొనర్పం దగుఁ, దగుఁ దునుమం దస్కరాళి న్ని జోర్విన్. 238

ధరణీ నాధుడు = రాజు; ఆయము = ఆదాయము; ఉరవౌ = గొప్పదైన; చాగంబు = త్యాగ; భోగంబు = స్వభోగల; ఉభయము = రెండింటికి; ఒకపాలు = నాల్గోభాగం; ఉగ్ర = భయంకరమైన, సేవ+ అవన+ అర్థము = సేనారక్షణకు, ఆరుపాలు = రెండుపాళ్లు; నిండారు = నిండుగావుంటే; బండారు ఇలు = భాండాగారం; చొరన్ = ప్రవేశించటానికి; ఒక పాలు = ఒకభాగం; ఇట్లుగాన్ = ఈ విధంగా; ఒప్పన్ = అందగించగా; వైరిపక్ష = శత్రుపక్షం మీద; ఈ క్షణము = దృష్టి; చరదృష్టిన్= చారులన్న దృష్టిద్వారా; సచివ= మంత్రులు; షష్ఠ స్వపక్ష+ ఈ క్షణంబునన్ = స్వపక్ష దృష్టిగా; ఒనర్పన్ దగున్ = చేయుట మంచిది; నిజ+ ఉర్విన్ = స్వదేశంలో; తస్కర+ ఆళిన్ = దొంగల గుంపును; తునుమన్ = చంపటం; తగున్ = మంచిది.

తా॥ రాజు రాష్ట్ర దాయంలో ఒక భాగం తన త్యాగ భోగాలకు; రెండు పాళ్లు సేనా రక్షణకు ఒక పాలు 'భాండాగారానికి ఉపయోగించాలి' స్వ-పర పక్షాలను చారులద్వారా పరిశీ లించాలి. దొంగలను స్వదేశంలో లేకుండా సంహరించాలి.

విశే॥ చాగము = త్యాగ శబ్దవికృతి; భాండార శబ్దవికృతి బడారు; ఎప్పుడూ వట్టి పో కుండా నిండుగా వుంటే - ఇది సిరిలక్షణం. ఒక్కొక్క ఇల్లు కూడ ఇల్లాలి మంచి మనస్సు వల్ల నిండుగా వున్నట్లు. విజయ నగర పాలకులు ఈ విధంగా కోశాగారాన్ని నింపుతూనే ఉండే వారట. అందుకే రాయలు సింహాసనానికి వచ్చేటప్పటికి 90 కోట్ల బంగారు నాణెములున్నట్లు చరిత్ర. న్యూనిజ్ కూడ తన గ్రంథంలో రాయల వారు తన ఆదాయాన్ని నాల్గుభాగాలు చేసి పద్యంలో చెప్పినట్లుగానే చేసేవాడని వ్రాయటం గమనించదగ్గ విషయం. చాగంబు - పండితాదులకిచ్చేది.

> ఆయంబు నందు నాలవ భాగ మొండె
> మూ డవ భాగ మొండె నందర్థ మొండె
> గాని మిక్కిలి సేయఁ గాదు వ్యయంబని
> యవధరించితె బుద్ధి నవని నాథ, 'భారతం.సభా. 1-47

**కం॥ లాలన నారక్షులగమి**
**నేలి, తెలిసి ముచ్చు, నాజ్ఞయిడ కతఁడు చెఱం**
**బో, లాఁతి నిడ, నయశ మెం**
**తే లేవదె శూలపృథువణి జ్న్యాయమునన్.** **239**

ఆరక్షుల = తలారుల యొక్క; గమిన్ = సమూహాన్ని; లాలనన్ = లాలిస్తూ(బహుమతుల ద్వారా, మంచి గా మాటలాడటం ద్వారా) ఏలి = సేవలు స్వీకరిస్తూ; తెలిసి = ఎరిగి; ముచ్చున్= దొంగను; ఆజ్ఞ+ ఇడక = శిక్షింపక, అతడు = ముచ్చు; చెరన్ = చెరసాలనుండి; పోన్ = తప్పించుకోగా; లాతిని+ ఇడన్ = మరొకని ఆస్థానంలో పెడితే; అయశము = అపకీర్తి; ఎంతేన్ = మిక్కిలి, లేవదె = వ్యాపించదె, శూల = శూలము ( శిక్షించేసాధనం) పృథు = పెద్ద; వణిక్ = వ్యాపారి; న్యాయమున్ = సామెతగా;

విశే॥ ఆరెకులను లాలనతో ఏలు కోవాలి. దొంగలను పట్టుకొనేదివారే కనుక. దొంగపట్టు బడితే వెంటనే శిక్షించాలి. చెరసాలలో బంధిస్తే వాడు పారి పోవచ్చు. ఆరెకులే మరొకని దొంగ స్థానంలో పెట్టి కొఱత

వేస్తే రాజుకే అపకీర్తి వస్తుంది కదా. కనుక అరెకు లీపనులు చేయ కుండ లాలించాలి. లాలనకు క్రింది మాట కారణం

తా॥ శూలపృథువణిక్ న్యాయము :- అవకతవక రాజు పంచ మహాపాతక పట్టణాధిపతి. ఆనగరంలో ఒకడిల్లు కట్టుకోవడానికి మట్టిగోడలు పెట్టుకొంటే వానకది కరిగి పోయింది.

వాడు రాజు దగ్గరమొరపెట్టు కొన్నాడు. 'ఎవరా దొంగ' అని రాజు అడిగితే తెలివితక్కువ మంత్రులు ''మబ్బు'' అన్నారు. రాజు శిక్షించ మంటె తలార్లు అన్నారు. ''మబ్బుకు కారణం పొగ'' అని రాజు ''అయితే దాని తలనరకండి''అని మంత్రి అన్నాడు. '' ఆ పొగకు కారణం కుమ్మరి పట్టుకోగా వాడన్నాడు ''నేను ఫలానావారి పెండ్లి కోసం అరివేణి కుండలు కావాలంటే ఆవంపెట్టాను. కనుక పెండ్లి కొడుకును కొఱతవేయ మన్నారు. రాజు అలాగే శిక్ష ఖాయం చేసాడు. తలారులు పెండ్లి కొడుకును కొఱతకు తీసి కొని పోగా వాడన్నాడట అయ్యా! ఈ కొరత వేసే శూలం లావుగా వుంది. నేనేమో సన్నంగా వున్నాను. ఈ శిక్షన్యాయం కాదుకదా॥ అంటే తలార్లు రాజు దగ్గరకు పోయి విన్నవించారట. అయితే ఒక లావుపాటి మనిషిని పట్టు కొని కొఱత వేయండి। ఈ మాత్రం తెలియదా? మాటిమాటికి రావద్దు. ఇక ఇదే ఆజ్ఞ అన్నాడు. తలార్లు ఒక స్థూలకాయుడైన సెట్టిని పట్టుకొని కొఱత వేసారు. ఈ కథ వేదం వారు వ్రాసింది.

చ॥ ఎఱుగ నగున్ఒ స్వశక్తి నవనీశుఁడు నాలుగుపాళ్ల మూఁడుపా,
ళ్లెఱుఁగక మోచినట్టిపని కిష్ట సుహృత్తతి దెల్ప నొక్కపా.
లెఱుగ నగు న్నయాఢ్యమతి నిట్లు నిరాగ్రహుఁడైనఁ జేయునె
త్తఱి విపదుగ్రదండపరతంత్రుఁడు గాక చిరంబు రాజ్యముఁ. 240

అవని+ ఈశుడు = భూపతి; స్వశక్తిన్ = తన ప్రతిభతోను; నయ+ ఆఢ్యమతిన్ = రాజ నీతి శాస్త్రపాండిత్యంతోనూ; నాలుగుపాళ్లన్ = నాలుగుభాగాల్లో; మూడుపాళ్లు+ ఎఱుగన్+అగు = తెలిసి కోవాలి; ఎఱుంగక = తెలియక; మోచినట్టిపనికిన్ = పూను కొన్న కార్యానికి; ఇష్టసుహృత్+తతి = ఇష్టమైన స్నేహితులసమూహం; తెల్పన్ = తెల్పితే;

ఒకపాలు = నాల్గుపాళ్లలో ఒకటి; ఎఱుగన్+అగు = తెలియదగును; ఇట్లు = ఈవిధంగా; ఏతఱిన్= ఏసమయంలోనూ; నిరాగ్రహుడు+ ఐనన్ = కోపం లేనివాడైతే; విపత్ = ఆపదలకు; ఉగ్ర = భయంకరమైన; దండ = శిక్షకు; పరతంత్రుడుకాక = లోను గాక; చిరంబు = దీర్ఘకాలం; రాజ్యమున్ చేయున్ = రాజ్యాన్నిపాలించగలడు.

తా॥ రాజునాల్గుపాళ్లలో మూడు పాళ్లు రాజధర్మ శాస్త్రపాండిత్యబలము స్వప్రతిభా బలంతోనూ తెలుసు కోవాలి. ఆమిగిలినపాలు హితులైన స్నేహితుల బృందం తెలుపగా తెలుసుకోవాలి. ఈ విధంగా తెలిసి కొంటూ కోపం లేక ఆపదలకు- ఉగ్రదండనకు పాలుపడక చిరకాలం రాజ్యంపాలించగలడు.

విశే॥ ఇష్టసుహృత్ప్రత్తి 27 వ ప., చూ. ఇలాంటిరాజు విషయమే 282, 276 శ్లోనూ వస్తుంది.

తే॥ కన్నొకటి నిద్ర వోఁబె ఱకంట జాగ
రంబు గావించు భూరుహాగ్రంబు మీఁది
యచ్చు భల్లంబుగతి భోగ మనుభవించు
నెడను బహిరంత రరులపై దృష్టి వలయు. 241

కన్ను+ ఒకటి = ఒక కన్ను; నిద్రపోన్ = నిద్రిస్తే; పేఱకంటన్ = మరొక కంటితో; జాగరంబు = జాగరణ; కావించు = చేసే; అచ్చుభల్లంబు గతిన్గా ఎలుగుబంటిలాగా; భూరుహాగ్రంబు+ అగ్రంబుమీది = చెట్టు పైనున్న; భోగము = రాజ్యభోగాలు; అనుభవించు+ ఎడన్ = అనుభవించే సమయంలోనూ; బహిః = బయట; అంతః = లోపలి (అరిషడ్వర్గం) అరులపైన్ = శత్రువులమీద; దృష్టి = చూపు; వలయున్ = ఉండాలి;

తా॥ చెట్టుమీది ఎలుగుబంటి ఒకకంటితో నిద్రిస్తూ మరొక కంటితో జాగరణ చేసినట్లుగా భోగాను భవాలు పొందుతూనే ఒక కన్ను బయట శత్రువులపై మరొక కంటిని లోపలి కామాదులపై ప్రసరింప చేయాలి.

అలం : ఉపమ.

విశే॥ ఈ జంతు చేష్ట రాయల వారికెక్కడ ఎఱుక పడ్డదో గాని చాల అపూర్వమైన అనుభవం.
ఏకావ్యంలోనూ కనబడని ఈ ఉపమాన సౌందర్యం ఈ కవిలో గుర్తించ వచ్చు. అదిస్వతంత్ర ప్రతిభాజన్యమో వ్యక్తిగత అనుభవ జన్మమో అవుతుంది.

మనిషికున్న రెండు నేత్రాలలో ఒకటిలోపలికి మరొకటి బయటకు ప్రసరించాలని భావం. ఇది ఈ దేశం సృష్టించిన ఆ ధర్మరాజ ప్రతిమ (బొమ్మ) ఇందు కే భారతాదులలో అంతర్విజయం సాధించలేనివాడు బహిర్విజయాన్ని ఎలా సాధిస్తాడని ప్రశ్నించారు ఆచార్యచాణక్యుడు కూడ అంటాడు. ''తస్మాత్ అరిషడ్వర్గాన్ని జయించటం ద్వారా ఇంద్రియజయాన్ని సాధించాలి కనుక ఈ శాస్త్రం ఇంద్రియ జయం కోసమే'' నన్నాడు. ''కృత్స్నం హిశాస్త్రమిదం ఇంద్రియజయః''

The kingship envisaged by the Indian traditional doctrine is this as for removed as could will be from what we mean when we speak of an Absolute Monarchy or of individuality. The supposed by Machivelli en -

(Spiritual Authority and Temporal power in the Indian theory of government.)

ఈ నేపథ్యం తెలియ కుంటే 4-278 పద్యానికి అర్థంలేదు.

ఉ॥ అక్షర పక్షపాతమున నర్థము నూల్ల నొసంగ, నుబ్బునర్
భిక్షు జటాధరాదికులు భిన్ననిజవ్రతు లౌదు; రైన దు

ర్భిక్షరుజాశిశుచ్యుతులు పెక్కగు; భక్తియ చాలు, దానఁద
త్ప్రక్షుభితత్వ మేయఘముఁ దార్పదు; శంకఁ దలంగు మియ్యెడన్. 242

అక్షర = విద్య (పైనున్న) పక్షపాతమునన్ = పక్షపాతంతో (ప్రేమతో) అర్థము = ధనము; ఊళ్లు = గ్రామాలు; ఒసగన్ = దానంచేస్తే; భిక్షు = సన్న్యాసులు; జటాధర+ఆదికులు = జడదారులు మొదలగువారు, ఉబ్బునన్ = గర్వంతో; భిన్న = చ్యుతమైన; నిజ = తమ; ఆశ్రమవ్రతులు = ఆశ్రమ వ్రతం కలవారు; ఔదురు = కాగలరు; ఐనన్ = అలా అయితే; దుర్భిక్ష = కరువు కాటకాలు; రుజ = సామూహిక రోగాలు; శిశుచ్యుతులు = పిల్లల మరణాలు; పెక్కు = ఎక్కువ; అగున్ = ఔతాయి; భక్తియ చాలున్ = వారిపై భక్తి చాలు; దానన్ = దానివల్ల; తత్ = వారి; తత్ప్రక్షుభి తత్త్వము = బాధపడటం (అన్నాదులు లేమి చేత) ఏ అఘము = ఏ పాపము; తార్పదు = సంఘటించదు; ఈ+ఎడన్ = ఈ విషయంలో; శంక = సందేహం; తలంగుము = విడిచిపెట్టు.

తా॥ విద్యాపక్షపాతం చేత సన్న్యాసులకు ధనగ్రామాదులు దానం చేయటం వల్ల వారు తమ ఆధ్యాత్మిక ప్రవృత్తి నుండి భ్రష్టులౌతారు. దానివల్ల దేశంలో కరువులు - కాటకాలు - రోగాలు-శిశుమరణాలు ఎక్కువౌతాయి. కనుక వారి యందు భక్తిని ప్రదర్శించు చాలు. ఒకవేళ వారు బాధపడితే దానివల్ల ఏ పాపమూ రాదు. ఈ విషయంలో శంక వీడుము.

విశే॥ సన్న్యాసులు స్వధర్మవ్రతభ్రష్టత దుర్భిక్షాదులకు కారణమవటం తర్కసహం కాదని ఆధునికశాస్త్రాచార్యులంటారు. కాని 20వ శతాబ్దంలో వచ్చిన శాస్త్రవేత్తలు ''నేను - నా చుట్టూవున్న పరిసరాలు - ప్రకృతి - జీవరాసులు - అన్నీ ఒకే ప్రాణశక్తినుండి వచ్చినవి కనుక ప్రకృతితో అన్నిటి మధ్యా సమతౌల్యం దెబ్బతినటానికి రోగాదులకు హేతు''వని మనస్తత్వశాస్త్రం. మన యోగశాస్త్రం మనిషికి వచ్చే రోగం ప్రకృతికి వచ్చే ఉత్పాతం. వాటికి కారణం మనిషి తాను వేరు - ప్రకృతి వేరు అనుకోవటం నుండి వచ్చింది. కనుక రోగానికి మూలకారణం నాలోని విషమభావన. ఇది విశ్వాంతరాళం నుండి దుష్టశక్తులరూపంలో దిగితున్నది. అని యోగులన్నమాట.

శిశుచ్యుతి - పెద్దలుండగ పిన్నలు మృతిచెందటం రావణ పాలన. పెద్దలు ముందు చనిపోవటం రామపాలన. రామరాజ్యం మన కాదర్శం తప్ప అన్యం కారాదు.

శంక : ఇది భౌతిక అభౌతిక సమన్వయం. కనుక అభౌతికదృష్టి లేని వానికి శంక కలుగుతుంది కదా. అందుకని ఖండితంగా చెబుతున్నాడు. కాబట్టి ఇది రాయలవారి ధర్మమనాలి. ఈ భౌతిక - అభౌతిక సమన్వయానికి మనస్తత్వశాస్త్రవేత్తలు చెప్పిన అభౌతిక వాదం లేదా అదృష్టవాదం ఆధారం. అదే మన వేదాంత పరిధిలోనిదే.

కం॥ విను వార త్రయ విజ్ఞా
పన కోర్వుము వధ్య కోటి పట్టునఁ, జెదరం

దన కప్పుడె కీడగు నను
జనముం బట్టుటకు మునుపె శస్త్రము చాలుఁ. 243

వధ్యకోటి = వధించదగ్గవారి; పట్టునన్ = విషయంలో; మును = ముందుగా; వార(త్రయ = మూడుసార్లు; విజ్ఞాపనకున్ = విన్నపానికి; ఓర్వుము = తాల్మివహించుము, చెదరన్ = వధ్యుడు తప్పించుకుపోగా; తనకున్ = రాజునకు; అప్పుడే; కీడు + అగున్ = అశుభమని; అను = అనుకోదగ్గ; జనమున్ = ప్రజలను; పట్టుటకున్ = బంధించటానికి, మునుపె = ముందే; శస్త్రమె = ఆయుధమే; చాలున్=చాలును.

తా॥ వధింపదగ్గవాడు ముమ్మారు విన్నవించుకోవచ్చు. ఆ మాత్రం క్షమాశాలి కావాలి రాజు. ఎవడు తప్పించుకొనిపోయి కీడు తలపెడతాడో అలాంటి వాళ్లను బంధించనక్కర్లేదు. శస్త్రంతో ఖండించు.

కం॥ శూరాలాపములకు నతి
శూరుఁడు దానయ్యు నృపతి సోఁకోర్వఁదగుఁ;
వారుబ్బుదు రందున, నిజ
శూరత దొరలందుఁ గనుట సూ కార్య మిలఁ. 244

నృపతి = రాజు; (నృ=నర) అతిశూరుడు = గొప్పశూరుడు; (శూరులను అతిక్రమించినవాడు) అయ్యున్ = ఐ కూడ; శూర+ఆలాపములకున్ = శూరుల గర్వోక్తుల; సోకు = తాకు; ఓర్వన్ తగున్ = ఓర్చుకోవటం తగును అందునన్ = దానివల్ల; వారు = ఆ వీరులు; ఉబ్బుదురు = ఉబ్బిపోతారు; ఇలన్ = రాజ్యంలో; నిజ = తనయొక్క; శూరతన్ = శౌర్యాన్ని; దొరలు+అందున్ = అధికారుల్లో; కనుటసూ = చూడటమే సుమా. కార్యము=చేయతగ్గపని.

తా॥ రాజు తన కొలువులోని శూరుల నతిక్రమించిన వాడైనా ఆ దొరలు పలికే ప్రగల్భాల తాకిడిని ఓర్చుకోవాలి. దానివల్ల వారు సంతోషిస్తారు. లోకంలో తన అధికారుల్లో తన శౌర్యాన్ని చూచుకోవటమే రాజునకు తగిన పని.

ఈ ధర్మం ప్రతి యజమానికీ - అధికారికీ - అన్వయించేదే.

శా॥ దేవు ల్మావు మతంగజంబును మణిశ్రీఖండముక్తాదియుఁ
రా, వాణిజ్యము పెంచి యేలఁగ నగు న్వర్షంపు లెవ్వఁ రుజన్
పోవల్లన్ దిగు నన్యభూప్రజల రా జాయాయి జాత్యాచితిఁ
బ్రోవంగాఁదగుఁ; దోఁట దొడ్డి గను లాప్తుల్సూడఁ బంపం దగుఁ. 245

మావున్ = గుర్రం; మతంగజంబునున్ = మతంగమన్న పర్వతం జన్మస్థలంగా కలది- ఏనుగు; మణి = రత్నం, శ్రీఖండ = మంచిగంధం; ముక్త = ముత్యాలు; ఆదియున్= మొదలైనవి; రాన్ - వచ్చేవిధంగా; వాణిజ్యము = వర్తకం; పెంచి = వృద్ధిచేసి; ఏలగనగున్ = పరిపాలించాలి; వర్షంపు+ఎవ్వన్ = వానలు

రానప్పుడు; రుజన్ = అంటువ్యాధులు ప్రబలినపుడు; హోవళ్లన్= ఆయా ఆపదలలో; దిగు = కాందిశీకులైవచ్చే; అన్య = ఇతర; భూప్రజలను = రాజ్యప్రజలను; రాజు; ఆయాయి= ఆయా విధంగా; జాతి+ఔచితిన్ = జాతులకు తగ్గట్లుగా; ప్రోవంగాన్ తగున్ = రక్షించటం కార్యం, ఆప్తుల్ = హితులు; తోట-దొడ్డి = పొలాలు పశులను కట్టివేసే చోట్లు; ఖనిజాల గనులను; చూడన్ = కాపుదలకు; పంపన్+తగున్ = పంపించటం మంచిది.

తా॥ రేవులను పెంచి వాటి నుండి గుర్రాలు - ఏనుగులు - శ్రీచందనం - ముత్యాలు- రత్నాలు; దిగుమతిచేసుకోవాలి. కరువుకాటకాల్లో ఆయాదేశాలనుండి వచ్చే కాందిశీకులకు జాత్యుచితంగా వసతులు కల్పించి కాపాడాలి. తోటలు - దొడ్లు - ఆప్తులను పంపి కాపాడుకోవాలి.

విశే॥ రాయలవారి కాలంలో రేవుపట్టణాలను 300 వరకు పెంచి వ్యాపారాభివృద్ధికి తోడ్పడినట్లు బార్బొసా అబ్దుల్ రజాక్ వంటి విదేశీచరిత్రకారులు వ్రాసినారన్నది జగత్ప్రసిద్ధ విషయం.

ఆ.వె॥ హదను వచ్చుదాఁక నపరాధిపై రోష
మాఁగి చెఱుపవలయు హదను వేచి,
లక్ష్యసిద్ధి దాఁక లావున శర మాఁగి
కాఁడ విడుచు నంపకాఁడు వోలె. 246

హదను = సమయం; వచ్చుదాక = వచ్చేంతవరకు; అపరాధిపై = తప్పుచేసినవానిపై; రోషము= కోపం; ఆగి = ఆపుకొని; హదనువేచి = సమయంచూచి; చెఱుపన్ వలయున్ = నాశనంచేసి తీరవలసిందే; లక్ష్యసిద్ధిదాక = లక్ష్యం సిద్ధించే వరకు; లావునన్ = బలంగా; శరమున్ = బాణాగ్రభాగాన్ని; ఆఁగి = లాగి, కాడన్ = బాణం (చివరనున్న రెల్లు కాడను); విడుచు = వదిలే; అంపకాడుపోలెన్ = విలుకాని వలె;

తా॥ విలుకాడు గురికుదిరే అంతవరకు బాణం వేయడు. గురి బాణం చివరి నుండే ములికి మీదగా చూస్తూ బాణం చివరనున్న కాడను నారికి లగించి లాగుతూ గురికుదిరాక విడిచినట్లుగా అపరాధిని వెంటనే శిక్షింపక కోపాన్ని దిగమ్రింగుకొని సమయం వచ్చినపుడు అంతం చేయాలి.

అలం : ఉపమ.

విశే॥ ఇది రాజవిద్య నుండి పుట్టింది. ఉపమాన - ఉపమేయాలు రెండూ రాజనీతికి సంబంధించినవే.

ఇదే లక్ష్యశుద్ధి అధ్యాత్మవిద్యలోనూ చెప్పబడింది. బాణం ఏకాగ్ర మనస్కత. ధనుస్సు ఓంకారం. లక్ష్యం భగవంతుడు. ఈ పోలికతో ముడిపడిన పద్యమిది.

కుడువ నిచ్చు తఱియుఁ గురువర ! క్రక్కించు
నవసరంబు నెఱిఁగి యరిన్నపాలు

నీవు ధర్మవృత్తి నిడుద్రాట పోనిమ్ము
క్రమ్మ కపిలయనఁగ, గ్రమ్మె చెఱుపు. (ఆశ్రమవాస పర్వం.)

పోవం బోలు లఘుప్రయాణత దినంబుల్ గొన్ని, యొండొంట నే
కా; వైరిక్షతి, కంబువు ల్వఱద రాఁగా నిల్చు జాలుంబలెం,
ద్రోవఁ సైన్యము గూడ; వైరి బలసాంద్రుం డైనఁ బూజాదులం
బోవం బోలుఁ, జరోక్తి చేత నసదేఁ బో కావరింపం దగుః. 247

వైరిక్షితికిన్ = శత్రురాజ్యం మీదికి; అంబువుల్ = నీళ్లు; వరదరాగాన్ = వరద వచ్చే అంత వరకు; నిల్చు = నిలిచే; జాలున్ బలెన్ = సన్నని పాయరీతిగా; కొన్ని దినంబుల్= కొన్నిరోజులు; లఘు ప్రయాణతన్ = ఆగి ఆగి చేసే ప్రయాణం లాగా; ఒండొంటనేకా = ఒక్కొక్క సేనగానే; త్రోవన్ = దారిలో సైన్యము = వివిధ సేనలు, కూడన్ కలిసి; పోవన్ పోలున్ = పోవటం నీతి; వైరి = శత్రువు; బలసాంద్రుడు = మంచిబలం కలవాడు, ఐనన్ = అయితే; పూజ+ ఆదులన్ = అర్చనాదులతో; పోవన్ పోలు = పోవుట నీతి; చర+ ఉక్తి చేతన్ = చారుల మాటలతో; అసదు+ ఏన్ = బలహీనుడని తెలిస్తే; పోక = వెన్కకు పోక; ఆవరింపందగున్= చుట్టుముట్టాలి

తా॥ శత్రుదేశం మీదికి దండయాత్ర చేసే విధానమెలాగంటే - సేనలను వివిధ వర్గాలుగా విభజించి ఒక్కొక్క దిశనుండి ఒక్కొక్కటి వచ్చి ఒకచోట అన్నీ కలిసి శత్రువు బలహీనుడని చారులు చెప్పిన మాటను బట్టి చుట్టుముట్టాలి. బలవంతుడైతే అతని నుండి పూజలందుకొని తిరిగి పోవటం మంచిది.

అలం : ఉపను

విశే॥ ఇది దండయాత్రా స్వరూప వర్ణన. రాయల వారు కళింగ జైత్ర యాత్రను నిర్వహించిన తీరును మనుచరిత్రాదులు వర్ణించాయి. బెజవాడ దగ్గర కొండపల్లెను పట్టుకొన్నాక రాయల సేనావాహిని ఒకటి తెలంగాణా మీదుగా ఆయా దుర్గాలను జయిస్తూ జమ్మిలోయలో చిత్తాపుఖాను ధానుష్కులతో ఎదురిస్తే అతనిని జయించి, వేంగిదేశం వచ్చిందట. మరొక సేన బెజవాడ నుండి తూర్పుకోస్తా మీదుగా నడిచిందట. రెండూ గోదావరి దగ్గర ఏకమై విడిది చేస్తే గజపతి బలవంతుడు - జయించటం కష్టం కనుక తిమ్మరుసు భేదోపాయం పన్ని పాత్ర సామంతులను 16 మందిని గూఢలేఖలు వ్రాసి అవి గజపతి కంటపడేటట్లు చేస్తే అతడు వారిని చంపించి రాయలకు కూతురు అన్నపూర్ణాదేవినిచ్చిన కథ చరిత్ర కెక్కినదే. ఈ పద్యంలో వున్న రాయలస్వానుభవమయే రాజనీతి సూత్రంగా వచ్చింది.

ఈ ఉపమానమే భారతంలోనూ వుంది.

కం॥ అనదతనంబును బెడిదఁపు
దనమును లేకుండ బరగి దరియెత్తెడునే,
జును బోలె నొత్తవలయు
మనుజేంద్రుఁడు మార్తురం గ్రముంబు నధిపా! (శాంతి. 3-24)

కం॥ ద్రవిణము నొవ్వఁగొంట, నొఱ ద్రాబలతో నిడుచుంట, భూమి గొం
తవలికి నిచ్చుచుంటఁ, బ్రథమాప్తతఁ జూడక శంక నుంట, లోఁ
బోవయు నృపాళికై యభయమున్ మణిభూషలుగుప్తిఁబంపిఁ భూ
దవుఁడరియం దిడందగు భిదం, దనయం దివి మాన్పుకోఁ దగున్. 248

ద్రవిణము = పన్నురూపమైన ధనం; నొవ్వన్ = ప్రజలు బాధపడేటట్లు కొంట = తీసికోవటం, ఒఱన్ = మంత్రాంగం; ద్రాబలతో = క్షుద్ర స్వభావులతో; ఇడుచుంట=చేస్తూ వుండటం; భూమిన్ = రాజ్యాన్ని; కొంత = కొంచెం; అవలికి= సరిహద్దు రాజ్యం లోనికి; ఇచ్చుచుంట = కలపటం; ప్రథమ = మొదటి; ఆప్తతన్ = స్నేహాన్ని; చూడక = పరిగణించక; శంకన్+ ఉంట = సందేహంతో వుండటం; లోన్ = లోలోపల; పొవయు = రాజుకొనే; నృప+ ఆళికై = రాజుల కొఱకై; భూధవుడు = రాజు; అభయమున్ = భయరాహిత్యం - రక్షణ; మణిభూషలు = రత్నాలనగలు; గుప్తిన్ = రహస్యంగా; పంపి = పంపించి; భిదన్ = భేదాన్ని; అరియందున్ = శత్రువునందు; ఇడన్+తగున్ = నిక్షేపించటం నీతి; తనయందున్= తనలో; ఇవి= వాటిని మాన్పుకొన్ తగున్ = మాన్పుకోవటం మంచిది.

తా॥ రాజయినవా డీ క్రింది నీతి సూత్రాలు పాటించాలి.

(1) పన్ను ప్రజాభారం కారాదు (2). మంత్రాంగాన్ని బలహీన మనస్కులతో చేయరాదు; (3) తన భూమిని అవతలి రాజ్యంలోకి కొంతైనా సరే అనుమతించరాదు. (4). ముందు అప్తుడైన వానిపై శంకతో చూడరాదు. (5). శత్రువులను చీల్చటం కోసం వారిలో వారికి పగలు రాజుకోవటం చూచి ఒకరి అభయాన్ని కల్పించి మరొకరికి నగలు పంపి శత్రువులను చీల్చాలి. (6) ఈ భేదోపాయం తనపై ప్రసరించకుండా చూచుకోవాలి.

విశే॥ ఇదొక షాడ్గుణ్యంగా ఆరంగాలు కల రాజనీతి సూత్రంగా రాయలు సూత్రీకరించాడు. చివరి ఐదవ ఉపాయమే పై పద్యంలో విశేషంగా చెప్పబడింది. 3వ విషయం నేడు కాశ్మీరంలో జరుగుతున్నదే. సరిహద్దు గట్లను రైతులు నరకుతూ పొలాన్ని విస్తరించుకోవటం పల్లెల్లో జరుగుతున్నదే. ఇదే కలహాలను కల్పించే విధానం. రాజ్యాల సరిహద్దుల సంగతీ ఇదే.

పూర్వం నుండి వస్తున్న పన్నుల భారాన్ని తగ్గించి రాయలవారు ప్రజలను కన్నబిడ్డలవలె కాపాడినాడని, మలయ బెన్నూరు - తిరుచినాపల్లి - దక్షిణ ఆర్కాటు మండలాల్లో దొరికిన శాసనాలు చెబుతున్నాయి.

'''ద్రవిణమునొవ్వగొంట'' పద్యం చివరి పాదంలో చెప్పిన విషయం. గజపతిపై దండెత్తినపుడు అతని 16 మంది సామంతులను భేదోపాయంలో విడదీసి విజయాని కవకాశం కల్పించిన తిమ్మరుసు భేదయుక్తి కెత్తిన పతాక.

కం॥ అహితుఁడు వేఁడిన, నేలెడు
మహి సగమే నిచ్చి, తెగని మైత్రి గొని, విభుం

డహిభయము మాన్పికోఁ దగు;
నహిభయ మహిభయముకంటె నధికము గాదే. 249

విభుండు = రాజు; అహితుడు = బలవంతుడైన శత్రువు; వేడినన్ = కోరితే; ఏలెడు= పాలించే; మహిసగమేన్ = నేల సగమైనా; ఇచ్చి+తెగని = వీడని, మైత్రిన్ = స్నేహాన్ని; కొని = స్వీకరించి; అహిభయమున్ = శత్రుభయాన్ని; మాన్పికోన్ తగున్; అహిభయము = శత్రుభయము, అహిభయము = పాము వల్ల భయము; కంటెన్, అధికము కాదే = గొప్పది కదా.

అలం : శ్లిష్టవ్యతిరేకము అహిశబ్దంపై శ్లేష

తా॥ పగయ కల్గెనేని పామున్న యింటిలో నివాసమున్నట్లే నన్న భారతనీతి నుండి ఈ అహిభయ మన్న సాదృశ్యం వచ్చినా రావచ్చు. లేదా స్వంతయూ కావచ్చు.

అహిభయము = స్వపక్షంలో వున్న గూఢశత్రువుల వల్ల భయము

కం॥ పలుకులు వేయు నేమిటికిఁ ? బార్థివుఁ డాత్మభుజాభృతక్షమా
తలమున గట్టుఁగీడు బహుధా మరయించి యడంచి చంచలా
క్షులగమిలో మెలంగు పురుషుండును బోలె నశంక నించుచుఁ
మెలఁగఁడ యేని, రాజ్యఫలమే యది ? రాజ్యము దుఃఖలబ్ధికే ? 250

పలుకులు = మాటలు; వేయున్ = వేయి; ఏమిటికి = ఎందుకు; పార్థివుడు = రాజు; ఆత్మ= తనయొక్క; భుజా = బాహువుతో; భృత = భరించబడే; క్షమాతలమున్ = రాజ్యంలో; గుట్టుకీడు= రహస్యంగా వుండే ఆపద; (అంతశ్శత్రువులు) బహుధా = అనేక రకాలుగా; అరయించి=శోధించి; అడంచి = అణచి; చంచల+అక్షులగమిన్ = చపలనేత్రలైన స్త్రీసమూహంలో; మెలంగు = ప్రవర్తించే; పురుషుండు పోలెన్ = పురుషుని వలె; అశంకన్= నిశ్శంకతో; నించుచున్ = నింపుతూ; మెలగడ+ఏనిన్ = మెలగక పోతే; అది+రాజ్యపాలన; దుఃఖలబ్ధికే = దుఃఖప్రయోజనానికా ?

తా॥ వేయిమాటలతో ప్రయోజన మేమిటి ? రాజు స్వరాష్ట్రంలోని అంతశ్శత్రువులను శోధించి- అణచి - స్త్రీలలో మెలగే పురుషుని వలె చరించక పోతే అది రాజ్యపాలన ఫలమా? అది దుఃఖం కోసమా ?

కుట్టుపేడు = వావిళ్ల ప్రతిపాఠం. రహస్యాన్ని ప్రకటించేవాడు అని పాఠాన్ని కుట్టుచేడుగా సూర్యరాయ నిఘంటువు పేర్కొని 'కొరడా' అని అర్థమిచ్చింది.

కుట్టుతేలు = కంటకుడు. అని ఆంధ్రభాషార్ణవం.

విశే॥ కౌటిల్యుని అర్థశాస్త్రంలో కంటకశోధన అనే అధ్యాయంలో బహుధా అరయించి అన్న క్రియా ప్రయోగ పరమార్థం చూచుకోవాలి. ఎన్ని రకాలుగా పరిశీలన ముంటుందో అందులో శ్లిష్టతయేమో భారత మిలా వివరిస్తుంది.

నానా విహార శైలో
ద్యాన సభాతీర్థ దేవతా గృహమృగయా
స్థానముల కరుగు నెడ
మానుగ శోధింప వలయు మానవ పతికిన్ (ఆది. 6-109.)

తే॥ బెదరి చేరని బయుని బిగియఁబట్ట
కతనిమై వడినే వచ్చి హత్తఁ జేఁత,
క్రమము, పెనఁగొడు బలుమీను త్రాటఁ జేఁదు
నొడ్డుగాలంపువేటకాఁ డుపమ గాఁడె ? 251

బెదరి = భయపడి; చేరని = సమీపించని; బలియునిన్ = బలవంతుని; బిగియన్ పట్టన్ = బిగించిపట్టుకోక = బంధించక; అతనిమై = అతనంతట అతడే; వడిన్+ఏన్ = వేగంగా (స్వయంగానే) (అతని మై-వడినే - ఏకశబ్దంగా గ్రహించి అతనంతట అతనే వచ్చి - అని వావిళ్లవ్యాఖ్యానం) వచ్చి - వచ్చి; హత్తన్ చేత = హత్తుకొనేటట్లు చేయటం; క్రమము = పద్ధతి (నీతి) పెనగొడు = గుంజుకొనే; బలు = పెద్ద; మీనున్= చేపను; త్రాటన్ = త్రాటితో; చేదు = లాగు; ఒడ్డు = ఏటి ఒడ్డున నున్న; గాలింపు= గాలం వేసి (నీటిలో) ఒడ్డున కూర్చున్న; వేటకాడు = చేపల వేటకాడు; ఉపమ = పోలిక, కాడె = కాడా ?

తా॥ బలిసిన చేప గాలానికి తగుల్కొని నీటిలోనికి గుంజుతుంది. కాని ఒడ్డున నున్న వేటకాడు త్రాటితో దాన్ని నేర్పుగా ఒడ్డునకు లాగినట్లుగా బలిష్ఠుడైన వీరుని బంధించకుండా అతనంతటే స్వయంగా వచ్చి నీతో సంధిచేసికొనేటట్లు చేయటం రాజనీతి.

వి॥ కుడువనిచ్చు తడియుఁ గురువర ! క్రక్కించు
నవసరంబు నెఱిఁగి యరి నృపాలు
నీవు ధీరవృత్తినిడు ద్రాట పోనిమ్ము
క్రమ్మ కపిల యనఁగఁగ్రమ్మి చెఱుపు (ఆశ్రమవాసం. 1-72)

సీ॥ దండపారుష్యంబు, కొండెంబు నతర్క
మరిసంధి కెడయాక మరలఁ బడులు
యువలి తప్పెన్ని కన్న విదేశయుఁ బెఱచుట
ప్రతిప్రవర్తకున కేర్పడఁగఁ జేత
జనున విశ్వాసంబు గనుఁగొని మెలఁగులు
విశ్వస నీయుని లేర్పఱచుట
మోమోట మంత్రంబుతో మిక్కిలిడుకొంట
మంత్ర భేత్తకు నాజ్ఞ మఱచియుంట

తే॥ వింత పుట్టినఁ గనుగల్గి చింతసేయ
కుంట, మాన్యులపట్టున నొక్క చూపె
చూడకుంట, విహీనులఁ గూడుకొంట,
వ్యసనియై యుంట, చలముంట, వలదు పతికి. 252

పతికిన్ = రాజునకు; వలదు = ఈ క్రిందివి త్యాజ్యం - పనికిరానివి.

1. దండపారుష్యంబు = కఠిన దండన.

2. కొండెంబునన్ = కొండెముల విషయంలో; అతర్క్యము = తర్కించక పోవటం (ముందు వెనుకల ఆలోచన లేకపోవటం.)

3. అరి = శత్రువుయొక్క; సంధికిన్ = సంధానానికి; ఎడ = సమయం; ఈక = ఈయక; మరలన్ పడుట = తిరుగబడటం.

4 అవలితప్పు = శత్రుకూటమి దోషం; ఎన్ని = ఎంచి; కన్న = చూచిన, విదేశ్యున్ = పరదేశీయుని; చెఱచుట = బాధించటం.

5. ప్రతిపవర్తకున్ = ఎదురు తిరిగి నడుచుకొనేవానికి; ఏర్పడన్ = అవి తనకు తెలిసినవిధంగా; చేత = చేయటం.

6. జను = మనిషి; అవిశ్వాసంబున్ = అపనమ్మకాన్ని; కనుగొని = చూచికూడా; మెలగుట = అతనితో కలిసి మెలసి ఉండటం.

7. విశ్వసనీయున్ = నమ్మదగినవానిని; నేర్పఱచుట = వేరు చేయటం,

8. మంత్రంబు బోన్ = మంత్రాంగ విషయంలో; మిక్కిలి = ఎక్కువగా; మోమోటః= మొగమాటం; ఇడుకొంట = పెట్టుకోవటం,

9 మంత్రభేత్తకున్ = మంత్రాంగాన్ని బహిరంగపరచి; వమ్ముచేసిన వానికి; ఆజ్ఞ = దండన; మఱచి ఉంట = మరచి పోవటం.

10. వింత = ఉత్పాతం; పుట్టినన్ = కలిగితే; కనుగల్గి = కన్నువేసికూడా; చింత = ఆలోచన; చేయ ఉంట = చేయకుండా వుండటం.

(ఏమి గ్రొత్తగఁబుట్టిన నించుకేని నలసుడవు గాక దాని నీవడసి తీర్పుము. ఆశ్రమ. ప. 1-62)

11. మాన్యుల పట్టునన్ = పూజ్యుల విషయంలో

12. విహీనులన్ = నీచులతో, కూడుకొంట = కలిసి తిరగటం.

13. వ్యసనియై ఉంట = సప్తవ్యసనాలు కలిగి వుండటం.

14. చలము+ఉంట = మాత్సర్యంతో వుండటం.

భారతంలో – నాస్తిక్యంబు నృతంబు ప్రమాదం, బాలస్యంబు, అనర్థజ్ఞుల తోడి చింతనంబు; క్రోధంబు, దీర్ఘచింత, దీర్ఘసూత్రత, యెఱుక గల వారి నెఱుంగమి; యర్థంబులయందు నర్థక చింత; నిశ్చిత కార్యంబులు సేయంమి; మంత్రంబుల రక్షింపమి; శుభంబులఁ బ్రయోగింపమి; విషయంబులందగులుటయనం బరిగిన పదునాలుగు రాజ దోషంబులంబరిహరింతె'' –

అని నారదుడు ధర్మరాజుతో అన్నాడు. (చూ.సభా. 1-56)

రాయలవారు సూత్రించిన ఈ 14 రాజదోషాలు వేరు

కం॥ త్రివిధోత్పాతదము లొదవిన
నవనివిభుఁడు విడువవలయు నధికద్రవ్యం
బవనీసురముఖ సురముఖ
పవనసఖముఖముల భుక్తి బలిహో మవిధిఁ. 253

త్రివిధ = భౌతిక - దివ్య - అంతరిక్ష సంబంధములైన మూడు; ఉత్పాతములు = ఉపద్రవాలు; ఒదవినన్ = సంభవిస్తే; అవని విభుడు = భూపతి; అధికి = మిక్కిలి, ద్రవ్యంబు = ధనం; అవనీసురముఖ = బ్రాహ్మణముఖంగాను, సురముఖ = దేవతాముఖంగాను; పవనసఖ = వాయువు చెలికాడు; అగ్నిముఖ = ముఖంగాను; భుక్తి = భోజనం; బలి = పూజలు; హోమ = వేల్మి; విధిన్ = విధ్యుక్త ధర్మాలకై; విడువన్ వలయును = (ధనం) ధారాళంగా విడుదల చేయాలి.

తా॥ త్రివిధోత్పాతాలు కలిగితే రాజు బ్రాహ్మణుల భుక్తి కోసం, దేవతల పూజల కోసం, అగ్నిహోమాల కోసం ఎక్కువ ధనం వ్యయం చేయాలి.

విశే॥ మనిషి చేసే దుర్మార్గాలను ప్రకృతి దేవతలు ఎదురు తిరిగి తీవ్ర ఉత్పాతాలు కల్గిస్తాయని ప్రాచీనుల విశ్వాసం. కనుక దివ్య ఉత్పాతాలు కన్పించటం వింతగ్రహాలు నక్షత్రాలు, అంతరిక్షాలు ఉల్కలు పడటం - పిడుగులు పడటం - అకాలంలో ఇంద్ర చాపాలా తోచటం వంటివి.
భౌతికాలు - ఈతిబాధలు - శలభాదులు పుట్టటం - అనిబృహత్సంహిత.
వీటి శాంతి కోసం 1. బ్రాహ్మణ - 2. దేవత - 3. అగ్ని పూజలు చేయటం.
దీని పర్యవేక్షణకే పురోహితుడవసరమైనాడు.

ధీరుడు ధర్మాధర్మ వి
శారదుఁడు బహుశ్రుతుండు సమచిత్తుడు వా
ణీరమణీ శ్రితవదనస
రోరుహుఁడన జనునెనీ పురోహితుడధిపా (సభా. 1-29.)

క్షితినాథ ! శాస్త్రదృష్టిఁ
బ్రతిభను దివ్యాంతరిక్ష భౌమోత్పాత

ప్రతికారు లగుచు సన్మా
నితులయి వర్తింతురయ్య నీ దైవజ్ఞుల్. (సభా. 1-33.)

విశేషాలకు చూడు- శ్వేతచ్ఛత్రం.

ఈ ధర్మసూత్రం అధ్యాత్మిక రాజనీతిలోది. ఆధునిక పాశ్చాత్య భౌతిక రాజనీతిలో లేదు.

అలం : క్రమం.

స్పర్థ పరస్పరంబు దొరపట్టున యోధుని పట్టునన్ నృపు
వర్ధన మొందఁ జేయఁ దగు, వారి హితాహితాచర్యలాది
తర్థి; మిథో వ్యథావహ హితప్రథమాన సమానతా ప్రథా
దూర్ధరతాదులం దగిలి ద్రోహపుయజింతఁ దలంపరేమియున్. 254

నృపుల్ = రాజులు; దొరపట్టునన్ = సామంతుల విషయంలో; యోధుని పట్టునన్= వీరుని విషయంలో; పరస్పరంబు = ఒకరొకరికి; స్పర్థ = వైరం; వర్ధనము = పెంపు; చేయన్‌దగున్= చేయుట నీతి; వారి = వారిద్దరి; హితం = మంచి; అహిత = చెడ్డ; చర్యలు = పనులు; అంతర్థి = అదృశ్యం; పొందవు = కావు. (స్పష్టంగా వారే వచ్చి వాడిలాచేస్తున్నాడని చెప్పటం వల్ల) మిథః = పరస్పరం; వ్యథ = వెతను; ఆవహ = కలిగించే; హిత = హితం చేయటం వల్ల; ప్రథమాన = కీర్తి పొందుతున్న; సమానత= ఇద్దరూ సమానాధికారాలు కావటం; ప్రథ = ఖ్యాతి; దుర్ధరత = ధురంధరత్వం; ఆదులన్ = మొదలైనవానిలో; తగిలి = చిక్కి; ఏమియున్ = ఏ కొంచెమూ; ద్రోహపు చింతన్ = ద్రోహచింతనం, తలంపరు = తలంచరు.

తా॥ అధికారులు యోధులకు స్పర్థ కల్గించాలి. దాని వల్ల ప్రయోజన మేమంటే - ఒకరి చేష్టను మరొకరు వచ్చి స్పష్టం చేస్తారు. దానివల్ల వారి హితాహిత చర్యలు తెలుస్తాయి. రాజునకు హితం చేయటం - రాజసన్మానం - కీర్తి కలుగుతాయి. కనుక ఒకరి నొకరు లీసిపోక రాజునకు హితమే చేస్తారు తప్ప ద్రోహం చేయరు. ఎందుకంటె రాజున కవతలివాడు తెలియచేస్తాడేమోనన్న భయం చేతనూ - రాజసన్మానాభిలాషతోను ద్రోహం చేయడు.

విశే॥ పద్యరచనలో సాంద్రత - వేగం - సమాసపటిష్టత - భాషావైభవం సంభావ్యాలు.

చం ॥ ధరణిపుఁ డెందునేఁ దగదు తాఁ జన, నూఱట కొక్కనిందగుం
దొరనొనరించి పంప, నరి దుర్బలుచేఁ జెడఁ డాతఁ డర్థభూ
కరితురగర్థి లేక కోఱగాఁ, డటు సేయ ద్విజాన్యుఁ డల్కకున్
నెరవగు, నాతఁడున్ వలయు, నిండిన దుర్గబలోర్వి యీ, దగున్. 255

ధరణీపుడు = భూపతి; రాజు; ఎందునేన్ = ఎక్కడికైనా; తాన్ = తానే; చనన్ తగదు = పోరాదు; (ఎందుకో తర్వాత చెప్పబడుతుంది.) ఊఱటకున్ = (రాష్ట్ర) విశ్రాంతికి; (తనకు బదులుగా) ఒక్కనిన్ = ఎవరో ఒకనిని; దొరన్ = అధికారిని; ఒనరించి = చేసి; పంపన్ తగున్ = పంపించాలి. అరి = శత్రువు; దుర్బలు

చేన్ = (పంపిన దొర) బలహీను డయితే; చెడడు = నశించడు, అతడున్ = పంపబడిన దొరకూడ; అర్థ = ధనం; భూ = రాజ్యం; కరి= ఏనుగు; తురగ = గుఱ్ఱం; ఋద్ధి = సమృద్ధి; లేక = లేకుండా; కొఱగాడు = పనికిరాడు; అటుసేయన్ = అలాచేస్తే (రాజ్యాదులిస్తే) ద్విజ+ అన్యుడు = బ్రాహ్మణుడు కానివాడు; అల్కకున్ = (రాజు) కోపానికి; నెరవు+ అగున్ = లక్ష్యం కాగలడు; అతడున్ = ఆ బ్రాహ్మణేతరుడు కూడ; వలయున్ = (రాజ్యపాలనలో) కావలసిందే; నిండిన = నిండైన; దుర్గ = కోట; బల = చతురంగ బలాలు; ఉర్వి = రాజ్యం; మండలం; ఈన్+తగున్ = ఈయవలసిందే.

తా॥ (1). రాజు అన్నిచోట్లకు పోరాదు. (2). తనకు బదులు మరొకని దొరను చేసి పంపాలి. (3). పంపిస్తే వాడికి చతురంగబలాలు - మండలాధి పత్యం ధనాదులివ్వాలి. ఇస్తే తప్ప శత్రువు లొంగిరాడు. అలాచేస్తే బ్రాహ్మణేతరుడు రాజున కెదురు తిరిగి జయించిన రాజ్యం తనదేనంటాడు. (5). అలా అయినపుడు వానిని శిక్షించాలి కదా అంటే - కాదు. వాడూ పాలనకు సాధనమే కనుక వానికీ దుర్గాదులనిచ్చి అదుపులో పెట్టుకోవాలి.

విశే॥ ఎందుకు పోరాదో 268వ పద్యంలో చెప్పబడింది. కాని పంచమాశ్వాసాంతం ''ఇది యంధ్రోక్తి యథార్థనామ'' లో రాయల వారే సేనాగ్రభాగంలో వుండి నడిపించాడని వుంది. కాబట్టి సందర్భ వివేకం కావాలి.

ద్విజాన్యుడన్నదాని కుదాహరణ :- మధురను జయించిన విశ్వనాథుని తండ్రి విశ్వనాథ నాయకునికి సమర్థమైన బలాలనిచ్చి పంపిస్తే అతడు తండ్రిని బందీగా పట్టుకొని వచ్చాడు. సంతోషించిన రాయలు విశ్వనాథనాయకుని మధురకు అధిపతిగా చేసాడు. ఈ కథను ఈ పద్యభావాని కనుసంధించు కోవాలి.

ఊఱటకు = రాజ్యశాంతికని చెప్పాలి.

పాఠాంతరాలు : అల్కకే. నెరవున్ అతండునున్ = వావిళ్ల ప్రతి- పై పద్యం వేదం ప్రతిలోనిది.

కం॥ అడవులు గడి దేశములవి
దడములుగాఁ బెంపు; మాత్మ ధరణీస్థలికిన్
నడుములవి పొళ్లుపొళ్లుగఁ
బొడిపింపుము దస్యుబాధ పొందక యుండన్. 256

గడిదేశములవి = సరిహద్దుల లోనివగు; అడవులు = అరణ్యాలు; దడములుగాన్ = దట్టంగా; పెంపుము = వృద్ధిచేయుము; ఆత్మధరణీ స్థలికిన్ = స్వరాష్ట్రంలో; నడుమలవి = నడుమనున్నని; పొళ్లుపొళ్లుగన్ = పొడిపొడిగా; పొడిపింపుము = నరికింపుము; దస్యుబాధ = ఆటవికులైన దొంగల వలన బాధ; పొందక యుండన్ = పొందకుండగా

తా॥ సరిహద్దుల్లోని అడవులను దట్టంగా పెంచి రాజ్యం మధ్యలో ఉన్న వానిని నరికించాలి. దొంగలు వానినాశ్రయించి దోచుకుంటారు. కనుక ప్రజల కీబాధలు లేకుండా చేయాలి. మరి గడిదేశముల అడవుల్లో దాగి దస్యులు ప్రజాబాధ కల్గించవచ్చుగదా ? ఈ ప్రశ్నకు క్రింది పద్యం సమాధానం.

రాయలవారు గుడికి వెళ్తున్నపుడు మునికుడుగన్న గ్రామప్రాంతంలో దొంగలున్నారని తెలిసి ఆదారి నిర్భయంగా చేయటానికై కొలూరు బద్దారెడ్డి యన్న వానికా బాధ్యత నప్పగించినట్లు, అతడు రాచర్ల వద్ద కోటను కట్టి కొడుకులతో పాటుగా నివసిస్తూ దొంగల ఆటకట్టించి - ఆ పోరులో తానూ మరణించినట్లు చరిత్ర.

చం॥ క్షమఁ గుఱుమన్నెపుం గహనచారి జనంబెడ దోషదృష్టి కు
డ్యము గడుగంగఁ బూన్కి; దెగ దల్గిన సర్వము; బాస నీగి వ
శ్యముగ నొనర్ప దాడి కగు; నౌ గడి కొల్లలకున్, శతాపరా
ధమును సహస్రదండము నతర్క్యము సర్వము నేలువానికిన్. 257

క్షమన్ = రాజ్యంలో; కుఱు = చిన్న; మన్నెపున్ = మన్యప్రాంతంలో; గహన = అడవుల్లో; చారి= తిరిగే ఆటవికులు; జనంబు = ప్రజలు; ఎడన్ = విషయంలో; దోషదృష్టి = తప్పులెన్నటం; కుడ్యమున్ = మట్టి గోడను; కడుగంగన్ = కడిగే; పూన్కి = ప్రయత్నం; అల్గినన్ = కోపిస్తే; సర్వమున్ = అంతా; తెగదు = పోదు; బాసన్ = మాటతో; ఈగిన్ = దానంతో; లేదా, మాటే = సత్యవాక్యే దానంగా ఇవ్వటం; వశ్యముగన్ = లోబడేటట్లుగా; ఒనర్పన్ = చేసికొంటే; దాడికిన్= యుద్ధధాటికి; జైత్రయాత్రలో రోజువారీ సేనగా; అగున్= పనికి వస్తుంది; గడి = సరిహద్దులను; కొల్లలకున్ = కొల్లగొట్టటానికి; ఔన్ = పనికివస్తుంది; సర్వమున్ = రాజ్యమంతా; ఏలువానికి = ఏలే వానికి; శత+అపరాధమున్నూ = వందతప్పులున్నూ; సహస్రదండనముల్ = వేయి శిక్షలూ. అతర్క్యము = ఊహింపరానివి.

తా॥ దుర్గమ ప్రాంతాలలో అడవుల్లో తిరిగే ఆటవికులను శిక్షించబూనటం మట్టిగోడను కడగటం లాంటిది. గోడ కూలినట్లు రాజేనష్టపోతాడని తాత్పర్యం. ఎందుకంటే గడిదేశాలను కొల్లకొట్టటానికీ - రోజు కూలీభటులుగా యుద్ధయాత్రలో పనికివస్తారు కనుక. అయినా రాజునకు నూరు తప్పులకు వేయి శిక్షలన్నది ఊహించరానివి కదా !

అలం : నిదర్శన

విశే॥ 255 - ఇదీ చంపకమాలే. కాని ఈ రచన వింత సాంద్రతరంగా బరువుగా వున్నదీ పరిశీలించాలి. ప్రథమ పాద సమాసం బరువైనది. క్షమ అన్న ప్రారంభమే భారావహంగా వుంది. ఇదే విచిత్రశైలి.

దాసరికథలో 6-40 పద్యంలో వనచరుల విషయువుంది. అతడు ఈటెను ధరించటం- రాక్షసునితో పోరాడటం. ఇవన్నీ అతని భటలక్షణాలే. గహన చరులను భటులుగా చేసికొనే పద్ధతికిది ఉదాహరణ.

తే॥ సింధుర మహాశ్వముఖ్యము ల్చేర్చు దొల
దీవి వణిజుల కూళ్లు సద్గృహములు పురిఁ
గొలువుఁ దేజంబు వెల మేలు గలుగఁ బ్రాఁత
వారిఁగాఁ జేయు; మరి నవి చేరకుండ. 258

సింధుర = ఏనుగులు; మహోశ్వముఖ్యముల్ = గొప్పగుఱ్ఱాలు మొదలైనవానిని; చేర్చి = దిగుమతి చేసి విక్రయించే; దొలదీవి = దూరపు దీవుల; వణిజులకున్ = వ్యాపారులకు; ఊళ్లన్ - గ్రామాలు నిర్మించి; సద్గృహముల్ = మంచి మిద్దెటిళ్లు కట్టించి; పురిన్ = నగరంలో; కొలువున్=రాజసేవా; తేజంబు = ప్రకాశమూ; వెల = ధర; మేలుగలుగన్ = ఎక్కువ కలిగేటట్లుగా చేసి; అరిన్ = శత్రువునకు; అవి = ఆ ఏనుగులు - గుఱ్ఱాలు; చేరకుండన్ = చేరకుండునట్లుగా చేసి; ప్రాతవారిగాన్= వారి క్రొత్తదనాన్ని; చూడక = చిరపరిచితులుగా; చేయుము = తప్పక చేయి.

తా॥ దూరదేశాలనుండి ఏనుగులు - గుఱ్ఱాలు తెచ్చి వ్యాపారం చేసేవారిని దగ్గరకు తీసి నీ నగరంలోనే కొలువూ - ఉన్నతి కలిగించి గ్రామాలు ఇళ్లు ఇచ్చి ప్రాతవారిగా చేసికో. మంచి వెల చెల్లించి ఏనుగులను - గుఱ్ఱాలను కొను. నీ శత్రువుల కవి చేరకుండా చూచుకో.

విశే॥ ఆనాటికి గోవా వ్యాపారులు గుఱ్ఱాల వ్యాపారం చేస్తుండేవారని రాయలు వాటిని కొని వారితో స్నేహం చేసి పెద్దగుఱ్ఱపు దళాన్ని నిర్మించాడని చరిత్ర. గోవా రాయబారులనాదరించినట్లు - వారి ఇంజనీర్లతో ఆనకట్టలు కట్టించి చెరువులు త్రవ్వించినట్లు రాయలవారిని గురించి పేయస్ అన్న పోర్చుగీసు చరిత్రకారుల వ్రాతలు, తురుష్కుల విజయాలకు మూలకారణం అశ్వదళం కనుకనే పంచ బహమ్మనీ సుల్తానులకు అశ్వపతులని పేరు. కనుక రాయలవారి రాజనీతిలో ఇదొక ముఖ్యాంశం. ఆ ప్రభువు విజయాలకీ అశ్వసైన్య మొక హేతువు. యుద్ధంలో రాయలవారి సేనా వాహిని అనంతంగా వున్నట్లు - వేల అశ్వాలతో దాడిచేసినట్లు వర్ణించటం - ఈ పద్యభావానికి చరిత్ర రూపమే.

తే॥ గడి నృపుల రాయబారుల యెడఁ గొలువున
సరస సల్లాపములు రాజు సలుపవలయుఁ;
గార్యఖడ్గము లనుచరు ల్గానఁ బలుక
వలయు; నని మైత్రిఁ దాఁ దేలఁ బలుకవలయు. 259

గడినృపుల = సరిహద్దురాజుల, రాయబారుల యెడన్ = రాయబారులతో, కొలువునన్ = సభలో; రాజు; సరససంభాషణలు = మైత్రీ సంభాషణలు, సలుపన్ వలయున్ = చేయాలి; అనుచరులే= దొరలు; కార్యఖడ్గముల్ = కర్తవ్యం = ఖడ్గధారణమే; కానన్ = స్పష్టపడేటట్లు; పలుకన్ వలయు= పలికి తీరాలి; తాన్ = రాజు; అవి = అనుచరుల మాటల, మైత్రిన్ = చెలిమితో; తేలన్ = తేలిపోయేటట్లుగా; పలుకన్ వలయున్.

తా॥ సరిహద్దు రాజులు తన సభకు పంపిన రాయబారులతో ఎలా వ్యవహరించాలో చిత్రించిన పద్యమిది. రాజేమో వారిని స్నేహంతో ఆదరించాలి. సభలోని సామంతులు - సేనాపతులు యుద్ధ ప్రసక్తిని తేవాలి. దాన్ని తాను స్నేహంతో తేల్చివేయాలి.

ఈ నాటకమంతా దేనికి ? చూ. 263. ఇది ధర్మమా ? చూడు. 276-78-282-284

సీ॥ తా నవంబుగ దొరఁజేయువాని మంత్ర
మునకు వేగమె లోఁజేయఁ జనదు; వాఁడు
క్రొత్తమన్నన రహిఁ ననుఁగులకుఁ జెప్పి
నయిన నదిచెడు, మఱి వాఁడు నడఁగుఁ గాన. 260

తాన్ = రాజు, నవంబుగన్ = క్రొత్తగా; దొరన్ = అధికారిగా, చేయువానిన్ = చేసేవానిని; వేగమె = వెంటనే; మంత్రమునకున్ = ఆలోచనకు, లోన్‌చేయన్ = అనుమతించటం; చనదు = మంచిది కాదు; వాడున్నూ; క్రొత్తమన్ననన్ = క్రొత్తగా రాజిచ్చిన చనువుతో, రహిన్= సంతోషంగా, ఆనుగులకున్ = ఇష్టులతో చెప్పన్ - అయినన్ - చెబితే, (చెప్పగానైతే), అది- ఆ మంత్రాంగం. చెడున్ = చెడిపోతుంది, మడివాడు = ఇక వాడు, అడఁగున్ - నశిస్తాడు. కాన = కనుక.

సీ॥ హిత, బహుశ్రుత, ధర్మరత, శూరతా, స్వపూ
ర్వతల మన్ ద్విజుల దుర్గముల నిలిపి,
పులిజున్ను మొదలుగాఁ బురుషాయుషావధి
కందుండ సవరణల్ పొందుపఱిచి
చీమంత యైనను సామంతకోటికి
మితము దప్పక యుండ క్షితులొసంగి,
యాయాధికవ్యయా నధికంబునుం బ్రజా
విరుజంబుగాఁగ బండరువుఁ గూర్చి

తే॥ క్షీణ రిపుధాత్రిఁ జరదృష్టి చేతఁ జూచి,
బకగతిహతాత్ గ్రహించి, తాన్, బ్రజయు నొవ్వ
కయు, పగఱ గాత్రములనె చీకాకు పఱచు
నృపతి డెందానఁ జేయిడి నిద్రవోవు. 261

హిత = హితం కోరేవారు; బహుశ్రుత = అనేకం చదివిన వారు; మహాపండితులు; ధర్మరత = ధర్మతత్పరులు; శూరతా = శూరత్వం; స్వపూర్వతలనన్=వంశక్రమానుగతితో; మన్ = జీవించే; ద్విజులన్ = రెండు జన్మలు కల; ఆర్యులు = బ్రాహ్మణులు - క్షత్రియులు- వైశ్యులు - వారిని; దుర్గములన్ = కోటగోడలు ఆవరణ గల నగరాలలో; నిలిపి = పాదుకొనేటట్లు చేసి;

తా॥ ప్రాచీన సంఘానికి ఆర్య = ద్విజ సంఘమని పేరు. (సంస్కృతీ సంపన్నమైన సంఘానికి ఆర్యసంఘమని పేరు. అందులోని వారు హితులై - బాగా చదివి ధర్మపరులై పూర్వంనుండి వంశపరంపరగా వస్తున్నవారు నైన ద్విజులను దుర్గాలలో నివసింపచేయాలి.

(2) పులిజున్ను మొదలుగా = కష్టసాధ్యమైన పులిజున్ను మొదలుకొని; పురుష+ఆయుష = అవధికిమనిషి జీవిత కాలపర్యంతం (నూరేళ్లు) అందున్ = ఆ దుర్గంలో; ఉండన్ = ఉండేటట్లు; సవరణల్ = సామగ్రి; పొందుపరచి = సంఘటించి.

తా॥ దుర్గంలో నూరేండ్లకు తగిన సంబారాలు ఉంచాలి. ఆ సంబారాల పట్టికలు భారతాదులిచ్చాయి. పులిజున్ను మొదలుకొని అన్నీ ఉండాలన్నమాటతో అవన్నీ చెప్పినట్లైనది. ఎన్ని చెప్పినా ఏవో కొన్ని మిగిలిపోక తప్పదు కనుక పులిజున్ను అని వానిని సంగ్రహించి చెప్పటం.

(3) సామంతకోటికిన్ = సామంత్రసమూహానికి; చీమ+అంత+ఐనన్; మితము తప్పకయుండన్ = పరిమితి దాటిపోక; క్షితులు = భూములు; ఒసగి = ఇచ్చి).

తా॥ సామంతులకు పరిమితంగా భూములు - మండలాలు ఇవ్వాలి.

(4) ఆయ = ఆదాయం; అధిక = ఎక్కువగా; వ్యయంబు = ఖర్చు; అనధికంబును=తక్కువగా; ప్రజా = ప్రజలకు, విరుజంబుగాన్ = బాధలేకుండా; బండరువున్=కోశం; కూర్చి = సంఘటించి;

తా॥ ప్రజలకు నొప్పిలేకుండ అధిక ఆదాయమూ - తక్కువ ఖర్చుగా బండారాన్ని కూర్చుకోవాలి.

(5) క్షీణ = బలహీనుడైన; రిపు = శత్రువుయొక్క, ధాత్రిన్ = రాజ్యాన్ని; చరదృష్టి చేతన్ = చారులన్న కన్నుల ద్వారా చూచి

(6) ఒక గతిన్ = కొంగ ఎంద్రకాయను; హఠాద్గతిన్ = హఠాత్తుగా; గ్రహించి = ఆక్రమించి; (ఆ బలహీనుని రాజ్యం) తాన్ = రాజైన తాను ప్రజలున్ = ప్రజలున్నూ.

(7) నొవ్వక = కందకుండా; పగఱన్ = శత్రువుల; గాత్రములనె = శరీరాలనే; చీకాకు పఱచు = కలతపెట్టే

(8) నృపతి = రాజు; డెందానన్ = గుండెమీద; చేయిడి = చేతులుంచుకొని; నిద్రపోవున్ = సుఖనిద్రచెందగలడు.

దుర్గవివరణలో ''గడ్డియు, . . . . . . . కొల్చును - కట్టెయులును; నేయి - నూనెయు; ఆయుధౌషధములు - ఆభీలయంత్రముల్ - కూపములు మహావీరులను'' ఉంచాలి. - (భారతం)

కం॥ శ్రీమందిర భుజమధ్యమ

కం॥ జలమును ధాన్యము నాయుధ
ములు రసవర్గములు యోధముఖ్యులు యంత్రం
బులు'' . . . . . (కామందకం)

వీనికి సంగ్రహరూపం ''పులిజున్నుమొదలుగా''

విశే॥ బక హఠగతి (వేదం)

కం॥ ఎచ్చోగజ ఘోట కయ
తచ్చర్వణ సుభట జీవిత ద్విజసుర పూ

జొచ్చు నిజ భోగముల కేగు
వెచ్చము వెచ్చంబుగాదు విత్తంబునకుల్. 262

ఎచ్చోన్ = ఎక్కడా; గజ = ఏనుగు; ఘోటక = గుర్రం; క్రయ = కొనటానికి; తత్ = వాటి; చర్వణ = మేతకు; సుభట = వీరుల, జీవిత = జీతాలకు; ఉచ్చ = ఉన్నత; నిజ = తన యొక్క; భోగములకు = అనుభవాలకు, అగు = అయ్యే; వెచ్చము = వ్యయము; వెచ్చంబుకాదు = ఖర్చుకాదు. విత్తంబునకున్ = ధనానికి;

తా॥ ఏనుగులను - గుర్రాలను కొనటానికి, వాటిని మేపటానికి; మహాయోధుల జీతాలకు, బ్రాహ్మణదేవతా పూజలకు, తన భోగాలకయ్యే ఖర్చు వ్యయంగా పరిగణించరాదు. చూ॥ 238 పద్యం.

విశే॥ ఇక్కడ రాజభోగాల విషయం పరిమితంగా చెప్పబడింది. నిజానికి మొగలు చక్రవర్తుల సుఖభోగాలు - వారు కట్టించిన భవనాలు చూస్తే హిందూచక్రవర్తులవి చాలా స్వల్పం. నేటికీ ఫతేపూర్ సిక్రీ వంటి భవన సముదాయం హంపీలో లేదు. ''పేయస్'' రాయలను దర్శించి వర్ణిస్తాడు. ఆ వర్ణనలో రాజు నగలెక్కువ ధరించినట్లుగానే లేదు.

ఆ॥ ప్రతిన వలదు వైరిపట్టున నృపతికి
దండు వెడలఁదీఱకుండుఁ దీఱు;
గాక యుండి యుండి కాలాంతరమున నేఁ;
గార్యకాఁడొ యంక కాఁడొ నృపుఁడు. 263

నృపతికిన్ = రాజునకు; వైరి = శత్రువు; పట్టునన్ = విషయంలో; ప్రతిన = ప్రతిజ్ఞ; వలదు = వద్దు; దండు = సేన; వెడలన్ = పోగా; తీరక ఉండున్ = పని సానుకూలపడక పోవచ్చు; తీఱున్= పడనూవచ్చు; కాక = అదీకాక; ఉండి ఉండి = ఆగి ఆగి; కాల+అంతరమునన్ = మరొకనాటికి; చాలా కాలం తర్వాత; ఔను = అవును; నృపుడు = రాజు; అంకకాడో = కయ్యానికి కాలు దువ్వేవాడా? కార్యకాడో = పనినేర్పుగా చేసుకొనే వాడా ? -

తా॥ రాజు కలహప్రియుడు కాదు. నేర్పుగా కార్యం సాధించేవాడుగా వుండాలి. కనుక శత్రువు విషయంలో పట్టుదల పనికి రాదు దండయాత్ర చేస్తే పని ఔతుందో ? కాదో ? చెప్పలేము. కాలాంతరంలో అదే కార్యం సాధ్యం కావచ్చు.

విశే॥ అంకము = యుద్ధాంగణం. చలము. అంకకాడు = చలపాది; మత్సరుడు. చూ. కలహమున కంకకాడయి కాలుద్రవ్వ - 5-84.

ఇక్కడ శూరుడని అర్థం. రాజునకు యుద్ధప్రీతి నిత్యమూ వుండరాదు.

కం॥ పోరానిపట్లఁ బోడుచుట
వైరి బలము దిరుగ జయమొ స్వర్గమొఁ యగు నా
నా రూపయం త్రతాత్పాం
కేరాదుల పట్లఁ బ్రజనె కవియంపఁ దగుః. 264

పోరానిపట్లన్ = పోనటానికి వీలు లేని చోట్లలో; పొడుచుల = కలహించటం; వైరిబలము = శత్రుసేన; తిరుగన్ = తిరుగబడితే; జయమొ = గెలుపో; స్వర్గమొ = మరణమొ; అగున్ = సంభవిస్తుంది; నానారూప = అనేక విధాలయిన; యంత్ర = ఆయుధ యంత్రాలును; ప్రాకార+ఆదులు = కోటగోడమొదలైన; పట్లన్ = చోట్లలో; ప్రజన్ = సేననే, కవియింపన్ తగున్= ఎదుర్కొనేటట్లు చేయాలి.

తా॥ పోరానిచోట్లకు పోతే రాజునకు విజయమో - వీరస్వర్గమో ఏది ఎదురౌతుందో కనుక రాజే పోరాదు. యంత్రాలు కల ప్రాకారాదుల దగ్గరకు రాజు పోకుండా సేనలనే సమాయత్తం చేయాలి.

చ॥ మనమున కొండు రెండు మఱుమంత్రములన్ సరిపోవఁ జెప్పినం
జనపతు లాతనిం బిలువ సొగుదు; రాగతి సారెఁబిల్చున
చ్చనువునకే ధనాదిఁగొని సంగతి గానివి క్రొవ్వి చేయఁజె
ప్పు; నృపతి దద్బహిశ్చరితముం జరుచేఁ బరికంపగాఁదగుః. 265

మనమునకున్ = మనస్సునకు; ఒండు రెండు = ఒకటో రెండో; మఱు = రహస్య; మంత్రములన్= మంత్రాంగ పుటాలోచనలను; సరిపోవన్ = తగినట్లు; చెప్పినన్ = చెబితే; జనపతులు = రాజులు; ఆతనిన్ = ఆ చెప్పిన వానిని; పిలువగన్ = పిలువటానికి; సొగుదురు = పూనుకొంటారు; ఆ గతిన్ = ఆ విధంగా; సారెన్ = మాటిమాటికి; పిల్చు = పిలిచే; ఆ చనువున కేన్ = ఆ కొద్దిపాటి చనువునకే; ధనాదిన్ = డబ్బు మొదలైన వానిని; కొని = గ్రహించి; సంగతి కానివి = సరిపోనివి; క్రొవ్వి = మదించి; చేయన్ = చేయటానికి; చెప్పున్ = చెబుతాడు; (కనుక) నృపతి = రాజు; తత్ = వాని; బహిః+చరితమున్ = బయటి ప్రవర్తనను; చరుచేన్ = చారుని నుండి; పరికింపగాన్= పరిశీలించగా; తగున్ = మంచిది.

తా॥ మనసునకు వచ్చినట్లు ఒకటో రెండో రహస్యాలోచనలను చెప్పినంతనే వానికీ చనువిస్తారు. దాని వల్ల వాడూ డబ్బూ - దస్కం తీసి కొంటూ చనువుతో ప్రవర్తిస్తూ మదించిపనికిరాని ఆలోచనలను నూరిపోస్తాడు. కనుక రాజు వాని ప్రవర్తన లోకంలో ఎలా వున్నదో చారులనుండి తెలుసుకోవాలి.

విశే॥ అల్పులకు మంత్రాంగంలో చోటివ్వరాదు.

కం॥ గడివాఁడు చెడునయేఁ దగుఁ
జెడఁ జేయుట; చెడఁటయేని చెల్మిమి తగుఁ; బై
గడివాఁడే పనికగుఁ దన
గడివాఁపరియైన, దనకె గడి కావఁబడుః. 266

గడివాడు = సరిహద్దులలోని రాజు; చెడున+ఏన్ = అపజయంపాలౌతాడో; చెడన్+చేయుట = చెడకపోతే; చెల్మియె = స్నేహమే; తగున్ = మంచిది; తన = తనయొక్క; గడివాడు = సరిహద్దురాజు; అరియేన్ = శత్రువయితే; పైన్ = తన గడివానిని అణచటానికి; అగున్ = సమర్థుడు; తనకె = తనకోసమె; గడి = సరిహద్దు; కానన్ పడున్ = రక్షించబడుతుంది.

తా॥ నీ సరిహద్దుల్లో వున్న రాజు అల్పబలుడైతే నీవే అతనిని లొంగతీసికోవచ్చు. బలవంతుడైతే స్నేహమే మంచిది. గడివాడు నీ శత్రువనుకో అతని గడివాడే నీ గడివానిని పొగరణచ గలడు. కనుక నీ గడి దేశ రక్షణ వాని వల్లనే జరుగుతుంది.

విశే॥ పొరుగురాజుల చర్య లెలా వుంటాయి ? వారి నుండి రాజ్యమెలా రక్షించుకోవాలి? అన్న ప్రశ్నల కిది సమాధానం.

అన్నీ తెలుగు పదాలే.

శత్రువు శత్రువు మిత్రుడన్న న్యాయం ననుసరంగా తన గడివాడు తనకు శత్రువు. వాని గడివాడు తనకు మిత్రుడు.

తే॥ రాష్ట్ర మెరియుంపు; కొనుము దుర్గములు, తదవ
రోధ మగపడ్డఁ బుట్టింటి రూఢి నడపు
పరుసములు తఁదిపుల, రాయు - చారు, లెదుటఁ
బలుకకుము, సంధి యొక్క వేళ వలసి యుండు. 267

రాష్ట్రమున్ = పరరాజ్యాలను; ఎరియింపుము = జయింపుము. (ఎరియు = మండు - బాధపడు). దుర్గములన్ = వారికోటలను; కొనుము = ఆక్రమించు. తత్ = ఆ శత్రురాజుల; అవరోధము = అంతఃపురాంగనలు; అగపడ్డన్ = ఎదురైతే; పుట్టింటి రూఢి = తోబుట్టువులుగా; రూఢి = ఆచారాన్ని; నెరపు = ప్రదర్శింపుము; తత్ = ఆ శత్రువుల నుండి వచ్చిన; రాయబారుల ఎదుటన్ = దూతల సమ్ముఖంలో; పరుసములు = కఠిన వాక్యాలు; పలుకకుము = పలుకవద్దు; ఒకవేళ; సంధి = సమైక్యం; వలసియుండన్ = కావలసి రావచ్చు కదా.

తా॥ పర రాష్ట్రాలను ఆక్రమించుము. కోటలను పట్టుకొని స్వాధీనపరచుకో. వారి స్త్రీలు ఎదుట పడితే తోబుట్టువులు లాగ ఆదరించు. వారి రాయబారుల ముందు వారిని తెగనాడకు. ఒకవేళ సంధి అవసరం కావచ్చు కదా

విశే॥ విదేశరాయబారులను రాయలవారు సాదరంగా గౌరవించేవాడని పేయస్ అంటాడు. ఈ పోర్చుగీసు రాయబారితో పాటుగా వచ్చిన వారందరికీ అంతఃపుర దర్శనం కూడా అనుగ్రహించాడని- మలయ కూట ప్రాసాద వర్ణనను - అమిత వైభవోపేతమైనదంటూ చెప్తాడతడు. అవరోధ విషయంలోని మాట సామాన్యంగా భారతదేశ చక్రవర్తులవలంబించిన ధర్మమే. శివాజీ కూడ ఇంతే కదా.

ఆ॥ అభిచారి ఘనగరాంబుదూషి తరుక్చ్ఛి
రంతరాద్రి గహనదంతు రాగ్ర
కీకటోర్వి మేరుగిరి సమార్థము వచ్చు
నేనిఁ జొరకు; మంపుమిడుము కొనఁగ.

అభిచారి = మారణహోమాలు చేసేవారున్నట్టి; ఘనగర = కాలకూట విషం (కలిపిన) అంబు= నీరు; దూషిత = కలుషితమైనట్టి; రుక్ = రోగాలతో; దంతుర = దట్టమైన; ఉగ్ర = క్రూరమైన; కీకట = మ్లేచ్ఛజాతులు కల; ఉర్విన్ = రాజ్యంలో; మేరు గిరి సమ బంగారు కొండంత; అర్థము= ఐశ్వర్యం; వచ్చున+ఏనిన్ = వచ్చినప్పటికీ; చొరకు = ప్రవేశించకు; కొనగన్ = ఆ రాజ్యాన్ని జయించటానికి; పంపె = ఆనతియే; ఇడు = (దళాధిపతులకు) ఇమ్ము.

తా॥ అభిచార హోమాలు చేసి రాజులను సేనలను చంపేవారున్నటువంటవీ; కాలకూట విషం కలిసిన నీరున్నట్టి ప్రాంతాలకు; రోగాలు వ్యాపించే కొండలు అడవులు ఉన్న సామాన్య ప్రాంతాలకు; మ్లేచ్ఛజనులున్న ప్రాంతాలకు నీవు పోకుండా సైన్యాధిపతులకు ఆజ్ఞనిచ్చి పంపుము.

విశే॥ 264లో చెప్పిన పోరానిచోట్లు 255వ పద్యంతో కలిపి చదువుకోవాలి - ఇవే రాజు పోరానిచోట్లు.

అభిచారహోమ విషయాలు అధర్వవేదంలో వున్నాయి.

2-39 మధురా చక్రవర్తి వర్ణనలో మంత్రవేత్తగా అతడు వర్ణింపబడ్డాడు. నాటి రాజుల కివి తెలుసు నన్నమాట. విజయానికివి సాధనాలుగా - సేనాదులతో పాటుగా వారు గ్రహించారు.

అంపు మిడుము కొనగ - అని వావిళ్ల పాఠం.

ఇది ఆదర్శప్రభు ధర్మం కాదు కనుక శత్రువుపై ఆరోపింపబడినది.

''అధర్మో పాయదిధాయకంబులగు నుపాయంబుల కుం జొరంజాలనన్'' - (శాంతి.3-3).

క్షేమదర్శి కోసలాధిపునకు కాలకవృక్షీయుడను ముని చెప్పిన దుర్మార్గ నీతి విన్న క్షేమదర్శి మాట పైవచనం. ఈ మైకేవిల్ల రాజనీతి ఆ దేశమాచరించలేదు.

కం॥ రాణింపఁ బల్కి తనపని
జాణై కొనుఁగొలుచు సంతసపుఁదతిఁ; దొలఁనం
ద్రాణ చెడఁ గవుడు మానిసి;
నాణె మెఱుగ బచ్చు గాఁగ నరపతికిఁ దగఁ. 269

కవుడు మానిసి = కపట మానవుడు; రాణింపన్ బల్కి = పదిమంది మెచ్చుకొనేటట్లు పలికి; తన పనిన్ = స్వకార్యాన్ని; జాణ+ఐ = నేర్పరియై; కొనున్ = చేసుకొంటాడు; సంతసపువేళన్ = మంచికాలంలో;

కొలుచున్ = (రాజును) సేవిస్తాడు; త్రాణచెడన్ = మంచిరోజులు పోగా; తొలగున్=(రాజును) పరిత్యజిస్తాడు; కాబట్టి - నాణెము (ఏ లోహంతో తయారైనదో) ఎఱుగు= తెలిసిన; బచ్చుగానన్ = వైశ్యుడగుటకు; నరపతికిన్ = రాజునకు; తగున్ = మంచిది.

తా॥ ఇది బంగారునాణెమా ? ఇత్తడిదా ? అని వ్యాపారికి తెలియాలి. లేకపోతే ఇత్తడిని పుత్తడిగా భ్రమింపవచ్చు. అప్పుడతని వ్యాపారానికి నష్టం. ఇలాగే ఇంపుగా మమ్ముగూర్చి చెబుతున్నాడు కదా ! అని నీచమానవుని దరికి చేరనివ్వరాదు. నీచత్వాన్ని తెలిపే లక్షణాలేమిటి ?

(1) నీవు సుఖంగా వున్నప్పుడు సేవించటం.

(2) కష్టకాలంలో వదలటం.

ఖాండిక్య కేశిధ్వజ సంవాదంలో అడవికి రాజుతో పాటు వచ్చిన వారికి కవుడు మానిసి విరుద్ధం.

కపటమానిసి = వావిళ్ల పాఠం

సీ॥ ''కపటాఖ్య విలసిల్లు గబ్బి గౌరు - - - -
కిటుకు, కౌడు, కవుడు'' - -'' (ఆంధ్రభాషార్ణవం.)

సీ॥ తజ్ఞ మండలిఁ గూర్చి, ధాతువుల్ దెలిపి, హే
మాదులఁగొని, ప్రకృత్యనుగుణాల్ప
జీవనాహృతులచేఁ జెలఁగి, మహాబలో
ద్రేకంబు - మర్దన రిత్తఁజేసి,
స్నేహార్ద్రుఁ డగుచు నశేషంబుఁ బోషించి,
సరవర్ణముల తప్పు సరణులుడిపి,
సతతద్విజ ప్రతిష్ఠాశాలియై బలి
యించు పట్టులు బలియించి, పలుచఁ

తే॥ జేయు పట్టులు పలుచఁగాఁ జేసి వలయు
మెసఁగ శోధన, మఱవక యెసఁగ వలయు
సాంగ రాజ్య మొకెత్తుగ స్వాంగ రాజ్య
మొక్క యెత్తుగ నృపతి యాయుష్య పరత. 270

ఈ పద్యంలో స్వాంగ రాజ్యము - సంగ రాజ్యము అన్న రెండు మాటలున్నాయి కనుక రాజు ఈ రెండింటిని జాగ్రత్తగా కాపాడుకోవాలన్న భావం చాలా గొప్పగా చెప్పబడుతున్నది. కాబట్టి ప్రతి విశేషణమూ - శబ్దమూ రెండింటికీ అన్వయించుకోవాలి.

(1) నృపతి = రాజు; ఆయుష్యపరతన్ = శరీరదృష్ట్యా; పరిపాలనదృష్ట్యా, దీర్ఘాయువును కోరిన

వాడై - తత్+జ్ఞ = పండితులు (1) సప్తధాతువులు (అస్థి - వస - రక్త - మాంస - మేదస్సులు- మజ్జ - శుక్రములు.)

(2) హేమాదిలోహాలు, తెలిసి = ఎరిగి; ప్రకృతి+ అనుగుణ = (1)శరీరస్వభావానికి తగిన; (2) ప్రజలకనుగుణంగా; అల్ప = స్వల్ప; జీవన+ఆహృతులచేన్ = మతభోజన స్వీకరణతో;

(2) పన్ను గ్రహించటంతో; చెలగి = ప్రవర్తించి; మహాబల = (1) వాతము యొక్క; (2) బలవంతులైన శత్రువుల యొక్క; ఉద్రేకంబున్ = విజృంభణను; మరర్ధనన్= మర్దించటం వల్ల (ఒడలు పట్టించుకోవటం వల్ల; శత్రువుల నైతే దండించటం); రిత్తచేసి = వ్యర్థపుచ్చి.

(3) స్నేహ+ ఆర్ద్రుడు+ అగుచున్ = నూనె పూసుకొని (ఒంటి నిండా నువ్వుల పోషించి=పెంపుచేసి; నర = (1) నెరసిన (2) ప్రజల; వర్ణము = (1) రంగుల (2) కులాల యొక్క; తప్పు సరణులు = తప్పిన వర్ణాతులను; దోషప్రవర్తనలను; ఉడిసి = పోగొట్టి

తా॥ నిత్యమూ నూనె రాసుకొని వ్యాయామం చేసి అభ్యంగనం చేయటం వల్ల వెంట్రుకలు వృద్ధాప్యంలో కూడా తెల్లబడకుండా చేసికొని; ప్రేమతో ప్రజలను వర్ణాశ్రమ ధర్మాలను తప్పకుండా కాపాడుతూ చెడుత్రోవను పోయేవారిని శిక్షిస్తూ

(4) సతత = ఎల్లప్పుడు; ద్విజ = దంతముల యొక్క; బ్రాహ్మణుల యొక్క; ప్రతిష్ఠాశాలియై = ఉనికిని కాపాడువాడై; బలియించుపట్టులన్ = బలిసేటట్లు చేసి.

(5) పలుచన+చేయుపట్టులు = కృశింపచేయవలసిన చోట్లు; పలుచగాన్ చేసి = కృశింపచేసి; తేజమెసగన్= దేహకాంతి - వీరత్వము అతిశయించేటట్లు; శోధనన్ = దేహశుద్ధిచేసుకోవటం - శత్రువుల వునికిని వెతికి రాజ్యం నిష్కంటకం చేసుకోవటం; మఱువక= విస్మరింపక; (చూ. 219 పద్యం) స+ అంగ రాజ్యము = సప్తాంగములు గల రాజ్యం; ఒక ఎత్తుగన్= ఒక సిబ్బిగా (త్రాసులో సిబ్బెలను ఎత్తులంటారు) స్వ+ అంగరాజ్యము = సప్తధాతువులున్న శరీరం; ఒక ఎత్తుగన్ = ఒక సిబ్బిగా; (రెండూ సరిసమానంగా ఉండేటట్లు.) ఎసగన్ వలయున్ = వర్థిల్లాలి.

సాంగరాజ్య పక్షంగా (చూ. 3-34) రాజు సుఖ పరిపాలనార్థం తెలిసినవారి నుండి లోహాదుల వునికిని పసికట్టి, స్వర్ణాదులను గ్రహించి, ప్రజల ఆదాయం నుండి కొంచెంగా పన్ను గ్రహిస్తూ బలవంతులైన శత్రువులను దండిస్తూ దయగలిగి అందరనూ సమానంగా పోషిస్తూ వర్ణాశ్రమధర్మ పరిరక్షణ చేస్తూ - ఉత్తమ ద్విజుల ఉనికిని కాపాడుతూ; జనంలేని చోట్ల జన సమ్మర్దం కల్పించి- ఎక్కువైన చోట్ల తగ్గించి జాగ్రత్తగా పాలించాలి.

స్వ+ అంగరాజ్యపరంగా : ఆయుర్వృద్ధి కోసం ధాతువులు తెలిసిన వైద్యులను కూర్చి స్వర్ణాదిభస్మాలను సేవిస్తూ దేహానికి పుష్టి కల్గించుకొంటూ బలిపించుకోతగ్గ వక్షోభుజాలను దృఢం చేసుకొంటూ తగ్గించుకోతగ్గ ఉదరాదులను కృశింపచేసుకొంటూ స్నేహార్ద్రుడై వ్యాయామం చేస్తూ దేహశుద్ధి నేమరక శరీరాన్ని కాపాడుకోవాలి.

అలం : శ్లేష సహిత ఉపమ.

విశే॥ అద్భుతమైన భావన. రాజంటే ఏమిటో వివరించే పద్యం.

సీ॥ సౌఖశాయనిక భిషక్పూర్వకము కల్య
వేళఁ గార్తాంతిక ద్విజుల గోష్ఠి;
జాము వోవ నమాత్య సామంత పూర్వకం
బర్థార్జనస్థ కాయస్థ గోష్ఠి;
దిన మధ్యమమున మర్దన మల్ల పూర్వకం
బగు సూద సూప కృన్మృగయుగోష్ఠి;
యపరాహ్ణమున దేవతార్చనా పూర్వకం
బార్య ధర్మాధికృద్యతుల గోష్ఠి;

తే॥ భుక్తి మీఁద విదూషక పూర్వకము పు
రాణ కవి గోష్ఠి, చార పూర్వకము సంజ
జాము గాయక గోష్ఠి, నిశఁ సుషుప్తి
పూర్వకము ప్రేయసీగోష్ఠి పొసఁగుఁ బతికి. 271

పతికిన్ = రాజునకు, కల్యవేళన్ = ప్రభాత కాలంలో; సౌఖ శాయనిక = సుఖ శయనమైనదా ? అని అడిగేవారలూ, భిషక్ = వైద్యులకు, పూర్వకము = ముందుగా; కార్తాంతిక ద్విజుల = జ్యోతిశ్శాస్త్రవేత్తలైన పండితులతో, గోష్ఠి = సమావేశం -

రాజు లేవగానే ప్రాతఃకాల కృత్యానంతరం ఆనాటి గ్రహ శుభాశుభాలు చెప్పే పండితులతో సమావేశమై - కార్యాకార్యాలు తెలుసుకోవాలి. తర్వాత సౌఖ శాయనికులు - వైద్యులతో గోష్ఠి చేయాలి. జాము పోవన్ = ఒక జాము తర్వాత; అమాత్య = మంత్రులు; సామంత పూర్వకం = సామంతుల సమావేశం కంటె ముందుగా; అర్థ+అర్జన = ఆదాయ సముపార్జనాధికారులతో; కాయస్థ = (వీరే ఆ అధికారులు) వీరితో గోష్ఠి: దిన మధ్యమమునన్ = మధ్యాహ్నం; మర్దన = శరీరం పట్టేవారు; మల్ల = మల్లురు, పూర్వకం = ముందు; సూద = వంట వాండ్రు; సూపకృత్ = పప్పు వండేవారు; మృగయు = వేటగాళ్ళతో, గోష్ఠి

శరీరం మర్దించె మల్లురతో గోష్ఠి కంటె ముందుగా (1) వంట వాండ్రు (2)వేటగాళ్ళతో సమావేశం కావాలి. శాకాహార మాంసాహార విషయకంగా ఇద్దరితో గోష్ఠిచేయాలి. ''జాంగలా మిషముతో శాకపాక మధిర సైరయంగ పీనంబుగా నారగించి'' - (4-135)

అపరాహ్ణమునన్ = ప్రొద్దు తిరిగినాక, దేవతార్చన కంటె ముందుగా; ఆర్య = పూజ్యులైన; ధర్మాధికృత్ = ధర్మాధికారులు, యతుల గోష్ఠి = సన్యాసులతో సమావేశం.

భుక్తి = భోజనం; మిదన్ = తర్వాత, విదూషకులతో గోష్ఠి కంటె; పూర్వకము = ముందు; పురాణ కవి గోష్ఠి = పురాణాలు విన్పించే కవులతో గోష్ఠి చేయాలి; సంజ జాము = సంధ్యాకాలంలో; చార పూర్వకము = చారుల కంటె ముందు గాయకులతో గోష్ఠి; నిశన్ = రాత్రుల్లో; సుషుప్తి పూర్వకము = నిద్ర కంటె ముందు; ప్రేయసీ గోష్ఠి = భార్యా సమావేశం పొసగున్ = తగును.

విశే॥ మనుస్మృతిలో; కౌటిలీయంలో; భారతంలో ఈ విషయమున్నది. (చూ. పీఠిక). పై పద్యం 1వ పాదంలోను - ఎత్తు గీతిలోను చెప్పబడ్డ గోష్ఠులు హితులైన వారితో 2వ పాదంలోని వారు - హితాహితులు. చూ. 273 పద్యం.

కం॥ హితులు హితాహితులు సదా
హితులును నై రాజునెడల నిటు త్రివిధమునన్
క్షితి ననుచరు లుందురు సం
తతమున్; మఱి వారిఁ దెల్పెదన్ విను మనఘా. 272

అనఘా ! = పాపం లేని తండ్రీ !; రాజు నెడలన్ = రాజునకు; త్రివిధమునన్ = మూడు రకాలుగా, అనుచరులు = అధికారులు; క్షితిన్ = లోకంలో; ఉందురు = ఉంటారు.

వారిని గురించి వివరిస్తాను విను.

చ॥ హితులు భిషగ్గ్రహజ్ఞ బుధ బృంద కవీంద్ర పురోహితుల్హితా
హితులు ధనార్జనాది నృప కృత్య నియుక్తులు వెండి కేవలా
హితులు దశావశార్పిత సమృద్ధ రమా హరణేచ్ఛు; లౌట నా;
హితమును నట్లు కాఁ జతుర వృత్తిఁ జరించుట నీతి భూమిపా. 273

భిషక్ = వైద్యులు; గ్రహజ్ఞులు = గ్రహచారం తెలిసిన వారైన జ్యోతిశ్శాస్త్రవేత్తలు; బుధ = పండితుల; బృందము = సంఘం; కవి+ఇంద్రులు పురోహితులు - వీరు ఐదుగురు హిత కోటిలోని వారు- రాజక్షేమాన్ని కోరేవారు.

ధనార్జన+ఆది = ఆదాయ శాఖాధికారులు మొదలైన; నృపకృత్య = రాజకార్యంలో; నియుక్తులు= నియోగింపబడినవారు; హిత+అహిత = శుభాశుభాలను కోరేవారు. ఒక ప్రక్క హితం వాచ్యంగా కోరుతూనే - లోపల అహితాన్ని కోరుతుంటారు.

వెండి = తర్వాత; దశావశ+అర్పిత = సందర్భానుగుణంగా రాజున కర్పింపబడిన; సమృద్ధ = ఐశ్వర్య; రమా = లక్ష్మిని; హరణ = తిరిగి పొందాలన్న; ఇచ్ఛులు = కోరిక కలవారు; కేవల+అహితులు = కేవలం శత్రువులు; ఓడిపోయి కానీ; లంచగొండితనంతో పట్టుబడిగానీ; దొరికిన సందర్భంలో తమ సంపాదనంతా రాజున కర్పించి తిరిగి పొందాలనుకొనేవారు కేవలం శత్రువులు.

ఆ॥ పాత్రభూతు లెస్స పరికించి; యతఁడడు
గకయు నొకఁడు సెప్పకయు మునుపుగఁ

బనసపండ్లు దిగిన పరిగ, స్వప్నము గన్న
నెఱిగ, నొసఁగి మెఱుఁగుపఱుచు టొప్పు. 274

పాత్రభూతున్ = యోగ్యుని; లెస్సన్ పరికించి = బాగా పరిశీలించి; అతఁడు, అడుగకయున్ = అడక్కుండానే; ఒకఁడు చెప్పకయున్ = ఒకడు సిఫార్సు చేయటానికి; మునుపు = ముందుగానే; పనసపండ్లు = వేరు పనసపండ్లు, దిగిన పరిగన్ = పండిన విధంగా; స్వప్నమున్ కన్న = కల గన్న; నెఱిగన్ = విధంగా; ఒసగి = సన్మానం చేసి; మెఱుగు పఱుచుట = ఆశ్చర్యం కల్గించటం; ఒప్పు = గొప్ప కార్యం.

రాజైనవాడు ఎవడు యోగ్యుడో తానే తెలుసుకొని, వాడడక ముందే, ఒకడు చెప్పకముందే - రాజు తగిన బహుమానాదులివ్వాలి. ఇదెలాంటి దంటే - నేల పనసపండ్లు పగిలితే నేల నెర్రెలు కొట్టి దాని నుండి వాసన - ద్రవం రావటం తెలుస్తుంది. ఈ వాసనాదులను బట్టి పండు దిగిందని తెలిసి భూమిని త్రవ్వి - పంట కోసుకొన్నట్లు, కలగన్నట్లు - పూర్వాపర జాగ్రత జీవిత సంబంధం లేనిది కనుక - పాత్ర భూతుని సన్మానిస్తే వాడాశ్చర్యచకితుడౌతున్నాడు కనుక (పనసపండు విషయం - చూ 1-68)

వీడు దరఖాస్తు పెట్టుకోవటం - అధికారి ఔనూ - కాదనటం కాదు. రాజే చూచుకోవాలి.

స్వతంత్రోపమానం. పండ్లు దిగటం = పంట దిగుబడి. నేటికీ వుంది.

కం॥ పితృదేవ క్రియలను విధిఁ
బితృ క్రియలె సూక్ష్మ లగుటఁ బితృభక్తుఁడ వై
శ్రుతి శీల తపశ్శాంతా
చ్యుత భక్తుల కొసఁగి పనుపు మున్న తగతికిన్. 275

పితృ = పితృ దేవతలకు; దేవతలకున్ = అగ్ని మొదలైన దేవతలకు (సంబంధించిన); క్రియలన్= వైదిక క్రతువుల్లో; విధిన్ = వేదానుశాసనంలో; పితృక్రియలె = శ్రాద్ధాదులే; సూక్ష్మలు = విచారించి చేయదగ్గవి; అగుటన్ = కావటం వల్ల; పితృభక్తుడవై = నీ వంశంలోని పూర్వవ్యక్తులకు భక్తుడవై; శృతిశీల = వేద పండితులు; తపః = తపస్వుల; శాంత = ప్రసన్న చిత్తులైన; అచ్యుత భక్తులకున్= విష్ణుభక్తులకు; ఒసగి = దానాదులు చేసి; ఉన్నత గతికిన్ = ఊర్ధ్వలోకాలకు; (పితృదేవతలను) పనుపుము = పంపించు.

మనువు విధించిన పంచ యజ్ఞాల్లో పితృ - దేవతల ఆరాధనలు రెండు యజ్ఞాలు. ఈ రెంటిలో మొదటిది సూక్ష్మం కనుక ఆ పితృదేవతలను ఊర్ధ్వలోకాలకు పంపటానికి వేద పండితులు - తపస్వులు - శాంతాత్ములు - అచ్యుల భక్తులకు విరివిగా దానం చేయాలి.

విశే॥ (1). బ్రహ్మ - (వేద పఠనం - శిష్యులకు చెప్పటం, ఆచరించటం) (2). పితృ - (3). దేవ - (4). నర - అతిథి మర్యాదలు (5). భూత (సర్వజీవులను సమంగా ప్రేమించటం - ఇవి 5 యజ్ఞాలు

- భారతీయ జీవన విధాన సూత్రాలు - 2,3 సూక్ష్మం - 4,5 భౌతికం - కన్పిస్తాయి కనుక ఈ రెంటి సమన్వయ సూత్రం బ్రహ్మ యజ్ఞం - (238లో ? - 276, 264 చూ.)

కం॥ దానము ద్విజరక్షణకును
జ్ఞానము నిజ రక్షణకుఁగ శరణము చొరు మెం
తే; నారాయణు 'రాజ్యాం
తే నరకం ధ్రువ' మటంట దీఱునె యొంటన్. 276

ద్విజ రక్షణకునున్ = పండిత పోషణకై; దానము = 1-43 లో చెప్పిన షోడశ మహాదానాలు (చేయటం కర్తవ్యం); నిజరక్షణకుగన్ = తన భద్రత కోసం జ్ఞానము; (సంపాదించుకోవాలి - ఈ జ్ఞానమే పూర్వకథల్లో నిరూపించబడినది); రాజ్యాంతే నరకం ధ్రువం = రాజ్య పాలనాంతంలో నరకం తప్పదు; అట+అంట = అనేమాట; ఒంటన్ = ఒక విధంగా; తీరదు - (కనుక), నారాయణున్; ఎంతేన్ = అనంతంగా; శరణమున్ చొరుము = శరణని ఆశ్రయించు.

సాధు సత్పురుష పోషణ కోసం దానం చేయాలి. తన పరలోక ప్రాప్తి కోసం జ్ఞానాన్ని ఆశ్రయించాలి. రాజ్యాంత నరక ప్రాప్తిని నిషేధించాలంటే నారాయణ శరణమే మార్గం.

ద్వయమంత్రంలో ద్వితీయచరణం -
శ్రీమన్నారాయణ చరణౌ శరణ మహం ప్రపద్యే -

ఇదే ఇక్కడ ప్రస్తావించింది. ఇద్దరు రాజులూ చేసిన పని ఇదేనని కథల్లో నిరూపించబడ్డది కదా!

తే॥ అలుపతిభక్తి, స్త్రీ పుంసపాళి వావి,
యతి వశిత్వము, దిగుజాతు లగ్రజాతి
ననుసరించుట, హితవృత్తి నధిపు పనికి
భృత్యుఁడొదవుట, నృపదండభీతిఁ జుమ్ము. 277

అలు = భార్య; పతిభక్తిన్ = భర్త మీద ప్రేమతో; వావిన్ = వరుసతో; స్త్రీ+పుంస = పురుషుల, పాళి = సమూహం; యతి = యోగి; వశిత్వము = ఇంద్రియ నిగ్రహం; దిగజాతులు = క్రింది వర్ణాలవారు; అగ్రజాతిన్ = పై వర్ణాలవారిని; అనుసరించటం; హితవృత్తి = శ్రేయోదాయకం; అధిపు పనికి = రాజు కార్యం కోసం; భృత్యుఁడు = సేవకుడు; ఒదవుట = లభించటం; నృపదండ భీతిన్ = రాజదండన భయం వల్ల; చుమ్ము = సుమా!

భార్యకు పతిభక్తి హితవృత్తి. స్త్రీ పురుషులు వావి తప్పరాదు. యతి వశి కావాలి. అగ్ర జాతులను దిగువ జాతులనుసరించాలి. కానీ రాజుకీ ధర్మం వర్తించదు. భృత్యుడు దొరకటం దండభీతి వల్ల తప్ప ప్రేమతో సమాజనీతితో - ధర్మంతో కాదు. పైవన్నీ ధర్మ, నీతి బద్ధాలు, చివరిది కాదు.

భారతీయ సమాజవేత్త కానివాడీ పద్యం వ్రాయలేడు :

(1). గృహస్థాశ్రమ సంబంధి ధర్మం (2). సన్యాసాశ్రమ విషయం (3). సాంఘిక సంబంధం (4) ప్రభుత్వ యంత్రాంగ సంబంధం.

ఇవే ఆశ్రమధర్మాలు. 4వది వానప్రస్థాశ్రమం.

(చూ. MANU DHARMA SASTRA - A STUDY BY KEWAL MOTWANI).

**ఆ॥ చంపి ధార్మికుండు, సతిఁబొంది మఱి బ్రహ్మ**
**చారి, బొంకి సత్యశాలి, యార**
**గించి సదుపవాసి, కేడించి శూరుడు,**
**చింది ధనియు, నగు విచిత్రసరణి.** 278

రాజు; చంపి = చావగొట్టి (శత్రులను, దండించదగ్గవారిని); ధార్మికుండు = ధర్మరాజౌతున్నాడు; సతిన్ = పతివ్రతయైన భార్యను; పొంది = కలసి; మరీ బ్రహ్మచారి ఔతున్నాడు; బొంకి = అబద్ధమాడి; సత్యశాలి = సత్యసంధుడు; ఆరగించి = తిని; సత్+ఉపవాసి = బాగా ఉపవాసం చేసినవాడు; కేడించి = పారిపోయి; శూరుండు = వీరుడు; చింది = దానం చేసి; ధనియున్ = ధనవంతుడు; విచిత్రసరణిన్ = లోకవిరుద్ధ మార్గంగా - అద్భుతంగా; అగున్ = అవుతుంది.

లోకధర్మం వేరు. రాజధర్మం వేరు. హింస చేసి ధర్మాత్ముడు కావటం రాజపాలనలో సూత్రం. లోకంలో కాదు. కురుక్షేత్ర యుద్ధం చేసినా ధర్మరాజే. మధురా చక్రవర్తి కథలో రాణి సతి సత్యాసత్య నిర్ణయానికి భారతంలో కృష్ణుడు చెప్పిన కథ. సత్యము, అహింస - ఈ రెండూ తటస్థిస్తే ఏది ఆచరణీయమంటే అహింసయే కనుక దాని కోసం చెప్పిన బొంకు సత్యమే. తిని ఉపవసించినవాడు అంతే. రాజ ధర్మ నిర్వహణలో శరీర బల మవసరం తప్ప ఉపవాసంతో నీరసం కాదు. చూ. 280. చెప్పబడ్డ జంటలు విరుద్ధాలు. వీటి సమన్వయం రాజర్షి బ్రహ్మము ప్రత్యక్షం కాదు. కనుక ఉపనిషత్తు విరుద్ధ శబ్ద ప్రయోగం ద్వారా రెంటినీ నిరసించి అతీత విషయ ప్రతిపాదనం చేస్తుంది.

అది ధర్మమూ కాదు - అధర్మమూ కాదు. స్త్రీ కాదు - పురుషుడూ కాదు.

ఇలాగ ద్వంద్వ ప్రతిపాదన చేసి నిరసించటం ద్వారా అతీత సత్యం పరోక్ష మార్గంలో బోధించం ఔపనిషద మార్గమేనని మహాచక్రవర్తి రాజర్షి ప్రతిపాదన.

**ఆ॥ ప్రణిధి స్వపురగృహియు, భాషావిదుడు ప్రణి**
**ధ్యంత రావిదుండు నగు; నతండు**
**లింగ మాత్ర కృశుఁడు లిప్సాలిగ ద్రవ్య**
**దాన ధనియుఁ గాక తఱియఁ జొరఁడు.** 279

ప్రణిధి = వేగులవాడు; స్వపుర = రాజనగరంలో; గృహియున్ = గృహమున్నవాడు (కావాలి); భాషావిదుండు

= దేశభాషలు తెలిసినవాడు, ప్రణిధి+అంతర+ఆవిదుండు = ఇతర రాజుల చారులను గుర్తించ గలవాడు; అగు = అయిన; అతండు = వాడు; లింగ మాత్ర కృశుడు = ఏ గుర్తులు లేనివాడు; లిప్స = కోరికను; అతిగ = అధిగమించిన; ద్రవ్య = ధన; దాన దానంతో ధనియున్= ధనవంతుడు; కాకపోతే; తఱియన్+చొరఁడు = వృత్తిలోకి రాడు.) రాజు కొల్వులో ఉండడు

ఇది వేగులవాని విషయం. చారులు రాజనగరంలోనే గృహం (సంసారం) ఉన్నవాడు; దేశభాషావేత్త; ఇతర రాజుల చారులను గుర్తించే తెలివున్నవాడు; ఏ గుర్తులూ లేనివాడు - కావాలి. అలాంటివాడు తన కోర్కెకు మించిన జీతమిస్తే తప్ప రాజు కొలువులో నిలువడు.

ప్రణిధ్యంతర+అవిదుండు - అని వేదం వ్యాఖ్య - వారిచ్చిన ఉదాహరణ అప్రస్తుతం. తెలియనివాడుద్యోగంలో పనికిరాడు కనుక పర రాజుల చారులను గుర్తించగలవాడు కావాలి. ఇతర ప్రణిధులు ఎవరో తెలియకుండా రాజు చూచుకోవాలి. కాని ప్రణిధికి తెలియకూడ దన్న నియమం విధించటం వీలు కాదు. కానీ వారన్నది ముద్రారాక్షసానుసారంగా. కనుక అదీ ఒప్పే. ఈ గూఢచార విషయంలో కౌటిలీయ కామందకీయాలు 9-10 విధాలుగా విభాగించి విస్తరిస్తే ఈ కవి వ్రాసిన పద్య మొకటే. ఉదాస్థితులు, గృహపతిక వ్యంజనుడు, వైదేహిక వ్యంజనుడు, తాపస వ్యంజనుడు, తీక్ష్ణులు, రసదులు, భిక్షుకులు - భేదాలు.

రాయని పద్యంలోని ప్రణిధ్యంతరావిదుండు - అన్నది కాపటికుడన్న గూఢచారి లక్షణంగా కౌటిలీయం చెప్పింది. పరమర్మజ్ఞః ప్రగల్భః ఛాత్రః కాపటికః ఈ పరమర్మజ్ఞతే ప్రణిధ్యంతరావిదుండుగా ఇక్కడ చెప్పబడినది. ఇతరుల రహస్యాలు తెలిసినవాడు గంభీరుడు, శిష్యుడు.

కం॥ తనుభృశ దమనజ సుకృతము
ధనదత్తిన కొనఁగవలయుఁ దత్తదృతుకమ
ర్దన మజ్జన భోజన లే
పన వసన ప్రసవ వహన పరతం బతికిన్. 280

పతికిన్ = రాజునకు; తత్తత్ = ఆయా; ఋతుక = ఋతు సంబంధమైన; మర్దన = సంవాహనం; మజ్జన = స్నానం; భోజన = ఆహారం; లేపన = మైపూత; వసన = వస్త్రాలు; ప్రసవ = పూలు; వహన = ధరించటం; పరతన్ = ఆసక్తితో; తనుభృశ = శరీర సంబంధ అధికమైన; దమన= ఉపవాసాదులతో కృశింప చేయుటం వల్ల ; జ =పుట్టే; సుకృతము = పుణ్యం ; ధనదత్తిన = ధన దానం చేతనే; కొనఁగ వలయున్ = పొందాలి.

రాజు ఆయా ఋతువులకు తగినట్లుగా మర్దనం - స్నానం - భోజనం - మైపూతలు- వస్త్రధారణం - పుష్ప వహనాదులను పాటించాలి. శరీర శ్రమతో - వ్రతాది క్లేశం వల్ల వచ్చే పుణ్య ఫలాన్ని దానాదులచే కూర్చుకోవాలి.

వ్రతోపవాసాదులు రాజునకు తగవు. అంబరీషుని లాగా. కథ భక్తి దృష్ట్యా చెప్పిందే తప్ప రాజ ధర్మ దృష్ట్యా కాదు. ఈ భేదం చూచుకోవాలి.

కం॥ నానావిధ షాడబముల
నాను నృపాహార మెప్పుఁడు, న పరాహ్ణమునం
గాని మఱి శుద్ధకోష్ఠతఁ
గాని, తమి న్భుక్తి యెపుడుఁ గడుఁ బథ్య మగుఁ౯. 281

నానావిధ = అనేక రాకాలైన; షాడబములన్ = రుచులతో; అను = తినే; నృప+ఆహారము = రాజ భోజనము; ఎపుడున్ = నిత్యమూ; అపర+అహ్ణమునన్ = మధ్యాహ్న మతిక్రమించి నపుడు కానీ; శుద్ధ కోష్ఠతత్ = బాగా ఆకలి వేసినపుడు (జీర్ణాశయ పరిశుద్ధి) కానీ; తమిన్ = ఆసక్తితో; భుక్తి = భోజనం; ఎపుడున్ = నిత్యమూ; కడున్ = మిక్కిలి; పథ్యము = మంచిది; అగున్ = అవుతుంది.

నృపాహార నానా రుచులతో - పదార్థాలతో - నిండి వుంటుంది. కనుక మధ్యాహ్నానంతరం కానీ. జీర్ణాశయ శుద్ధి కలిగినపుడు కానీ భోజనం చేయటం పథ్యం.

విశే ॥ షాడ బర సోదాహరణం రస విషయంలో భరతముని ఉదాహరించాడు. ఏలకుల వంటి సుగంధ ద్రవ్యాలతో చేసిన ఒక రకమైన పానకం అందులో అన్ని ద్రవ్యాలు కలిసి మరొక విచిత్ర రుచి వస్తుంది. దాన్ని షాడబ రస మంటారు.

కం॥ విను, వర్గసమత నృపుఁడు
న్నను, ధర్మాంశంబె హెచ్చెనా, పెఱమడి కె
త్తిన నీరును దెగి యలరా
జన పుమడికి నెక్కినట్లు చను ముద మందఁ౯. 282

నృపుఁడు = రాజు; వర్గ సమతన్ = చతుర్విధ పురుషార్థాలను సమానంగా ఆదరిస్తూ; ఉన్నను = ఉంటే; విను = జాగ్రత్తగా ఆలకించు తండ్రీ ! (కుమారునికి చెప్పిన మాట కనుక); ధర్మాంశంబె= ధర్మమన్న పురుషార్థమే; హెచ్చెనా = అధికమైతే; (ఇక చెప్పేదేమిటి ?) పెఱ మడికిన్ = మరొక చేనికి; ఎత్తిన = ఏతం వేసిన; నీరము = నీరు; తెగి = కట్ట తెగి; అల; రాజనపు మడికిన్ = రాజన మన్న వరి చేనికి; ఎక్కినట్లు = పారినట్లు; ముదము = సంతోషం; అందన్ చనున్ = పొందినట్లు ఔతుంది.

రాజు నాల్గు పురుషార్థాలను సమానంగా ఆదరిస్తున్నపుడు ధర్మం హెచ్చిన దంటే పెరమడికి పారే నీరు గట్టు తెగి రాజనాల చేనికి పారినట్లు - సంతోషించ దగ్గ విషయం.

అలం : ఉపమ

వ్యవసాయ సంబంధమైన ఉపమానం చాలా సొగసుగా వుంది. 274లో పండ్లు దిగటం క్రియ లాగా ఇక్కడ మడి - ఎత్తిన - ఎక్కిన క్రియలు నేటికీ రైతు వాడుకొనే మాటలే.

కం॥ వెలయించునట్టి యొక మణి
వెలుఁ గానం గొనుము, ధరణి వెండి సువేషో

జ్జ్వలతకు వలదేవాసర
ములు మణుల విభూషణములు భూపతి దాల్పన్. 283

ధరణిన్ = లోకంలో; వెలయించునట్టి = ప్రకాశించే; ఒక మణిన్; వెలుగు+ఆనన్ = కాంతి నిండారగా, కొనువము = ధరించు; వెండి = పిదప; సువేష+ఉజ్జ్వలతకున్ = మంచి వేష ధారణ యొక్క ఔజ్జ్వల్యమునకై; వాసరముల = ఏడు వారాలకు తగిన; మణుల = నవ రత్నాల; విభూషణములు = నగలు; భూపతి = రాజు; తాల్పన్ వలదే = ధరించ వద్దా ?

లోకంలోకెల్ల శ్రేష్ఠమైన ఒక మణిని ధరించు. దాని వెలుగు ఉజ్జ్వలంగా ఉండాలి. రాజున కుచితమైన వేషధారణ ముండాలి. దానికి తగ్గట్లు ఏ రోజు ఏ మణి మంచిదో అలా ఏడు వారాల నగలు ధరించాలి.

ఇది రాజ వేష సంబంధమైన సూచన.

వెలుఁగానన్ - కటి కానేటట్లు - అన్న ప్రయోగం లాంటిది.

విశే॥ రాయల వారిని దర్శించిన పేయస్ వ్రాత

''ఆ చక్రవర్తి బంగారు గులాబీ పూల నగిషీలున్న వస్త్రాలను ధరించినాడు. మెడలో ఒక వజ్ర పతకమున్నది''

రాయల వారికి రత్నశాస్త్ర పరిజ్ఞాన మున్నట్లు శరదృతు వర్ణనలో స్పష్టపడినది. (4-159)

కం ॥ చేయునది రాజ్య మఁట, యఘ
మేయవధిగ నీఁగువార మే, మనఁ జన; దా
మ్నాయంబు నశక్యాను
ష్ఠేయముఁ జెప్పదు; స్వశక్తిఁ జేయఁగఁ జెప్పున్. 284

చేయునది = చేసేది; రాజ్యము+అఁట = రాజ్యపాలనమట; అఘము = పాపం; ఏ; అవధిగన్ = ప్రమాణంగా; ఈఁగువారము = పోగొట్టుకోగలము; ఏము; అనఁ జనదు = అనుకోవద్దు; ఆమ్నాయంబు = వేదం; అశక్య = శక్యము కాని దానిని; అనుష్ఠేయము = చేయవలసినదిగా; చెప్పదు = విధించదు; స్వశక్తిన్ = శక్తి కొలదిగానే; చేయఁగన్ చెప్పున్ = చేయుమని విధిస్తుంది.

చేసేదేమో రాజ్యపాలనం కదా ! పాప నివర్త నోపాయమేమి ? అని భావించవద్దు. వేదం చేయటానికి శక్యం కాని దానిని విధించదు. స్వశక్తికి లోగిన దాన్నే విధిస్తుంది.

వ॥ మనుదండ ధరాదులు విశేషించి దోషం బెఱింగి దండించియె ధర్మ పరులనఁబరఁగిరి; ప్రజాపరిపాలనంబు పనిగాఁ బ్రజానాథుండు బహుముఖంబులం బుట్టింపం బుట్టి విరట్ప్రమాట్ప్రభృతి వేదోదిత శబ్ద వాచ్యుండై దేవ సదృశుం డగు మూర్ధాభిషిక్తుడు సోఁకోర్చి యలకు నగునలజళ్లు తీర్చినం గాక జన్మంబు సఫలం బగునె ? కేవలేంద్రియ ప్రీతి బందీకృత పరకళత్ర పథిక పరిషత్ప్రహరణ ప్రాప్తి

విత్తమ్ముల౯ బాటచ్చర ప్రభులకు జరగదే ? యింత లాంపట్య మేమి పని యని యవని యెడ నవన వైముఖ్యంబు చెల్ల; దెట్లనినఁ దొల్లి కృతయుగంబుఁ గృతవార్య నందనుండగు సహస్ర బాహుం డాత్మీ దోస్తంభ సంభృత యగు నీవిశ్వంభర నే ద్వీపంబున నేనాఁట నేవీట నేత్రోవ నేక్రేవ నేవేళ నెవ్వఁ డేమి సేయం దలంచు నప్పుడందందు నసి యముసల చాపాది శస్త్రాస్త్రధారియై తోఁచి యాజ్ఞయిడు; నట్లాజ్ఞ యిడ నంతిమం బగు నీ యుగంబున యుగానుసారంబుగా మితసారం బగు రాజలోకంబునకు శక్యంబు గాదు గదా ! యొక్క రాజలోకంబున కన నేల ? యిక్కాలంబునందలి భూసురులకు నక్కాలంబు నందలి భూమిదివిజులకుఁ గల శక్తి యున్నదె ? యొక్క బాడబుండు కడలి నీరు గ్రుక్కగొనియె; నొక్క విప్రుండు స్రష్టకిఁ బ్రతిస్రష్టయయ్యె; నొక్క బ్రాహ్మణుండు బ్రహ్మదండంబున బ్రహ్మాస్త్రంబు వారించె; నట్టియనుష్ఠానంబు మాకు లే దిందేమి ప్రయోజనం; బని శక్త్యనుష్ఠానంబు వీరికి విడువవచ్చునే ? వీరితరుల కుపాసనీయములు గాకపోయిరె ? కావున సావధానుండవై శక్తి కొలది శ్రుత దృష్టంబు లుపేక్షింపక రక్షణ శిక్షణంబు లాచరించుచు నశక్యంబున కార్త శరణాగత రక్షకుండగు పుండరీకాక్షు మీఁద భారంబిడి యనహంకృతిఁ బ్రవర్తిల్ల నెల్ల సంసిద్ధులు కరస్థంబులగు – నది యట్లుండె, నట్లయిన పట్టబద్ధుండగు రాజు ధర్మంబునంద దృష్టియిడి నడవవలయు; వరుణ వైశ్రణ వాయు వైశ్వానర వాసవాదుల జన్మంబులును బహు భవారబ్ధ క్రియాలబ్ధంబుల భూర్భువస్స్వరాదులగు నిజ్జగంబులును ధర్మ ప్రతిష్ఠితంబులు కావునఁ దదాచరణ చణుండవై ఋణత్రయంబును నీఁగి సమానులం దుత్తమ శ్లోకుండవై రాజ్యపరిపాలనంబు సేయుమని యభిషిక్తుం జేసె. నిది మదీయ భక్త ప్రభావం'' బని యంబుజాలయ కానతిచ్చె. 285

మను = మనువు; దండధర+ఆదులు = యముడు మొదలైన వారు; వివేష్ఠించి = మిక్కిలి; పనిగాన్ = కర్తవ్యంగా; ప్రజానాథుండు = ప్రజాపతి; బహుముఖంబులన్ = అష్ట దిక్పాలకుల అంశలతో; విరాట్ - సమ్రాట్; ప్రభృతి = మొదలైన; వేద+ఉదిత = వేదంలో చెప్పబడిన; శబ్ద= మాటలతో; వాచ్యుండై = చెప్పబడ్డవాడై; సదృశుండు = సమానుండు; మూర్ధ+అభిషిక్తుండు = పట్టాభిషిక్తుడు; సోకు = శ్రమ, అలజళ్ళు = ఉపద్రవాలు; ఇంద్రియ ప్రీతిన్ = పంచేంద్రియ సుఖాలకై; బందీకృత = బంధించిన; పర కళత్ర = శత్రుభార్యలు; పథిక= బాటసారుల; పరిషత్ = గుంపు; ప్రహరణ = కొల్లగొట్టటం; ప్రాప్త = లభించిన; విత్తమ్ములన్ = ధనంతో; పాటచ్చర ప్రభులకున్=దోపిడిగాండ్రైన రాజులకు; జరగదె = కాలం-జీవితం జరుగ లేదా; లాంపట్యం = లంపటత్వం; వ్యామోహం; అవని యెడన్ = రాజ్యం విషయంలో; అవన= కాపాడటం; వైముఖ్యంబు = విముఖత్వం; కృతవీర్య నందనుండు = కృతవీర్యుని కొడుకు - కార్తవీర్యుడు; ఆత్మీయ = తన; దోః స్తంభ = స్తంభాల వంటి బాహువులు, సంభృత = భరింపబడిన; విశ్వంభర = భూమి; క్రేవన్ = ప్రక్కలో; అసి = కత్తి; ముసల = రోకలి; చాప = విల్లు; ఆజ్ఞయిడున్ = ఆజ్ఞాపిస్తాడు; మిత = పరిమితమైన; సారంబు = శక్తి; రాజలోకంబునకున్ = రాజ సమూహానికి; బాడబుండు = బ్రాహ్మణుడు; కడలి = సముద్రం; గ్రుక్క = పుడిసిలి; ప్రతిస్రష్ట =

మూరు సృష్టి కర్త ( విశ్వామిత్రుడు), బ్రహ్మదండంబునన్ = యోగులు ధరించే కర్రతో (వసిష్ఠుడు); అనుష్ఠానం = తపస్సు), ఉపాసనీయులు = పూజ్యులు; శ్రుత = విన్పించునది; దృష్టంబు = చూడబడినది; అశక్యంబునకున్ = అలవిగాని దానికి, ఆర్త= ఆర్తితో; శరణాగత = శరణని వచ్చిన వారికి; రక్షకుండు = రక్షించేవాడు, అనహంకృతిన్ = అహంకార రహితంగా; కరస్థంబులు = అరచేతిలోనివి; వైశ్రవణ = కుబేర; వాసవ = ఇంద్ర; బహుభావ = అనేక జన్మల్లో; ఆరబ్ధ = ప్రారంభించిన; క్రియా లబ్ధంబులు = యజ్ఞ ఫలాలు = భూః = భూలోకం; భువః = అంతరిక్షం; స్వర్ = స్వర్గలోక; ధర్మప్రతిష్ఠితంబులు = ధర్మమే ఆధారంగా కలపి ( లోక సృష్టి చేసి భగవంతుడు అందరి సుఖ శాంతుల కోసం ధర్మాన్ని సృష్టించాడన్న ఉపనిషత్కథను అనుసంధించుకోవాలి.); తత్ = దానినే; ఆచరణ = ఆచరించటంలో; ఏణుండు=సమర్థుడు; ఋణత్రయంబు = మూడు ఋణాలు; ఋషి; దేవ, పిత్ర ఋణాలు; ఉత్తమ శ్లోకుండు = గొప్ప కీర్తి కలవాడు;

మదీయ భక్త ప్రభావంబు - స్వామి వక్త కనుక కథా ప్రారంభం చేసింది తానే అతంలో తానే మధ్యలో యామునుని అంతర్యామిగా; ఋతు వర్ణనల్లో ఎడనెడ కన్పిస్తూ; మయుగింపులో తళుక్కుమంటూ - కథలో అంతస్సూత్రంగా తానే వున్నాడు. కేకనే నాయకుడతడే ఈ కథకూ- కావ్యానికీ. ( చూ. పీఠిక - నాయకుడన్న అంశం) అంబుజ+ఆలయ = పద్మమే నివాసంగా కల లక్ష్మి - శ్రోత.

ఆశ్వాసాంతాలు

శా॥ దుగ్ధాంభోధి మహాగృహోత్సుక, సుధాంధో బృంద చూడామణీ
రుగ్ధారాశ బలీ కృతాంఘ్రి యుగ; కారుణ్యాంబు సింధూభవ
ద్దృగ్ధామా; ధృతమంథ; సింధుర వరార్తి క్షేపి దోశ్చక్ర; శ్రీ
ముగ్ధాలా పర సాదరా; కృత పలాన్మూర్ఛ స్వనో ద్యద్దరా. **286**

దుగ్ధ+అంభోధి = పాల సంద్రమన్న; మహా = విశాల, గృహ = నివాస స్థానం మీద; ఉత్సుక = ఆసక్తి కల సామీ !, సుధా+అంధస్ = అమృతమే ఆహారంగా కల దేవతల; బృంద = సమూహానికి; చూడామణీ = కిరీట రత్నాల యొక్క; రుక్+ధారా = కాంతి ప్రవాహంతో; శబలీకృత = నానా వర్ణాలుగా చేయబడ్డ; అంఘ్రియుగ = అడుగుల జంట కల స్వామీ !; కారుణ్య+అంబు = దయారసముకు; సింధూభవత్ = సముద్ర మౌతున్న; దృక్+ధామా = చూపులకు నెలవైన వాడా !; ధృత = ధరించిన; మంథ = మంథర పర్వతం; సింధుర వర = గజరాజు యొక్క; అర్తి=దైన్యాన్ని; క్షేపి = పోగొట్టే; దోః చక్ర = బాహువుల్లో చక్రమున్న వాడా ! ; గజార్తిని చక్రంతో పోగొట్టిన వాడు); శ్రీ = లక్ష్మీదేవియొక్క; ముగ్ధ+ఆలాప = ముద్దు పలుకులందున్న; రస = శృంగార రస మందలి, ఆదరా = ఆదరమున్న వాడా ! ( యామునాచార్యుని కథా ప్రారంభ పద్య వ్యాఖ్యానం చూచుకోవాలి.); కృత = చేయబడిన; పలాత్ = రక్కసుల; మూర్ఛ = మూర్ఛపోగొట్టగల; స్వన = ధ్వనిచే; ఉద్యత్ = విజృంభించే; దర = శంఖమున్న ప్రభూ !

రాక్షసుల గుంపులను కేవల ధ్వని చేతనే మూర్ఛపొందించగల పాంచజన్య మన్న శంఖం ధరించేవాడా! ఇక చక్రంతో పనేమిటంటే - భక్తార్తిని పోగొట్టటం -

... సిరిలో నివసించటమే ఉత్సాహంగా కలవాడు. దేవతల కిరీట రత్నాల వివిధ కాంతులతో ... పాద ద్వయం కలవాడు, దయారసం చిందుతున్న నేత్రాలున్నవాడు, పర్వత - గజార్తిని ... బాహువులు - చక్రమున్నవాడు - శంఖ ధారియైన స్వామీ !

చ॥ పరధృత దరారి వితరణ
పరిపాలిత తొండమాన్నృపాలక, పునరు
త్తరిత నరనప్తృ బాలక,
శరణాగత సేవధీ, భుజంగాశరథీ. 287

... దేహంలో ధరింపబడిన, దర = శంఖ; అరి = చక్రాలను, వితరణ = దానం చేయటం వల్ల; ... రక్షింపబడ్డ, తొండమాన్ నృపాలక = ఆ పేరు గల రాజు గలవాడా !; పునః = తిరిగి; ఉత్తరిత ... బడిన, నర = అర్జునుని, నప్తృ = మనుమడైన బాలక = పరీక్షిత్తు కలవాడా; శరణ+ఆగత ... శరణాన్ని వారికి కొంగు బంగారమా; భుజంగ+ఆశ = పాములే ఆశనం - ఆహారం గల ... రథ = రథమైన వాడా.

... ధర్మపదన్న రాజునకు - ఆకాశరాజు - తొండమానుడు జన్మించాడు. ఆకాశరాజు కూతురే ... ఆమెను శ్రీనివాసుడు వివాహం చేసుకొన్నాడు. ఆమె సోదరుడు వసుధానుడు. ఆకాశరాజు ... రాజ్యం కోసం కలహం కాగా - స్వామి తన భక్తుడైన తొండమానునకు శంఖచక్రాలిచ్చి ... సాధించినట్లున్నది - పరీక్షిత్కథ భాగవత ప్రసిద్ధమే.

మత్త. కుండలి ద్విష దుదగ్ర కేతన, గోత్ర భిద్ద్రుమ హారిదో
శ్చండి మోత్పుల కీ కృతాంగక సత్య, దౌత్యకురూక్తవా
క్పాండితత్వ, యశోనిధీకృత పాండవేయ, కపర్దికో
దండ ఖండని పాట వాంచ దుదార దార సమాగమా. 288

... - పాములకు; ద్విషత్ = శత్రువైన గరుత్మంతుడు; ఉత్+అగ్ర = (గుర్తుగా) పైనున్న; కేతన = ... వాడా !, గోత్రభిత్ = కొండలను నరికిన ఇంద్రుని; ద్రుమ = చెట్టును; హారి=హరించిన; దోః ... మొక్క, చండిమ = పరాక్రమంతో; ఉత్+పులకీకృత = బాగా పులకించిన; అంగక - ... సత్య = సత్యభామ కలవాడా !

... హరించి తేవటంలో ప్రదర్శించిన స్వామి పరాక్రమానికి సత్య పులకించిపోయింది, ... రాయబారంలో; కురు = కౌరవులైన పెద్దలు; భీష్మాదులతో; ఉక్త = పొగడబడ్డ; వాక్ - ... పాండిత్య = పాండిత్యం కలవాడా. (తిక్కనగారి నిర్వహణ చూచుకోవాలి.)

... కీర్తికి, నిధీకృత = నిలయంగా చేయబడిన; పాండవేయ = అర్జునుడు కలవాడా!

... అతనికి సారధి కావటమే ఈ వాక్య తాత్పర్యం.

కపర్ది = శివుని ( జటాజూటం కలవాడు కనుక), కోదండ = విల్లును; ఖండన = ముక్కలు చేయటంలోని; పాటవ = పటుత్వంతో; అంచత్ = ప్రకాశిస్తున్న; ఉదార = మహోత్కృష్టమైన; దార = భార్యయొక్క; సమాగమా = కలియక పొందినవాడా ! గరుత్మంతునిచే చిహ్నమైన కేతనం కలిగి, ఇంద్రుని ఉద్యాన వృక్షాన్ని పెకలించి తెచ్చి సత్యకు సంతోషం కల్గించి, కౌరవ సభలో దౌత్యం నెరవేర్చి భీష్మాదులతో మెప్పు పడని, అర్జునునకు అఖండ యశస్సు కల్పించి, శివు కోదండ అంతటి ప్రసన్న - ప్రశాంత చిత్తను భార్యగా పొందదిన - వివిధ కథలకు నెలవైన వాడా-నమస్కారం.

శ్రీకృష్ణ గాథయే ఎక్కువ స్మరింపబడటం గమనార్హం

శా॥ ఇది సింహాచలదంభకేసరి పదాభీష్టార్చనా పుణ్యల
బ్ధదురుట్టం కణ పొట్టు నూరి విజయ స్తంభోపలోట్టం కితాం
కదృఢేష్టాక్షర కృష్ణరాయ నృప సంజ్ఞాస్మత్కృతా ముక్తమా
ల్యద నాశ్వాస వరంబు నాలవది హృద్యంబై మహిం బొల్పగుా. 289

సింహాచల = సింహాద్రిపై వెలసిన; దంభకేసరి = మిషామూర్తియైన నృసింహస్వామి, పద = పదాలను, అభి+ఇష్ట = మిక్కిలి భక్తితో; అర్చనా = పూజించటం వల్లనైన; పుణ్యా = సుకృతంతో; లబ్ధ = పొందబడిన, దురుట్టంకణ = కష్టంతో చెక్కిన; పొట్టునూరి = భీముని పట్నం దగ్గర ఊరు; విజయస్తంభ = గజపతిని జయించిన కథను చెక్కిన స్తంభపు; ఉపల = రాతిపై; ఉట్టంకిత = ఉట్టంకింపబడిన (చెక్కిన), అంక = గుర్తుగా కం; దృఢ = చెదరని; అష్ట+అక్షర = ఎనిమిది అక్షరాలు కల (శ్రీకృష్ణరాయనృపతి), సంజ్ఞ = నామం కలవాడనైన, అస్మత్ = మా యొక్క; ఆముక్తమాల్యదలో; ఆశ్వాసవరంబు = శ్రేష్ఠతరమైన ఆశ్వాసం; నాల్గవది, హృద్యంబై = హృదయావర్జకమై, మహిన్ = లోకంలో; పొల్పు+అగున్ = ప్రకాశిస్తుంది.

గజపతిపై విజయం లభించిన చోటు పొట్నూరు. బహుశా అక్కడ యుద్ధం జరిగి వుంటుంది ప్రతి ఆశ్వాసాంతంలోనూ యుద్ధ రంగ స్థలమే పేర్కొనటం గమనిస్తే రాయలకా దృష్టి ఉన్నట్లు - చారిత్రక సంఘటనను సూచించే తలపున్నట్లు స్పష్టపడుతుంది. కనుక అక్కడనే విజయస్తంభం చెక్కించాడు మహావిజేతగా. ఆ స్తంభం మీద చెక్కినవి అష్టా ర సంజ్ఞ - శ్రీకృష్ణదేవరాయలు - ఆ పేరు గల మా కావ్యంలో ఇది నాల్గవ ఆశ్వాసం. శ్రేష్ఠతరం. ఇదంతా సింహాచల దంభ కేసరి అనుగ్రహ విశేషం.

విశే॥ రాయలవారు విజయానంతరం యుద్ధరంగ సమీపంలోని క్షేత్ర దైవ దర్శనం చేయటం - స్వామిని వివిధ బహూకృతులతో అర్చించటం అలవాటు. ఆయా యుద్ధరంగాలకు వస్తూ పోతూ వున్నపుడు శ్రీవేంకటేశ్వరుని దర్శించటమూ జరిగేదట.

ఇతర యుద్ధ విజయాల్లో లేనిది - ఈ ఆశ్వాసాంతంలో ఉన్నదీ దైవానుగ్రహం. కనుక ఆశ్వాస వరంబు. ఇంతే కాక రాయల వారి ఆత్మవస్తువు నిక్షిప్తమైన కథ ఈ ఆశ్వాసమే. ఆ ఆత్మవస్తువు-

ఋతు వర్ణనల ద్వారా తెలుగుదేశ సంకీర్తనం.

రాజనీతి కథనం ద్వారా ఆత్మ ధర్మపాలనావిష్కరణం.

కవి సమ్రాట్టు విశ్వనాథ వారన్నారు - ''మాల దాసరి కథ యందు రాయలే యున్నాడు'' అని. ఈ రాయలు మహాకవి. ఈ నాల్గవ దానిలోని రాయల వారు మహా చక్రవర్తి రాజధర్మశాస్త్ర కర్త కవికి అదనంగా నున్న లక్షణమిది. ఇందుకే కావ్యంలో ఇదే బృహత్తమాశ్వాసం.

ఇష్టాక్షర - పూర్వపాఠం. ప్రియమైన అక్షరాలు - ఎవరికి ప్రియం ? తనకే కదా ! ప్రీతి. కనుక ఇష్ట - దీనికాధారం -

అతని సామ్యంబు గని ముక్తుఁడగు, సురాది
భేద సంజన కాజ్ఞాన మేదఁ బిదప
నలము కళ్యాణ గుణముల హరికిఁ దనకు
లేని భేద మెవ్వాఁడు కల్పింపగలడు ? (3-86)

ఈ విజయ సంకీర్తనం మనుచరిత్ర – తిమ్మరుసు బాలభారత వ్యాఖ్యావతారికలు చాలా అందంగా చేశాయి.

స్వామి దయతో ఈ విజయం లభించిన దనటంలో భక్తే కాక చారిత్రక సత్యమూ వున్నది. గజపతికి 16 మంది సామంతులుంటే వారిని భేదోపాయంతో చీల్చి - చంపించిన వాడు తిమ్మరుసు. ఈ ఉపాయస్ఫురణ కీ స్వామి కారకుడన్నట్లున్నదీ పద్య భావం.





# ఆముక్తమాల్యదా సౌందర్యం

## పంచమాశ్వాసము

## గోదా కథా నిర్మాణ విశ్లేషణ

## చూళిక

అండజ గామిని - అన్న 5 - 25వ పద్యం, నిర్మాణ శిల్ప భూమికగా కథా నిర్మాణ శిల్పం చూడవచ్చు.

ఈ 25వ పద్యమంతా - కథ లాగానే - రస+తత్త్వ సమ్మిశ్రణం. పద్యంలో కుండలినీ శబ్దప్రయోగం దానికి సూచన. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ప్రాణశక్తి వాహికలు, స్పందనలు. ఆ ప్రాణశక్తికి హంసప్రతిమ. దీని స్పందనలైన ఉచ్ఛ్వాస నిశ్వాసాలను యమించటం ప్రాణాయామం. అది కుండలినీ ఉత్థాపనకు - మేల్కొలిపే సాధన - అంటే, ప్రాణాయామం ద్వారా కుండలిని సుషుమ్నలో ప్రవేశపెట్టటం - కనుక అండజ గామినితో పద్యం ప్రారంభమైనది.

గోదాదేవి (నాయికా సౌందర్య) వర్ణన భామారత్న (8) మన్న మాటతో మొదలైనది. ఇది కథా రహస్య సూచకమైన నాందీ వచనం. 74వ పద్యానికి వెళ్ళేసరికి భామారత్న మంటే శృంగార నాయికయైన సత్యభామ అని స్పష్టపడుతుంది. కనుక ఈ కథలోని ఆధ్యాత్మిక తపస్సు శృంగార రస యోగం.

ఈ మహాకావ్య దేవాలయంలో పంచమాశ్వాసం గర్భగుడి కనుక 'పంచమం' బలరున్ అని ఆశ్వాసాంతంలో కవి వాచ్యం చేసాడు. పంచమ స్వనం వసంత సూచకం. కనుక ఈ కథకు నేపథ్యం వసంతం. ప్రథమ పాండ్యుని కథకు గ్రీష్మకు (వైరాగ్య ప్రతీక) యామునాచార్య కథకు వర్షాశరత్తులు రాజ్యధర్మ ప్రతిష్ఠాపన మన్న మహార్థ వ్యంజక ఋతువులవి. ఇది ప్రాచీన నాటక సంప్రదాయం. దాన్ని శ్రవ్య కావ్యానికి అన్వయించినవాడు ఈ మహాకవి. ఈ కథా గమనంలో ఇది ప్రముఖ సూత్రం.

కథ శృంగార రసాత్మకం కాబట్టి కేవల రస శిల్పమే అనుస్యూతంగా ఉంటుంది తప్ప ఇతర కథా శిల్పాదులుండవు.

వేయిపడగల్లో గిరిక నాట్యాధ్యాయం - విక్రమోర్వశీయంతో దీన్ని పోల్చుకొని ఆస్వాదించగలగటం ఒక వాఙ్మయ రస తపస్సు. ఈ కథలో మూడే పాత్రలు. (1) కవి - సూత్రధారుడు. (కూచిపూడి భాగవతంలో, వేయిపడగల నాట్యాధ్యాయంలో భోగప్పశాస్త్రి వంటివాడు) (2) గోదాదేవి - నాయిక (కూచిపూడి భామాకలాపంలో భామే ఈమె). (3) చెలికత్తెలు.

1-39 దాకా కవి చేసిన నాయికా వర్ణనం. 40 నుండి 54 దాకా గోదాదేవి అవతారాల నాక్షేపించినది. 55 మరలా సూత్రధార వచనం కథను కలిపే సంధి వచనం. 56 చెలుల మాటలు. 57 గోదా వాక్యం. 59 - 63 దాకా చెలికత్తెలు గోదా రతి స్థాయిని వ్యంగ్య వైఖరిలో బహిర్గతం చేయటం. 65 - వారి మాటలను నాయిక త్రోసిరాజనటం. 66 మరలా సూత్రధార వచనం. 67 నుండి 70 దాకా అపూర్వమైన స్వగతాలాపం. (ఏకాంకికల్లో ఏక పాత్ర మాట్లాడుకోవటం లాగా). 71 మరలా సూత్రధార వచనం. తర్వాతి మూడు పద్యాలు 72, 73, 74 చెలికత్తెల సంభాషణలు. 75 మరలా సూత్రధార వచనం. 77 సకియల మాటలు. 78 కవి మాట 79, 80, 81 నాయిక మాటలు. 82, 83 సఖుల ఓదార్పులు. 84 నుండి 87 దాకా నాయిక లోకోత్తర విరహం. 88 మరలా సూత్రధార వచనం. 89 నుండి 95 దాకా గోదాదేవి చేసిన వ్రత వర్ణన - కవి రచన.

ఇది రచనా ప్రణాళికలోని శిల్ప సౌందర్యం కవిలో వర్ణించే కావ్య కవి (చివరి వ్రత వర్ణనల్లో), నాట్యంలో సూత్రధార పాత్ర - (సంధి వచనాల్లో) ఈ రెండు విషయాలు భావిత రమణీయాంశాలు.

ఈ 95 పద్యాల్లో సంభాషణలు - స్వగతాలు - సంధివచనాలు - వర్ణనలు - ఒక రస స్రోతస్విని. ఒక విక్రమోర్వశీయం. ఒక గిరిక నాట్యం. అంతా సంగీత నాట్య సాహిత్య సంగమేశ్వరం. త్రినదీ సంగమ క్షేత్రం.

ఈ కథలో భగవంతుని గురించి గోదాదేవి ప్రయోగించిన మాట అతడు - తాను- ఇతడు - ఈతడు - (37, 40, 41, 44, 45, 46, 52, 53, 54, 58, 59) - ఇవన్నీ వేదాంతంలో సః; తత్-శబ్ద బోధకాలు. ఆ వేదాంత మలా ఉంచి దాన్ని అడుగున పాతేసి, పైకి తేలినది శృంగారం. సంస్కృత నాటకాల్లో (చూ. కుందమాల) నాయకుడు నాయికను 'వరాకి' అన్నట్లు శృంగార పిచ్చిలమైన శబ్దాలివి.

## పంచమాశ్వాసం

కం॥ శ్రీ నీళా జాంబవతీ
మానస తామరస విహారమాణమిళిందా!
భానద్భ్యుదయ కళిందా।
నానాంఘ్రి శిరోక్ష శేషనగ హర్యక్షా!

అ : శ్రీ = లక్ష్మి; నీళా జాంబవతీ = నీలాదేవి, జాంబవతీ దేవులయొక్క; మానస = మనస్సులన్న; తామరస = తామరపూలలో; విహరమాణ = విహరిస్తున్న; మిళిందా = తుమ్మెదా !; భా = కాంతి (నల్లని); నది = ఏరుయొక్క; ఉదయ = జన్మకు; కళిందా = కళింద పర్వతమైన వాడా !; నానా = అనేక; అంఘ్రి = పాదాలు; శిరః = తలలు; అక్ష = నేత్రాలు కలవాడా !; శేషనగ = శేషుడే కొండగానైన తిరుమలపై (విహరించే); హర్యక్షా = సింహమా !

శ్రీ నీలా జాంబవతుల మనస్సులన్న తామరపూలలో విహరించే తుమ్మెదా ! నల్లని శరీర కాంతి వంటి యమున పుట్టుకకు ఆధారమైన కళిందపర్వతంవంటి దేహం కలవాడా! అనేక చరణ శిరో నేత్రాలున్న విశ్వమూర్తీ ! శేషపర్వతం మీద విహరించే సింహమా !

తిరుమలేశ్వరుడు నీలవర్ణుడు కనుక మిళిందమనీ, కళిందపర్వతం నుండి ప్రవహించే యమున వంటి నల్లని కాంతిని ప్రవహింప చేసే వాడనటం - సొగసు - అతడు సింహమనటం పూర్వాశ్వాసాంత సింహాచల దంభకేసరి వాసన రాయలవారి మనస్సును వీడలేదు - పైగా విజయనగరంలో లక్ష్మీయోగ నారసింహమూర్తిని చెక్కించిన కాలమిదే.

అలం : అంత్యానుప్రాసం.

విశే॥ నీలకు ఆళ్వార్ల స్తుతుల్లో ప్రాధాన్యమున్నది. గోదాదేవి కూడా తిరుప్పావైలో కృష్ణున కిష్టమైన భార్యగా చెప్పింది. ఆమే గోదాదేవిగా శ్రీవైష్ణవం చెప్పింది కనుక పద్యమలా ప్రారంభమైనది.

వ. అవధరింపు మవ్విష్ణుచిత్తుఁడు. 2

ఆ విష్ణుచిత్తుండు - 4వ ఆశ్వాసం 35వ వచనంలో ఏ విష్ణుచిత్తుడు స్వపుర ప్రవేశం చేసాడో... ఏ విష్ణుచిత్తుడు మధురా చక్రవర్తిని భాగవతుని చేసి దైవానుగ్రహం పొందాడో- ఆ విష్ణుచిత్తుడని - పూర్వ కథతో ముడి.

మధ్యలో వచ్చిన యామున కథ ప్రాసంగికం తప్ప ప్రధానం కాదు. ప్రధాన కథ విష్ణుచిత్తునిది అని తాత్పర్యం.

స్ర॥ ఒకనాఁ డాగ్రామంకు రౌఘం బురుకుసుమకుడుం 'గోద' రక్షోణిఁ దల్ప
ప్రకరం బై కాంక్షచే మున్సతులఁ బదరి పైఁ బ్రౌఢి వాటించి నిట్టూ
ర్పెకదొట్టఁగ డస్సి వీరాయిత మఱి మఱి తా రెట్ల మున్నట్ల యౌ నా
యికలం గందర్పుఁ డోటం బెటిఁగి తఱిమి వీఁపేసెనా నంటు తోఁటన్. 3

అవతారిక : ఈ పద్యంలో కాయికకామ శృంగారం వర్ణింపబడుతున్నది. రాబోయే దివ్య శృంగారానికిది నీడ-వక్రచ్ఛాయ, నీళ్ళలో రూపం తలక్రిందులుగా, అద్దంలో ప్రతిబింబం కుడి ఎడమలుగా కన్పించినట్లు ఊర్ధ్వలోక శృంగారాని కిది వక్రీభూత రూపమన్నమాట.

[illegible] ఆతసప్ప్రయా రూపాత్మాన్ ఉన్నాయన్న ఉపనిషదుక్తి దృష్ట్యా చూచుకోవాలి. ఛాయ [illegible] (వెలుగు) పోయినట్లు దివ్య శృంగారం కూడా భౌతిక ప్రతీకల ద్వారా ధ్వనితం కావలసిందే. [illegible] ముఖ్యం తప్ప భౌతిక ప్రతీక - ఛాయ ముఖ్యం కాదు. భారతీయ మైథున శిల్ప దృష్టి [illegible]

[illegible], ఆమ్ర = మామిడి, అంకురంబు = చిగురాకుల; ఓఘుంబు = గుంపు; ఊరు = సెజ్జ; కుసుమ [illegible] = పొదరిండ్ల; ఉదరక్షోణిన్ = మధ్యస్థలంలో; తల్ప = శయ్యల; ప్రకరంబు = [illegible]; [illegible] కాగ (పూపొదరిళ్ళ గుంపు నడుమ మామిడి లేచిగురాకులు సెజ్జలు కాగా); మున్ = ముందు; [illegible] - [illegible], సదరి = ఆక్షేపించి; ప్రౌఢి = పీరాయితమును; పాటించి = నిర్వహించి; [illegible] = [illegible] = దట్టమైన శ్వాస; ఎకదొట్టన్ = అతిశయిస్తే; పీరాయితమున్= పురుషాయితను ([illegible]), అజీ = త్యజించి; మజీ = పిదప (పతుల సురతక్రియను ఆక్షేపించి నాయికలు [illegible] లను స్వీకరించి ఉపరి సురత క్రీడలో అలసి నిట్టూర్పు అతిశయింపగా- ఆ పనిని మాని); [illegible] = ఈ ఉపరి సురత క్రియకు ముందు; తారు = స్త్రీలు; ఎట్లు - అట్లు = ఏ విధంగా క్రింద [illegible] లాగ; ఔ, నాయికలన్ = పత్నులను, కందర్పుండు= మన్మథుడు; ఓటంబు = స్త్రీల [illegible], [illegible] = తెలిసి, [illegible] = వెన్నాడి; పీపును, ఏసెనో = కొట్టెనో; నాన్ = అన్నట్లున్న; [illegible] = అంటు మామిడి తోపులో (సురత కలహాపజయ సూచకంగా నాయికల వీపులపై [illegible] మామిడి చిగురాకు ఆయుధంతో గాయపరిచినాడా అన్నట్లున్న మామిడి తోపులో)

స్త్రీలు క్రింద పండుకొన్నందున చెమట చిత్తడి కంటుకొన్న మామిడి చిగురాకులు ఓడిపోయిన [illegible] గాయాలవలె నున్నవి.

[illegible] : ఉత్ప్రేక్ష

మామిడి చిగురాకులుండటం వల్ల వసంతర్తువు రాగా; సతీపతుల వన క్రీడలు ముమ్మరమైన వసంతం [illegible] ధ్వనిస్తున్నది.

ఈ కథ గోద కథ - కనుకనే కుడుంగోద అని సమాసంలో గోద శబ్దం కావాలని [illegible] చెప్పింది ఈ ప్రత్యేక కథ కీ పద్యం నాంది వంటిది. కావ్య కథా నాయికా నామం [illegible] రసం (శృంగారం) ధ్వనింపజేయడం ప్రస్తుతింపదగ్గ అంశం.

[illegible] చేయడం పూర్వ కథల్లో లేదు. ఇక్కడ వర్ణింపబడిన శృంగారం భౌతికం. కాబట్టి [illegible] ''సహ్యకన్యాతటోద్యాన'' - లోని శృంగారం దివ్యం, ఆలంకారికం.

ఉ. [illegible] వన వీథిఁ గనుంగొనె నీడ నున్నపుం
[illegible] పచ్చల యరం గయిపో వెలిదమ్మి బావికిం
[illegible] తులసీ వన సీమ శుభాంగి నొక్క బా
[illegible] కందళదళప్రతిమాంఘ్రికరోదరాధరన్.

వింగడము+ఐన= విశాలమైన (4-50 చూ); ఒక్క, వనవీథిన్= తోటలోపల ఒక ప్రక్క; సున్నపు+ అరంగు= సున్నంతో కట్టిన అరుగు; నీడన్ = చెట్ల నీడలు పడి; పచ్చల+అరుంగు= పచ్చలు (మణులు) తాపిన అరుగు; ఐ; పోన్ = పోగా; వెలి+తమ్మి = తెల్ల తామరల; బావికి; చెంగటన్ = ప్రక్కనే; ఉల్లసిల్లు = అందగించే; తులసీ వన సీమన్ = తులసి తోటలో; ఒక్క; శుభ+ అంగిన్ = మేలైన అవయవాలు కలదానిని, కురువింద = కెంపురాళ్ళు); కందళ = ముక్కల; దళ = కోతకు; ప్రతిమ = సాటియైన; అంఘ్రి = పాదాలు; కర = చేతులు; ఉదర= లోపలి భాగాలు; అధరన్ = పెదవి కల బాలను; కనుంగొనెన్ = చూచినాడు.

ఆ తామ్రవనంలో ఒక ప్రక్క విశాలమైన అరుగున్నది. అది చెట్ల ఆకుల నీడలు పడి పచ్చలు తాపిన అరుగువలె నున్నది. దాని ప్రక్క ఒక తెల్ల తామరల దిగుడు బావి. దాని ప్రక్క ఏపుగా నవనవలాడే తులసితోట. అందులో ఒక పసిపిల్ల. ఆ నిసుగు పాదాలు, చేతులు కెంపుల వన్నెలు చిమ్ముతున్నాయి. పవిత్ర దేహంతో ప్రకాశిస్తున్నది. ఆ బాల విష్ణుచిత్తుని దృష్టిలో పడ్డది.

పచ్చలరాల అరుగు - వెలిదమ్మి బావి చెంత - తులసితోట ఇవన్నీ ఆ శిశువు దివ్య శిశువని వ్యంజిస్తున్న పవిత్ర వస్తువులు. ఆ దేశ (స్థల) పవిత్రత కవి వ్యంజకాలు. వాని నడుమ పసిబాల. సీతవలె ఈమె కూడా అయోనిజ అని ధ్వని.

చ॥ కనుగొని విస్మయం బొదవఁగాఁ గదియం జని సౌకుమార్యముం
దను రుచియు న్సులక్షణ వితానముఁ దేజముఁ జెల్వుఁ గొంత సే
పనిమిష దృష్టిఁ జూచి యహహా ! యనపత్యున కమ్ముకుందుఁ డే
తనయగ నాకు నీ శిశువుఁ దాఁ గృప సేసె నటంచు హృష్టుఁడై. 5

కనుగొని = (ఆపాదమస్తకం పరిశీలించి) చూచి; విస్మయంబు = నివ్వెరపాటు; ఒదవఁగాన్= కలుగగాన్, సంభవించగా; కదియన్+చని = సమీపించి; సౌకుమార్యమున్ = మృదుత్వం; తను = శరీర; రుచియున్= కాంతి; సులక్షణ వితానము = సాముద్రిక శాస్త్ర ప్రకారం శుభలక్షణాల సమూహం; తేజమున్ = (శరీరమంతా ఆవరించియున్న); దివ్య వర్చస్సు; చెల్వున్ = అందం; అనిమిష దృష్టిన్ = రెప్పపాటు లేని చూపుతో; కొంత సేపు చూచి; ఆహహా = ఆహా ! (విస్మయం నుండి పుట్టే మాట); అమ్ముకుందుడే= ఆ కృష్ణుడే; అనపత్యునకున్ = సంతానం లేని వానికి (నాకున్); తనయగన్ = కుమార్తెగా; ఈ శిశువున్= ఈ దివ్యబాలికను; కృప సేసెన్ = అనుగ్రహించినాడు; అట+అంచున్; హృష్టుడై = సంతోషించినవాడై.

ఆ నిసుగును చూచి అబ్బురపాటుతో దగ్గరకు వెళ్ళి, పరకాయించి శరీర మందున్న శుభ లక్షణాలను కాంచి, అందం, దివ్య తేజస్సు రెప్పపాటు లేని దృష్టితో చూచి ఓహో ! ఆకృష్ణుడే ఈ శిశువును పిల్లలు లేనినాకు కూతురుగా అనుగ్రహించినాడు కదా అని సంతుష్టుడై - విస్మయం - అద్భుతం. విస్మయమంటే ఎన్నిసార్లు చూచినా క్రొత్తగా వుండేది. రసస్థాయి. ఆశ్చర్యమంటే లోకంలో క్రొత్తను చూచినపుడు కలిగేది, రెండవసారి ఆశ్చర్యం పోతుంది. వస్తు సందర్శనంతో కలిగే మనోవికాసం విస్మయం.

...మో యోగ భూమికా - 1.12 శివసూత్రం దగ్గర ఈ భేదాన్ని కాశ్మీర శివాద్వైతాచార్యులు ... 37వ పద్యంలో మరలా గోదాదేవి శ్రీమన్నారాయణుని అవతారాలు అద్భుతం చెప్ప ...పోట కూడా అర్థమిదే.

...అభినయం - అనిమిష దృష్టి - నోటిమాట అహహో ! శుభలక్షణాలు - భాగవతంలో ...స్కంధంలో దీని విషయం చూచుకోవచ్చు.

...అంశపు కనుక తేజస్సు, శుభలక్షణ వితానం. చెల్వు, రుచి లోకోత్తరమైన ఆకర్షణమున్న ...ప్రత్యక్షమున్నట్టు. ఇది మహాత్ముల లక్షణం. అవతార విశేషం.

౭౦॥ కొనిపోయి ధర్మగేహిని।
అనురక్తి నొసంగ బొంగి యాయమయును జే
పు నిజస్తన్యంబున లలిఁ
బెనిచె న్గో మొప్ప నిట్లు పెరుగ గ్రమమునన్ 6

... పోయి; ధర్మగేహినికిన్ = ధర్మపత్నికి; అనురక్తిన్ = ప్రేమతో; ఒసంగన్ = ఇవ్వగా; ... = ఆ అమ్మ కూడా !; పొంగి = పొంగిపోయి; చేపు నిజస్తన్యంబు= చేసిన తన పాలతోనే; ...తో, గోము+ఒప్పన్ = ముద్దుగా; పెనిచెన్ = పెంచినది; ఇట్లు, పెరుగన్ = పెరుగుతుండగా; ... = కాలానుగుణంగా; బాల్యావస్థను కవి వర్ణించలేదు, వసుచరిత్రలో గిరిక బాల్య వర్ణన ... జన్మ రహస్యం వేరు కనుక. ఔచిత్య దృష్టి కవిని నియమిస్తుంది. బాల్య వర్ణన మనౌచిత్యం.

ధర్మగేహిని 1-80, 4-90లో ప్రసక్తమైనది. అద్వైతం సన్న్యాసమతం. విశిష్టాద్వైతం గృహస్థ ... పరమహంసకు శ్రీశారదాదేవి ధర్మగేహిని. గృహస్థ ధర్మానుష్ఠానాని కనుగుణమైన గేహిని ...

చూళిక -11

## నాయికా సౌందర్య వర్ణనం

"...గూర్చి నన్న విను ముసు మాల్యమిచ్చు నప్పిన్నది . . . ." అన్న పద్యంలోని శబ్దం రతి ... అన్నది భగవంతుడు. ఈయన వర్ణన శ్రీరంగ వర్ణనలో వస్తుంది. ఆ స్వామి దివ్య ...వర్ణన కనుగుణంగానే గోదా వర్ణన ముండాలి.

... దృష్టిలో ఆమె శృంగారిణి. ఇది రస భావ సంబంధ సౌందర్యం. కవి దృష్టిలో ఆమె ... ఈ రెండు భావాలకు అనుసంధి ఈ గోదావర్ణన. ఇందుచేత ఈ వర్ణన సౌందర్యలహరిలో ... శ్రీశంకరులెలా వర్ణించారో తదనుగుణంగా మహాకవి తీర్చినాడు. దీని వివరణకు ఠం ...

కవి గోదాదేవిని ''శ్యామాంకంబు . . . కాంచెన్''

శ్యామా అన్నాడు, వేదాంత దేశికులు ''శతముఖమణి నీలా . . .'' ఇంద్రనీలమణి వంటి నీలవర్ణ, ''దూర్వాదళ ప్రతిమయా తవ దేహ కాంత్యా'' దర్భ పోచ వన్నెవంటి పచ్చని దేహకాంతి కలది - అని స్తుతిస్తే, ఇక్కడ శ్యామా శ్యామల వర్ణం కలదన్న అర్థంలో అనలేదు. ఎందుకంటే 36వ పద్యంలో ఆమె దేహకాంతి ముందు పచ్చ పసుపు నల్లబడిపోతున్నదన్నందున- మరి శ్యామా? ఆమె మధురమైన బంభరస్వనంలో ప్రాకుతున్నది (సుషుమ్నలో). ఆమె శబ్ద బ్రహ్మస్వరూపిణి. సకల కావ్యరచనా శబ్ద శక్తి కవులామె నారాధించి మహాకవులౌతున్నారు.

అంటే యోగశాస్త్రంలో కుండలినీశక్తిని శ్యామాం - సూక్ష్మాం - అన్నారు. ''శీతకాలే భవేదుష్ణా చోష్ణకాలే చ శీతలా ప్రతప్త కాంచనాభా సా శ్యామా స్త్రీ పరికీర్తితా'' అని వ్యాఖ్యానించారు.

ధ్యాయేత్కుండలినీం, దేవీ మిష్టదేవ స్వరూపిణీం
సదా షోడశ వర్షీయాం పీనోన్నత పయోధరాం
నవయౌవన సంపన్నాం సర్వాభరణ భూషితాం
పూర్ణ చంద్ర ప్రభాం రక్తాం సదా చంచల లోచనాం. (షట్చక్ర నిరూపణ)

సరిగా గోదా వర్ణన దీనికి సంబంధించింది. ఆ మహాకవి ప్రౌఢోహ సంపత్తిలోని రహస్య సూత్రమిది ఇందుకే ఆమె (33) 'కుండలిని' అన్నాడు. యోగశక్తి పోఁబెట్టెద దీని (తనువును) 80 - దీనిని స్ఫురింప చేసే మాట. గోదాదేవి చెలికత్తెలు పూర్వజన్మలో నాగకన్యలని మరొకమాట

వరాహపురాణంలో (దాసరి కథ - భూదేవికి వరాహస్వామి చెప్పినదీ పురాణంలోనే) భూదేవి భగవంతుని దగ్గరకు ఇళా పింగళలతో కలసి వచ్చిందని వర్ణన. ''ఇళయా వై పింగళయా సఖీభ్యాం చ సమన్వితా'' ఇళా పింగళన్న సూక్ష్మ నాడులు కుండలినీ యోగవిషయం. వీటి నడుమ సుషుమ్నా నాడి. దీని ద్వారా 'కుండలిని' మూలాధారం నుండి సహస్రారానికి చేరుతుందని శాస్త్రం. దీనినే రాయలవారు ఇదే ఆశ్వాసాంతంలో కంధర నీల వర్ణ - పద్యంలో వర్ణించినది. ఈ కుండలిని ఆస్వామిని సమీపించుట వేదాంతపరంగా మోక్షం. కావ్యపరంగా శృంగారం. ఆమె గతి విశేష వర్ణన మిలా చేయబడ్డది

కూజంతీం కులకుండలీ చ మధురం మత్తాలిమాలాస్ఫుటం
వాచం కోమల కావ్యబంధ రచనాభేదాతిభేదక్రమైః,
శ్వాసోచ్ఛ్వాస విభంజనేన జగతాం జీవో యయా ధార్యతే
సా మూలాంబుజ గహ్వరే విలసతి ప్రోద్దామ దీప్తావలిః(షట్చక్ర నిరూపణం)

సౌందర్య లహరిలో ''కవీంద్రాణాం చేతః కమల వన బాలా తప రుచిం'' - వంటి శ్లోకాల్లో స్తుతింపబడిన దీమెయే - కూజంతాం - లోనిగతి విశేషమే రాయలవారి ''కంధర-'' పద్యంలో స్వనవత్ స్థితి - రస పరంగా వియోగ శృంగారం - వేదాంతదేశికులూ అన్నారు ''ఉచ్చావచైః విరహ

సంగమజైరుదంతైః'' (గోదాస్తుతి). పెరియాళ్వారు స్వామితో గోదాస్థితిని వివరించి విచారపడితే ఆయనన్నాడు 'ఇది యేమి తపంబంటి యింతకన్న తపంబున్నదే - అని (157) ఆమె విరహం - అక్కడ చేసిన సంభాషణలు (ఉద్వాసనములు, తపస్సు) యోగమని స్వామి తీర్పు. ''ఆ కుండలిని శబ్ద బ్రహ్మం. సర్వమంత్రాధిష్ఠాత్రి. సర్వవాక్ జన్మభూమి'' ఇది మహాకవి చిత్రించిన జననీ వైభవం. వాగ్దేవతలు చేసిన పరాశక్తి సౌందర్యం (శరీరాతీత - శారీరక) లలితాసహస్రంలో - ఎలా తల్లిని క్రమంలో వర్ణించారో అదే పద్ధతిలో గోదాదేవీ వర్ణనం చేయటం అద్భుత ప్రతిభ.

| లలితా వర్ణన క్రమమిది : | | గోదాదేవి వర్ణన – | పద్యసంఖ్య |
|---|---|---|---|
| 1. | కచము | కచము | (5-8) |
| 2. | ఫాలము | ముంగురులు | 9,10 |
| 3. | బొట్టుతో ముఖం | ముఖము | 11 |
| 4. | భ్రుకుటి | ఫాలము | 12 |
| 5. | నేత్రాలు | చూపులు | 13 |
| 6 | నాసిక | పక్ష్మ రేఖలు | 14 |
| 7. | చెవులు | తాటంకమున్న చెవి | 15 |
| 8. | కపోలములు | ముఖం | 16 |
| 9. | అధరము | కంధరము | 17 |
| 10. | దంతాలు | కంఠరేఖాత్రయం | 18 |
| 11. | ముఖ పరిమళం | బాహులతలు | 19,20 |
| 12. | వాఙ్మాధుర్యం | స్తనాలు | 20-23 |
| 13. | లేత నవ్వు | నూగారు | 24,25 |
| 14. | గడ్డము | కౌను | 26,27 |
| 15. | కంధర | నాభి | 28 |
| 16 | భుజాలు | కటి | 29 |
| 17. | స్తనాలు | ఊరులు | 30,31 |
| 18. | నూరు | జంఘలు | 32,33 |
| 19 | కౌను | కాలిగోళ్ళు | 34 |
| 20. | వళీత్రయం | మీగాళ్ళు | 35 |
| 21. | కటి | | |

22. ఊరువులు
23. జంఘికలు
24. గుల్ఫము
25. పిక్కలు
26 గోళ్ళు
27. పాదాలు
28. లావణ్యం లావణ్యం 36

రెండు వర్ణనలు కచముతో ప్రారంభమై లావణ్యంతో ముగియటం చిత్రంగా లేదా! లలితా సహస్రంలో దేవీ అవయవ వర్ణన చేసి వెన్వెంటనే తత్సంబంధమైన ఆభరణ వర్ణన చేయబడుతుంది. అలాగే గోదా వర్ణన కూడా.

ఉదా : (అంగ వర్ణన) చంపకాశోక పున్నాగ సౌగంధిక లసత్కచా (అలంకార వర్ణన) కురువింద మణి శ్రేణీ కనత్కోటీర మండితా. కెంపులు - రకరకాల రత్నాలు కూర్చిన బంగారు కిరీటం అలంకారంగా కలది. గోదావర్ణన 22-23, 24-26, 27- చూ.

సాదృశ్య సౌందర్యం పద్య వ్యాఖ్యానంలో పొందుపరచబడ్డది. అలాగే శ్రీశంకరుల సౌందర్య లహరీ వర్ణనం కూడా సంఘటితమైనది ఇదంతా గోదాదేవి పరమేశ్వరిగా- నారాయణిగా భావించి శబ్ద రూపంలో చేసిన అర్చనా విశేషం. ఈ వర్ణన మంతా నాయికను నాయకుడు (7-41) చూచిన చూపులో పర్యవసిస్తున్నది. ఇది రస దర్శనం. అది భక్త దర్శనం. 3-86 లో ''శ్రీవిష్ణునీగతి జంతింపవలయుఁ దన్మయుఁడై. యోగి క్రమంబుతోడ'' కాబట్టి ప్రత్యంగ భావన ఉపాసనా - సాధనా విషయమౌతుంది. దానికోసమే ఒక్కొక్క అంగము ననేక రీతుల్లో - భంగిమల్లో - వర్ణించబడక తప్పదు. 'క్రమంబుతోడ' - అంటే కచ వర్ణనతో ప్రారంభమై - శిరస్సుతో మొదలై పాదవర్ణనతో అంతం కావటం పై విషయమైన ఉపాసనకు ప్రతిష్ఠ - ఆధారం. శ్యామా నామంతో మొదలు కావటం వర్ణనమంతా శ్రీదేవీ పరమని ధ్వనించటమే. ఆముక్తమాల్యద = చూడికొడుత్త నాచ్చియార్ = కొప్పులో ముడుచుకొన్న దండను దైవార్పణం చేసినది. నేటికీ దేవాలయాల్లో ఆమె విగ్రహం విస్తృత కబరీభర ముండటం దీనికి సూచకమే. 38వ పద్యంలో అదే శిల్పించబడినది. ఆమె కది ప్రత్యేకమైనది.

'నాచ్చియార్ తిరుమొళి' లో గోదాదేవి తన కబరీ - స్తనాది వర్ణనం చేస్తుంది. దానినే కవి తన భక్తి యోగసాధనగా చేసుకోవటానికే ఈ వర్ణన మిలా ప్రస్ఫుటమైనది.

## గోదావర్ణన

సీ. వాతెఱ తొంటికైవడి మాటలాడదు, కుటిల వృత్తి వహించె గుంతలములు
అఖులు సిరులు రా నఱగంట గనుఁగొనె, నాడించె బొమగొని యాననంబు,

సనుగొమ ల్నెగయ వక్షముపేక్షఁ గడకొత్తెఁ, బాణి పాదము లెఱ్ఱవాఱఁదొడఁగె,
సారెకు మధ్యంబు దారిద్ర్యములె చెప్పె, నొచ్చోర్వ కిటు లోఁగఁ జొచ్చెమేను,

తే. వట్టిగాంభీర్య మొక్కఁడు వెట్టుకొనియె, నాభి, నానాఁటి కీగతి నాఁటి ప్రియము
చవుకయైనట్టి యిచ్చటఁ జనదు నిలువ, ననుచు జాఱినకరణి బాల్యంబు జాఱె.7

బాల్యాన్ని శరీరం తిరస్కరించినది. అంటే యౌవనం ప్రాదుర్భవించింది. ఈ వయో ధర్మం కలిగినంతనే అది జారిపోయి ఇది శరీరాన్ని ఆక్రమించినదని ధ్వనించటం చమత్కారం. యౌవన తిరస్కారమెలా ఉందంటే -

వాతెఱ = వా = వాయి, తెఱ = ముఖం; ద్వారం = పెదవి (వాతెర అనీ ప్రయోగాలున్నాయి. వాయికి తెర వంటిది), తొంటికైవడి = పూర్వం లాగా; మాట లాడదు; కుంతలములు = కురులు; కుటిలవృత్తిన్= కౌటిల్యమును (వంకరతనాన్ని); వహించెను. బాల్యావస్థలో తెగవాగిన నోరు మాటలాడటం మాని మౌని కాగా, జుట్టేమో కుటిలమైనది. ఉంగరాలు తిరిగింది. సిరులు రాన్ = సిరిపట్టే సరికి (అందం); అక్షులు = నేత్రాలు; అఱగంటన్ = అరకంటితో = సగం మాత్రం తెరిచిన కంటితో; కనుగొనెన్ = చూచాయి; ఆననంబు = మోము; బొమన్= కన్బొమలను (ఆటబొమ్మను), కొని = ధరించి, ఆడించెన్= కదలించినది. నేత్రాలు కాంతి రాగా అరగంట చూడటం ప్రారంభించాయి ముఖమేమో చేతిలో ఆటబొమ్మ రాగేసుకొని తల అటూ ఇటూ - పోవే - అన్నట్లు బాల్యాన్ని తిరస్కరించింది. అరమోడ్పుకన్ను - మదిరాక్షి యౌవన పారవశ్యంతో కన్నులర మూతపడటం, కన్బొమలు నలుపెక్కి దళసరి కావటం - యౌవనోదయ లక్షణం వక్షము = రొమ్ము; చనుగొమల్ = స్తనశాఖలు; నెగయన్= విజృంభించేసరికి - చనులు కొమ్ములు చూపేసరికి; కడకున్ = చివరకు; ఒత్తెన్ = నెట్టివేసింది (బాల్యాన్ని అని ప్రతి పాదానికీ అన్వయించుకోవాలి); పాణి పాదములు = చేతులు కాళ్ళు, ఎఱ్ఱవాఱన్+తొడగెన్ = ఎరుపెక్కటం ప్రారంభించినవి - కళ్ళెర్ర చేసాయి. వక్షమందు రొమ్ములు కొమ్ములు చూపటం ప్రారంభించగానే చేతులూ కాళ్ళూ కళ్ళెర్ర చేసాయి. (కొమ్ములు చూపటం = గర్వించటం. కొమ్ములు మొలిచాయా ? అనటం లోని అర్థం ); మధ్యంబు = నడుము; సారెకున్ = మాటికి; దారిద్ర్యంబులె = లేమినే; చెప్పెన్= వ్యక్తీకరించింది; మేను = శరీరం, ఒచ్చు = మురికిని; ఓర్వక = ఓర్పుకోక; ఇటు = ఈ విధంగా; లోఁగ+ చొచ్చెన్ = వెనుదీయటం ప్రారంభించింది (తనలో తాను ఒదిగి పోవటం ప్రారంభించినది) (చూ. 28వ పద్యంలో లోగి). యౌవనం రాగానే నడుము సన్నబడి, శరీరం నిత్యస్నానం కోరుకొన్నది. బాల్యంలో నడుము సన్నగా లేదు. అది మురికిని సహించింది. నాభి = బొడ్డు; వట్టి గాంభీర్య మొక్కటి = లేని బెట్టుసరి తన మొకటి, పెట్టుకొనియెన్ = ధరించింది (నాభి లోతైనది); బాల్యంబు = బాల్యావస్థ, ఈగతిన్ = ఈ నడకతో; ఈ విధంగా; నానాటికిన్ = రోజు రోజుకు; నాటిప్రియము = ఆనాటి ప్రేమ; చవుకయైనట్టి = తేలికయైనట్టి; ఇచ్చటన్ = ఈ శరీరం మీద; నిలువన్ చనదు = నిలుచుట కూడదు; అనుచున్ = అనుకొంటూ; జాఱిన కరణిన్ = ఎవరికీ తెలియకుండా జారుకున్నట్లు; జాఱెన్ = తనంత తాను జారిపోయింది.

బాల్య యౌవనావస్థల మధ్య సరిహద్దు ఎప్పుడు చెరిగిపోయిందో చూస్తున్నంతలో మొగ్గ పుష్పమైనట్లు ఆ రేఖ కన్పించలేదు ఉల్లంఘనం తెలియదు కానీ పూర్వ అపరావస్థం భేదం తెలుస్తూనే ఉంది. అలాగే ఒక ఋతువు వెనుదిరిగిపోవటం మరొక ఋతువు రావటం కానీ, వాటి సంధి కాలం తెలియదు కానీ, పోవటం - రావటం తెలుస్తూనే ఉంది. వర్తమాన జ్ఞానం లేకుండానే జరగుతున్న వైచిత్రి ఈ పద్యప్రాణం. కనుక బాల్యం జారిపోయి యౌవన మంకురించింది జారటం తెలియలేదు. యౌవనం వచ్చిందని స్పష్టం.

అలం : శ్లేషతో సమ్మిళితమైన ఉత్ప్రేక్ష. లోకోత్తర భావన. యౌవనోద్భూతి నిలా వర్ణించిన ఘట్టాలు మృగ్యం.

> హేమాభాంగ విభాధరారుణిమ వక్త్రేందు ప్రభాశ్రీలఁ ద
> ద్భామారత్నము పొంద దయ్యె మును దత్తద్వర్ణ యుక్తాఖ్యలన్,
> శ్యామాంకం బలి గర్వధూర్వహకచ, చ్ఛాయాచ్ఛటం గాంచె, నౌఁ
> గా మున్నుర్వి 'శిరఃప్రధాన' మను వాక్యం బెమ్మెయిం దప్పునే. 8

తత్ = ఆ; భామారత్నము = స్త్రీ రత్నము; హేమ = బంగారు; ఆభ = వన్నె; అంగ = శరీరము; విభా = కాంతి (బంగారు వన్నె కల శరీరచ్ఛాయ వలన కానీ); అధర+ అరుణిమ = క్రింది పెదవి ఎరుపువల్ల కానీ; వక్త్ర+ ఇందు = ముఖచంద్రుని; ప్రభా = కాంతి; శ్రీలన్ = శోభలవలన కానీ; తత్తత్ = ఆయా; వర్ణ = వన్నె, యుక్త = కూడుకొన్న; ఆఖ్యలన్ = పేర్లను; మును = ముందుగా; పొందదు+ అయ్యెన్ = పొందలేదు, అళి = తుమ్మెదల; గర్వ = మదం, ధూః+ వహ = బరువును మోసే; కచ = జుట్టు (యొక్క); ఛాయన్ = కాంతి; ఛటన్ = రాశివల్ల; శ్యామా+ అంకంబు = శ్యామల వర్ణం కలది (యౌవన మధ్యస్థ). అన్న పేరును; కాంచెన్ = పొందినది, ఔన్+కా = ఔను కదా (ఇది ప్రసిద్ధమే); మున్ = పూర్వం; ఉర్విన్ = లోకంలో; శిరః = తల; ప్రధానం = ముఖ్యమన్న; వాక్యంబు = మాట; ఎమ్మెయిన్ = ఏ విధంగానైనా; తప్పునే = తప్పుతుందా ?

లోకంలో సర్వాంగాల్లో శిరస్సు ప్రధానమన్న మాట ఉన్నది కదా. అది పొల్లుపోదు కనుక ఆమెకు నల్లని జుట్టు కలదన్న పేరు శ్యామాంకము మాత్రం వచ్చింది తప్ప- శరీరం బంగారువన్నె కలదనీ; ఎర్రని పెదవి కలదనీ; ముఖం చంద్రకాంతి కలదనీ - హేమాంగి - అరుణోష్ఠి - చంద్రముఖి - వంటి పేర్లు రాకుండా; శ్యామా = పూర్ణ యౌవన శ్రీ కలదని మాత్రమే వచ్చింది.

అలం : శ్యామాంక సమర్థనం చేత - నిరుక్తి

హేతువు కాని దాని వల్ల సమర్థన కనుక హేతూత్ప్రేక్ష.

> కం ॥ ఆయత భుజైక చక్రుం
> డా యదుపతి దొమ్మి గెలువ నడరు మరుని కా

[illegible]యసచక్ర పరంపర।
[illegible]యస నుంగరపుంగురులు యువతికి నమరుగ. 9

[illegible] దీర్ఘమైన, భుజ = బాహువునందలి; ఏకచక్రుండు = ఒకే చక్రం కలవాడు; ఆ యదుపతిన్ = [illegible] ద్వంద్వయుద్ధంలో; గెలువన్ = జయించటానికై; అడరు = విజృంభించు; [illegible] = [illegible]; కాల = నల్లని; ఆయస= ఇనుప; చక్రపరంపరలో= చక్రముల గుంపులో; అనన్ = [illegible] యువతికి= యౌవనవతికి; ఉంగరపు = గుండ్రని ఉంగరాల; కురులు = వెండ్రుకలు; అనురున్ [illegible]

[illegible]బాహువునందు శ్రీకృష్ణునకు ఒకే చక్రమున్నది. అతనిని మన్మథ కలహంలో జయించటానికి [illegible] గోదాదేవికి నల్లని గుండ్రని చక్ర పరంపర లమరించినాడో అన్నట్లు ఆమె ఉంగరాల జుట్టున్నది.

[illegible]

[illegible] ఇలాంటి జుట్టు చెక్కబడటం చూచుకోవచ్చు). ఏక = వేదాంతంలో ఇది సంఖ్యావాచకం [illegible] అద్వైత అని అర్థాలు - ఆయన సాటి లేని చక్రం వీర రసాలంబనం. ఈమె చక్రాల కురులు [illegible] రసాలంబనం

తే॥ సకల సీమంతినీలోక సమతిశాయి।
భాగ్యవర్ణావళులు వ్రాసెం బద్మగర్భుం
డసంగ గర్పూరతిలకరజోవదాత।
ఫాలమునం గుంతల శ్రేణి పడంతి కలరు. 10

[illegible] = [illegible], సీమంతినీ = పాపట కలది, స్త్రీ, లోక = సమూహాన్ని; సమతిశాయి = అధిగమించే; [illegible], వర్ణ+ఆవళులు = అక్షర సమూహం; పద్మగర్భుడు = బ్రహ్మ; కర్పూర తిలక = [illegible] బొట్టు యొక్క; రజః = పొడిచేత; అవదాత = తెల్లనైన; ఫాలమునన్= నుదుట; రాసెను; అనన్= [illegible] అన్నట్లు, పడతికి = యువతికి; కుంతల శ్రేణి = కురుల సముదాయం; అమరున్ = అమరినది.

గోదాదేవి భాగ్యం ఇతర స్త్రీ లోకాన్ని అతిశయిస్తుందని బ్రహ్మ ఆమె ఫాలంమీద వ్రాసినట్లు [illegible] ఫాలం కర్పూరపు బొట్టు వల్ల తెల్లనై ఉన్నది. దానిపై సిరా (మసి) తో వ్రాసిన నల్లని గుండ్రని [illegible] గుండ్రనివై అందంగా ఉన్నాయి.

[illegible]

[illegible] కుంకుమ పెట్టుకోవటం పుణ్యస్త్రీ లక్షణం కనుక ఒట్టి పాపట కలదని కాదు.

[illegible] కచ వర్ణన.

[illegible] భావించి యది దృఢంబగుటయు నవలి యంగకవము [illegible] 3 - 80

ఈ దృష్టితో ఈ వర్ణనలు చూచుకోవాలి.

'చంపకాశోక పున్నాగ సౌగంధిక లసత్కచా' - లలితా సహస్రం

ఈ నామాన్ని వ్యాఖ్యానిస్తున్నారా అన్నట్లుగా సౌందర్యలహరిలో శ్రీశంకరులు

''ధునోతు ధ్వాంతం నః తులిత దళితేందీవరవనం
ఘనస్నిగ్ధశ్లక్ష్ణం చికురనికురుంబం తవ శివే,
యదీయం సౌరభ్యం సహజ ముపలబ్ధుం సుమనసో
వసంత్యస్మిన్ మన్యే వలమథనవాటీవిటపినాం'' 43

''తల్లీ ! నల్ల కల్వలవలె చక్కనై మెఱుగై మృదువులైన నీ కురులు మా అజ్ఞానాంధకారాన్ని చెదరుగొట్టుగాక. స్వర్గంలో ఇంద్రుని నందనోద్యానవనంలోని పూలన్నీ నీ కురుల సహజ సుగంధాన్ని పొందటానికోయన్నట్లు ఆ కురులలో కుదురుకొన్నవి కదా!''

లలితా సహస్రము - తదనుగుణంగా సౌందర్యలహరీ - శ్రీదేవి శిరస్సు (కిరీటం) నుండి పాదాంతం వర్ణించాయి. ఇక్కడా అంతే. ఈ దేసీ సంప్రదాయం ప్రస్తుత వర్ణనల్లో కన్పిస్తున్నందున ఈ నాయికా వర్ణనలో నాయిక దృష్ట్యా - భక్తి దృష్ట్యా సౌందర్య ఆరాధనల నన్వయించుకోవాలి.

శా. సైరంధ్రు ల్పయికెత్తి కజ్జలము బక్ష్మ శ్రేణికం దీర్ప వా
లారుం గన్నుల మీఁదు చూచు తఱి ఫాలాంచ చ్చతుర్థీ నిశా
స్ఫారేందుం గనె వక్త్ర; మక్కనుటఁ గాఁ బర్వేందుఁ డాత్మ ప్రభా
చోరుం డుండఁగఁ దన్నుఁ దద్గతవిభాచోరం బనుఁ లోకముల్. 11

సైరంధ్రుల్ = అలకంరించే స్త్రీలు; పక్ష్మశ్రేణికన్ = కనురెప్పలకు; కజ్జలము = కాటుక; తీర్పన్= అలంకరించటానికై; పయికిన్+ఎత్తన్ = ముఖం పైకెత్తగా; వక్త్రము = ముఖము; వాలారుంగన్నులన్ = పొడవైన కన్నులతో; మీఁదు = పైకి; చూచుతఱిన్ = చూచేవేళ; ఫాల+అంచత్ = అందమైన ఫాలమున్న; చతుర్థీనిశా = వినాయక చతుర్థిరాత్రి; స్ఫార+ఇందున్= స్పష్టమైన చంద్రుని; కనెన్ = చూచింది; అక్కనుట+కాన్ = ఆ చూడటం వల్లనే కదా; ఆత్మ = (ముఖము) తనయొక్క; ప్రభా = కాంతి; చోరుండు = దొంగ; పర్వేందుండు = పున్నమినాటి చందమామ; ఉండగాన్; లోకముల్; తన్ను = ముఖాన్ని; తత్ = చంద్రునిలో; గత = ఉన్న; విభా = కాంతియొక్క; చోరంబు = దొంగ; అనున్ = అంటున్నని.

సైరంధ్రులు ఆమె కనులకు కాటుక దిద్దటం కోసం ముఖాన్ని పైకెత్తారు. ఆ కన్నులకు వినాయక చతుర్థి నాటి నెలవంక కన్పించింది. అందుకని ఆ ముఖానికొక అపకీర్తి వచ్చింది. చంద్రునకు ఉపమానం కాదగ్గ ఆమె ముఖం ఉపమేయమై పోయింది. ఆమె ముఖ కాంతి చంద్రుడపహరిస్తే లోకమంటున్నదట ఆ చంద్రుని కాంతి నీ ముఖము అపహరించిందని.

అలం : ఉత్ప్రేక్షా అపహ్నవ సంకరం

'అష్టమీ చంద్ర విభ్రాజ దలిక స్థల శోభితా' (ల.స.)

అష్టమి నాటి చంద్రుని వలె ప్రకాశించే ఫాల స్థలంతో శోభించే తల్లీ ! లావణ్యంతో మెరిసే నీ ఫాలం శిరస్సు పైనున్న చంద్రరేఖయొక్క ప్రతిరూపమనుకొంటాను. కాకపోతే రెండు చంద్రరేఖలను తంత్రిందులుగా కలసి పండు వెన్నెల కురిసే పూర్ణ చంద్రునిగా ఎందుకౌతాయి? (సౌ.ల) 46

మ॥ కనుఁగవఁ దన్ను గెల్వఁగ మృగం, బల సూడున కిందు రేఁతు నే
నని రుచిదక్కఁ దత్పరిమళాఢ్యత లేమి నతండు గొంకఁ, దా
నినుపఁ జనఁ, బగం దనదు నెత్తుటఁ బొట్టిడుకొంట కాక వా
సనక యన న్మొగం బమరుఁ జానకు ఫాలము పచ్చికస్తురిన్. 12

మొగంబు = ముఖము, కనుగవన్ = కన్నులజంటతో; తన్నున్ = తనను; గెల్వగాన్ = జయిస్తే; మృగంబు= కస్తూరి లేడి; అల = ఆ; సూడునకున్ = పగకోసం; ఇందున్ = చంద్రుని; రేతున్ = ప్రేరేపిస్తానని; నేను; అని (పోయి అలా చెబితే); అతండు = ఆ చంద్రుడు; రుచితక్కన్=(తనకు) కాంతి తప్ప; తత్= ఆ ముఖానికున్న; పరిమళ+ఆఢ్యత = వాసనల కలిమి; లేమిన్ = లేనందువల్ల; కొంకన్ = సందేహిస్తే; తాన్ = కస్తూరి మృగం; నినుపన్= వాసన నింపటానికై; చనన్= పోగా (అతని పక్షం కడితే); పగన్ = ఆ మృగం మీది వైరంతో, తనదు నెత్తుటన్ = తన నెత్తురుతో; బొట్టు = తిలకం; ఇడుకొంట = పెట్టు కోవటం; కాక= తప్ప; వాసనక = వాసన కోసమా ?; అనన్ = అన్నట్లు; చామకున్ = శ్యామకు; ఫాలము= నుదురు; పచ్చికస్తురిన్ = పచ్చి కస్తూరితో; అమరున్ = అందగిస్తున్నది; (పచ్చి = వాసన ఎక్కువ).

ఆమె ముఖము కన్నుల జంటతో లేడిని గెలిచింది. అందుకని ఓడినవాడు పరరాజుతో చెలిమికట్టి శత్రువును జయించటం రాజనీతి కనుక ఆ మృగం చంద్రుని పక్షాన చేరింది. అతనికే ఆ ముఖాన్ని జయించే సాధనాలన్నీ లేవు 'నా దగ్గర కాంతి ఉన్నదే తప్ప వాసన లేద'న్నాడు. అయితే ఆ కొరత నేను తీరుస్తానని ఆయనతో చేరింది ఇది చూచిన మొగం తన కోపం పోయేటట్లుగా లేడిని చంపి నెత్తురు (బొడ్డు కోసి కస్తూరి తీస్తారు కనుక) బొట్టుగా పెట్టుకొన్నది. అంతేకాని వాసన కోసమా ? - అన్నట్లు ఆమె ఫాల ప్రదేశం కస్తూరి బొట్టుతో చాలా అందంగా ఉన్నది.

అలం : ఉత్ప్రేక్ష.

జగజ్జనని ముఖం చంద్రుడు కాగా - చంద్రునిలో మచ్చలాగా కస్తూరిబొట్టు ఉన్నది.

'ముఖచంద్ర కళంకాభ మృగనాభి విశేషకా' (ల.స) ముఖమన్న చంద్రునిలో మచ్చలాగా ఉన్న కస్తూరిబొట్టు గలది.

కడిఁదివిలుచేది గుజి కీలకటుచి నిలుపు।
మరుని కువలయ శరము కంపములఁబోలు

దార కడకంటి పై సారె చేరి చేరి ।
వేగ మగుడు సలజ్జ దృగ్విభ్రమముల. 13

తార = కంటి లోపల నల్ల పాప; కడకంటిపై = కంటి చివరలపై; సారెన్ = మాటి మాటికి; చేరి చేరి = సమీపించి సమీపించి; వేగన్ = త్వరగా; మగుడు = వెన్కకు తిరిగే; సలజ్జ = సిగ్గు కల; దృక్ = చూపుల; విభ్రమములు = విలాసవంతములైన చలనాలు; కడిది = గట్టి; విలు= విల్లు; చేది = లాగి; గుఱికిన్ = లక్ష్యశుద్ధికై; -ఈల కఱచి = పండ్లు బిగపట్టి, నిలుపు = నిలిపే, మరుని = మన్మథుని; కువలయ శరము = కలువపూవు; కంపములన్ పోలున్ = చలనములను పోలుతున్నాయి.

ఆమె చూపులు సిగ్గుతో కూడిన విలాస చలనాలు కలవి. నల్లగ్రుడ్డు కడకంట చేరటం- మరలా వేగంగా వెన్కకు పోవటంలో ఆ విలాసాలు మెరుస్తున్నవి. ఆ చలన మెలా ఉన్నదంటే- గట్టి వింటి నెక్కు పెట్టి మన్మథుడు పళ్ళు బిగబట్టి లక్ష్య శుద్ధికై నల్ల కలువ బాణాన్ని నిలిపితే అది కదలుతున్నట్లున్నది- ఆమె చూపులు నల్ల కల్వలు

అలం : ఉత్ప్రేక్ష.

పై పద్యంలో మృగాక్షిగా వర్ణించి ఇక్కడ కువలయాక్షిగా వర్ణించాడు. ఇది చలన సౌందర్యం కాగా పైది నిశ్చల సౌందర్యం. 11వ పద్యంలో మొగం పైకెత్తినపుడు వాలారు కన్నుల అందం చెప్పాడు.
''వక్త్ర లక్ష్మీ పరీవాహ చలన్మీ నాభ లోచనా'' (ల.స.)

ముఖసౌందర్యమన్న ప్రవాహంలో చలించే చేపలవంటి కన్నులు గల తల్లీ ! ''తల్లీ! నీ కుడి కన్ను సూర్యుడై పగటి కాలాన్నీ - ఎడమ కన్ను చంద్రుడై రాత్రినీ, ఫాల నేత్రాగ్నితో సంధ్యలను కన్పిస్తున్నవి.'' నీ నేత్రాలు విశాలములై (విశాల) మంగళకరములై (కల్యాణి) కలువలకు జయింపరానివై (అయోధ్య) కృపాధార కలిగి (ధారానగరం) మధురములై (మధుర) అగాధములై (భోగవతి) కల పుణ్య క్షేత్ర విజయంతో శోభిస్తున్నవి. (సౌం. ల. 48, 49.)

నవ వయస్సీధు మదముచే శ్రవణ కూప
ములఁ బడెడు శంక నలువ చాపలము లుడుగ
నిడియె శృంఖల లనఁ గాటు కిడిన దీర్ఘ
పక్ష్మ రేఖలఁ గనుదోయి పడతి కొనరు. 14

పడతికిన్ = గోదాదేవికి; కనుదోయి = కన్నుల జంట; కాటుక+ఇడిన = కాటుక పెట్టిన; పక్ష్మ రేఖలన్ = రెప్పల గీతలతో; ఒనరెన్ = ఒప్పారుతున్నాయి; నవ = కొత్త; వయః = యౌవనప్రాయమన్న; సీధు = మధువుయొక్క; మదము చేన్ = కైపుతో; శ్రవణ = చెవుల; కూపములన్ = నూతుల్లో (గుంటల్లో), పడెడు = పడతాయన్న; శంకన్ = అనుమానంతో; నలువ = నాల్గు మోముల వేలుపు - బ్రహ్మ; చాపలములు= చాపల్యములు; ఉడుగన్ = పోగా; శృంఖలలు = సంకెళ్ళు; ఇడియన్+అనగన్ = వేసాడో అన్నట్లు (ఒనరెన్).

ఆమె కనులు కాటుక రేఖలతో విశాలంగా అందంగా ఉన్నాయి. యౌవన మదం వల్ల అని చంచలములు కాగా, బ్రహ్మ అవి చెవుల గుంటల్లో పడిపోతాయేమోనన్న సందేహంతో- వాటికి సంకెళ్ళు వేసినాడో అన్నట్లు ఉన్నాయట.

అలం : ఉత్ప్రేక్ష. (చూ. 1-68 పద్యం)

అనయము రాగ మొప్ప సహ జానన చంద్ర కటాక్ష పంక్తి ప
ర్విన నఘ శంకఁ గర్ణ మను శ్రీ మఱుపెట్టఁ జెలంగి చెండుఁ గొ
ట్టి నవనిఁ బడ్డ కమ్మ మగుడం గొను నంతకు నంసపాళి నం
గన యిడి దాఁచు పేరఁ బెర కర్ణము కమ్మ పయిం దళుక్కనన్. 15

సహజ = తోబుట్టువులైన (సహ - జ); నైజమైన; ఆనన చంద్ర = ముఖచంద్రుని; కటాక్ష= కడకంటి; పంక్తి = సమూహం; రాగము = ఎరుపు; అనురక్తి = అనయమున్ = నిత్యమూ; ఒప్పన్ = ప్రకాశిస్తుంటే; పర్విననన్ = వ్యాపిస్తే (కలిగే); అఘశంకన్ = పాపము కదా అన్న సందేహంతో; అంగన = గోద; చెలంగి = ఉత్సహించి; చెండున్ = బంతిని; కొట్టన్ = కొడితే; అవనిన్ = నేల మీద; పడిన; కమ్మన్ = చెవి దుద్దును; కొనునంతకున్ = తీసుకునే లోపల; పెఱ కర్ణము = మరొక చెవికున్న; కమ్మ = పోగు; పయిన్ = పైన; తళుక్కు+అనినన్ = తళతళా మెరుస్తుండగా; అంస పాళిన్ = భుజ ప్రదేశంలో; ఇడి = ఉంచి; దాచుపేరన్ = దాస్తున్న మిషతో; కర్ణము అను శ్రీన్ = (కమ్మరాలిపోయిన) చెవి యన్న లక్ష్మిని; మఱు పెట్టన్ = దాస్తుంది.

ముఖ వెనుక ప్రక్క భుజం మీదకు వంచి ఆమె చెండాట ఆడుతుంటే ఒక కమ్మ జారిపడిపోయింది కమ్మలేని చెవి యన్న లక్ష్మిని సోదరుడైన ముఖచంద్రుడు చూడరాదు - ఇది లోకరీతి. కర్ణాభరణ హీనంగా పుణ్యస్త్రీ ఉండరాదు. ఇది పద్యభావ నేపథ్యం. దీని పైకట్టిన పద్యభావం రాలిన కమ్మ కల చెవిని భుజం మీదకు వంచి ముఖచంద్రుని చూపునకు తప్పించింది. అందువల్ల ఆ పాపం చంద్రునకు లేదు. కంటి చివళ్ళు ఎఱ్ఱగా ఉండటం శుభలక్షణం కనుక అదే అనురాగం. ముఖచంద్రుని కటాక్ష పంక్తి ప్రేమతో సోదరియైన లక్ష్మిని చూడటం. చెవులు శ్రీకారాలు, ఆమె చెండాట ఆడుతున్నది.

అలం : అపహ్నవం - ఉత్ప్రేక్షా సంకరం.

''అభినవ కువలయ శ్యామ కోమలమైన డామూపు మకర కుండలము దాల్ప ''శ్రీకృష్ణుని తల ఎడమ భుజం మీదకు వ్రాలినది. (చూ 5-6)

''కదంబ మంజరీ క్లుప్త కర్ణ పూర మనోహరా''
(కడిమి చిగుళ్ళు చెవులలో అలంకారంగా ధరించిన తల్లీ !)
''తాటంక యుగళీ భూత తపనోడుపమండలా !
(చంద్రుడు - సూర్యుడు - చెవి కమ్మలుగా కలది.) (ల.స.)

*గతే కర్ణాభ్యర్ణం గరుత ఇవ పక్ష్మాణి దధతీ*
*పురాం భేత్తు శ్చిత్త ప్రశమ రస విద్రావణ ఫలే*
*మే నేత్రే గోత్రా ధరపతి కులోత్తంసకలికే!*
*తవాకర్ణాకృష్ట స్మర శరవిలాసం కలయతః. (సౌం. ల)*

మంచు కొండల రాయని కూతురవైన తల్లీ ! ఈకల రెక్కల వంటి రెప్ప వెంట్రుకలను దాల్చిన ఈ నీ కనులు చెవుల దాకా వ్యాపించి శివుని శాంత రసాత్మను చెదరగొట్టటమే లక్ష్యంగా గల చెవిదాకా లాగి ఎక్కుపెట్టిన మరుని బాణాలవలె నున్నవి కదమ్మా !

నాసా చంపకత న్సుగంధ మచటన్ రా భృంగముల్ గ్రోల సం
త్రాసం బందియుఁ బల్కుచో నలము వక్త్రం బేల నా నేటి కం
దే సౌరభ్యము లేదు కుందములు గా వే దంతము ల్గానినాఁ
డా సక్తిన్ బ్రతిబింబ దంభమున నేలా? వ్రాలఁ దజ్జాతికిన్. 16

నాసా = ముక్కు; చంపకతన్ = సంపెంగ లక్షణం కలది కనుక; అచటన్ = అక్కడ; సుగంధము= మంచి వాసన; రాన్ = రాగా; క్రోలన్ = త్రాగటానికి; భృంగముల్ = తుమ్మెదలు; సంత్రాసంబు= భయం; అందియున్ = పొందినవై కూడ; పల్కుచోన్ = భాషించే వేళ; వక్త్రంబు = నోటిపై; ఏల+ అలమున్ = ఎందుకు మూగుతాయి; నాన్ = అనటం; ఏటికిన్ = దేనికి ?; అందున్ = ఆ నోటిలో; ఏ సౌరభ్యము = ఏ వాసన; లేదు = లేదు; దంతముల్ = పండ్లు; కుందముల్ కావే = మొల్లలు కావా; కానినాడు = కానప్పుడు; తత్ + జాతికిన్ = ఆ తుమ్మెదల జాతికి; ఆసక్తిన్ = కోర్కెతో; ప్రతిబింబ దంభమునన్ = ప్రతిఫలమన్న మిషతో; వ్రాలన్+ ఏలా = ఎందుకు వ్రాలాలి?

ఆమె నిశ్వాస వాయువులందున్న సంపంగి వాసనల కాకర్షింపబడి కూడా తుమ్మెదలు - సంపంగి పై వ్రాలవు కనుక - ముక్కుపై వ్రాలక ఆమె సంభాషించే వేళ నోటిపై మూగుతున్నాయి. ఎందుకంటే - ఆ నోటి సువాసన కోసం, అక్కడున్న దంతాలు మొల్లలు కనుక. ఒకవేళ కాకపోతే లోకంలో ఉన్న మొల్ల మొగ్గలపై తుమ్మెదలు - దంతాలకు ప్రతిబింబాలు కనుక - వ్రాలటం దేనికి ?

నాసిక సంపెంగ పువ్వు - దంతాలు మొల్ల మొగ్గలు.

అలం : కైతవాపహ్నుతి+ ఉత్ప్రేక్ష.

నవ చంపక పుష్పాభ నాసాదండ విరాజితా (ల.స.)
(క్రొత్త సంపంగి పూవులాగ ఉన్న నాసిక కలది)

*అసౌ నాసావంశః తుహిన గిరివంశ ధ్వజ పటే*
*త్వదీయో నేదీయః ఫలతు ఫలమస్మాకముచితం*
*వహత్యంతర్ముక్తా శిశిరకర నిశ్వాసగలితా*
*సమృద్ధ్యాయస్తాసాం బహిరపి స ముక్తామణిధరః. (సౌం. ల. 61)*

తల్లీ! హిమాలయ వంశ పతాకా! నీ యీ నాసిక అన్న వెదురు కర్ర ఫలమిచ్చు గాక. (దానికి లోపల ముత్యాలుంటాయన్న ప్రతీతి కనుక). నీ ఎడమ ముక్కున చంద్రనాడి నిశ్వసించి లోపలి ముత్యాన్ని పైకి జార్చినట్లు బైట కూడా ముత్యాలను ధరించి ఉన్నది కదా (ఈ నీ నాసిక అలంకారంగా ఎడమ ముక్కున ముత్తెపు నాసాభరణం ధరించింది.)

తే॥ శంఖ సామ్యంబు రా మున్ను జలజ భవుఁడు।
సరసిరుహపత్ర నేత్ర కంధర యొనర్చె,
జవ్వనము వచ్చి వెండి సాక్షాత్కరించు।
శంఖమున చేసె నును గంధసారచర్చ. 17

జలజభవుడు = పద్మసంభవుడు - బ్రహ్మ; సరసిరుహ పత్ర = పద్మదళాల వంటి; నేత్ర = కన్నులున్న గోదాదేవికి, కంధర = కంఠము; శంఖ సామ్యంబురాన్ = శంకం పోలికరాగా; మున్ను = పూర్వం (జన్మతః); ఒనర్చెన్ = చేసినాడు; వెండి = తర్వాత; జవ్వనము = యౌవనం; వచ్చి, నును = లేత; గంధసార = చందనపు; చర్చన్ = పూతతో; సాక్షాత్కరించు=ప్రత్యక్షమైన; శంఖమున = శంఖాన్నే; చేసెన్ = చేసినది.

జన్మ సహజంగా బ్రహ్మ ఆమె కంఠాన్ని శంఖ సదృశంగా చేస్తే తర్వాత వచ్చిన యౌవనం దానికి గంధపు పూత పూసి నిజమైన శంఖంగానే చేసింది.

అలం : ఉపమ; ఉత్ప్రేక్షలు.

కామేశ బద్ధ మాంగళ్య సూత్ర శోభిత కంధరా (ల.స.).
కామేశ్వరుడు కట్టిన మంగళ సూత్రంతో అందమైన కంఠం కల తల్లీ! 68, 69 - (సౌం. ల.)

కం॥ కమల దళేక్షణ సంగీ
తమున నెగడు మంద్ర మధ్య తార త్రిస్థా
నములకుఁ దీర్చిన రేఖల।
క్రమ మగు రేఖాత్రయమునఁ గంఠం బమరున్. 18

కమలదళ+ఈక్షణ = తమ్మి పూవు రేకులవంటి నేత్రాలు కల గోదాదేవీ!; సంగీతమునన్= గాంధర్వ విద్యలో; నెగడు = ప్రకాశించే; మంద్ర; మధ్య, తార; త్రిస్థానములకున్ = సంగీతం లోని మూడు స్థానాలకు; తీర్చిన = వ్రాసిన; రేఖలక్రమము = గీతల వరుస, అగు = ఐన; రేఖా త్రయమునన్ = మూడు రేఖలతో; కంఠంబు = గళం; అమరున్.

గోదాదేవి సంగీతాన్ని మూడు స్థాయుల్లో పాడగలదన్నట్లుగా కంఠమందు మూడు రేఖలున్నాయి. అవి చాలా అమరినట్లున్నవి.

అలం : ఉత్ప్రేక్ష.

కంఠం త్రిరేఖాన్వితంగా ఉండటం భారతీయ శిల్పంలో చాలా అందంగా మలచబడటం చూడాలి.

''తల్లీ ! నీ కంఠం నీ ముఖ మన్న తామరకు కాడవలె నున్నది.''(సౌం.ల 68)

గళమందలి త్రిరేఖలు మంగళ సూత్రపు మూడు ముడులట్లు; మంద్ర మధ్యమ గాంధార గ్రామములు కలసి పోకుండా గీసిన సరిహద్దు రేఖలట్లున్నవి.'' (సౌం. ల.69.)

తే॥ లలన మృదుబాహుయుగబిసలతలు గడఁగి
బిసలతాశ్రీల నెల్లను వెస హరించె;
మఱి హరింపంగ నవి నెఱి విఱిగి కాదె
సారెఁ దనుయాత్రఁ దంతులఁ జరపుచుండు. 19

లలన = (స్త్రీ) గోదాదేవి యొక్క; మృదు = మెత్తని; బాహుయుగ = చేతుల జంట (అన్న); బిసలతలు= తామర తూళ్ళ తీగలు; కడఁగి = పూనుకొని; వెసన్ = త్వరగా; బిసలతాశ్రీలను+ఎల్లన్ = తామర తూళ్ళ సంపద నంతటినీ; హరించెన్ = కొల్ల కొట్టింది; మఱి = ఇక; హరింపంగన్ = కొల్ల గొట్టినందువల్ల; అవి = తామర తూళ్ళు; నెఱి = పూర్తిగా; విఱిగి కాదె = తెగిపోయినందువల్ల కదా; సారెన్ = మాటికి; తంతులన్ = దారాలతో; తనుయాత్రన్ = దేహయాత్ర = బ్రతుకు నిలుపుకొనటం; జరపుచుండున్ = జరుపుకొంటున్నవి.

గోదాదేవి బాహువులు తామర తూడుల అందాలను కొల్లగొట్టినందువల్ల అవి విరిగిపోయి (చెదరిపోయి) నందున నూలుపోగులద్వారా పొట్ట పోసుకొంటున్నవి. తామర తూడులు విరిగి ముక్కలు కావటం - వాటి నుండి నూలు రావటం సహజం. ఇది ఆధారంగా చేసిన కల్పన.

లలన : విలాసమే శీలముగా గల స్త్రీ = (శర).

తల్లీ ! నీ కరకమలములు గోళ్ళ లత్తుక ఎరుపుతో అప్పుడే విచ్చిన తామరలను నవ్వుతున్నట్లున్నవి. వానికి పోలిక చెప్పలేను. కమలము తనయందున్న లక్ష్మి పాదాల పారాణి రంగు కొంత పొందితే పోలగలదేమో? (సౌం. ల. 71.)

మ॥ తళుకొత్తు న్భుజకీర్తి వజ్రఘృణి సూత్ర స్యూత హారస్ఫుర
త్కళికా చిత్ర కుచద్వయోపరిగలా ధస్స్వల్ప విస్తారదై
ర్ఘ్యలసత్తిర్యగురస్తటం బను వివాహోంచన్మనోజాత పా
టలదంతచ్ఛద బోడబాసికము దండ ల్వోలెఁ గేల్లింతికిన్. 20

ఇంతికిన్ = స్త్రీ (గోద)కి; కేల్లు = బాహువులు; భుజకీర్తి = భుజాలయందున్న ఆభరణాల (దండ కడియాలు) లోని; వజ్ర = వజ్రముల; ఘృణి = కిరణాలన్న; సూత్ర = దారాలతో; స్యూత = గుచ్చిన;

హార = ముత్యాల దండల్లో; స్ఫురత్ = ప్రకాశించే; కళికా = మొగ్గలతో; చిత్ర = అనేక వర్ణాలు కల; కుచద్వయ = చనుల జంటకు; ఉపరి = పైన; గళ+అధః = గొంతుక్రింద; స్వల్ప = కొంచెం; విస్తార = వెడల్పైన; దైర్ఘ్య = పొడవైన; లసత్ = అందగిస్తున్న; తిర్యక్ = అడ్డముగా నుండే; ఉరస్తటంబు = వక్షః ప్రదేశం, అను = అన్న; వివాహ+అంచత్ = పెళ్ళిలో ప్రకాశించే; మనోజాత = మన్మథుని; పాటల = ఎఱ్ఱని, దంతచ్ఛద = వాతెఱ కల (రతిదేవియొక్క); బోడబాసికము = బోడి బాసికముయొక్క; దండల్ వోలెన్ = (వ్రేలాడు) దండల్లగా; తళుకు+ఒత్తున్ = కాంతి వెద జల్లుతున్నవి (కేళ్ళు కర్త).

గోదాదేవి చేతులు వక్షః స్థలం ఎలా ఉన్నాయంటే - ఆమె దండలకు కడియాలున్నవి. వాటికి వజ్రాలున్నవి. ఆ వజ్ర కిరణాలు ఉరః స్థలం మీదున్న ముత్యాల హారాల ముత్యాల మొగ్గల్లోకి (పూసరాలైతే మొగ్గల్లోకి) గుచ్చుకొన్నట్లు ప్రవేశిస్తున్నవి. వీటితో అందంగా స్తనాలకు పైన గొంతు క్రింద కొంచెం విస్తారంగా; పొడవుగా వక్షః ప్రదేశముంది. అది రతిదేవి వివాహ కాలంలో కట్టుకొన్న బోడి (తల లేని) బాసికం లాగా ఉంది.

స్త్రీలు కట్టుకొనే బాసికం దీర్ఘచతురస్రంగానూ; పురుషులు ధరించేవి పొడవైన శిఖరంతో త్రికోణాకారంలోనూ ఉంటాయి. ఈ బాసికాలు బంగారపువి. దాని కటు నిటు రంగు జల్తారు దారాల కుచ్చులు వ్రేలాడు తున్నాయి. ఇది ఉపమాన వస్తువు.

ఉపమేయం గోదాదేవి వక్షః స్థలం. కంఠానికి క్రింద, చన్నులకు పైన ఉన్న ప్రదేశం. ఇది రతి దేవి వివాహ కాలంలో కట్టుకొన్న బాసికం లాగా ఉంది. బాసికానికి వ్రేలాడే జలతారు దారాలు ఆమె బాహువులు భుజకీర్తుల్లోని వజ్రాల నుండి వెలువడే కాంతి కిరణాలు. వివాహ కాలంలో వధువు మెడలో పూలదండలు అలంకారాలుగా ధరించటమున్నది కనుక బాహువుల వజ్రాల కిరణాలు అడ్డంగా ఉరఃస్థలంపైకి వ్యాపించి మెడలో దండల్లోకి చొచ్చుకొని పోతున్నవి.

అలం : ఉత్ప్రేక్ష.

కనకాంగద కేయూర కమనీయ భుజాన్వితా - ల.స.

సౌం ల. 70 - 71 శ్లోకాలతో పోల్చు.

చ॥ ఒదవెడు జవ్వనంబు వెలి కొత్తఁగఁ, బయ్యెద సిగ్గుఁ గూడి బి
ట్టదుముఁగఁ లేఁత లౌట దిగ నాఁకకు మీఱును లేక; వక్షపుం
జదుమునఁ బ్రక్కల న్మెఱసి చప్పట లై మఱి లావు గూడఁ బైఁ
బొదలె ననంగఁ బిక్కటిలెఁ బొల్తుక చన్నులు నాఁడు నాఁటికిన్. 21

పొల్తుక = కన్యయొక్క; చన్నులు; నాడునాటికిన్ = రోజురోజుకు; ఒదవెడు = సంభవిస్తున్న; జవ్వనంబు = యౌవనం; వెలికిన్ = బైటకు; ఒత్తగన్ = తోస్తే; పయ్యెద; సిగ్గున్ కూడి = పైటా సిగ్గూ ఏకమై (పైట సిగ్గుతో కలిసి); బిట్టు = మిక్కిలి; అదుమగన్ = అణోస్తే, లేతలు= పసివి; ఔటన్ = అయినందువల్ల;

దిగన్ = లోపలకు పోవటానికి గానీ; ఆకకున్ = నిరోధానికి (అడ్డుకు); మీఱును లేక = అతిక్రమించటానికి గానీ శక్తి లేక; వక్షము+చదుమునన్ = చదునైన రొమ్మున; ప్రక్కలన్ = పార్శ్వస్థలంలో; మెఱసి = మెరపుగా కన్పించి (హఠాత్తుగా తోచి); చప్పటలై = చప్పగా చదికిలబడ్డవై (ప్రక్కలందు బలిసి); మఱి = తర్వాత క్రమంగా; లావు కూడన్ = బలం రాగా (బలిసినవై); పైన్ = పైన; పొదలెను = వృద్ధి పొందాయి; అనంగన్ = అన్నట్లుగా; (నాడు నాటికిన్); పిక్కటిలెన్ = నిండుగానైనవి (ఏపుగా పెరిగినవి).

యౌవనోదయిరి కాగానే క్రమంగా ఆమె స్తనాలు మొగ్గలై అంకురించి - ప్రక్కల కుదురు కట్టి - (కుదురుకొని); పైట సిగ్గులు కలసి వాటిని మూసినా - రొమ్మున విస్తరించి పైకి నిక్కినవి. (మొనలు పొడుచుకొని వచ్చాయి). ఇదొక క్రమ వికాసం. ఈ క్రమం చూస్తే ఏమనిపిస్తున్నదంటే - యౌవనం లోపల నున్న స్తనాలను పైకి ఒత్తుతున్నది. పైన సిగ్గూ పైటా ఏకమై మరలా క్రిందికి దిగద్రొక్కుతున్నవి. పైనున్న త్రొక్కుడుకీ క్రిందనున్న ఒత్తిడికీ తట్టుకోలేక ప్రక్కలకు పెరిగి - నాటుకొని - కుదురుకొన్నాక- వత్రునగా బిళ్ళలుగా కట్టి; క్రమంగా బలం పుంజుకొని పైకి మొనలు పొడుచుకొని వచ్చాయి.

స్తన క్రమ విజృంభణం లోకోత్తర రమణీయంగా ఉంది. ఈ క్రమాభివృద్ధిలో భిన్న దశలు వర్ణనీయాంశాలుగా గ్రహించటమే ప్రతిభ. రెండు శక్తులు సమానంగా ఎదురైనపుడు- (వెనకా ముందూ) - నడుమనున్న వస్తువు ప్రక్కలకు చెదరిపోతుంది కదా. అలాగే యౌవనం పైకి నెడుతున్నది. సిగ్గూ పైటా, ఒకటి; స్వభావం - రెండవది; సిగ్గుతో ధరించినది; కలసి అదుముతున్నవి. కనుక ప్రక్కలకు పెరిగినవి. ఈ సూక్ష్మవర్ణన రాయల ప్రతిభా వైలక్షణ్యం.

(చూ. 4.3 లో సంచి క్రమంగా త్రాడు తెగటం వర్ణింపబడ్డది).

పొలతి+క = చిన్నది. బాల్యం నుండి యౌవనం గడపలో కప్పుడే అడుగు పెట్టిన కన్య. చన్ను కట్టు - చన్ను కట్టటం వంటి ప్రయోగాల కర్థమే ఈ వర్ణన.

అలం : ఉత్ప్రేక్ష.

''కామేశ్వర ప్రేమరత్న మణి ప్రతిపణస్తనీ'' (ల.స.)

కామేశ్వరుని ప్రేమరత్నానికి సరియైన వెలగా నిచ్చిన స్తనాలు కలది. ''అమూతే వక్షోజౌ అమృత రస మాణిక్య కుతుపౌ''. (సౌం.ల. 73) తల్లీ! నీ యీ స్తనాలు అమృత రసాన్ని నింపిన కెంపుల కలశాలు.

తే॥ ధృత రఘూత్తమ శాప మొక్కింత విడిచి
విడిచి కడ కేఁగ నప్పుడప్పుడ కలిసెడు
చక్రయుగ మన ఱొమ్మెల్ల నాక్రమించె
గొమిరె చన్నులు లేఁగప్పు కొనల నలర. 22

ధృత = (ఎన్నాళ్ళుగానో) వహించిన; రఘూత్తము = శ్రీరామచంద్రుని; శాపము; ఒక్క+ఇంత= ఒక కొంచెం; విడిచి విడిచి = క్రమంగా తీరి; కడకున్+ఏగన్ = దూరం పోతే; అప్పుడు+అప్పుడ =

...ప్పుడే, కలిసెడు = కలుస్తున్న; చక్రయుగము = చక్రవాకపు జంట; అనన్ = అన్నట్లుగా; కొమిరె ...న్నులు = కన్యాస్తనాలు; ఱొమ్ము+ఎల్లన్ = వక్షఃస్థలమంతా; లేఁగప్పు = లేత నలుపు; కొనలన్ = మొనలపై; ...ప్ = ఏపిసింపగా, ఆక్రమించెన్ =

రామశాపం వల్ల ఆమె స్తనాలు - దూరస్థమైన చక్రవాక ద్వంద్వం లాగ ఉండి క్రమంగా శాపం తీరిపోగ ఆ జంట దగ్గరకు చేరి కౌగిలించుకొన్నట్లుగా ముందు దూరంగా ఎడ మెడంగా ఉంటూ పెరిగిన క్రమ వికాసం వల్ల దగ్గరకు వచ్చి వచ్చి ఎడములేక ఒకదాని నొకటి కౌగిలించుకొని ...న్నట్లున్నవి

సీతా విరహంలో చక్రవాకం జంట క్రీడిస్తుంటే రాముడు వాటిని శపించాడట - రాత్రి దూరంగా ...తో ఉండమని రాత్రి దూరస్థమై పగలు కలుసుకొన్నట్లు మొనల లేత నలుపు - అవసానంలో శాపం కొంచెం మిగిలినట్లుగా ఉన్నది. (శాపం = నలుపు) లేదా చక్రవాకం ముక్కు నలుపుతో పోలిక.

కం॥ తారెట్లట్లుగఁ
జేరిన ముత్తెంపు సరులఁ జేడియ చన్నుల్;
లోరెంట లుడిపె ఘన మగు।
వారు నిజార్జవముఁ జేరు వారికి నీరే? 23

జేడియ చన్నుల్ = ముదిత చన్నులు; తారు = తాము; ఎట్లు = ఎట్లో; అట్లుగన్ = అలాగే; ... = ఆమెను; చేరిన = సమీపించిన; ముత్తెపు సరులన్ = ముత్యాలదండల్లో; లో = నడుమనున్న; రెంటల = రెండు వీడిగా ఉన్న లక్షణాన్ని - ద్వంద్వ ప్రవృత్తిని; ఉడిపెన్= పోగొట్టాయి; ఘనమగువారుఁ ..., చేరువారికిన్ = సమీపించిన వారికి; నిజ = తమ; ఆర్జవమున్ = ఋజుత్వాన్ని; ఈరే = ఇవ్వరా?

లోకంలో ధర్మాత్ములు తమ దగ్గరకు వచ్చిన వారికి తమ లక్షణాలే నేర్పుతారు కదా. అలాగే ఆమె ఘనమైన స్తనాలు తమ దగ్గరనే ఉన్న ముత్యాల సరాల్లో దూరే లక్షణాన్ని పోగొట్టి కలసి ఉండటం నేర్పాయన్నట్లు క్రిక్కిరిసిన తమలో అవీ కలసిమెలసి పెనవేసుకొన్నట్లున్నాయి.

...న మధ్య దూరం సన్నని తామర తూడంత హారాలు. వాని మధ్యలో ఒదిగి పోయిన భారతీయ ...ప్రస్తానే ఈ అందం చూడదగినది.

అలం : అర్థాంతరన్యాసం

''నాభ్యాలవాల రోమాళి లతా ఫల కుచద్వయీ'' (అ.స.).

నాభి పాదునుండి ప్రాకిన తీగ నూగారు. దానికి చివరన కాచిన పండ్లు స్తనాలు. అవి కలది.

తే॥ వింహితతిమీఁదఁ గోపాన మరుఁడు దివియ
వేగమై పైఁడి యొఱతోన విసరఁ, గుట్లు

దునిసి బైటికి నసిధార దోఁచె ననఁగఁ
గనక రుచి మధ్యలత నారు కాంత కలరు. 24

మరుడు = మన్మథుడు; విరహితతి = విరహుల సమూహం; మీదన్; కోపానన్ = కోపంతో; వేగమై = వేగంగా (వేగం కలవాడై); తివియన్ = లాగి; పైడి = బంగారు; ఒఱతోన్ = కత్తి గొనెనతోనే; విసరన్ = విసిరితే; కుట్లు తునిసి = ఆ ఒరకుట్లు తెగిపోయి; అసి = కత్తి; ధార= అంచు; తోచెన్+ అనఁగన్ = కన్పిస్తున్నదా అన్నట్లుగా; కనకరుచిన్ = బంగారు కాంతితో; మధ్యలతన్ = నడుమన్న తీగె మీద; కాంతకున్ = గోదా దేవికి; ఆరు = నూగారు; అలరున్= అందగిస్తున్నది (పైడి యొఱతోన విసరన్ వేగమై తివియన్ - అనీ అన్వయించవచ్చు).

విరహులపై ఒళ్ళు మండిన మన్మథుడు వేగంగా కత్తి ఒరతో విసరటంతో ఆ వేగానికి ఒర కుట్లు తెగి - కత్తి అంచు ఒరనుండి కన్పిస్తున్నట్లు - గోదాదేవి బంగారు కౌఁదీగె మీద నూగారు రాజిల్లుతున్నది. పోలికలు :- నూగారు = నల్లని నునుపైన కత్తి అంచు. ఒర = బంగారు కాంతితో మెరిసే ఉదరభాగం. కుట్లు = నూగారు రేఖలు ముడుతల్లో విడివిడిగా కన్పించేది.

అలం : ఉత్ప్రేక్ష.

(ఆమె శరీర కాంతి వర్ణన - 36వ పద్యం చూడు - కనుక మధ్యలత బంగారు ఒర).

తల్లీ ! నీ నూగారు ఎలా ఉన్నదంటే - నీ భర్త శివుని క్రోధాగ్నికి మన్మథుడు శరీరం మండుతూ ఉంటే ఆ మంటలను చల్లార్చుకోవటానికి నీ నాభీ సరస్సులో మునిగితే పైకి లేచిన పొగచాలు'' (సౌం. ల 76.)

కం. అండజ గామిని యూరుపుఁ
బిండు వలపు లాన నాభి బిలము వెడలి చ
న్గొండల నడుముగఁ బ్రాకెడు
కుండలియో యనఁగ నారు కొమరొప్పారుఁ. 25

ఆరు కొమరు = నూగారు అందం; అండజ గామిని = హంస గమనయైన గోదాదేవియొక్క; ఊరుపు పిండు = నిట్టూర్పుల గుంపు; వలపులు = వాసనలు; అనన్ = త్రాగటానికి; నాభి బిలమున్ = బొడ్డన్న పుట్టనుండి; వెడలి = బయలుదేరి; చన్ కొండల = ఉన్నత స్తనాల; నడుముగన్ = మధ్య; ప్రాకెడు = ప్రాకుతున్న; కుండలియో = పామా; అనగన్ = అన్నట్లుగా; ఒప్పారున్ = విరాజిల్లుతున్నది.

ఆమె నూగారు కుండలిని. అది నాభి బిలం నుండి బయలుదేరి చన్గొండల నడుమనుండి పైకి వస్తున్నది. ఎందుకంటే - ఆమె నిట్టూర్పుల వాసనలను త్రాగటానికా అన్నట్లు.

అలం : ఉత్ప్రేక్ష.

కుండలి శబ్దం కుండలిని అర్థంలో ప్రయుక్తం కావటం విశేషం. బయటి పాము లోపలి కుండలినీ శక్తికి ప్రతీక. లోపలిది వాస్తవం బయటిది దానికి ఛాయ - ప్రతీక చిహ్నం (దీనికి వివరణగా చూ. 37లో నాగకన్యకలు - 79, 80 యోగశక్తి).

''తల్లీ ! నీ నడుముపై కన్పించే ఈ రోమ రాజి - కుచకలశములు అన్యోన్య మొరసికోవటం [illegible] నడుమునున్న ఆకాశం (స్థలం) క్రమంగా చోటు చాలక క్రిందకు జారినాభీ బిలాన్ని చేరుకున్నట్లున్నది.'' (సౌం. ల. 77)(ఆకాశం నలుపు నూగారుగా మారింది).

కం॥ అంగన నిలిచిన బాహువు
లుం గౌనును నేఉుపఉుచు లోకమునకు ర
త్నాంగద కాంచీ భేదము
లుం గెళవుల నడుమ నునికియు న్నూఁగారుఁ. 26

అంగన = శుభాంగి, నిలిచినన్ = నిలబడితే; లోకమునకున్ = లోకంలో ప్రజలకు; బాహువులున్ = [illegible], కౌను = నడుమును; కెళవులన్ = ప్రక్కలందు; రత్నాంగద = మణిమయమైన బాహుపురులు; కాంచీ = మొలనూలు, భేదములు = వేర్పాట్లు; నడుమన్= ఉదర భాగాన నున్న; నూగారున్ = రోమక్రమం; ఉనికులున్ = ఉండుటలు (ఉనికి+లు); ఏఉుపఉచున్ = వేర్వేరని ప్రదర్శిస్తున్నవి.

ఆమె నిలబడినపుడు ఇది చేయి. ఇది నడుము - అన్న భేదాన్ని కల్పించేవి పార్శ్వములందు- బాహుపురులు; నడుమ నూగారు - మొలనూలు.

కం॥ తను మధ్యవళీ భంగము
లను గూర్పఁగ నవియుఁ దత్కులముల, యగుటఁ గం
తుని యిడినపత్తి ఱేకనఁ
జను నొడ్డాణమునఁ గౌను చామకు నమరుఁ. 27

చామకున్ = యౌవనవతికి; తను = సన్నని; మధ్య = నడుము నందున్న; వళీ = భంగములను= త్రివళులన్న విరుపులను; కూర్పగన్ = అతకటానికి; అవియున్ = వళీ భంగాలున్నూ; తత్ = ఆ బంగారు; కులములు జాతులున్ = జాతివే కావటం వల్ల; కంతుని = మన్మథునియొక్క; ఇడిన = తాపిన; పత్తిఱేకు = లోహాల [illegible]టానికై వేసిన సన్నని రేకు, అనన్ = అనటానికి; చను = వీలైన; ఒడ్డాణమునన్ = ఒడ్డాణంతో; కౌను = నడుము, అమరున్ = అమరిన (ఒకదాని కొకటి నప్పినట్లున్నాయి).

ఆమె నడుము ఒడ్డాణంతో అందంగా ఉంది. రెండూ - నడుమూ; ఒడ్డాణం - ఒకే రంగులో ఉన్నాయి మన్మథుడు (త్రివళులు పొట్టపై నున్న మూడు ముడుతలు విడివిడిగా తునిగినట్లుంటే [illegible]టానికై బంగారంతో చేసిన సన్నని రేకు బిగించాడా అన్నట్లుంది ఒడ్డాణం.

అలం : ఉత్ప్రేక్ష

కం॥ లేఁ గౌఁ దీఁగ నితంబము
ప్రేఁగునఁ ద్రెంపుటయుఁ గని విరించి బిగింపన్
లోఁగి ముడి యిడియె వదలుగ
నాఁ గోకస్తని గభీర నాభి చెలంగున్. 28

కోకస్తని = చక్రవాక పక్షుల స్తనాల వంటి స్తనాలున్న గోదయొక్క; నాభి = బొడ్డు; లేఁగౌఁదీఁగ= లేత సన్నని తీగవంటి నడుము; నితంబము = కటిభాగం; ప్రేగునన్ = బరువుతో; త్రెవ్వుటయున్ = తెగిపోవటం; కని = చూచి; విరించి = బ్రహ్మ; బిగింపన్ = బంధించటానికై; వదులుగన్ = గట్టిగా కాక; లోఁగి = రెంటిని ఒక దానిలో ఒకటి దూర్చి; ముడి+ఇడియెన్ = ముడివేశాడు; నాన్ = అన్నట్లు; చెలంగున్ = శోభిస్తున్నది.

ఆమె నాభి సన్నని నడుము నితంబ భారం వల్ల తెగిపోతే చూచి బ్రహ్మ రెంటిని బిగించి వేసిన ముడిలాగా ఉన్నది. బొడ్డు గుండ్రంగా చుట్టచుట్టినట్లుంది కనుక ముడి - అనటం చాలా క్రొత్త అలంకారం.

అలం : ఉత్ప్రేక్ష.

''తల్లీ ! నీ నితంబ భారమూ - వైశాల్యమూ - నీ తండ్రియైన పర్వత రాజు తన చఱియనుండి తీసి నీకరణంగా ఇచ్చినాడన్నట్లున్నది'', (సౌం.ల. 81.)

కం॥ వెలఁది కటిపేర నిల నొక
పులినము డిగఁబడియె సింధు పులినపు పంక్తిన్
నలువ యది పడఁగ గాదే
తెలియుట కం దంచపదము దిరముగ నిలిపెన్. 29

సింధు - నదుల; పులినపు = ఇసుక దిబ్బల; పంక్తిన్ = గుంపునుండి; ఇలన్ = లోకంలో; ఒక పులినము= ఒక ఇసుక తిన్నె; వెలఁది = ఇంతి; కటిపేరన్ = నితంబ మన్న పేరున; దిగబడియెన్=ఉండిపోయినది; అది - ఆ పిరుదులన్న పులినం; పడగన్+కాదే = పడినందువల్లనే కదా; తెలియుటకున్ = తెలియచేయటం కోసం; అందున్ = ఆ నదీ స్థలాల్లో; అంచపదము= హంసపాదము (పాదు); తిరముగన్ = స్థిరంగా; నిలిపెన్ = నిలిపినాడు

నదుల ఇసుక తిన్నెలలో నుండి ఒకటి చెదరిపోయి ఇంతి కటి పేరున భూమిలో ఉండిపోవటం వల్ల - ఆ లోపించిన పులిన స్థలాన్ని సూచించటాని కన్నట్లు బ్రహ్మ పులిన తలాల్లో హంసపాదు గుర్తుగా ఉంచినాడు కదా.

ఇసుక తిన్నెలపై హంసలు చరించటం సహజం. అది లోపించి పోయిన తిన్నెను సూచించే గుర్తుగా ఉత్ప్రేక్షితం.

గ్రంథాల్లో లుప్తభాగాలను సూచించే గుర్తు అంచపాదు - సృష్టికర్త ఒక ఇసుకతిన్నెను తీసి ఈమె [illegible]గా నిర్మించి - ఆ తీసిన భాగమెక్కడో అక్కడ అంచపాదు గుర్తుగా ఉంచాడని చమత్కారం.

విశే॥ ఇటి పేరి పులిన తలంలో భవిష్యత్తులో అంచపాదులు - ఒకరకమైన నఖక్షతాల పేరు కలవి రాబోతున్నవని వ్యంగ్యం.

అలం : ఉత్ప్రేక్ష

తే. కదళి దివియించె నాగ్రాంఘ్రికంబు తొడల
మెనుపు నెట్లన్నఁ బొరల సోదన నడంచు
కొన్న యాఁదోఁక పాటును గొప్పు విప్ప
మెఱయు గోర్ముచ్చులును గెంపు గుఱులు గావె. 30

కదళి = అరటిచెట్టన్న దొంగలసాని; ఆగ్ర+అంఘ్రికంబు = మునిపాదం దాకా (ఆ+అగ్ర+అంఘ్రికంబు); తొడల మెనుపున్ = ఆమె ఊరువుల కలిమిని; దివియించెన్ = దోపిడి చేయించింది; దొంగిలింపించింది (ఆ దొంగల గుంపుతో); ఎట్లు+అన్నన్ = ఈ దొంగతనానికి సాక్ష్యమేమిటి ? అంటే; పొరల సోదనన్= అరటి పట్టల్లో (వస్త్రాం కుచ్చుల్లో- మడతల్లో); వెదకటం వల్ల (బైటపడ్డ సత్యమేమంటే); అడంచుకొన్న= దాచుకొన్న; ఆఁదోఁకపాటున్ = ఆవు తోక వలె క్రిందికి పోను పోను; ఉబ్బు = స్థూలత్వం; తగ్గటమన్న గుణం, కొప్పున్ విప్పన్ = అరటి పువ్వన్న దొంగ కొప్పు విప్పితే (బైటపడిన); మెఱయు = కన్పించే; గోర్ముచ్చులున్ = గడ్డ గోళ్ళు (ఆయుధ విశేషాలు); అన్న దొంగలు ఆపేరు గల అరటిపువ్వులోని విశేషాలు, కెంపున్ = ఎఱ్ఱని మణి; గుఱులు = సాక్ష్యాలు; కావె = కావా ?

అరటిబోదెల ఆఁదోకపాటు - అరటి పువ్వుల్లోని గోర్ముచ్చులు - పూవులోని ఎఱ్ఱదనం - ఈ మూడు వస్తువులు దేవి ఊరు సౌందర్యం - పాద నఖాలు - పాదాలకున్న లత్తుకరసం - వీటిని అరటి దొంగలసాని దొంగతనం చేయించింది. దొంగ సొమ్మును - వస్త్రాల మడతల్లో - కొప్పు ముడిలో - దాచుకొన్నట్లు; చెట్టూ దాచుకొన్నది. అవి బైట పడటంతో అరటి తల వాల్చింది.
చూ॥ 78వ పద్యం, దొంగలు బాటసారులు దాచిన సొమ్ముల కోసం చేసే వెదకులాటలు. అదే పని ఇక్కడా జరిగింది.

విశే॥ ఇలాంటి అలంకారాలన్నీ కవిలోనున్న చక్రవర్తి న్యాయపాలనను ధ్వనిస్తాయి.

తే. వసుధలో నెట్టి శ్రీ గల వారివేని
పరిభముల దాస్యములు సేయు సరసిజాక్షి
యూరువుల కెట్లటన్నఁ బైఁ దారు మోచు
గొడుగులును నల్ల కలశముల్ గుఱులు గావె ? 31

వసుధలోన్ = భూలోకంలో; ఎట్టి = ఎలాంటి; శ్రీ = ఐశ్వర్యం; కలవారిని = ఉన్నవారిని; ఏనిన్ = ఐనా; కరభములు = ముంజేతులు (మణికట్టు నుండి చేతిపై భాగం వ్రేళ్ళదాకా); సరసిజ+అక్షి = పద్మ నేత్ర; ఊరువులకున్ = తొడలకు; దాస్యములు సేయున్ = ఊడిగం చేయక తప్పదు; ఎట్లు+అటు+అన్నన్ = ఎలాగంటే; తారు = ముంజేతులు; పైన్ = పైన (అంటే అరచేతులు కరభాలకు పైనుంటాయి కనుక); మోచు = మోసే; గొడుగులు = ఛత్రములు; కలశములు = చెంబులు; గుఱుతులు = గుర్తులు; కావె = కావా ?

అరచేతిలో ఛత్ర - కలశ రేఖలు ఐశ్వర్య చిహ్నాలు. అవి కలవారు రాజులు - రాణులు. అలాంటి చేతుల మీది భాగాలు - గోదాదేవి ఊరువులకు దాస్యం చేయక తప్పదు కదా. జగజ్జనని కనుక ఆమె ఊరుదాస్యం ఐశ్వర్యం. అదీ అందర కందదు - కనుక శ్రీకలవారిదే ఆ భాగ్యం. అంటే శ్రీ = లక్ష్మిని; కలవాడు విష్ణువు. అయనదే ఊరు సేవా భాగ్యం. ఇది విశేషార్థం.

ఊరువులు కరభములట్లున్నాయని సాధారణార్థం - రాజులకు గొడుగులు పట్టడం- కలశ జలాలతో పాద క్షాళనం చేయటం సేవకుల వంతు. శృంగారంలో ఊరు సేవ భర్త వంతు.

కాళిదాసన్నాడు కదా ''అంకే నిధాయ కరభోరు'' - ఇత్యాది.

వసుధలోన్ = నిత్య విభూతిలో శ్రీ ఊరు దాస్యం. లీలా విభూతిలో భూ (గోదా దేవి ఊరు దాస్యం); వసుధ = లీలావిభూతి. ''కామేశ్వర జ్ఞాన సౌభాగ్య మార్దవోరు ద్వయాన్వితా'' (ల.స.).

శివునికే తెలిసిన సౌభాగ్యం; మృదుత్వం కల ఊరు సంపద కల తల్లీ ! కాముని కాల్చినవాడు అమ్మవారి ఊరు సౌభాగ్యాస్వాదనం చేస్తున్నాడు.

''అష్టదిగ్గజాల తొండాలను - బంగారు అరటి బోదెలను తల్లీ! నీవు ఒక్కసారిగా జయించి ఆ ఏనుగుల కుంభాలను మోకాళ్ళుగా ధరించావు. అవి భర్త నమస్కారాలతో కఠినము లైనాయి కదమ్మా !'' (సౌం.ల.).

కం. వలరాజు కుటుంబము న
గ్గలముగఁ బోషించుకలమ గర్భము లయ్యెఁ
బొలఁతుక జంఘ లతిశ్యా
మల మంజీరస్థ నిబిడ మరకత కాంతిఁ. 32

పొలతుక = (పొలతి+ఉక) = అందగత్తె; జంఘలు = పిక్కలు = చిరుతొడలు; అతి = మిక్కిలి; శ్యామల= మిక్కిలి పచ్చని; మంజీరస్థ = కాలి అందెలలోని; మరకత = ప్రాకుడు వంటి రంగు కల రత్నాల; కాంతిన్= ప్రకాశంతో; అగ్గలముగన్ = ఎక్కువగా; వలరాజు = వలపుల (వలపు+రాజులు) మన్మథుని; కుటుంబము= చిల్కలు; పోషించు = సాకెడి; కలమ = వరి; గర్భముల = పొట్టలు; అయ్యెన్ = ఐనవి.

ఆమె పిక్కలు వరిపైరు పొట్టలు - (ఇంకా ఈననివి). అవి వలరాజు కుటుంబమైన చిల్కలను పోషిస్తున్నవి. వరిపండటం - చిల్కలు కంకులు కోసం చేలపై ఎగరటం పల్లీ దృశ్యం.చూ. 4-162.

''తల్లీ ! మన్మథుడు నీ పతిని జయించటం కోసం (తనను కాల్చినాడన్న కోపంతో); రెండు అమ్ముల పొదులు తగిలించుకొన్నాడు. అవే నీ పిక్కలు - వాటి నుండి వెలువడి వచ్చే బాణాల శిఖరాలై- నిత్యమూ దేవతల కిరీటాల రాపిడికి వాడి దేరిన నీ వేలి గోళ్ళు - మెరుస్తున్నవి''. (సౌం.ల.).

ఇంద్ర గోప పరిక్షిప్త స్మరతూణాభజంఘికా - (ల.స)

ఆర్ద్ర పురుగులతో కూర్చిన (కెంపుల మణుల తాపిన) మన్మథుని అమ్ముల పొదుల వంటి పిక్కలు గల తల్లీ!

తే. ఉవిద నిద్దంపుజంఘల సవతుఁ గోరి
కలమ గర్భంబు లడఁచు లోఁ గంటకములు,
చాతురుల మించి మఱి దివసక్రమమున,
నిలువ కవి బాహిరము లైనఁ దలలు వంచు. 33

కలమ గర్భంబులు = వరిపైరు పొట్టలు; ఉవిద = గోదాదేవి; నిద్దంపు = మృదువైన; జంఘల= పిక్కల యొక్క; సవతు = సామ్యం; కోరి = కోరుకొని; కంటకములన్ = ముళ్ళను; చాతురులన్ = నేర్పుతో; మించి = ఎక్కువగా; లోన్+అడచున్ = లోపల దాచుకొంటున్నది; మఱి = తర్వాత; దివ సక్రమమునన్ = కాలక్రమంగా; అవి = ముండ్లు; నిలువక = లోపలనే ఉండకుండా; బాహిరములు+ ఐనన్ = బయట పడగా, తలలు వంచున్ = పైరు సిగ్గుతో తలలు వాల్చుతున్నది.

వరిపైరు పొట్ట ఆమె జంఘలతో పోటీపడి తనలోని ముండ్లను లోపల దాచిపెట్టింది. కానీ కాలక్రమంలో గర్భం నుండి వెన్ను ముండ్లతో బైటకు రాగా సిగ్గుపడి తల దించుకొన్నది.

పంట పండటం = వరి వెన్ను వేయటంతో పైరు తలలు వాలుస్తుంది. ఈ సహజ క్రియ సిగ్గుగా ఆరోపితం కనుక. అలం : హేతూత్ప్రేక్ష.

చ. ఇలఁగల వస్తు సంతతుల కెల్లను. గచ్చిడు మాస్వభావ పా
టల రుచి కేమొ వేఱ యొక డాలిడ వచ్చునె? లక్కనీట మ
మ్మలమిన దెంత ముగ్ధ యిది యంచుఁ బదాబ్జము లంగుళీముఖం
బుల నగు నట్లు మించు నఖము ల్మెఱయుఁ గోమ రారు నింతికిన్. 34

ఇంతికిన్ = స్త్రీకి; పద+అబ్జములు = తామరపూల వంటి పాదాలు; ఇలన్ = భూమిలో; కల = ఉన్న; వస్తు సంతతులున్+ ఎల్లన్ = అన్ని వస్తువుల సముదాయానికే; గచ్చు = పూత; ఇడు = పెట్టే; మా = (పాదాలు) తమయొక్క; స్వభావ = సహజమైన; పాటల రుచికిన్ = గులాబీ రంగుకు ( ఎరుపులో తెలుపు పాళ్ళున్న రంగు పాటలం); ఏమొ వేఱ యొక డాలు = ఏదో మరొక కాంతిని; ఇడన్+వచ్చునె = పూయ వచ్చునా?; లక్క కలిపిన నీటితో; మమ్మున్= పాదాలను, అలమినది = కప్పినది (అలదినది); ఇది = గోద; ఎంత; ముగ్ధ = అమాయరాకులు (ముగ్ధా నాయిక = నూత్న యౌవన); అంచున్ = అంటూ;

అంగుళీ ముఖంబులన్ = వ్రేళ్ళ నోళ్ళతో; నగునట్లు = నవ్వుతున్నట్లు; మించు = అతిశయించే; నఖముల్ = గోళ్ళు; కొమరు+ ఆరున్ = అందగిస్తున్నవి.

ఆమె పాదాలు ఎఱ్ఱగా, గోళ్ళు తెల్లగా ఉండట మెలా ఉన్న దంటే - పాదా లనుకొన్నాయట - ఈమె ముద్దరాలు - సహజమైన; మా గులాబీ రంగే లోకంలో అన్ని వస్తువులకూ రంగు నద్ద గలదు కదా. ఐనా ఈమె మాకు లక్క నీరు వ్రాసిన దేమి? అని ఆమె అమాయకతను గోళ్ళు ముఖాలతో నవ్వుతున్నవో అన్నట్లుగా తెల్లని గోళ్ళు ఎఱ్ఱని పాదాల కెంతో అందగిస్తున్నవి.

అలం : ఉత్ప్రేక్ష.

**''నఖ దీధితి సంఛన్న సమజ్జన తమోగుణా!''** (ల.స)

నమస్కరించే వారిలో నున్న అజ్ఞానమన్న చీకట్లు కాలి గోళ్ళ కాంతితో ధ్వంసం చేసే తల్లీ !

''ఏ పాదాలు లక్క నీటి నలుదుకొన్నాయో, ఏ పాదాహతిని (పుష్పించటం కోసం) కోరుకుంటున్న కంకేళిపై పశుపతి అసూయపడు తున్నాడో తల్లీ! నేత్రాలకు సౌందర్య స్థానమైన ఆ పాదాలకు నమస్కారమంటున్నాను.'' (సౌం. ల)

కం॥ లలనోపరిపదకచ్ఛప
ములు బలిమి మెయిన్ గజ ప్రభూతగతి శ్రీ
విలసనముఁ గొనఁగఁగాదే
కలిగెన్ గజకచ్ఛ పోగ్ర కలహం బుర్విన్. 35

లలన = రమణి; ఉపరిపద = పాదాల పై భాగ (మీగాళ్ళు) మన్న; కచ్ఛపములు = తాబేళ్ళు; బలిమి మెయిన్ = బలవంతంగా; గజ = ఏన్గుల; ప్రభూత = గొప్ప; గతి = నడకలన్న; శ్రీ = సంపదయొక్క; విలసములన్ = విలాసాలను; కొనఁగన్+ కాదే = తీసుకోవటంవలన కదా; ఉర్విన్ = లోకంలో; గజ కచ్ఛప = ఏన్గులకు; తాబేళ్ళకు; ఉగ్ర = భయంకర, కలహంబు = పోట్లాట; కలిగెన్ = కలిగింది.

గోదాదేవి మీగాళ్ళు తాబేళ్ళు అని ఏన్గుల నడకల బలవంతంగా లాక్కొన్నందున, లోకంలో రెంటికీ ఎడతెగని కలహం సంభవించింది.

తాబేళ్ళ వంటివి మీగాళ్ళు. నడకలు గజ గతులని తాత్పర్యం.

అలం : వాటి యుద్ధం పురాణ ప్రసిద్ధమైనా ఇక్కడ మరొక హేతువు కానిది హేతువుగా చెప్పబడినందున హేతూత్ప్రేక్ష.

''కీర్తికి స్థానాలైన నీ మీగాళ్ళు తల్లీ ! కఠినమైన తాబేటి బొచ్చెలతో కవులెలా ఉపమిస్తున్నారు? అంత సుకుమారములైన పాదాలను భర్త శివుడు వివాహ కాలంలో సన్నె కల్లు నెలా తాకించాడో!''

(సౌం. ల)

''కూర్మ పృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా'' (ల. స).
తాబేటి వీపులను జయించే మీగాళ్ళు కల తల్లీ !''

తే॥ తరుణి తను కాంతి యెదుట నూతన హరిద్ర
తులకు రాలేక యత్యంత మలిన మయ్యె
నౌటఁగా రాత్రియన నిశ యనఁ దమిస్ర
యన నిశీథిని యన క్షప యనఁగఁబరగె 36

తరుణి = యౌవన కాంతి గల గోదాదేవి; తను = శరీర; కాంతి = వన్నె; ఎదుటన్ = ఎదురుగా; తులకున్ = పోలికకు రాలేక; నూతన హరిద్ర = కొత్త పసుపు; అతి+అంత = మిక్కిలి; మలిన+అయ్యెన్ = వన్నె కోల్పోయి నల్ల పడింది; ఔటన్+కాన్ = అట్లయినందు వల్ల కదా; రాత్రి, నిశ, తమిస్ర (చీకటి); క్షప (చీకటి); నిశీథిని (నిశ) అనగన్, పరగెన్ = లోకంలో పేర్లు పొందింది.

ఆమె శరీరం వన్నె ముందు కొత్త పసుపు వెలవెల పోయి నల్ల పడింది. అందువల్లనే దానికి నిశా నామాలు కలిగాయి (పసుపుకు రాత్రి పేర్లన్నీ అన్వయిస్తున్నవి).

రాత్రి = జీవుల పనులను అరికట్టేది.
నిశా = ఇంకా వాటిని సన్న పరిచేది.
తమిస్రా = చీకటి ఎక్కువగా కలది.
క్షపా = జీవుల చేష్టల నన్నిటినీ నాశనం చేసేది. నిశీథిన్ = నిశీథ మంటే నడురాత్రి - ఎక్కువగా చీకటి కలది.

ఈ విధంగా కవి వాడిన నిశానామాలు పోను పోను సారవంతమైన అర్థాన్నిస్తున్నందున అలంకారం సారాలంకారం. ( ఈ విచిత్రార్థం చెప్పింది శ్రీ వేదం వారు)

''మహా లావణ్య సేవధిః'' - శరీర స్నిగ్ధ కాంతికి నిలయమైన తల్లీ! అని లలితా సహస్రం-
తల్లి శరీర సౌందర్య వర్ణనను ముగించింది. ఇక్కడా అంతే. అందుకే రెంటికీ పోలిక.

సీ॥ అయ్యిందువదన ధరాంగన గావునఁబ్రాహ్మ్యత్రిఁ బొరుగుల భాగవతుల
గృహములందు మరాళికైకావళీహారిణీ, మనోజ్ఞా, స్రగ్వి ణీ, సమాఖ్య
లమర. జనించి వయస్య లై నాగకన్యలు, పుత్త్రికా వివాహముల యందుఁ
బాడు పద్మాలయా పరిణయామేయగేయముల ననంతు కల్యాణ గుణము

తే॥ లద్భుతం బొప్పవిని విని యతనిఁ గవయు
బుద్ధి ప్రాగ్జన్మ సంస్కారమున జనింపఁ
దదవతారానుమేయకథాసుధాను
కలిత లీలానుకృతుల వర్తిలుచు నుండి. 37

ఆ; ఇందువదన = చంద్రముఖి (చూ. 11,12 పద్యాలు); ధర+ అంగన = భూదేవి; కావునన్= కాబట్టి; పొరుగుల = పొరుగువారైన; భాగవతుల = వైష్ణవుల; గృహములన్ = ఇళ్ళలో; నాగకన్యలు = నాగ జాతి కన్యలు; ప్రాక్+మైత్రిన్ = పూర్వ జన్మలోని స్నేహం వల్ల; సమాఖ్యలు=పేర్లు; అమరన్ = ఒప్పేదం కాగ; జనించి = పుట్టి; వయస్యలై = నెచ్చెలులై, పుత్రికా = బొమ్మల, వివాహములందున్ = పెండ్లిళ్ళలో; పాడు = పాడే; పద్మ+ ఆలయ = పద్మకు నివాసంగా కల లక్ష్మీయొక్క; పరిణయ = వివాహ సంబంధమైన; గేయములన్ = స్త్రీల పాటల్లో; అనంతు = శ్రీమన్నారాయణుని; కల్యాణ గుణములు = మంగళమలైన గుణాలను; అద్భుతంబు = ఆశ్చర్యం; ఒప్పన్; విని విని = చాలా సార్లు తృప్తి పోక విని; అతనిన్= ఆ అనంతుని; కవయు = కలిసే; బుద్ధి = తలంపు; ప్రాక్+జన్మ = పూర్వ జన్మ; సంస్కారమునన్=వాసనతో; జనింపన్ = కలుగగా; తత్ = అతని; అవతార+అనుమేయ = అవతారాలకు సంబంధించి భావింపదగ్గ; కథా సుధా = గాథామృతంతో; అనుకలిత = కూడుకొన్న; లీల+అనుకృతులన్ = లీలలను అనుకరిస్తూ; వర్తిలుచున్- ఉండి = కాలం గడుపుతూ.

ఆ గోదాదేవి పూర్వజన్మలో భూదేవి కావటం వల్ల ఆనాటి చెలికత్తెలైన నాగకన్యలు పొరుగిళ్ళలో భాగవతులకు సంతానంగా మరావళి వంటి పేర్లతో పెరుగుతూ, బొమ్మల పెళ్ళిళ్ళలో లక్ష్మీనారాయణుల పెండ్లి పాటలు పాడేవారు. ఆ పాటల్లో నారాయణుని అనంతములైన కళ్యాణ గుణాలు తాను వింటూ, పూర్వ జన్మ సంస్కారం పైకి తేలాడగా, తిరిగి అతనికే భార్య కావాలని వాంఛిస్తూ, అవతారాల కథామృతంతో భావించదగిన ఆ అనంతుని లీలా భాషణాదులను అనుకరిస్తూ కాలం గడుపుతూ-

ధరాంగన అన్న రహస్యం మొదటిగా సూచించిన పద్యమిదే. నాగకన్యలు ధరాభారాన్ని వహించే ఆదిశేషుని జాతివారు కనుక ఒకే చోట ఆడి పాడుకొనే వారు.

పుత్రికా వివాహాలు - పల్లీ వాతావరణాన్ని చైతన్య వంతం చేసే స్త్రీల పెండ్లి పాటలు. కవికీ సంస్కృతిపై ప్రీతి మెండు. ఒకే రేఖతో ఆ బొమ్మను చిత్రించే అభ్యాస నైపుణ్యం కలవాడు. (చూ 1-75, 2-55 ఋతు వర్ణనలు).

కళ్యాణ గుణములు - వైష్ణవ మతం సగుణోపాసన నంగీకరించింది కనుక ఆ స్వామి మంగళ గుణాలు కలవాడు. (చూ. పీఠికలో నాయకుడు) అనుమేయ - లీలానుకృతులు భగవంతుని చేష్టాదికం మనకు అంతు పట్టనివి కనుక, అవతారాల్లో మనుష్య జన్మలున్నాయి కనుక, ఆమానవ ధర్మ సాజాత్యంతో అనుమాన ప్రమాణంతో కొలిచి ఊహించిన లీలలు - నాయకుని వేష భాషాద్యనుకరణం - ఇదొక శృంగార చేష్ట. గోపికలు ఈ పని చేసినట్లు భాగవతం. ఇది ఆలంకారిక మతానుసారంగా. వేదాంతానుసారంగా *'లోకవత్తులీలా కైవల్యం'*- కర్మఫలాను సంధితం కాకపోవటం లీల. సృష్టి పరమాత్ముని లీలా చేష్ట. దీనికి అన్య ప్రయోజనం లేదు. ఆటకు ఫలం ఆటే. కాకపోవటం నీలోపం. ఆటే కానిది కర్మఫలానుసంధి.

అద్భుతం - రసనామం - లౌకికమైన ఆశ్చర్యం కాదు.

మరాళి = హంసి, ఏకావళి = ఒకే పేట కల ముత్యాల హారం, మనోజ్ఞ = అందమైనది (మనస్సు తెలిసి

మాట్లాడేది). (సగ్విణి = పూలదండ వంటి తనువు కలది, ఈ పేర్లకూ, రాబోయే సంభాషణల్లో వారి మాటలకూ సంబంధమున్నది.

వర్తిలుచున్ = ఆమె దైనందిన జీవిత సూచకమైన మాట.

సీ॥ తమతండ్రి శ్రీశ దత్తశ్రీలు గృహమునఁద్రవ్వి తండములయ్యుఁ దనదు తొంటి
ప్రగ్వి నిర్మాణదాస్యం బనుత్సేకత జరపుచుఁ, బ్రజ్ఞ వైష్ణవ పురాణ
సంహితా వ్యాఖ్యా రచనఁ, బ్రొద్దుఁ గడపుచుఁ , గట్టెడు, కమ్మ చెంగలువ విరుల
తోమాలె, లలకలు దువ్వి, కంతునకు, బ్బార్హ నిబద్ధ ఖేటకం, బనఁగ నీల

తే॥ వృషకకుద్రేఖ నెడమ కొక్కింత యొఱగ
నిడిన ధమ్మిల్ల వలయంబు నడుగునంద
గొంతసే పర్థిఁ గీలించి కూపవారి
నీడ వీక్షించి క్రమ్మఱ. గూడ నునుచు. 38

తమ తండ్రి = గోదాదేవి తండ్రి (గౌరవ వాచకం = తమ); శ్రీ = లక్ష్మియొక్క; ఈశ = భర్త చేత, దత్త = ఇవ్వబడిన; శ్రీలు = సిరులు; గృహమునందు, త్రవ్వి తండములయ్యున్= తామర తంపరగా ఉన్నా; అనుత్సేకతన్ (న+ ఉత్సేకతన్) = నిగర్వంగా; తనదు = తనయొక్క (తమ అని తల్లినని - తన అని తండ్రి నన్న భేదం గమనించాలి); తొంటి = మొదటి; స్రక్ = పూదండలు; వినిర్మాణ = అందంగా కూర్చే (అర్పించే); దాస్యం= సేవ (చూ 3-87, 90); జరపుచున్ = నిర్వహిస్తూ; వైష్ణవ పురాణ సంహిత = విష్ణు సంబంధ పురాణాలన్న వేద సంహితా భాగాలను; ప్రజ్ఞన్ = ప్రతిభా శక్తితో; వ్యాఖ్యా రచనన్= వివరణలు వ్రాస్తూ (చెబుతూ); ప్రొద్దు = కాలం; కడపుచున్ = గడుపుతూ; కట్టెడు = కట్టే, కమ్మ = కమ్మని; చెంగలువ విరుల = ఎఱ్ఱ కలువ పూలు; తోమాలెలు = దండలు (చూ. 1-75) అలకలు = వాసన గల జుట్టు; దువ్వి; కంతు = మన్మథుని; బ్బార్హ = బర్హ = (నెమలి) సంబంధమైన ఈకలతో చేసిన; ఖేటకంబు+అనన్ = డాలో అన్నట్లుగా; వృషక కుత్ = ఎద్దు మూపురం, రేఖన్ = వలె, ఎడమకున్, ఒక్క+ ఇంత, ఒరుగన్ = ఒరిగేటట్లు, ఇడిన = కట్టిన, ధమ్మిల్ల వలయంబు = జుట్టు ముడి (యొక్క) అడుగు+ అందున = అడుగు తట్టున, అర్థిన్ = కోర్కెతో, కొంతసేపు, కీలించి = పెట్టుకొని, నీడన్ = తన ప్రతిబింబాన్ని, కూప వారిన్ = బావి నీటిలో, ఈక్షించి = చూచి, క్రమ్మఱన్ = తిరిగి, గూడన్ = పూల బుట్టలో, ఉనుచున్ = పెడుతుంది.

గోదాదేవి తండ్రికి విష్ణుమూర్తి అనంత ఐశ్వర్య మిచ్చినా (4-32), తొలి దినాల్లో తన పుష్పమాలా కైంకర్యం మరిచిపోకుండా (4-37), గర్వం లేక దండలు గడుతూ విష్ణు పురాణాదులకు వ్యాఖ్యలు వ్రాస్తూ- శిష్యులకు వివరిస్తూ- చెంగలువ దండలు కడుతుండేవాడు. ఆ కట్టిన దండలను పూల సెజ్జలో పెట్టి గుడికి పోయి స్వామి కర్పించటం- దినచర్య. అలా కట్టిన దండలను కూతురు తల దువ్వుకొని -

ఎడమ ప్రక్కకు ఎద్దు మూపురం లాగా ఒరిగేటట్లుగా - మన్మథుని నెమలి ఈకల డాలులాగా అందంగా ముడిచిన ముడి క్రింద ఆ దండలలంకరించుకొని కోర్కె తీరేటట్లుగా, బావి నీళ్ళలో తన రూపం చూసుకొని, తిరిగి పూల బుట్టలో పెట్టేది. కొప్పుముడి అలంకరణ - దాని క్రింద దండ పెట్టుకోవడం నాటి నాగరికత.

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ వినిర్మాణం = పీఠికలో 44వ పద్యంలో వినిర్మింపుము- కావ్యం - పూలదండ - రెండూ విష్ణుమూర్తి కంకితములే. భామహుడన్నాడు కావ్య నిర్మాణం - పూలదండ కట్టటమూ ఒకటేనని - కావ్యంలో పద్యాలే ఎర్రకల్వలు (దండలోలాగా). వీటిని తానై తొలిగా అలంకరించుకొన్నది దేవి. కావ్యనామం ఆముక్తమాల్యద - ఇది శృంగార నాయికా పరంగా. తుదకు ఈ దండ చేరిన చోటు స్వామి. ఇది భక్తి పరంగా.

భక్తి = దివ్య శృంగారం - మత దృష్ట్యా భక్తి, కావ్య మత దృష్ట్యా శృంగారం.

విష్ణు పురాణ వ్యాఖ్యా రచన చేసింది శ్రీ మద్రామానుజ ముని శిష్యుని కుమారుడు విష్ణుచిత్తుడు తప్ప ఈ విష్ణుచిత్తుడు కాదు. ఇది తప్పని కొందరన్నారు. కానీ రెండవ విష్ణు చిత్తుని రచనకు పూర్వమే విష్ణు పురాణ శ్రవణ మనన వివరణాదులుండవా! - ఇది సంప్రదాయ మన్న వాతావరణ నేపథ్య సూచనగా ఈ మాట వ్రాసాడనుకోవాలి తప్ప కవికి తెలియదనుకోవడం మన తెలివికి చిహ్నం కాదు.

ఉ. ఆ నవలా యలంతి పసు పాడి, దుకూలముఁ దాల్చి, గుబ్బచన్
గోనలఁ దావు లుప్పతిలఁ గుంకుమ తేటల నిగ్గు దేరఁ గ
ర్ప్రానన నాభిఁ దీర్చి, పితృ బద్ధ లతాంతము లర్థిఁ, గొప్పునన్
బూని యొకింత సే పునిచి, పుచ్చి చెలిం గని వెచ్చ నూర్చుచున్. 39

ఆ నవలా = ఆ స్త్రీ; అలంతి = అల్పంగా; పసుపు+ ఆడి = పసుపు రాసుకొని స్నానం చేసి; దుకూలము = సన్నని చీర; తాల్చి = కట్టి; గుబ్బచున్ కోనలన్ = గుండ్రని చన్నుల పార్శ్వముల పై, తావులు = వాసనలు; ఉప్పతిలన్ = పుట్టేటట్లుగా; కుంకుమ తేటలన్ = లేత కుంకుమ పూతలతో; నిగ్గు = వన్నె; తేరగాన్ = పుట్టగా; నాభి = బొడ్డు; కర్ప్రానన్ = కప్పురంతో; తేర్చి= అలంకరించుకొని; పితృ బద్ధ = తండ్రి కట్టిన; లత+ అంతములు = పూలు; కొప్పునన్= కొప్పులో; అర్థిన్ = కోర్కెతో; పూని = తాల్చి; ఒకింత సేపు = కొంచెం సేపు; ఉనిచి = ఉంచి; పుచ్చి = తీసివేసి; చెలింగని = చెలికత్తెను చూచి; వెచ్చన్+ ఊర్చుచున్= వేడిగా నిట్టూరుస్తూ.

ఆమె పలుచగా పసుపు నలదుకొని స్నానం చేసి, సన్నని వలువ దాల్చి చన్నులకు పైనా - ప్రక్కలా కుంకుమ తేట- వాసన లీనగా, పలుచగా పూసి కర్పూరపు బొట్టు దిద్ది తండ్రి కట్టే పూదండలు కొప్పులో ముడుచుకొని, తీసి, వేడి నిట్టూర్పులు పుచ్చుతూ చెలిని చూచి (అన్నది).

అలంతి, దుకూలము, తేటలు - ఇవి నాగరకతా చిహ్నాలు- దట్టంగా పూసుకోవటం మొరటుతనం.

పైదీ- ఈ పద్యంలో రచన కథా నిర్మాణ సంబంధం తప్ప వర్ణనాత్మకం కాదు. రెండు పద్యాల్లో ఒక అపూర్వ వాతావరణ రంగ నిర్మాణ ముంది. నాటి కాలంలో ఒక భక్తుడు- పండితుని గృహ వాతావరణ చిత్రణ భావించాలి. దండలు కడుతూ - శిష్యులకు పాఠాలు చెబుతూ- లేదా రచన చేస్తూ ఇదొక అందమైన రచన. పురాణ వాసనలు విరజిమ్ముతున్న రచనగా భావించాలి. కూపవారి = నేటికీ శ్రీవిలుబుత్తూరిలో ఆ బావి ఉన్నది. ఈ వర్ణనకు సాక్షిగా. ఈ మాటకు వెనుక ఒక తాత్త్విక భావమున్నది. ఒక సూర్యుడే నీటిలో అనేక ప్రతిబింబాలుగా కన్పిస్తున్నట్లు ఒక్క ఆత్మ ఇంత సృష్టిగా- జీవులుగా వస్తున్నాడన్న భావం ప్రసిద్ధమే కదా.

భూదేవి మూల ప్రకృతి. బావి = మనస్సు, సంకల్పం.

ప్రతిబింబం = ప్రకృతి. ఆత్మ ప్రకృతి యన్న బావిలో జీవులుగా ప్రతిబింబించటం.

### ఉపాలంభనం

కం॥ మీ పాడిన హరిచందము
లేపాడినన్ దలఁప వచ్చు? నితఁ డే సతులం
గాపాడినవాఁ డనుఁగై
త్రో పాడినఁ దన్ను వలచి తొయ్యలు లారా? 40

తొయ్యలులు+ ఆరా = అమ్మలారా!; మీ పాడిన = మీ (యొక్క)రు పాడిన, హరి = విష్ణువు; చందములు = పద్ధతులు, ఏ పాడినన్ = ఏ న్యాయంగా; తలపన్ వచ్చున్ = భావించ వచ్చును? అనుఁగు+ ఐ = ప్రేమ కలవాడై; తన్ను వలచి = తనను ప్రేమించి, త్రోపు+ ఆడగన్ = తనపై పడగా; ఏ సతులన్ = ఏ స్త్రీలను;కాపాడిన వాడు = రక్షించాడు? (కనుక)

మీరు పాడిన ఈ కళ్యాణ గేయాల్లో, ఏ పాటలో, ఇతడు తనను ప్రేమించి వచ్చిన స్త్రీలను ప్రేమతో కాపాడినట్లు? - కనుక మీరు పాడిన హరి పద్ధతులు కట్టుకతలు- ఆ స్త్రీలను నిరసించటంలో, బాధించటంలో ఏ పాడీలేదు.

పద్యంలో త్రిప్రాస చూసుకోవాలి. 1-3 పాడిన, పాడిన. 2-4 లో ఏ పాడిగ, త్రోపాడిన అని ఉండగా, అప్పుడు 1-3 నడుము నున్న మాధుర్యం, 2-4లో స్వరభేదం వల్ల సిద్ధించదు. కనుక ఏ పాడిన అని పఠిస్తే పరిపోతుంది. రాయల రచనే అంతే కావచ్చునేమో! వ్రాయసగాంధ్ర ఎన్ని దిద్దుబాట్ల కోర్చుకోలేదు కనుక కావ్య సరస్వతి !

(ఏపాడిగన్ = పూర్వపాఠం)

చూళిక - ఉపాలంభ శిల్పం

40 నుండి 54 వ పద్యం దాకా గోదాదేవి చేసిన ఉపాలంభనం. (రహస్యా లెత్తి పొడవటం = నింద). విరహ వేదనలో కవులంతా చంద్రాదులను ఉపాలంభించినట్లు నిరూపిస్తే ఈ కవి క్రొత్త పంథాలో చేయటం భావనకు పరాకాష్ఠ. భగవంతుడు నాయకుడై - భగవతి నాయిక యైనపుడు చంద్రోపాలంభనం తెలివి తక్కువ పని కనుక- ఇక్కడ భగవద్దూషణ దోషం కనుక. వ్యాజోక్తి ఈ ఘట్టాని కంతా పృష్ఠభూమి. 4వ ఆశ్వాసంలో 'తమ తండ్రి' చేసిన దశావతార స్తుతి నంతా తిరుగ వేసి నిందారూప స్తుతిగా (వ్యాజనింద)- పైకి నింద, లోపల స్తుతి. ( ఇది 4 లో - తండ్రి నిరూపించాడు. అది అవతార దృష్ట్యా - పురుష దృష్టితో). ఈమె స్త్రీ దృష్ట్యా - ఏయే అవతారంలో - భార్యగా - ప్రియురాండ్రుగా ఎవరెవరు ఎలా బాధపడింది చెప్పి వ్యాజనిందాలంకార గర్భంగా వ్రాయటం కవి విలక్షణ ప్రతిభావిష్కారం. దీనికి పూర్వాపరాల్లో తుల్యఘట్టాలు మృగ్యమే కనుక లోకోత్తర ప్రజ్ఞా చేష్ట ఈ వర్ణన.

55లో ఉపాలంభ దంభమన్న మాటతో పద్యాల నన్నిటినీ వ్యాఖ్యానించు కోవాలి.

44 లో జలచర వన చరావతారాలైన మత్స్య - కూర్మ- వరాహ నరసింహావతారాల ఉపాలంభనం.

46 లో వామనావతారం. 47 లో పరశురామావతార ఆక్షేపం. ఇక్కడ భార్యలు లేరు కనుక. వామనావతారం రాబోయే వానికన్నిటికి బాల్యావస్థ కనుక వటు రూపం. అక్కడ తగిలిన శాపమే రాబోయే అవతారాల్లో స్త్రీలకు కల్గిన బాధకు హేతువుగా చెప్పి - తర్వాతి వతారంలో నాయికను భూదేవి- రాజ్యలక్ష్మిగా చెప్పటం చాలా సొగసైన కల్పన.

48 నుండి 51 దాకా రామావతారోపాలంబనం.

53-54 బలరామకృష్ణుల నాక్షేపించటం.

52. రామావతారం కృష్ణావతారంగా పరిణమింపజేసిన సంధి అద్భుత భావన

ఇంకా దీని రహస్యానికి చూ.6-90.

**తాను సురమౌని, నృప, తనుల్ దాల్చి యకట!**
**కామినీ తతి నుడికించుకంటె నట్టె**
**గండెయును నల్ల దాసరిగాఁడు కిరియు!**
**హరియునై పోవుటయ మంచి దనుయుగంబు.** 41

తాను = శ్రీహరి; సుర = దేవతల; మౌని = మునుల; నృప = రాజుల; తనుల్ = శరీరాలు; తాల్చి= ధరించి; అకట = అయ్యో!; కామినీ తతిన్ = స్త్రీ జనాన్ని; ఉడికించుకంటెన్= తపింప జేయటం కంటె; అను యుగంబు = యుగ క్రమంలో (ప్రతి యుగంలో); అట్టె = అలాగే; గండెయును = చేపా; నల్ల దాసరిగాడు = తాబేలూ; కిరియున్= పందీ, హరియున్ = సింహం; అట్టె = అలాగే; ఐపోవుటయ = ఐపోవుటయే మంచిది కదా.

ఆ హరి వరుసగా ఆయా యుగాల్లో దేవతా - మౌని నృపదేహాలు ధరించి, వలచి తన్ను చేరిన ప్రియలను తపింప జేయటం కంటె మత్స్య కూర్మ వరాహ సింహ రూపాల్లో అలాగే ఉండిపోవటం మంచిది కదా !

గండె - నల్ల దాసరిగాడు అన్న మాటల్లో తేలికదనం. కిరియున్, హరియున్ అన్న అనుప్రాసలోనూ అలాగే నింద స్ఫురిస్తున్నది.

అలం : వ్యాజనింద. '' ఈ ఘట్టానికంతా ఇదే మూలాలంకారం. నింద ద్వారా స్తుతి స్ఫురించటం దీని లక్షణం. ఈ వక్ర భాషణం- శృంగారంలో స్త్రీ నోటి గుండా శోభించేది-

లేశము - గుణ దోషాలను వినిమయం చెప్పటం- ఇది వేదం వారి వ్యాఖ్య.

కం॥ ఆ తనువుల లేరు గదా
నాతులు; మఱి కాక కలిగిన, న్వగఁ దిర్య
గ్జాతికి నీ జాతికిఁ గల
యీ తీవ్రత గలదె యెఱుఁగ కిట్లే లంటిన్? 42

ఆ తనువులన్ = ఆ జంతు దేహాల్లో; నాతులు = స్త్రీలు; లేరు కదా!;

మఱి = ఒక వేళ ఉన్నా; కాక = తాపం; కలిగినన్ = కలిగితే; తిర్యక్+జాతికిన్ = పశుపక్షి జాతికి; ఈ జాతికి = ఈ మన మానవ జాతికి గల; ఈ తీవ్రత = ఈ భావోద్రేకం; కలదె= ఉన్నదా!; ఎఱుగక = తెలియక, ఇట్లు+ ఏల+ అంటిన్

ఆ జంతు రూపాలు ధరించినపుడు స్త్రీ రూపాలు లేవు కదా! ఒక వేళ ఉన్నా మనకున్న విరహోద్రేకం వాటికి లేదు కదా! ఒక వేళ నాకు తెలియక ఇలా అంటున్నానా?

అలం : ఆక్షేపం.

మత్స్యాద్యవతారాలు ఒక ప్రయోజనం కోసం వచ్చి మరలా అప్పుడే పోయినవే తప్ప రామాదుల్లాగా కలకాలం లేవు కదా! కనుక విరహ ప్రశ్న లేదు.

తే. ''ఆత్మవత్సర్వ భూతాని'' యనుట బొంకె
ముద్దియలకైన వలవంత ముచ్చటలను
నాటి పాటలఁ గీతలఁ గొం తమరుఁ గాని
నోరు లేని జంతువులకే నొప్పి ఘనము 43

సర్వభూతాని = ఎల్ల జీవులు, ఆత్మవత్ = తన వంటివే, అనుటబొంకె = అబద్ధమా (కాదు); ముద్దియలకున్ = ముగ్ధలగు కన్యలకు; ఐన = కలిగిన; వలపు+వంత = విరహబాధ; ముచ్చటలను =

సంభాషణలతోను; ఆట పాటలన్; కతలన్ = కథలతో; కొంత = కొంచెమైనా; అడగున్ = ఉపశమిస్తుంది; కాని; నోరులేని జంతువులకె = మాటలు రాని పశుపక్ష్యాదులకే; నొప్పి = వంత; ఘనము = ఎక్కువ.

జంతువులకు నోరు లేదు కనుక తమకైన వలవంత మనుష్యులకు వలె మాటలతో, ఆటలతో, పాటలతో, కథలతో పోగొట్టు కోలేవు. కాబట్టి జంతువులకే వలవంత ఘనం. కనుక శ్రీహరి ఆ జంతురూపాల్లోనే శాశ్వతంగా ఉండి పోయినా బాగుండునన్న నామాట సరియైనది కాదు. సర్వభూతాలు ఆత్మ స్వరూపాలే కదా.

ముచ్చటలు - ప్రస్తుతం గోదాదేవి చేసే పని ఇదే. తన వలవంత వ్యాజనిందతో అడచుకొనే ప్రయత్నమే. ఆపాటల విషయం - రాబోతున్నది.

రాబోయే పద్యాల్లో పూర్వావతార స్మరణ రూపమైన గాథలు త్రవ్వుకోవటం.

మ. ధరపై నీతడు పూర్వ కల్పముల సక్త స్త్రీ విశాలాంబకాం
బురహ శ్రేణి జలంబు మైఁ బులకలుఁ బూరించుచుఁ వేఁచు దు
ర్భర కర్మం బలమంగ వచ్చు జలజత్వ సబ్ధారోమత్వ కే
సరిత ల్పూర్వవతార దంభమున నాచ్ఛాదించుఁ దాఁ బ్రౌఢిమై. 44

పూర్వ కల్పములన్ = ప్రాచీన యుగాల్లో; ఈతడు = ఈయన (కోపంతో అన్న మాట); ధరపై = భూమి పై; సక్తస్త్రీ = తనను ప్రేమించిన ఇంతుల; విశాల+అంబక = నెడల్పైన నేత్రాలనే; అంబురుహ = పద్మాల; శ్రేణి = గుంపుయొక్క; జలంబు = కన్నీరు, మైన్ = శరీరం మీది; పులకలున్ = గగుర్పాటునూ; పూరించుచున్ = నింపుతూ; వేచు = తపింపజేసిన; దుర్భర= మోయరాని; కర్మంబు = కర్మఫలం; అలమంగన్ = అలుముకోగా; వచ్చు = రాబోయే; జలజత్వ=నీటిలో పుట్టిన లక్షణం (మత్స్య కూర్మత్వాలు); స్తబ్ధ రోమత్వ = వరాహత్వం (నిక్కబొడుచు కొన్న వెంట్రుకలు కలగటం); కేసరితల్= సింహత్వం (జూలు కలిగి ఉండటం); భూరి = గొప్ప; అవతార దంభమునన్ = అవతారమన్న మిషచే; తాన్; ప్రౌఢిమై = నేర్పుగా; ఆచ్ఛాదించుటల్ పొండు = కప్పుకోవటమే కదా పొండి (పొగడ్తలు మానండి).

4-17 నుండి 23 దాకా భక్తితో చేసిన అవతార స్తుతులన్నీ (అట్టివి) దబ్బర. ఎందుకంటె తనను ప్రేమించి వచ్చిన స్త్రీల నేత్ర పద్మాల్లోని బాష్పపూరం - శరీరాలపై రోమాంచం - కల్పిస్తూ విరహతాపం కల్గించిన పాప ఫలంగా - నీళ్లలో పుట్టటం - వెంట్రుకలు నిక్క పొడుచుకోవటం (మత్స్య - కూర్మ - వరాహాలు). జూలు విస్తారంగా కలిగి యుండటం ప్రాప్తిస్తే ఇవన్నీ అవతారాలన్న మిషతో గొప్పగా కప్పి పెట్టుకోవటమే కదా!

అలం : హేతూత్ప్రేక్ష - కైతవాపహ్నుతి.

నేత్ర పద్మాల్లో జలం కన్పించిన పాప ఫలంగా నీటిలో పుట్టే మత్స్య - కూర్మ నీచ జంతు జన్మ ప్రాప్తి.

మ్రైఁబులకులు కన్పించటం వల్ల - స్తబ్దరోమత్వ- కేసరితలు - రాగా అదేదో పెద్ద అవతార విశేషమున్నట్లు లోకాలను భ్రమింప జేస్తున్నాడు ఈతడు.(ఆక్షేపం)

క. అనిమిష ముని మను జాధిప
జననంబుల నీతఁ డెట్లు జలజాక్షులఁ గూ
ర్చిన వారి నేఁచె దయలే
కనిన వినుఁడు మీదు పాట లంద తెలిపెదన్. 45

అనిమిష = దేవత; ముని; మనుజ+ అధిప = రాజుల; జననంబులన్ = పుట్టుకలలో; ఈతడుఃఈయన ( ఆక్షేపం - ఈ మహాప్రభువు); కూర్చిన = ఆసక్తులైన, జలజ+ అక్షులన్= పద్మ నేత్రలను; దయలేక; ఏచెన్ = బాధించినాడు; అనినన్ = అంటే, వినుడు; మీ పాటలందే ఉన్నాయి. స్పష్టం చేస్తాను.

ఇక్కడ నుండి రాబోయే పద్యాలను (44 నుండి 54 దాకా), 4-17 ,31 దాకా సాగిన స్తుతితో పోల్చుకోవాలి. ఇది తండ్రి భక్తితో చేసిన దశావతార స్తోత్రం. ఇక్కడ కూతురు విరహ యోగంతో చేసిన ఆక్షేపం - ఉపాలంభం. ఇది శృంగార యోగం. అది భక్తి యోగం.

చ. మొదల నుపేంద్రుఁడై యితఁ డమోఘ హతిన్ భృగు పత్నిఁ ద్రుంచి, య
మ్ముదుసలి గేహినీ విరహముం దన యట్లన పొందు మన్న, నా
కదియును దేవ కార్యమున కయ్యెడు నంచు వహించి, త్రోఁచు లా
గెద వటువయ్యు లచ్చి మది కెన్నఁడుఁ బాయని జాలి నింపఁడే? 46

మొదలన్ = తొట్టతొలిగా (జంతు రూపాల నుండి విడివడి మొదటి సారిగా విష్ణువు ధరించిన మానవ మూర్తి); ఉప+ ఇంద్రుడై = ఇంద్రుని తమ్ముడు వామనుడై; భృగు పత్నిన్ = భృగువన్న ముని భార్యను; అమోఘ హతిన్ = వ్యర్థం కాని దెబ్బతో; త్రుంచి = చంపి; ఆ+ముదుసలి = ఆ ముసలి భృగువు; గేహినీ విరహమున్= భార్యా వియోగాన్ని; తనయట్లన = తనకు లాగానే, పొందుము; అనగా; నాకున్ = విష్ణువునకు; అదియునున్ = ఆ విరహం కూడా; దేవ కార్యమునకున్ = దేవతల పని కోసం; అయ్యెడున్ = కాగలదు; అంచున్, వహించి, ఎదన్ = హృదయంలో; త్రోచులాగు = పెడద్రోసే విధంగా ( శాపాన్ని లెక్కింపక) లేదా హృదయంలో భవిష్యద్విషయం తోచినదో అన్నట్లుగా పైరీతిగా అని; వటువు = బ్రహ్మచారి; అయ్యున్= అయి కూడా; లచ్చి మదికిన్ = లక్ష్మి మనస్సునకు; ఎన్నడున్ = ఎప్పుడూ; పాయని = పోనట్టి, జాలిన్ = వంతను; నింపడే = పూరించినాడు కదా

మొదటిగా ఉపేంద్రుడై భృగు పత్నిని చక్రధారతో తల నరికినందున భృగువు - నీవూ నాలాగనే భార్యా విరహాన్ని పొందుమని శపించాడు. దాని కాయన అదీ దేవ కార్యం కోసమేకాగలదనిన- అలాగే లక్ష్మికి తరగని దుఃఖాన్ని పెట్టాడు కదా!

భృగు పత్ని చాటున దైత్యులు దాగినందున విష్ణువు చక్రధారతో ఆమెను చంపాడనీ- భర్త శాపమిచ్చినాగానీ - అందుకే ప్రతి అవతారంలో లక్ష్మికి వియోగ బాధ తప్పడం లేదని తాత్పర్యం. ఈ భృగుపత్ని కథ ఉత్తర కాండలో ఉన్నది

విశే : పై పద్యంలో - అనిమిష- అని మొదటిగా అన్నాడు కనుక. ఆ మొదటి అవతారం వామనుడు. అందుకే ఈ పద్యం మొదల- అన్న మాటతో ప్రారంభమైనది.

మ. ప్రళయార్కోగ్ర కుఠారకోణము నృపత్రై విధ్యవత్పీఠికా
ఖ్యల త్రిస్థానము లేడుమార్లు వరుసన్ ఘట్టించు దోశ్శక్తిఁ గీ
ర్తిలసద్వల్లకి మ్రోయ రక్తయయి యెంతే వశ్యయౌ భూ సతీ
తిలకంబుం దుదిఁ ద్రోవఁ గశ్యపున కార్తిం బిడ్డ యైపోవదే? 47

ప్రళయ+అర్క = లయకాల సూర్యుని వలె, ఉగ్ర = వాడియైన, కుఠార = గండ్రగొడ్డలియనే, కోణము = వీణ వాయించే కమాను, నృప = రాజుల, త్రైవిధ్యవత్ = శత్రుమిత్ర ఉదాసీనులన్న మూడు రకాల, పీఠిక+ ఆఖ్యలన్ = సింహాసనాలన్న పేరు గల, త్రిస్థానములు = మూడు చోట్లు, ఏడు మార్లు = ఏడు సార్లు, వరుసన్ = వరుసగా, ఘట్టించు = కొట్టే, దోః+శక్తిన్ = బాహు బలంతో, కీర్తి లసత్+వల్లకి = కీర్తి అన్న అందమైన వీణ, మ్రోయన్ = ధ్వనిస్తూ ఉంటే,రక్తయయి = తన యందు ప్రేమతో, ఎంతేన్ = ఎక్కువగా, వశ్యయౌ = లోబడిన, భూసతీ తిలకంబున్ = శ్రేష్ఠురాలైన భూదేవిని, తుదిన్ = చివరకు, త్రోవన్ = వద్దు పొమ్మంటే, ఆర్తిన్ = బాధతో, కశ్యపునకున్ = ఆ పేరు గల ఋషికి, బిడ్డయైపోవదే = బిడ్డ అయిపోయినది కదా।

ప్రళయ కాల సూర్యబింబం లాగా నిప్పు కణాలుమిసే గండ్ర గొడ్డలినే వీణ వాయించే కర్ర పుల్లగా చేసి శత్రుమిత్ర ఉదాసీనులన్న మూడు రకాల సింహాసనాలపై వరుసగా ఏడు సార్లు బాహు బలంతో గట్టిగా కొట్టేసరికి ఆ 21 సార్లు రాజుల పై సాధించిన విజయం వీణయై లోకాల్లో మ్రోగింది. అది విని భూదేవి అతనికి వశ్యయై రాగా కాదని కశ్యపునకు ఇచ్చాడు కదా.

పరశురాముని కథను అనుసంధించుకోవాలి. 4-25 పద్యంతో పోల్చి సింహాసనాలను బ్రద్దలు చేయటం 21 సార్లు - ఎలా ఉన్న దంటే నేర్పరియైన వీణ విద్వాంసుడు సప్తస్వరాలను-మంద్ర మధ్య తార స్థాయిల్లో వరుసగా 7 సార్లు - మూడు స్థాయిల్లో వాయించినట్లుంది. యుద్ధ వీరం వీణా పాండిత్య వీరంగా మలచటంలోనే వక్త 'రతి' భావం వ్యక్తం. భంగ్యంతరంగా స్తుతి. వీరుడూ ఒక కళాకారుడే. ఇందుకే పాండిత్య వీరం వీర రసభేదంగా చెప్పారు.

ప్రళయార్కోగ్ర కుఠారమన్న సమాసం లోని తీక్ష్ణత భావ వ్యంజకం. నాయిక వీరునే ప్రేమిస్తుంది తప్ప అల్పుని కాదు. కనుక భూదేవి వశ్యయైనది. తానూ అంతే నని వ్యంగ్యం.

మ. తన సౌందర్యము చెప్పగా గరగి పద్మాకాంత రప్పించి మో
హన కంజంబున వైచి తియ్య మిడు సెయ్యం బొప్ప బైకొన్న, మీ

ఱీ నృశంసత్వమునం దొఱంగి చని వెఱ్ఱిం జేసె, గాకుత్స్థుఁడై
న నిలింపారివిదారి చందములు డెందాన న్విచారింపుఁడా. 48

పద్మాకాంత = లక్ష్మీదేవి; తన, సౌందర్యము = అందం; చెప్పగాన్ = దూతికల ద్వారా విని; కరఁగి = ద్రవించి (కరిగిపోయి); రప్పించి = పిలిపించి; మోహన కంజంబునన్= ప్రేమ అన్న పద్మంతో; వైచి = కొట్టి; తియ్యము ఇడు నెయ్యంబు = మాధుర్యం కల్పించే ప్రణయం; ఒప్పన్; పైకొన్నన్ = సిగ్గు విడిచి పై బడితే; మీఱి = కాదని; నృశంసత్వమునన్= క్రౌర్యంతో; తొఱంగి = వదలి; చని = పోయి; వెఱ్ఱిం జేసెన్ = పిచ్చి దానిని చేసాడు కదా!; ఆ కాకుత్స్థుడు= కకుత్స్థ వంశీయుడైన రాఘవుడు; ఐనట్టి; నిలింప+ అరి = దేవతలకు శత్రులైన రాక్షసులను; విదారి = చంపే విష్ణుని; చందములు = చేష్టలు; డెందానన్ = మనస్సులో; విచారింపుడా = ఆలోచించండి.

ఆయన అందం విని పద్మ కరిగిపోయి పిలిపించి సిగ్గు విడిచి ప్రణయపద్మం వేసి తీపి నెయ్యంతో కౌగిలించుకోగా, ( ఈయనేం చేసాడట!) క్రూర భావంతో కాదని పోయి ఆమెను పిచ్చిదాన్ని చేసాడు, ఆ రాముడైన శ్రీహరి చేష్టలివి ఆలోచించండి.

శ్రీరామునకు పట్టాభిషేక మన్న వార్త విన్న రాజ్యలక్ష్మి ఆతనిని ప్రేమతో సమీపించింది. పై బడ్డది (తనను పాలింపమని) (కానీ ఈయన ఏం చేసాడో తెలుసా?). కాదని అరణ్యానికి పోయి రాజ్యలక్ష్మిని పిచ్చిదానిని చేసాడు ( ఆమె భరతుని అంగీకరించనూ లేదు. శ్రీరాముని కాదని జీవించనూ లేదు).

అలం : లేశం.

చ. చెలువము దాల్చి త న్గవయఁ జేరిన రాగిణి రావణస్వసన్,
నలువురు నవ్వ నత్తెఱఁ గొనర్పక యేలిన, వియ్య మై యతం
డలుగఁడ, సీత కిట్టి తలఁ పాత్మఁ దలంపక యాయమ న్వృథా
కలహమునం దనుం దొఱఁగు కాఁకకు నాఁకకు లోను సేయఁడే. 49

చెలువమున్+తాల్చి = సుందర రూపం ధరించి; తన్ = తనను, కవయన్ = పొందటానికై; చేరిన = సమీపించిన; రాగిణిన్ = రాగం (ప్రేమ) కల; రావణ స్వసన్ = రావణుని చెల్లెలిని; నలుగురు = లోకం; నవ్వన్ = నవ్వేటట్లుగా; ఆ+తెఱఁగు · ఆ పద్ధతి (ముక్కు కోసి కురూపిని చేయటం); ఒనర్పక = చేయకుండా; ఏలినన్ = ఏలుకొంటే; అతండు = ఆ రావణుడు; వియ్యము+ ఐ = బంధువై; సీతకున్ = సీతమీద; అలుగడ = కోపింపడు కదా, అట్టి తలపు= అలాంటి ఆలోచనే; ఆత్మన్ = హృదయంలో; తలంపక = తల పోయకుండా; వృథా కలహమునన్ = వ్యర్థమైన కయ్యంతో; ఆయమ = ఆ తల్లి సీత; తనున్ = శ్రీరాముని; తొఱగు = వదలి పెట్టే; కాకకున్ = విరహానికీ; ఆకకున్ = రావణుని కోపానికీ; లోను సేయడే= లోబడేటట్లు చేయలేదా!

ఆ రావణుని చెల్లెలు శూర్పణఖ ప్రేమతో వచ్చింది. అంతే కదా. ఆమెనలా చేసినందు వల్ల కదా రావణుని బంధుత్వం పోవటం. పోవటమే కాక శత్రుత్వం కొని తెచ్చుకోవటం జరిగింది. కేవలం ప్రయోజనం లేని కలహం కదా ఇది. దాని వల్ల నష్టమెవరికి? సీతకు. అంత విరహ దుఃఖానికి ఆమెను లోను చేసిన రాముని అవతారమంటే ఎలా? చెలువము దాల్చి - సహజ భయంకర రాక్షసి వేషం వదలి సుందరియై ఆ తెఱగు - ఏతెరగో క్రింది పద్యంలో వర్ణింపబడుతున్నది. ఏలినన్ -

వీటికి శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో ఈ పద్యాలు పోల్చు కోవచ్చు. అరణ్యకాండ. పంచవటీ ఖండము 92 లో చెలువము దాల్చుట అంటే ఏమిటో వర్ణింపబడినది.

సీత రామునితో - ''స్వామీ నీ అందమంతా నేనే అనుభవించటం దోసం కదా. ఈమె నా వలెనే నిన్ను ప్రేమిస్తున్నది తప్పేమిటి?'' - (185) ఈ దృష్టితో ఇక్కడ గోదాదేవి మాటాడుతున్నది, స్త్రీ పక్షపాతంతో. మూల రామాయణంలో - ప్రాచ్య పాఠంలో మాత్రమే శూర్పణఖ లోకోత్తర సౌందర్యమున్న స్త్రీగా వచ్చినట్లు చెప్పబడినది. అదే చెలువము దాల్చి అని రాయలవారన్నది.

రాగిణిన్ - కామపాశంతో కట్ట బడినదని మూలం. కామమోహితా- ఇలా కామశబ్దము మూలంలో కన్పిస్తుంది.(పోల్చు - 4-263)

శా. ఫీట్కార స్రవదస్రమై పెదవి గంపింప, న్మోఱ ల్గిట్టి ప్రా
వృట్కాలాంబుద గర్జ గెల్వఁగ, వలచ్ఛ్రీఖండ శాఖాసిత
త్విట్కుంభీనస రేఖఁ గే లసిలతా ధృద్బాహు వేష్టింప, మ్రుఁ
రాట్కంఠీరవ మై యొనర్చె వడి సోణా, లంట ఘోణాచ్ఛిదన్ 50

ఫీట్+కార = ఫీట్ అన్న ధ్వనితో; స్రవత్ = కారుతూ ఉన్న, అస్రమై = నెత్తురు కలదై; పెదవి; కంపింపన్ = చలిస్తుండగా; మొఱల్ = బాధతో చేసే ఆలాపాలు; కిట్టి = నల్దెసల వ్యాపించి; ప్రావృట్+కాల = వర్షాకాల; అంబుద = నీటి నిచ్చేది మబ్బు; గర్జన్ = ఉరుముమ్రోతను; గెల్వఁగన్ = అతిశయించగా; వలత్ = గుండ్రంగా చుట్టుకొనే; శ్రీఖండశాఖః చందన వృక్షం కొమ్మ ; అసిత = నల్లని; త్విట్ = కాంతి గల; కుంభీనస = పాము; రేఖన్ = వలె; కేలు = చేయి; అసిలతా = కత్తిని; ధృత్ = ధరిస్తున్న; బాహున్ = చేతిని; వేష్టింపన్ = చుట్టుకోగా; (గంధపు కొమ్మ లక్ష్మణుని చేయి- దానిని నల్లని త్రాచు లాగా చుట్టుకొన్నది శూర్పణఖ చేయి. గంధపు కొమ్మకు వ్రేలాడే తీగ కత్తి);. మున్ = త్రేతాయుగంలో; రాట్ కంఠీరవమై = రాజసింహమై; ఘోణాచ్ఛిదన్ = ముక్కు కోతను; సోణాలు+అంటన్ = ముక్కు ఎముకలంటా; వడిన్ = వేగంతో; ఒనర్చెన్ = చేసినాడు.

శ్రీరాముని దయా స్వభావమెంత గొప్పదంటే - పాపం శూర్పణఖ స్త్రీయని కూడా చూడకుండా దాని ముక్కును కోయించాడు తమ్మునితో. ఎముక దాకా తెగగోసాడు. అప్పుడు కత్తి ఎముకకు తగిలిఫీట్ మని ధ్వనించింది.కారే నెత్తురు పెదవి మీద పడుతుంటే కంపిస్తున్న పెదవులతో ఉరుమురిమినట్లు

మొరపెడుతూ తనను సమీపించిన లక్ష్మణుని హస్తాన్ని వద్దని పట్టుకోగా ఆయన అన్నగారు అన్నంత పనీ చేశాడు.

సంయుక్తాక్షర ప్రాస - వర్ణితాంశం లోని కాఠిన్య క్రౌర్యములకు వ్యంజకం. సోణా-ఘోణా అనుప్రాస కూడా దానికి పోషకమే.

వేదంవారు ఈ రచనలోని కాఠిన్యం సుకుమారియైన గోదకు ఉచితం కాదన్నారు. కానీ! ఆమె కవయిత్రి. తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళి వ్రాసింది. కనుక భావతాదాత్మ్యం చెంది అన్న మాట కాబట్టి ఇది వారు భావించినట్లు వక్త్రౌచిత్యం కాదు. విషయౌచిత్యం. లక్ష్మణుని హస్తం తెల్లనిది కనుక గంధ వృక్ష శాఖ. ఆమె నల్లనిది కనుక చేయి నల్ల త్రాచు, ఆకారం స్వభావ రీత్యా. ఆమె స్వరూపం ధరించింది- మాయా రూపం వదలి - మొర ఉరుములాగా ఉంది.

అలం : ఉత్ప్రేక్ష.

రామాయణం కవికి హృత్కవిలె; కొట్టిన పిండి (పోల్చు. 4-26, 27) రామాయణంలో ఈ ఘట్టమిలా ఉంది.

రాముడు రాక్షసిని విరూపను చేయమన్నాడు. లక్ష్మణుడు క్రుద్ధుడై రాముని ప్రక్కనే ఉన్న కత్తిని పట్టి యెత్తి 'చిచ్ఛేద కర్ణనాసం'- ముక్కూ- చెవులూ ఖండించినాడు. ఆ బాధకామె 'విస్వరం సా వినద్య'- వికృత కంఠంతో అరిచి - 'యథాగతం ప్రదుద్రావ'- వచ్చినట్లుగానే పరుగెత్తినది

ఇంకా 'విరూపా, మహాఘోరా, రాక్షసీ, శోణితోక్షితా ననాద వివిధాన్నా దాన్ యథా ప్రావృషితోయదః'- 8-23.

నికృత-ఘోర రూపిణి - రక్తంతో తడిసినదై వర్షాకాల మేఘం లాగా వివిధ ధ్వనులతో అరచినది.

తే. ఒల్లఁ బొమ్మనఁ బోదె, తా నుల్ల సముల
నేప ? నది రక్కసియ యౌట యెగ్గె ? వలచి
స్త్రీలు దలవంపఁ దాన వచ్చె, నది చాల
కాట దాని బజీతు సేయంగ నగునె ? 51

ఒల్లన్ = అంగీకరించను; పొమ్ము; అన్నన్ = అంటే; పోదె = పోదా ?; తాన్ = ఆమహాత్ముడు (ఆక్షేపం); ఉల్లసములన్ = ఎగతాళి మాటలతో; ఏపన్ = బాధిస్తే; అది = శూర్పణఖ; రక్కసియ = రాక్షసి; ఔట = కావటం; ఎగ్గె = తప్పా ?; స్త్రీలు తలవంపన్; వలచి = ప్రేమించి; తాన వచ్చెన్ = తానై వచ్చింది (దూతికను పంపటం కాదని మర్యాదగా); అది చాలక = ఆ చేష్టే చాలు కదా తనెంత చచ్చి వచ్చిందో; ఆటదానిన్ = స్త్రీని; బజీతు = అవమానం; సేయంగన్ = చేయటం; అగునె = మంచిదేనా?.

"నీ ప్రేమ నాకక్కర లేదు పో" అంటే అదే పోయేది కదా! దానిని ఎగతాళి చేయటం దేనికి?

అది రాక్షసిగా పుట్టటం దాని తప్పా? స్త్రీ జాతికి సిగ్గు గలిగేటట్లు తానే వలచి తన దగ్గరకు వచ్చింది కదా! ఇంకా ఇలా అవమానం చేయాలా?

అలం : అర్థాంతరన్యాసం.

ఉల్లసములు :- అరణ్య కాండ, 18వ సర్గలో రామ లక్ష్మణులు ఆమెను ఆట పట్టించినట్లు-ఆమె 'పరిహాస అవిచక్షణ' - పరిహాసమంటే తెలియనిది కనుక అనీ చెప్పబడినది. రాముడు తన తమ్ముని వివాహమాడుమని శూర్పణఖతో చెప్పటం. ఆమె లక్ష్మణుని సమీపించటం - ఇతడు మరలా రాముని దగ్గరకు పంపటం - ఈ కథ అంతా పరిహాసాత్మకమే.

మ. తను నంటన్ సతు లౌటఁ గోరు ముని బృందంబుం దదాపాది ప
ద్వనజక్షోదముగల్గియు, న్బెఱజనిం దా వల్లవ స్త్రీలుగా
జననం బందఁగఁ జేసి కూడియు, స్వసంసక్తాత్మలం గాందినీ
తనయ ప్రేరణఁ బాసె భోజపుర యాత్రాదంభ సంరంభియై 52

తనున్ = శ్రీరాముని, అంటన్ = తాకటానికి (పొందుకై); సతులు = పతివ్రతా స్త్రీలు; ఔటన్ = కావటానికై; కోరు = కోరుకొనే, ముని బృందంబున్ = ముని సమూహాన్ని; తత్=ఆస్త్రీత్వమును; ఆపాది = కల్గించే; సత్+వనజ = పాద పద్మపు; క్షోదము = ధూళి; కల్గియున్ = ఉండి కూడా; పెఱజనిన్ = మరొక జన్మలో; వల్లవ స్త్రీలుగాన్ = గొల్ల యువతులుగా; జననంబున్+అందగన్+చేసి = పుట్టేటట్లు చేసి; కూడియున్ = వారిని పొంది కూడా; స్వ = తనపై ; సంసక్త = గాఢంగా తగుల్కొన్న; ఆత్మలన్ =జీవాత్మలు కలవారిని; గాందినీ తనయ ప్రేరణన్ = గాందిని కుమారుడు అక్రూరుడు - అతని ప్రేరణతో; భోజపుర=మధుర ( భోజ వంశస్థుల రాజధాని - కుంతి భోజుడు ఆమె తండ్రి); యాత్రా= పోవుట అన్న; దంభ = మిషతో; సంరంభియై = తొందర కలవాడై; పాసెన్ = గొల్లెతలను త్యజించినాడు

రామావతారంలో మునులు స్వామి సౌందర్యమునకు మోహితులు కాగా వారిని స్త్రీలనుగా చేసే శక్తి తన పాద పద్మ రజమునకున్నది కదా ( దానితో స్త్రీ జన్మ నిచ్చాడు కదా అహల్యకు). అలా చేయలేదు. సరే, మరో జన్మలో వ్రజాంగనలుగా పుట్టించాడు. వారి ననుభవించి పైగా మధురకు పోయినాడు, అంత ప్రణయినులైనా వదలి - తప్పు మీద తప్పు- మరలాతప్పు. మూడు తప్పులు చేసాడాయన మొదటి తప్పు- స్త్రీలుగా పుట్టించటం. రెండు, వారిని ఆసక్తలను చేయటం. మూడవది - వారిని పొంది కూడా మధుర యాత్రా మిషతో పరిత్యజించటం.

అవతార కార్యాలని భక్తులే అంశాలను. కవులై గానం చేసారో అదే విరహ ఉపాలంభన దృష్ట్యా- స్త్రీగా- తాను దోషారోపణ చేస్తున్నది.

వీటిని కాదనట మెలాగా? నిజమే నన్నంత తర్క యుక్తంగా ఉంది ఆమె వాదన.

కల్పవృక్ష మంటున్నది- రామునితో సీత :

ఆ యమయందు దోస మొకయించుక యైనను గానుపింపదే।
పాయక యల్ల సర్వఋషి వాటెకలందూ న మౌనికా మినుల్,
తీయని దృష్టి నిన్ననుమతించిన నాకు స్ఫురింపలేదు, ని
న్నాయమలెల్ల మోహకలితాక్షుల, గాంచుట దెల్ల మయ్యెడున్ (అరణ్య. పంచవటి)

మ॥ హతల నొనర్చె మోహితల నల్ల యయోముఖి నా పులస్త్య భూ
సుతను, విరూప లౌట ననుచో, ముసలి న్పెను నిట్ట తాటి వం
టతివ రమించెఁ దా ముసలి యయ్యు, రహి న్మఱుగుజ్జు బ్రేష్యకై
ధృతి సెడి యుగ్రసేనునకుఁ బ్రేష్యత నొందియు దిద్ది యేలఁడే? 53

మోహితలన్ = మోహము గొన్న వారైన; ఆ అయోముఖిన్ = ఒక రాక్షసి పేరు; ఆ పులస్త్య భూసుతను= పై పద్యాల్లో చెప్పిన శూర్పణఖను (పులస్త్య బ్రహ్మ కొడుకు విశ్రవసుడు. వాని కూతురు శూర్పణఖ); విరూపలు = కురూపులు; ఔటన్ = అయినందు వల్ల; హతలన్= వలపు భగ్న లైన వారినిగా; ఒనర్చెన్ = చేసినాడు; అనుచోన్ = అంటే; (ఆఁ! వారు కురూపులు కనుక అలా చేసాడంటారా? చెలికత్తెలతో వాదన కదా ఇదంతా) మరి; ముసలి = ముసలివాడు; ముసలం = నాగలిఆయుధంగా కలవాడైన బలరాముడు; తాన్; పెను = పెద్ద; నిట్ట తాటి వంటి+ అతివన్ = పొడవైన తాడి చెట్టు వంటి స్త్రీని; ముసలిన్ = తన కంటె ముసలి దానిని; రమించెన్+కదా = కూడినాడు కదా; రహిన్ = కోర్కెతో; మఱుగుజ్జు = పొట్టిది, ప్రేష్యకై = సేవకురాలి కోసం; ధృతి చెడి = మతి చెడి; ఉగ్రసేనునకున్ = కంసుని తండ్రికి; ప్రేష్యతన్ ఒందియున్ = సేవకా వృత్తి నంగీకరించి; దిద్ది = మూడు వంకరలు పోగొట్టి; ఏలడే = ఏలుకోడా?!

అయోముఖినీ - శూర్పణఖను విరూపలను చేసాడు. వారు రాక్షసులు - కురూపులు కదా! అందుకే అలా చేసాడంటే మరి ముసలియైనా, తన కంటె పెద్దదీ - తాడి చెట్టు లాగా పొడవైనదీ - అయిన రేవతిని బలరాముడై ఎలా రమించాడు? ఇంకా త్రివక్ర అన్న కంసుని పరిచారిక - మరుగుజ్జు దాన్ని దాని వంకలు దిద్ది ఎందు కేలుకొన్నాడు?

అయోముఖికి శూర్పణఖ లాగా ముక్కు చెవులు కోయటమే కాక స్తనాలు కూడా కోసివేసాడు. చూ॥ అరణ్య కాండ.

త్రివక్ర కథ భాగవతంలో దశమ స్కంధంలో ఉన్నది.

తాటిన్పై యతివ - అని వేదం వారి పాఠం. ఇక్కడ గ్రహించిన పాఠం తాటి వంటి అతివ. ఇత్వ సంధి గ్రాహ్యం కాదని వారిలా గ్రహించారు. కాని ఈ సంధి ఈ కవికి సమ్మతమే.

తే. తనకు నందఱుఁ గూర్ప బృందావనమున,
నొకతె రతిఁ దేల్చి, కాఁక నొం డొక తెఁ బ్రేల్చి,

యంత రాధకు మేలువాఁ డై మురారి
యెల్ల సతులకు నెద నుడుకే యిడండె. 54

మురు+అరి = మురాసురుని సంహరించిన శ్రీహరి; బృందావనమునన్ = బృంద అన్న పేరు గల అడవిలో; తనకున్; అందఱున్ = గొల్ల స్త్రీలంతా, కూర్పన్ = అనురక్తలు కాగా, (ప్రేమిస్తే; ఒకతెన్; రతిన్ తేల్చి = కామకేళిలో సుఖింపచేసి; ఒండు+ఒకతెన్; కాకన్ = విరహంలో; (పేల్చి = తపింపజేసి; అంత = చివరకు; రాధకు; మేలువాడు+ఐ = (ప్రేమికుడై; ఎల్ల సతులకున్=స్త్రీలందరకూ; ఉడుకే = విరహమే; ఇడండె = ఇవ్వలేదా.

ఒకతెను సుఖపెట్టటం, మరొకతెను బాధించటం. ఈ పక్షపాతమేమిటి? సమబుద్ధి కలవానికి? - అని నింద. రతి- అన్న శబ్దం ద్వారా ఆమె విరహాతిశయం ధ్వనిస్తున్నది, వియోగ శృంగార పరాకాష్ఠగా.

వ. అని యిట్లు త్రపాభరంబున నుపాలంభదంభంబుగాఁ జేయు పునః పునస్స్మరణంబున నంతఃకరణరాగంబు దేటపడం దెలిసి బోఁటు లీబోఁటి కైటభారియెడ నాటు కొన్న కన్నె కూర్మి లజ్జా వశంవద యై వెలి విరియంగానీక పుటపాక నికాశం బగు కాఁకఁ జీకాకుపడి నాఁడు నాఁటికి నగుచున్నట్ల గిటగిటనగు చున్న దింత నియ్యింతి యెరవు మాన్చి మనలను గుట్టెఱుంగనీయని యింగితం బెఱుక పఱుచుకొని చింతా పనోదనంబు సేయకున్నం బ్రమాదం బని నవ్వుచు నర్మ గర్భంబుగా నిట్లనిరి.
55

త్రపాభరంబునన్ = సిగ్గు బరువున; ఉపాలంభ = విరహంలో చేసే నింద; ఆక్షేపం; దంభమునన్= మిషతో; పునఃపునః = మాటి మాటికి; స్మరణంబునన్ = స్మరించటం వల్ల; అంతః కరణ = మనో; బుద్ధి; చిత్తాహంకారముల సంపుటి కలిసి అంతశ్చైతన్యం; రాగంబు= అనురాగం; తేటపడన్ = స్పష్ట పడగా; బోఁటులు = చెలికత్తెలు; కైటభ+అరి = కైటభుడన్న రాక్షసుని చంపినవాడు శ్రీవిష్ణువు; కన్నె కూరిమి = కన్నె వలపు; లజ్జా వశంవదయై = సిగ్గునకు లోనై; వెలి = బైటకు; విరియన్ కానీక = పొక్క కుండా; పుటపాక = బంగారం వన్నెరావటానికి కరగ బెట్టటం; నికాశం = వన్నెవంటి; కాకన్ = తపనతో; చీకాకుపడి = విసుగు కొని ( శ్రమపడు - శ.ర); నాడు నాటికిన్ = రోజు రోజుకు; నగుమన్+ ఉన్నట్లు = నవ్వుతున్నట్లు గానే; గిట గిట అగుచున్నది = చిక్కిపోతున్నది (1-78 లో ఈ శబ్దమున్నది); ఎరవున్ + మాన్చి = వేరు తనాన్ని పోగొట్టి ( మనం స్నేహితులం కనుక కష్ట సుఖాలు దాచుకోక చెప్పుకొనక పోవటం వేరుదనం); మనలను; గుట్టు = రహస్యం; ఎఱుగనీయని = ఎరుగ నివ్వని; ఇంగితంబు = మనస్సులోని చాటు తలపు; ఎఱుక పరచుకొని= బైట పెట్టి; చింత = దిగులు; అపనోదనంబున్ = పోగొట్టటం; నర్మ గర్భంబుగాన్ = పరిహాసంగా.

అంతః కరణ సంపుటి :- 1.మనస్సు - సంకల్ప వికల్పాలు చేసే చిత్తవృత్తి విశేషం.

2.బుద్ధి - నిశ్చయాత్మక చిత్తవృత్తి - ''పదార్థ అధ్యవసాయ ధర్మతః'' (వివేక చూడామణి).

3. అహంకారం -స్వాభిమానం- నేను, నాది అనుకొనేవృత్తి విశేషం.

4 చిత్తం - స్వార్థాను సంధానం. తన దనుకొన్న దానిని పునః పునః స్మరించే వృత్తి.

ఇది జీవాత్మకు కవచం, దీని బరువుకు మనిషి క్రుంగి పోతాడు. గోదాదేవి చైతన్యమంతా శ్రీకృష్ణ భావనా సంపిహితమని తాత్పర్యం.

చూళిక-

56 నుండి 65 దాకా ఒక దశకం. ఇది సఖీ సంభాషణం. శాకుంతలంలో ప్రియంవదా,అనసూయలు నిర్వహించిన పాత్రలిక్కడ గోదాసఖులు 37 వ పద్యంలోని నాగ కన్యలు నిర్వహిస్తున్నారు. వారి పరిహాస జల్ప రూపమైన సంభాషణ- గోదాదేవి అంతః కరణ మందణగారిన రతిభావ వ్యంజకం. విరహాగ్ని ప్రోజ్జ్వలనం. పైకి చెలుల నడుమ జరిగే హాస్య భాషణమే. దీని కాధారమైనది వారి క్రీడా ప్రపంచం. ఈ ఆశ్వాస లాస్య క్రీడలో ఇదొక అంగం. శృంగార రసావిష్కరణలో ప్రధాన సోపానం.

శాకుంతలంలో నాయిక సౌందర్య - మనోభావావిష్కారానికి చెలికత్తెల పాత్ర నిర్మాణం జరిగినట్లు స్పష్టమే. వారే లేకపోతే శృంగారస నిర్మాణం - అభివ్యక్తి కుదరదు.

నాయకుడు లతల చాటున ఉంటే - వీరు ముప్పురు రంగస్థలంమీద స్పష్టంగా ఉన్నారు. ఈ కావ్యంలో నాయకుడు దేశ-కాల- వ్యక్తులందు అంతర్యామి. ఇదొక నాయికా- సఖీ సంభాషణం. రసస్థానమైన ప్రేక్షక పాఠకుల కోసం తప్ప నాయకుని కోసం కాదు. అతడు చూస్తూనే ఉన్నాడు కదా. ఇదీ నాటక - కావ్య సామ్యం.

శకుం - అనసూయే! అతిపినద్ధేన అనేనస్తనవల్కలేన ప్రియంవదయా నియంత్రితాస్మి. (అనసూయా! ఈ ప్రియంవద నా స్తనవల్కలాన్ని బిగించి కట్టింది).

ప్రియంవద - అత్ర పయోధర విస్తారయిత్రుకం ఆత్మనో యౌవనముపాలభస్వ. మాం కిముపాలభసి.''

(స్తన విజృంభణ హేతువైన నీ యౌవనాన్ని ఆక్షేపించక నన్నంటా వేమిటి?)

రాజా - సమ్యగియ మాహా. ఈమె చక్కగా అన్నది.

''ఇద ముపహితసూ క్ష్మ గ్రంథినా స్కంధ దేశే'

61, 62, 63- పద్యాలతో పైవిషయం పోల్చుకోవచ్చు.

ఉ॥ ఎవ్వరు నట్లపో నెరసు లెన్నక మానరు ప్రాణభర్తలం
దవ్వుల నున్నఁ గాఁకకతన, న్మటి వారలు వశ్యులైనఁ దా

రెవ్వరి నొల్లక యొక్కటయి యింద్రుఁడు చంద్రుఁ డటంద్రు, బోటిదా
నివ్వలఁ దేరకత్తె యగు, నిట్టివి నీ తల వేగనే చెలీ! 56

చెలీ = తల్లీ! (పరిహాస సంబోధన; ఏమన్నావమ్మా - అలాగా;, సరే- ఈ మాటలను మనసులో కూర్చుకోవాలి),ఎవ్వరున్ = ఎవరైనా; అట్లపో = అంతేలే పో; దవ్వులన్ = దూరాల్లో ఉన్న; ప్రాణ భర్తలన్ = ప్రాణవల్లభులను (ప్రాణాలను భరించే వాడు. ఈమె ప్రాణ మతడు); కాక = విరహం; కతనన్= వల్ల, నెరసులు = పొల్లులు ( చిన్న చిన్నవి); ఎన్నక = గణించకుండా మానరు కదా; మఱి = ఇంక (తర్వాత); వారలు = భర్తలు; వశ్యులు+ ఐనన్ = లోబడితే; తారు = తాము; ఎవ్వరిన్;ఒల్లక = అంగీకరించక; ఒకటి+అయి = ఏకమై; ఇంద్రుడు;చంద్రుడు - అట+అంద్రు = అని అంటారు. (వ్యాజ నింద అడుగున డాగిన స్తుతి ఇది); బోటి = సఖి (మా బోటి వాళ్ళు)); ఇవ్వలన్ = ఇవతల; తేరకత్తె = పనికిమాలినది ( తేరన్ = భర్తను తీసుకొని వచ్చే, కత్తె = స్త్రీ, దూతిక); అగున్ = ఔతుంది; ఇట్టివి = ఇలాంటివి; నీ తలన్ = నీ తల మీదనే; వేగనే? = తెల్ల వారినవా?.

అమ్మా ! లోకంలో అంతా ఇంతే. భర్తలు దూరాన ఉన్నందున తప్పులెన్ని వారు దగ్గరై నంతనే ఇంద్రా చంద్రా అంటూ వారిలో ఒదిగిపోతారు - నడుమనున్న చెలికత్తె వట్టి దూతి గానే మిగిలిపోతుంది.

అలం : అప్రస్తుత ప్రశంస, లోకోక్తి.

*రాముడే భూమిజాత భర్త యొకఁడంతె*
*దేని కెంత వెలో మఱి దాని కంతె*
*పావనియు దాను నంతియ వట్టి రామ*
*మేదినీపతి దూతగా మిగిలిపోయె (కల్పవృక్షం - సుందర)*

కం॥ అనుటయు నెలనగ వడఁచుచుఁ
గనలించుక తెచ్చి యోడు గఱచుచు నయ్యం
గనలన్ కందుక నికరముఁ
గొని వ్రేయుచుఁ గెలను చూచుకొనుచుంబలికెఁ. 57

అనుటయున్ = అనగానే; ఎలనగవున్ = లేత నవ్వును; అడఁచుచున్ = అణచుకొంటూ; కనలు= కోపం; ఇంచుక = కొంచెం; తెచ్చి = ఉన్నట్లు నటించి; ఔడున్ = పెదవిని; కఱచుచున్ = పండ్లతో కొరుకుతూ;ఆ+అంగనలన్ = ఆ చెలికత్తెలను; కందుక నికరమున్ = బంతుల దొంతిని కొని = గ్రహించి; వ్రేయుచున్ = కొడుతూ; కెలను = ప్రక్కలను (అటూ ఇటూ); చూచుకొనుచున్; పలికెన్ = అన్నది.

15వ పద్యంలో చెండాట స్మరింపబడినది. అదే ఇక్కడ కందుక నికరము - ఆటల్లో మాటలన్న మాట. ఇది సందర్భం. నేపథ్యం

వాళ్ళలా అనగానే రహస్యం బైట పడటం మంచిదే నన్నట్లుగా లేత నవ్వు ఉదయించటంతో - అణచు కొంటూ - పెదవి పండ్లతో బిగపట్టి - ఆట చెండ్లతో కొడుతూ- ప్రక్కలకు చూస్తూ - ఎవరైనా ఉన్నారేమో- వింటున్నారేమో నన్నట్లు అన్నది.

చెండాట - దేశీయ నృత్త విశేషం. ఇదిలాస్యం. బంగారం వంటిలోహంతో చేసిన బంతులతో - లోపల గుండ్లతో గలగలమని మ్రోగుతుండగా - ఆడే ఆట. వివరణకు (చూడు -నృత్త రత్నావళి.) ఔడు గఱచుట- నాట్యంలో ఓష్ఠ కర్మలు 6. అందులో సందష్టమని ఒకటి, పెదవి కొరుకుకోవటం - క్రోధాభినయం. ఇక్కడలేని కోపాన్ని ఉన్నట్లు నటించటం. ఆంగికాభినయం.

కం. విడువక మీ గానము సొగ
సిడుటయు, మఱి పాడుఁ డనుట యెగ్గే? పాసెం
బడిగిన వారే పేదలె?,
కొడిమెలు గట్టకుఁడి యతనిఁ గొని పని యేలా? 58

విడువక = వదలక; మీ గానము; సొగసు = ఇంపు; ఒసగినన్ = కల్గించినందు వల్ల; మఱి = ఇంకా, పాడుడు; అనుటయున్; ఎగ్గే = తప్పా?; పాసెంబు = పాయసం; అడిగిన వారే = పెట్టుమన్నవారే; పేదలె? = పేదలా?; అతనిన్ కొని = ఆయన నాధారంగా గ్రహించి; కొడిమెలు = అబద్ధపు నిందలు; కట్టకుడి = కట్టకండి ( ఆయనకూ నాకూ లేని సంబంధం అంటగట్ట వద్దు); పని ఏలా = ఏమి పని? (నిందలు మోపటానికి).

వారి గానగాథలను గోదాదేవి పరాస్తం చేసింది. పూర్వ పక్షం చేయటం వారిని సమర్థించుకోమనటం. ఆ సమర్థన కూడా ఈమెకు ఇంపే,వినటానికి. కానివారు పాడకుండా రహస్యం బైటపెట్టారు. అందుకని ఈ మాట.

శా॥ పోనిండన్న, వయస్య లిట్లని రగుం బో నిక్క, మిం కిప్పుడే
కానీ, మ్మిం కొకకొంత సేపటికి నే కానీ. సఖీ, యెల్లి యే
కానీ, నీ నుడిఁ దన్మ నోజ్ఞ గుణము ల్గానీ, తదన్యాయము
ల్గానీ, చిందినఁ జింత నీ కతని పైఁ గా కెవ్వరిం దేల్చెదే? 59

పోనిండు = ఇక అతని విషయం వదిలి పెట్టండి; అన్నన్; వయస్యలు = చెలులు; నిక్కము అగుంబో = నిజమే సుమా; ఎప్పుడేన్, కానీ; ఇంకా కొంచెం సేపటికి కానీ; ఎల్లియేన్ కానీ = రేపు కానీ; తత్+మనోజ్ఞ గుణముల్ కానీ = ఆయన కళ్యాణ గుణాలు కానీ; తత్+ అన్యాయముల్ గానీ = ఆయన అధర్మ చేష్టలు కానీ; నీనుడిన్ = నీ మాటలో; చిందినన్ = తొణికితే; నీకున్; చింత = ఆలోచన; అతని పైన్ కాక = అతని మీద తప్ప; ఎవ్వరిన్ తేల్చెదే = ఎవరిని మోసగిస్తావే.

''ఇక సరే. ఆయన మాట మాటాడకండి'' అని గోదాదేవి అనగానే చెలికత్తెలన్నారు. '' ఔనమ్మా! నీ వన్న దెంత సత్యమో! ఇప్పుడు కానీ! కొంచెం సేపయిన తర్వాత కానీ!, రేపుకానీ, నీ వాయన మంచి గుణాలనో, చెడు గుణాలనో ప్రస్తావిస్తే, అప్పుడు చెప్పవచ్చు నీ కాయన పైన ప్రేమ ఉన్నదని, కానీ ఇప్పుడెలా చెప్పగలం? నిజమే సుమా. పోవే. మమ్ములనా తెలివి తక్కువ వాళ్ళను చేస్తావు? - ఎందుకంటే నీ దినచర్య ఇదిగో ఇది! (తర్వాతి పద్యం)

సీ. నఖముఖోజ్జిత పరాఙ్ముఖముక్త బాష్పాంబు
పటిమ దీపపుఁ జిట చిటలు దెలుపఁ
బొరి నుపాంశూత్సృష్ట ఫూత్కృతుల్ కృశమధ్య
పార్శ్వముహుః ప్రకంపములు దెలుప,
నొదవెడు గాఢ్గద్య మదరిపాటునఁ బల్క
రింపఁ బుట్టెడు కేకరింత దెలుప,
వలవంత విసువు కాంతల వుట్టు దూషించు
కారణంబుల తొంటి కతలు దెలుపఁ

తే. నలఁతఁబానుపుపైఁ బొరలాట దెలుపఁ,
దెగువ లోలోననే నవ్వునగవు దెలుపఁ,
గలఁక మామీఁది పనిలేని కసరు దెలుపఁ,
బొలఁతి ! రేలు నీ యున్కియే పులుగుగాదె ? 60

పొలతి = అమ్మా !; నఖముఖ = కొనగోళ్ళతో; ఉత్+జిత = పైకి చిమ్మబడిన; పరాక్+ముఖ= అవతలికి త్రిప్పిన ముఖంతో; ముక్త = జారిన (విడువబడ్డ); బాష్ప+అంబు = కన్నీటి; పటిమన్ = ఆధిక్యాన్ని; దీపపు = దీపముయొక్క; చిటచిటలు = అలాంటి ధ్వనులు; తెలుపన్ = స్పష్టం చేస్తుంటే.

ఎదురు బొదురుగా అందరూ కలిసి పండు కొన్నారు. ఒక రాత్రికాడ గోదాదేవి ఏడుస్తూ (స్వామి విరహంతో) మొగం వెనుకకు త్రిప్పి జారే కన్నీరు కొనగోళ్ళతో చిమ్మింది. అది దీపం మీద పడి చిట చిట మన్నది. ఈ ధ్వనికి మేల్కొన్నారు చెలులు. ఆ ధ్వనులే చెబుతున్నవి కదా నీ విరహ దుఃఖాన్ని? అని నిగ్గ దీయటం.

కృశమధ్య = సన్నని నడుము, పార్శ్వ = డొక్కలు; ప్రక్కలు; ముహుః = మాటికీ; ప్రకంపములు= ఎగసి పడటం (కదలికలు); పొరిన్ = క్రమంగా; ఉపాంశు = రహస్యంగా; ఉత్ సృష్ట = బైటకు విడిచే; ఫూత్కృతుల్ = ఊర్పులను (ఫ్- అన్న ధ్వనులు కలవి); తెలుపన్= తెలుపుతుంటే.

ఆమె అవతలకు తిరిగి పండు కొన్నది. వారివతల ఉండి చూస్తున్నారు. గోదాదేవి డొక్కలు ఎగసిపడుతున్నవి. ఊర్పుల గాలులు విన్పిస్తున్నవి. ' ఓహో! ఈమె నిట్టూరుస్తున్నది. అందుకే పార్శ్వములు ఎగసి పడుతున్నవి' అని నిశ్చయించుకున్నారు. అవతలి దీపపు కాంతిలో పార్శ్వ ప్రకంపాలు బాగా కన్పిస్తున్నవి. అసలే ఆమె బంగారు చాయలో మెరిసి పోతుంది కదా.

అదరిపాటునన్ = హఠాత్తుగా, పల్కరింపన్ = పలుకరిస్తే, పుట్టెడు = పుట్టే, కేకరింత = కంఠస్వరం, ఒదవెడు = కలిగే, గాద్గద్యమున్ = గద్గదికను, తెలుపన్ = తెలియచేస్తుంటే.

హఠాత్తుగా పల్కరిస్తే ఆమె కంఠాన్ని సరిచేసుకోవటం ద్వారా ఆమె గాద్గద్యం తెలిసింది.

కాంతల పుట్టు = స్త్రీ జన్మను; దూషించు = నిందించే; కారణంబులన్ = హేతువులతో; తొంటి కతలు = పురాణోక్త గాథలు (చెప్పటం); వలవంత = విరహపు; విసువు = విసుగుదలను; తెలుపన్.

స్త్రీల పుట్టుకను దూషిస్తూ ఉదాహరించావే ఇందాక (అవతార కథాదులు). అవన్నీ నీ విరహ వైరాగ్యాన్ని సూచించే కారణాలే కదా.

పానుపు పైన్, పొరలాట = దొర్లటం, అలతన్ = అలసతను, తెలుపన్ .

నీ విరహాయాసాన్ని నిద్రపోకుండా ప్రక్క పైన దొర్లటమే చెబుతున్నది కదా.

లోలోపనే నవ్వే నవ్వు- తెగువన్ - జన్మను చాలించే ప్రయత్నం తెలుపన్ - ఈజన్మ వ్యర్థమన్న తెగింపును నీలో నీవు నవ్వుకోవటంతో స్పష్టపడుతున్నది.

మా మీది, పనిలేని = అనవసరమైన; కసరు = కోపం; కలకన్ = కలతను; తెలుపన్.

రేలు = రాత్రులందు; నీ యున్కియే = ఈ విధంగా ఉన్న నీ స్థితే; పులుగు గాదె = గుర్తు కదా ! (నీ విరహానికి).

శృంగార రసం మధురమనీ, విరహ శృంగారం మరీ నని సిద్ధాంతం. దానినే మాత్రం వాచ్యం చేసినా మలినమై పోతుంది. ఈ అద్భుత పద్యం బహు సుకుమారంగా రతి భావాన్ని నాటకీయంగా ధ్వనిస్తున్నది నాటకీయత ఏమంటే - అందరూ కలిసి పండుకొన్నారు. మంచాని కవతల దీపమున్నది. కొంచెం సేపటికి అంతా నిద్రలోకి జారారు- ఈమెకు నిద్ర లేదు, దుఃఖం పొర్లు కొని వస్తున్నది. మొదటి పాదంలో బాష్పంచిటపటలతో ధ్వనిస్తున్నది. రెండో పాదంలో నిట్టూర్పు (దాని అభినయం - డొక్కలు ఎగసిపడటం ద్వారా ధ్వనించటం)- మూడో పాదంలో గాద్గద్యం - నాల్గులో స్త్రీ జన్మను దూషించటం (40, 54). నిద్ర లేక పోవటాన్ని సూచించే పొరలాట- ఇలా భావజాలం. సుకుమారంగా ఆమె 'రతి' భావాన్ని వ్యంజిస్తున్నది. తెగువ - పూర్వరాగ శృంగారంలో మరణం, చివరిది. అదీ సూచితమైనది.శృంగారం మధురమంటే ఇలా ధ్వనించి నప్పుడు.

కాబట్టి - ఎవ్వరిన్ తేల్చదే?

చ॥ ఎఱుగరుగా యొకద్భుతము నీ చెలి దీర్ఘికఁ దీర్థ మాడ నా
యఱుతఁ దగిల్చి పోవుఁ దన హారము; వోయిన నేనుఁ బోవుదున్
మ ఱకువ వెంటఁ బోవ జలమగ్నత నౌ నది సున్న, మైనఁ దాఁ
గఱకటిఁ బెట్టి పొమ్మఁడుగుఁ గాని నిజార్తి యెఱుంగ దేమియున్. 61

ఒక; అద్భుతమున్ = ఆశ్చర్యకరమైన అంశం; ఎఱుగరుగా = మీకు తెలియదు కదా (కనుక చెబుతున్నాను); ఈ చెలి = ఈ గోద; దీర్ఘికన్ = దిగుడు బావిలో; తీర్థము+ ఆడన్ = స్నానం చేయటానికి, తన హారమున్ = తన ముత్యాల దండను; నా; అఱుతన్ = మెడలో; తగిల్చి = వేసి; పోవున్ ; పోయినన్ = పోగా; నేమున్ = నేనూ; పోవుదున్ = స్నానానికి పోతాను; మఱకువన్ = మరుపుతో; వెంటన్ పోవన్ = బావిలో దిగితే; జల మగ్నతన్ = నీటిలో మునిగితే; అది = ఆ హారం, సున్నము+ ఔన్ = పొడి పొడి అయిపోయింది; ఐనన్= కాగా; తాన్ = ఆమె; కఱకఱి బెట్టి = బలవంతం చేసి, సొమ్మున్, అడుగున్, కానీ; ఏమియున్= కొంచెం కూడా; నిజ = తన, ఆర్తిన్ = విరహమును; ఎఱుంగదు.

ఈమె దిగుడు బావిలో స్నానానికి దిగుతూ హారం నా మెడలో వేసింది. నేనూ మరిచి పోయి ఆమె తోపాటే దిగాను. ఆమె విరహాగ్ని వేడికి నీరు కాగి హారంలోని ముత్యాలన్నీ పొడి పొడి కాగా, నా హారం నాకిమ్మని నన్ను బలవంతం చేస్తుందే తప్ప తన కాక వల్లే అవి సున్నమైనవని ఈమెకు తెలియదు.

వేడినీళ్ళు తగిలితే ముత్యం నల్లపడి పగిలి పొరలు లేచి పోతుంది. స్నాన వేళ శరీరం లోని వేడి నీటి చల్లదనానికి పైకి పొంగి ప్రక్క నున్న చెలి మెడలోని హారాన్ని సున్నం చేసింది.

చూ. 1-56 ఆ గ్రామంలో దిగుడు బావులున్నాయి.

చెలికత్తెలు ఆరుగురు(37). ఇక్కడ చమత్కార సంభాషణలు 61,62,63. మూడు పద్యాలు. ఒక్కొక్కరు ఒక్కొక్క పద్యమన్నారు. 56,59,60 ముగ్గురూ కలిసి అన్నారు.

దీని కంటె అందమైన భావం - వారు నాగ కన్యలు- అంటే యోగనాడీ స్వరూపిణులు. ఇడా - పింగళా - సుషుమ్నలు - గోద కుండలినీ శక్తి. ఈ మూటి ద్వారా తాను సహస్రారంలో ఉన్న భర్త దగ్గరకు చేరటం యోగఫలం.

సహస్రారం = మానస సరస్సు, సుధా సముద్రం అన్నీ ఒకటే. ఇదే హ్రదము = డిగ్గియ. దానికి పోయే దారులు నాగకన్యలు ఈ ముగ్గురు. ఈ యోగ సిద్ధాంతాని కిది కావ్య - కవితా- రూపం. (చూ. ఈ అశ్వాసాంత పద్యం)

చ. **అనిన మరాళి పల్కు, విన వా హరిణీ! యొకనాఁడు కస్తురిం**
**గొని యిడు బొట్టు నా కనుచుఁ గూర్మి నొసంగినఁ, బెట్టు చుండఁ, జు**
**ఱ్ఱనుచు మొగంబు వ్రేసినటు లౌ తన యూర్పుల నింకి యింకి పో**
**యిన పలు బేంట్లు గోరఁ గొని యెత్తనె పట్టెను మాటిమాటికిన్.** 62

అనినన్ = హరిణి అలా చెప్పగానే; మరాళి = మరొక చెలికత్తె; హరిణీ = ఒసేవ్ హరిణీ; వినవా, ఒకనాడు; కస్తురిం గొని = కస్తూరి తెచ్చి; నాకున్, బొట్టు; ఇడవా = పెట్టవా అంటూ; కూర్మిన్ = స్నేహంతో; ఒసంగినన్ = ఇస్తే, పెట్టుచున్+ ఉండన్ = పెడుతుండగా; చుఱ్ఱు+ అనుచున్=చుఱ్ఱుమంటూ; మొగంబు వ్రేసినటులు =చెంప దెబ్బ కొట్టినట్లుగా; తన, ఊర్పులన్ = నిశ్వాసలతో; ఇంకి ఇంకి పోయినన్ = బాగా

ఇంకి పోతే ( ఇంకు+ ఇంకు = ఇఱ్ఱింకులు); పలు = అనేక; బేంట్లు = బెత్తికలు; గోర కొని = గోటితో తీసి; ఎత్తన్ = ఎత్తటం తోనే; మాటి మాటికిన్; పట్టెను = సరిపోయింది. మరాళి అంటున్నది- ఒసే! హరిణీ! ఇదొక రోజున కస్తూరి తెచ్చి తనకు బొట్టు పెట్టమన్నది, సరేనని పెడుతుంటే దాని వేడి నిట్టూర్పు గాలికి కస్తూరి బిగుసుకు పోవటం వల్ల మాటి మాటికీ బెత్తిక లెత్తటం తోనే సరిపోయింది.

అలం : అతిశయోక్తి .

చూ॥ 12 వ పద్యం

మ. అనినఁ బ్రగ్విణి పల్కెఁ, దన్నుఁ, జెలులారా! నే లతా డోలఁ జి,
క్కన నూపం దెగి వ్రాల, దీని చను వ్రేకంబే క్రియం దాల్తునో
యని పట్టం, దినమధ్య మార్కరుచిశీర్యన్మంజరు ల్పోని వా
డిన పాలిండ్లను బెండు బొమ్మగతి నుం డె న్సందిటం జుల్కనై. 63

అనినన్ = మరాళి అన్న తర్వాత; స్రగ్విణి = మరొక చెలికత్తె పల్కెన్; చెలులు+ ఆరా = సఖులారా!; తన్ను = తనను (ఆమెను); నేన్ = నేను; లతాడోలన్ = తీగె ఉయ్యాలలో; చిక్కన ఊపన్ = గట్టిగా ఊపితే; తెగి = ఉయ్యాల త్రాళ్లు తెగిపోయి; వ్రాలినన్ = ఈమె క్రింద చదికిలబడగా; దీని; చనువ్రేకంబు = విస్తార స్తన భారాన్ని; ఏ క్రియన్ = ఏ విధంగా; తాల్తునోయని = పట్టుకొనేదని; పట్టన్ = పట్టుకోగా, దిన మధ్యమ+ అర్కరుచిన్ = మధ్యాహ్నపు ప్రొద్దు ఎండకు; శీర్యత్ = వాడిపోయే; మంజరుల్+పోని = పూగుత్తులట్టి; వాడిన = వాడి వత్తలైన; పాలు+ ఇండ్లు = పాలకు నిధులైన స్తనాలు; సందిటన్ = కౌగిటిలో; బెండు బొమ్మగతిన్ = జీలుగు బెండుతో చేసిన; బొమ్మ వలెన్ = అందమైన బొమ్మ లాగా; చుల్కనై = తేలికయ్యె; ఉండెన్ = ఉన్నాయి.

ఒక రోజామెను తీగటుయ్యాలలో కూర్చోబెట్టి గట్టిగా ఊపుతున్నాను- ఆ విసరుకు ఉయ్యాల తెగటం, ఈమె క్రింద పడటం జరిగింది. లేవ నెత్తటానికి పూనుకొని అనుకొన్నాను; 'దీని స్తన మండల భారం విస్తారం ఎలా ఎత్తుకొని లేపే'దని భావించి, ఎత్తితే ఏముంది? మధ్యాహ్న సూర్య రశ్మికి వాడిపోయిన తామర మొగ్గలైన చనులతో ఈమె నా సందిట బెండు బొమ్మ గతి ఒదిగిపోయింది.

విశే॥ బెండు బొమ్మ- జీలుగు బెండుతో బొమ్మలు చేసే కళ నాడు ఉండేది అన్న మాట.

స్రగ్విణి దండ ధరించినది (కలది). దండ నిచ్చిన దాని కత - లతాడోల సంగతి- చెప్పటం సరిపోయింది. (స్రగ్విణి వృత్త అఖండ తరంగమాలా డోలనమును బోలిన ధీర విలంబన గతి గలది. డోలా గతి వలె నిద్ర పుచ్చు లక్షణము కలది. (చూ. మహాభారత మందలి ఛందః శిల్పము) 62, 63 పద్యాల ప్రథమ పాదాల్లోని యతులు సంబోధన పై నున్న ప్లుతం. వినవా ! చెలులారా !

వ॥ అని తన యవస్థఁ దోఁప నాఁడిన ననాదరయుం బోలె వారల కిట్లనియె. 64

అవస్థ = స్థితి; దశ; తోపన్ = స్పష్టం కాగా; ఆడినన్ = చెబితే, అనాదరయున్ + పోలెన్ = నిరాదరణతో; ఆసక్తి లేని దాని వలె.

క. అర్పఁగఁ దీర్పఁగ మిక్కిలి
నేర్పు గల వయస్య లట్లు నెలఁతలు మీ మీ
నేర్పునఁ బలికెద రక్కఱ
యేర్పడ మీ కీ విచార మేటికిఁ జెప్పఁడీ. 65

నెలతలు = చెలులారా !; ఆర్పగన్ = ఆర్పటానికి గానీ; తీర్పగన్ = కష్టాలు తీర్చటానికి గానీ; నేర్పుగల = చాతుర్యం కల; వయస్యలు = చెలికత్తెలు; అట్లు = వలె; అక్కఱ = (సందర్భం, సమయం) అవసరం, ఏర్పడన్ = సంభవించేసరికి; నేర్పునన్; పలికెదరు = మాట్లాడుతున్నారు; మీకున్; ఈ విచారము = ఈ ఆలోచన; ఏటికిన్ = ఎందుకు?; చెపుడీ.

మీమీ నేర్పునన్ - ముగ్గురూ విధంగా మూడు విషయాలు కతలుగా అందంగా అల్లినట్లు చెప్పటం. హరిణి తనకుచితంగా - అలాగే మిగిలిన వారూ అంటే ఆ పద్యాలల్లటంలో నేర్పు భావసౌందర్యమున్నూ అడుగున యోగరహస్యాన్నీ భంగ్యంతరంగా కవి పాఠక లోకానికి సూచించటమే. పద్యమంతా దీర్ఘాక్షరాల కూర్పుకలది. సాగదీసి ఎగతాళిగా అంటున్నది వక్త.

వ. అని మేలంబు సేసికొని తేలి పోఁబలికి పుట పాక ప్రకారంబగు వియోగ దవథుభరం బవ్వధూరత్నం బడంచికొని యుండియు నుండ లేక నిశా సమయంబుల నొక్కొకమాటు తనలోన. 66

మేలంబు సేసికొని = ఎగతాళిగా చేసి; తేలిపోన్ పలికి = విషయాన్ని తేలగొట్టి; తేలికగా చేసి; పుటపాక ప్రకారంబు = నిప్పుల్లో పుటం చేసినట్లు; వియోగ = విరహ; దవథు = తాపము యొక్క; భరంబు = బరువు; ఆ; వధూరత్నంబు = శ్రేష్ఠురాలైన వధువు; (వధూవరులన్న చోట ఏ అర్థమో ఆ అర్థమే).

తేలిపోబలికిన మాటలు కందంలో - వచనంలోను వ్రాయటంలో కథా నిర్మాణ రహస్యమేమిటి? ''ముందు మూడు వృత్తాలు - తర్వాతి సీసం, బరువును మోయలేని పాఠక విశ్రాంతి కోసం.''

సీ. అభినవ కువలయ శ్యామకోమలమైన
డామూఁపు మకర కుండలముఁ దాల్ప,
నిస్తులాస్యశ్రీ వయః స్తంభ నిక్షిప్త
నింబచ్ఛద భ్రువునిక్క సుంత,
పరువంపు మంకెన విరి వంపు నర వంపు
వాతెఱ చెంద్రంపు వాన గురియ,

నడ్డంపు మెఱుంగు వాలారు కన్గవచూడ్కి
శ్రవణ కుండల కాంతి సవతుగాఁగ,

తే. సప్తభువనాంగనానురంజనకు సప్త
విధ పరీవాహముగ గాన సుధ వెలార్చు
మూడ్కి వేణువు పై వ్రేళ్లు మార్చి మార్చి
మరులు కొలిపి తె గోవింద మందసతుల. 67

గోవింద! = గోవులను కాచే స్వామి !; అభినవ = అపుడే విచ్చే, (కొత్త) కువలయ = కలువ పూల వలె; శ్యామ = నీల కాంతి కలిగి; కోమలము = మృదువు, ఐన; డామూపు = ఎడమ భుజాగ్ర ప్రదేశం; మకర కుండలమున్ = మొసలి రూపం గల పోగును; తాల్పన్ = ధరింపగా

అప్పుడే వికసిస్తూ - సగం మొగ్గ - సగం పువ్వుగా నున్న నీలి కలువలాగా- కోమలంగా ఉన్న ఎడమ భుజం మీద ఎడమ చెవి పోగు ఆనుకొని ఉండగా - తల ఎడమ ప్రక్కకు వంచి మురళి వాయిస్తున్నాడని భావించుకోవాలి.

నిస్తుల = సాటి లేని; ఆస్య = ముఖముయొక్క; శ్రీ = సౌందర్యముయొక్క; వయః = తారుణ్యమును; స్తంభ = అలాగే నిలబెట్టటానికై; నిక్షిప్త = దాచుకొన్న; నింబచ్ఛద = వేపాకు వంటి; భ్రువు = కన్బొమ; సుంత = కొంచెం, నిక్కన్ = పైకి లేవగా.(భ్రువల్పంబునిక్క = పాఠాంతరము)

భగవంతుని ముఖ సౌందర్యానికి తులా ప్రమాణం లేదు. కనుక అది అలాగే స్థిరంగా ఉంచుకొనే ప్రయత్నంగా వేపాకును దాచుకొన్నాడన్నట్లున్న కన్బొమ కొంచెం పైకి లేవగా-

భ్రు - భ్రూ వేపాకు అంచుతో ఆకృతితో పోలిక భావించు కోవాలి.

విశే॥ వేపాకు వయస్తంభ నౌషధమనటం ఈ కవికీ పరిజ్ఞానమున్నట్లు రాజనీతి లోని పద్యం సాక్ష్యం- 4-230, 270.

పరువంపు = బాగా విచ్చిన; మంకెన విరి = మోదుగు పూవు; వంపు = వంకర కలిగిన; అరవంపు వాతెఱ = అర్ధ చంద్ర రేఖగా నున్న పెదవి; చెంద్రంపు = కుంకుమ (సింధూరం = చెంద్రం), వాన = వర్షం; కురియగాన్ = కురుస్తుండగా.

చక్కగా వికసించిన మోదుగు పువ్వువలె ఎఱ్ఱనైన వంపు తిరిగిన పెదవి కుంకుమ కాంతిని వర్షిస్తుంటే.

అడ్డంపు = అడ్డంగా ప్రసరించే; మెఱుగు = మెరుగు కాంతి గల; వాలారు (వాలు+ ఆరు) = కత్తిలాగా తీక్ష్ణమైన; కన్గవ = కంటి జంట; చూడ్కి చూపులు రెండూ ఏకమైనట్టి చూపు; శ్రవణ = చెవులకున్న; కుండల = పోగుల, కాంతి = కాంతితో; సవతుగాగ = సమానం కాగా; సపత్నీ భావం పొందుతుండగా

రెండు కన్నుల చూపులూ ఒకే దిశగా చూస్తున్నందున - ఎడమ దిక్కున తలవాల్చి మురళి పాడుతున్నాడు కనుక - అడ్డంగా - తీక్ష్ణంగా ఉన్న చూపు - దృష్టి చెవుల రత్నాల పోగుల వన్నెతో విరోధం వహిస్తున్నట్లుగా ఉంది.

సప్త భువన = ఏడు లోకాల (లోకాలన్న), అంగనా = స్త్రీల (స్త్రీ), అనురంజనకున్ = రంజింప చేయటానికై, సప్త విధ = ఏడు విధాల, పరీవాహముగన్ = సన్నని నీటి జాళ్ళుగా, గానసుధన్ = సంగీతామృతాన్ని, వెలార్చు = స్రవింపచేసే, మాడ్కిన్ = విధంగా, వేణువుపైన్, వ్రేళ్ళు, మార్చి మార్చి, మంద సతులన్ = వ్రేపల్లె స్త్రీలను ( ఆలయమందలు కాచుకొనే గొల్ల కన్నెలను- ఆలమందల వంటి అమాయక స్త్రీలను), మరులు కొలిపితె = వలపు కలిగించినావా?.

గోవిందుడు కనుక గోవు వంటి స్త్రీలను మరులు కొలపటానికై మురళి పాడుతున్న భంగిమ లోకోత్తరంగా వర్ణితం కావటం భావుక లోకరసాయనం. భావనా చారితార్థ్యం. మురళికున్న ఏడు రంధ్రాలు ఏడు తూములు; కలుగులు, వాటి పై వ్రేళ్ళు మార్చి మార్చి ఏడు లోకాలన్న స్త్రీని మహాప్రకృతి కాంతను- మోహింప జేయటానికో అన్నట్లు- సప్త స్వరాల తోపాడుతూ - వ్రేపల్లె స్త్రీలను మర్లు కొలిపినావా?.

(మరులు తీగమెట్టి ఇరులన్న నోయను 6-12)

భారతీయ శిల్పాల్లో ఈ మూర్తి భంగిమ నేత్ర తర్పణంగా శిల్పించబడ్డది. పోల్చుకోవచ్చు. ఈ కావ్యం 3-85 పద్య భావంతో దీనిని పోలిస్తే ఇది కవితా-వక్రతా-నాట్య భంగిమా మనోజ్ఞం కాగా అది భక్తుని దర్శనం, అక్కడ వక్రతా భంగిమలు లేవు. స్తుతిరూపం కనుక గోదా భావనామూర్తి- కావ్య కళాన్వితం- వర్ణనామూర్తి. ఇది కృష్ణ సౌందర్యం. 6-98 లో పరస్వరూప వర్ణనం.

భగవంతుని ఎన్ని పార్శ్వాలలో దర్శించాడు మహాకవి । ఇంతకంటె తప స్సుంటుందా? -

మాళిక :-

68, 69,70 - ఈ మూడు పద్యాలూ ఒక గుచ్ఛము. వ్యాజనిందా రూప స్మరణ. అవతారాల ఆక్షేపణ స్త్రీ పక్షమువలంబించి చేస్తే - ఇక్కడ స్త్రీలనాక్షేపించటం చేస్తున్నది. దశమ స్కంధం కథలే దీనికి ఆధారం.

భక్తిలో 9 భేదాలు. అందులో స్మరణ - చింతన మననాదులున్నాయి. ఇక్కడ అదే. కాకపోతే భక్తిలో భాష వాచ్యం. ఇక్కడ వక్రం. ఇదంతా వక్రసుందరమైన విరహాలాపన. పూర్వ రాగ శృంగారంలోని దశభావాల్లోను స్మృతి ఉన్నది. నాటి రాధాదు లనుభవించిన అనుభవ స్మరణలో తన కోరిక అభిలాష (దశ విధ భావాల్లో ఒకటి) వ్యంగ్యమౌతూనే ఉన్నది. ఈ అభిలాష మార్గాన్వేషణకు దారి తీస్తుంది. దీనినే చింతన అన్నారు ఆలంకారికులు. దశ విధ భావాల్లో ఈ చింతనము ప్రియుని పొందే ఉపాయాన్వేషణ. ఇదే తర్వాత చెలుల ద్వారా లభించబోతున్నది.

ఉ. అక్కట రాధ నీకుఁ దగవా మగవారల నత్తమామలం
దక్కి ముకుంద వేణు కలనాదపు టీలకు లేటిమొత్తమై
త్రెక్కొను కాఁకమై నడికి రేలరుదెంచిన గోపికావళిన్.
బొక్కఁగ జేసి తద్రుచిర భోగము గుత్తగ నీవ కైకొనన్. 68

రాధ = రాధాదేవీ !; అత్తమామలన్; తక్కి = వదలి, ముకుందు = శ్రీకృష్ణుని; వేణు కలనాదపు టీలకున్ = మురళీ మధుర నాద మన్న సంకేతధ్వనికి; లేటి మొత్తమై = లేళ్ళ గుంపై;( త్రెక్కొను ( త్రెక్కు+కొను) = చంపు; బాధించు (చంపు- త్రాగు - కలత చెందించు - బ్రొను); కాకమైన్ = తాపంతో; నడికిరేలు = అర్ధరాత్రులందు; అరుదెంచిన = వచ్చిన; గోపిక + ఆవళిన్= గొల్ల స్త్రీల మొత్తాన్ని; పొక్కగ జేసి = ఏడ్పించి; తత్ = ఆ; రుచిర = అందమైన; భోగమున్= అనుభవాన్ని, నీవ; గుత్తగన్ = మొత్తం కొనుగోలుగా, కైకొనన్ = దక్కించుకోవటం; నీకున్; తగవా = న్యాయమా?; అకటా! = అయ్యో! (సడికి - అని పాఠాంతరం)

వేణునాదానికి ఆకర్షితలై ఎల్ల వ్రేపల్లె వనితలు అత్తమామలను కాదని, అర్ధరాత్రులు- లేళ్ళ గుంపులై- పరుగులు పెట్టి వచ్చారు కదా రాధా! వారినందరినీ కనుమొరగి స్వామి పొందు నీ వొక్కతేవే ఆచుకోవటం న్యాయమా?

తత్ రుచిర భోగము - రతి - సంయోగము లనకుండా ఇలా అనటంవల్ల జీవేశ్వర సంయోగం శబ్దానికందదు కనుక మరొక రీతిగా అంటే (రతి - సంయోగం) లౌకికమైపోతుంది కనుక.ఈ కాలానికి రాధ కథ తెలుగులోకి వచ్చింది. రాధామాధవ కవి అని రాయలే సన్మానించాడు కదా ! తత్కావ్య కర్తయైన ఎల్లనార్యుని.

ఉ. అక్కమ లాక్షుఁ డొక్కతె నిజాంసమునం దిడి కుంజపుంజపుం
జక్కికిఁ గొంచుఁ బోవఁ బెఱ చాన లినాత్మజ వెంట వ్రేఁగున
న్మిక్కిలి డిగ్గు పాద సరణిం జని రోయుదు రట్టె రోసి తా
రక్కడఁ గాంచుటేమి వలదా యభిమాన మొకింత యింతికిన్? 69

ఆ+కమల+ అక్షుడు = ఆ పద్మనేత్రుడు; ఒక్కతెన్; నిజ = తన; అంసమునందున్ = భుజము మీద పెట్టుకొని; ఇడి = ఉంచి ( భుజానికానుకొని - ఎత్తుకొంటూ - నడిపిస్తూ); కుంజ= పొదరిండ్ల; పుంజ = వరుసల; చక్కికిన్ = ప్రదేశానికి (మాటుకు); కొంచున్ పోవన్ = తీసుకొని పోగా; పెఱ చానలు = ఇతర స్త్రీలు; ఇన+ ఆత్మజ = సూర్యుని కూతురు - యమున; వెంటన్ = ప్రక్క; వ్రేగునన్ = బరువుతో; మిక్కిలిన్ = ఎక్కువగా; డిగ్గు = ఇసుకలో లోతుకు దిగిపోయే; పాద సరణిన్ = అడుగుల బాట వెంట; చని = పోయి; రోయుదురు+ అట్టె = వెతుకుతారా+ఆశ్చర్యం; రోసి = అట్లే వెదకి; తారు = ఆ చానలు, కాంచుట+ ఏమి = ఏమి చూస్తారు; ఒకింత = కొంచెం; అభిమానం = ఈలువు ( రోషం); ఇంతికిన్ = స్త్రీకి; వలదా?= వద్దా ?

ఆ కృష్ణుడేమో ఒక గోపికను భుజాన కానించుకొని, తానే మోస్తూ యమున సైకతాల్లోకి వెళితే- ఈ సిగ్గులేని ఇతర గోపికలు వారి అడుగుల జాడ - బరువును మోసుకొని పోయేటప్పుడు లోతుగా దిగబడతాయి కనుక - బట్టి వెతుక్కుంటూ పోతారా? - అవ్వ. వాటిని పోయి ఏమి చూచారు ? ఆడదానికి కొంచెమైనా అభిమాన ముండాలి కదా !

పై పద్యంలో రుచిర భోగమే ఈ పద్యంలో - కాంచుటేమి ? చూచిన దేమిటన్న ప్రశ్న కర్థం - అది స్త్రీగా తాను చెప్పరానిది. ఇది లోక దృష్ట్యా. ఆధ్యాత్మిక దృష్ట్యా జీవేశ్వర సంయోగం. శబ్దానికందేది కాదు. ఏ శబ్దంతో అన్నా అది కలుషితమై పోతుంది.

అలం : అర్థాంతరన్యాసం.

చ. ఇలు గలనైన వెల్వడని యీలువుటాంఁడ్రకుఁ దాఁపిక త్తైవై
యులు కెడలించి శౌరి తను యోగపు వాచవిఁ జూపి మీఁదఁ బె
ల్లలము వియోగవహ్ని భవ దంతర సైకత పంక్తి పొంత వం
తలఁ బొరలించి తౌదు శమనస్వస వుగ్రమయూఖనందనీ ? 70

ఉగ్రమయూఖ = తీక్ష్ణ కిరణాల వాడు, సూర్యుడు, నందినీ = కూతురా ! (యమునా !); కలను = కలలో; ఐనా; ఇలు = ఇల్లు; వెల్వడని = వదలి బైటకు పోని; ఈలువు+ఆంఁడ్రకున్= అభిమానవతులకు; తాపిక త్తైవై = కుంటెన కత్తైవై (తార్పుల దానివై అని నింద); ఉలుకున్ = జంకుబాటును; ఎడలించి = పోగొట్టి; శౌరి = శ్రీకృష్ణుని; తను = శరీరపు; యోగమున్ = పొందును; వాచవిన్ = మాటల రుచిని; చూపి = ప్రదర్శించి, (మాటలతో నోరూరేటట్లు చేసి); ఆ మీదన్ = ఆ తర్వాత; పెల్లు= ఎక్కువ, అలము = వ్యాపించే; వియోగ వహ్నిన్ = విరహాగ్నితో; భవత్ = నీ; అంతర = మధ్యనున్న; సైకత పంక్తి = ఇసుక తిన్నెల వరుసల; పొంతన్ = ప్రక్క; వంతలన్ = బాధలతో; పొరలించితి = పొర్లేటట్లు చేసావు (ఉడుకు చల్లార్చు కోవటానికై); శమన = యముని; స్వసవు = చెల్లెలవు; ఔదు = అవుదువు కదా !

వాడి మయూఖముల్ గలుగువాడు కన్న కూతురా ! నీవు కఠినాత్ముడైన యమునకు చెల్లెలవు కదా ! అందుకే - కలలోనైనా గడపదాటి బైటకురాని అభిమానవతులకు మాటల్లో అమృతాన్ని ఒలకబోసి, నోరూరించిశౌరితను యోగ మాహాత్మ్యం కోసం - బైటకు లాగావు. తరువాత వారి గతేమిటి ? విరహాగ్నితో నీ సైకతాల్లో పొర్లాడటం. ఇదంతా తాపికత్తె వైన నీ చేష్ట కదా ! ఇది న్యాయంగా ఉన్నదా ?

అలం : వ్యాజనింద.

వ. అని యొంటి పాటునం దనలోనం బలుకు పలుకు లాలించి పొంచియున్న వయస్య లాస్యంబు లపహాస్యచంద్రికాతుందిలంబులుగాఁ దోఁచి భామ, యేమేమి ? నీ మనం బెఱింగియే కదా ముును మున్న యతని మాటలు మానలేవంటి' మని మూదలించినం గించి దవనతాననయై నెమ్మొగంబు వెలవెలపాటు లేనగవున నడంచి మఱి మొఱంగ ననువు పడక యందంబు గూడుకొని వారి కిట్లనియె. 71

ఒంటిపాటునన్ = ఒంటరిపాటున; తన లోనన్ = తనలో తాను; ఆలించి = విని; పొంచియున్న వయస్యలు = దాగి ఉన్నట్టి చెలికత్తెల; ఆస్యంబులు = ముఖాలు; అపహాస్య = పరిహాసమనే; చంద్రికా = వెన్నెలలతో; తుందిలంబులుగా = తొణికిసలాడగా; తోచి = చాటు నుండి బైటకు వచ్చి; భామ = అమ్మాయీ !; ఏమి+ఏమి, నీ మనంబు = నీ ఆలోచన; ఎఱింగియే కదా = తెలిసే కదా; మును మున్న = మున్ముందే; ఆతని మాటలు = ఆయన మాటలు; మానలేవు; అంటిమి; మూదలించినన్ = నిరూపిస్తే (మున్+తల = తార్కాణిస్తే); కించిత్ = కొంచెం; అవనత = వంచిన; ఆనన = ముఖం కలది; ఐ; నెఱ+మొగంబు = నిండు మోముయొక్క; వెల వెల పాటు = పాలిపోవుటను; లేనగవునన్ = లేతనవ్వు (వెన్నెల) చాటున; ఒడంచి = దాచి; మఱిన్ = ఇక; మొఱంగన్ = దాచటానికి; అనువు పడక = వీలు కాక; అందంబు గూడుకొని = వారితో తానూ కలిసిపోయి.

గోదాదేవి పై పద్యాలు ఆత్మగతంగా అనుకొన్నవి. అది స్మరణ మైనా ప్రసిద్ధ భక్తి మార్గం లోది కాదు శృంగార విషయమే నన్న మాటను ఈ వచనం ధ్రువపరుస్తున్నది. వారు దేనికి పొంచి ఉన్నట్లు ? కథలో వారి పాత్ర గోదా గత రతి స్థాయి పోషణ - వ్యక్తీ కృతి సాధనలు. ఆమె లోని రతిస్థాయికి వాళ్ళు ద్రవ్యే సారణులు, సారథులు, భామా ? - సత్యభామ! ఈ విషయం 74లో 'సత్య'తో కలపాలి.

(అందంబు గూడుకొని, చూ॥ దాసరి కథలో 37వ వచనం)

తే. 'నాఁడు మన మున్న నెట్లొ పూఁ బోఁడులార,'
యనిన, వారలు మగుడ నా యమకు ననిరి
'యింతి, నాఁ డుండ కెందుఁ బోయితివి నీ ?' వ
టన్న నచ్చెరువడి వారి కతివ పలికె. 72

పూఁబోఁడులు+ఆరా = పూవు+పోడిమి = పూలవంటి శరీరాలున్న చెలులారా ! (కోమలులారా !); నాడు = ఆ కృష్ణావతారంలో; మనము; ఉన్నన్ = ఉంటే; ఎట్లొ ? = ఎలా ఉండేదో ?; అనినన్; మగుడన్ = తిరిగి, వారలు; ఆయమకున్ = ఆమెతో; అనిరి; ఇంతి = అమ్మాయీ !; నాడు; ఉండక = లేకుండా; నీవు; ఎందున్ = ఎక్కడకు; పోయితివి= పోయినావు గనుక; అట; అన్నన్; అతివ = గోదాదేవి; అచ్చెరువు = ఆశ్చర్యం; వారికిన్ = వారితో; పలికెన్ = అన్నది

శ్రీ శిరిడీ బాబా చాలా మంది భక్తులతో అనేవారట. మనం 72 జన్మల నుండి ఉన్నాం. (ప్రక్క ప్రక్కనే జీవిస్తూ) - అలాగే శ్రీఅరవిందులు. ఇలా మహాత్ములందరూ - అప్పుడూ నీవూ - నేనూ ఉన్నామంటున్నారు. ఈ జన్మ పరంపర ఒక తామరతీగ. ఎక్కడో బయలుదేరి ముడులు - చిక్కులుగా సాగుతున్నది. ఒక్కొక్క కణపు దగ్గర నీవూ - నేనూ- ఇద్దరం కలుస్తూనే ఉన్నామని వారిమాటల కర్థం. (కనుక ప్రస్తుత గోద పూర్వం సత్యభామ)

తే. సకిలయలార, త్రైకాలిక జ్ఞానవంతు
లైన ఋషులట్ల పలికెద రంత యెఱుక

యెదఁ గలిగెనేని యెఱిఁగింపు, డేను మొదల
నెవ్వతె నటన్న; మఱి వార లిట్టు లనిరి. 73

సకియలు+ఆర = చెలులారా, త్రైకాలిక = త్రికాల సంబంధమైన; జ్ఞానవంతులు = జ్ఞానం కల; ఋషులు+అట్లన్ = ఋషుల్లాగా; పలికెదరు = అంటున్నారు; ఎదన్ = హృదయంలో; ఎఱుక = (భూతకాలిక) జ్ఞానం, కలిగెన్+ఏని = ఉంటే; ఎఱిగింపుడు = చెప్పండి; ఏను; మొదలన్ = మొదట్లో (అప్పుడు); ఎవ్వతెను.

ఋషిర్దర్శనాత్ - ఋషి అంటే దర్శనం కలవాడు. ఇందుకే ముని వంటి మాటలు వాడక ఈ శబ్దమే వాడబడ్డ కారణం.

సృష్టి అంతా ఆత్మ (నేను) అల్లుకొన్న గూడే. నా ఆలోచనలే నా జీవితం. భగవంతుని సంకల్పమే సృష్టి. నాటక కర్త ప్రతిభా కల్పనమే నాటకం. అతని ప్రతిభా నర్తకి ధరించిన భిన్న పాత్రలే అది. ఈ దృష్టితో కథ అంటే - పాత్ర అంటే - నాదే. నా ఆలోచనలే. ఒక్కొక్క ఆలోచన - భావం ఒక్కొక్క పాత్ర. నాగకన్యలు గోదాదేవి మనస్సులోని విజ్ఞాన కిరణాలు. కుండలినీ రూపాలే. గోదాదేవి కుండలినీ శక్తి అన్న అంశం ముందే స్పష్టం కనుక ఈ మాట తాను సత్యభామ నన్నది. - పాత్ర అన్నా ఆ పాత్ర తన మనస్సే. భావమూర్తి; సంకేతం. చేతనవంతమైన ప్రతిమ.

మ. దివిజద్రుప్రసవంబుఁ గాంచిన సపత్నిం జూచి, చూ పోప, కిం
తవుజిల్గుంబని యంత సేసి, మది నీర్ష్యాక్రోధము ల్సందడిం
ప, విరిం బోక, ద్రుమంబుకై కొని, పతి న్మందన్న మ్రా నెల్లఁదే
నవధిం బెట్టిన సత్య వీ వహహా ! కావా ? భామినీ ! నావుడుఁ. 74

భామినీ = భామా !, ఈవు; అహహా = అబ్బో !; దివిజ = స్వర్గంలో పుట్టిన; ద్రు = చెట్టు; ప్రసవంబు= పువ్వు (కల్పవృక్ష పుష్పం); కాంచిన = పొందిన; స పత్నిన్ = సవతిని (రుక్మిణి); చూచి; చూపు+ఓపక= అసూయతో; ఇంత+అవు = చిన్నదైన (చేత్తో చూపుతూ అనే మాట); జిల్గన్‌పని = అల్పమైన కార్యము; అంత సేసి = అంత పెద్దది చేసి; మదిన్; ఈర్ష్యా= అసూయ; క్రోధముల్ = కోపాలు; సందడింపన్ = త్రొక్కిసలాడగా; విరిన్+పోక = పూవుతో పోకుండా; ద్రుమంబున్ = చెట్టునే; కైకొని = గ్రహించి; పతిన్ = శ్రీకృష్ణుని; మందు+అన్నన్= మందు కావాలంటే, మ్రాను+ఎల్లన్ = చెట్టునే; తేన్ = తేగా; అవధిన్ = హద్దును (రేఖ గీసి); పెట్టిన; కావా = తప్పక ఔతావు; నావుడున్.

భామినీ ! ఆనాడు సవతి రుక్మిణి పారిజాత పుష్పాన్ని నారదుని నుండి గ్రహిస్తే, చూచి అసూయతో గోటితో పోయేదాన్ని గొడ్డలి దాకా తీసుకొని స్వర్గయాత్ర చేసి భర్తతో పూలతో పాటు చెట్టునే తెమ్మని - భర్తను ఆజ్ఞాపించిన సత్యభామను నీవే కదా ! మందు కోసం ఆకు తెచ్చుకోవటం పోయి మ్రాకునే పెకలించి తెప్పించినట్లుంది కదా ! ఇదంతా నీ ఈర్ష్యా-క్రోధ కారణంగా జరిగిన పని కదా.

విశే॥ భామినీ - సత్యభామా - పట్టుదల కోపం కల స్త్రీ.

సత్యభామ = భూదేవి అని పురాణవచనం. కనుక గోదాదేవి పూర్వజన్మ సత్య. తత్పూర్వం భూదేవి.

వ. గ్రక్కునం బ్రత్యుత్పన్న విజ్ఞానయై, గృహదీపికారోపణంబునం గృహ గత పదార్థంబు లొక్క మాటె దృగ్గోచరంబు లగునట్లు, జన్మాంతరంబున నయ్యనంతుని తోడి క్రీడా ప్రపంచంబు సద్యస్సమనుభూతం బైన తెఱంగునం దోఁచిన. 75

గ్రక్కునన్ = వెంటనే; ప్రతి+ఉత్పన్న = స్పష్టంగా పుట్టిన; విజ్ఞాన+ఐ = జ్ఞానం కలదై; గృహగత= ఇంట్లో ఉన్న; పదార్థంబులు = వస్తు సమూహం; గృహదీపిక = ఇంటిదీపం; ఆరోపంబునన్= పెట్టటంతో; ఒక్క మాటె = ఒక్కసారిగానే; దృక్ = చూపుకు; గోచరంబులు+అగునట్లు = కన్పించినట్లు; జన్మ+అంతరంబునన్ = మరొక (పూర్వ) జన్మలో; ఆ అనంతుని తోడి = ఆ హరితో; క్రీడా ప్రపంచంబు = విహార సమూహం; ఎల్లన్ = అంతా; సద్యః = వెంటనే; అప్పటికప్పుడే; సమనుభూతంబు = చక్కగా అనుభవింపబడినది; ఐన; తెఱంగునన్ = విధంగా; తోచినన్ = స్ఫురించగా.

ఆ మాట వినీ వినగానే ఆమెకు పూర్వ జన్మ జ్ఞానం కలిగింది. ఇంట్లో సంజ దీపం పెట్టేసరికి చీకటిలో నున్న వస్తువులన్నీ కంటికొకేసారి కన్పించినట్లు దానితో వెంటనే శ్రీకృష్ణునితో ఆమె చేసిన విహారములన్నీ గుర్తుకు వచ్చినవి.

భౌతికజ్ఞానం పుస్తకాదుల ద్వారా క్రమంగా కలిగేది. విజ్ఞానం హఠాత్తుగా గురు ప్రబోధం వల్ల కలుగుతుంది. కనుకనే 4- 202లో యామునాచార్యుడు కూడా శ్రీరంగనాథ దర్శనంతో హఠాదపాస్తభ్రముడైనాడు. ఇందుకే దీపోదాహరణం వచ్చింది.

ఉ. వాలిక కన్నులం బొడము వారి సకజ్జల మాశ్రిత శ్రవో
గోళక మై తదంతికపుఁ గుంతల వల్లికిఁ దల్లి తోడుగా
మైలవలి న్నన ల్నిగుడు మైఁ బులక ల్నిగుడ శ్లథాంగియై
సోలినఁ జూచి డెందములు సుఱ్ఱన హాయని బోటు లర్మిలిన్. 76

వాలిక కన్నులన్ = సోగ కన్నుల్లో; పొడము = పుట్టే; వారి = నీరు; సకజ్జలము = కాటుకతో కలిసినదై; ఆశ్రిత = ఆశ్రయింపబడ్డ; శ్రవోగోళకమై = చెవుల రంధ్రాలుకలదై; తత్ = దానికి; అంతికపు = దగ్గరగా ఉన్న; కుంతల = జుట్టు; వల్లికిన్ = తీగకు; తల్లి తోడుగాన్ = తల్లి వలె బాసట కాగా (నల్లని జుట్టుకు నలుపు లద్దగా); మై లవలిన్ = శరీరమున్న ఏలకి తీగకు; ననల్ = మొగ్గలు; నిగుడుమైన్ = పుట్టినట్లుగా; పులకల్ నిగుడన్ = పులకలు కలిగి; శ్లథ+అంగి+ ఐ = వాడిన అవయవాలు కలదై; సోలినన్ = క్రిందకు వ్రాలిపోగా; అర్మిలిన్ = ప్రేమతో, డెందములు = హృదయాలు; చుఱ్ఱు+అనన్ = చుఱ్ఱుమని కాలిపోగా; (నిప్పుల్లో వస్తువు తగలబడే వేళ వచ్చే ధ్వని అనుకరణ శబ్దం); బోటులు = చెలికత్తెలు; హాయని = అయ్యో! అని.

సోగ కనుల నుండి కారుతూ నీరు కాటుకను కడిగి తెస్తూ చెవుల రంధ్రాల్లో పడుతూ- దగ్గరగా

ఉన్న చెంపల పై జుట్టునకు నైల్యాలద్దుతూ- శరీరం పైన పుల్కలు - తీగకు మొగ్గల్లాగా పొడుచుకొని రాగా- క్రింద పడిన గోదను చూచిన చెలికత్తెలు ప్రేమతో గుండెలవిసి పోగా.

విశే॥ అశ్రువు, రోమాంచము సాత్త్విక భావాలు.

మూర్ఛ- పూర్వరాగావస్థలు 10. (చివరిది మృతి. అది సూచింపబడుతుందే తప్ప వర్ణింపబడదు. వర్ణిస్తే కావ్యం - రసమూ లేవు కదా) అందులో ఈ మూర్ఛావస్థ ఒకటి.

ఉ॥ ఎంతకుఁ దెచ్చెనే సరసిజేక్షణ చెయ్దము! లిందు మీఁద జ
న్మాంతర వర్తనంబు హృదయంబున కిత్తఱి నెచ్చరించి గో
రంతలు గొండలంత లగు నట్లుగఁ జేసితి, మంచుఁ గూపికో
ద్వాంత సతాళవృంతమృదువాత హిమాంబుక ణాళిఁ దేర్చినన్. 77

సరసిజ+ ఈక్షణ = తామర పువ్వు వంటి నేత్రాలు కల గోదాదేవి; చెయ్దములు = చేష్టలు; ఎంతకున్ తెచ్చెనే = ఎంత దుఃఖం తెచ్చినవే!; అయ్యో!; ఇందు మీదన్ = ఇంతకు పైన; జన్మ+ అంతర = పూర్వ జన్మ సంబంధమైన; వర్తనంబు = చేష్ట, ఇత్తఱిన్ = ఈ సమయంలో; హృదయంబునకున్ = హృదయానికి; ఎచ్చరించి = గుర్తు చేసి; గోరు+ అంతలు = కొంచెమైన దాన్ని; కొండ+ అంతలు = పర్వతమంతగా; చేసితిమి (సత్యభామా వృత్తాంతం చెప్పి); అంచున్ = అంటూ; కూపిక = చిన్న గాజు పాత్రనుండి (కూపి+క); ఉత్+వాంత = పైకి చిమ్మబడిన; తాళవృంత = విసనకర్రల; మృదు = సుకుమార; వాత = వాయువులతో; స = కూడుకొన్న; హిమ = చల్లని; అంబుకణ+ ఆళిన్ = నీటి బిందువుల సమూహంతో; తేర్చినన్= మూర్ఛ నుండి తేరుకొనేటట్లు చేస్తే

అయ్యో! ఈమెకు గోరంతలు కొండంతలు చేసి చెప్పి ఎంతకు తెచ్చామమ్మా! ఎలాంటి స్థితి కల్పించామే, దీనికని చిన్న పాత్రల లోని నీరు చల్లిన విసన కర్రలతో మృదువుగా వీచేసరికి ఆమె మూర్ఛ నుండి తేరుకొన్నది.

చేటికా- అని వావిళ్ళ పాఠం. కూపికా - అని వేదంవారి పాఠం. ఇది శిశిరోపచారం.

అలం : గోరంతలు కొండలంతలు లోకోక్తి. ఇందులో అలంకారమేమీ లేదు. 'సౌందర్య మలంకారః' అన్న వామనాచార్యుల నిర్వచనం ప్రకారం హృదయం జల్లుమన్పిస్తే అలంకారం తప్ప లక్షణమున్నంత మాత్రాన కాదు. గణాల కూర్పు పద్యం కానట్లు.

కం॥ తెలిసి కను దెఱచి వెండియు
జలజేక్షణ తన్ముకుందచరణస్మృతిని
శ్చలతఁ గను మొగిచి మఱి య
శ్రులు ఱొప్పలఁ ద్రోవఁ దెఱచి చూచి సఖులతోన్. 78

జలజ+ఈక్షణ = తామర పూల వంటి నేత్రాలు కల గోదాదేవి; తెలిసి = మూర్ఛ నుండి తేరుకొని; స్పృహరాగా, కను తెఱచి; వెండియున్ = మరల; తత్ = ఆ; ముకుంద = శ్రీకృష్ణ; చరణ = పాద; స్మృతిన్ = స్మరణయొక్క, నిశ్చలతన్ = ఏకాగ్రతతో; కను మొగిచి= కన్నులు మూసి కొని; అశ్రులు = కన్నీరు; ఱెప్పలన్ = రెప్పలను, త్రోవన్ = విడలదీయగా; తెఱచి; చూచి; సఖులతోన్.

మూర్ఛ నుండి - అపస్మార దశ నుండి - జాగ్రదవస్థకు వచ్చే విధానం లోని సూక్ష్మత వర్ణింపబడినది స్పృహ రావటం - కన్ను తెఱవటం - మరలా నారాయణ రూప ధ్యానంతో కన్నులు మూసినా కన్నీరు రెప్పలను తోసుకొని ప్రవహించటం వల్ల కళ్ళు తెరవక తప్పలేదు.

ఈ వర్ణన లోని ఈ క్రమ సౌందర్యం భావించాలి.

కం. **మీ రెవ్వ రనుటయును, శృం**
**గారిణి ! మే మురగ కన్యకల, మింతకు ము**
**న్ధారుణి కేతెంచితి; మన**
**నారామలఁ గౌఁగిలించి, యార్తి న్బలికెన్.** **79**

మీరు, ఎవ్వరు; అనుటయున్ = అనగానే; శృంగారిణి = శృంగార రస స్వరూపిణీ! ; మేము; ఉరగ కన్యకలము = నాగ కన్యకలము కదా, ఇంతకు మున్ = ఇప్పటికి ముందే; ధారుణికిన్ = భూమికి; ఏతెంచితిమి = వచ్చాము, అనన్ = అంటే; ఆ రామలన్ = ఆ సుందరులను; కౌగిలించుకొని; ఆర్తిన్ = దుఃఖముతో; పలికెన్.

శృంగారిణీ ! సంబోధన ఆమెలోని రతి స్థాయి అనుభావ పారమ్య స్థితిని ధ్వనించే సంబోధన. రసానుభవం పాత్ర - పాత్రధారి - ప్రేక్షకుల కొకేసారి కల్గుతుంది వ్రాసిన కవికి రచన వేళలో కలుగుతుంది.

**నాయకస్య, కవేః శ్రోతః సమానానుభవః తతః** - ( నాయకునకు - కవికీ - శ్రోతకు సమానానుభావం కల్గుతుంది) అని తమ గురువులైన భట్టతౌతుల మాటగా అభినవులన్నారు.

**అట్టిమురారి కప్పుడనుగ్గై మఱియీకలివేళఁ గ్రమ్మఱం**
**బుట్టి వియోగవేదనలఁ బొక్కెడు నీతనువేల? తండ్రిదా**
**నిట్టగునన్ను నింకొకని కియ్యక తొల్తన యోగశక్తిఁ బో**
**బెట్టెదదీనివెండియు నుపేంద్రపదాంబురుహంబెము ట్టెదన్** **80**

అట్టి = 74వ పద్యంలో చెప్పబడిన; సత్యభామా విధేయుడైన; మురారికిన్ = కృష్ణునకు, అప్పుడు; అనుగ్గై = ప్రేయసినై; మఱి = ఇక ( విరుద్ధంగా); ఈ కలి వేళన్ = ఈ కలికాలంలో; క్రమ్మఱన్ = తిరిగి; పుట్టి, వియోగ వేదనలన్ = విరహబాధలతో; పొక్కెడు = సతమతమయ్యే, ఈ, తనువు = శరీరం, ఏల? = దేనికి ?, తండ్రి = విష్ణుచిత్తుడు; తాను; ఇట్టు+అగు = ఇలాంటి; నన్ను; ఇంక; ఒకనికిన్ =

మరొకనికి, ఇయ్యక తొల్తనన్ = ఇవ్వకముందే; దానిన్ = దేహాన్ని; యోగశక్తిన్ = యోగశక్తితో; పోన్+పెట్టెదన్ =నశింపచేస్తాను; వెండియున్ = తర్వాత; ఉప+ ఇంద్రుని = ఇంద్రుని తమ్ముడు; (వామనుడు - త్రివిక్రముడు); పద+అంబురుహంబె = పాద పద్మాన్నే, ముట్టెదన్=పట్టుకొంటాను (సేవిస్తాను).

అలాంటి శ్రీకృష్ణునకు అప్పుడు అంత కూర్చు దాననై మరి ఈ కలి వేళ జన్మించటమే పాపం. పైగా విరహవేదనలో మాడిపోతూ బ్రతుకుతూ, తండ్రి గారు నన్నొకని కివ్వకముందే ఈ శరీరాన్ని యోగ శక్తితో ధ్వంసం చేసుకోవటం ఉత్తమం. ఆ తర్వాత మరలా ఆ స్వామి పాదాల దగ్గరకే పోవచ్చు - సేవించుకోనూ వచ్చు.

విశే॥ దశావస్థల్లో చివరి అవస్థ=మృతి సూచితం.

కం. అది యొండె భక్తి, యెవతే
నెద విశ్లేషైక భీరు వృత్తిఁ బ్రియాలా
భదశ నెమ్మెయిఁ దొరఁగించిన
హదనన యదిగాక యున్న యవి వైశికముల్. 81

ఎవ్వతె = ఏ స్త్రీ; ఎదన్ = హృదయంలో; విశ్లేష = ఎడబాటు; ఏక = ముఖ్యమైన; భీరు వృత్తిన్ = భయభావంతో; (ముఖ్యంగా ఎడబాటే భీతి కారణం); ప్రియ = భర్త; అలాభదశన్= లభించనపుడు, మెయిన్ = దేహం; తొరగించినన్ = త్యజిస్తే; హదనన = సమయంలోనే; అది ఒండె భక్తి = అదొక్కటే భక్తి; అది; కాకయున్నన్ = కాకపోతే; అవి; వైశికముల్ = నటనలు.

ప్రియుడు దూరంగా ఉండి; విరహ భీతితో బ్రతకటం కంటె శరీరాన్ని త్యజించటం భక్తి తప్ప- మిగిలిన వన్నీ నటనలు.

అలం : ఆక్షేపం.

తే. అనిన వారలు పల్కి, రా యదువతంస
మెందుఁ జన్నాఁడు ? విను రంగ మంద నిల్చె;
వేగపా టేల ? యతఁడ నీ విభుఁ డగుటకు
నర్చనాదుల నివ్విటి హరి భజింపు. 82

అనినన్; వారలు = నాగకన్యలు; పల్కిరి; ఆ యదువతంసము = ఆ యాదవ శ్రేష్ఠుడు; ఎందుఁజన్నాడు= ఎక్కడకు వెళ్ళినాడు ?; విను; రంగము+అందె = శ్రీరంగంలోనే; నిల్చెన్= ఉన్నాడు; వేగపాటు = తొందరపాటు (మరణించాలనుకోవటం); ఏల = దేనికి; అతఁడ = కృష్ణుడే; నీవిభుఁడు=నీ భర్త; అగుటకున్ = కావటానికి; భజింపు = సేవించు.

ఆ కృష్ణుడెక్కడకు పోయినాడు కనుక చావటానికి. అది తొందర పాటు పని. ఆయన శ్రీరంగంలోనే ఉన్నాడు. ఆయనే నీ భర్త. కావాలంటే ఈ నగరంలోని విష్ణువును సేవించు.

విశే ॥ ప్రథమాశ్వాసంలో చెప్పిన మన్నారు స్వామి అర్చామూర్తి. కృష్ణుడు అవతారం = విభవమూర్తి, అదెప్పుడూ అందబాటులో ఉండదు. పంచమూర్తుల్లో సర్వులకు సర్వ వేళలా అందుబాటులో ఉండే స్వామి అర్చావతారమే అన్న మత విషయం కూడా సంభావ్యమే.

శాకుంతలంలో విరహిణి యైన శకుంతలతో ప్రియంవదాఅనుసూయలు- రాజునకు ప్రణయ లేఖ వ్రాయుమనటం వంటిదే ఇప్పటి హరి భజింపుము - అన్న మాట.

చ॥ అలుకకు మన్న(న్ దేఱె; మఱి యంతట నుండియు వేళవేళనె
చ్చెలు లిడు తెల్వులు న్మగుడ( జింతలసంతమసంబులు న్సమా
కలితత మించె సొమ్మిడని కార్శ్యమునన్ హృదయంబున న్సదా
పలపలగా(గ నీలముల బన్నసరం బయి నిర్మలాంగికిన్. 83

అలుకకుము = భీతి చెందకుము; అన్ననన్ = అని ఓదార్చినంతనే, తేఱెన్ = కలత తీరినది; మఱిన్ = ఇక; అంతట నుండియున్ = అప్పటి నుండీ; వేళ వేళన్ = ప్రతివేళా; నెచ్చెలులు (నెఱ+చెలులు) = చెలిమి కత్తెలు; ఇడు = కల్పించు; తెల్వులున్ = ప్రబోధములన్న పగళ్ళు (తెలుపులు); మగుడన్ = మరలా; చింతల = వేదనలన్న, సంతమసంబులున్ = చీకట్లూ, సమాకలితతన్ = చక్కగా కూడు కోవటం వల్ల, సొమ్ము = నగలు; ఇడని = పెట్టని; కార్శ్యమునన్ = కృశత్వంలో; నిర్మల+అంగికిన్ = శుభ్రదేహకు; హృదయంబునన్ = ఎదలో; సదా = ఎప్పుడూ; పలపల కాగన్ = విరళ విరళంగా (దూరదూరంగా); నీలముల = ఇంద్రనీలాలు కూర్చిన; బన్నసరంబు = ముత్యాల హారము; ఐ; మించెన్ = అందగించింది.

చెలులు ఓదార్పు మాటల కామె ఊరడిల్లినది. ఇంక తర్వాత మాటి మాటికీ చెలులు కల్గించే ఊరటలు - ఓదార్పులు తెలుపులు తెలుపులై (తెలివి+లు) మరలా వారు లేనపుడు తనలో తాను కల్పించుకొనే ఆలోచనలు- వేదనలన్న చీకట్లు- చక్కగా కలిసిన వెలుగు చీకట్లో అన్నట్లు ఇంద్ర నీలాలు- ముత్యాలు ఎడమెడంగా కూర్చి కట్టిన బన్నసరంలాగా నిర్మలాంగికి అందగించినది.

ఆమె విరహంలో సొమ్ములు ధరించటం లేదు కనుక ఈ హారం కాలస్వరూపుడైన భగవంతుడు చేయించినట్లుగా ఉంది. (ఈ భావానికి చూ. 4-21) గొప్ప నిరూప భావన.

ఈ కావ్యంలో మేలి జాతి భావన గల పద్యం. నిర్మలాంగి కనుక ఈ తెలుపు నలుపులు హృదయంలో భావవర్ణాలు. సుఖ దుఃఖాలే తెలుపు నలుపులు. కనుక హృదయ గత భావాలు అంగ స్వచ్ఛత వల్ల శరీరం మీద కన్పిస్తూ నీలాల బన్న సరమైనది. గాజుకుప్పె లోపలి వెలుగు బైటకు ప్రసరించినట్లుగానని భావం.

చూ. కావ్య ప్రారంభ పద్యం: 4-158.

చూళిక: -

ఇతర కవులు చంద్రాద్యుపాలంభనం చేయిస్తే తమ కావ్య నాయికలతో; ఈ కవి మాత్ర మా మార్గం పోక - రాబోయే నాల్గు పద్యాల్లో కాల స్వరూపుడైన భగవంతుడామె రతి భావోద్దీపనం కల్గిస్తున్నాడని చెప్పబడుతున్నది. ఆ విరహాలాపం నాల్గే పద్యాలు. చత్వారి వాక్- వాక్కు నాల్గు విధాలన్నట్లు. ప్రాతఃకాలంతో మొదలైన దినం నిశలో లీనమౌతున్నది కనుక, మధ్యాహ్నం - సాయాహ్నంతో కలుపుకొని నాల్గు కాల ఖండాలూ ఆమెకు విరహోద్దీపన సామగ్రియే. ప్రతి దినమూ ఇంతే- కవి నిశా కాల విరహంతో ప్రారంభించటం లోని సొగసు- చింతల సంతమసంబులన్ - అన్న పై పద్యభావ విశదీకరణం.

తే. ఎలసి యేప్రొద్దుఁ గనుపొంద నీక మరుడు
కలహమున కంకకాఁ డయి కాలుద్రవ్వఁ
బాండుబహుళక్షపాపరంపరలు వెడల
కింటిలో నేదుముల్లయ్యె నిందుముఖికి. 84

మరుడు = మన్మథుడు; ఎలసి = సమీపించి (పొంచి); ఏ ప్రొద్దున్ = ఏ వేళా; కనుపొందనీక = రెప్పపాటు కలుగనివ్వక; అంకకాడు = (అంకము+కాడు) = పట్టుదల గలవాడై; కలహమునకున్ = కయ్యానికి; కాలు ద్రవ్వన్ = నేల మీద పాదంతో కొట్టటం (పశువులు కోపంతో ఎదుటివాని పైకి దూకే ముందు నేలను గిట్టతో త్రవ్వటం సహజం); ఇందు ముఖికిన్ = చంద్రవదనకు; పాండు = శుక్ల (తెల్లని); బహుళ = కృష్ణ పక్ష;క్షపా = రాత్రుల; పరంపరలు = వరుసలు; వెడలకన్ = జరుగక; ఇంటిలోన్ = ఇంట్లో పెట్టిన; ఏదుముల్లు+అయ్యెన్ = ముండ్ల పంది ముల్లైనది.

ఏదు ముల్లు చూరులో గ్రుచ్చితే నిత్యమూ ఆ గృహంలో పోట్లాటలే జరుగుతాయని విశ్వాసం. నిశా కాలాల్లో ఆమెకు నిద్రలేదు. మన్మథుడు ఆమెను నిద్ర పోనివ్వక నిత్యమూ కలహానికి కాలు ద్రవ్వుతుంటే- శుక్ల కృష్ణ నిశల సమూహమంతా నిద్రలేని రాత్రులౌతున్నాయి. ఇదెలాంటి దంటే ఏదు ముల్లున్న ఇల్లు ఏ విధంగా కలహమయమౌతుందో అలాగ మదను డామెతో కలహిస్తున్నాడు.

అలం : పరిణామం.

మ॥ తలిరుంగైదువు జోదునానతి వధూ ధైర్యంపుఁ బెన్కోటఁ గం
దళితాహర్ముఖయంత్రకారుఁ డలుక న్నానాఁటికిం ద్రెల్లఁ గో
మలమార్తండమరీచి దీపకలికోష్మం జూడి యేయుం దళ
ద్దళ పాథోరుహలోహనాళకుహరోద్యచ్చంచరీకాశ్మముల్. 85

తలిరుంగైదువు = చిగురాకు బాకు (కల); జోదు = యోధుని (మరుని); ఆనతిన్ = ఆజ్ఞతో; కందళితః అప్పుడే అంకురించిన, అహర్ముఖ = ప్రాతఃకాలమన్న, యంత్రకారుడు= శతఘ్ని ప్రేల్చేవాడు; అలుకన్ = కోపంతో; వధూ = గోదా; ధైర్యంపుఁ బెన్కోటన్ = స్థిరత్వ మన్న పెద్ద కోటను; నానాటికిన్ = రోజు

రోజుకు, త్రెళ్ళన్ = పడిపోగా; కోమల = సూక్ష్మమైన; మార్తండ = సూర్యుని; మరీచి = కిరణమన్న; దీపకళిక = దీపజ్వాల; ఊష్మన్ = వేడితో; చూడి = ముట్టించి; దళత్+దళ = విరిసే రేకులున్న; పాథోరుహా = పద్మము (యొక్క); లోహనాళ కుహర = ఇనుముతో చేసిన గొట్టపు కడుపులోనున్న; ఉద్యత్ = ఎగురుతున్న; చంచరీక = తుమ్మెదలన్న; అశ్మముల్ = ఇనుప గుండ్లు; ఏయున్ = ప్రయోగిస్తున్నాడు.

దొర ఆజ్ఞాపిస్తే, ఫిరంగి ప్రేల్చేవాడు గుండ్లను ప్రేలుస్తున్నాడు. ఇక్కడ దొర మరుడు- చిగురాకు ఆయుధంగా గల దొర - ప్రేల్చేవాడు ప్రాతః కాలం. ఫిరంగి పద్మం. గొట్టం తామరకాడ. పద్మంలో రాత్రి నిద్రపోయి అది విచ్చుకోగానే బైటకు ఝుంకార ధ్వనితో గుంపులై బయటకు ఎగిరివచ్చే నల్లని తుమ్మెదలు ఫిరంగి గుండ్లు - ముట్టించేది సూర్యకిరణ మన్న దీపకళిక. అది వచ్చి తాకేసరికి పద్మం వికసించింది. తుమ్మెద బారులు ఎగిరిపోతున్నాయి. ప్రాతఃకాల సౌందర్య వర్ణన దృశ్యం చెరువులో పద్మ వనం, విచ్చుకొనే పూలు, ఎగిరే తుమ్మెదలు. ఈ అందమంతా ఆమెకు ఉద్దీపన సామగ్రి. అందం బాధా హేతువెలాగా ? అంటే ఆమె ధైర్యమన్న పెద్ద కోటగోడను ప్రేల్చివేయటానికింత సన్నాహం చేస్తున్నాడు. మన్మథుడు, శృంగారం వీరాంగముగా వర్ణింపబడటం చిత్రంగా ఉంది.

కావ్యం మీద కవిరాజ ముద్ర ఉంది. ఇలాంటివి చాలా చోట్ల గుర్తించబడ్డాయి.

అలుకన్ - పీఠికలో 42 వ పద్యంతో పోల్చు. ఇంకా ఈ ఆశ్వాసాంత పద్యంతో సహా

''సమ్యగ్లక్షణ ధీనిబంధనవిధాసంక్రంద నాచార్య . . . . . భాగుమ్మత్తూరి శివం సముద్ర పురవప్రోర్మీల నాడంబరా . . . .'' పారిజాతాపహరణం ఆశ్వాసాంతం.

ఉమ్మత్తూరు శివసముద్రపు కోటలు కావేరి మధ్యలో ఉండేవట. వాటిని 1509 లో రాయలు జయించాడు. ఆ యుద్ధ వర్ణన మీ పద్యం. కావేరి నీటిని బయటకు వాళ్ళు దీయిస్తూ ప్రవాహాన్ని మళ్ళించే వాళ్ళు మళ్ళిస్తున్నారు. కోటగోడను ప్రేల్చేవారు ప్రేలుస్తున్నారు. ధానుష్కులు కోటగోడపై నున్న శత్రుసైనికులపై బాణప్రయోగం చేస్తున్నారు. ఇంత ఆశ్చర్యంగా ఉన్నదట ఆ యుద్ధం. అందుకని 'ఆడంబరా' అన్నాడు మహాకవి.

ఇలాంటి యుద్ధాలు ''తలిరుంగైదు''వన్న పద్యాన్ని వ్రాయించాయి.

అలుకన్ - కోపం దేనికంటె కోటగోడ ఎన్నాళ్ళు ప్రేల్చినా కూలిపోనందుకు.

రోజూ ప్రాతఃకాల మిదే యుద్ధం వరుస. ఉదయగిరి దుర్గం జయించటానికి రాయల వారికి 9 నెలలు పట్టిందట. అది గిరి దుర్గం కనుక. దీనికి 1 వ ఆశ్వాసాంతా పద్యంచూడు. వధూ ధైర్యంపు పెన్ కోట (పెద్దకోట) కనుక నానాటికి ప్రేల్చక తప్పటం లేదు అలుకతో.

కోమల : సూర్యకిరణం బహు నిశితమైనది. సుకుమారమూ - సూక్ష్మమూ కనుక. దళద్దళ- బడబడా గుండ్లు పడుతున్నవి. దానికిది వ్యంజక శబ్దం.

అలం : రూపకం.

తే. పొంత ఘటయంత్రసరముఁ ద్రిప్పుచు జపించు
మగువ ధృతి దూల మధ్యాహ్న మంత్రవాది
సురుచిరవితానదంభ కౌసుంభ ధారి
తుహినధారాగృహాంగి బిందువులు సెదర. 86

మధ్యాహ్న మంత్రవాది = మిడివేళ అన్న మాంత్రికుడు; మగువ = గోదాదేవి; ధృతి = ధైర్యం; తూలన్ = చెదరిపోగా; పొంతన్ = ప్రక్కనే, ఘటయంత్ర = కుండలయంత్రమన్న; సరమున్= జప సరమును, త్రిప్పుచున్ = త్రిప్పుతూ;సురుచిర = కాంతివంతమైన; వితాన = చాందినీ; దంభ = మిషతో, కౌసుంభధారి = ఎర్రని వస్త్రం ధరించినవాడు, తుహిన ధారా గృహ = మంచు వలె చల్లనైన ధారా గృహమే; అంగి = శరీరం కలవాడు; బిందువులు = ధారా గృహంలో ఘట యంత్రం నుండి పడే నీటి తుంపుర్లు (నోటి నుండి రాలే తుంపుర్లు) చెదరన్ = ఎగిరిపడుతుండగా; జపించున్ = మంత్రం జపిస్తున్నాడు.

మధ్యాహ్న వేళల్లో ఆమె ధారా గృహంలో విశ్రాంతి తీసుకొంటున్నది. ఆ శైత్య ధారలూ - గృహోపరి భాగంలో కన్ను చెదిరేటంత ఎరుపు కల - చాందినీ వస్త్రం - విరహతాపాన్నే పెంచుతున్నది. ఈ దృశ్య మెలా ఉన్నది ? - ఎరుపు వన్నె కల వస్త్రం కట్టి - చేతితో జపమాల త్రిప్పుతూ - ఒంటి నిండా విభూతి దాల్చిన మాంత్రికుడు - నోటి తుంపుర్లు చెదరుతుండగా - మంత్రం జపిస్తున్నట్లున్నాడా ? లేకపోతే చల్లదనం తాపకారణ మెలా ఔతుంది ?

ధారా గృహమే మాంత్రికుని శరీరం. తుహిన బిందువుల విభూతి. ఘటయంత్రమే సరము. అని చిమ్మే ధారలే తుంపుర్లు - నోటి నుండి చెదరపడుతున్నవి.

ధారాగృహాలు ప్రాచీన వాస్తు వైభవాలు. నేటికీ హంపీలో కన్పిస్తున్నవి. దిగుడు బావి చుట్టూ భూగృహాలుగా - గదులుగా - కట్టబడేవి. ఘటయంత్రాలు అంటే - కుండల వరుసలు త్రాడుకు కట్టి - మాలగా గుండ్రంగా - దాన్ని గిలక మీదుగా త్రిప్పుతుంటే - కొన్ని కుండలు క్రిందికీ - కొన్ని పైకి వస్తాయి. పైకి వచ్చేవి నీటిని ముంచుకొని వచ్చి క్రుమ్మరిస్తే- ఖాళీ కుండల వరుసలు క్రిందికి దిగుతాయి. ఇదొక విధమైన మోట. మోట అయితే ఒకే బాన ఉంటుంది. దీనికనేక కుండలుంటాయి. ఈ యంత్రంతో నీళ్ళు క్రుమ్మరించుకొంటూ ఉండే చల్లని గృహాలు - ధారాగృహాలు.

ఈ పద్యాలన్నీ - సుందర దృశ్య వర్ణనలు - చల్లనివీ - అందమైనవీ తాపకారణాలు ఎలా కాగలవు. తాపమన్న కార్యానికివి సూక్ష్మ కారణాలు. కనుక కావ్యలింగం అలంకారం. లింగ మంటే సంకేతం. తర్కంలో లింగాలున్నాయి. అవి శాస్త్ర విషయాలు, కావ్యలింగమంటే సాహిత్య విషయికమైనవి. కనుక కావ్య శబ్దం విశేషణంగా చేర్చబడినది.

ఉ. తామరసాప్త తామ్రముఖి దంష్ట్రితవిస్ఫుటమల్లి హల్లక
స్తోమరజశ్ఛటాంగక, మధుద్యుతితార, వియద్ద్రుచంక్రమో

ద్దామ, పితృప్రసూ ప్లవగి, దైన్యరుతోత్థరథాంగపోత, చిం
తామయ నిద్రలం బొలసి తాపము సేయఁ దొడంగె నింతికిన్. 87

ఇంతికిన్ = గోదాదేవికి; చింతామయ = తాపమయమైన; (చింత+ఆమయ = చింతతో కలిగే వ్యాధి అనెడి నిద్ర - వేదం); నిద్రలన్ = నిద్రల్లో; పితృప్రసూప్లవగి = సాయం సంధ్య యనే ఆడు కోతి, పొలసి = కన్పించి; తాపము సేయ దొడంగెన్ = విరహ తాపాతిశయాన్ని కల్గిస్తున్నది.

ఇది తాత్పర్యం. దీని పైన కట్టిన ఊహ పద్యం. ఆ కోతి ఎక్కడిది ? ఎలా ఉంది ? - సాయం సంధ్యయే ఆ కోతి. దానికి తామరస+ఆప్త = పద్మప్రియుడైన సూర్యుని వలె; తామ్రముఖి = ఎర్రని ముఖం కలది; దంష్ట్రిత = దంష్ట్రలుగా మలచబడిన; విస్ఫుట = విచ్చిన; మల్లి = మల్లె మొగ్గలు కలది; హల్లకస్తోమ = ఎర్రకలువల; రజశ్ఛట = పుప్పొడి రాశి; అంగక= అవయవాలుగా కల్గినది; మధు ద్యుతి తార = తేనె వన్నె కన్నుగ్రుడ్లు (నక్షత్రాలు) గలది (తారకలే తారలు అందే కంటి పాపలు); వియత్ = ఆకాశమన్న; ద్రు = చెట్టు పైకి; చంక్రమ = దూకే; ఉద్దామ = విశృంఖలమైనది; దైన్యరుత = దీనమైన ఏడ్పుతో; ఉత్థ = లేచిన, రథాంగ పోత = చక్రవాక శిశువులు కలది.

దాని ఎఱ్ఱని ముఖం సాయం సూర్యుడు. పండ్లు విప్పుతున్న మల్లె మొగ్గలు, దాని శరీరం ఎర్ర కలువల పుప్పొడి, కనుగ్రుడ్లు తేనె వన్నెల చుక్కలు (సాయం కాల కాంతిలో తెల్లని చుక్కలు మధు వర్ణం కలవైనాయి). ఆకాశమన్న చెట్టు మీద ప్రచండంగా దూకుతున్నది. ఏడుస్తూ లేస్తున్న జక్కవల సంతానమే శిశువులుగా కలది. ఆ సాయం సంధ్యా ప్లవగి చింతల సంతమసంలో - కలత నిద్రలో కన్పించి దుఃఖహేతువైనది. స్వప్నంలో కోతి కన్పిస్తే బ్రతుకులో చెరుపు కల్గుతుందని సుందర కాండలో చెప్పబడినది. సీతమ్మ ఆంజనేయుని చూచి అనుకున్నదట. దానిపై కట్టిన కట్టడం ఈ పద్య రత్న సౌధం - మలయకూటం.

ఉపమాన సామగ్రి అత్యంతోచితం. తామ్రముఖం - సాయంకాల రవిబింబం. మల్లెలు - దంష్ట్రలు. (కోతి నోరెప్పుడూ ఇకిలిస్తుంది కనుక బైటపడ్డవి). హల్లక రజస్సు - శరీరచ్ఛాయ. (కలువలు వికసించే సమయం కనుక హల్లకం వాడబడినది).

తారకలు - తారల కనుగ్రుడ్లు. మధుద్యుతి - సంధ్యారక్తిమ కనుక చుక్కలలాగే ఉంటాయి. వియత్ - ద్రుమం (సుందరకాండలోను హనుమ శింశుపావృక్షం మీదుండే సీతమ్మకు కన్పించాడు). ఆకాశం వృక్షంపై భాగంలాగా ఉంటుంది కనుక.

హంపీలో రాయలవారి గురువు వ్యాసరాయుల బీజాక్షర సంపుటిలో యంత్రమూర్తిగా హనుమంతుని స్థాపించారు. వారే సుప్రభాతం వ్రాసారు. నేటికీ అది పఠింపబడుతున్నదట. మంత్రాక్షరాల నుండి దైవమూర్తి ఏర్పడినట్లు ఇక్కడ మర్కటత్వం ప్రకృతిలో అయా పదార్థాల నుండి నిష్పన్నం చేయబడినది. దైవమంటే అంతే. ఆ యంత్ర హనుమబీజాక్షర రూప ఆంజనేయ మూర్తి వర్ణనమే ఈ పద్యం.

వ్యాసరాయలు కొన్ని వందల హనుమంతుని గుడులు కట్టించాడట. అంతకు పూర్వం హనుమ విగ్రహాలు పార్శ్వమూర్తులట. వ్యాసరాయలే భక్తున కున్ముఖంగా ఉండే ప్రత్యక్ష మూర్తులను చెక్కించినట్లు చరిత్ర.

ఈ పద్యం దానికి కీర్తి పతాక. చరిత్రనూ, మతాన్ని కావ్యంగా మలిచే ప్రతిభా శక్తి

వ॥ ఇతెఱంగున సకలకాలంబుల నారటంబున కూఱటఁగానకుండియు
నప్పుండరీకాక్షి యందుండు నప్పుండరీకాక్షు నారాధనంబున
నారాధారమణుఁగ్రమ్మఱఁజెంద డెందంబునం దలచి 88

ఈ; తెఱంగునన్ = విధంగా; సకల కాలంబులన్ = అన్ని వేళలా; ఆరటంబు = ఆరాటం (తాపం); ఊఱట = ఓదార్పు); ఆ; పుండరీక+అక్షి = తామరసనేత్ర; పుండరీకాక్షు = శ్రీవిష్ణుని; ఆరాధనంబునన్ = అర్చనతో; రాధారమణున్ = శ్రీకృష్ణుని; క్రమ్మఱన్ = మరలా; చెందన్ = పొందటానికై; డెందంబునన్ = హృదయంలో.

సీ. పద్మాస్య ప్రతిదిన ప్రత్యూషమును మౌన
నియతి మేల్కని, సఖీచయము మ్రోల
హేమపాత్రిక హరిద్రామలక్యాదిక
స్నానీయ వస్తు వ్రజంబుఁ గొనుచు,
ధౌతాంశుకంబులు తడి యొత్తులును దేర,
నంతః పథంబున నరిగి, నిజగృ
హారామదీర్ఘిక ననుసంహిత ద్రావి
డామ్నాయయై స్నాన మాచరించి,

తే. పర్జనీలేశ పూర్ణ సౌభాగ్యదాంగ
ధూతి చకచక లీ రెండతోడ మాఱు
మలయు, నిడు వెంద్రుకల గుంపు మలఁచి వైచి
వేగ వెడవెడ దడియొత్తి, విధియుతముగ. 89

పద్మ+ఆస్య = తామర పుష్పంవంటి ముఖం కలది - గోదాదేవి ప్రతిదిన ప్రత్యూషమునున్= ప్రతిరోజూ ప్రాతఃకాలంలో;( బ్రాహ్మముహూర్తం - సూర్యోదయానికి రెండు ముహూర్తాల ముందు) మౌన నియతిన్= మౌన వ్రతంతో; మేల్కని = లేచి; సఖీచయము = చెలుల సమూహం; హేమపాత్రికన్ = బంగారు పాత్రలో; హరిద్రా = పసుపు; ఆమలకి = ఉసిరిక; ఆదిక = మొదలైన; స్నానీయ వస్తు = స్నానోపయుక్తాలైన వస్తువుల; వ్రజంబు = మొత్తం; ధౌత+అంశుకంబులన్ = ఉదికిన తెల్లని వస్త్రాలు; తడి ఒత్తులున్ = తడిని తుడుచుకొనేవి; మ్రోలన్ = తనకు ముందుగా; కొంచున్ = తెస్తూ; తేరన్ =

తీసుకొనిరాగా; అంతఃపథంబునన్ = (ఎవ్వరికీ కన్పించకుండా); దొడ్డిదారి గుండా (లోపల మార్గంలో); అరిగి = పోయి; నిజ = తను; గృహ+ ఆరామ దీర్ఘికన్ = ఇంటి తోటలోని దిగుడుబావిలో; అనుసంహిత ద్రావిడ+ ఆమ్నాయయై = పఠింపబడిన దివ్య ప్రబంధం కలదై; స్నానమాచరించి = స్నానం చేసి; పర్ణనీ = పసుపు; లేశ= పొడికి; పూర్ణ = సంపూర్ణ; సౌభాగ్యద = కాంతి అందాన్నిచ్చే; అంగ = శరీరావయవాల; ధూతి = కదలికలతో కలిగే; చకచకలు = నైగనిగ్యం; (పసుపు కొంచెం పెట్టుకొని స్నానం చేయగానే ఆమె తను కాంతి పసుపుకే వన్నె పెట్టేది కాగా, ఎండలో చకచకలీనుతున్నది); ఈ రెండ తోడన్ = లేత ఎండతో; మాఱు మలయున్ = ఎదురు నిల్వగా; నిడు = పొడవైన; వెంద్రుకల గుంపును; మలచి = ముడిచి; వైచి = వెన్కకు వేసి; వేగన్ = త్వరగా; వెడ వెడ = పొడి పొడిగా; తడియొత్తి = తుడుచుకొని; విధియుతముగన్ = శాస్త్రరీతిగా.

ప్రతి ప్రాతఃకాలంలోను మౌనంగా లేచి లో త్రోవల గుండా ఇంటి పెరట్లో ఉన్న దిగుడుబావికి స్నానార్థమై చెలికత్తెలు - దాసీలు - బంగారు పాత్రల్లో పసుపు - ఉసిరిక వంటి స్నానావసరమైన పదార్థాలు, ఉదికిన బట్టలు కూడా తీసికొని తనకు ముందు నడుస్తుండగా - పోయి, స్నానం చేసేది. ఎండలోకి వచ్చి నిడుద కేశ పాశం తుడుచుకొని - వెనుకకు ముడుచుకొని మౌన నియతి - దేవతా ధ్యానంతో మేల్కోవటం విధి.

ద్రావిడామ్నాయము - దివ్య ప్రబంధం. అప్పటికి వచ్చిన ఆళ్వార్ల దివ్యస్తోత్రాలు. పే - భూత - పొయిగై - విష్ణుచిత్తాదుల రచనలు.

పోల్చి - 1-83 అక్కడ అరటి దొన్నెలు. ఇక్కడ హేమపాత్ర.5-36 లో పసుపు వన్నె శరీర కాంతి ముందు వెలవెలపోతున్నది.1-64 లో 'లోత్రోవలు'.

కథాగమనం కోసం వ్రాసిన ఇలాంటి పద్యాలు చాలా అందమైనవి. చూ. 5-37,38.

ఉ॥ కుందరదాగ్ర నెన్నొసల గుమ్మడిగింజ తెఱంగు పాండుమృ
ద్బిందువుఁ దీర్చి, చెందిరము పేచకి శీర్షము పై బలె న్గటిం
జందుర కావిజీ బమరఁ జల్లని రేయిటి తట్టుపు న్నళి
న్విందులఁ దేల్ప, నూనెముడి వెంద్రుకలుఁ దడి తావు లీనఁగ౯. 90

కుంద = మల్లె మొగ్గ(లవంటి); రద+ అగ్ర = పంటి చివళ్ళు కలది (గోద); నెఱ+నొసలన్= అందమైన నుదుటిపై; పాండు = తెల్లని; మృత్ = మట్టితో; బిందువున్ = బొట్టును; గుమ్మడిగింజ; తెఱంగు = వలె; తీర్చి = దిద్ది; పేచకి = ఏన్గు; శీర్షము పైన్ = కుంభస్థలం మీద; చెందిరము బలెన్ = సిందూరపు పూతలాగా; కటిన్ = నితంబసీమపై; చందుర = కుంకుమ వన్నె; కావిజీబు = జిలుగు కావి చీర; అమరన్ = ఒప్పిదం కాగా; చల్లని; రేయిటి = రాత్రి; తట్టుపున్గు = తట్టి తీసిన మేలిపునుగు; అళిన్ = తుమ్మెదలను; విందుల తేల్పన్ = ఆతిథ్యమిస్తూండగా; నూనెముడి = దూముడి; వెంద్రుకలున్; తడి తావులు = తడి వాసనలు; ఈనగన్ = వెదజల్లుతుండగా.(వెంద్రుకలన్- తడి-తావులీనగన్ అనీ చెప్పవచ్చును)

మల్లె మొగ్గలవంటి దంతాగ్రలు కల గోదాదేవి; అందమైన ఫాలం మీద నాముతో గుమ్మడి గింజ బొట్టు పెట్టుకొని; కటి మండలకి చుట్టిన సన్నని కావి చీర - ఏన్గు కుంభస్థలం మీద అలమిన కుంకుమ పూత వలె అందగిస్తుంటే; రాత్రి; శరీరానికి రాసుకొన్న మంచి పునుగు వాసన లీనుతూ తుమ్మెదలకు విందులిస్తుండగా నూనెముడితో వెంద్రుకలు తడి వాసనలు వెదజల్లగా.

కుందరదాగ్రాలకు - గుమ్మడి గింజనాము బొట్టుకు స్పర్ధ.

ఏన్గుకుంభస్థలానికి - రెండు దిబ్బలుగా ఉంటుంది కనుక నితంబ ద్వయికీ స్పర్ధ.

నూనెముడి - పై పద్యంలో నిడుద వెంద్రుకలు మలచి వెన్కకు వైచినదిదే. ఆమె కేశపాశ సౌందర్యము నాన్యతో దర్శనీయము - అన్నట్లు మాటిమాటికీ ఏమరక చెప్పటం భావించాలి.

నెన్నొసలు - అనటంలో అందం - కన్బొమల మధ్య - నొసటి పైన.

తే॥ బోటి గట్టిన చెంగల్వ పూవుటెత్తుఁ
దరుపరిణతోరు కదళమంజరియుఁ గొనుడుఁ,
బోయి, గుడి నంబి విజనంబుఁ జేయఁ జొచ్చి
మ్రొక్కి వేదికఁ బలువన్నె మ్రుగ్గు వెట్టి. 91

కట్టిన; చెంగల్వపూవు+ఎత్తు = ఎర్రకలువల దండను; తరు = చెట్టునే; పరిణత = పండిన; ఉరు = పెద్ద; కదళి మంజరియున్ = అరటిగెల; బోటి = చెలికత్తె; కొనుడున్ = తీసుకొనిరాగా; పోయి = గోదాదేవి వెళ్ళి; నంబి = పూజారి; విజనంబు = జనం లేకుండా; చేయన్ = చేస్తే; చొచ్చి = ప్రవేశించి; మ్రొక్కి; వేదికన్ = విగ్రహం ముందున్న తిన్నెపై; పలువన్నె మ్రుగ్గు = రంగుల మ్రుగ్గు, తీర్చి = వేసి.

తానై కట్టిన ఎర్ర కల్వ దండ - చెట్టున పండిన అరటిగెల - తీసుకొని చెలికత్తె ముందు నడువగా- నంబి గుడిలో జనం రాకుండా చేస్తే - తాను పోయి నమస్కరించి తిన్నెపై మ్రుగ్గు తీర్చి చెంగల్వ - పాండ్యదేశ ప్రీతికరమైన పుష్పం కాబోలు. చాలా చోట్ల గ్రహింపబడినది.

చూ. 1-75; 6-92.

(కదళ మంజరి - చూ. 1-69 పద్యంలో కదళీ వన పంక్తి - దగ్గర చేయని కదళీ శబ్ద విచారణ, వేదం వారు కదళిలో ఇకారమునకు గతి కన్పించదనటం, తదనుగుణంగా వావిళ్ళ పాఠం కదళి కాదని - కదళ అని దిద్దటం వింత.)

తే. కపిలగవి సర్పిఁ బృథుదీప కళిక దీర్చి।
ద్వయముతో వక్షమునఁ గల్వదండసేర్చి
యగరు ధూపంబు లిడి శర్క రాజ్యయుక్త।
హృద్య కదళీ ఫలాలి నైవేద్య మొసఁగి. 92.

కపిలగవి సర్పిన్ = పుల్లావు నేతితో; పృథు = పెద్ద; దీపకళికన్ = దీపపుజ్వాలను; తీర్చి =వెల్గించి; వక్షమునన్ = విగ్రహరూపమైన స్వామి ఎదురురొమ్మున; ద్వయముతోన్ = ద్వయమంత్రోచ్చారణతో; కల్పదండను చేర్చి, అగరు ధూపంబులు = అగరుతో ధూపం వేసి; శర్కర = చక్కెర; ఆజ్య = నేతితో; యుక్త = కూడుకొన్న; హృద్య = చవులూరించే; కదళీ ఫలాళిన్ = అరటి పండ్ల సమూహంతో; నైవేద్యము+ ఒసగి = నివేదనం చేసి.

ద్వయమంత్రము - చూ. 2-87, 1-77.

''నారాయణాబ్జ చరణౌ శరణ మహం ప్రపద్యే శ్రీమతేనారాయణాయ నమః.''

క. ఖండిత పూగీ నాగర
ఖండంబులు ఘనశశాంకఖండంబుల చే
హిండితమగు తాంబూలము
ఖండస్థిరభక్తి నొసఁగి కదలి చెలులతోఁ. 93

ఖండిత = ముక్కలుగా చేయబడ్డ; పూగీ = పోకలు; నాగర = శొంఠి; ఖండంబులు = ముక్కలు; ఘన = పెద్ద; శశాంక = కర్పూరపు; ఖండంబులు = ముక్కలు; చేన్ = తో; హిండితము+ అగు= మిశ్రితమగు; తాంబూలము; అఖండ స్థిర భక్తిన్ = ఏకాగ్రమైన చెదరని భక్తితో; ఒసగి = అర్పించి (తాంబూలం); చెలులతోన్ కదలి = సఖులతో పాటు బైటకు వచ్చి;పై పద్యంలో నైవేద్యమర్పించినది. ఇందులో తాంబూలం = వక్కలు - ఆకులు - శొంఠి ముక్కలు - కర్పూరంతో కూడినది.

గీ॥ చెలువ గర్భగృహ ప్రదక్షిణముఁ జేసి,
వినతయై మౌళి శఠకోపమును ధరించి
చరణ తీర్థముఁ గొని తత్ప్రసాద లబ్ధ,
మయిన మాల్యముఁ దాల్చి గేహమున కరుగు. 94

చెలువ = గోదాదేవి; గర్భగృహ = మూలవిరాట్టున్న గుడికి; ప్రదక్షిణము చేసి = వలగొని; వినతయై = వంగి; శఠకోపమును; మౌళిన్ = శిరస్సున; ధరించి = తాల్చి; చరణ తీర్థమున్ కొని = స్వామి పాద జలమును స్వీకరించి; తత్ = ఆ స్వామి; ప్రసాద = దయతో; లబ్ధమైన= లభించిన; మాల్యమున్ = దండను; తాల్చి = శిరస్సునందు తాల్చి; గేహమునకున్ = ఇంటికిన్; అరుగున్ = పోవును.

89 నుండి ఇక్కడి దాకా 6 పద్యాలు ఏకధాటిగా - వేగంతో - నడిచాయి. ఆమె పూజా విధానాన్ని ధ్వనించే రచన ఇది. అన్నీ అసంపూర్ణ క్రియలే. 'అరుగున్' దాకా ఆ క్రియా ప్రయోగం మోన్ని - ఏకాగ్రతను - ఏకధాటిని ధ్వనిస్తున్నది. విసువూ విరామం లేకుండా అర్చించినదన్న భావం స్ఫురిస్తున్నది. కనుక ఈ షట్కము అంతా ఒకే పద్యం. లేదా మాలిక.

క॥ ప్రతిదినము నిట్లు చని య
చ్యుత పూజ యొనర్చి వచ్చి సుదతి వియోగ
చ్యుత ధైర్య యగుచు నయ్యదు ।
పతిగుణములు ద్రవిడభాషఁ బాడుచు నుండున్. 95

సుదతి = అందమైన పండ్ల వరుస కలది; ప్రతిదినమున్ = ప్రతిరోజూ; ఇట్లు = ఈ విధంగా; చని = పోయి; అచ్యుత = విష్ణువునకు; పూజ; ఒనర్చి = చేసి; వచ్చి; వియోగ = విరహం వల్ల; చ్యుత = సడలిన; ధైర్య = ధీరగుణం కలది; అగుచున్; ఆ+యదుపతి = శ్రీకృష్ణుని; గుణములు; ద్రవిడభాషన్ = తమిళంలో; పాడుచున్; ఉండున్.

ఈ వ్రతమే గోపికలు భాగవతంలో చేసినది. మార్గళి - మార్గశీర్షవ్రతంగా ప్రసిద్ధం. ఆ ముప్పది రోజులు ఆమె పాడిన పాటలే తిరుప్పావై. విరహగీతికలే నాచ్చియార్ తిరుమొళి.

దవిడ ప్రబంధ మండలికి భూషణ ప్రాయమైనవి. భావోన్మేషం

మాధవ లీల

97-143. పద్యాలు హద్దుగా ప్రవహించిన మధుకుల్య ఈ వసంతవర్ణన.

పాదపాత్పాదపం గచ్ఛన్ - శైలాత్ శైలం, వనాద్వనం,
వాతి నైకరసాస్వాద - సమ్మోదిత ఇవానిలః

(వసంత వాయువు చెట్టునుండి చెట్టుకు - కొండనుండి కొండకు, అడవినుండి అడవికి వీస్తున్నది. చూస్తే ఈ గాలి దేవునకు, ఏకరసాస్వాదనతో తృప్తి కలుగుతున్నట్లు లేదు.)

రామాయణ కిష్కింధకాండలో మహర్షి 70 శ్లోకాల్లో వసంతవర్ణన నీవిధంగా సహజసుందరంగా చేస్తే -

శ్రీకృష్ణ దేవరాయ లదేవాయువును - 5-108 లో ఇంత ప్రౌఢంగా చిత్రించాడు. ఇది వీరిరువురి మార్గ భేదం.

సమానత్వ మేమంటే - అక్కడ శ్రీరామునకు విరహోద్దీపనంగా ఇక్కడ గోదాదేవికీ-ఈ వర్ణన అవసరమౌతున్నది. కనుకనే అటు మహర్షీ ఇటు రాజర్షి

''గాలికి కదిలే బొట్టుగు పూగుత్తిని మధుపానంతో వివశయై చలించే
ప్రియురాలిని లాగా తుమ్మెద త్వరితగతిని పొందుతున్నది.
'సీతా తనూలతను స్మృతి కెత్తుతూ పర్వతసానువున
కర్ణికారం వికసించింది' - అని వాల్మీకి

రాయలు వర్ణనాంతంలో - ''ఇంతులెనసిరి పూబొదరిండ్ల పతులన్'' అనీ - ముగింపులో 'కామిని

మేఘరంజిని' - (145లో) అన్నాడు. అంటే గోదా విరహోద్దీపన సామగ్రిగా వసంత వర్ణన మవసరమౌతున్నది. అంటే ఇదంతా కేవల శృంగార రస పరిధిలోని విషయమన్నమాట.

వాల్మీకి - కాళిదాసాది మహాకవుల ఋతువర్ణనల్లో ప్రతివిషయాన్ని నిలిపి - ఆపాదమస్తకం - బొమ్మగీసే పద్ధతి తక్కువ. రాయల వర్ణనలు అజంతా చిత్రాలు తప్ప ఆధునిక ప్రతీకా చిత్రణం కాదు. (110 వంటివి)

ఈ క్లిష్ట కల్పనలు భావనావ్రధులైన ప్రౌఢోహలు - గోదాదేవి విరహాతిశయాన్ని - వైశిష్ట్య వైలక్షణ్యాలను వ్యంజించటం కోసం; ఆ విరహంలో అలౌకిక లక్షణాలను ధ్వనించటం కోసం చేసినవి. కనుకనే పూర్వ ఋతువర్ణనల్లోని వైవిధ్యమిక్కడ కన్పించదు. వాటి ప్రయోజనం పరిధులు వేరు. ఇది కేవలం శృంగార రస ముఖమైన వర్ణన.

అందుకే అంతంలో కామిని అని గోద ననటం తటస్థించింది. వసంతుడనక మాధవుడనటం. ఈ వసంత ఋతువు కాలస్వరూపుడైన మాధవుని లీల - ఆమె విరహానుతని కానంద దాయకమన్నమాట. ఈ వర్ణనలకు భూమిక నాచ్చియార్ తిరుమొళి. అదంతా ఆ తల్లి తన విరహాన్ని తానే వర్ణించుకొన్న అద్భుతసృష్టి.

### వసంతఋతు వర్ణనం

గ॥ మొదలనాముక్తమాల్యదమదనతాప
తరణి పెనువెట్టవేఁగిన దక్షిణాశ
మత్కృతోష్మకుఁదుదముట్టు మాడుననుచుఁ
దొలఁగెనన నుత్తరాశకుఁదొలగెతరణి 96

మొదలన్ - మొదటే, ఆముక్త - ధరించిన,
మాల్య - దండను - ద - ఇచ్చిన గోద యొక్క, మదనతాప - మన్మథాగ్నియన్న.

తరణి = సూర్యుని; పెనువెట్ట = మహాతీవ్రమైన ఎండలలో వేగిన - (మంగలంలో పేలాలవలె) వేగినట్టి; దక్షిణ+ఆశ = దక్షిణ దిక్కు (పాండ్య దేశంలో జరిగిన కథ కనుక); మత్కృత - నాచేత; చేయబడిన; ఊష్మకున్ = వేడికి; తుదముట్టన్ = చివరికంట; మాడున్ - మాడిపోగలదు; అంచున్; తొలఁగెను = దక్షిణ దిక్కును వీడినాడు; అనన్ - అన్నట్లు; ఉత్తర దిశకున్ - ఉత్తర దిక్కుకు; తొలగెన్ - వెళ్ళినాడు.

అసలే గోదాదేవి విరహతాప సూర్యుని వేడికి మాడిపోయిన దక్షిణ దిక్కు; ఇంకా నేనూ మండిస్తే మరీ చచ్చిపోతుందన్న జంకుతో సూర్యుడు దక్షిణ దిక్కు నుండి ఉత్తర దిక్కుకు తిరిగినాడా యన్నట్లు - ఉత్తర దిక్కుకు మళ్ళినాడు.

అలం : హేతూత్ప్రేక్ష.

ఉత్తరాయణం ప్రవేశించినదని భావం. సూర్యుడు మకరరేఖకు పోవటం. మకర సంక్రాంతి రావటం జరిగింది. కర్కాటక రేఖలో ప్రవేశిస్తే దక్షిణాయనం. (దీని వర్ణనతో వర్షఋతు ప్రారంభం జరిగింది.)

''దిక్ దక్షిణాపి పరిపక్త్రిమ పుణ్యలభ్యాత్
సర్వోత్తరా భవతి దేవి తవావతారాత్''. (గోదాస్తుతి)

అని వేదాంత దేశికుల స్తుతి. గోదాజన్మ దక్షిణ దిక్కున జరిగినందు వల్ల ఆమె పుట్టుకతో అది సర్వోత్తర (ఉత్కృష్ట)మైనది.

శూర్పణఖ కథలో ''సేవమానే దృఢం సూర్యే దిశమంతక సేవితాం
విహీన తిలకేవ నోత్తరా దిక్ ప్రకాశతే:-
(అరణ్య. 15-8) సూర్యుడు దక్షిణదిశను పొందితే ఉత్తరదిక్కు తిలకహీన వలె శోభించటంలేదు. అని హేమంత వర్ణన చేసాడు మహర్షి . రాయలపద్యానికిది మూలం కావచ్చు.

మ॥ తెలియంగ వచ్చెనట్టి తఱిఁ దిగ్మకరుండు ధనాధిపాశకై
తొలఁగిన కారణం బతివ దుర్వహ దీర్ఘ వియోగ వహ్ని పె
ల్లలమిన తద్దిశం దగిలినట్టి తనూష్మ ఘనీభవన్మహో
జలమయ శంకరశ్వశురశైలము కోనలఁ జల్వఁ దీర్చుకోన్. 97

తిగ్మ - తీక్ష్ణమైన; కరుండు = కిరణాలు కలవాడు (సూర్యుడు); అట్టి తఱిన్ - ఆ సమయంలో; ధన+ అధిప = ధనపతి (కుబేరుడు); ఆశకు+ ఐ = దిక్కునకై; తొలఁగిన = వెళ్ళిన; కారణంబు = హేతువు; తెలియగన్ వచ్చెన్ = స్పష్టపడ్డది. అతివ = గోదాదేవి; దుర్వహ = మోయరాని; దీర్ఘవియోగవహ్ని = చిరకాల విరహాగ్ని; పెల్లు- ఆధిక్యం; అలమినన్ = వ్యాపించిన; తత్+ దిశన్ = ఆ దక్షిణ దిక్కునందు; తగిలిన+ అట్టి = సోకినట్టి; తను+ ఊష్మన్= శరీరపు వేడిలో; ఘనీభవత్ = గడ్డకడుతున్న; మహో = గొప్ప; జల = నీరు; మయ = మాయ రూపైన (మంచు); శంకర - శివుని; శ్వశుర = మామమైన; శైలము - కొండ (మంచుకొండ), కోనలన్ = గుబురు చెట్ల మూలల్లో; చల్వన్ = చల్లదనంతో; తీర్చుకోన్= తీర్చుకోవటానికి.

వేడి కిరణాలవాడు ఉత్తర దిక్కునకు మళ్ళిన కారణం తెలిసింది. గోదా విరహాగ్ని తన శరీరానికి కాక కల్గించేసరికి సూర్యుడు తాళలేక; శివుని మామగారిల్లు - మంచుకొండకు పోయి, కోనల్లోని చల్లదనంతో ఒంటిమంటలను చల్లార్చుకోవటానికి. సూర్యమండలం సైతముడుకెక్కిపోయినంతగా ఆమె విరహతాపమతిశయించింది - తిగ్మ కరుడనటంలో సొగసు, మంచుకొండకోనల చల్లదనం రెండూ విరుద్ధాంశాలు - ఒకటి ఉష్ణత, మరొకటి శీతలత. కనుక మహో - శైలము.

అలం : ఫలోత్ప్రేక్ష - కావ్యలింగ - సంకీర్ణం.

విశే॥ దక్షిణ దిక్కు- గోదాదేవి విరహార్తి గీతికలతోసుడి తిరిగిపోయినదన్న గోదాస్తుతిలో వాక్యం దీనికాధారం.

కినిసి వలఱేఁడు దండెత్తఁగేతువగుట
మీన మిలతోఁచు టుచితంబ మేషమేమి
పని? యనఁగనేల విరహాఖ్య బాంధయువతి
దాహమున కగ్గిరాగఁదత్తడియు రాదె 98

వలఱేడు = వలపురాజు; కినిసి = విరహిణులపై కోపించి; దండెత్తుట = యుద్ధయాత్ర సాగటం; కేతువు+అగుటన్ = జెండా కావటం వల్ల; మీనము = చేప; ఇలన్ = భూమిపై; తోచుట; ఉచితంబ = తగినది; మేషము = మేకకు;ఏమిపని = రావలసిన అవసరమేమిటి?, అనఁగన్ ఏల ? = అనటం దేనికి; పాంథయువతి = ప్రవాసియైన వాని భార్య ను దాహమునకున్ = దహించటానికి; విరహ+ఆఖ్యన్ = విరహమన్న పేరున; అగ్గి = నిప్పు రాగాన్ = వస్తే; తత్తడియున్ = వాహనం కూడా; రాద = రాదా ?

మన్మథుడు విరహులపై కోపంతో దండెత్తిరాగా; అతని జెండామీద గుర్తు మీనం కూడా రాక తప్పక వచ్చింది. మరి మేషం దేనికి వచ్చినట్లు ? విరహం పేరున అగ్నివస్తే వాహనమైన మేకా వచ్చింది. తప్పు లేదు.

సూర్యుడు - మీనరాశిలో; తర్వాత మేషంలోకి ప్రవేశించాడు. క్రమంగా పగళ్ళు వేడెక్కు-తూ; వసంతం బలుస్తున్నదని భావం.

97-98 పద్యాల్లో వసంతాగమనం - క్రమ పరిణామప్రారంభం సూచించాడు. ఇదే పద్ధతి ఇతర ఋతువర్ణనల్లోనూ కన్పిస్తుంది.

మ॥ ప్రియ పరిరంభణ ద్రఢిమ పెల్లిక నామని వచ్చి చేయుఁగా
వ్యయమని సీతునంద చెలువల్ పెదవుల్ తడుపంగా వచ్చె, దా
రయమున, బేర్చి యా ఋతువు రాఁ జనవిచ్చి తొఱంగిరయ్యవ
స్థ, యుచితమే కదా 'విపదిధైర్య' మనంజనుమాట యింతకున్ - 99

ఇఁకన్ = తర్వాత; ఆమని = వసంతం; వచ్చి; ప్రియ = ప్రియులయొక్క-; పరిరంభ = కౌగిలింతల; ద్రఢిమ = బిగువు; పెల్లు = ఆధిక్యం; వ్యయముసేయుగా = నశింపజేస్తుంది కదా; అని;సీతు+అందన్ = చలికాలం లోనే; చెలువల్ = ప్రియురాండ్రు; పెదవుల్ = పెదవులను; తడుపంగన్ = తడుపుకోగా; చలికి పగిలిన వానిని తడుపుకోగా; ( భయపడగా); ఆ ఋతువు- వసంతం; పేర్చి = విజృంభించి; రయమునన్ = వేగంగా; వచ్చెన్ = రానే వచ్చింది. రాన్ = రాగా; చలి; విచ్చి = చెదరి; తొఱంగిరి = పెదవులను తడుపుకోవటం; భయపడటం మానివేసారు.ఇంతకున్ - ఈ విషయంలో;విపది ఆపదలో, ధైర్యం - ధీరత్వం (వహించాలి) అనన్; అన్నమాట = లోకంలో ఉన్న న్యాయం; ఉచితమే కదా !

ప్రియుల దృఢాలింగనాలు వసంతం వచ్చి సడలిస్తుందని కాంతలు, చలికాలంలోనే పెదవులు తడుపుకున్నారు. ఇంతలో వసంతం రానే వచ్చింది. ఆ రావటం రావటం పెద్దగా వచ్చింది కనుక నిండా మునిగినవానికి చలి ఏమిటన్నట్లు - కాంతలు కూడా పెదవులు తడుపుకోవటం చలిపోయింది కనుక - భయపడటం మానివేసారు. పెదవులు పగలటం మాని వేసాయి.

ఆ అవస్థ తగినది, లోకంలో ఆపదల్లోనే ధైర్యముండాలి అన్న సూక్తి నిజమే కదా !

అలం : అర్థాంతరన్యాసం. శ్లేష అప్రధానం.(చూ. 5-104)

మ॥ స్పష్ట బహువ్రణం బయిన సీతున కళ్కి, నిజోష్ఠపల్లవో
చ్ఛిష్టముఁగొన్న దిమ్మధు, విసీ యన కింతులు మోవిఁ దన్మధూ
చ్ఛిష్టముఁ గొన్న యొచ్చె మఱఁ, జేసిన, వారు కృతం బెఱింగి వి
స్పష్టముగా నొనర్చిరి వసంతున కూఱట దోహదంబులన్. 100

ఇంతులు; స్పష్ట = స్పష్టింపబడిన (కల్పింపబడిన); బహువ్రణంబు = అనేక గాయాలు కల; సీతునకున్ = చలికాలానికి; అల్కి = జంకి; ఇమ్మధువు = ఈ తేనె; నిజ = తమ; ఓష్ఠపల్లవ = చిగురాకు పెదవి; ఉచ్ఛిష్టము = ఎంగిలి; కొన్నది = తీసుకొన్నది, ఇసీ అనన్ = ఛీఛీ అనక; మోవిన్ = పెదవితో; తత్ = ఆ; మధు = తేనెయొక్క; ఉచ్ఛిష్టము = ఎంగిలి ఐన మైనము (మధూచ్ఛిష్టము = మైనం); కొన్న = గైకొన్న; ఒచ్చెము = హైన్యం (తక్కువతనం); అఱఁజేసినన్ = పోగొట్టిన; వసంతునకున్ = చైత్రునకు; వారు = ఇంతులు; కృతంబు+ఎఱింగి = చేసిన మేలు మరువక (కృతజ్ఞతతో); దోహదంబులన్ = దోహద క్రియలను; విస్పష్టముగాన్ = మిక్కిలి తేట తెల్లంగా (అందరకూ తెలిసేటట్లు); ఊఱటన్ = ఓదార్పుగా (బాధలేకుండా); ఒనర్చిరి = చేసారు.

చలికాలం స్త్రీల చిగురాకు పెదవులను చిట్లగొట్టినాడు (చూ. పై పద్యం). అందుకని వారు తాము మధువు (ఇప్ప పూల నుండి తయారు చేసిన మద్యమునకే మధువని పేరు) త్రాగేటప్పుడు ఎంగిలి పడినదైనా - పగుళ్ళకు ఆమధూచ్ఛిష్టము (మైనం) పూసుకొన్నారు. అది తమకు నైచ్యమైన పని కదా ! వసంతుడు రాగానే ఆ మైనంతో పని తీరింది.

కనుక ఆ నీచత్వం నుండి తప్పించిన వాడు వసంతుడు. ఆ కృతజ్ఞతతో వారు ఆయా దోహదక్రియలతో ఆయా పూలపాదులను పూయించారు. దానితో వసంతునకు ఆరాటం తగ్గి ఊఱట పడ్డాడు.(దోహద క్రియలకు 125 నుండి చూడు)

అలం : అన్యోన్యం.

మ॥ మునుపే చంద్రబలంబుగల్గి మలయంపుం గమ్మ లేగాడ్పుఁదే
దున నేతెంచు లతాంత బాణునకు సూర్యుండుఘన్ మహింగ్రొత్తఁగా

ననుకూలించెc జలంబునన్ విరహిణీప్రాణా పహారంబు సే
యన యూహించువిధాత కృత్యమదియేలా మాను నెప్పట్టునన్. 101

మునుపే = ముందుగనే, చంద్రబలంబు = చంద్రగ్రహ సహాయం; కల్గి; మలయంపున్ = మలయ పర్వతం నుండి బయలుదేరే; కమ్మ = మంచివాసనగల; లే = లేత; గాడ్పు = గాలి; తేరునన్ = రథంమీద; ఏతెంచు = వచ్చే; లత+ అంత = (తీగ చివరనుండేది) పూవు; బాణునకున్ = బాణాలు కలవానికి; మహిన్ = లోకంలో; క్రొత్తగా = ప్రస్తుతం; సూర్యుండున్; చంద్రునితో పాటు ఈయన కూడా; అనుకూలించెన్ = తోడైనాడు; చలంబునన్ = పట్టుదలతో; విరహిణీ = భర్తలు దూరాన కల సతుల; ప్రాణ+ అపహారంబు = ప్రాణాలపహరించుటమన్న పని; చేయన = చేయాలనే; ఊహించు = ఆలోచించే; విధాత = సృష్టికర్త; కృత్యము = పని; అది; ఎలా = ఎందుకు; ఎప్పట్టునన్ = ఏ సమయంలోనైనా; మానున్ = తప్పిపోతుంది.

అసలే మేనమామ అండ చూచుకొని గర్విస్తున్న మన్మథుడు మలయపు కమ్మలేగాలి రథం మీద వ్యాహాళికి వస్తున్నాడు. వసంతం ప్రారంభమైనది కదా ! ఇప్పుడాయనకు సూర్యుడు తోడైనాడు. విరహిణీ సతుల ప్రాణాలు తీయాలనే సంకల్పించుకొన్న విధాత ప్రయత్నం ఫలించదా ! కనుకనే చంద్ర; సూర్య బలంతో మన్మథుడు గాలి రథం మీద దర్జాగా వాహ్యాళి వస్తున్నాడు.

విశే॥ చంద్ర, సూర్య బలమున్న వారికి ఎదురు లేదని జ్యోతిశ్శాస్త్రం మాట.

(1) వీరిద్దరూ వసంతం రావటంలో పేట్రేగిపోతున్నారు. శీతకాలంలో మంచులో అణగిపోయినారు.

(2) 'మలయంపున్ - తేరున; సమాన సౌకుమార్యం: పై పద్యప్రాసతో పోల్చి చూచుకోవాలి- కవి కప్పడి-ఎలాగైనా వ్రాస్తాడు.

అలం : అప్రస్తుత ప్రశంస - అర్థాంతరన్యాసం అంగం.

కం ॥ మలయ కటకోటజ స్థిత
కలశీసుత సేవ నిట్లు గనెనో తదాశా
నిలుండనగ నలసవృత్తిన
మెలcగుచు నాపోశనించె మిహికాజలధిన్. 102

మలయ = పర్వతం; కటక = చటియలందున్న; ఉటజ = పర్ణశాలలో; స్థిత = ఉన్నట్టి; కలశీసుత = అగస్త్యమహర్షి; సేవన్ = సేవలో; తత్ = ఆ; ఆశా+అనిలుడు = దిశనుండి వచ్చేగాలి; ఇట్లు = ఈ విధమైన; అలస వృత్తిన = మందగమనంతోనే; మెలగుచున్ = సంచరిస్తూ; మిహికాజలధిన్ = మంచన్న సముద్రాన్ని; ఆపోశనించెన్ = ఆపోశనం పట్టాడు.

మలయ పర్వత సానువుల్లో ఆశ్రమం కట్టుకొనియున్న అగస్త్యమహర్షిని సేవించినందువల్ల -

ఆయనలాగానే మెల్లగా నడుస్తూనే ఆ దిక్కుగాలి దేవుడు మెత్తగా ఉంటూనే మంచుసముద్రాన్ని ఆచమించాడు.

అగస్త్యుడు సముద్రాన్ని పుడిసిలి పట్టి నాడన్న పురాణ కథాధారంగా ఈ పద్యం కల్పితం.

అలం : ఉత్ప్రేక్ష. (పోల్చు - 2-38);

తే॥ మలయతరున్యాయము యిలఁ
గలతరువులకెల్లఁ జేయఁగా వలచెఁజుమీ
యలరించునెపంబునఁ బరి
మళితములుగనఁగ నచటి మారుత మొలసెన్. 103

ఇలన్+కల = భూమిపైనున్న; తరువులకున్ = అన్ని చెట్లకూ; మలయ తరున్యాయమ = మలయ పర్వతం మీదున్న చెట్లకున్న గుణమైన పరిమళం (గంధపు చెట్లకు మలయం ప్రసిద్ధి); చేయగాన్ = కల్పించాలని, వలచెన్‌సుమా = కోరినాడు సుమా. అనఁగన్ = అన్నట్లుగా; అలరించు నెపంబునన్ = పుష్పింపజేసే మిషతో; పరిమళితములుగన్= వాసనలు కలవిగా చేయబడినట్లుగా అచటి; మారుతము = గాలి; ఒలసెన్ = వ్యాపించింది.

మలయం మీదున్న గంధ వృక్ష వాసనలే భూమిపైనున్న చెట్లకన్నిటికీ కన్పించాలనుకొన్నాడేమో. మలయపవనుడు, లతలను పుష్పింపజేసే మిషతో వాసనలను కల్పిస్తూ పూలు వికసింపజేస్తున్నాడు.

కుప్పసముల్ వదల్చి యిఱీగుబ్బల నొత్తిరి హత్తి వేగుజా
మిప్పలలర్చు గాడ్పులకధీశుఁగ్రమంబున ఘర్మశంకమై
నుప్పతిలంగ దోమతెర లుప్పర మెత్తిరి దక్కిరూష్మముల్
దెప్పరమైన లోహశకటీ ప్రకటీకరణంబుఁ గామినుల్ 104

కామినుల్ = కాముకలైన స్త్రీలు; వేగుజామున = తెల్లవారుగట్ల; ఇప్పలు = మధూక వృక్షాలు; అలర్చు = వీచే (పూచే); గాడ్పులకున్ = గాలులకు; (ఇప్పపూల మీదుగా వీచే గాలులకు); కుప్పసముల్ = రవికలను; వదల్చి = సడలించి; ఇఱీగుబ్బలన్ = క్రిక్కిరిసిన చన్నులతో; అధి+ఈశున్ = భర్తను; హత్తి = హత్తుకొని; ఒత్తిరి; క్రమంబునన్ = కొంచెం సేపటికి; మైన్ = శరీరం మీద; ఘర్మశంక = చెమట పోసిందన సంశయం; ఉప్పతిలంగన్ = జన్మిస్తే; దోమ తెరలను; ఉప్పరము = ఆకాశానికి; ఎత్తిరి = తోసివేసారు; ఊష్మముల్ = వేడి; తెప్పరమైనన్ = ఎక్కువ కాగా; లోహశకటీ = ఇనుప బండిపై నుంచి తోసుకొనిపోయే కుంపట్లు యొక్క; ప్రకటీకరణంబున్ = ప్రయోగించుకోవటం (ఉపయోగించుకోవటం); తక్కిరి = త్యజించారు.

1. వసంతంలో ఇప్పలు పూస్తాయి. ఆ పూలగాలులతో వనమంతా మత్తెక్కిపోతుంది. కనుక అసలే కామినులు పైగా ఈ గాలు లుద్దీపనసామగ్రికాగా; తమంత తామై - రవికలను సడలించి క్రిక్కిరిసిన గుబ్బలతో ప్రాణవల్లభులను హత్తుకొని ఒత్తుకొన్నారు.

2. క్రమంగా ఘర్మశంక కలిగింది. దోమతెరలను తొలగించారు. వేడి ఎక్కువ కాగా

3 చలికాలంలో ఉపయోగించిన కుంపట్లను వాడటం మానుకొన్నారు.

అలం : స్వభావోక్తి.

స్తనాలతో ఒత్తటం, క్రమంగా స్వేదం కలగటం దోమతెరలనూ - కుంపట్లనూ తీసివేయటం- ఈ మూడు వాక్యాల మధ్య రహఃక్రీడానుభోగం గుప్తంగా ఉంది.

ఆ మహాకవి వాచ్యం చేయడు. కుంపట్ల విషయం - 4 -135 ఎత్తుగ గీతిలో వచ్చింది.

రచన = పద్య ప్రారంభ గాంభీర్యం భావించుకోవాలి. ఆయన ఏ మాటన్నా నోటి నిండుగా ఉంటుంది.

**అరుణాంశుండు హిమర్తువన్ రజని డీలై క్రుంకి పుష్పర్తువా**
**సరకల్యోదితుఁడౌచు మున్న యిడుటన్ శ్యామాకుచాలేపసం**
**కరసాంద్రాగ్నిశిఖారుణ ప్రభఁ గొనెన్ గాకున్నఁ గాలజ్ఞప**
**త్త్రిరుతం బెట్లు చెలంగు మానకుపితస్త్రీకర్ణ దంభోళియై** **105**

అరుణ+ అంశుండు = ఎర్రని కిరణాలవాడు = రవి; హిమర్తువు = చలికాలము; అన్ = అన్న; రజనిన్ = రాత్రి; డీలై = బలహీనపడి; క్రుంకి = అస్తమించి; పుష్పర్తు = పుష్పఋతువు = వసంతము; వాసర = దిన; కల్య = ప్రాతఃకాలంలో; ఉదితుండు = ఉదయించినవాడు. ఔచున్ = అవుతూ; మున్న = చలికాలమన్న రాత్రే; ఇడుటన్ = ఇచ్చినకారణం; శ్యామా = పదునారేండ్ల యౌవనవతియొక్క; కుచ = స్తనాలపై; ఆలేప = పూతలో; సంకర = కలిసిన; సాంద్ర = దట్టమైన (చిక్కని); అగ్నిశిఖా = కుంకుమపూవన్న అగ్నిజ్వాల, ప్రభన్ = కాంతిని; కొనెన్ = తీసుకొన్నాడు; కాక+ ఉన్నన్ = కాకపోతే; కాలజ్ఞ = కాలవేత్తయైన; పత్త్రి = రెక్కలు కలది కోడి; కోకిల; రుతంబు = కూత; మాన = అభిమానంతో; కుపిత = కోపించిన; స్త్రీ= ఆడువారి; కర్ణ = చెవులకు; దంభోళియై = పిడుగుపాటై; ఎట్లు = ఏవిధంగా; ఉప్పతిలున్ = సంభవిస్తుంది.

లోకంలో పొరుగూరు పోతూ, ప్రక్కవారికి తమ వస్తువులను ఇల్లడపెట్టి, రాగానే తీసుకోవటం కద్దు. ( ఇప్పుడు బాంకుల్లో దాచుకోవటం లాగా) లేదా రాత్రిపూట గట్టి ఇండ్లలో దాచుకొని తెలవారాక తీసుకోవటం లాగా.

చలికాలమన్నరాత్రి బలహీన పడిన సూర్యుడు, తనలోని తేజస్సును అగ్ని దగ్గర దాచుకొన్నట్లు, భామల దగ్గర దాచుకొన్నాడు. ఆ తేజస్సే వారి చనుకట్టులపై పూతలో మిశ్రితమైన కుంకుమ పువ్వు. చలికాలంలో భామల స్తనాలలోని వేడిమియే అగ్ని - దాని జ్వాలయే కుంకుమ పువ్వు ( కాంతి రూపం కూడా రెంటికీ ఒకటే కదా). తిరిగి వసంతోదయం కాగానే తేజస్సుతో వెలుగుతున్నాడు కాబోలన్నట్లు, - ఇది వసంతోదయపు పగలు కాకపోతే కోడి ( కోకిల) కూతలు అభిమానంతో రాత్రి పతుల పొందులెడబాసిన కుపితాంగనల చెవులకు పిడుగులట్లు - విన్పించవు కదా !

అలం : రూపకం.

చలికాలంలో కుంకుమ పువ్వు కలిపిన ఆ మైపూతలు ధరించటం నాటి నాగరికత

ఇలాంటి చారిత్రక - సామాజిక వాస్తవాలను గ్రథించటం కావ్యరచనా ప్రణాళికలో ఒక భాగం. తర్వాతి యుగాలవారికి చరిత్ర - సమాజశాస్త్ర నిర్మాణమన్న సౌధ నిర్మాణానికి తోడ్పడే బంగారు ఇటుకలు. దానికీ కావ్యం గని.

సూర్యుడు తన తేజస్సును అస్తమయ సమయంలో అగ్నిలో నిక్షిప్తం చేస్తాడు - అనటానికి కాళిదాసు ప్రమాణం

''దినాంతే నిహితం తేజః సవిత్రేవ హుతాశనః'' - రఘువంశం.

మృగమదాపలేపనము మాని రగరు కలనఁ
జన్నుఁగవ మీఁది కొప్పిరి బన్నసరము
నొంటికురువేరు పోచకుఁగంటగింప
రైరి తుఱిమెడి సరపువ్వు లందతివలు. 106

అతివలు = స్త్రీలు; మృగమద = కస్తూరి; ఆలేపమును = పూతను; అగరుకలనన్ = అగరన్న సుగంధ ద్రవ్యం కలిగియుండటంతో; మానిరి = వదలిరి; బన్నసరమున్ = ముత్యాల దండను (ఐదుపేటల హారం), చన్నుగవ నీదకున్ = స్తనమండలంపై ధరించటానికి; ఒప్పిరి = అంగీకరించారు; తుఱిమెడు = తలలో పెట్టుకొనే; సరపువ్వులందున్ = దండలో గ్రుచ్చే పువ్వుల్లో (నడుమ); ఒంటి = ఒకే; కురువేరు పోచకున్ = వాసనగల వేరు (లానుజ్జకమని సంస్కృత నామం) పోచకు; కంటగింపరు+ఐరి = ఇష్టపడినవారైనారు.

చలికాలంలోని ఆభరణాదులను వదలి వసంతానుకూల వస్తుధారణ చేసారు. చలికాలంలో వేడికోసం కస్తూరి, ఇప్పుడు అగరు గంధపుపూత. అప్పుడు రత్నహారం, ఇప్పుడు ముత్యాలహారం.

అపుడులేని కురువేరుపోచ చల్లదనం కోసం కావలసివచ్చింది. అది కంటకం - ముల్లు కలది. అయినా కంటగించక - ముల్లుగ్రుచ్చుకొన్న బాధను సహిస్తూ ఒప్పుకొన్నారు.

నాటి నాగరికతా వర్ణనగా గుర్తించాలి.

అలం : స్వభావోక్తి.

చ॥ చిలువసుధారసాధరల చెల్వపుఁ బుక్కిటితావిఁ దీయునై;
వలపుల నందు తత్ప్రియుల వక్త్రవిషజ్వలనోష్మ నొల్లనై,
వెలునడి తద్గుణద్వితయవేధఁ జూమీ యన మ్రానుపట్టుటల్
తలిరులు పుట్టుటల్ గలుగఁ దార్కొనెఁ జందనశైలవాతముల్. 107

గంధశైలం = గంధపు కొండయొక్క; వాతముల్ = గాలులు; చిలువ = సర్పజాతి; సుధారస+అధరల = అమృతపు రుచిలోడి మోవిగల; ఆడుత్రాచులయొక్క; చెల్వంపు = అందమైన; పుక్కిటితావిన్ = పుక్కిళ్ళ పరిమళాన్, తీయనై = తీపి కలదై, వలపులన్+అందు= నాగాంగనల ప్రేమలను స్వీకరించే; తత్ + ప్రియుల = ఆ ప్రియులయొక్క; వక్త్ర = ముఖాల; విష = విషముయొక్క; జ్వలన = మంటల; ఊష్మన్ = వేడికి; ఘాటైనై = కారపు రుచి కలదై; వెలువడి = బయలుపడి; తత్ = ఆ; గుణ ద్వితయ = రెండు గుణాలయొక్క (మాధుర్యం- కారం), వేధన్ = తాకుట వల్ల; చుమీ = సుమా; అనన్ = అన్నట్లుగా; ప్రానుపట్టుటల్ = ఆకులు రాలిన గండ్లు మానిపోవటం; తలిరులు = చిగుళ్ళు; పుట్టుటల్; కలుగన్ = కలిగేటట్లు; తార్కొనెన్ = వీచాయి

వెన్నెల ప్రసంతం రాగానే ఆకులు రాలిపోయిన చోట్ల మానిపోవటం - ఆ స్థానంలో - ఆ గండ్లకు ఎర్రని చిగుళ్ళు పుట్టటం ఎలా ఉందంటే - చందన శైలం నుండి బయలు పడుతూ వాయువులు, అమృతం వంటి పెదవులు కల నాగాంగనల తీయని పుక్కిటి తావులతో, ఆ ప్రేమలు పొంది మగత్రాచుల విషం పెరిగిన ఊర్పుల వేడి తావులతో - వీచినవి. ఆ చల్లని అమృత స్పర్శకు గండ్లు మానిపోయి, మగత్రాచుల వేడిగాడ్పులకు ఎర్రని చిగుళ్ళు పొటమరించాయి కాబోలు నన్నట్లుంది.

అలం : యథా సంఖ్య - హేతూత్ప్రేక్ష.

వి॥ ఎగురాకు పాము నాలుకవోలె ఎర్రగా ఉన్నదని ముందు 110వ పద్యంలో చెప్పబోతున్నాడు. ఆ ఎరుపునకు కారణం కారం.

''ఈపద్యమున కారణములను చెప్పిన క్రమమున కార్యములను చెప్పలేదు. తలిర్చుట అధరసుధాకార్యము; మోడుబరుట విషజ్జ్వలనోష్మకార్యము. ఇందువలన నిట యథాసంఖ్యాలంకారము తప్పిపోయిన'' దన్నవేదం వ్యాఖ్యసమీచనం కాదు. పైరీతిగా.

ఆకురాలుపు గండ్లు - ఆకురాలిన చోట ఏర్పడిన గాయం మానటానికి అమృతం కారణం.

''ఆకురాలుపు గండ్ల యందుఁ దొలఁగి'' (చూ.మనుచ. 6-27)

ప్రానుపట్టు - మాను = మనోజ్ఞము - ప్రాను రూపాంతరం (శబ్దార్థచంద్రిక); ప్రానుపట్టు = ఒంచగించు, ప్రానుపడు = నిశ్చేష్టుడగు.

మ॥ మదనస్యందనతా స్వవృత్తిఁ దెలిపెం బాటీర భూభృద్వల
న్మృదువాతం బలిపక్వ పాదపలతావృంతావళీమూలరం
ధ్రదళత్పంకజకర్ణికాగణ హరిద్రాభంగ భాభాసుర
చ్ఛదన చ్ఛద్మవివర్తి కాంచన కనచ్ఛ్రకచ్ఛటాభీత్కృతిఁ. 108

పాటీర = గంధపు; భూభృత్ = కొండ (నుండి); వలత్ = సుడిసే; మృదు = లేత; వాతంబు= గాలి;

అతి= మిక్కిలి; పక్వ = పండిన; పాదప = చెట్ల (యొక్క); లతా = తీగల; వృంత+ఆవళి=తొడిమెల గుంపు (యొక్క); మూల = జన్మస్థానములైన;రంధ్ర = (ఆకురాలుపు) గండ్లు, (నుండి); దళత్ = రాలుతున్న; పంకజ కర్ణిక = తామరపూల దుద్దులయొక్క; గణ = మొత్తముయొక్క; హరిద్రా = పసుపు; భంగ = ముక్కల; భా = వన్నె (వలె); భాసుర = ప్రకాశించే; ఛదన = ఆకులన్న; ఛద్మ = నెపంతో; వివర్తి = గుండ్రంగా తిరుగుతున్న; కాంచన = బంగారు వలె; కనత్ = ప్రకాశించే; చక్ర = బండి చక్రాల; ఛటా = మొత్తము (యొక్క); ఛీత్+కృతిన్ = చీత్కారంతో; మదన = మన్మథుని; స్యందనతా = రథత్వముయొక్క; స్వ = తన; వృత్తిన్ = ప్రవర్తనను (ప్రవృత్తిని - స్వభావాన్ని) తెలిపెన్= ప్రకటించింది.

చందన పర్వతం నుండి వీస్తున్న లేతగాలికి, చెట్లనుండి తీవెల పూల తొడిమెల మొదళ్ళ నుండి పండిన ఆకులు - తామరపూల దుద్దులకాంతితో, పసుపు కొమ్ముల ముక్కల వన్నెలతో, ప్రకాశిస్తూ రాలటం - మన్మథుని మలయ పవనమన్న బంగారు రథ చక్రాలు గుండ్రంగా వేగంగా తిరుగుతున్నట్లున్నాయి. ఆకులు రాలే సమయంలో గలగలలు రథచక్రాలు తిరిగేవేళ ధ్వను(ఛత్కారాలు)ల్లాగా ఉన్నాయి. మలయ పవనం మన్మథుని రథం. సుడులు తిరుగుతూ గాలిలో తేలే పండుటాకులు రథచక్రాలు. పండుటాకుల మిషతో రథ చక్రాలు తిరుగుతున్నాయి.

అలం : కైతవాపహ్నవం - గమ్యోత్ప్రేక్ష - నిదర్శనల సమ్మిశ్రణం.

విశే॥ చాలా - అద్భుతమైన శ్లిష్టభావన. గాలిలో ఆకులు పండిపోయి రాలటం ఎందరు చూడలేదు. కానీ ఈ భావన ! మన్మథుడు లక్ష్మీపుత్రుడు కనుక బంగారు రథం మీద వసంతర్తుసమయంలో వాహ్యాళి బయలుదేరినాడన్నమాట. రథం చాలాకాలంగా నడవనందువల్ల క్రొత్తగా బైటకు తీసినందువల్ల చక్రాలకు కందెన వేసినందువల్ల కిఱ్ఱుమంటున్నాయి. అదే ఛీత్కారం.

వ ॥ తదనంతరంబ = తర్వాత

109

సీ॥ క్షావశారక్తరాంకవ, మరణ్యానీమ
 ధూది తారుణిమ, వల్ల్యురగరసని
కోద్గతి, తరుగరుత్మద్గరుద్గణము క్రీ
 డాహార్యజీమూత రోహితంబు,
నవ మిళిందప్రాహుణకనిమంత్రణ శోభ
 నాక్షతప్రతతి, వాయస విభక్త
పరభృతౌఘ ప్రాప్త పత్రిక, మాలతీ
 త్రాసామయావహోద్రక్షతజము.

తే॥ ప్రమదవనవనదేవతా సముదయాంగ
రాగ, మినజహరిజ్జగత్ప్రాణ శాణ

కషణదశితదళాంతసంక్రాంత కాంతి
ఘనమణిశలాక, చిగురాకుగలయ మొలిచె. 110

చిగురాకు, కలయన్ = (భూమిపై) అంతటా; మొలిచెన్ = ఉద్భవించింది ఎలా ఉన్నదంటే- క్ష్మావశా = భూమి అనే ఆడఏనుగు, (పై కప్పిన) రక్తరాంకవము = నెత్తురువన్నె శాలువా (రాంకవము, రంకువన్న మృగం బొచ్చుతో తయారు చేసినది).

ఆ రోజుల్లో ఏనుగులకు హౌదాలెత్తేవారు. దానితో కూర్చోవటానికి ఈ శాలువాలు పరిచేవారు.

అరణ్యాని : పెద్ద అడవి అన్న యువతి, మధు = చైత్రమాసమన్న మధువు (త్రాగినపుడు); ఉదిత = కల్గిన; అరుణిమ = ఎరుపు; అరణ్యమన్న యువతి మధువు త్రాగినపుడు కలిగిన నేత్రాల ఎరుపు.

వల్లి - తీగ (అన్న); ఉరగ = (రొమ్ముతో ప్రాకేది) పాము (యొక్క); రసనిక= నాలుక; ఉద్గలి = బయటకు చాచటం; తీగలన్న పాములు చాచిన నాలుక (పాము మాటిమాటికి చీలిన నాలుకను కదలించటం సహజం.) గాలికి కదిలే చిగురాకులా ఉన్నది. తరు - గరుత్మత్ = చెట్టన్న గరుత్మంతుని, గరుత్మంతుని; గరుత్ - రెక్కల గణము - సమూహం; (చెట్టన్న గరుత్మంతుని రెక్కల ఈకలగుంపు) క్రీడ+ఆహార్య = క్రీడా పర్వతమన్న; జీమూత = మేఘం మీది రోహితంబు= ధనుస్సు (ఇంద్రధనుస్సు). క్రీడా పర్వతమన్న మేఘం మీద వేసిన ఇంద్రధనుస్సు.

నవ = క్రొత్త; మిళింద = తుమ్మెదలన్న, ప్రాహుణక = అతిథుల యొక్క నిమంత్రణ- = భోజనాహ్వానవేళ; శోభన = శుభార్థమైన; అక్షత ప్రతతులు = అక్షంతల సమూహం. క్రొత్తగా వచ్చిన తుమ్మెదలను వసంతుడు తన యింటికి విందుకాహ్వానిస్తూ పెట్టిన మంగళాక్షతలు (కుంకుమ కలిపిన బియ్యం).

వాయస = కాకుల నుండి, విభక్త = వేరైపోయిన; పరభృత = కోకిలల (ఇతర పక్షులతో పొదుగబడినవి కనుక); ఓఘ = గుంపుతో; ప్రాప్త = పొందబడిన; పత్రిక = పత్రం.

కోకిలలు, కాకులతో పొదగబడి వసంతం రాగానే కంఠధ్వనులతో బైటపడి వేరైపోతున్నపుడు వ్రాసుకొన్న పత్రికలు. (కుంకుమ పూత కలని కనుక ఎర్రనిది) లేదా వేరు పడటంలో బాంధవ్యపోవటమే ఎరుపు.

మాలతీ = మాలతి తీగకూ; త్రాస = భయమన్న; ఆమయ = రోగం; ఆవహ = కలిగించే; ఆర్ద్ర = పచ్చి; క్షతజము = నెత్తురు.

వసంతంలో మాలతి పుష్పించదని కవి సమయం. కనుక అది అలా కావటానికి భయం కల్పించే పచ్చినెత్తురు (దుష్టప్రయోగాలు చేసేవారు పచ్చి నెత్తురు చల్లి భయపెట్టడం సహజం కనుక)

ప్రమదవన = విహారపు తోటలయొక్క; వనదేవతా = వనదేవతల; సముదయ= సమూహానికి; అంగరాగము = మైపూత.

ఇన జహరిత్ = యమదిశ (దక్షిణం) నుండి వీచే; జగత్ప్రాణ = వాయువన్న; శాణ= సానమీద; కషణ =

ఒరిపిడికి, దళిత = ఊడిపోయిన,దళ+ అంత = ఆకుల లోపల; సంక్రాంత; లభించిన; కాంతి = ప్రకాశం కల; ఘన = గొప్ప; మణిశలాక = రత్నాంకురం,

దక్షిణ దిశనుండి వీచేగాలి అన్న ఒరిపిడి రాయి మీద ఒరిపిడి పెట్టగా పండుటాకులన్న బంగారు ఆభరణం నుండి రాలి పడిన కెంపు - (చిగురాకు)

అలం : రూపకం.

''సొనదేఱి పొటమరించిన'' - (మను. చ6 37)-ఈ భావానికీ పైపద్యభావానికున్న భేదం గమనించదగ్గది.

అలం : రూపకం.

తే. శరనిధుల మాఘ్యములు దీఱె మరున, కిట్టి
యడరున జయింతు మని కదా యద్దినాళిఁ
గ్రూరతిథిఁ గృష్ణరజనిఁ దద్వైరిఁ గనియుఁ
బెద్ద లివురాకుఁ బట్టైన పెట్టువడిరి. 111

మరునకున్ = మన్మథునకు; శరనిధులన్ = అమ్ముల పొదుల్లో; మాఘ్యములు = మొల్లలు (మాఘమాసం పూలు); తీఱెన్ = నష్టమైపోయాయి; ఇట్టి అడరునన్ = ఈ సమయంలో; జయింతు మని కదా; గెలుస్తామని కదా, ఆదిన+ఆళిన్ = ఆ రోజుల్లో; క్రూరతిథిన్ = హింసా తిథియైన; కృష్ణరజనిన్ = కృష్ణచతుర్దశినాడు; తత్ = ఆమరుని; వైరిన్ = శత్రువైన శివుని; కనియున్ = దర్శించికూడా; పెద్దలు = ఘనులు; ఇవురాకు = చిగురాకు; బట్టైన = డాలు; పెట్టు = దెబ్బ; పడిరి = తిన్నారు.

మాఘమాసం గతించి చైత్రం వచ్చింది కనుక మన్మథున కాయుధబలం తగ్గింది. కనుక అతని శత్రువు - శివుని - కృష్ణచతుర్దశినాడు దర్శించి మహాదేవుని అనుగ్రహంతో - మరుని జయించటం సులభమనుకొని అలా చేసినా చిగురాకు దెబ్బలు తప్పలేదు.

అలం : విషాదం.

విశే॥ చిగురాకు కామోద్దీపకమని భావం.

క్రూరతిథి = కృష్ణ చతుర్దశి ప్రాణిహింసా పూజాదినం కనుక ఉగ్రమంత్ర జపాదులకది ప్రసిద్ధం. (5-86, 4-248 చూ.)

పెద్దలు - శివభక్తులు. వారూ కాముని బారిన పడ్డారని భావం.

తే. అవని నపుడు నవోదితుండైన యట్టి
మరునకుం గుసుమర్తు వన్మంత్రసాని
బొడ్డుగోసిన కొడవలి వోలె విరహి
దారకం బయ్యెఁ గింశుక కోరకంబు. 112

అప్పుడు = ఆ చైత్రంలో; అవనిన్ = భూమిపై; నవ = క్రొత్తగా; ఉదితుండైన = పుట్టిన; అట్టి; మరునకున్; కుసుమ+ ఋతువు = పూలకారు; అన్న; మంత్రసాని = మంతరసాని (పూర్వ కాలంలో పల్లెల్లో బహుశా మంత్రాదులతో సుఖ ప్రసవం కలగటానికై చికిత్స చేసే వైద్యురాలు); బొడ్డు కోసిన అపుడే భూమిపై పడ్డ శిశువునకు తల్లి ప్రేగు కోస్తారు; కనుక; కొడవలి పోలెన్ = చిన్నవంకర కత్తిలాగా ఉన్న, కింశుక = మోదుగ, కోరకంబు = మొగ్గ; విరహి దారకంబు+ అయ్యెన్ = విరహులను కోసేది ఐనది.

వసంతంలో మోదుగు పూస్తుంది. అది ఎర్రగా కొడవలి వలె వక్రంగా ఉంటుంది. ఆ ఎరుపు నెత్తురు నవోదితుడు అపుడే పుట్టిన బిడ్డయైన మన్మథుని బొడ్డు కోస్తే అంటిన నెత్తురది. వసంతమే మంత్రసాని.

**అలం :** ఉపమ.

112-111-108- పద్యాలు ఈ క్రమంలో ఉండి ఉండాలి.

రాయల కవితలో అక్రమం భావించలేం. ఆశ్వాసాంతాలు చూస్తే ఇది స్పష్టం. కనుక ప్రతులను తయారు చేసేటప్పుడు క్రమం తారుమారై ఉండవచ్చు.

**చ. కుసుమములెల్లఁ గామినుల కొప్పుల నుండ నటుండ లేమి సి**
**గ్గెసఁగంగ వంగినట్లు జనియించె నన ల్మఱి వంగి, జీవితే**
**శ సమితి గొమ్ములం గరఁచి చల్ల c గుచక్షణికాంగరాగ మౌ**
**టసదె యటంచు రాగిలిన యట్లుల రాగిలి విచ్చెఁ గింశుకిన్. 113**

కుసుమములు+ ఎల్లన్ = అన్నిపూలు; కామినుల = కాముకులైన స్త్రీల; కొప్పులన్ = కొప్పులపై; ఉండన్ = ఉంటే; అటు+ ఉండన్+లేమి = అలా ఉండలేనందువల్ల; కింశుకిన్ = మోదుగ చెట్టున; సిగ్గు; ఎసఁగంగన్ = ఎక్కువ కాగా; వంగిన+ అట్లు = క్రిందికి వ్రాలినట్లు; ననల్= మొగ్గలు; వంగి = వంపు తిరిగి ; జనియించెన్ = పుట్టినవి; మఱి = ఇక; జీవిత+ ఈశ = ప్రాణ వల్లభులు; కొమ్ములన్ = పిచికారులతో; కరచి = లోపలకు నీటితోపాటు తీసి; చల్లన్ = ప్రియులపై వసంతం చల్లగా; కుచ = స్తన మండలం మీద; క్షణిక = క్షణకాలంపాటు; అంగరాగము = మైపూత; ఔట = కావటం; అసదె = సామాన్యమా !; అట+ అంచున్ = అలా అనుకొంటూ; రాగిలిన యట్లు = సంతోషించినట్లు, ఎరుపెక్కినట్లు; రాగిలి = ఎరుపెక్కి; విచ్చెన్ = విచ్చుకొన్నాయి.

మోదుగు పువ్వు కొడవలి ఆకారంలో ఎర్రగా ఉంటుంది. దాన్ని స్త్రీలు ధరించరు. ఈ స్వభావ సిద్ధమైన విషయం మీద కట్టిన భావం. పూలన్నీ కామినుల కొప్పుల్లో కూర్చుని కులుకుతుంటే తామేమో ఆ భాగ్యానికి నోచుకోలేక పోయామన్న సిగ్గుతో తలలు వంచుకొన్నట్లు - వంపుతో పూచాయి. తర్వాత వాటి అదృష్టం తిరిగింది. వసంతంలో నీళ్ళలో పసుపు కుంకుమ సున్నం - మోదుగు పూలు కలిపిన వసంతం ప్రియలపై చల్లారు. ఈ మోదుగులు స్త్రీల రొమ్ములపై క్షణ కాలంపాటు మైపూత వస్తువులు

కావటం వల్ల సంతోషించినట్లు ఎర్రగా విచ్చుకొన్నాయి. కొప్పులపై కులకటం కంటె కుచములు కంగరాగం కావటం భాగ్యం కదా !

నైపుణిఁ జందనాద్రి గహనద్రుమసౌరభవీచిఁదామ్రప
ర్ణీపరిలబ్ధ మౌక్తిక మణిప్రకరంబులు దోఁచి దక్షిణా
శాపవనుండు సల్లువెదఁ జల్ల జనించెన కాక వీనికే
లా పొడమంగ నప్పొలప మప్పుడు నా వనిఁదోఁచెఁ గ్రొన్ననల్. 114

దక్షిణ + ఆశాపవనుండు = దక్షిణదిగ్వాయువు; నైపుణిన్ = నేర్పుతో; చందన+ అద్రి = గంధపు కొండపైని; గహన = అడవిలో; ద్రుమ = చెట్లయొక్క; సౌరభ వీచిన్ = వాసనల అలలతో; తామ్రపర్ణీపరిలబ్ధ = తామ్రవర్ణిలో దొరికిన; మౌక్తిక; మణి = ముత్యాల; రత్నాల; ప్రకరంబులన్ = సమూహాన్ని; దోచి = దొంగిలించి; (దోగాడి); చల్లువెదన్ చల్లన్ =గుప్పిళ్ళలో గింజలను చల్లినందువల్ల; జనించెనకాక = పుట్టినవే తప్ప; వీనికిన్= ఈ లతలకు; అప్పొలపము = ఆ అందం; (గుంద్రని దనం - వాసన); పొడమంగన్ = జనించటం; ఏలా = దేనికి?; నాన్= అన్నట్లు; క్రొత్త+నసల్= క్రొత్త పూ మొగ్గలు; వనిన్ = తోపుల్లో; తోచెన్ = ప్రకటితమైనాయి.

తోటల్లో దొడ్లలో ఎక్కడ చూచినా ఎర్రని, తెల్లని పూలమొగ్గలు వాసనలు చిమ్ముతూ వికసించాయి. దీనిక్కారణం బహుశః మలయపవనం గంధపు చెట్ల మీదుగా వీస్తూ వాటి వాసనలను సంగ్రహించి - నీటిలోనున్న ముత్యాలను, రత్నాలను దోచుకొని- అడవుల్లో మణుల్లాగా ఎర్రగా(చిగురాకులు) విరబూసి పరిమళిస్తున్నాయి. (చిగురాకు వాసన ఒగరు; పూలవాసన తీపి)

అలం : హేతూత్ప్రేక్ష.

విశే ॥ చల్లువెద - గొర్తివెద అనిరెండు రకాలు.

గొర్తివెద - నాగలికి దొన్నెను కట్టి దానిలో గింజలు పోస్తూ చాలులో త్రిప్పుతారు. ఆగింజలు చాళ్ళలో పడతాయి.

కం ॥ వీరుద్ద్రుమిథున మేళనయున్
కైరతిపతి యేయదుస్సి హరితద్యుతిఁబై
నారెగయఁ బొటమరించిన
నారసముల తుద లంగన నన లవి మించెన్. 115

వీరుత్ = తీగెల; ద్రు = చెట్ల(మొక్క); మేళనకై = సంగమానికై (లతల, చెట్లు శరీరాల్లోకి); హరిత = పచ్చని; ద్యుతిన్ = వన్నెలో; పై = మీద; నారసముల = బాణాల; తుదలు = అగ్రభాగాలు; అనన్ = అన్నట్లు; ననలు = పూలు; మించెను = ఎక్కువైనాయి.

లతా స్త్రీల, వృక్ష పురుషుల సంగమంతో పుష్పాలు పుడుతున్నాయి. ఆసంగమ కారణం మన్మథుని బాణాలు. అవి వాటి శరీరాల్లో దూసుకొని అవతలివైపుకు మొనలు తేలాయి. ఆమొనలు లతా వృక్ష చర్మాన్ని తొడుగుగా బైటకు వచ్చినట్లున్నాయి పూ మొగ్గలు.

మొగ్గ = అమ్ము మొన; పసరు మొగ్గకు పైన పచ్చరంగుంటుంది కనుక అదే చెట్లనార

అలం : ఉత్ప్రేక్ష.

విశే ॥ వీరుత్ - స్త్రీలింగం, ద్రు - పుంలింగం, స్త్రీ+పురుష - ద్వంద్వం.

తనయుదరంబునం బొడమి తామ్రరుచిచ్ఛట లుల్లసిల్లఁగో
ల్కొను ధరణీజ సంతతికిఁ గోరక దంతము లించుకంత ని
క్కినయది యాదిగాఁగఁ జెలఁగెన్ వనలక్ష్మి; గడుం జెలంగఁగాఁ
జనుఁ బ్రియుఁడైన మాధవుని సంగతి మీఁదటఁ జాలఁ గల్గుటన్. 116

వనలక్ష్మి = వనదేవత; తన ఉదరంబునన్ = తనకడుపున; పొడమి = పుట్టి; తామ్రరుచిచ్ఛటలు = ఎరుపు వన్నెల మొత్తం; ఉల్లసిల్లన్ = ప్రకాశిస్తే; కోల్కొను = క్రమంగా పుంజుకొనే; ధరణీజ = చెట్ల; సంతతికిన్ = గుంపునకు; ( ధరణీజ= చెట్టు - గోదా- సీతా దేవులవలె); దంతములు = పండ్లు; ఇంచుక అంతన్ = కొంచెం; నిక్కిన అది ఆదిగాన్ = మొలచినది మొదలుకొని; చెలఁగెన్ = సంతోషించింది; ప్రియుడు+ ఐన = వల్లభుడైన; మాధవుని = వసంతుని; సంగతి = పొందు; చాలన్ కల్గుటన్ = చాలా కల్గినందువల్ల; మీదటన్ = తర్వాత; ప్రియుడైన; మాధవుని = వసంతుని; సంగతి =కలియక, చాలన్; కల్గుటన్ = కలిగినందువల్ల; చనున్ = అది తగినదే.

వనదేవత కడుపున పుట్టిన బిడ్డలైన చెట్లు చిగురాకు తొడిగి ఎర్రగా వున్నాయి. వాటికి మొగ్గల దంతాలూ మొలిచాయి. అక్కడ నుండి వనలక్ష్మి చాలా సంతోషించింది. వన్నె మారింది. అది తగినదే. ఎందుకంటే తర్వాత మాధవుడన్న ప్రియుని పొందు చాలా లభించింది కనుక.

విశే ॥ ప్రాచీన కాలంలో స్త్రీలు కానుపుకోసం పుట్టింఢ్లకు పోవటం - కనటం - కన్నాక శిశువునకు దంతాలు మొలిచాక అత్తింటికి రావటం ఆచారం. ఆరాక దంపతులకు సంతోషకారణం. భర్త సంగమం లభిస్తుందని సంతోషం.

సీ ॥ మును నన ల్దమిఁబట్టి ముంగాళ్ళ,
ముక్కుఁజో డనలఁబీలిచి పసర్కొనిన విడిచి,
పరువంపు విరి గొందు లరసి, చాలై త్రోవ,
బెట్టి యీరము లీఁగు పిండుఁదగిలి,
క్రొవ్విరి దొలుతనొక్కడ గని యది వ్రాలు,

తఱి దాని నిలఁ బడఁ దాఁకి గ్రోలి,
యాకురాలుపుగండ్ల నానెడు నాస నిం
తడుగూది బంకంటి యంగలార్చి
యెట్టకేలకు నొకఁడబ్బఁ బొట్టనిండఁ
గ్రోలియది గాలిఁగదలినఁగూలు నగుచుఁ
బ్రమదవనపాలికలు వేడ్కఁ బట్టనగుచు
మధుదినాది క్షుధాభ్రమన్మధుపచయము. 117

మధుదిన= వసంత సమయ; ఆదిన్ = ప్రారంభంలో; క్షుధా = ఆకలితో; భ్రమత్ = ఎగిరే; మధుప = మధువును త్రాగే తుమ్మెదల; చయము = గుంపు; మును = ముందుగా; ననల్ = పూలను, తమిన్ = ఆసక్తితో; ముంగాళ్ళన్ = ముందుకాళ్ళతో; పట్టి = అదిమి పట్టుకొని; ముక్కు, జోడనలన్ = జంటతో; పీలిచి = తేనెను ముక్కు తొండాలతో పీల్చి; పసర్ కొనినన్ = పసరు వాసనతో రుచి; కొనినన్ = రాగా; విడిచి = వదలి.

పువ్వుమీద వ్రాలి కాళ్ళక్రింద దానిని పట్టి అదిమి ముక్కుల జంటతో తేనెను పీలుస్తూ పసరు మొగ్గలు కావటం వల్ల వగరు రుచి తగిలి వదలిపెట్టి.

పరువంపు = పరిపక్వమైన; విరిగొందులు = పూలున్న మూలలు; అరసి = వెదకి; చాలై = గుంపుల వరుసలై; త్రోవన్ పెట్టి = దారితీసి; ఈరములు = పొదలు; ఈగు = దూరే; పిండున్ తగిలి = గుంపు వెంటబడి

బాగా ముదిరిన పూలు కల దారులు వెదకి గుంపులై బారులుగా పొదరిళ్ళపై వ్రాలబోయే గుంపు వెంటబడి

తొలుతన్ = ముందుగా; క్రొవ్విరిన్ = కొత్తగా విచ్చిన పువ్వును; ఒక్కడు = ఒక్కతుమ్మెద; కని = చూచి; అది వ్రాలు తఱిన్ = అది వ్రాలే సమయంలో; దానిన్ = ఆ ఒంటరి తుమ్మెదను; ఇలన్ = నేలపై,పడన్ = పడేటట్లు; తాకి = ఎదుర్కొని; క్రోలి = ( అది క్రింద పడిపోగా) త్రాగి.

ఒక్క తుమ్మెద తెలివితో క్రొత్త పూలను కనిపెట్టి వ్రాలి త్రాగబోయేసరికి దానిని క్రింద పడవైచి మరొక్కటి వచ్చి దానెను త్రాగింది.

ఆకురాలుపు గండ్లన్ = ఆకురాలగా ఏర్పడిన తొర్రలను; ఆనెడు = త్రాగే ఆశతో; ఇంత = కొంచెం; అడుగు+ ఊది = కాలాన్చి; బంక = జిగురు; అంటి = తాకి; అంగలు; ఆర్చి = దుఃఖ పడి.

ఆకురాలిన చోట్లే గండ్లు. అక్కడ రసమూరుతుంది. అది జిగురుగా వుంటుంది. అది త్రాగాలని ఆశగా వ్రాలి కాళ్ళంటుకు పోయేసరికి బాధతో ఝుంకారం చేసి,

ఎట్టకేలకున్ = చిట్టచివరకు; ఒకఁడు = ఒక్కపూవు; అబ్బినన్ = దొరికితే; నోటినిండన్; క్రోలి = త్రాగి; అది = తుమ్మెద వ్రాలిన ఆపూవు; గాలిన్ కదలినన్ = గాలికి కదిలేసరికి; ప్రమదవన = ఉద్యానవన పాలికలు = రక్షించేయువతులు; వేడ్కన్ = క్రీడగా; నగుచున్ = నవ్వుతూ; పట్టన్ = పట్టుకోవడానికి; అగుచున్ = పాలిస్తూ; కూలున్ = క్రిందపడుతున్నవి.

చిట్టచివరకు ఒక పువ్వు దొరికింది. తుమ్మెద కడుపునిండా ఆపువ్వు తేనె త్రాగింది. ఇంతలో తాను నిలబడిన పువ్వు గాలికి కదిలేసరికి క్రిందపడబోతూ ఉద్యాన పాలికలు వినోదార్థం పట్టుకోవటానికి అనుకూలిస్తూ క్రింద కూలింది.( మధువు మత్తులో)

అలం : స్వభావోక్తి. వసంతంలో ఉద్యాన వనాలపై ఎగిరే తుమ్మెదల వర్ణన ఇంత సహజ సుందరంగా వర్ణించటం లోకోత్తర ప్రతిభ.

సీ ॥ మరుదూఢ మలయాహి గరధూమ్య లనుగళ
న్మనసిజ రథపదాంజన కళికలు
త్రాసధావచ్ఛిశిరత్యక్త బాష్పముల్
పికపంచమస్వరోద్భేద వీణ
లబ్ధాగమన్మరందాసార జంబువుల్
హిందోళ సాక్షాన్ముకుందరోచు
లభిసారి కాంశుకోద్యన్నీల గుళికలు
జాత్యనుల్లసనాత్త శాపతతులు

చైత్రసంజీవనౌషధీ జాతచేత
నాత్మజని హేతు తరుపునర్యాయి యువతి
కరవిధూతహసంతి కేంగాలచయము
లళుల పంక్తులు వనుల నల్లాడఁ దొడఁగె 118

వనులన్ = తోటల్లో; అళుల = తుమ్మెదల; పంక్తులు = గుంపులు; అల్లాడన్ = తెగ ఎగరటం; తొడఁగెన్ = మొదలు పెట్టాయి.

వాటి వర్ణన :-

మరుత్ = వాయువు; ఊఢ = మోస్తున్న; మలయ = ఆకొండపైనున్న; అహి = పాముల; గర = విష(సంబంధమైన); ధూమ్యలు = పొగలచాళ్ళు; మనసిజ = మన్మధుని; రథపద = రథచక్రాలతో; అనుగళత్ = అనుసరించి రాలుతున్న; అంజన = కందెన; కళికలు = మొగ్గలు(బొట్లు)

మలయ పర్వతం నుండి బయలు వెడలుతూ వాయువులు అక్కడి పాముల విష ధూమాన్ని

మోసుకొని తెస్తున్నవో అన్నట్లుగా; అప్పుడే వసంతాగమమైనందున మన్మథుడు తన బంగారు బండికి కందెన వేయించి తోలుకొని వస్తున్నాడు. ఆకందెన నూనె బొట్లు-

త్రాస = భయంతో; ధావత్ = పరుగెత్తే; శిశిర = ఋతుస్త్రీ; త్యక్త = వదలిన; బాష్పముల్ = కన్నీటిబొట్లు; పిక = కోకిలల; పంచమస్వరానికి; ఉద్భేద = ఉద్దీపనమైన; వీణలు = కస్తూరి వీణలు(నల్లచెక్కతో చేసే వారేమో ఆరోజుల్లో. నేడు మనం చూచే వీణ తంజావూరు నాయిక రఘునాథ రూపకల్పన అంటారు. ఇది చందన వర్ణం)

భయంతో శిశిర ఋతువన్న స్త్రీ నడుస్తూ పరుగెత్తు తున్నపుడు రాలే కాటుక కన్నీటి బొట్లు. కోకిలల పంచమ స్వరానికుద్దీప్తి -(రెట్టింపు చేసే) కల్గించే శ్రుతిపోసే వీణలు.

అబ్ద = నీటినిచ్చేది మేఘం(దాని); ఆగమత్ = రాకను కల్పిస్తున్న; మరంద = తేనె; ఆసార = వానకు; జంబువుల్ = నేరేళ్ళు; హిందోళరాగ = శిశిర = వసంత సంధికాలంలో పాడదగిన ఆరాగానికి ప్రత్యక్ష (ప్రతి+ అక్ష) కంటికి ఎదురుగా నిలిచిన; ముకుంద = శ్రీహరి; రోచులు = కాంతులు.

పూలనుండి కారుతున్న తేనె వానల కాలాన్ని తేగా ఆకాలంలో పండే నేరేటి పండ్లు. (తుమ్మెదలు) విష్ణు ప్రియమైన హిందోళరాగాలాపనకు ప్రత్యక్షమైన విష్ణుని నీలకాంతి ముద్దలు.

అభిసారిక = ప్రియుని సంకేత స్థలానికి పోయే కామినుల; అంశుక = వస్త్రాలకు; ఉద్యత్ = ప్రకాశించే; నీల = నలుపును కల్గించే; గుళికలు = మాత్రలు; జాతి = జాజితీగ; అనుల్లసన (న+ ఉల్లసన) = పుష్పించక పోవటానికి; ఆత్త = పొందిన; శాపతతులు =శాపాల సమూహం (కర్ణునకున్న శాపాల్లాగే) అభిసారికల వస్త్రాలకు నలుపునాపాదించే ఔషధ ఘుటికలు, జాజి, ఆఋతువులో పూయకూడదని పెట్టిన శాపాల సమూహం. (ఈఋతువులో జాజి పూయదు కనుక)

చైత్ర మాసమన్న, సంజీవన+ ఓషధి = బ్రతికించే మందువల్ల; జాత = పుట్టిన; చేతన = ప్రాణవంతములైన; ఆత్మ = తమ; జని = పుట్టుకకు;హేతు = కారణమైన; తరు = చెట్లకోసం; పునః = తిరిగి; యాయి = పోయే; యువతి కర = యువతుల చేతులతో విధూత = విసరి వేయబడ్డ; హసంతిక = కుంపట్లలోని; ఇంగాల = బొగ్గుల; చయము = సమూహం.

శిశిరర్తువులో వెలిగించిన కుంపట్లతో పని తీరిపోయినది కనుక; యువతులు ఆరిపోయిన ఆబొగ్గును విసరి వేసారు. అవి చైత్రమాసమన్న సంజీవనౌషధ స్పర్శ తగిలినందువల్ల మధ్యలోనే ప్రాణంపోసుకొని, తమ పుట్టినిల్లైన చెట్లకోసం పోతున్నవో అన్నట్లుగా - తుమ్మెదలు తోటల్లో విజృంభించి గుంపులు గుంపులుగా ఎగురుతున్న దృశ్యం ఆధారంగా వ్రాసిన అద్భుత చిత్రం. కవి భావనకు పరాకాష్ఠ. లోకంలో తుమ్మెదకిది మనః కల్పిత ప్రతిబింబం. కవిత్వమంటే - ఉపమానమంటే ఈప్రతిబింబమే.

ద్విజతఁగాంచియు మధుసేవ విడువలేక- జాతిఁబాసిన తేంట్లనిస్వనము గూడు కోసుట నోయనఁగోకిలస్వనముసెలంగెఁ- దనకుమఱీ పంచమత్వంబు తప్పకుండ

కోకిల స్వనము= (పంచమ)స్వరంతో కూత; ద్విజతన్ = బ్రాహ్మణ; పక్షి; జన్మను; కాంచియున్ = పొంది కూడా; మధుసేవన్ = (తేనె); మద్యపానం; విడువలేక = వదల్లేక; జాతిన్ = కులాన్ని; జాజిపువ్వునూ; పాసిన = పోగొట్టుకొన్న; తేంట్ల = తుమ్మెదల; నిస్వనమున్ = ధ్వనిని; కూడుకొనుటనో అనన్ = కూడుకోవటం వల్లనో అన్నట్లుగా; తనకున్ = కోకిలకూ; మఱి; పంచమత్వంబు = పంచమకులత్వం; పంచమస్వరత్వం; తప్పకుండన్ = తప్పిపోకుండా; చెలగెన్ = ఎక్కువైనది.

కోకిల పంచమ రుతం - తుమ్మెదల ఝుంకారంతోడు కాగా పేట్రేగినాయి. ఇదెలా వుందంటే - ద్విజత్వం (పక్షి - విప్రలక్షణం) పొందికూడా (తేనె త్రాగటం తుమ్మెద వంతు, మద్యం త్రాగటం విప్రుని పక్షాన) జాతి - కులాన్ని కోల్పోవటం విప్రసంబంధం : జాజిపువును కోల్పోవటం వసంత సంబంధమైన తుమ్మెదల విషయం. భ్రష్టత పొందినా తేంట్ల ఝుంకార ధ్వని తోడుకాగా పంచమం వచ్చినట్లు- ఆస్వరం లోనే కోకిలలు కూస్తున్నవి. మధుపానం అతతాయి భ్రష్ట బ్రాహ్మణ లక్షణం ( చూ. 4-209) తుమ్మెదల తోడ్పాటు - పిక పంచమస్వరోద్భేద వీణలు కనుక. మధుపానంతో తుమ్మెద - పంచమత్వంతో కోకిల ద్విజలక్షణాన్ని కోల్పోయినవి.

అలం : హేతూత్ప్రేక్ష. శ్లేషాధారితం.

పూచిన మావులం దవిలి పూవిలుజోదున కమ్మె మాధవుం
డేచిన శంక; నాతఁడవియే కొనియే పథికావలీజయ
శ్రీచణుఁడయ్యె; నట్టిదయకృత్యముచే నగునట్టి పీడయుం
గోచర మౌనె, దైవ మనుకూలమునై పరుమేలుఁదీఱినన్ 120

మాధవుఁడు = వసంతుడు(మా = లక్ష్మి, ధవుఁడు = భర్త) పూచిన మావులన్ = పూల వికాసంకల మామిళ్ళను; అశుభహేతువులైన సుళ్ళుగల గుఱ్ఱాలను; తవిలి = విపరీతంగా; (పూతపక్షం) వెంటబడి మరీ (గుఱ్ఱాల పక్షంగా); తరిమి; పూవిలు జోదునకున్ = పూలే ధనుస్సుగా గల యోధునకు; అమ్మెన్ = విక్రయించాడు; ఆతఁడు= ఇక ఆయన (కొన్నవాడు); ఏచిన శంకన్ = చాలా అనుమానంతో; అవియే కొనియే = అవియే కొని కూడా; పథిక = విరహుల; అవళీ = సమూహము యొక్క; జయశ్రీ = జయసంపదతో; చణుఁడు = సమర్థుడు(గొప్పవాడు); అయ్యెన్ = ఐనాడు; అది; అట్టిద = అదంతే కదా; దైవము = అదృష్టం; అనుకూలమునై = అనుకూలమైతే; పరుమేలున్ = ఇతరులకు మంచి; తీఱినన్ = కలిగితే; అకృత్యముచేన్ = చెడ్డపనితో; అగునట్టి = అయ్యే; పీడయున్ = అశుభం ( బాధ); గోచరము+ ఔనె = కన్పిస్తుందా?

దైవమనుకూలమై ఇతరునికి మంచి జరిగితే చెడ్డ పనులు కూడా సత్ఫలితాన్నే ఇస్తాయి కదా ! (అర్థాంతరన్యాసం) ఎలాగంటే - వసంతుడు తన స్నేహితుడైన మన్మథునకు చెడ్డ సుడులున్న గుఱ్ఱాలను కొనమని తరిమి అమ్మాడు ఐనా వాటితోనే విరహి జనులను జయించిన వీరుడైనాడు. (వ్యాఘాతాలంకారం) ఇదెలా సంభవం ? - అంటే పూచిన మావులంటే - పూతపట్టిన మామిడి

చెట్లు. పైన విరోధం దీనితో తొలగిపోయింది. కనుక విరోధాభాస (దీనికి శ్లేష మూలంగా వుంటుంది - పూచిన మావులన్న శబ్దం శ్లిష్టం).

అలం : సంశ్లిష్టాలంకారం.

ఉరుశక్తిన్మధుమాసదోగ్ధ పిదుకన్ జ్యోత్స్నీగవీచంద్రమస్
స్ఫుర దూధః ప్రవిముక్తమైన నిబిడ జ్యోత్స్నా పయఃపూరము౯
విరియం బాఱిన గొజ్జఁగ ల్గురియ మున్నీరైన యక్కమ్మనీ
రు రహిం గూడిన నేర్పరించు గములై రోలంబకాదంబముల్ 121

మధుమాస = వసంతర్తువన్న; దోగ్ధ = పాలుపిదికేవాడు; ఉరుశక్తిన్ = గొప్పబలంతో; జ్యోత్స్నీ = వెన్నెల రాత్రియన్న; గవీ = గోవు యొక్క; చంద్రమః = చందమామ అన్న; స్ఫురత్ = ప్రకాశించే; ఊధః =పొదుగు నుండి; ప్రవిముక్తము + ఐ = స్రవించే; పయః = పాల; పూరమున్ = ప్రవాహం; విరియంబాఱిన = విచ్చిన; గొజ్జఁగల్ = గొజ్జంగిపూలు; కురియన్ = స్రవిస్తే; మున్నీరైన = సముద్రమై; ఆ కమ్మనీరు = ఆసుగంధం కల నీరు; (గొజ్జెగలు రాల్చిన మంచు నీరు పాలరాల పాత్రల్లో పడి పన్నీరౌతుంది.);రహిన్ = అందంగా; (సరిసమానంగా); కూడినన్ = సమ్మిశ్రితం కాగా; రోలంబ = తుమ్మెదలు; కాదంబముల్ = అంచలు, గములై = గుంపులై; ఏర్పరించున్ = వేరుచేస్తాయి.

వసంతుడన్న దోగ్ధ వెన్నెల రాత్రియన్న ఆవు పొదుగైన చంద్రుని పట్టి బలంగా పిండేసరికి వెన్నెల వాన ఆకాశం నుండి కురుస్తున్నది. నేలమీదున్న గొజ్జెగలు తేనె వానను కురిస్తున్నవి. ఈరెండు బాగా కలిసి పెద్ద సముద్రం కాగా-పాలను వేరుచేస్తున్నవి. హంసలు పాలను వేరుచేస్తుంటే - త్రాగుతుంటే తుమ్మెదలు తేనెను వేరు చేస్తూ త్రాగుతున్నాయి.

విశే॥ ఒక పెద్దతోట, రాత్రిపూట ఒకే వెన్నెల కుండపోత వానగా పడుతున్నది. తోటలో పూలచెట్లనిండా పూలు - ఎగిరే తుమ్మెదలు, కారే తేనె వానలు ఎంత విచిత్రమైన సుందర లోకం ఈపద్యం.

అలం : రూపకం.

రచనలో నిర్మాణ రహస్యాన్నీ భావించాలి. మొదటి రెండు పాదాలకూర్పు నిబిడం కాగా - చిక్కని పాలలాగా, మిగిలిన రెండు పాదాల కూర్పులో సౌకుమార్యం- తేనెలాగా ఉంది.

ఉరుశక్తిన్, మధుమాస, దోగ్ధ -జ్యోత్స్నీగవీచంద్రము, స్ఫురత్, ఊధః, ప్రవిముక్త, జ్యోత్స్నా పయః పూరమున్- గీట్లుగొట్టిన అక్షరాలపై బరువున్నది. శక్తిన్+మధు = నకారం బరువు మమీద పడుతూ గట్టిగా కౌగలించుకొన్నట్లు శబ్దాల కూర్పులో సాంద్రత వస్తున్నది. క్రింది రెండు పాదాల్లో తెలుగు మాటలు. కూర్పులో విరళత్వం వల్ల సౌకుమార్యం వచ్చింది.

పిదకటంలో దోగ్ధ ఉరుశక్తిని ధ్వనిస్తే మొదటి సగభాగం రెండోసగం పూలు తేనెను స్రవించటంలోని సౌకుమార్యాన్ని వ్యంజిస్తున్నది.

దిగ్గియ నంచ దూఁడు గొని తీర వనేక్షువు వంక మీఁదుగా
నగ్గెడ పుల్లకేసరమునందు వసింపఁగ నెక్కునూలి ను
న్ప్రగ్గము నందఁగాఁ దరుమరందసరోమకరంద గోష్ఠికిన్
వెగ్గల మాడుతేంట్లు మరు వింటికిఁబూనె గుణద్వయత్వమున్. 122

అంచ = హంస, దిగ్గియన్ = దిగుడు బావిలో (నుండి); తూడున్ = తామర కాడను; కొని = ముక్కున పట్టి; తీర = ఆబావి; ఒడ్డునే ఉన్న; వన = చెరుకు చేనులోని; ఇక్షువు = చెరకు గడ; వంకమీదుగాన్ = వంపుపై నుండి; అగ్గెడన్ = ఆచెరకు తోటగట్టుపై; పుల్ల = విచ్చిన; కేసరమునందున్ = పొగడచెట్టుపై; వసింపగాన్ = కూర్చుని ఉంటే; ఎక్కు = ఆచెరకునకు తగల్చిన్న; నూలి = ఆతామర తూడుపోగు; నున్ = లేత; ప్రగ్గమునందున్ = సన్నత్రాటిపై; అందున్ = ఆపొన్నపై; అనారత = ఎడతెగకుండా; మరంద = తేనెను; సరసి = డిగ్గియలోని; అరవింద = తామరల తేనె; గోష్ఠికిన్ = కలిసి త్రాగటానికి; (పానగోష్ఠి-మధుసేవ); వెగ్గలము = మిక్కిలిగా; గుంపులై ఆడు = ఎగిరే తేంట్లు = తుమ్మెదలు మరువింటికిన్ = మన్మథుని ధనుస్సునకు; గుణద్వయత్వమున్ = అల్లెత్రాళ్ళ జంటలక్షణాన్ని; పూన్ = వహించింది.

ఒక దిగుడు బావి. అందులో అరవిందాలు. ఒడ్డున చెరుకుతోట. గట్టున పొన్నచెట్టు, ఆబావి ఆచేనుకు నీటిని ఏతం వేసేది. ఒక హంస బావిలో తామరతూడును ముక్కుతో పట్టుకొని, ఒక వంపు చెరకు గడ మీదుగా ఎగిరి గట్టున పొన్నచెట్టు మీద వ్రాలింది - మరొక ప్రక్క పొన్నచెట్టు పూల మకరందం కోసం - బావి తామరల తేనెకోసం - తుమ్మెదలు బార్లుకట్టి క్రిందకీ పైకీ ఆడుతున్నాయి. చెరకు గడకొక ప్రక్కనొక గుంపు-మరొక ప్రక్క ఇంకొక బారు- ఆడుతున్నవి. ఈదృశ్యం-మరుని వింటికి జంట త్రాళ్ళులాగా వున్నాయి. మన్మథునకు విల్లు చెరకుగడ అదీ వంపుగా వున్నందున ధనురాకారంలో వుంది. ఆవింటికి అల్లె త్రాడు తుమ్మెదలని కవి సమయం.

ధనుః పౌష్పం మౌర్వీమధురకరమయీ పంచవిశిఖా (పూలవిల్లు అల్లెత్రాడు తుమ్మెదలు. ఐదేబాణలు. (సౌందర్యలహరి).

నిడుద మధూలిక ల్నడుమనే కొని తీఁగెలు సాఁగఁజుట్టుకొం
చడరిగడార కాచకటకాకృతి సుళ్ల మెలంగె గాడుపుల్
జడగతి నధ్వనీనపరిషత్పటునిశ్వసితానలం బెదు
ర్పడ మటి సార్చులై చురచురం దుద సుళ్లుగస్రుక్కెవో యనన్. 123

గాడుపుల్ = గాలులు; అధ్వనీన = బాటసారుల (భార్యావిరహితుల); పరిషత్ = సమూహం; పటు = దీర్ఘ; నిశ్వసత = నిట్టూర్పుల; అనలంబు = అగ్ని; ఎదుర్పడన్ = గాలికి ఎదురురాగా; మటి = ఇక; స+ అర్చులు+ ఐ = జ్వాలలు కలవై; చురచురన్ = కాలేటప్పుడు వచ్చేధ్వనితో; తుదన్ = చివర్ల, సుళ్ళుగన్= చుట్టలు చుట్టలుగా; స్రుకెనోయనన్ =కాలి వంకర్లు తిరిగి పోయినవో అన్నట్లు; నిడుద = పొడవైన;

మధూళికన్ = తేనెధారలను; నడుమనే = క్రింద పడకముందు అంతరిక్షంలోనే, తీగలుసాగన్ = తీగలు తీగలై సాగేటట్లు, చుట్టుకొంచున్ = గుండ్రని చుట్టలుగా చుట్టుకొంటూ, అడరి = ఏపుగా, కడార = బంగారు వన్నెగల; కాచ = గాజు; కటక = కడియాలు(గాజులు); ఆకృతి = ఆకారంతో; సుళ్ళన్ = సుడులతో; గాడుపుల్ = గాలులు; మెలంగెన్ = మెలగినవి.

మలయ పవనం వీస్తున్నది. పూలనుండి తేనె ధారగా కారుతున్నది. ఈగాలి అధారను నేలపై పడకముందే తన్నుకొని పోతూ, తాను వలయాలు వలయాలుగా వీస్తున్నవి కనుక అధారలు కూడా చుట్టలు చుట్టలుగా బంగారు వన్నెతో మెరుస్తున్నవి. అవి స్త్రీల గాజుల వలె ఉన్నాయి. సుడులగాలులు- తేనెచుట్టలు చూస్తుంటే- బాటసారుల విరహపు వేడి నిట్టూర్పులు ఎదురుకాగా ఈతేనెలు చురచుర కాలి వంకర తిరిగి పోయినట్లున్నవి. తేనెజిగట కనుక తెగిపోక గాలి సుడులతో పోయి సుడులు తిరుగుతూ బంగారు గాజుల్లాగా వుంది. ఈగాజులు సుమంగళీసూచకం. అది చేయించింది వారిభర్తలే. వారు దూరదేశంలో ఉంటూ ఇళ్ళకు నిట్టూర్పులు విడుస్తూ -బాధతో వస్తున్నారు. ఆనిట్టూర్పులు కుంపటిలో బంగారం కరిగి గాజులుగా మారి తమభార్యల అందాలకు వన్నె పెడుతూ తమ జీవన భద్రతకు హేతువౌతున్నవి. చూ. 2-48 వేసవి సుడిగాలులు. ఇవి వసంతంలోవి.

> కురిసిన క్రింది పుప్పొడులఁగొంచు నగంబుల మీఁదికై పిశం
> గరుచులఁ గొన్ని పెల్లెగసె గాడ్పులసు ళ్ళతి మాధవుండు రా
> నెరవుగఁ బూవు సొమ్మిడి వనేందిర భూమికి వెండి మెట్టదా
> మరరవణంబు రాఁగొన, భ్రమద్గతులౌ మలుచుట్టులో యన్ 124

వన+ ఇందిర = వనలక్ష్మి; పతి = తనభర్త; మాధవుండు = విష్ణువు; రాన్ = రాగా; భూమికిన్ = భూదేవికి; ఎరవుగన్ = ఎరవు సొమ్ముగా; పూవు సొమ్మన్ = పూలనగలను; ఇడి = ఇచ్చి; వెండి = బదులుగా; తాన్ = భూమినుండి; మెట్టతామర అన్న; రవణంబున్ = నగను (అలంకారం); కొనన్ = గ్రహించటానికి; భ్రమత్ = గుండ్రంగా(సుళ్ళుగా); గతులు + ఐ = నడకలు కల; మలు చుట్టులో యనన్ = త్రిప్పే చీలలన్నట్లుగా; కురిసిన = రాలిన; క్రింది పుప్పొడులన్ = పూపరాగాన్ని; కొంచున్ = గ్రహిస్తూ; గాడ్పుల సుళ్ళు = సుడుల గాలులు; కొన్ని; పిశంగరుచులన్ = బంగారు వన్నెలతో; నగంబుల మీదికై = కొండలపైకి, పెల్లు = మిక్కిలి; ఎగసెన్ = ఎగిరాయి.

తోటలపైన ఆకాశంలో పుప్పొడుల ధూళి పెల్లుగా గాలి సుళ్ళలోబడి తిరుగుతున్నది. భూమిపైన అంతటా మెట్టతామర అలముకొన్నది. ఈ దృశ్యమెలా ఉందంటే- వసంతుడు రాగానే, వనేందిర తన నగ పుప్పొడిని భూదేవి (సవతి) కిచ్చి ఆమె నగ మెట్ట తామరను తాను తీసుకోబోతున్నట్లుగా (గాలి సుడులు తిరుగుతున్నది.)

సుళ్ళుగా తిరిగే గాలులే వర్ణనాంశం. నగలూడదీయటానికి మర చీలలు త్రిప్పాలి. వనేందిర - భూదేవుల నగలు పూలు -మెట్ట తామర వారి శరీరాలపైనే ఉన్నాయి. వాటిని ఊడదీయటానికి త్రిప్పే మర చీలలో అన్నట్లుగా గాడ్పులు సుడులు సుడులై తిరుగుతున్నాయి.

అలం : ఉత్ప్రేక్ష.

నులు చుట్టలు = మర చుట్టలు (ప్ర్యూ) (పాఠాంతరం)

మ॥ తరుణులదోనిదాన మధుధార ననల్ వకుళాళినింపఁ గా,
దరుణుల మేముగామె యని తద్గతలేతావనదేవతల్ సురన్
ధర వకుళౌఘు మెల్లనుననల్గన (గ్రాయఁగ నించు బుగ్గలన్
దొరసె మధుప్రపూర్ణత మధూకములం బృథుపాండు పుష్పముల్ 125

తరుణులు = స్త్రీలు (యౌవన వతులు), అదః = ఈపూలకు;నిదాన = మూల కారణమైన; మధు ధారన్ = మధువు(యొక్క) ధారతో;వకుళ = పొగడలు; ననల్ = పూలను; నింపగాన్= విరబూస్తే, తత్+గతలు+ఔ = ఆవనంలోనే ఉన్న; వనదేవతలు; ఏము = మేము; తరుణులము= యువతులము; కామే = కామా, అని; ధరన్ = భూమి మీదున్న; వకుళ = పొగడల; ఓఘము= గుంపు; ఎల్లనున్ = అంతా; ననల్ = పూలను; కనన్ = కనటానికి; క్రాయఁగన్ = ఊయటానికని; సురన్ = మధువును; నించు = నింపిన; బుగ్గలన్ = పుక్కిళ్ళతో; మధూకములన్ = ఇప్పచెట్లకు; మధు ప్రపూర్ణతన్ = తేనె నిండటం వల్ల; పృథు = పెద్ద; పాండు= గులాబీరంగులో; పుష్పముల్ = పూలు; దొరసెన్ = పూచినవి.

అడవుల్లో ఇప్పచెట్లు తెగపూస్తే ఆ పూలు తరుణుల బుగ్గల్లాగా ఉన్నాయి. పూల నిండుగా తేనె ఉన్నది. అదేమిటంటే - 'వకుళోముఖసీధునా' పొగడ మధువు వల్ల పుష్పిస్తుంది. ఈ దోహద కార్యం వర్ణింపబడుతున్నది. ఇప్పపూలు పూయించటానికై వనదేవతలు పుక్కిళ్ళ నిండా సురను పూరించుకొన్నట్లున్నాయి. ఇప్ప పూలు ఇవిదేనికట -లోకంలో తరుణులు వసంతంరాగానే నోటి మధువును వకుళాలపాదుల్లో ఊసినందువల్ల అవి పూస్తుంటే చూచిన వనదేవతలు పంతంగా ఇలా చేసినట్లున్నది.

తరుణుల బుగ్గలు ఉబ్బి - పాండువర్ణంలో ఉంటాయి కనుక ఇప్ప పూలలాగే ఉన్నాయి.

అలం : వస్తూత్ప్రేక్ష.

విశే॥ ఇక్కడ నుండి దోహదప్రక్రియలు వర్ణింపబడుతున్నాయి.

మ॥ తరుణులఁ గౌఁగిటన్ననుచుఁ దమ్ము వృథా విరులెత్తి చేసెమో
పరులుగఁ జైత్రుఁడంచుఁ దదభావ మనోభవ వహ్ని వెచ్చి ని
ర్భరమధుపాళి ధూమము పరాగఁపు నీఱును తేనెగట్టె చాఁ
దరుదుగఁ దాల్పఁగా గొరవులై యొఱగంబడెఁగొన్ని భూజముల్. 126

తరుణుల = యౌవనవతుల (యొక్క); కౌఁగిటన్ = కౌగిలితో; ననుచు = పుష్పించే; తమ్మున్ = కురవక లతలు (గోరంటులు); తమను; చైత్రుఁడు = వసంతుడు (జైత్రుడు = జయశాలి); వృథా = అనవసరంగా, విరులు+ఎత్తి, పూయించి; మోపరులుగన్ = బరువు మోసే వారిగా (కనుకనే విరులను

గంపల కొలంది నెత్తికెత్తినాడని - ఎత్తు(క్రియ అందం); చేసెన్= చేసినాడు, అంచున్ = అంటూ; తత్ = ఆ; అభావ = కౌగిలిలేని; మనోభవ = మన్మథ; వహ్నిన్ = అగ్నిలో; వెచ్చి = కాలిపోయి; నిర్భర = మోయరాని; మధుప+ఆళి = తుమ్మెదలచాలన్న; ధూమమున్ = పొగ; పరాగ(పు నీఱును = పూధూళి అన్న బూడిద; తేనె అన్న; కట్టె చాదునున్; కట్టె కాలేటప్పుడు లోపలి నుండి బుసబుసపొంగే నీరు చాదుగా (చాదు మసితో చేసే పిల్లల బొట్టు); అరుదుగన్ = వింతగా; తాల్చ(గాన్ = ధరించి; కొన్ని; భూజముల్ = కొన్ని చెట్లు; కొరవులై = కాలిన కొరువులై (కొఱవి = గోరింట; శ్లేషలో సాధు శకట రేఫల కభేదం); ఒఱుగంబడెన్ = నేల(వాలాయి.

ఆలింగనాత్ కురవకః- స్త్రీల కౌగిలికి గోరంటు పూస్తుంది. ఇది దానికి దోహదం; ఈ సం(ప్రదాయాధారంగా నిర్మించిన భావ మీ పద్యం. కురవకా లనుకొన్నాయి. ''మేము యువతుల ఆలింగనంతో పుష్పించుదామని ఎదురుచూస్తుంటే పెద్ద మొనగాడై (జై(తుడు) ఈచై(తుడు అనవసరంగా ఈ పూలు గంపల కొలదీ పూయించిమా నెత్తిన పెట్టటం వల్ల కదా అంగనల ఆలింగన భాగ్యం కోల్పోయినామని ఏడ్చి ఏడ్చి విరహాగ్నిలో కాలిపోయి కొరువులై నేల(వాలాయి. అగ్నిలో కాలేటప్పుడు - పొగ, బూడిద, కట్టెచాదు రావటం సహజం.

అలం : ఉ(త్ప్రే)క్ష -శ్లేషసహితం.

ఆ॥ ఫల శలాటు లురుల నళులకై తమ కూడు
చెఱుప మావు లంటి చెలువ పిండుఁ
మగుడ ననలు నింప మొగము గన్నులు నెఱ్ఱఁ
బాఱె మిగుల శౌక పైకములకు. 127

చెలువపిండు = అందగత్తెల సమూహం; ఫల = పండ్లు; శలాటులు = కాయలు; ఉరులన్ = రాలిపోగా; అళులకై = తుమ్మెదల కోసం; తమ కూడు = శుక పికాల అన్నమైన ఫలశలాటులను; చెఱుపన్ = నాశనం చేస్తే (తుమ్మెదల కూడు తేనె); మావులు = మామిళ్ళను; అంటి = తాకి; మగుడన్ = తిరిగి; ననలు నింపన్ = పూలను నింపే సరికి; శౌక = శుక సమూహ (చిలుకల గుంపుకి); పైకములు = పిక (కోకిల) సముదాయానికీ; మిగులన్ = చాలా; కన్నులు; ఎఱ్ఱఁ బాఱెన్ = ఎరుపెక్కాయి. (కోపంతో) కరస్పర్శేణమాకందః - చేతితో తాకటమే మామిడికి దోహదం.

కనుక వసంతుడు రాగానే పూచిన మామిళ్ళు పండ్లు కాయలు కాస్తున్నవి. అయినా స్త్రీ వాటిని తాకినందువల్ల కాయలూ పండ్లూ రాలిపోయి తిరిగి చిగిర్చి పూయటం (ప్రారంభించాయి. అందుకని పండ్లు పోయాయని చిలుకలకూ కాయ పోయినదని కోకిలలకూ కోపంతో కళ్ళు ఎ(రబడ్డాయి.

అలం : హేతూ(త్ప్రే)క్ష; (క్రమాలంకారం - ఫలశలాటులు శౌకపైక సంబంధంగా అన్వయం.

మ॥ అతుల(ప్రేమరసార్ద్ర యోర్తు (ప్రియహాస్య(క్రీడ సంకేత వం
చితయై తత్ క్షణజాంగజజ్వర మిళత్ చిత్త (భ్రమం బూని, నా

పతినో వృక్షము కానవే యన సపుష్పంబయ్యె గోఁగంతలో
నతఁడున్ దోఁచిన నవ్వుడున్ విరిసెఁ బ్రాంతాంచన్న మేరుద్రువున్. 128

అతుల = సాటిలేని; ప్రేమరస+ఆర్ద్ర = ప్రణయమన్న రసం చేత స్నిగ్ధహృదయ; ఓరు = ఒక్కతె; ప్రియ = ప్రియునియొక్క; హాస్యక్రీడన్ = నవ్వులాటలో; సంకేత = ప్రియ ప్రియుల కగు కలయికకు స్థానంలో (నవ్వులాటకు) వంచితయై = మోసగింపబడినదై; తత్ = ఆ; క్షణజ = క్షణంలో పుట్టిన; అంగజ = మన్మథ; జ్వర = ఉష్ణంతో; మిళత్ = సమ్మిశ్రితమైన; చిత్తభ్రమంబు = మనోవ్యాకులత; ఊని = పూని; ఓ; వృక్షము = చెట్టా; నా పతిన్ = నా భర్తను; కానవే = చూడలేదా; అనన్ = అనగానే; స+పుష్పంబు = పూలుకలది; ఐ; గోఁగు = కర్ణికారం; అంతలోన్ = అంతలోపలే; అతఁడున్ = ప్రియుడు; తోఁచినన్ = కన్పిస్తే; నవ్వుడున్ =నవ్వగా; ప్రాంత = దగ్గరలోనే; అంచత్ = అందంగా ఉన్న; నమేరుద్రువుకో = పొన్నచెట్టునూ; విరిసెన్ = వికసించింది.

గోగు సల్లాపంతో పూస్తుంది. పొన్న నవ్వుతో.

సల్లాపతః కర్ణికారః – నమేరుః హసితేన చ.

కనుక ఒక ప్రణయిని సంకేత స్థలానికి పోయింది. ప్రియుడు కన్పించ లేదు. అతడు నవ్వులాట కోసం దాక్కొన్నాడు. ఈమె కర్ణికారాన్ని చూచి ఏడుస్తూ నా ప్రియుని చూడలేదా అనగానే అది పూచింది. ఆ మాట విని నక్కిన ప్రియుడు బైటపడ్డాడు. వెంటనే ఆమె నవ్వింది. నవ్వుతో నమేరువు పూచింది.

ఇవన్నీ నేడుమనకు పిచ్చివర్ణనలుగా కన్పించవచ్చు. అందుకేనేమో కవి నవ్వుదున్- ఆమెతోపాటు మనమూ. మన నవ్వు ఎగతాళి. ఆమె నవ్వు అనుభవం. హృదయ నిష్ఠమైన భావుకునకివన్నీ అందంగానే ఉంటాయి. హృదయం పారవేసుకొని మనో లోకంలో జీవించే నేటి మనిషికిది నవ్వులాటగా తోచవచ్చు. కానీ ప్రేమతో తాకటం - మాటాడటం - నవ్వటం చేస్తే చెట్లు కూడా స్పందిస్తాయని నేటి వైజ్ఞానికధోరణి నిరూపిస్తున్నది. ప్రతిదీ ప్రాణవంతమే, చేతనవంతమే కనుక.

రవిశంకర్ సితారు వాద్యానికి చెట్టూ పిట్టా ఆనందించాయని, ఇతర గోల సంగీతానికి అలా జరగలేదనీ విన్నాం. వ్యవసాయ పరిశోధన రంగంలో - మధుర సంగీతానికి ఆవులు ఎక్కువ పాలు పిదికిన సంగతి చాలా మందికి తెలిసిందే. ఈ ప్రాణసూత్రమే సర్వజీవరాసుల్లోనూ ఉన్నదన్న విశ్వాసం కలిగిన వారికీ వర్ణనలన్నీ సహేతుకాలే. (వానితాత్త్వికార్థానికి చూ. స్టెల్లార్ క్రమరిచ్ వ్రాసిన (Indian Sculpture)

తే॥ స్థాణువొక్కండు మగవాఁడు దలఁక కుమియ
ఫలమొసఁగె నట్టె కినియక పద్మవదన
వదనసురఁ గూర్మి నొసఁగ నీవలదె పుష్ప
మైన ననుమాడ్కి నుమిసిన ననిచెఁ బొగడ. 129

ఒక్కండు - పేరూ ఊరూ లేనట్టి, వాడు = ఒకానొకడు; మగవాఁడు = మార్దవంలేని మొరటువాడు (తిన్నడు); తలఁకక = సంకోచం లేకుండా; ఉమియన్ = ఊస్తే (పుక్కిలి నీటితో అభిషేకిస్తే); కినియక = కోపించక; స్థాణువు = మొద్దు (శివుడు); ఫలమున్ = పండును (ముక్తిని); ఒసఁగెను = ఇచ్చాడు; అట్టె = అట; ఆశ్చర్యార్థకం;

అట్టె = అలాగే; కినియక = కోపించక; పద్మవదన = తామరపువ్వువంటి ముఖం కల స్త్రీ; వదన = నోటి; సురన్ = మధువును; కూర్మిన్ = ప్రేమతో; ఒసఁగన్ = ఇస్తే; పుష్పము+ఐనన్= పూలైనా; ఈన్+వలదె = ఇవ్వాలి కదా; అనుమాడ్కిన్ = అన్నట్లుగా; ఉమిసినన్ = పద్మవదన సురను పుక్కిలితో ఊస్తే; పొగడ = వకుళం; ననిచెన్ = పూచింది;

**వకులో ముఖసీధునా** = నోటిమధువుతో వకుళ పుష్పిస్తుంది.

పద్మవదన X ఒక్కండు మగవాడు; వదనసుర X ఉమ్మి ప్రేయన్, కూర్మిన్ X తలకక; పుష్పం X ఫలం విరుద్ధాంశాలు.

శ్రీకాళహస్తి మాహాత్మ్యంలోని కన్నప్ప కథాధారంగా అల్లిన భావం. '' - కొంటి నే వన్ననదంద నొక్క మగవాడిడ - (పీఠిక) పాదం ఆంధ్రవిష్ణువునకూ, ఆంధ్రుల తిరుకాళత్తి; రాయనికీ ఒకే బాధ. ఈయన పద్మవదన వదనసుర లేనివాడు కాగా ఆయన తా'నప్పిన్నదా'ని దండను గైకొన్నవాడు. శివునకే న్యూనత.

తే॥ మధువుఁ గాంతల పుక్కిట మధువు, బేళ్ళ
యీర్ష్యఁ, బసచూపఁ బొగడపై నెలయ, దాన
విరిసెఁ దొల్లిఁటిదళములు, విరులు జడిసె
దీన, సగ్గెల్పునకు నుబ్బి తేఁటు లార్చె. 130

మధువున్ = వసంత ఋతువూ; కాంతల = అందగత్తెల; పుక్కిటి = పుక్కిలి బట్టిన; మధువున్= మద్యము; పేళ్ళ ఈర్ష్యన్ = సమాన నామాలున్నందున కలిగిన ఈసువల్ల; (ఇద్దరున్నూ) పస = చేవ (బలం); చూపన్ = ప్రదర్శించటానికి; పొగడపైన్ = వకుళవృక్షం మీద; వెలయన్ = పరాక్రమిస్తే; దానన్ = చైత్రమాసం పస వల్ల; తొల్లిటి = మునుపటి; దళములు = ఆకులు; విరిసెన్ = రాలిపోయాయి. దీనన్ = ఇక రెండో మధువు పసతో; విరులు = పూలు; జడిసెన్ = వర్షించాయి. ఆ గెలుపునకున్ = కాంతల మధువు గెలుపునకు; తేఁటులు = తుమ్మెదలు; ఉబ్బి = పొంగిపోయి; అర్చెన్ = అరిచినవి. (సంతోషంతో)

వసంతం రాగానే పండుటాకులు రాలిపోవటం, పూలు పూయటం, తుమ్మెదల ఝుంకారాలు సహజమే. ఈ సహజ వస్తువిక్కడ ఉత్ప్రేక్షిత మౌతున్నది.

చైత్రానికీ - పుక్కిట మధువుకూ ఒకే పేరు. వాసుదేవునకూ - పౌండ్రక వాసుదేవునకూ ఒకే పేరున్నట్లు. ఉంటే నాకైనా ఉండాలి. నీకైనా ఉండాలి కానీ ఇద్దరు వాసుదేవులుండరాదని అసలు వాసుదేవునిపైకి నకిలీ వాసుదేవుడు దండెత్తినట్లుగా - ఇక్కడా కలహమేర్పడి తమ తమ బలాలను

పొగడపై చూపించేసరికి - చైత్రబలంవల్ల ఆకులు రాలి బోసిపోయింది. రెండో మధువు వల్ల పూలు వానై కురిసాయి కనుక రెండో మధువునకే విజయం తటస్థించింది. దానికి తేటులుబ్బి కేరింతలు కొట్టాయి.

అలం : హేతూత్ప్రేక్ష.

ఆకులు రాలటం - ఉన్నది పోవటం; కొండనాల్కకు మందువేస్తే ఉన్ననాలుక ఊడినట్లు. అందుకని అది ఓడిపోయింది. రెండో మధువు పసతో బోసిపోయిన చెట్టుకు ఆకుల కంటె గొప్పవైన పూలు పూయటం - గెలుపు.

మధుమాసంలో మధువు నామ మాత్రం. అది చేతికి నోటికందేది కాదు. అసలే అందగత్తెలు (కాంతలు) ఆపైన మధువు. తాకేసరికి మ్రోడు కూడా సరిగమలు పాడినట్లు పూలు జలాజలా రాలటం వల్ల కురిసిన మకరందం తేంట్ల కాహారం. అది బోంట్లిచ్చింది. కనుక వీటి కేరింతలకు హద్దు లేదు. ఒక సహజ విషయం మీద మానవ మనస్తత్వారోపణం చేయటం వల్ల భావం వక్రతాసిద్ధి పొందింది. అంటే అందాన్ని ఆవిష్కరిస్తున్నది.

ఉ॥ మేకొని తాచినన్ భృగువు మెచ్చిన వానికి మర్త్యభార్యయౌ
శ్రీకి నివాసమై చెలిమిసేయుట నిట్టి ప్రశాంతి గల్గెనో
కాకన, నాతిదన్నిన వికాసము నొంది వనస్థలస్థితా
శోకముసేసె మెచ్చునఁ బ్రసూన రజః కనకాభిషేకమున్. 131

మేకొని = పూనుకొని; (కావాలని); భృగువు = ఒక మహర్షి; తాచినన్ = తన్నినా; మెచ్చిన వానికిన్ = ఆమోదించిన విష్ణువునకు; మర్త్య = మానవ; భార్యయౌ; సతియైన; శ్రీకిన్ = సీతకు; నివాసమై = ఇల్లై; చెలిమి = స్నేహం; చేయుటన్ = కట్టటంవల్లనో; ఇట్టి = చెప్పబోయే రీతిగా; ప్రశాంతి = కోపరాహిత్యంతో ఏర్పడిన శాంతగుణం; కల్గెనో కాక = కల్గిందేమో కాబోలు; అనన్ = అన్నట్లు; వనస్థల = ఉద్యానవనమందలి; స్థిత = ఉన్న; అశోకము = కంకేళి; నాతి = స్త్రీ; తన్నినన్ = తంతే; వికాసమున్ = పూలు పూయటమన్న సంతోషం; ఒంది = పొంది; మెచ్చునన్ = మెప్పుగా; ప్రసూన = పూల; రజః = పరాగమన్న; కనక = బంగారు (తో); అభిషేకమున్ చేసెన్ = అభిషేకించింది.

అశోకః చరణాహత్యా = అశోకానికి కాలితాపు దోహదం కనుక నాతి తన్నినా సంతోషించినట్లు పుష్ప వికాసం పొందటం ఎలా సంభవమంటే పూర్వమా చెట్టు సీతకు నివాసమైన ఆమెతో చెలిమి కట్టి ఆమె భర్త భృగువు తన్నినా మెచ్చుకొన్నాడు కనుక - ఆ గుణాన్ని అతని భార్య ద్వారా పొంది ఉండవచ్చు- నని సమర్థన.

అలం : ఉత్ప్రేక్ష. వ్యతిరేకం.

విశే॥ వనస్థలస్థిత అశోకమున్నచోటు నేల. భృగు చరణాహతి పొందిన నారాయణుడు వైకుంఠంలో

ఉన్నట్టివాడు. లేదా జలనిధిలో; అదీ వన = నీటి; స్థలముః చోటే - అతడు పొందిన తన్ను మగవానిది లేదా మహర్షిది. కనుక సహించవచ్చు. ఆశోకం తిన్న తన్ను స్త్రీది; అందునా మానవకాంత. ఐనా మెచ్చుకోవటం. నారాయణుని మెప్పుదలకంటె ఘనం . ఇంకా చాలదన్నట్లు కనకాభిషేకం చేయటం మరో గొప్ప. (తన్నటంవల్ల పాద కదలి పూపరాగం రాలటం సహజం; (త్రిమూర్తుల సత్త్వగుణ పరీక్షార్థం మునుల తరపున పనిగట్టుకొని పోయి ముగ్గురినీ తన్నాడుట భృగువు. నారాయణుడు మెచ్చుకొన్నాడు కనుక సత్త్వగుణనిధి అని తీర్పు చెప్పుకొన్నారని పురాణగాథ.)

అళులే తద్వ దనేందురాగమిళనా ప్రాదుర్భవత్ కోరకం
బుల తేనెల్ సుధలంచు రా, నొకతె నెమ్మోమెత్తఁ, జైత్రంపుఁ బు
వ్వులలోఁ దద్గుణులయ్యె గంధఫలిఁ బువ్వుల్ వుట్టి, పోదోలె నొ
చ్చెలచేఁదై, తఱచెందుఁ దల్లిబడికోల్, చెట్టౌటయే కామహిన్. 132

ఒకతె; నెమ్మోము+ఎత్తన్ = తన చక్కని ముఖాన్ని ఎత్తితే; గంధఫలిన్ = సంపెగకు పువ్వుల్; పుట్టి = పూచి; ఏతత్ = ఈమె; వదన+ఇందు = ముఖమనే చంద్రుని; రాగ = ఎర్రదనముయొక్క; మిళనా = కూడటంవల్ల; ప్రాదుర్భవత్ = పుట్టిన; కోరకంబుల = పూమొగ్గల; తేనెల్ = మరందాన్ని; సుధలు = అమృతము; అంచున్ = అంటూ; అళుల్ః తుమ్మెదలు; రాన్ = వస్తే; చైత్రంపుఁ బువ్వుల లోన్ = చైత్రమాసంలో పూచిన పూలలోపల; తత్+గుణులు+అయ్యెన్ = చైత్రమాసం పుష్పింప జేసినవి కనుక అవన్నీ ఆ గుణం కలవే ఐనవి, చేదై = ఒగరై; పోన్+తోలెన్ = దూరంగా చెదరగొట్టాయి (అళులను); మహిన్ = లోకంలో (భూమిలో); ఒచ్చెల = అయ్యో !; తల్లి బడికోల్ = తల్లిపోలికలోని; చెట్టన్ = చెడు; ఔటయేకా = కానటయే కదా.

చైత్రం పుష్పింపజేసిన సంపెగలుండనే ఉండగా, ముఖరాగేణ చంపకః - అన్నట్లు ఒకామె మోమెత్తి చంపకాలను పుష్పింపజేసింది. ఆముఖం చంద్రుడు కనుక ఆ పూలలో తేనెకు బదులు జరామరణ తారకమైన సుధ కలదని తుమ్మెదలు రాగా, చైత్రపుష్పాల ఒగరు వాసన దరి చేరనీయక తరిమివేసాయి. ఇది ఇంతే. ఎందుకంటె తల్లిగుణం కూతురుకు రావటం మంచిది కాదు కదా.

అలం : అర్థాంతరన్యాసం.

సంపెగవాసన తుమ్మెదకు సరిపడదని కవిసమయం. అదే ఇలా చమత్కరింపబడినది.

గంధఫలీ శబ్దం - స్త్రీలింగం కనుక తల్లితనం ఆరోపితమై, ఇందు శబ్దం పుంలింగం కనుక పితృభావం విన్యస్తమైనదన్నమాట.

అలరెఁబ్రియాళువోర్తు ప్రియమౌట వసంతముఁబాడ, నప్పుడ
వ్వెలఁది సపత్ని భక్తికిని వేల్పులు మెత్తురు గాన రాగమున్
ఛలమునఁ దన్ను బాడఁగ వసంతుఁడు దా దయ చేసెఁగాక, యా
యలె ? నిజ శక్తి నా యనుచు నాపసకుం గొదవెట్టె నీసునన్. 133

ఓర్తు = ఒకతె; ప్రియము; ఔటన్ = ఇష్టమైనందున; వసంతమున్, ఆ రాగాన్ని; పాడన్ = పాడగా; ప్రియాళువు = ప్రేంకణ వృక్షం; అలరెన్ = పుష్పించింది; అప్పుడు = ఆ సందర్భంలో; ఆ వెలది = పాడిన స్త్రీయొక్క, సపత్ని = సవతి, భక్తికిన్; వేల్పులు = దేవతలు; మెత్తురు గానన్ = మెచ్చుకొంటారు కనుక, రాగమన్ = రాగమన్న; ఛలమునన్ = మిషతో; వసంతుడు; తన్నునెన్ = తనను గురించి; పాడగాన్ = పాడేసరికి; తాన్; దయచేసెన్+కాక = అనుగ్రహించినాడు తప్ప; నిజ = ఆమెయొక్క; శక్తినా = శక్తి వల్లనా; ఆయలె = సరేలే; అనుచున్ = అంటూ; ఆపసకున్ = ఆ రాగ మాహాత్మ్యమునకు (ఆమె గొప్పదనానికి), ఈసునన్ = అసూయతో; కొద పెట్టెన్ = తక్కువదనాన్ని ఆపాదించింది.

వసంతరాగంతో ప్రేంకణం పూచింది. ఒకామె తనకిష్టమైన రాగమని పాడితే అలా జరిగింది. ఇది సహించని ఆమె సవతి అన్నది కదా. ''సరేలే. ఇది ఆమె శక్తి కాదు. భక్తికి వేల్పులు అనుగ్రహిస్తారు కదా. ఈమె వసంతం పాడితే వసంతుడు అనుగ్రహించి పుష్పింపజేసాడు అంతే. ఆమె పాట మహత్తుతో కాదు''.

అలం : కైతవాపహ్నవం.

అధరసుధం బ్రాణిజతఁ బ్రాణి యగుచు, మౌక్తి
కాండమాలిక నిడెను నాసాగ్రమౌక్తి
కంబయునఁ జాలునన విచ్చె గతజరత్సు
మంపు వావిలి మొగ మూర్పు నింప నోర్తు. 134

ఓర్తు = ఒక స్త్రీ మొగము; ఊర్పున్ = ముఖనిశ్వాసము; నింపన్ = నిండిస్తే; నాస+అగ్ర = ముక్కు చివర; మౌక్తికంబ = ముత్తెమే (బులాకీకున్నది); ప్రాణిజతన్ = ప్రాణమున్న ముత్తెపుచిప్పలో పుట్టినందున; అధరసుధన్ = మోవి అమృతంచేత; ప్రాణి యగుచున్ = ప్రాణం కలదై; మౌక్తిక = ముత్యాల; అండ = గ్రుడ్ల; మాలికన్ = సమూహాన్ని (మాలను); ఇడెను = ఇచ్చింది; అనన్+చాలు ననలు = అనటానికి వీలైనపూలు; గత = పోయిన; జరత్= ముసలి; సుమపు = పూలు గలదైన; వావిలి = సింధూరం; విచ్చెన్ = పూచింది.

సిందువారోముఖానిలాత్ - కనుక ఒకామె నిట్టూర్పున కది పూచింది. ఆమె నాసాగ్ర మౌక్తికం - చేతనవంతమైన ముత్తెపుచిప్పలో పుట్టినందువల్ల అది అధరసుధను త్రాగినందువల్ల ప్రాణం కలదై ఈ ఊర్పు దానిని తాకుతూ ప్రసరించినందువల్ల - అది గ్రుడ్లను పెట్టినట్లుగా వావిలి ముత్యాలవంటి పూలు పూచింది.

అలం : వస్తూత్ప్రేక్ష

వావిలి పూలు ముత్యాలవలె ఉంటాయి కాబోలు !

ఘనమగు నాకు రాలి తిలకం బల రిక్తత నున్న నోర్తు లోఁ
గనికర మూని కన్నుఁగవఁ గాయజుఁ డిల్లడ యిడ్డ తూపులే
యనువుగ నించెఁ గాక మఱియంటక ముట్టక యొక్క చేష్టలే
కనెగడెఁ జూడ్కి నంట యిది గల్లనఁగా నలరించెఁ జూపులన్. 135

ఓర్తు = ఒకానొక చెలువ; తిలకంబు = బొట్టుగుచెట్టు; ఘనము+ అగు (ఘనముగన్)= దట్టమైన; ఆకు; రాలిపోగా; అతి = మిక్కిలి; రిక్తతన్ = లేమితో (బోసిగా); ఉన్నన్ = ఉంటే; లోన్ = మనస్సులో; కనికరము = జాలి; ఊని = పూని; కన్నుఁగవన్; కనుల జంటలో; కాయజుఁడు= మన్మథుడు (శరీరంనుండి జన్మించేవాడు); ఇల్లడ+ ఇడ్డ = న్యాసంగా దాచిన; తూపులే = బాణాలే; అనువుగన్ = తగినంతగా; నించె కాక =నింపింది కనుక మఱి; అంటక = చేతితో తాకక; ముట్టక = ముట్టకుండా; ఒక్క చేష్టకూడా లేక; చూడ్కిన్ = చూపుమాత్రంగా; నెగడెన్+ అంట = వర్ధిల్లినది (పూచినది అనటం) ఇది; కల్ల = అబద్ధం; అనంగాన్ = అనేటట్లుగా; చూపులన్; అలరించెన్; పుష్పింపజేసింది.

''తిలకో వీక్షణేన చ'' - తిలకం చూపుతో పుష్పిస్తుంది. కనుక ఒకతె తనచూ పూలతోనే పుష్పింపజేసింది (పుష్పవతిని చేసింది). ఎందుచేత - ఆమె చూపులు మన్మథుడు ఇల్లడపెట్టిన అమ్ములు కనుక. చూపులను నీలి కల్వలతో ఉపమించటం సంప్రదాయం. చూపులే మన్మథుని బాణాలైన నీలి కలువలు కనుక బొట్టుగు పుష్పించింది లేకపోతే కల్ల.

వసంతం రాగానే ఆకు ఘనంగా రాలటం సహజం. అందువల్ల తిలకం బోసిపోయింది.

కాయజుఁడు శరీరంలోనే ఉన్నాడు కనుక అతని తూపులే ఆమె చూపులు. ప్రణయార్ద్ర దృష్టికి సర్వజగత్తు పుల్కరిస్తుంది. కనుక ఇది కల్లకాదు.

సాంద్రమకరందవృష్టి రసాతలంబు,
దొరఁగు పువ్వుల భువియుఁ, బూధూళి నభము
నీక్రమత్రయి మాధవుఁ డాక్రమించె
నురు విరోచన జనిత మహోష్మ మడఁగ. 136

మాధవుఁడు = లక్ష్మీ భర్త విష్ణువు; (వసంతుడు) రసాతలంబున్ = పాతాళలోకాన్ని; సాంద్ర= దట్టమైన; మకరంద = తేనె; వృష్టినీ = వానతో; తొరఁగు = రాలే; పువ్వులన్ = పూలతో;; భువియున్ = భూమీ; నభమున్ = ఆకాశాన్ని; పూధూళిన్ = పూల పరాగంతో; ఈ; క్రమ = అడుగులు; త్రయిన్ = మూటితో (ముల్లోకాలనూ); ఆక్రమించెన్ = ఆ = అంతటా; చక్కగా; క్రమించెన్ = నడచినాడు(జయించినాడు.); ఉరు = విస్తారమైన; విరోచన = ఆ పేరుగల రాక్షస రాజునకు; సూర్యునివల్ల; జనిత = పుట్టినవాడు బలి; మహా+ ఊష్మము = గొప్ప ప్రతాపం; తీక్ష్ణమైన ఎండ; అడఁగన్ = పోగా; ఆక్రమించెన్ = జయించినాడు.

అలనాడు త్రివిక్రముడై విష్ణువు త్రిలోకాలను - భూమ్యాకాశాలు, రసాతలం ఈక్రమంగా - త్రిపాదాల నుంచటం ద్వారా క్రమించినట్లే నేడు వసంతుడు - అదే పేరు కలవాడైనందున తేనెవానతో రసాతలాన్ని, పూలతో భూమినీ, పూధూళితో నింగినీ క్రమంగా ఆక్రమించాడు.

లోకమంతాపూలమయం, మకరంద ప్రవాహాలతో నిండిపోతున్నది. గగనమంతా పూధూళితో - చాలా అందమైన లోకం చిత్రింపబడినది.

ఆ కాలంలో విజయనగరమంతా ఉద్యానవనమయం - రాయల ఉద్యానవనం పేరు నందనోద్యానం వాస్తవిక దృశ్య చిత్రణకు ఈ వర్ణనమంతా అవాస్తవికం కాదు. కేవలోహాలోకమూ కాదు. (పోల్చ. 4-24, 88, 105).

**ఊడుకోనఁ బడు మధూలిక**
**యోడికలకుఁ గ్రిందఁ గ్రమ్మియుండెడు తేంట్లన్,**
**నీడలు దిరిగియు, దిరుగని**
**జాడఁ దరుల్ప్రోలిచె నవ్వసంతపు వేళన్. 137**

అవ్వసంతపు వేళన్ = ఆ వసంత ఋతువులో; ఊడు కొనన్ = భూమి చిల్లిపడిపోవునట్లుగా; పడు = కారే, మధూలిక = తేనె సోనల; ఓడికలకున్ = వానలకు (ఓడిక = ధారగా పడటం); క్రిందన్ = నేలపై; క్రమ్మి = మూగి; ఉండెడు = ఉండే; తేంట్లన్ = తుమ్మెదలతో; నీడలు = వృక్షచ్ఛాయలు; తిరిగియున్ = ప్రొద్దుతో పాటుగా తిరిగినా, తిరుగని జాడన్ = తిరగనట్లుగా; తరుల్ = చెట్లు; పొలిచెన్ = అందగించినవి.

ననకారున తేనె సోనలు వానలై కురుస్తుంటే దానికోసం తుమ్మెదల గుంపులు గుంపులై మూగాయి. ఇదెలా ఉన్నదంటే; చెట్ల నీడలు సూర్యునితో పాటు తిరిగినా తిరగనట్లే ఉంది. తుమ్మెదల గుంపులు నీడల్లాగా చెట్ల క్రింద మూగినవి.

**శతదళమంజరీధవళ చైత్రనిశామలచంద్రికౌఘముల్**
**వృత వియదంత కేళివనవృక్ష లతాంత రజచ్ఛటన్, గళం**
**కితఁగని కామినీ కమన కేళియుఁబోఁ జెడవా నగాటవీ**
**కతక పరాగమొక్క దెసఁగ్రమ్మి యనచ్ఛత మాన్పకుండినన్. 138**

శతదళ = నూరురేకులు గల పద్మం; మంజరీ = గుంపుల వలె (తెల్లని నూరు రేకుల పద్మవనం వికసించినట్లుగానున్న); ధవళ = తెల్లని; చైత్రనిశా = చైత్రరాత్రులందు; అమల = నిర్మలమైన; చంద్రిక = వెన్నెలల; ఓఘముల్ = ప్రవాహాలు; వృత = క్రమ్మిన; వియత్+అంత = ఆకాశం చివరదాకా; కేళివన = క్రీడోద్యానాల్లోని; వృక్ష = చెట్ల; లత+అంత = తీగల చివుళ్ళపై వికసించే పూలయొక్క; రజః = పరాగ; ఛటన్ = రాశితో,

(ఆకాశం దాకా వ్యాపించిన ఉద్యానవన లతావృక్షాలకు పూచే పూల పరాగం వల్ల -)

కళంకితన్ = కళంకంతో చెడిపోయిన (బురదైన); కని = చూచి; ఒక్కదెసన్ = ఒక్కప్రక్క; నగ = కొండలపైని; అలువీ = అడవుల్లోని; కతక = చిల్లచెట్ల; పరాగము = ధూళి; క్రమ్మి = ఆవరించి; అనచ్ఛతన్ = కళంకాన్ని; మాన్పకుండినన్ = మాన్పకపోతే; కామినీ కమన = ప్రేయసీ ప్రియుల; కేళియున్ = క్రీడ; పోన్; నశించేటట్లు; చెడవా ? = చెడిపోవా ?

(చైత్రమాసపురాత్రులు ఓహో ! నూరు రేకులపద్మం కేసరాల్లాగా వెన్నెల తెల్లగాకురుస్తున్నది. నింగినంటే వనవృక్షాల పూల పరాగం అంతరిక్షమంతా అలముకొన్నది. దూరాన కొండలపైనుండి బల్లచెట్ల పూప్రరాగమూ క్రమ్ముకొన్నది.)

ఆ వెన్నెల రాత్రుల్లో ప్రేయసీ ప్రియులు విహరిస్తున్నారు. (పోల్చు- 2-61) ఈ భావం మీద నిర్మించిన అలంకారసౌధ మూపద్యం. తెల్లని వెన్నెలను క్రమ్మిన పరాగం కలుషితం చేస్తుంటే కొండలనుండి చిమ్మే బల్లచెట్ల ధూళి దానిని విరిచివేస్తుంటే వెన్నెలకేమి తక్కువ?

శైత్య పాండిమలు తుషారాంతమునఁ జేరె
నిరులు కొంద్రాక్ష పందిరుల విరుల;
వలయగానము లయుక్తలకార్శ్యమునఁ జేరె,
మలయంపు గ్రమ్మ వీవలుల, నలుల;
సౌరభోల్లాసముల్ జాతిగ్రుంగఁగఁ జేరె,
నలరారు గొదమ క్రోవులను, నెలను;
స్ఫుటజటా మనస్కరంబులు ప్రతిచ్యులిఁ జేరె
నందన ప్లక్ష సంతతుల, వ్రతుల;

స్వభృత పరభృత వినుత రసాల పరిష దహరహః క్లుప్త
బహురహః ప్రహర
విహరమాణమానవతీమ్లానిమాని
వారి వారిజవన గంధవాహమొులసె. 139

తుషార = మంచు (కాలం); అంతమునన్ = చివర (పోగా); శైత్య = చల్లదనం; పాండిమ = తెల్లదనం; ఇరులుకొన్ = చీకట్లు క్రమ్మే; ద్రాక్ష పందిరులన్ = ద్రాక్షపొదల్లోను; విరులన్ = పూలలోను; చేరెన్ = చేరాయి.

మంచుకాలం పోయి వసంతంరాగానే - మంచుచల్లదనం ద్రాక్షపందిళ్ళ క్రీనీడల్లో తెల్లదనం పూలల్లో చేరాయి. (ద్రాక్ష పందిరిపై ప్రాకి తోటలో చీకట్లు క్రమ్మాయి. పూలు పూచాయి.) అయుక్తల = వియోగినులయొక్క; (న+యుక్త = భర్తలతో కలియనిది); కార్శ్యమునన్ = చిక్కిపోవటంవల్ల; వలయ = గాజులు; మలయంపుఁ గమ్మనీవనలన్ = మలయపు కొండనుండి వీచే గంధవాయువులలో; గానములు = పాటలు; అలులన్ = తుమ్మెదల్లో; చేరెన్.

చిక్కిపోయిన కారణంవల్ల వియోగినుల చేతుల గాజులు జారిపోయి మలయపవనముల సుడులలో; గానం తుమ్మెదల్లో చేరాయి.

(చూ. 123 పద్యం)

జాతి = జాజిపూవు; క్రుంగఁగన్ = నశిస్తే; (దాని) సౌరభ = వాసన; ఉల్లాసవము(ల్) వికాసము(లు);అలరారు = అలరు = పూలతో; ఆరు = అందగించే; కొదమ = మదించిన; క్రోవులను = గోరంట్లులో, నెలను - జాబిల్లిలో; చేరెన్.

(120లో మాలతి పూయదన్నాడు కదా) జాజి పూయటం లేదు. దాని వాసనలు గోరంట్లులో చేరితే, వికాసం నెలవెన్నెలలో చేరిపోయినవి. (గోరంటలు వెన్నెలలు అలరారు తున్నాయి).

వ్రతిచ్యుతిన్ = సన్యాసుల వ్రతభంగంవల్ల, (స్త్రీ కాంక్ష కల్గటమే సన్యాసవ్రతభంగం); స్ఫుట = స్పష్ట; జటా = జడలు; మస్కరంబులు = కర్రలు; నందన = తోటల; ప్లక్ష = జువ్వి చెట్లలో; వృతులన్ = ఆవరణలలో (కంచెలలో); చేరెన్ (తోటల్లో జువ్వులు ఊడలు దిగితే; కంచెలైవెదురుపొదలు పెరిగాయి).

సన్యాసులు వ్రతభంగం పొందే సరికి ఇక ఉండటం దండగని జడలు తోట్లలో జువ్వి చెట్ల ఊడల్లో చేరితే దండములు కంచెల్లో కలిసి పోయాయి (చూ.4-66) స్వభృత = తమచేపెంచబడిన; పరభృత = కోకిలలచేత; వినుత = స్తుతింపబడ్డ; రసాల = ఆపేరున్న మామిడిచెట్ల; పరిషత్ = (సమూహం) తోటల్లో; అహరహః = నిత్యమూ క్లప్త = కూర్చబడ్డ; బహు = అనేక; రహః = రహస్య (ఏకాంత)ము; ప్రహర = జాముల్లో; విహరమాణ = విహరిస్తున్న; మానవతీ = అభిమానవతుల; పరిమ్లానిమ = బడలికను; ఆనివారి = చక్కగా పోగొట్టే; వారిజవన = తమ్మిపూల గుంపు (నుండి వీచే); గంధవాహము = వాసనగల గాలి; ఒలసెన్= క్రమ్మింది.

మామిడి తోటల్లో మానవతులు పెంచిన కోకిలలాడుతూ - కూస్తూ ఉన్నందున అందంగా వుంది. ఆ తోటల ఏకాంతపు మరుగు ప్రదేశాల్లో వారు క్రీడించి అలసిపోయారు. ఆ అలయికను తమ్మి కొలనులపైనుండి ప్రసరించే గాలులు పోగొడుతున్నవి. (చూ. ఆ శ్వాస ప్రారంభ పద్యం.)

అలం : సీస పద్యం నాలుగు పాదాల్లో యథాసంఖ్యం, అంతట స్వభావోక్తి ; పర్యాయం.

**సారెకుఁ గీరముల్, ఫలరసాలము, శాఖలలోనఁ ద్రిమ్మరం**
**గా, రహిఁ దన్మధూళికకుఁగా, నళి పంక్తులు వెంటఁగ్రుమ్మరం**
**గా, రొదమించె నందుఁ జిలుకల్ వనలక్ష్మియుఁ దద్వచస్సుధాం**
**ధోరుచు లానఁగా సరపణుల్ జనులట్లిడి పెంపఁగా బలెన్.** **140**

కీరముల్= చిలకలు; సారెకున్= నిరంతరం; ఫలరసాలము = పండ్లుగలమామిళ్లు; శాఖలలోనన్ = కొమ్మల్లో; త్రిమ్మరంగాన్ = తిరుగుతుంటే; రహిన్ = కోర్కెతో; తత్ = ఆ మామిడి; మధూళికకున్ = తేనెసోనలకు;

కాన్ = అనుతున్నట్లు (కోసం); అళిపంక్తులు; = తుమ్మెదల బారులు; వెంటన్ = చిలుకల వెనుక; క్రమ్మరంగాన్ = తిరుగుతుంటే; అందున్=ఆ రెంటిలో (తుమ్మెదలు ; చిలుకలు); చిలుకల్; వనలక్ష్మియున్ = వనదేవత కూడా; జనులు అట్లు = మనుష్యుల్లాగానే; తత్ = ఆ (చిలుకల); వచః = అరుపుల; సుధ+అంధః = వెన్నెలన్న భోజనపు; రుచులు = చవులు; అనఁగాన్ = ఆస్వాదించటానికై; సరపణుల్ = గొలుసులు; ఇడి = వేసి; పెంపఁగాన్ బలెన్ = పెంచినందువల్లనో అన్నట్లుగా; రొదన్ = ధ్వనులతో; మించెన్ = రెట్టింపైనది.

చిలుకలు రసాలపు తోపుల్లో పండ్ల కొమ్మలపై దట్టంగా ఎగురుతున్నవి. వాటి వెనుకనే తుమ్మెదలు తేనె కోసం బారులై ఎగురుతున్నవి. ఇదెలా ఉందంటే; మనుష్యుల్లాగానే వనలక్ష్మికూడా చిలుక పలుకలున్న అమృతమయమైన అన్నము రుచిని ఆస్వాదించటానికై ఇనుపగొలుసులు వైచి పెంచుతున్నదో అన్నట్లుగా - ఉంది.

**అలం :** ఉత్ప్రేక్ష.

సీ. వ్రతిహంతృతాత్తకీటత చన్న, భృంగసం
ఘపుటంగములచేతఁ గాయమెత్తి,
యమదిశాగత మరుత్ప్రాణియై దదలిరం
గస్థలాబ్జినిఁ దమ్మికన్ను దెఱచి,
ప్రాంతపుల్లామ్ర సంశ్రయి, తచ్ఛటాహతా
ధ్గతి లేచి చెలిఁ జైత్రుఁగౌఁగిలించి,
యురు పరాగపుశాటి నుద్దండ వాప్యుత్ప
లస్రవత్స్రీధురత్యస్ర ముడిపి

తే. క్రమ్మఱఁ బలాశ కటకాముఖమునఁ గీర
చలితశాఖాస్ఫుటాశోకశరముఁ గూర్చెఁ
దద్రతికిఁ గాఁగఁ జలికాలఁ దన్ని మంచు
పాండురాంగుండు విడిచిపో బ్రతికి మరుఁడు. **141**

మంచు = మంచుకాలమున్న; పాండుర = తెల్లని; అంగుండు = అంగాలున్నవాడు (శివుడు); తత్+రతికిన్+కాన్ = ఆ రతీదేవి కోసం; చలికాలన్ = చల్లని దయగల పాదంతో (చలి గాలిపే కాలితో); తన్ని = విడిచిపోన్ = చంపకుండా వదలిపెట్టగా; మరుఁడు = మన్మథుడు; బ్రదికి= జీవించినవాడై.

వ్రతి = సన్యాసులను; హంతృత = చంపినందువల్ల; ఆత్త = లభించిన (పొందిన); కీటత = క్రిమిత్వం; చన్నన్ =పోగా; భృంగసంఘపు = తుమ్మెదల గుంపు; అంగములచేతన్ = అవయవాలతో; కాయమున్ = శరీరాన్ని; ఎత్తి = ధరించి.

శివుని దగ్గర నుండి వ్రతులైనవారినెల్లా బాధించినందువల్ల పురుగై ఆ పాపం దీరిపోగానే తుమ్మెదల అంగాలతో శరీరం ధరించి-పురుగుదనం తుమ్మెద పోవటం - ఆ అవయవకాంతివంటి కాయం ధరించటం. పురుగు నుండి మనిషి కావటం - సుందరంగా వర్ణింపబడినది.

యమదిశ = దక్షిణ దిక్కు నుండి; ఆగత = వస్తున్న (వచ్చిన); మరుత్ = గాలితో; ప్రాణియై = ప్రాణం పోసుకొన్న వాడై; తత్+అళిరంగ = తుమ్మెదల; కాంతితో కాయధారణం చేసాడో వానికి ఆటపట్టైన;స్థల+అబ్జినిన్ = మెట్టతామర గుంపులో; తమ్మికన్నున్+తెఱచి = అదే తామర పూవన్న కన్ను విప్పి (యమ దిశ ప్రాణం తీసేది తప్ప పోసేది కాదు. కనుక ఇది అద్భుత జన్మ)

శరీరం పొందిన పిదప ప్రాణం పోసుకోవాలి కనుక దక్షిన దిగ్వాయువుతో ఊపిరిపోసికొని, మెట్ట తామర తీగలో ఆ పూవన్న కన్ను తెఱచినాడు. యమదిశావాయువు ప్రాణం కావటం వల్లనే వియోగులకు, వ్రతులకు ప్రాణాంతకుడైనాడు.

ప్రాంత = సమీపంలో; ఫుల్ల = విచ్చిన; ఆమ్ర = మామిడిని; సంశ్రయి = ఆశ్రయించుకొని ఉన్న; తత్+ఘటా = ఆ తుమ్మెదలగుంపు (యొక్క); హఠ+ఉద్గతిన్ = హఠాత్తుగా లేవటం ద్వారా లేచి; చెలిన్ = స్నేహితుడైన, చైత్రున్ = వసంతుని; కౌగిలించి = వాటేసుకొని -

దగ్గరలోని మామిడ్రమోకపై మూగిన తుమ్మెదలగుంపు హఠాత్తుగా గాలికో - మనిషిరాకకో బెదరి, లేవటమే మన్మథుడు - కన్ను తెఱచినాక - లేవటం. లేచి వసంతుని కౌగిలించుకొన్నాడు.

ఉరు = పెద్ద; పరాగపు శాటిన్ = పుష్ప రజస్సన్న వస్త్రంతో; ఉద్దండ = పొడవైన; వాపి = బావిలోని; ఉత్పలం = కలువ (నుండి); స్రవత్ = కార్చే (రే); సీధువు = తేనె అనే; రతి+అస్రము = రతికన్నీరు; ఉడిపి = తుడిచి.

మొదట పదార్థ సృష్టి చేసి ప్రాణాత్మ స్వరూపుడైన పరమాత్మ దానిలో అనుప్రవేశిస్తే జడపదార్థం జగత్తు (కదిలేది)గా మారినదని ఐతరేయోపనిషత్తు. జగత్ప్రాణస్వరూపుడు వాయువే -

దిగుడుబావిలోని కలువల నుండి కారే తేనె అన్న రతి బాష్పజలాన్ని పెద్ద పొడవైన పూధూళి అనే వస్త్రంతో తుడిచి - (పూధూళి బంగారు వన్నె కనుక పట్టు బంగారు వస్త్రం ధ్వనిస్తున్నది).

క్రమ్మఱన్ = మరల; పలాశ = మోదుగుపూవును; కటకాముఖమునన్ = నాట్యంలో హస్తముద్రా విశేషం. (బాణప్రయోగం చేసేవేళ మూడు వ్రేళ్ళతో పట్టుకోవటం జరుగుతుంది కనుక దానిని అభినయించటం)తో; కీర = చిలుకలతో; చలిత = చలింపచేయబడిన; శాఖాస్ఫుట = కొమ్మల్లో స్పష్టపడ్డ; అశోక శరమున్ = అశోకపుష్పబాణాన్ని; కూర్చెన్ = తొడిగెను.

తిరిగి అశోక పుష్ప బాణాన్ని సంధానం చేసాడు మరుడు.

మోదుగు పువ్వే అతని కటకాముఖహస్తం (అకారంలో రెండూ ఒకటే). బాణం కంకేళి. గురి

చూచేటప్పుడు బాణం చలిస్తుంది. కనుక (చూ. 5-13) ఆచలనం చిలుకలవల్ల కొమ్మ కదలటం. ఆకులు - రెమ్మలు కదలటం. ఆ కదలికవల్ల పుష్పం స్పష్టంగా కన్పిస్తున్నది.

పద్యంలో భావం క్రమవికాసం పొందినది మొదటి పాదంతో పుట్టుక - రెండోపాదంలో కన్ను తెరవటం - మూడులో స్నేహితుని కౌగిలించుకొని - నాల్గలో భార్య కన్నీరుడిపి - మరలా బాణానుసంధానంచేయటం - ఈ క్రమోన్మీలనసౌందర్యం - భావక్లిష్టతతోపాటు ఆస్వాదనీయమైనది.

87వ పద్యం భావం లాంటిదే ఇదిన్నీ.

అళులే అతని శరీరం. ఈ నలుపు పాపజన్మ సంబంధంగా వర్ణింపబడినది. ఆ పాప కారణం ప్రతిహననం. ఈ హననం భౌతిక మృతికాదు. బాధార్థకంలో ప్రయోగింపబడినది. మహాత్ములను బాధించినందున క్రిమిజన్మ కలిగింది. అంతేకాక అతడు తనువు లేనివాడు కనుక అళులే తనువు. పద్మమే కన్ను. పలాశము కట కాముఖం - ఇత్యాదిగా అన్వయం చెప్పుకోవాలి.

విశే॥ రాయలవారి వసంతోత్సవ విశేషాలను తిమ్మన గారు వర్ణించారు. ప్రతి వర్ష వసంతోత్సవ-(చూ.పారిజాతం అశ్వాసాంతం). ఇవే మన్మథోత్సవాలు. చైత్రశుద్ధ త్రయోదశి నుండి 9 రోజులు. ఈ ప్రస్తుత పద్యవర్ణన మహోత్సవస్మరణకు

> చిగురుఁ బికాళికిన్, ఫలముఁ జిల్కలగుంపునకున్, మధూళిఁ దేఁ
> టిగమికిఁ, దావి గాలికి, విటీవిటకోటికిఁ బువ్వులుం, దలం
> బుగఁ గృప నీనియున్ సురభి పుంస్త్వముఁ బాంథులచోటఁ బూనె, న
> ట్లగుఁ బ్రజ కోర్కు లిచ్చుతన కాత్మఁ దలంచిన దబ్బదే యనన్. **142**

సురభి = చైత్రం (వసంతఋతువు); పిక+ఆళికిన్ = కోకిలల గుంపుకు; చిగురున్ = చిగురుటాకూ; చిల్కల గుంపునకున్; ఫలమున్ = పండూ; తేటిగమికిన్; తుమ్మెదల గుంపుకు; మధూళి = తేనె సోన; గాలికిన్; తావి = వాసన; విటీ = విట కోటికిన్ = విటకత్తెలకు; విటులకు; పువ్వులున్; కృపన్ = దయతో; దళంబుగాన్ = అధికముగా; ఈనియున్ = కనీ (కూడా); పాంథుల చోటన్ = విరహుల విషయంలో; మాత్రం (పాంథుడు = బాటసారి, ప్రవాసి); పుంస్త్వమున్ = కాఠిన్య రూపమైన పురుషత్వాన్ని; పూనెన్ = వహించినది. అది, అట్లు+అగున్ = అలాగే ఔతుంది; ప్రజ కోర్కులు = ప్రజల కోరికలు; ఇచ్చు = ఇచ్చే; తనకున్ = సురభికి; ఆత్మన్ = తనలో; తలంచినదేదో అది; అబ్బదే = లభించదా; అనన్ = అన్నట్లుగా (అ పుంస్త్వమును పూనినది). అన్నిటికీ కామధేనువై తల్లివలె కావలసిన దిచ్చినది కానీ, ప్రవాస విరహానుభవం పొందే వారిపట్ల మాత్రం; మగవాడై పోయినది. అది సరే. అందరకూ కావలసినదిచ్చే కామధేనువు తాను కోరుకొన్న కోరికను పొందలేదా !

సీ॥ సహకార ఫలరస సౌరభ్యములఁ గూడి
    మాధ్వి మోవులఁ గదంబముగ వలవ,

మలయజోదరత జంభలఫలత్వగ్గత
శ్రీ మించుచెవుల గొజ్జఁగలు మెఱయ
శశి కదళోదరచ్ఛదపుఁ బావడ లూరు
చకచకఁ బట్టి పాలికిఁ బెనంగఁ,
ద్రాక్కు తేంట్లకుఁ గాఁక లెక్కింపఁ జెరివిన
గంధఫలీపంక్తిఁ గబరు లలరఁ,

తే॥ గేలఁ గలవంటకపుఁ దావికిని బులిమిన
ఘుసృణములు మించ, ననలఁ బేరెసఁగు పవన
ములు, న మేరురజోవృష్టి బూదిఁ జఱవ
నింతు లెనసిరి పూఁబొద రిండ్లఁబతుల. 143

ఇంతులు = ఉవిదలు; మోవులన్ = పెదవులందు; మాధ్వి = మధువు; సహకారఫలరస = మామిడి పండ్ల రసముయొక్క; సౌరభ్యములన్ = వాసనలతో; కూడి = కలిసి; కదంబముగన్=అనేకవాసనల సమ్మిశ్రణమై; వలవన్ = పరిమళిస్తుండగా.

వసంతర్తువు గనుక మామిడి పండ్లు తిన్నందున ఇప్పపూల సారాయిత్రావినందున- రెంటి వాసనలు కలిసి మోవులనుండి వింతపరిమళ మీనుతుండగా -

మలయజ = గంధము; ఉదరతన్ = లోపలనున్నందువల్ల; జంభలఫల = నిమ్మపండు; త్వక్+ గత = తోలువన్నెకల; శ్రీ = కాంతి; మించు = అతిశయించు; చెవులన్ = చెవుల్లో; గొజ్జఁగలు = ఆ పేరుగల పూలు; మెఱయన్ = వన్నె లీనుతుండగా.

గంధం లోపల పూసుకొన్నందున దబ్బపండు చర్మం వర్ణంలాగా పసిడికాంతులతిశయించే చెవుల్లో గొజ్జగపూలు ప్రకాశిస్తుండగా; శశికదళ = కర్పూరపుటరటుల; ఉదర = పొట్టలోపలి; ఛదపు = పొరల కాంతివంటి రంగుకల; పావడలు=పరికిణీలు; ఊరు = తొడల; చకచకన్ = ధాళధళ్యములను; పట్టి = బంధించి; పాలికిన్ = భాగం కోసం; పెనఁగన్ = కలహిస్తుండగా

వారు ధరించిన వస్త్రాలు కర్పూరపుటరటి బోదెలోపలి పొరల వన్నెలు కలది. అవి ఊరువుల కాంతితో కలహిస్తున్నవి.

త్రొక్కు = మూగికాళ్ళతో త్రొక్కే; తేంట్లకున్ = తుమ్మెదలకు; కాఁకలు = వేడిమి; ఎక్కింపన్=రెట్టింపు చేయటానికై; గంధఫలీ = సంపెగపూల; పంక్తిన్ = చెండ్ల (గుంపు) తో; కబరులు = ముడులు; అలరన్= ఒప్పారుతుండగా;కేలన్ = చేతిలో; కలవంటకపుంతావికిన్ = చక్కనివంటల వాసనలు (పోవటానికై;) పులిమిన= రాసిన;ఘుసృణములు = కుంకుమ పూవులు; మించన్ = ఎక్కువ కాగా;

ననల = పూలతో; పేరు = మిక్కిలి; ఎసఁగు = ఏపుమీరే; పవనములు = గాలులు; నమేరు = సురపొన్నల; రజోవృష్టిన్ = పూధూళితో; బూఁదిఁజలవన్ = బూడిద రాయగా (వీపులకు); పతులన్ = భర్తలను, పూఁబొదరిండ్లన్ = పూలపొదరిళ్ళలో; ఎనసిరి= కూడిరి.

వివిధ వంటకములు తిన్నందున చేతులకంటిన (మత్స్యాది) వాసనలు పోవటానికై కుంకుమపువ్వు రాసుకొన్నారు. ఆ వాసనలు వేస్తుండగా, గాలికి రాలిన సురపొన్నల పుప్పొడి వీపులకు బూడిద రాసినట్లు అంటుకోగా సతులు భర్తలతో సంగమించారు.

మొదటిపాదంలో మోవివాసన - రెండులో చెవుల గంధం - గొజ్జగల వాసన మూడులో పావడల వన్నెలు - తొడలకాంతుల సయ్యాటలు - నాల్గులో కబరులందున్న సంపెగలవాసనలు- హస్త ఘుసృణ పరిమళాలు రాగా వాటితో సురపొన్నల రజ శ్శయ్యలపై సంగమించారు

వారి అభిరుచులు - కట్టుబట్టల సుకుమార కాంతులు - పరిమళభరిత జీవన విస్తృతి - భోగానుభూతి - ఓహో ! నాటి జాతి అనుభవ సంపద - !

2-61 తో పోల్చుకొని ఆనందించదగ్గ పద్యం.

ప్రతి ఋతువర్ణనాంతంలో ఈ దంపతీ శృంగార వర్ణన - కామ పాశవిక కామభావ విరుద్ధమైన భోగానుభవ దృష్టితో చేయటం గమనించాలి.

ఈ అభిరుచి వాసనలు లేని వట్టి పొందులు పందులకూ ఉంటాయి కదా.

వ॥ అట్టి వసంత సమయంబున. 144

ఈ వచనపు తుంట వర్ణననుండి కథలోకి పోయేమార్గం - ద్వారం. లేకపోతే అనవసరం.

ఉ॥ కామిని మేఘరంజి మధు గర్వ మడంతు నటంచు, లో నిజ
క్షేమముఁ గోరి, పాడి మణి చిత్ర మరుత్తృణతాచిరద్యుతి
స్తోమ వలాహకావలులు దోఁచి, ప్రఫుల్ల కదంబ కేతకో
ద్దామ సమీరణాహతులఁ దాపము నీ నొఱగున్ విచేష్టతన్. 145

కామిని = కామభావము కలది (గోదాదేవి); లో = మనస్సులో; నిజ = తన, క్షేమమున్; భద్రతను, కోరి = అభిలషించి;మేఘరంజిన్ = ఆ పేరుగల రాగము; పాడి = ఆలపించి; మధుగర్వము= వసంతుని మదాన్ని (విజృంభణ); అడంతును = అణచివేస్తాను. అట+అంచున్ = అంటూ; పాడి ఆ రాగాలాపన చేసి; మణి = మణులవలె; చిత్ర = పలువన్నెలున్న; మరుత్ = దేవత (ఇంద్రుని); తృణతా = విల్లు (ఇంద్రధనుస్సు); అచిరద్యుతి = మెరుపుల; స్తోమ = గుంపు (కల); వలాహక = మబ్బుల; ఆవలులు = గుంపులు; తోచి = కన్పించి; ప్రఫుల్ల - వికసించిన; కదంబ = కడిమి; కేతక = మొగలి; ఉద్దామ = అధికమైన; సమీరణ = గాలుల; ఆహతులన్= తాకిళ్లను; ఈన్ = ఇవ్వగా; విచేష్టతన్ = చేష్టలు దక్కి; ఒఱఁగున్ = కూలిపోతుంది.

వసంత విజృంభణవల్ల ఆమె కామిని కాగా; తన భద్రత నాకాంక్షించి మేఘరంజని నాలపించి వానకారును సృజిస్తే వసంతుని పొగరణుగుతుంది కదా అని పాడేసరికి మబ్బుల గుంపులు - పైన మెరుపులు - ఇంద్ర ధనుస్సులతో - రాగా నేలపై = కడిమి - మొగలి పూల గాలులు తగిలి మూర్ఛ పోయినది.

అలం : విషమం.

రాగాలాపనతో పంచభూతాల నుజ్జ్వలింప జేయవచ్చునని సంగీతశాస్త్రం చెబుతుంది. తాన్‌సేన్ మొదలైన వారిని గురించి ఎన్నో కథలున్నాయి. రాజస్థాన్ చిత్రకళలో రాగాలకు బొమ్మలు వేసిన పద్ధతి - రాగమాల - అన్న పేరుతో ప్రసిద్ధ చిత్రలేఖన విధానమున్నది. (ప్రపంచంలో ఎక్కడా ఆ పద్ధతి లేదంటారు.) అందులో రాగాలాపనశక్తిని చిత్రించిన బొమ్మలు చూచుకోవాలి ఇలాంటి విషయాలర్థంకావటానికి.

తే ॥ అతివ పూర్ణేందుభీతిఁ దదశ్మశాలఁ
దెండి యతఁ డందు నినుమడి తీండ్రఁదోఁప
మింటిపయి నుంట గా దని యింటి పైకిఁ
దెచ్చుకొంటి నటంచుఁ బెన్ టిచ్చ వెడలు. **146**

అతివ = గోదాదేవి; పూర్ణ = నిండు; ఇందు = జాబిల్లి (వల్ల); భీతిన్ = భయంతో; తత్+అశ్మ=ఆ చంద్ర కాంతశిలల ; శాలన్ = విశాలభవనంతో; తెండి = పండుకొని; అతఁడు = ఆ చంద్రుడు; అందున్ = ఆ పాలరాతి ఇంట్లో; ఇనుమడిన్ = రెట్టింపుగా; తీండ్రన్ = తీక్ష్ణతతో; తోపన్ = ప్రకాశిస్తే; మింటిపయిన్ = ఆకాశంలో; ఉంట = ఉండటం; కాదు = మంచిది కాదు. అని; ఇంటిపైకిన్ = స్వగృహంలోకి; తెచ్చు కొంటిన్ = తెచ్చుకొన్నాను (ఆపదను); అట+అంచున్; పెన్ = పెద్ద; టిచ్చన్ = ఆశ్చర్యంతో; వెడలున్ = ఇంటి నుండి బయటకు వస్తుంది.

నింగిపైన చంద్రుడు వెన్నెలలారబోస్తుంటే విరహోద్దీపకంగా, తట్టుకోలేక చంద్రశాలలోకిపోయి పండుకొన్నది. అక్కడ చంద్రుడు రెట్టింపుగా - మింటిపై నొకడు- పాలరాలలో ప్రతిబింబం రెండు గా వెలిగి మిక్కిలి బాధిస్తే మింటిపైనున్న ఆపదను ఇంటిపైకి తెచ్చుకొన్నాననుకొంటూ మరలా ఇంటి నుండి బైటకు వస్తున్నది.

అలం : లలిత.

తే ॥ భ్రమరగీతిక మాయ విపంచి మీట
దానఁ శ్రుతిఁ గూడి మిగులఁ ద ద్రక్తి హెచ్చ
వే నివారించి లేచి, 'దైవికము నెదుట
యుక్తులు ఫలింప,వనుచు బి ట్టూర్చి నవ్వు. **147**

భ్రమరగీతిక = తుమ్మెదల పాట; మాయన్ = పోగా; విపంచిన్ = వీణను; మీటన్ = మీటితే; దానన్ = దానితో (వీణతో); శ్రుతిన్ = శ్రుతితో (తుమ్మెదల గానం); కూడి = కలిసి; మిగులన్ = మిక్కిలి; తత్+రక్తి = ఆ సంగీతరుచి; హెచ్చన్ = ఎక్కువైతే; వెన్ = వెంటనే; నివారించి = మాని; లేచి; దైవికము+ఎదుటన్ = దైవం ముందు; యుక్తులు = ఆలోచనలు; ఫలింపవు; అనుమన్; బిట్టు = ఎక్కువగా; ఊర్చి = నిశ్వసించి, నవ్వున్.

భ్రమరగానం విరహోద్దీపకం కనుక పోగొట్టుకోవటానికై వీణ మెట్టు సవరించింది. ఈ గానానికా ఝుంకారం శ్రుతిగా పరిణమించే సరికి ఆమెకు మరీ విరహతాపమధికం కాగా- దేవునిముందు మన ఆలోచనలు ఫలిస్తాయా ? - అని నవ్వుకొంటూ లేచిపోతుంది.

నవ్వు = నిస్సహాయతాసూచకం - ఉన్మాదావస్థ.

**అలం :** విషమం.

తే॥ వెలఁది కతితాపదం బయ్యె విరుల పాన్పు;
మును దదంఘ్రిహతాది భర్త్సనలుగన్న
తరులఁ బొడమిన పూఱట దన కొసఁగునె,
పొంచి తఱివేచి మిగుల నొప్పించుఁ గాక 148

విరుల పాన్పు = పూలసెజ్జ, వెలఁదికిన్ = గోదాదేవికి; అతితాపదంబు = మిక్కిలి తాపము నిచ్చునది; అయ్యెన్ = ఐనది; మును = పూర్వం; తత్ = స్త్రీయొక్క; అంఘ్రి = పాదపు; హతి = తన్ను; ఆది = మొదలగు; భర్త్సనలు = అవమానాలు; కన్న = పొందిన; తరులన్= చెట్లకు; పొడమినవి = పుట్టినవి (పూలు); తనకున్ = స్త్రీయైన తనకు; ఊఱట - ఓదార్పు; ఒసఁగునె = ఇస్తాయా ?; పొంచి = దాగి; తఱివేచి = సమయం చూచి; మిగులన్ = ఎక్కువ; నొప్పించున్+కాక = బాధిస్తాయి తప్ప.

ఆమెకు పూలపాన్పు తాపహేతువైనది. దానికి కారణం - మున్ను స్త్రీ జాతి పాదతాడనాది అవమానాలు పొందిన చెట్లకు పుట్టిన పూలు కనుక ఊఱట నివ్వటానికి బదులుగా, సమయం చూచి పొందిన అవమానం కంటె ఎక్కువగా బాధించక ఊరుకోవు.

**అలం :** హేతూత్ప్రేక్ష.

శా॥ పూఁజాదంభమునన్ బరాకుమెయి మున్ బూఁబోఁడి నేర్పూది చే
తోజాతానల మార్ప శాస్త్రసరణిన్ దూలిన్ హరిన్ వ్రాసి ల
జ్జాజాడ్యాకులదృష్టిఁ బ్రత్యవయ వేక్షం జేయుచో వెండి వ
క్షోజాగ్రద్రమఁ గాంచి తల్లడిలు నీసుం దాపమున్ మీఱఁగన్. 149

పూఁన్+పోడిమి = పూల మెత్తదనం లాంటి శరీరం కలది. చేతో+జాత = మన్మథ సంబంధమైన; అనలము = అగ్ని ; అర్పన్ = చల్లార్పుకోవటానికై; మున్ = ముందు; శాస్త్రసరణిన్ = శాస్త్రీయం

పద్ధతిగా,నేర్పునవలంబించి; పరాకు మెయిన్ = అన్యమనస్కయై; పూజాదంభమునన్ = పూజ మిషగా; తూలిన్ = కుంచెతో; హరిన్ = శ్రీవిష్ణుని; వ్రాసి = గీసి; వెండి = (వ్రాసిన తర్వాత) తిరిగి; లజ్జా = సిగ్గుతో; జాడ్య = జడత్వంతో; ఆకుల = చెదరిన; దృష్టిన్ = చూపుతో; ప్రతి+అవయవ+ఈక్షన్+ చేయబోన్ = ప్రతి అంగాన్ని చూడటం చేస్తుండగా; వక్షో జాగ్రత్ = హరి ఉరమందు ప్రకాశించే; రమన్ = లక్ష్మిని; కాంచి = చూచి; ఈసున్ = అసూయ; తాపమున్ = విరహం; మీఱగన్ = ఎక్కువ కాగా; తల్లడిలున్ = తల్లడిలి పోతుంది (బాధపడుతుంది).

పువ్వు వంటి శరీరం కల గోదాదేవి మన్మథాగ్నికి తట్టుకో లేక దానిని చల్లార్చు కోదలచి, శాస్త్రానుసారంగా శ్రీహరి బొమ్మను నేర్పుతో పరాకుగా వ్రాసింది. వ్రాసినాక చిత్తరువు అందం చూచుకోవటం సహజం కనుక ప్రతి అవయవాన్ని సిగ్గుతో చూస్తున్నది. ఉరస్థలం మీద లక్ష్మి తోచింది. ఈమెకు అసూయ - విరహ మెక్కువైనాయి. మరీ తల్లడిల్లిపోయింది.

అలం : కైతవాపహ్నవం.

విశే॥ ఆమె పూబోడి - మన్మథుడా నిప్పు - ఈ భావతీవ్రతకు

(1) న ఖలు న ఖలు బాణః సన్నిపాతోఽయ మస్మిన్‌పుష్ప రాశావివాగ్నిః - అన్న శాకుంతల శ్లోకం చూచుకోవాలి.

(2) నేర్పు - శాస్త్రసరణి = చిత్రకారుని సుశిక్షణను సూచించేవి.

(3) హరిచిత్ర రచనను చూచి ఎవరైనా అపహాస్యం చేస్తారేమో ? - కనుక పూజాదంభం.

(4) బొమ్మగీసి సరిగా - భావానుగుణంగా వచ్చినదా లేదా అని చూచుకోవటం చిత్రకారునికి సహజం. పూజలో ప్రతి అవయవ భావన - దర్శనం అత్యవసరం.

(5) లజ్జాజాడ్యాకులదృష్టి - శృంగారభావాభినయస్ఫోరకమైన దృష్టి విభ్రమం.

(6) పరాకు కనుకనే వక్షస్సున రమను తానే గీయటం జరిగింది.

ఇలాగా పద్యంలో ప్రతిశబ్దమూ ఉచితమై - రచన నిర్మాణమౌ తున్నది.

(7) ఎప్పటి కప్పుడు బొమ్మలు వ్రాసి - పూజించి - చెరిదిపివేయటం ఒక పూజాపద్ధతి.సైకతలింగార్చన = చక్రార్చనలు లాంటివే.

చ॥ కుముదసర స్తట స్ఫటిక కూల నవోత్పలశయ్య వ్రాలి, పూ
ర్ణిమలఁ బికాళిఁ గుట్టుసురు ద్రెక్కొన ధర్మపుదార వట్టు, శే
షము రెయి మల్లికాళిరుతి చక్కఁగఁ జేయకయుండ నిల్పు, నా
యమ మఱునాఁటికిం గలుగ,నాంతగళప్రుతి గుంభితాశ్రువుల్. 150

పూర్ణిమలన్ = పున్నమి రాత్రులందు ( నిద్ర రాని కారణంగా); కుముద = తెల్ల కలువల; సరః = కొలనుల; తట = ఒడ్డులందున్న; స్ఫటిక = పటికరాల; కూల = ఒడ్డున నున్న; నవ=అప్పుడే; విచ్చిన; ఉత్పల = కలువల; శయ్యన్ = సెజ్జపై; వ్రాలి = పడి; పిక+అళి = కోయిలల గుంపు; కుట్టు + ఉసురున్= కొరప్రాణాలను; త్రెక్కొనన్ = హరిస్తే; ధర్మపు దార వట్టున్ = ఓడిన రాజులు తమ ఓటమికి సూచకంగా కొమ్ము బూరాలూదేవారు. ఆ కొమ్ములు పట్టటం. ధారా పూర్వకంగా చేసేది దానం; ఉదక ధారలేకుండా చేసేది త్యాగం.

విశే॥ మిగిలిన కొంచెం ప్రాణం; రెయిన్ = రాత్రులందు; మల్లిక+ అళిరుతి = మల్లెపూలపై వ్రాలే తుమ్మెదల; ధ్వని చక్కఁగన్ చేయక ఉండన్ = పూర్తిగా హరించకుండేటట్లు; మఱునాటికిన్ = రేపటికి; ఆయమన్ = ఆమెను; కలుగన్ నిల్పున్ - బ్రతికి ఉండేటట్లు చేస్తుంది=ఆ+అంత = తెల్లవారిన దాకా; గళత్ = కారే; శ్రుతి = చెవుల్లో;

తే॥ నెలఁతఁ గుచకుంభ యుగళ ముండియు వియోగ
జలధి నీఁదింప లే దయ్యె; సఖులు వంచు
చున్న పన్నీటి వెల్లి లోఁగొన్న కతన,
ముంప కది లాఘవమునఁ దేలింపఁగలదె ? 151

కుచ = స్తనములన్న; కుంభయుగళము = కుండల జంట; ఉండియున్ = ఉన్నా; నెలఁతన్= గోదను; వియోగ = విరహ; జలధిన్ = సముద్రాన్ని; ఈదింపలేదు+అయ్యెన్; ఈదింప లేకపోయింది; ఎందుకంటే - సఖుల = చెలికత్తెలు; వంచుచున్+ఉన్న = పోస్తున్న; పన్నీటి వెల్లి=పన్నీటి వరద; లోగొన్న కతనన్ = ముంచినందువల్ల ( శీతలోపచారం కోసం పన్నీరు)- ముంపక = ముంచకుండా; అది = కుంభయుగళ; లాఘవమునన్ = లఘుత్వవ (తేలిక) చేత; తేలింపన్+ కలదె ? = తేలించగలదా ?

కుండలను బోర్లించి వాటిపై పండుకొని నదులను దాటటం సహజం. లేదా కొన్ని చిన్న పడవలు బోర్లించిన కుండలపై నిర్మిస్తారు. ఏదైనా నదీ తరణోపాయమది. ఇక్కడ రెండు కుండలున్నా మునిగిపోతున్నది. కారణమేమంటే చెలికత్తెలు శైత్యోపచారంగా పోసే పన్నీటి వెల్లువ ముంచటంవల్ల కుండలామెను తేలించ లేకపోయినవి.

గుంభిత = పూరించిన; అశ్రువుల్ = కన్నీళ్ళు.

( అది పున్నమి. తెల్ల కలువల కొలను ప్రక్క స్ఫటికరాలతో కట్టి చప్టా(వేదిక) ఉన్నది. దానిపై క్రొత్త కల్వల పాన్పున ఆమె శయినించింది. ఇక పిక సమూహం కూతల కామె ప్రాణాలన్నీ కడబట్టి పోయినవి. ఆమె తన ఓటమిని అంగీకరించి మోకరిల్లినది. పున్నమిరాత్రి విచ్చినమల్లెలపై తేనెక్రై మూగిన తుమ్మెదలు తెల్లవార్లు రోద చేస్తూనే ఉన్నాయి. ఆమె చెవులకది తాకియుంటే ఆమె తెల్లవారికుండేది కాదు కదా. విరహ దుఃఖం కార్చిన కన్నీరుతో చెవుల రంధ్రాలు మూసుకొని పోవటం వ్లల్ల ఆ రొద విన్పించలేదు. ఆమె తెల్లవారికి బ్రతికున్నది.

అలం : అతిశయోక్తి.

విశే॥ అశ్రువన్న సాత్త్వికా భావం వర్ణితమైనది. పై పద్యంలో జడత్వమన్న భావం )

ఒక పూర్ణిమానిశ. తెల్ల కలువల కొలను. గట్టున స్ఫటిక వేదిక పైన కల్వల పాన్పు. పిక - భ్రమర కూజితాలు = ఏమి అందమైన బొమ్మగ గీసాడును మహాకవి.

ఉ॥ చంచలనేత్ర తాల్పు జలజాతమృణాళసరంబు వేగ, స
ల్లించినఁ, బాఱుతెంచి కబళించి; తదూష్మకు నంగలార్చు రా
యంచ కుచేష్టఁ గాంచి, యికనైనను గందుమొ యంచు మోమె వీ
క్షించినఁ, దోఁచు లేనగవు సేరుచు బోంట్ల కొకింత ప్రాణమున్. 152

చంచలనేత్ర = చలన శీలములైన దృష్టులు కలది (ఇదే మీనాక్షి = మృగాక్షి); తాల్పు = ధరించే, జలజాత = నీటిలో పుట్టిన; మృణాళము = తూండ్లు; సరంబు = హారం; వేగన్ = త్వరగా; సల్లించినన్ = సడలించి వేస్తే; పాఱుతెంచి = (తామరకాడల ఆహారం కోసం) పరుగెత్తుకొని వచ్చి; కబళించి; ఆబగామ్రింగి; తత్ = దాని, ఊష్మకున్ = వేడిమికి; అంగలార్చు= వగర్చే; రాయంచ = రాజహంస; కుచేష్టన్ = వికారపు పనిని; కాంచి = చూచి; ఇకనైననున్ = ఇకమీదైనా; కందుమొ = చూస్తామో ?; అంచున్ = అంటూ; మోమె = గోదాముఖాన్నే; వీక్షించినన్ = చూస్తే; తోచు = కన్పించే; లే = లేత; నగవు = నవ్వు; బోంట్లకున్ = చెలికత్తెలకు; ఒకింత = కొంచెం; ప్రాణముల్ = ప్రాణాలను; చేరుచున్ = కల్గిస్తున్నవి. (పోయిన వాటిని తెచ్చి కూరుస్తున్నవి).

వియోగిని గోదాదేవి శైత్యోపచారంతో తామరతూళ్లతో హారం ధరించింది. వియోగ తాపాగ్ని ఉపశమనార్థంగా కొంచెం సేపటికి ఆ సరాన్ని వేడెక్కినదని తీసిపారవేస్తే, తినాలని ఆబగా వచ్చిందొక రాజహంస. తిన్నాక సరం వేడికి దట్టుకోలేక అంగలార్చింది. ఆలల్పచేష్టను చూచి గోదాదేవి స్వల్పంగా నవ్వింది. అది చూచిన చెలికత్తెల పోయిన ప్రాణాలు లేచివచ్చినట్లైనది.

అలం : అతిశయోక్తి.

ఉ॥ శ్రీపతి మీఁది గీతముల ప్రేమ విపంచిక నంటఁ, బాణి సం
తాపము సోఁకి మెట్ల మయినంబు గరంగిన, డించి, పాడు నా
లాపినిఁ దాల్చి, పెన్నైమటల న్మనుటి తంత్రులు జజ్జుకోఁ గలా
లాపిని దాన పాడును, గళంబును గద్గద మైన మ్రాన్పడున్. 153

శ్రీపతి = లక్ష్మీశ్వరుని; మీది = పై; గీతముల = పాటలందు; ప్రేమన్ = భక్తితో; విపంచిన్ = వీణను; అంటన్ = తాకితే, పాణి = చేతి; సంతాపము = వేడి; సోకి = తాకి; మెట్ల = వీణ మెట్లకున్న; మయినంబు= మైనం; కరంగినన్ = ద్రవిస్తే; డించి = వీణను క్రిందపెట్టి; పాడు = పాడే; ఆలాపినన్ = శ్రుతినాలపించే

తంబూరాను; తాల్చి = ధరించి; పెన్ = పెద్ద; చెమటలన్ = చెమటలకు; మఱి = పైన; తంత్రులు; తీగలు; జజ్జుకోన్ = చప్పపడగా ( తీగలు సడలిపోగా); కల+అలాపిని = మధురంగా పాడగల ఆమె; పాడును = శ్రీపతిగీతాలు పాడుతుంది. కానీ; గళంబునన్ = గొంతుకూడా; గద్గదమైనన్ = గాద్గదిక వహిస్తే; మ్రాన్పడున్= చేష్టలు కోల్పోతుంది.

37వ పద్యంలో చెప్పిన బొమ్మల పెండ్లిండ్ల పాటలు - లేదా తాను వ్రాసిన తిరుప్పావు-నాచ్చియారు తిరుమొళి పాశురాలు (పద్యాలు); వీణపై ఆలపించటం కోసం దాన్ని ముట్టుకోగా చేతి వేడికి మైనం కరిగిపోయింది. చేసేది లేక తంబూరాను సవరిస్తే చెమటల కా తీగలూ మూగపోయినవి. ఇక మధుర కంఠంతో తానే పాడబోతే - గొంతు బొంగురు పోయింది.

అలం : విషమం.

విశే॥ స్వేదం - (గద్గదిక); వైస్వర్యం - (మ్రాన్పాటు), స్తంభం - సాత్త్విక భావాలే ఆలంకారికంగా వర్ణింపబడ్డవి.

తే ॥ ప్రతికుసుమతల్పమున జాఱి పడిన తప్త
వలయ మలినాంకయుగము వర్తులతఁ బొలిచెఁ,
జూడ నిఁక మాన ధైర్యముల్ సున్న లనుచు
సుదతి బోంట్లకుఁ ద్రప వ్రాసి చూపె ననఁగ. 154

సుదతి = అందమైన పండ్ల వరుస కలది (గోద); చూడన్ = విచారిస్తే; ఇకన్ = మున్ముందు; మాన = అభిమానం; ధైర్యమున్ = ధీరత్వం; సున్నలు = శూన్యం; అనుచున్ = అంటూ; బోఁట్లకున్ = చెలికత్తెలకు; త్రపన్ = సిగ్గువల్ల; వ్రాసి చూపెన్ = (చెప్పలేక) వ్రాసిచూపించింది. అనఁగన్ = అన్నట్లుగా; ప్రతి కుసుమ తల్పమునన్ = పూలసెజ్జల అన్నింటిపై జాఱిపడినట్టి; తప్త = కాగిన; వలయ = హస్తాంగదాలయొక్క; మలిన+అంక = నల్లని గుర్తుల; యుగము = జంట; వర్తులతన్ = గుండ్రనితనంతో; పొలిచెన్ = ఒప్పెనవి.

ఆమె శయనించిన ప్రతి పూలసెజ్జపైన; కృశత్వం వల్ల ఆమె చేతి కడియాలు జారిపోయి, నాటిగుర్తులు నల్లగా పడ్డాయి. ఆ గుండ్రని గుర్తులు సఖులకామె సిగ్గుతో చెప్పలేక చేతితో ఇకముందు నాకు మానధైర్యాలుండవని, వ్రాసి చూపినదో అన్నట్లున్నాయి.

అలం : ఉత్ప్రేక్ష.

విశే॥ తప్త - విరహాగ్నితో బంగారు కడియాలు వేడెక్కి పోయినవి. వర్తులత = తెలుగు అక్షరం గుండ్రంగా ఉంటుంది. కనుకనే దస్తూరిని ముత్యాల కోవ అంటారు.

చూ. అభిజ్ఞాన శాకుంతలం - శకుంతల విరహశయ్యావర్ణన.

మా. దాసరికథలోని వట వృక్ష వర్ణన.

ఉ॥ ఆ వనజాక్షి కాఁకఁ; బొరలాడ, నలంగిన సొమ్ముఁ జీరలున్
వేవిన నూడ్చి యూడ్చి మఱి వేఱ వహించుట; వారక్లప్తముల్
గా వనమాలి సేవయెడఁ గాంక్ష నొదుంగక, కల్లతెల్విటో
నే వలవంత దాఁగఁ జరియించిన, డాఁగమిఁజూచి నెవ్వగన్. 155

ఆ వనజ + అక్షి = తామరసాక్షి; కాఁకన్ = తాపంతో; పొరలాడఁగాన్ = నిద్ర రాక పొరలికలుపెడితే; నలంగిన = నలిగి పోయిన; సొమ్మున్ = నగలు (మెలికలు పడ్డవి); చీరలున్=కోకలున్నూ;వేవినన్ = తెల్లవారగాన్, ఊడ్చి ఊడ్చి = మార్చి మార్చి (దైనందిన చర్య కనుక); మఱి = ఇక; వేఱ = వేరే నూత్న వస్త్రాభరణాలు, వహించుట = ధరించటం; వారక్లప్తముల్ కానీ; ప్రతిరోజూధరించేవన్నట్లు కాగా -వనమాలి = వనమాల హారంగా కల విష్ణుని; సేవయెడన్ = పూజా విషయంలో; కాంక్షన్ = కోర్కెతో; ఆయనపై వలపుతో, ఒదుంగక = మానక; కల్ల తెల్వితోనే = లేని తెలివితోనే; వలవంత = విరహం; దాగన్ = కప్పిపెట్టి; చరియించినన్ = ప్రవర్తిస్తున్నా; డాగమిన్ = దాగనందువల్ల; చూచి = అంతా ప్రతిరోజూ చూచి, నెవ్వగన్ = తీరని దుఃఖంతో -

ఆ పద్మనేత్ర విరహతాపంతో నిద్రరాక పొరలాడినందువల్ల వస్త్రాలు నలిగి పోయి- నగలు మెలిదిరిగి పోగా, ఆమె తెలవారగానే వాటిని తీసి క్రొత్తవాటిని ధరిస్తున్నది. ఇది చూచే వారికెలా ఉందంటే - ఆమె రోజు కొక లలంకారం చేసికొంటున్నట్లున్నది. (దేవికి చేసే నిత్యాలంకారం లాగా నని తాత్పర్యం) ఏడు వారాల నగలన్న మాట ఉన్నది, భగవత్సేవ చేస్తూనే- తన వలపు దానిక్రింద దాచాలని ప్రయత్నిస్తున్నది. కానీ అది దాగటం లేదు. ఇదంతా గమనించిన-తండ్రికి నిర్వేదం కలిగింది.

అలం : యుక్తి

నేవిన - అని వావిళ్ళ వారి పాఠం. వే వెస అని వేదం వారి పాఠం కంటె శ్రేష్ఠం.

కం॥ పుత్రియుఁ దాఁ గామిని, నొక
పుత్రియు నట్లుండుటకు నబుద్ధేక్షుధనుః
పత్రి యగు విష్ణుచిత్తుఁడ
పత్రప లే కదియు నేతపంబో యనుచున్. 156

తాన్ = విష్ణుచిత్తుడు; పుత్రియున్ = సంతానవంతుడు; కామిని = కానందువల్ల; ఒక పుత్రియున్ = ఆ ఉన్న ఒక కూతురూ; అట్లు = దుఃఖిస్తూ; ఉంటకున్ = ఉండటానికి; అబుద్ధ = తెలియని; ఇక్షు ధనుః = చెఱకువింటి ; పత్రి = బాణం కలవాడైన; విష్ణుచిత్తుడు = అపత్రప = సిగ్గు (సంకోచం); లేక; అదియున్ = కూతురు చేసేది. ఏ తపంబో = ఏ తపస్సో; అనుచున్.

విష్ణుచిత్తునకు మన్మథ బాణపాతం తెలియని కారణంగా సంతానవంతుడు కాలేదు. 'దొరికినది చాలు' లెమ్మను కోగా ఆమె ఇలా ఐనది. ఆమె చేష్టలు కూడా తపస్సేనేమో మనకు తెలియదనుకొంటూ-

భార్య ఉన్నా అబుద్ధేక్షుధనుః పత్రుడు. అంటే మనయుగంలో శ్రీరామకృష్ణ పరమహంసలాగ కేవల దాంపత్య ధర్మప్రతీకగా ఉన్నదన్నమాట. గార్హస్థ్యం శ్రీవిశిష్టాద్వైత మంగీకరించిన ఆశ్రమం. అద్వైతం; బౌద్ధం - సన్యాసాన్ని పెద్దచేసినట్లు, ఆ గృహస్థ ధర్మ విషయమే 1-80 నుండి 83 దాకా, 6-130 చివరి వాక్యం వర్ణిస్తున్నది.

వ. తలపోసి దినదిన ప్రవర్ధమాన తనయా తనుగ్లాని కత్యంత దుఃఖితుండై, తత్కారణం బెఱుంగక వలదని మౌగ్ధ్యంబున వారించి చూచి, అంత కంత కగ్గలం బగుడు, గుడికిం జని, పూజాంతిమ నమస్కరణానంతరంబునఁ, దన మనోనిర్వేదనంబు, అన్నగరి వెన్నునకు విన్నవింపం, బునర్న మస్కృతిం జేసి, ''దేవా! దేవర దాసియగు మదీయపుత్రి యేమి గుఱించియో విచిత్రంబగు వ్రతచర్యం గాత్రశోషంబు సేయుచున్నది. వల దన్న వినదు, అపుత్రకుండనగు నాకుఁ బుత్రియైనను బుత్రకుండైనను దాన, యే నేమిసేయుదు! మఱి, తన తపశ్చర్య తెఱంగు, మా తపశ్చర్య తెఱంగుగాదు, ఏము - భవద్దివస భవజ్జనిదివస రాత్రులం దక్క గణరాత్రజాగరంబు లెఱుంగము, ఏము బిసబీజాక్ష వలయంబులు దక్క బిసవలయంబు లెఱుంగము, ఏము ప్రసాద కుసుమంబుఁ, జెవిఁ జెరువుటఁదక్క నవి గప్పుకొన నందు శయనింప నెఱుంగము. ఏము చెంబుల భవత్తీర్థంబు గ్రోలినఁ దానంగంబులు దడిపికొను, నేము చాంద్రాయణంబులఁ చంద్రవృద్ధిఁ బడిఁ గడియొక్కించినఁ దా డించు, నేము నిధి ధ్యాస నిశ్వాస నిరోధంబు సేసినం దాఁదద్ధ్యానదశ వెలికి నిగడించు, నేము చిన్ముద్రకై హృదయంబునం గేలు సేర్చినం, దాఁ గపోలంబునం జేర్చు, వల్కలోత్తరీయంబు లేము వహించినందాఁ గిసలయోత్తరీయంబులు వహించు, నేము సితపక్ష నూత్నేందుఁ గీర్తించినందాఁ బూర్ణేందు నుపాలంభించు; నిట్లుగాఁ బ్రవర్తిల్లుచున్నయది; యిదియేటితపం బున్మాదంబు గానోపు; నెంత భవదీయ భక్తి గలిగిన మాదృశులకు ప్రకృతి సంబంధంబు విడువదు, అంతర్యామివి నీవెఱుంగని యది లేదు; దీనితెఱంగెఱింగింపవే''; యనవుడు ననుకంపాతిశయంబునఁ దచ్ఛాందసంబునకు మందస్మితంబు సేసి మందరధరుం డిట్లనియె. 157

ప్రవర్ధమాన = పెరుగుతున్న; తనయా = కూతురి; తనుగ్లాని = శరీరం కృశించిపోవటానికి; మౌగ్ధ్యంబునన్ = అబుద్ధేక్షుధనుః పత్రుడు కనుక మన్మథజ్ఞానం లేనందున; అంతిమ = చివరి; నమస్కరణ = నమస్కార; అనంతరంబునన్ = తర్వాత; గాత్రశోషంబు = శరీరాన్ని శుష్కింపజేయటం; భవత్+దివస = మీదినం (హరివాసరం; అవతారికలో 11వ వచనం చూడు); భవత్+జని దివసంబు = మీ జన్మదినం; గణరాత్ర = అనేక రాత్రులు వరుసగా; బిసబీజ+అక్షవలయంబులు = తామరగింజల పూసల వలాలలు; బిసవలయంబులు = తామర తూళ్ళు; ప్రసాదకుసుమంబులు = ప్రసాదంగా ఇచ్చిన పూలు; తీర్థంబు =

పవిత్ర అభిషేకజలం; చాంద్రాయణ = చంద్రసంబంధం;( చాంద్ర; అయన = గమనం), నిదిధ్యాసన్= బ్రహ్మాధ్యానంలో; చిన్ముద్ర= జ్ఞానముద్ర; వల్కల = ఉత్తరీయంబులు = నారచీరలు; కిసలయ=చిగురాకు; సితపక్ష = శుక్ల పక్షంలోని; నూత్న + ఇందున్ = వెలపొడుపును, ఉపాలంభించున్ = ఆక్షేపిస్తుంది. ఉన్మాదంబు = పిచ్చి; అనుకంప = దయ; మందర ధరుఁడు= మందరపర్వతాన్ని వీపున మోసిన కూర్మావతార స్వరూపుడైన నారాయణుడు.

ఛాందసంబునకు - వైదిక మౌర్ఖ్యమునకు (లోకంలో చాదస్తం మాటకిదే మూలం)-మందస్మితంబు - గీతలో (పలు ప్రశ్నలకు స్వామి) చిరునవ్వుతో సమాధానం చెప్పినట్లుంది. ఈ చిరునవ్వు ఆత్మానుభవ నిదర్శనం కనుక భగవంతుడు ఆత్మస్వరూపుడు కనుక - సచ్చిదానందమూర్తి కనుక. దాని కిది చిహ్నం.

ఈ వచనం చాలా అందమైనది. రాయలవారి వచనాలు ప్రత్యేకంగా అధ్యయనం చేయదగ్గవి- శబ్దార్థభావ సంబంధంగా . ఈ వచనంలో గోదాదేవి - విరహ తపస్సు ముగ్ధంగా- అమాయకంగా - తండ్రి నోటినుండి చెప్పబడటం - అదీ భగవంతుని శ్రోతగా చేసికొని - ఎవడు నాయకుడో వాని నాలంబనంగా చేసికొని.

భక్తికి ప్రేమకు నడుమనున్న అంతర మెంత ? - సన్నని నూలు పోగంత. ఇదే శృంగార - శాంతరసాలమధ్య అంతరం. శాంత మనటం దేనికంటె భక్తిని రసంగా ఆలంకారికు లంగీకరించలేదు కనుక.

రెంటిని - శృంగార శాంతాలను; ప్రక్క ప్రక్కనే పెట్టి - ఆ రెంటికి సంబంధించిన విభావానుభావాలను వర్ణించటం. తన తపశ్చర్య తెరగు వేరు. తన తనయా తపశ్చర్య తెరగు లేదు. ఆ వైరుధ్యాన్ని ప్రదర్శిస్తున్న వచనం కనుక కేవల విరుద్ధ రసాలని అలంకారికులన్న రసాలకు మధ్య ఒక వంతెన కట్టటం ఈ వచన తాత్పర్యం.

శ్రీవిశ్వనాథ కవిసమ్రాట్టు కూడా - సీతారాముల శృంగారాన్ని వర్ణిస్తూ - ''ఇట్లు వైరాగ్యసంసార భావంబులు ప్రయోగక్షేత్రస్థగంగా యమునలవలె-(''బాలకాండ) అనటంలాంటిదే ప్రస్తుత వచనం.

ఆశ్వాసాంతం

ఉ॥ కంధర నీలవర్ణ, మధుకైటభ నాగ సుపర్ణ, యోగిహృ
ద్గ్రంథిభిదోష్ఠ భోగివనితా స్వనవత్ శ్వసన స్రవచ్చిర
స్సంధి వసన్నిశాపతి రసస్రుతి దుగ్ధపయోధి వీచికా
మంథర కేళికాదర, సమాశ్రిత పంక్తిశిరోధిసోదరా ! 158

కం = నీటిని; ధర = ధరించేది;( మేఘం వంటి); వర్ణ = శరీరం వన్నె కలవాడా !; మధుకైటభ= ఆ రాక్షసులన్న; నాగ = పాములకు; సుపర్ణ = గరుత్మంతుడైనవాడా; యోగి = యోగుల; హృత్+ గ్రంథి =

హృదయగ్రంథి (విష్ణుగ్రంథి); భిదా = చీల్చటం వల్ల; ఉత్థ = పైకి లేచిన; భోగివనితా = కుండలిని; స్వనవత్ = ధ్వనించే; శ్వసన = నిట్టూర్పుల గాలి తాకిడికి; (బుసలకు); స్రవత్ = స్రవించే; శిరస్సంధి = మాడు పట్టున; వసన్ = ఉండే; నిశాపతి = రేరాజు (చంద్రుని); రసం = అమృతం; స్రుతి = ప్రసరణమన్న; దుగ్ధ పయోధి = పాలసంద్రము యొక్క; వీచికా = అలలపై; అమంథర = అలసట లేని; కేళిక = ఆటపై; అదర = ప్రేమ కలవాడా !; సమాశ్రిత = శరణన్న; పంక్తి శిరోధి = దశకంఠుని; సోదరా = విభీషణుడు కలవాడా !

మేఘుచ్ఛాయ శరీరం కలిగి - మధుకైటభులన్న పాములకు సుపర్ణుడై కుండలినీ యోగుల హృదయగ్రంథి భేదనంవల్ల లేచిన కుండలినీ బుసలకు సహస్రకమలమన్న చంద్రబింబం నుండి కారే అమృతమే పాలసంద్రం కాగా ఆ అలలపై తేలటమే క్రీడగా కలవాడవై విభీషణునకు శరణైన స్వామీ !

విశే॥ ఈ పద్యమంతా యోగశాస్త్ర సంబంధం కలది గ్రంథి - భోగివనితా. నిశాపతి - శిరస్సంధి - రసస్రుతి - ఈ శబ్దాలు కుండలినీ యోగంలో సాంకేతిక శబ్దాలు.

మానవ శరీరంలో 6 చక్రాలున్నాయి. మూలాధారం - స్వాధిష్ఠానం - మణిపూరం-అనాహతం-విశుద్ధి - అజ్ఞాచక్రాలు 'ఇది భ్రూమధ్యగతం కాగా - మొదటిది మలద్వారం చెంత - వెన్నుపూస చివర - మర్మాంగ ప్రదేశం క్రింద రెండవది. ఈ రెంటికి పైన గుహ్యగ్రంథి. మణిపూరం నాభీమండలం - అనాహతం హృదయస్థానం. తర్వాత విష్ణుగ్రంథి. పైరెండు - విశుద్ధి ఆజ్ఞలకు పైన రుద్రగ్రంథి - మొదటిగ్రంథి అన్నమయకోశ స్థానీయం. స్థూల దేహాభిమానం కలది. రెండవది ప్రాణమయ - మనోమయ కోశ సంబంధమైనది. మూడవది విజ్ఞానానందమయకోశ రూపమైనది.

మొదటి గ్రంథి జాగ్రదవస్థా కారకుడైన విశ్వనామక జీవుడు.

రెండవది స్వప్నావస్థా కారకుడైన తైజస నామకుడు

మూడవది సుషుప్తి దశా సంబంధుడైన ప్రాజ్ఞనామక జీవుడు.

వీటిని కుండలినీ శక్తి ద్వారా చీల్చి ఆ శక్తిని సహస్రారంలోకి ప్రవేశపెట్టటం వల్ల ఆ శ్వాసాగ్నికి చంద్రమండలం కరిగి స్రవించే అమృత ధారలే వీచికలైన పాలసముద్రం. అదే ఇల్లుగా కలవాడు నారాయణుడు.

సహస్రార మధ్యగత కర్ణికారూప చంద్రమండలం బిందురూపం. తస్మాత్త దేవ సుధా సింధుః - (కామ కళా విలాసం); బిందుస్థానం సుధాసింధుః (వామ కేశ్వరీ తంత్రం)

ఆదిశంకరుల సౌందర్యలహరిలోనూ ఈ స్తుతులు, వర్ణనలున్నాయి.

విష్ణుగ్రంథి అనటంలో రహస్యం అది సూక్ష్మశరీరాభిమానీ, మిథ్యా ప్రపంచానుభవః కలుషరజః ప్రధాన ప్రకృతిః - కనుక. వీని భేదనం కష్టం. అది తొలగిపోతే ఆత్మజ్ఞాన లబ్ధిసుఖకరం కనుక.

కం॥ ప్రపదానిశ నతిచర్యా
త్రిపదావనవర్య ! నాకదేవాద్యమర
ద్విప ! దానవాహితోదిత
విపులత్మాభవా ! భవారివిశ్రుతనామా ! 159

ప్రపద = పాదాగ్రాలకు; అనిశ = ఎల్లప్పుడు; నతిచర్యా = మ్రొక్కులు అన్న చేష్టతో, త్రిపద= మూడు లోకాలను; అవన = రక్షించటం వల్ల; వర్య = శ్రేష్ఠులైన; నాకదేవ = దేవతాధిపతి ఇంద్రుడు; ఆద్య = మొదలైన; అమరద్విప = దేవతోత్తములు కలవాడా ! దానవ+అహిత; అహితులు (శత్రువులైన); రాక్షస సంహారానికై; ఉదిత = పుట్టిన; విపుల = విస్తారమైన; ఆత్మ భవా = స్వయంగా వచ్చిన అవతార స్వరూపుడా! భవ+అరి = జన్మను తొలగించడంలో; (జన్మకు శత్రువైన); విశ్రుత = బహుధా కీర్తింపబడుతున్న; నామా = పేరు కలవాడా !

పాదాగ్రాలకు నిత్యమూ నమస్కరిస్తున్న ఉత్తమ దేవతలైన ఇంద్రాదులు కలవాడా! రాక్షససంహారం కోసం నిత్యమూ స్వయంగా అవతరించటం వల్ల విపుల జన్మలు కలవాడా ! జన్మరాహిత్యంతో ముక్తిని ప్రసాదించే నారాయణ నామం కలవాడా !

ఆత్మభవుడు = చూ. 3.83 మానవజన్మలు కర్మవశాత్తూ వచ్చేవి. అవతారం కర్మబద్ధం కానిది.

విశే॥ (1) ఈ పద్యం గట్టుపల్లి శ్రీనివాస కవివ్యాఖ్యానంలోనే ఉన్నది. అదే వేదం వారికి మూలం. వావిళ్ల ప్రతిలో నాల్గవ ఆశ్వాసాంతంలోని కరధృత - అన్న పద్యమే ఇక్కడా వచ్చింది. మరొక పద్యం కన్పించటం లేదు కనుక. 4,5 ఆశ్వాసాంతాల్లో దీనినే గ్రహించి వ్యాఖ్యానించాడు. జోగి జగన్నాథుడు.

(2) రచనా సౌందర్యం భావించదగ్గది. ఇది సంకీర్తనం - స్తుతి కనుక రచన - పద విన్యాసంలో ఒక సంగీతం - భజనానుగుణమైన గేయలక్షణ మున్నది.

ప్రపదా - త్రిపదా; చర్య - వర్య

ఈ ఆవృత్తి చేత పద్యం భజన గేయం లాగా చిందులు వేస్తున్నది.

తోటకవృత్తం.

ద్రుహిణాండకరండక ధూర్వహగ
ర్భ, హరా ర్భక దుర్భర పక్వతపః
కుహనార్భక, వార్భృత కోనిరి హే
రి హిరణ్మయ హర్మ్యచరిష్ణుపదా ! 158.

ద్రుహిణాండ = బ్రహ్మాండ; కరండక = కటాహం (గంగాళం); ధూర్వహ = బరువుమోసే; గర్భ= గర్భకోశం కలవాడా; హర = శివుని; అర్భక = కుమారుడైన స్కందుని; పక్వతపః = పండిన తపస్సునకు; కుహన = కపట; అర్భక = బాలుడా !; వార్ - భృత - నీటితో నిండిన; కోనిరి = కోనేరులో;

హారి = అందమైన, హిరణ్మయ = బంగారు; హర్మ్య= సౌధంలో; చరిష్ణు= చరించే; పదా = పాదాలు కలవాడా;

1. బ్రహ్మాండ భాండాలను ధరించిన బృహద్గర్భస్వరూపుడు.

2 కుమారస్వామి తపస్సునకు బాలుడుగా అవతరించినవాడు.

3. కుమార (స్కంద) పుష్కరిణిలో బంగారు సౌధంలో విహరించే పాదాలున్నవాడు.

స్కందపుష్కరిణిలో బంగారు రథాకారమైన సౌధంలో తెప్పోత్సవ సందర్భంలో - విహరించేవాడని తాత్పర్యం.

మ॥ ఇది యంధ్రోక్తి యథార్థనామ యవనాసృక్పూర్ణ కెంబావి వా
రిద పద్ధత్యవరోధి వప్రవలయశ్రేణీ విఘాత క్రియా
స్పద సేనాగ్రగ కృష్ణరాయ మహిభృత్ సంజ్ఞాస్మ దాముక్తమా
ల్యద నాశ్వాసము పంచమం బలరు హృద్యంబైన పద్యంబులన్. 160

ఇది = ఈ కావ్యం; ఆంధ్ర+ఉక్తి = తెనుగుభాషలో; యధార్థ = నిజమైన; సార్థకమైన; నామ= పేరున్న; యవన+అసృక్ = మహమ్మదీయుల నెత్తురుతో; పూర్ణ = నిండిన; కెంపు+బావి = కెంబావి = ఎర్రని బావియొక్క, (ఆ పేరు గల నగరం)వారిద = నీటి నిచ్చే మేఘాల; పద్ధతి = మార్గాన్ని; అవరోధ= అడ్డగించే; వప్ర = కోటల; వలయ = గుండ్రని గోడల; శ్రేణీ = సమూహాన్ని; విఘాత = కూల్చటమన్న; క్రియ+ఆస్పద = పనితో మునిగిన; సేన+అగ్రగ = సేనలకు ముందున్న; కృష్ణరాయలన్న; మహిభృత్ = అస్మత్ = నాయొక్క; ఆముక్త మాల్యదా కావ్యంలో పంచమంబు=ఐదవది; హృద్యంబైన = హృదయానికి హత్తుకొనే; పద్యంబులన్ = పద్యాలతో; అలరున్ = అందగిస్తున్నది.

కెంబావిని తెలుగు బాసలో నిజమైన అర్థం కలదిగా చేసాడు రాయలు. ఆ పట్టణం కోటగోడలను కూల్చి - యవనుల నెత్తురును ప్రవహింపజేసినందువల్ల ఆ పట్టణానికి అన్వర్థ నామధేయం కలిగింది. అలా చేసిన సేనకు ముదుండి ఈ బీభత్సకాండను నిర్వహించిన కృష్ణరాయల కావ్యంలో ఇది పంచమాశ్వాసం. హృదయా వర్జకమైన భావాలు కల పద్యాలతో అందమైనది.

అలం : నిరుక్తి.

విశే॥ కెంబావి యుద్ధం గజపతియుద్ధం తర్వాత - సింహాచలం దగ్గర జరిగినగెల్పునకు పిదప యవనులతో జరిగింది.

ఈ పట్టణం - బీజాపురం - అహమ్మదునగరం - బీదరు రాజ్యాల్లోని ముయ్యేల (మూడు రాజ్యాలకు ఎల్లగానైన) గుట్టల్లోని ఒకకుగ్రామం నేడు. (చూ. లక్ష్మణ రాయవ్యాసావళి) పొట్నూరి కడవిజయస్తంభ మెత్తించిన తర్వాత (1516 ప్రాంతం) బహ్మనీసుల్తానులతో ఈ కెంబావి యుద్ధం జరిగిందనుకోవాలి. అది 1518-20 ప్రాంతం కావచ్చు నని అంచనా.

(చూ. పీఠికలో చారిత్రకాంశాలు అశ్వాసాంతాలు.)





# ఆముక్తమాల్యదా సౌందర్యం

## షష్ఠాశ్వాసము

కం. శ్రీకారి కృపార్ద్రేక్షణ!
వైకుంఠ ! యకుంఠ భక్త వరద ! పదాబ్జా
స్తోక మరందాయిత గం
గా! కాకోదర నగోదయస్థపతంగా ! 1

శ్రీకారి = సిరులిచ్చే, కృప+ ఆర్ద్ర = దయతో స్నిగ్ధమైన; ఈక్షణ = చూపులు గలవాడా; వైకుంఠ = వికుంఠాదేవి కుమారుడా; అకుంఠ = అనర్గళంగా; భక్త = భక్తులకు; వరద = వరాలిచ్చేవాడా; పద = పాదాలన్న; అబ్జ = తామర పూలలో; అస్తోక = అతిశయంగా; మరంద+అయిత = తేనెగా అవుతున్న; గంగా = గంగానది కలవాడా; కాక+ ఉదర = శేష; నగ = కొండయన్న; ఉదయ = ఉదయ పర్వతంపైన; స్థ = ఉన్న; పతంగా= సూర్యమూర్తీ!

స్వామీ ! సిరుల ననుగ్రహించే కృపాదృష్టి కలవాడా ! ( కరుణతో తడిసిన కళ్లు కలవాడా) వికుంఠా తనయా ! చేతికి ఎముక లేకుండా భక్తులకు వరాలిచ్చే వాడా ! పాద పద్మాల్లో అతిశయంగా తేనెవలె తొణికిసలాడే గంగ కలవాడా !శేషశైల మన్న ఉదయ పర్వతంపైన పొడిచిన సూర్యుడా !

విశే॥ నాల్గో పాదంలో గంగా - ఆ - అన్న ప్లుతానికీ ఉదయస్థ - లోని య కారానికి యతి. ఇది ప్లుత యతి.

స్వామి కొండపైన సూర్యబింబం లాగా ఉన్నాడనటం చాలా అద్భుతమైన దర్శనం.

వ. అవధరింపు మనంతర వృత్తాంతంబు. 2

అనంతర = తర్వాతి; వృత్తాంతంబున్ = కథను; అవధరింపుము = సావధానంగా చిత్తగించాలి.

### భావోన్మేషం

దాసరికథ వ్రాయటంలో రాయలవారి భావన త్రివిక్రమంగా ఉంది - త్రిభూమికల్లో సంచరించినదని తాత్పర్యం.

**I. తిరుప్పాణాళ్వారు**

ఇతనినే మునివాహనుడంటారు. పంచముడు. నిత్యము వీణ మీటుతూ శ్రీరంగస్వామిని సేవించేవాడు. అదే అతనివ్రతం. ఒకనాడు భగవంతుడు అర్చకుడైన లోకసారంగ మహాముని కలలో కన్పించి తిరుప్పాణాళ్వారును బుజాలపై నెక్కించుకొని తన దగ్గరకు తీసుకొని రమ్మనాడు. అతడలాగే చేసినాడు. కనుక మునివాహనుడన్న బిరుదు వచ్చింది. అప్పుడు మునివాహనుడు భగవంతుని స్తుతిస్తాడు. ఆదివ్య ప్రబంధం పేరు 'అమలనాదిపిరాన్'.

ఈ ఆళ్వారుని కిదొక అర్చనాసమర్పణం.

**II. కైశికీపురాణం**

ఈ దాసరి కథవరాహపురాణంలోనిది. దానినే పై పేరున వ్యవహరించటం శ్రీవైష్ణవ సంప్రదాయం. దీనికి మణి ప్రవాళశైలిలో శ్రీభట్టరు తమిళవ్యాఖ్యానం వ్రాసాడు. శ్రీవైష్ణవం రామాయణ - గీతా చరమశ్లోకాలతో పాటు వరాహచరమాన్నీ ప్రపత్తి యోగప్రమాణంగా గ్రహించినది.

*స్థితే మనసి సుస్థిష్టే శరీరే సతి యో నరః*
*ధాతు సామ్యే స్థితే స్మర్తా విశ్వరూపం చ మా మజం*
*తతః తం మ్రియమాణం తు కాష్ఠపాషాణ సన్నిభం*
*అహంస్మరామి మద్భక్తం నయామి పరమాం గతిం.*

1. సుస్వస్థమనస్కుడు. స్వస్థశరీరంకలవాడు, ధాతుసామ్యస్థితుడైన మనిషి విశ్వరూపుడును- అజుడనైన నన్ను మరణ వేళ స్మరిస్తే వానినీ పరమగతికి తీసుకొని పోగలను,

ఇది మిగిలిన చరమశ్లోకాల్లో ప్రథమచరణం.

దీనికి పెరియవాచ్చాన్ పిళ్లై తమిళ వ్యాఖ్యాన మున్నది.

**III. తృతీయ భూమిక ప్రధానమైన కావ్య విషయం.**

శ్రీవిలుబుత్తూరులో మన్నారుస్వామి విగ్రహం మహోదారంగా ఉంటుంది. అంతగంభీరమూర్తి నోటినుండి వచ్చిన శబ్దమెలా ఉంటుంది ? ఇందుకని విశ్వనాథ కవిసమ్రాట్టన్నారు.

'' ఈ కథ చెప్పినది జగన్నాథుడు. జగన్నాథుడు చెప్పిన కథ యెట్లుండును ? జగన్నాథముగ నుండును.'' (వేయిపడగలు)

(చూ. విజ్ఞాన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం. 3 వది. వారివ్యాసమే)

ఖాండిక్యకేశిధ్వజసంవాదంలోనూ తెలుగుమాటలే. అవి ప్రసన్నంగా ఉంటే ఇందులోనూ తెలుగే. ఇది ప్రౌఢ భాష.

కారణం వక్తనుబట్టి. శ్రోత విష్ణుచిత్తుడు. వాది జయించేసి మతస్థాపన చేసిన తన భక్తుడు. ఈ దృష్ట్యా శబ్దమూ - వర్ణనా- చూసుకోవాలి.

చ. కలఁ డొకరుండు పేరుకొనఁ గాని కులంబు మదీయ భక్తుఁడి
యిల మును వాఁడు వామనత నే వసియింపనొ పుణ్యభూమి, నం
దుల కొక యోజనత్రయపు దూరపుటూర వసించి, బ్రాహ్మ వే
ళలఁ జనుదెంచి, పాడు మము లాలస మంగళ నామ కైశికిన్. 3

పేరుకొనగాని కులంబు = అనరాని కులంవాడు; మదీయ భక్తుఁడు = నాకు భక్తుడు; వాడు; ఈ + ఇలన్ = ఈ లోకంలో; మును = పూర్వం; నేన్; వామనతన్ = వామనావతారంగా; వసియింపనొ = ఉండేవాడినే, పుణ్యభూమి = పుణ్యక్షేత్రం; అందులకున్ = ఆ కురంగుడి అన్న క్షేత్రానికి; ఒక; యోజన త్రయపు టూరన్ = మూడు యోజనాల దూరంలో ఉన్న కుగ్రామంలో; వసించి = నివసిస్తూ; బ్రాహ్మవేళలన్ = బ్రాహ్మముహూర్తంలో; (తెలవారు జామున); చనుదెంచి = వచ్చి; లాలసన్ = ఆసక్తితో (భక్తితో); మంగళనామ = ఆ పేరుగల; కైశికిన్= కైశికీ గానంతో; మమున్ పాడున్ = మమ్ము కీర్తించే వాడు.

చెప్పరాని కులం వాడొకడుండే వాడు. ఎక్కడంటావా ? పూర్వం మేము వామనమూర్తిగా ఉండే వాళ్లమే ఆ పుణ్యక్షేత్రానికి మూడు యోజనాల దూరంలో ఒక గ్రామంలో ఉంటూ రోజూ ప్రొద్దున్నే వచ్చి మంగళ కైశికీ గానంతో మమ్ము కీర్తించే వాడు.

కురుంగుడి 108 తిరుపతుల్లో ఒకటి

పద్యంలో వాక్యనిర్మాణం పరిశీలించాలి. సంభాషణశైలిలో చెప్పబడుతున్నది. ప్రథమ వాక్యంలో మూడు విరుపులు, అన్వయ క్రమంలో లేదు.

పేరుకొనగాని కులంబు - ఈ మాట విష్ణుచిత్తునితో అంటున్నది. ఇతడేమో విప్రోత్తముడు. అతడేమో పంచముడు. కానీ దైవదృష్ట్యా ఇద్దరూ భక్తులే. సమానులే.

ఆళ్వార్లలో తిరుప్పాణాళ్వారు - (నరవాహనుడు) పంచముడు, చాతుర్వర్ణ్య + అతీతంగా శ్రీవైష్ణవం అంతకు ముందే - శైవం - తర్వాత కర్ణాటక శైవం - వచ్చాయి.

మహారాష్ట్రలో భక్తి ఉద్యమంలో మహాభక్తులు పంచములైనవారూ ఉన్నారు.

ఇది ప్రత్యేకించి పరిశీలించదగ్గ చారిత్రకాంశం.

వ. అహరహంబు నమ్మహాత్ముండు. 4

కం. జాత్యుచిత చరిత్ర మ
మత్రీప్త్యర్థం బూఁది తనదు హృదయము శుచితా

నిత్యంబుగఁ దత్తను సాం
గత్యము మసిపాఁత మానికంబై యొదుఁగన్. 5

జాతి+ఉచిత = స్వజాతికి తగిన; చరిత్రమ = జీవనమే; మత్ = నా; ప్రీతి+అర్థంబు = సంతోషం కోసం; ఊది = అవలంబించి; తనదు; హృదయము; శుచితానిత్యంబుగన్= నిత్యపరిశుద్ధంబుగ; తత్+తనుసాంగత్యము = ఆ శరీరంతో కూడి ఉండటం; మసిపాతన్=మసిగుడ్డలో; మానికంబై = రత్నమై; ఒదుగన్ = అణగి ఉండగా;

కులోచిత జీవితం నా ప్రీతికోసం అవలంబిస్తూ, తన హృదయాన్ని నిష్కలుషితంగా చేసుకొని ఆ శరీరంతో - మసిగుడ్డలో మాణిక్యమున్నట్లు ఒదిగి ఉండగా -

విశే॥ భక్తుడైన వానికి ( జాత్యనుగుణ) కర్మ ఉండాలా ? అన్న ప్రశ్నకు అద్వైతం కర్మ సన్న్యాసం బోధిస్తుంటే విశిష్టాద్వైతం కర్మ సహిత మత జీవితాన్ని బోధించింది. కనుక ఈ మాటన్నాడు మహాకవి. గీతలో భగవంతు డన్నాడు.

*శ్రేయాన్ స్వధర్మః విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్*
*స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః* (18-47)

పరధర్మం చక్కగా అనుష్ఠించటం కంటె స్వధర్మం శ్రేయం. స్వధర్మంలో మరణించటమూ శ్రేయమే కాని పరధర్మం మాత్రం భయంకరం.

సీ. చమురైన తోల్కుబుసంబు టెక్కియును; ని
త్తడి శంఖ చక్ర కుండలము లమర,
దివెదారికొమ్ముఁ దోల్తిత్తియును; జోడమ్ము;
మెడమీఁది మొగలాకు గొడుగుఁ దనర,
మత్పాదరక్షయు; మావు పెన్నెఱకఁగు
ట్టైన యోటి తిపిరిదండెయును మెఱయ,
జిటి తాళములు సంక పుటిక నొక్కొక మాటు
గతిరయంబునఁ దాకి కలసి మొరయ.

తే. వలుద వనమాల కంటెయు, మలిన తనువుఁ
బట్టై తిరుమన్ను, బెదరుఁ గెంబుట్టుఁ జూపుఁ
బసుపుఁ బొడి తోలు వల్వంబు నెసక మెసఁగ
వచ్చు సేవింప సురియాళు వైష్ణవుండు. 6

చమురు+ఐన = చమురు మరకల; తోల్కుబుసంబు = తోలుచొక్కా; టెక్కియునున్ = టోపీ; ఇత్తడి; శంఖచక్ర కుండలములు = ఒకటి శంఖ చిహ్నంతో మరొకటి చక్ర చిహ్నంతో ఉన్న ఇత్తడి చెవి పోగులు, అమరన్ = ఒప్పుతుండగా;

చమురంటి మాసిన తోలుచొక్కా- తోలుటోపీ, ఇత్తడి శంఖ చక్రాల కమ్మలు- అందగిస్తున్నాయి (ఇత్తడి = కుండలము - ''డ-ల'' ప్రాసయతి)

దివెదారి కొమ్ము = దివ్వెలున్న చెట్టులాంటి కంబం; గరుడ కంబం (భజనల్లో మధ్య ఉంచుకొన్న అనేక దీపాలు కల కొమ్మల ఆకృతిలో ఉండే స్తంభం); తోల్తిత్తి = తోలు సంచి, జోడు+అమ్ము = వింటి నుండి ప్రయోగించే బాణం కాక చేతియాయుధమైన అమ్ము; మెడమీది = మెడపైన; మొగిలి+ఆకు గొడుగు = మొగలి ఆకులతో చేసిన గొడుగు;

దాసర్లు భిక్షాటనం కోసం ఒక చేత్తో చిరుతలు మ్రోగిస్తూ - మరొక చేత్తో గరుడ కంబం పట్టుకొని వస్తారు. అలాంటి స్తంభంతో - తోలు తిత్తి - జోడమ్ము (మార్గ రక్షణార్థం) - మొగలి గొడుగుతో

మత్ = నా; పాదరక్షయున్ = చెప్పున్నూ; పెన్ = పెద్ద; మావు = గుఱ్ఱపు; నెఱక = వెంట్రుకతో, కుట్టిన; ఓటి తిపిరి = ఓడుపోయిన చిన్న; దండెయును = సొరకాయ తంబురా (కిన్నెర);

ఒక చేతిలో లేదా శిరస్సున వేంకటేశ్వరస్వామి చెప్పు, (మొన్న మొన్నటి దాకా దాసరు లిలా రావట ముండేది.) ఒక చేత చిన్ని కిన్నెర సొరకాయ బుఱ్ర పగిలితే దాన్ని గుఱ్ఱపు వెంట్రుకతో కుట్టుకొన్నాడు. అదే తిపిరిదండె (అనేక వీణభేదాల్లో ఇదీ ఒకటిగా పాల్కురికి పండితారాధ్య చరిత్రలో పేర్కొన్నాడు)

చిటితాళములు = చిన్ని తాళాలు; చంక పుటిక = చంకలో చిన్న బుట్ట; గతిరయంబునన్ = నడక వేగం వల్ల; తాకి = తాళాలు ఒక దానితో ఒకటి తాకి; కలసి = కలిసిపోయి; మొరయన్ = ధ్వని చేస్తుండగా;

చిటితాళాలు భుజం మీద వేసుకొన్నందున నడక వేగంతో అవి ఒకటొకటి తాకి ధ్వనిస్తుండగా- (ఒక తాడుకు ఆ చివర ఒకటి ఈ చివర ఒకటి కట్టి భుజానికటూ ఇటూ వేసుకొన్నాడు) చంకలో చిన్న బుట్ట ఏమైనా వస్తువు లుంచుకోవటానికి.

వలుద = గుండ్రని; వనమాల కంటెయున్ = తులసిపూసల కంఠాభరణం (దండ); మలిన తనువున్ = మకిలి ఒడలు; పట్టె తిరుమన్న = తిరుచూర్ణపు పట్టెనామం; (మొకం మీద); బెదరు కెంపు ఉట్టు చూపున్ = బెదిరే ఎర్రని చూపులు; పసుపు పొడి తోలు వల్వంబు = పసుపు పొడి పట్టించిన తోలు వస్త్రం (ఉత్తరీయం); ఎసకము౹ ఎసఁగన్= ఒప్పు తుండగా; సేవింపన్ = నన్ను సేవించుకోవడానికి; వచ్చున్ = వస్తూ ఉండేవాడు.

మెడలో తులసి పూసల దండ, లేదా తులసి పూసలు నడుమ కూర్చిన ఇత్తడి కంటె, మురికి ఒడలు, బెదరు చూపులు - పసుపు పొడి వన్నె ఉత్తరీయం.

విశే॥ మొగిలాకుతో గొడుగులు కుట్టడం మనకు తెలియదు. మనకు తాటాకు గొడుగులు. నేటికీ శ్రీవిలుబుత్తూరులో ఈ మొగిలి గొడుగులు వానకాలంలో కన్పిస్తూనే ఉంటాయి.

దాసరి చిత్రం

మురికి శరీరాన్ని కప్పుతున్న తోలు చొక్కా, భుజాన పసుపు వన్నె ఉత్తరీయం, తలపై తోలు టోపీ (బహుశా కుళ్లాయి), చెవులకు ఇత్తడి శంఖచక్రాకారపు కమ్మలు, ఒక చంకన తోలుతిత్తి, మరొక చంకన బుట్ట, భుజాన చిటితాళాలు, మొగిలాకు గొడుగు, జోడమ్మా - చేతిలో గరుడకంబం, ఓటి దండె, నెత్తిపై స్వామి పాదరక్ష, మెడలో తులసిపూసల కంటె, ముఖాన తిరుచూర్ణపు నామం, ఎర్రని బెదరు చూపులు,ఇదే ముందుపద్యం లోని ''మసిపాత'' వర్ణనం.

శా. గండాభోగముల న్ముదశ్రులహరుల్గప్ప న్నతుల్పాడి, యా
దండ న్వేగులు డించి, భక్తి జనితోద్యత్తాండవం బాడు, నా
చండాలేతర శీలుఁ, డుత్పులకుఁడై, చాండాలిక న్మీఁటుచుఁ
గుండుల్ నీరుగ, నెండ, గాలి, పసి, తాఁకుం జూడ, కాప్రాహ్ణముఁ. 7

ఆ; చండాల+ ఇతర శీలుఁడు = చండాలుని కంటె వేరైన స్వభావం - ప్రవర్తన కలవాడు; ఆదండన్ = ఆప్రక్క; వ్రేగులున్ డించి = పై పద్యంలో చెప్పిన బరువులన్నీ క్రిందపెట్టి; ఉత్+పులకుడై = పులకలు కలవాడై (రోమాంచంతో); గండ+ఆభోగములన్ = చెక్కిళ్ల విస్తృతిపై; ముత్+అశ్రులహరుల్ = సంతోషబాష్ప వీచికలు; కప్పన్ = ముంచుతుండగా; ఎండతాకు = ఎండవేడి; పసితాకున్ = ఆకలి; గాలితాకూ; చూడక = గమనించక; గుండుల్ = బండలు; నీరుగన్ = నీరయ్యేటట్లు; ఆ ప్రాహ్ణమున్ = మధ్యాహ్నం దాకా; చాండాలికన్ మీటుచున్ = ఓటితిపిరిదండెను; (చండాలుని వాద్యం) మీటుతూ; నుతుల్ పాడి = నాపై కీర్తనలు పాడి, భక్తి జనిత+ఉద్యత్+తాండవంబు+ఆడున్ = భక్తితో పుట్టిన తాండవ నృత్యం చేస్తుండేవాడు.

బరువులన్నీ ఒక ప్రక్క పెట్టి, ఆ సాధుశీలుడు తన వెడల్పైన చెక్కిళ్ల మీద సంతోష బాష్పవీచికలు నిండారగా, కిన్నెరను మీటుకొంటూ, రాళ్లు కరిగేటట్లు ఎండ, గాలి, ఆకలి దప్పులను మరచి నన్ను సంకీర్తిస్తూ, భక్తితో వెర్రి నృత్యం చేసేవాడు.

అలం : స్వభావోక్తి.

విశే॥ గండాభోగములు - వెడల్పైన చెక్కిళ్లు. జాత్యుచిత ముఖవర్ణన. నాగరిక ముఖవర్ణన వేరు. భక్తి-తాండవంబు - నేర్చుకొన్నది కాదు. భక్తితో తనంత తానై పుట్టినది.

తే ॥ అట్లు దడవుగఁ గొల్చి సాష్టాంగ మెఱఁగి
గర్భ మంటపిఁ గడిగిన కలఁకజలము
లోని జూటొట్టి నిండి కాలువగఁ జాఁగి
గుడివెడలి వచ్చునది శూద్రుఁ డడఁగఁ గ్రోలి. 8

అట్లు; తడవుగన్ = చాలాసేపు (వేకువ జామునే వచ్చి మధ్యాహ్నం దాకా); కొల్చి = సేవించి; సాష్టాంగము = ఎనిమిది అంగములు నేలకు తాకేటట్లు (స+అష్ట+అంగ); ఎఱగి = నమస్కరించి; గర్భమంటపిన్ =

గర్భగుడిలోని స్వామిపీఠాన్ని; కడిగిన; కలఁక జలము = కలుషిత జలం; లోని = లోపలి; ఱాతొట్టి = రాతి తొట్టి; నిండి; కాలువగన్ +చాగి = కాల్వగా పారి, గుడి వెడలి = గుడినుండి బయటకు; వచ్చునది= వచ్చే దానిని; శూద్రుఁడు+ఇడగన్ = చతుర్థ వర్ణం వాడివ్వగా; క్రోలి = త్రాగి,

అలా మధ్యాహ్నం దాకా సేవించి సాష్టాంగంగా నమస్కరించి, గర్భగుడిలోని స్వామి విగ్రహమున్న వేదికను కడిగిన కలకనీరు గర్భగుడినుండి బయటనున్న రాతి తొట్టి నిండి గుడిబయటకు కాలువగా సాగివస్తే దాన్ని ఒక శూద్రు డివ్వగా- త్రాగి

విశే॥ కలకనీరైనా భక్తునకు అసహ్యం కాలేదు. సేవ్యమే

సాష్టాంగము : చేతులు రెండు - కాళ్లు రెండు- బుజాలు రెండు- రొమ్ము - నుదురు

పీఠం కడిగిన నీరు బయటకు వచ్చే మార్గవర్ణన దేవాలయ నిర్మాణాన్ని సూచిస్తుంది.

గర్భ గుడి - లోపలి విగ్రహపీఠం- ఆ గుడిబయట రాతి తొట్టి - మరల బహిః ప్రాకారం. రాతి తొట్టినుండి కాలువగా సాగి తూములోనుండి బయటకు రావటం.

ఉ. **ఆతఁడు ముఖ్యజాతిఁ గని నంతన పాయుచు, నెండ గాలి నెం**
**తో తడవుం బ్రసాద వినియోగము వార్చి వసించుచుం, ద్రివ**
**ర్ణేతర జాతి మెచ్చి దయ నిడ్డ ప్రసాదము దండె సాఁచి శ్ర**
**ద్ధాతిశయంబునన్ వినతి నంది, భుజించుఁ, గొనుం దదంబువున్.** 9

అతడు = ఆ దాసరి; ముఖ్యజాతి = అగ్రజాతి మనుష్యులను; కనినంతన = చూచి నంతటే; పాయుచున్ = తొలగుతూ; ఎండన్ -గాలిన్ = ఎండలో గాలిలో; ఎంతో తడవున్ = ఎంతో సేపు; ప్రసాద వినియోగము = దైవ ప్రసాదము పెట్టేటంతవరకు; వార్చి = కనిపెట్టుకొని; వసించుచున్ = ఉంటూ; త్రివర్ణ+ ఇతర జాతి = చతుర్థ కులస్థులు; మెచ్చి = అతనిని మెచ్చుకొని; దయన్ = దయతో; ఇడ్డ = పెట్టిన; ప్రసాదమున్= దైవప్రసాదం; దండెన్ సాచి = తిపిరి దండెను చాచి; శ్రద్ధ+అతిశయంబునన్ = అధికమైన శ్రద్ధతో; వినతిన్+అంది = వినయంగా స్వీకరించి; భుజించున్ = తింటాడు; తదంబువున్=దైవజలాన్ని- తీర్థాన్ని; కొనున్ = తీసుకొంటాడు.

అగ్ర వర్ణస్థులను చూచి దూరంగా తొలగిపోతూ- దైవప్రసాదం పెట్టేటంత వరకూ ఎదురు చూస్తూ- చతుర్థకులస్థులు దయతో పెట్టిన ప్రసాదం- చేతిలో దండెను సాచి స్వీకరించి తిని- తీర్థజలాన్ని త్రాగేవాడు.

ముసిపాతలో దాగిన మాణిక్య వర్ణన.

వ. **ఇట్లు ధన దివాకీర్తిజని నగు పరమార్తినైచ్యంబు సకలజన శోచ్యంబుగా గుడి లాఁపరా తూపరాణి కడ నిలిచి బహిరావరణ ప్రదక్షిణంబ కావించి ప్రాగ్దెక్క నిజ పక్కణంబునకుం బోవుచుండు, నిట్లుండి యొక్కనాడు.** 10

ఇట్లు = ఈ విధంగా; దివాకీర్తిజనిన్ = చండాలజన్మతో; అగు = ఐన; పరమ = గొప్ప; ఆర్తిన్ = దుఃఖం; కల్గించే; నైచ్యంబు = నీచత్వం; సకలజన = అందరకూ; శోచ్యంబుగాన్ = విచారించదగినది కాగా, గుడి; లాఁపరా = తూముకు వేసే రంధ్రాలున్న పలకరాయికల; తూపరాణి = తూము; కడన్ = దగ్గర; నిలిచి; బహిః+ ఆవరణ = బయటి ప్రాకారం చుట్టు; ప్రదక్షిణంబు కావించి = వలగొని ( కుడిచేతి మీదుగా గుడిచుట్టూ తిరగటం); ప్రొద్దెక్కన్ = ప్రొద్దు బాగా ఎక్కేటప్పుడు; నిజ = తన; పక్కణంబునకున్ = పల్లెకు; పోవుచున్+ ఉండున్ = పోతుండేవాడు.

అతని ప్రవర్తన - శీలం అతని జాతికి విరుద్ధంగా ఉన్నందున అందరూ అయ్యో పాపం - అని జాలి పడేవారు. అతడు మాత్రం గుడి బయటి ప్రాకారం తూము దగ్గర లోపలినుండి వచ్చే నీటిని త్రాగే వాడు కనుక- అక్కడ నుండి మొదలు పెట్టి ప్రాకారం వెలుపల ప్రదక్షిణం చేసేవాడు.

విశే॥ ఈ కథలో చాలా విచిత్రమైన అప్రసిద్ధమైన శబ్ద ప్రయోగం చేయటం గుర్తించాలి.

ఈ ప్రౌఢికి హేతువు భగవంతుడు వక్త, భక్తుడు శ్రోత, వారి నడుమ సంభాషణం కథ.

ఇది అతని దైనందిన కృత్యం. కనుక 10 పద్యాలు ఒకే గుక్కలో చెప్పబడ్డాయి

కం. అర్ధమరే యద్దాసరి
యద్దండ బిడాలగాహితాలయ కృకవా
కూద్దండరవము విని చను
ప్రొద్దాయె నటంచుఁ బాడఁ బోవుచుఁ ద్రోవన్. 11

ఆ దాసరి; అర్ధమరేయిన్ = నడురాత్రి; ఆ దండన్ = ఆ ప్రక్కనే; బిడాల = పిల్లి; గాహితః ప్రవేశించినందున; ఆలయ = ఇంటి; కృకవాకు = కోళ్లయొక్క; ఉద్దండ = పెద్ద; రవముః రొద; విని; చనుప్రొద్దు = సేవకు వెళ్లే సమయం; ఆయెన్ = ఐనది; అటంచున్ = అంటూ; పాడన్ = మంగళకైశికీ గానానికి; పోవుచున్ = పోతూ; త్రోవన్ = దారిలో.

ఒక అర్ధరాత్రి ఇంటిప్రక్క నున్న కోళ్ల గూటి లోకి పిల్లి చొరబడి నందున అవన్నీ పెద్దగా రొదచేసాయి. అతడు గుడికి పోయే సమయమైన దనుకొంటూ లేచి, పోతూ దారిలో.

విశే॥ఇది క్రిందిపద్యంలోకి పోతున్నది.

కోళ్లగూడు - జాత్యుచిత చరిత్రలోని అంశమే.

ఆ. మరులుఁ దీఁగ మెట్టి యిరు లన్న నో యని
యెడు తమిస్రఁ గాడుపడి పొలంబు
లెల్లఁ దిరిగి తూర్పు దెల్ల నౌతఱి నొక్క
శూన్యగహనవాటిఁ జొచ్చి చనుచు. 12

మరులు తీగన్ = మరులు కల్పించే తీగను; మెట్టి = త్రొక్కి; ఇరులు = చీకటులారా; అన్నన్ = అని పిలిస్తే; ఓ యనియెడు = ఓహో! అని సమాధాన మిచ్చే; తమిస్రన్ = చీకటిలో; కాదువడి = కలవరపడి; పొలంబులు +ఎల్లన్ = ఎన్నో చోట్లు; తిరిగి; తూర్పు; తెల్లనౌ తఱిన్ = తెలుపారుతున్న వేళలో, ఒక్క, శూన్య గహన వాటిన్ = నిర్మానుష్యమైన అడవిలో; చొచ్చి = ప్రవేశించి; చనుచున్ = పోతూ.

ఏదో మరులు తీగను త్రొక్కినట్లు దారి తప్పి, పిలిస్తే పలికే చీకటిలో బయలు ప్రదేశాలన్నీ తిరిగి తిరిగి చివర కొక నిర్మానుష్యమైన అడవిలో ప్రవేశించి పోతూ-

సీ. ఇడిసిన యిడుపుల యెడలఁ బొ్రేవే నుత్త
రేను గసెంద కోరింద పొదల
గెడసిన గరిసెల క్రింద లాఁగలఁ గ్రుస్సి
యదవ కాఁపురముండు నాఖుతతుల
సగము దుమ్మునఁ బూడి చిగిరింత వా మూయఁ
బెరిఁగిన నూతిపాఁతర బొరియలఁ
జీమలు ప్రాలీడ్వఁ జివికిన వెలుఁగు ప
ట్టునఁ బండి యెండి క్రుంగిన గునుకులఁ,

తే. బెంటదొగ్గల్లలోఁ గడు పంటి శ్మశ్రు
చలనములఁ గ్రుక్కు జీర్ణోతువులఁ, బొలంబు
దుండుగల మళ్ల యౌరులఁ దూలి రాడు
చిక్కునేతాల పొడఱు సీమఁ జనుచు. 13

ఇడిసిన = కూలిపోయిన; ఇడుపుల = వాకిలి; ఎడలన్ = ప్రక్కచోట్ల; పొ్రేను, ఉత్తరేను, కసింద,కోరింద-సామాన్యంగా పాముల దొడ్లలో పొలం గట్ల మీద ఉండే పిచ్చి చెట్లు; పొదలన్ = ఆ చెట్ల పొదలలో;

కెడసిన = ప్రక్కల కొరిగి పోయిన; గరిసెల = గాదుల క్రింద; లాగలన్ = బొక్కలలో; క్రుస్సి = కృశించి; అదవుకాపురము = దిక్కుమాలిన నివాసం (అధవః- అదవ-సూ.ని); ఉండు; ఆఖుతతులన్= ఎలుకలగుంపు;

సగము = సగభాగం; దుమ్మునన్+పూడి = దుమ్మువల్ల మూసుకొని పోయి; చిగిరింత = ఒక రకం చెట్టు; వా = ముఖభాగం (వాయి=నోరు); మూయన్ = మూతగా ఏర్పడితే; పెరిగిన = ఎక్కువైన, నూతి = నూయి వలె ఏర్పడ్డ; పాతర బొఱియలన్ = పాతర బొరెలలో;

చీమలు; ప్రాలు = బియ్యపు గింజల్ని; ఈడ్వన్ = ఈడ్చుకొని పోయినందువల్ల; చివికినన్ - చీకిపోయిన; వెలుగు పట్టునన్ = కంచెలో; పండి; ఎండిన= ఎండిపోయిన; గునుకులన్ = గునుకన్న ధాన్యం మొక్కలతో;

పెంట దొగ్గళ్ళలో = పెంటకుప్పల మీద దొగ్గలి చెట్లలో; కడుపు+అంటి = డొక్కలు పీక్కొని పోయి, శ్మశ్రుచలనములన్ = మీసాల కదలికతో; క్రుక్కు = ముడుచుకొని బ్రతికి; జీర్ణ = ముసలి; ఓతువులన్ = పిల్లులతో;

పొలంబు = పొలాల్లో; దుండుగలన్ = కలుపు మొక్కలతో; మళ్ల = వరిమళ్ళలో; ఔరులన్ = అవురుగంటలన్న గడ్డితో; తూలి = నేలపై పడ్డ; రాడు = నిట్రాడుమాత్రమే; చిక్కిన = మిగిలిన; ఏతాలన్ = ఏతపు కట్టడాలతో; పాడు+అఱు సీమన్ = పాడుపడ్డ ప్రదేశ ంలో; చనుచున్ = పోతూ;

తలుపులు ద్వారబంధాలు పడిపోయి గాదెలక్రింద రంధ్రాల్లో దిక్కులేని బ్రతుకు బ్రతికే ఎలుకలు-నూతులవలె నున్న పాతర్ల దుమ్ముతో సగం పూడిపోయాయి. పాతరపై అంచులు చిగిరింత గడ్డి పెరిగినందువల్ల సగం మూతపడింది. ఆ పాతర్ల నిండా బొరియలే తప్ప గింజలు లేవు. గింజల్ని లాక్కొని చీమలు పోతూ ఉంటే జారిపడిన గునుకు ధాన్య ం మొలిచి కంకి వేసి ఎండిపోయింది. పెరట్లో పెంట కుప్పల మీద దొగ్గలి పొదల్లో, కడుపు అంటుకొని పోయిన ముసలి పిల్లులు. పొలాలన్నీ దుండుగల మొక్కలతో, వరిమళ్ళలో పెరిగిన ఔరుగంట్లతో, నిట్రాడు మాత్రం మిగిలి పడిపోయిన ఏతాలతో పాడుపడిన ప్రదేశం నుండి పోతూ.

అలం: స్వభావోక్తి.

విశే॥ రాయలవారి పాలనలో మండలాధిపతుల అన్యాయాలకు పన్నులు కట్టలేక ఊళ్లు వదలిపోయిన సందర్భాలున్నాయి. అలాంటి ఊళ్ళు చూచినట్లున్నాడాయన. ఇలాంటి వర్ణనలు సంస్కృతాంధ్ర సాహిత్యాల్లో చాలా అరుదు.

భాష- గడ్డిగాదం మొక్కల పేర్లు గుర్తించాలి. ఇదంతా దేశీయ ద్రవ్యమే.

క. అపమార్గత నరుగుచు మా
ర్గపు ధామార్గవపుఁ గంటకంబులఁ గాల్లఁ
విపరీతత నూడ్చుచు నే
రుపున న్పల్లేరు లీడ్చి త్రోయుచుఁ జనుచున్. 14

అపమార్గతన్ = దారిలేని ప్రదేశంలో; అరుగుచున్ = పోతూ; మార్గపు = దారిలోని; ధామార్గపున్ = ఉత్తరేని; కంటకంబులన్ = ముళ్లను; విపరీతతన్ = క్రిందనుండి పైకి; ఊడ్చుచున్ = తీసిపారవేస్తూ; నేర్పునన్ = నేర్పుతో; పల్లేరులు; ఈడ్చి = లాగి; త్రోయుచున్ = పారవేస్తూ; చనుచున్ = పోతూ.

దారికాని ప్రదేశంలో పోతున్నాడు. దారంతా ఉత్తరేను, పొదలు బలిసివున్నందున ముళ్ళు కాళ్లకంటుకొంటే వాటిని క్రిందినుండి పైకి ఊడలాగి విసరివేస్తూ, పల్లేరులను లాగి పారవేస్తూ పోతూ

అలం: స్వభావోక్తి.

విశే॥ ఉత్తరేను ముళ్లు క్రిందివైపుకు గుచ్చుకొంటుంది. కనుక క్రిందినుండి పైకెత్తితే ఊడి వస్తుంది.

శా. కాంచె న్వైష్ణవుఁ డర్ధ యోజన జటాఘాటోత్థశాఖోపశా
ఖాంచజ్ఝాట చరన్మరుద్రయ దవీయః ప్రేషితోద్యచ్ఛదో
దంచ త్కీటకృత వ్రణచ్ఛలన లిప్యాపాదితాధ్వన్య ని
స్సంచారాత్త మహాఫలోపమ ఫలస్ఫాయద్వటక్ష్మాజమున్ 15

వైష్ణవుఁడు = విష్ణుభక్తుడైన దాసరి; అర్ధయోజన = సగము ఆమడ (దాకావ్యాపించిన); జటా = ఊడల, ఘాటా = పైభాగంలో; ఉత్థ = మొలిచిన; శాఖ = కొమ్మలు, ఉపశాఖా = కొమ్మలకు పుట్టిన కొమ్మలతో; అంచత్ = (గంభీరంగా) ఒప్పుతున్న; ఝాట = సమూహంలో; చరత్ = తిరుగుడు పడుతున్న; మరుత్ = గాలియొక్క; రయ = వేగంతో, దవీయః = దూరానికి; ప్రేషిత = పంపబడిన; ఉద్యత్ = ఎగిరే; ఛద = ఆకులలో; ఉదంచత్ = స్పష్టంగా (ప్రకాశించే); కీట = పురుగులతో; కృత = చేయబడ్డ; వ్రణ = రంధ్రాలన్న; ఛలన = మిషగల; లిపి = వ్రాతతో; ఆపాదిత = కల్గిన; అధ్వన్య = బాటసారుల , నిస్సంచార = సంచరించనందువల్ల; ఆత్త = లబ్ధమైన, మహాఫల = గొప్పఫలాల; ఉపమ = సాటిరాగల; ఫల = పండ్లతో; స్ఫాయత్ = విజృంభించే; వటక్ష్మాజమున్ = మఱ్ఱిచెట్టును; కాంచెన్ = చూచినాడు.

అపమార్గంలో దాసరి ఒక మఱ్ఱిచెట్టును చూచాడు. అది అర్ధయోజనం వైశాల్యం కలిగివుంది. దాని ఊడలకు కొమ్మలు- వాటికి కొమ్మలుగా సాగిపోతున్నది. ఆరాక్షసిమఱ్ఱి గుబుర్లలో గాలి సుడిపెట్టి వీస్తుంటే ఆకులు దూరదూరాల కెగిరి పోతున్నవి. ఆ ఆకులు పురుగులు కొట్టినవి కనుక వాటినిండా తూట్లున్నాయి. అదిలిపిలాగా ఉంది. ఆ అక్షరపంక్తి ''బాటసారులారా! ఇటు రాకండి. నాపై బ్రహ్మరాక్షసు డున్నాడు.'' అని చెబుతున్నట్లుంది. కనుక ఆ ప్రాంతంలో నరసంచారం లేదు. దాని వల్ల మనుష్యుల ప్రాణాలు కాపాడింది మఱ్ఱి. ఆ పుణ్యఫలం లాంటి పెద్ద పండ్లతో ఒప్పారుతున్నది.

**అలం:** అపహ్నవంతో కూడిన ఉత్ప్రేక్ష.

విశే॥రాయలవారి కాలంలో ఇలాంటి చెట్లుండేవని పేయస్ వ్రాసాడు. అతడు విజయనగర ప్రాంతంలో పెద్ద మఱ్ఱిని చూచాడట. 'కొన్నిపందల బండ్లను క్రింద నిలపవచ్చును' అని. కదిరిదగ్గర అనంతపురం జిల్లాలో 'తిమ్మమ్మ' మఱ్ఱిమాను ఉంది. ప్రపంచంలోకెల్లా పెద్దచెట్టట. ఏది ఊడో- ఏది మొదలో ఎవరికీ తెలియదు. కొన్ని ఏండ్ల క్రితందాకా ఇంత చెట్లు దారిప్రక్కన కనిపించేవి.

ఆ. కాంచి యాతఁ డొక్క కాలిత్రోవయు నంతఁ
గాంచి యందుఁ దెరువుఁ గాంచినదియ
పరమలబ్ధి గాఁగఁ ద్వరితంపుగలి నవ్వ
టావనీజ మంత నంతఁ గదిసి. 16

అతఁడు; కాంచి = చూచి; అంతన్ = అంతటు; కాలిత్రోవయున్ = కాలిదారి; కాంచి; అందున్ = అక్కడ; తెరువు కాంచినదియ = దారి దొరికినదే; పరమలబ్ధి = మహాభాగ్యంగా; కానన్ = కాబట్టి; త్వరితంపు గతిన్ = తొందర నడకతో; ఆ వట+అవనీజము = ఆ మర్రిచెట్టును; అంతన్ +అంతన్ = నెమ్మదిగా; కదిసి = సమీపించి.

అర్థయోజనం మేర వ్యాపించి యుంది కనక దూరం నుండే చూచి- కాలిదారి కూడా ఉండటం చూచిన దాసరి అక్కడ ఒకదారి కన్పించటమే మహాభాగ్యంగా భావించి తొందరగా అడుగులు వేస్తూ ఆ మర్రి దగ్గరకు వెళ్లాడు

విశే॥ఒక స్పష్టమైన దారిలేదు. ఏదో ఒక దారి కన్పిస్తే అదే పది వేలనుకున్నాడు. ఆ సమయ మలాంటిది.

ఒక భయానక సందర్భ వర్ణనం. 13 నుండి వర్ణింపబడి క్రింది పద్యంలో జుగుప్సాస్థాయి బీభత్స రసం వర్ణింపబడుతున్నది.

సీ. ఎలనీటి బొండలంబులు వోలె మెదడెల్ల
జుఱ్ఱివైచిన డొల్లు పుఱ్ఱె గములు,
నెఱచి గీఱిన జీర లేర్పడ ఁదుదముట్టఁ
జీఁకిన నులిపచ్చి కీకసములు,
దొనదొన మను నీఁగెతుట్టెల రూపేరు
పడక క్రంపలను వ్రేలెడు గరుసులు,
దూల్ల మక్కెక్కి మంగళ్ల తిప్పలు రేఁగు
వడువున గాలి నాడెడు నెఱకలుఁ,

తే. దునిసిన నరాంగకములఁ బొత్తులను గమిచి
పోక యొండొంటితోఁ బోరి పీకులాడు
శ్వాపదంబులుఁ బదహతి వ్రస్సివలుచు
వరుగు దఱచగు ముఱుత్రోవ నరిగి యెదుట. 17

ఎల = లేత; నీటిబొండలంబులు = నీటి కొబ్బరి బొండాలు; పోలెన్ = వలె; మెదడు + ఎల్లన్ = మెదడంతా; జుఱ్ఱివైచినన్ = జుర్రుకొని త్రాగిపారవేస్తే; డొల్లు = డొల్లే; పుర్రెల గుంపు;

ఎఱచి = మాంసం; గీఱిన జీరలు = గోళ్లతో చీరిన చారలు; ఏర్పడన్ = ఏర్పడేటట్లుగా; తుదిముట్టన్ = ఎముకంటా; చీకిన = ఆస్వాదించిన; నులిపచ్చి = కొంచెం పచ్చిగల; కీకసములు = ఎముకలు;

దొనదొన = ఈగలు ముసిరే ధ్వన్యనుకరణ శబ్దం; అను; ఈగతుట్టెలన్ = ఈగల తుటువములవల్ల;

రూపు = ఆకారం, ఏరుపడక = ఏర్పడకుండా; క్రంపలను = కంపలపై; వ్రేలెడు = వ్రేలాడుతున్న; గరుసులు = చర్మాలు;

ద్రూళ్లన్ = ధూళితో; మక్కు+ ఎక్కి = మకిలి పట్టిన; మంగళ్ళ తిప్పలు = మంగలి ఇంటి దిబ్బలు; రేగు = గాలికి రేగే; వడువునన్ = విధంగా; గాలిన్ = గాలిలో; ఆడు+ ఎడు = ఆడుతున్న; ఎఱుకలు = వెంట్రుకలు (నెఱుక - 6వ పద్యం)

తునిసిన = ముక్కలై పోయిన; నర+అంగకములన్ = మనిషి అంగాలను; పొత్తులనున్ = సరిసమానంగా; కమిచి = నోట గరుచు కొని; పోక = పోకుండా; ఒండు+ ఒంటితోన్ = ఒకదానితో ఒకటి; పోరి = కొట్లాడి; పీకులాడు = లాక్కొంటున్న; శ్వాపదంబులున్ = కుక్కలును; పదహతిన్ = కాళ్లతాకిడికి, వ్రస్సి = చితికి; వలుచు = వాసన వేసే; వరుగు = మనిషి మాంసపు వరుగుతో; తఱచు+ అగు = దట్టమైన; ముఱుత్రోవన్ = మురుగుదారిన; అరిగి = పోయి; ఎదుటన్ = ఎదుటిగా.

దాసరి ఒక మురుగు వాసన కొట్టే అపమార్గం నుండి మఱ్ఱిని సమీపించాడు.

ఆ మఱ్ఱి ఇలా ఉన్నది.

కొబ్బరి నీరంతా త్రాగి లేత కొబ్బరిని గీకి తిని పారవేస్తే డొల్లే బొండాల్లాగా - మెదడెల్లా జుఱ్ఱుకొని పీల్చి పారవేస్తే డొల్లే పుఱ్ఱెల గుట్టలు- పళ్లతో మాంసం గీరి తింటే ఏర్పడ్డ గీరలతో పచ్చి ఆరని ఎముకల గుట్టలు- కంపల మీద ఆనవాలు తెలియకుండా ఈ గల తుట్టెలు మూగిన చర్మాలు-

దుమ్ముకొట్టుకొని ఎఱ్ఱవారిన మనుజుల వెంట్రుకలు మంగళ్ళ తిప్పలు గాలికి రేగినట్లు ఎగురుతున్నవి. చిదురై పోయిన మనుష్యుల అంగాలకోసం పొత్తుతో తలా ఒకటి తీసుకొని పోక కొట్లాడుతున్న కుక్కలు- వాటికాళ్ల క్రింద నలిగి గొలు వాసన కొట్టే మాంసపు వరుగుతోరణాలు వ్రేలాడే దుర్గంధ భూయిష్ఠమైన మార్గాన వెళ్లి ఎదురుగా.

అలం: స్వభావోక్తి.

విశే॥జుగుప్సా స్థాయిని వ్యంజిస్తున్న విభావ సామగ్రి. మనుష్యులను భక్షించే బీభత్స రసాశ్రిత నాయకుడు బ్రహ్మరాక్షసుని స్వభావాన్ని- పరిసరాలను ధ్వనిస్తున్న అద్భుత వర్ణన. తెలుగులో ఇదొక అపూర్వవర్ణన. పుఱ్ఱెలు- ఎముకలు- చర్మాలు-వెంట్రుకలు-చెదరిపడిన మానవావయవాల ఖండాలు- మాంసపు వరుగు తోరణాలు- వాటికోసం కొట్లాడే కుక్కలు.

ఎంత చిత్రమైన వర్ణన ! ఇతరులు భావించటానికైనా వీలులేని దృశ్యం.

కావ్యంలో ఇది బీభత్స రసాత్మక సందర్భం. (పిరువీఁకులాడు పాఠాంతరం.)

సీ. ముంగాళ్లఁ జాఁగి పై ద్రుచ్చుఁ జూపులు పర్వ
బొమికల లెత్తుచుఁ బారి పోవు శునులఁ,

బలలతోరణములు పట్టి బిట్టెగయ శా
ఖాధూతి నెగయు కంకముల రొదల,
నడ్డంబు దిరిగి కరాహతిఁ[1] బడి రొంటి
హస్తంబు లిడి యంగ లార్చు కపుల,
డబ్బాటుమై నొక్కెడలు సూపి యవి మాయ
నడఁగఁ వేఱెడఁ జూపు వ్యాప్పతులను,

తే. కని యెవఁడొ యొక్కరుం డిందుఁ గలఁడు,[2] వాడు
నరుఁడు గాఁ, డింధనాదికాహరణమునకు
వేళయును గాదు, పొలగాలి వీచెఁ, దెరువు
నెడ, వనుచు జాలిగొని సంశయించు వేళ. 18

ముంగాళ్లపైన్+చాగి = ముందరి కాళ్లు చాచి; ముచ్చు చూపులు = దొంగచూపులు; పర్వన్ = ప్రసరిస్తే; బొమికలు = ఎముకలను; ఎత్తి = నోట కరచుకొని; పాఱిపోవు; శునులన్ = ఆడకుక్కలతో;

పలల తోరణములు = మాంసం త్రాడుకు గుచ్చి ఆరగట్టిన తోరణాలు; పట్టి = పట్టుకొని; బిట్టు = దృఢంగా; ఎగయన్ = ఎగిరితే; శాఖాధూతిన్ = కొమ్మల కదలికలతో; ఎగయు = ఎగిరే; కంకముల రొదలన్ = గ్రద్దల రొదలతో;

అడ్డంబు తిరిగి = అడ్డుపడి; కర = చేతి; ఆహతిన్ = దెబ్బను; పడి = పొంది; రొంటిన్ = నడుమున; హస్తంబులు = చేతులు, ఇడి = పెట్టి; అంగలార్చు = ఏడ్చే; కపులు = కోతులు.

డబ్బాటుమైన్ = హఠాత్తుగా; ఒక్క+ ఎడలు = ఒక ప్రదేశం చూపించి; అవి మాయన్ = మరలా అవి అణగారి పోగా; వేఱు+ ఎడన్ = మరొక చోటును; చూపు = చూపే; వ్యాపృతులున్ = వ్యాపారాలను;

కని = చూచి; ఎవడొ = తెలియని వాడు; ఒక్కరుండు = ఒకడు; ఇందున్ కలడు = ఇక్కడున్నాడు; వాడు; నరుడు గాడు = మనిషి కాదు; ఇంధన+ ఆదిక = పొయ్యిలో పుల్లలు ॥మొ॥; ఆహరణమునకున్ = సేకరించు+కోవటానికి; వేళయునున్‌గాదు=వేళకూడాకాదు ; పొలగాలి = మాంసపు వాసనతో; గాలి; వీచెన్; తెరువున్ = దారికూడా; ఎడవు = శూన్యం; జాలిగొని = జంకి; సంశయించు వేళన్ = సందేహించే సమయంలో;

ముందరి కాళ్లచాచి దొంగ చూపులతో- ఎముకలు నోట కరిచి పారిపోయే ఆడకుక్కలున్నాయి. గ్రద్దలు కొమ్మల వ్రేలాడే మాంసపు తోరణాలను పట్టుకొని గట్టిగా ఎగిరితే కొమ్మలు వేగంగా కదలి వాటికీ తగిలితే అవి అరుస్తున్నవి. కోతులు రాక్షసుని దెబ్బకు హడలి పోయి రెండు చేతులూ రొండిన పెట్టుకొని ఏడుస్తున్నవి. హఠాత్తుగా కన్పించే దృశ్యం మాయమై పోయి మరొకటి కన్పిస్తున్నది.

ఇవన్నీ చూస్తే ఇక్కడ మనిషికాని వాడొకడు ఎవడో ఉన్నాడు. పోనీ మనుష్యు లెవరైనా కట్టెల కోసం వచ్చారా? అనుకోవడానికి ఇది దానికి వేళ కాదు కనుక ఎవరో అని జంకుబాటుతో సందేహిస్తున్న సమయంలో.

అలం: స్వభావోక్తి.

విశే॥ పై వర్ణన కిది పొడిగింపు. కుక్కలు- కోతులు - గ్రద్దలు- శుష్క మాంసం కోసం మూగేవి కనుక వాడు తిని పారవేసిన వాటి కోసం మూగాయి కాబట్టి ఇది మానవ నివాసం కాదు- అని తర్కించు కొన్నాడు. మరెవరై ఉంటారు? అని సందేహం.

ఎడవు - ఇదే పాఠం వావిళ్ల - వేదం ప్రతుల్లో ఉంది కానీ వావిళ్ల ప్రతిలో ఎడారి అన్న అర్థమిచ్చారు. కానీ సూ.రా.ని. ఎడవు = ఎడారి; ఎడవు = శూన్యం- అన్నది. ఇడపు = మరు ప్రదేశమన్న అర్థంలో ఆము. 4-53.

జాలి = దయతో జాలిపడట మన్న అర్థంలో వాడుక .మనకొక జాలి యిడక - ఆము 3-27 = శ్రమ ఇవ్వక. ప్రస్తుత పద్యంలో భయ-మన్న అర్థంలో ప్రయోగించబడ్డది.

సీ. మృతమర్త్యు రెంటాన నిడ్డఁ జాలక నెత్రు
రంజిల్లు పెను పొట్ట ముంజివానిఁ,
బల్లచీమల వక్రభల్లాతకియుఁబోలె
[1]నెత్తుదుప్పటి నొప్పు కత్తెవాని,
వ్యత్యస్త హస్తిమస్తాభఁబాయగు గడ్డ
మును దంష్ట్రికలుఁ బొల్చు మొగమువానిఁ,
గడుఁదుర్ల నిడు తుట్టె గతిఁ జొంగ లోఁ బాండు
రత మించు కపిలకూర్చంబువాని,
తే. నెఱకుఁ దెఱువరిఁ గన శాఖ లెక్కఁజాఱుఁ
బ్రేవు జందెంబుఁ గసరి పైఁ బెట్టువాని,
వ్రేలు ఁడగుబొజ్జ గల బూరగాలివానిఁ
జెంబుతలవాని నవటు కచంబువాని. 19

మృత = చచ్చిన; మర్త్యున్ = మనిషిని; రెంటానన్ = గోచిగా (వస్త్రంగా); ఇడ్డన్ = పెట్టుకోగా, చాలక = చాలనందున; నెత్రు రంజిల్లు = నెత్తుటితో ఎర్రనైన; పెనుపొట్ట = పెద్దపొట్టచుట్టూ ఉన్న; ముంజివానిన్ = దర్భల మొలత్రాడు కలవానిని (బ్రహ్మచారి కట్టే మొలత్రాడు ఒక విధమైన గడ్డి- ముంజిగడ్డితో చేస్తారు);

పల్ల చీమలన్ = ఎఱ్ఱచీమలతో; వక్ర = వంకర; భల్లాతకియున్ పోలెన్= జీడిమామిడి లాగా; ఎఱ్ఱదుప్పటి = ఎఱ్ఱనైన ఉత్తరీయంతో; ఒప్పు; కఱ్ఱవానిన్ = నల్లనివానిని;

వ్యత్యస్త = తలక్రిందులైన; హస్తి = ఏనుగు; మస్త = తల; ఆభ = పోలిన; పాయ+ అగు గడ్డమున్ = నడుమ చీలిక గల గడ్డమూ; దంష్ట్రికలున్ = దంతాలూ; పొలిచే మొగము కలవానిని;

కడుఁదుర్ల = కందిరీగల; నిడు = పొడవైన; తుట్టెగతిన్ = గూడువోలె; చొంగలోన్ = చొంగతో; పాండురత = ధూమ్రవర్ణం; (పొగమూరిన రంగు); కపిల= (తైలసంస్కారం లేక) ఎరుపెక్కిన; కూర్చంబు వాని = గడ్డము కలవానిని;

ఎఱుకున్ = ఆహారానికి; తెరువరిన్ = బాటసారిని; కనన్ = చూడటం కోసం; శాఖలు+ ఎక్కన్ = కొమ్మలపై కెక్కుతుంటే; జాఱు; ప్రేవుజందెంబున్ = ప్రేవులే జందెం కనుక దాన్ని; కసరి = విసిగి కోపంతో తిట్టి; సైపెట్టువానిన్ = సరిచేసుకొనేవానిని; వ్రేలుడు+ అగు = వ్రేలాడే; బొజ్జ; బూరగాలివానిన్ = ఊచకాళ్లుగల వానిని; చెంబువంటి తలగలవానిని; అవటు = ముచ్చిలి గుంటలో; కచంబువానిన్ = జుట్టున్నవానిని.

శవాన్ని గోచీగా పెట్టుకొంటుంటే చాలక అది జారిపోతున్నది. వాడు లాగిలాగి పెట్టుకోవటం వల్ల పొట్టనిండా నెత్తురైనది. ఆ పొట్టమీద దర్భల మొలత్రాడు, రాక్షస బ్రహ్మచారి చిహ్నంగా గోచరించింది. ఎఱ్ఱచీమలు ప్రాకే వంకర జీడిమామిడి లాగా ఉన్న ఎఱ్ఱ దుప్పటి కప్పుకొన్న నల్లని శరీరం కలవాడు. కోరలతో చీలిన గడ్డపుకొనతో- తలక్రిందులైన ఏనుగు తలను తలపిస్తున్నవాడు. చొంగ కారటం వల్ల ఎరుపెక్కిన గడ్డం- కందిరీగల పొడవైన గూడు లాగా ఉంది. మాటిమాటికీ ఆహారం కోసం ఎవరు వస్తున్నారోనని చూడటానికి కొమ్మలెక్కుతుండగా ప్రేవుల జందెం జారిపోతూ ఉంటే కోపంతో దాన్ని కసరి మరలా పైకి లాక్కొంటున్నాడు. వ్రేలాడే బొజ్జ- ఊచకాళ్లు- చెంబుతల- ముచ్చిలిగుంటలో జుట్టు- ఇదీ వాడి అవతారం.

3,4 పాదాల్లో పోలికలు చాలా విచిత్రంగా ఉన్నాయి.

అలం : స్వభావోక్తి. అతిలోకవర్ణనం. (ఎఱ్ఱత్రుప్పట - ఎఱ్ఱని వెంట్రుకలు - పాఠాంతరంగా ఆచార్య పి. నరసింహారెడ్డి ఆముక్తపదసూచిక. ఆ అర్థం రాయలసీమలో ఉన్నదట. ఇదే సమంజసం.)

**తే.** **కండకన్నుల వాని, నాఁకటను బండ**
**తిట్ల బేతాళికల సారెఁ దిట్టువాని,**
**నగగరిమవాని, నన్వర్థ నాముఁ గుంభ**
**జాను వనునొక్క ద్విజనిశాచరునిఁ గనియె.** **20**

కండకన్నుల వానిన్ = కండలు దిగిన కన్నులు కలవానిని ( కంటి చుట్టూ ఉన్న ప్రదేశంలో కండలు దిగినందువల్ల కళ్ళు కన్పించటం లేదు); ఆకటన్ = ఆకలితో; బేతాళికలన్ = బేతాళ పరిచారి కలను; బండతిట్లన్ = బండ బూతులతో; సారెన్ = మాటిమాటికీ; తిట్టువానిన్ = తిడుతున్న వానిని; నగగరిమ వానిన్= కొండ లాగా ఉన్న వానిని; అను+అర్థ+నామున్ = అర్థాన్ని అనుసరించిన పేరుగలవానిని; కుంభజానువు = కుండలవంటి మోకాళ్ళున్నవాడు; అను; ఒక్క; ద్విజనిశాచరునిన్= బ్రహ్మరాక్షసుని; కనియెన్ = చూచాడు.

మను. చ. 4-73 లో క్రింది రాక్షస వర్ణనతో పోల్చి చూస్తే ఈ వర్ణనలో వైచిత్రి బోధపడుతుంది.

*విసుమానములు గాగ వసతోడఁ బెసవెట్టి*
*నెట్టెంబుగాఁ బ్రేవు జుట్టినాడు*
*బండికందెన చాయ బైసిమూలిన మేన*
*మెదడు గందఁపు రొంపి మెత్తినాడు*
*కునఖంపు డాచేతి పునుక కప్పెర నిండఁ*
*బ్రాణి కోటుల నల్ల బట్టినాడు-*
. . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . .
*నిట్ట తాడనఁ బొడవుచే నిక్కినాడు*
*నిడుద కోఱల మిడిగ్రుడ్ల నెగడినాడు.*

పైది వక్రముగా- గాఢ భావనాశీలం కలది కాగా, ఈ పద్యం సరళము. దానియందున్న వైచిత్రి ఇందులో లేదు. మనుచరిత్రకర్తవేరు. ఆముక్తకర్త వేరనటానికిదొక ఉదాహరణ.

ఉ. వాఁడును గంటిఁ బోకు మని వ్రాలె మహీ న్విటపాళి నుగ్గుగా,
వీఁడును మున్ను రే పగటి వేళకు మానిసి యౌటఁ, బోరిలో
వాఁడిమిఁ గొంతకాల మిల వ్రాలుట, లావరి యౌట, నిల్చి యా
వాఁడిశరంబుచే నడువ, వాఁ డది ద్రుంపుడు వీడు నుద్ధతిఁ. 21

వాడునున్ = బ్రహ్మరాక్షసుడు; కంటిన్ = చూచాను; పోకుపోకుము; అని; విటప+ ఆళి = చెట్లగుంపు; నుగ్గుగాన్ = నుసియౌనట్లు; మహిన్ = క్రిందకు; వ్రాలెన్ = ఎగిరి దూకాడు; వీడునున్ = దాసరియు; రే+పగటి వేళకున్ = రేయింబవళ్లూ; మానిసి= మనిషి; ఔటన్ = ఐనందువల్ల; మున్ను = పూర్వం; ఇలలో = లోకంలో; పోరిలోన్ = యుద్ధంలో; వాఁడిమిన్ = పరాక్రమంతో; కొంతకాలము; వ్రాలుటన్ = ప్రసిద్ధుడైనందువల్ల; లావరి= బలం కలవాడు; ఔటన్ = అయినందువల్ల; నిల్చి = ఎదిరించి;

వాడి శరంబుచేన్ = జోడమ్ముచే; అడువన్ = కొట్టగా; వాఁడు = బ్రహ్మరాక్షసుడు; అది = ఆ బాణాన్ని; త్రుంపుడున్ = విరగ్గొట్టగా; వాడున్ = దాసరికూడా; ఉద్ధతిన్ = కోపవేగంతో.

బ్రహ్మరాక్షసుడు చెట్టెక్కి ఆహారం కోసం చూస్తున్నాడు. కనుక దాసరి రాగానే- ఒరేయ్ నా కంట పడ్డావు, పారి పోవద్దు'- అని క్రిందకు దూకాడు. చెట్లన్నీ నుగ్గునుగ్గై పోయాయి. ఇక వీడో రేయింబవళ్లూ మనిషే కనుక- ( రాక్షసునకు రాత్రి బలం- పగలు బలహీనత కనక- వాడికది లేనందున) యుద్ధంలో పని చేసినవాడు, బలశాలి-కనుక చేతిలో జోడమ్ముతో కొట్టాడు. వాడది త్రుంచివేసాడు. వీడు కోపంతో

యుద్ధసమయంలోనే కొందర్ని సేనలో చేర్చుకొనే అలవాటుండేది. ఆ రోజుల్లో వారినే కై జీతగాండ్లు అనేవారు. అలాంటివాడు దాసరి కాబట్టి ఎదురించ గలివాడు. 'వాడూ-వీడూ' అనే శబ్దాలే పరస్పరం సంఘర్షించుకొంటున్నాయి.

సీ. తిగిచిన నడుగులు దెమలక ఱొమ్మప్ప
 ళించి యవ్వలికిఁ జండించి దాఁటి,
చఱచిన వంచించి చరమభాగమునకై
 తిరిగి, తత్క్రియ కగు దృష్టి నిలిపి,
పైఁబడ్డఁ జనుమర పట్ల కొడ్డుచు నుండు
 పిడికిళ్ల బలిమి లోఁబడక నిలిచి,
చొరఁ జూడ గ్రుంగి ముష్టుల బిగి కోటగాఁ
 జొరనీక తిరిగెడు చోన తిరిగి,

తే॥ యసుర వధసాధనము రోయు నపుడు గ్రుద్ది
తాఁచి తిరిగినఁ గృతముష్టి దండ నిలిచి
యెడకొలది వెనుక నడు మొయ్య' నడిచి యడిచి
మత్పదస్మృతి యాత్మ నేమఱక యతఁడు. 22

అతడు = దాసరి; మత్ = నా; పదస్మృతిన్ = పాదస్మరణను; ఏమఱక = విస్మరించక;

తిగిచినన్ = రాక్షసుడు ముందుకు లాగితే; అడుగులు = పాదాలు; తెమలక = కదల నివ్వక; ఱొమ్ము +అప్పళించి = రాకాసి రొమ్ముపై కొట్టి; చండించి = వేగంతో; అవ్వలికిన్ = మరొక ప్రక్కకు; దాటి = దూకి;

చఱచినన్ = రాక్షసుడు చేత్తో వ్రేస్తే; వంచించి = మోసంతో ఆ దెబ్బను తప్పుకొని; చరమ భాగమునకై = వెనుక ప్రక్కకు; తిరిగి = మళ్లి; తత్ = ఆ; క్రియకున్+అగు = పని కనువగు; దృష్టిన్ = చూపును; నిలిపి = నిశ్చలం చేసి;

పైబడ్డన్ = రాక్షసుడు తన మీద పడగా; చనుమఱ = చనుల నలుపున్న; పట్లకున్ = చోట్లకు; ఒడ్డుచున్ = విసురుతూ, ఉండు; పిడికిళ్ల బలిమిన్ = ముష్టిబలంతో; లోన్ పడక = చిక్కక; నిలిచి;

చొరన్ చూడన్ = వాడి పిడికిళ్లగోడను దాటి లోపలకు ప్రవేశించటానికి ప్రయత్నించగా; క్రుంగి = వంగి; ముష్టుల బిగి = బిగించిన పిడికిళ్లే; కోటగాన్ = ప్రాకారం కాగా; చొరనీక = ప్రవేశింప నివ్వక; తిరిగెడు చోన = తిరిగిన చోటనే; తిరిగి;

అసుర = రాక్షసుడు; వధసాధనమున్ = చంపే ఆయుధం; రోయునప్పుడు= వెతికే వేళ; గ్రుద్ది; తాఁచి = తన్ని; తిరిగినన్ = వాడు ముందుకు తిరిగితే; కృతముష్టిన్ = పిడికిలి బిగించి; దండన్ = (ప్రక్కనే) నిలిచి; ఎడ కొలది = సందు కొలది; వెనుకన్ = వీపువైపు తిరిగి; నడుమున్ ; ఒయ్యన్ = చక్కగా; అడిచి = కొట్టి ;

ఇదంతా మల్లయుద్ధంలో కుస్తీపట్లు కాబోలు. రాయలు మల్లవిద్యా నిపుణుడు కనుక ఈ వర్ణన తత్సంబంధగా భావించాలి. పద్యంలో ప్రతిపాదంలోను మొదటి అసమాపక క్రియ రాక్షసుని కుస్తీ పట్ల పేచీగా చదువుకోవాలి. ఇదొక నిరాయుధ ద్వంద్వ యుద్ధం. రాజు అనుభవంలోది.

రాక్షసుడు దాసరిని ముందుకు లాగాడు. వాడు రాక్షసుని రొమ్మున గ్రుద్ది వేగంగా అవతలికి దూకాడు. వాడు పెద్ద దెబ్బ వేసాడు. కానీ వీడు మోసంతో దాన్ని తప్పుకొని వాడి వెన్నకు పోయి వాడేం చేస్తాడో ఆ దెబ్బకు ఎదురొడ్డటానికై వేచి యున్నాడు. జాగ్రత్తగా చూస్తూ వాడు మీదకు ఎగిరి దూకాడు. వీడు వాడి గుండెకు గురిపెట్టిన పిడికిళ్ల కోటగాపెట్టి రానివ్వటం లేదు. అక్కడి కక్కడే గిరగిరా తిరుగుతూ వాడి కందటం లేదు.

ఇది కాదని రాక్షసుడు ఆయుధం కోసం ప్రక్కకు తిరిగి వెతుకుతున్నాడు. వీడది సందుగా చూచి గ్రుద్ది - తన్ని - వాడు తన వైపుకు తిరిగితే పిడికిళ్ళతో నిలిచి - కొంచెం వెన్నకు వెళ్ళి వాడి నడుం మీద తన్ని - తన్ని .

నా పాద స్మరణను ఏమరకుండా కథలో ఇది చాలా ముఖ్యవాక్యం .

**తే.** **తాఁచి పోఁజూడఁ దన రాక్షసీచయంబు**
**నెల్లఁ జీరిన డిగ్గి వా రేఁగుదేరఁ**
**బోయె నదె వాఁడు రారె రారే యటంచుఁ**
**బాఱి వారును దానును బట్టి కొనుఁడు.** **23**

తాచి = తన్ని; పోన్ +చూడన్ = పరుగెత్తే ప్రయత్నం చేస్తే; తన = రాక్షసుని; రాక్షసీ చయంబున్ = రాక్షస స్త్రీ సమూహాన్ని; (బేతాళికలు) ఎల్లన్ = అందర్నీ; చీరినన్ = పిల్వగా; వారున్; డిగ్గి = చెట్టు; దిగి; ఏగుదేరన్ = రాగా; అదె; వాడు; పోయెన్ = తప్పించుకొన్నాడు; రారె = రారే; అటంచున్; తానునున్ = వాళ్లూ తనూ, పాఱి = పరుగెత్తి; పట్టి కొనుడున్ = పట్టుకోగా;

కం. బంబోతు తద్దాసరి య
ప్పుం బదహతులను గపోణి పోటుల నిరుమై
లం బొడుచుచుఁ బెనఁగుచుఁ బో
వం, బట్టి వటంబుఁ జేర్చి వాఁ డిట్లనియెన్. 24

బంబోతు = పెద్ద పోతుటెద్దు లాగా బలసినవాడు; ఆ దాసరి; అప్పున్ = అప్పుడు కూడా; పదహతులన్ = తన్నులతో; కపోణి పోటులనన్ = మోచేతులతో పొడవటంతో; ఇరు మైలన్ = రెండు ప్రక్కలా; పొడుచుచున్; పెనఁగుచున్ = పెనుగులాడుతూ; పోవన్ = తప్పించుకొనిపోగా; పట్టి = బంధించి; వటంబున్+చేర్చి = మఱ్ఱి క్రిందకు తెచ్చి; వాడు = రాక్షసుడు; ఇట్లు; అనియెన్.

గ్రోలెదన్ - పాఠాంతరం.

శా. సారాస్వాదనఁ బ్రాణపంచకము తృష్ణం బాసి సంతర్పణ
న్మూరింబో నసిఁ ద్రుంచి పొంగెడు భవ న్ముండంబు ధారోష్ణ[1] మిం
పారం గ్రోలి, పిశాచి నీదు కఱకు ట్లందీ, నదస్తాలకాం
తారాంత ర్నృకపాలకుండ విగళ న్మైరేయముం ద్రాగెదన్[2]. 25

సార+ఆస్వాదనన్ = చక్కని ఆస్వాదన చేత; తృష్ణన్ = కోర్కెన్; పాసి = వదలి; ప్రాణపంచకము = ఐదు ప్రాణాలు; సంతర్పణన్ = సంతృప్తితో; మూరింబోన్ = పొంగిపోగా; అసిన్ = కత్తితో; త్రుంచి = నరికి; భవత్ = నీ; ముండంబున్ = తలను (కత్తితో నరికి); ధారోష్ణమున్ = వేడి నెత్తుటి ధారను; ఇంపు+ఆరన్ +క్రోలి = తృప్తిగా త్రాగి; పిశాచి = రాక్షసి; నీదు = నీ; కఱకుట్లు = కాల్చిన మాంసం కండలు; అందీన్ = చేతికందిస్తే; అదః = ఈ; తాలకాంతార = తాటి తోపులో; నృకపాల = మనిషి పుఱ్ఱెలన్న; కుండన్ = కుండలో; విగళత్ = పడుతున్న; మైరేయమున్ = కల్లును; త్రావెదన్ = త్రాగుతాను.

రాక్షసుడు కోపంతో అంటున్నాడు.

ప్రాణాలన్ని సంతృప్తితో ఇక చాలు అనేంతవరకూ ఆస్వాదిస్తూ - కత్తితో నీ తలకాయ నరికి - పొంగే వేడి నెత్తుటిని త్రాగి - నీ కండలు కోసి కాల్చి నా దాసీ పిశాచి చేతికందిస్తుంటే - ఈ తాటి తోపులో కట్టిన మనిషి పుఱ్ఱెలన్న కుండల్లో కురుస్తున్న కల్లుత్రాగుతాను.

విశే॥ రాక్షసుల భోజన విధానం భయానకసుందరంగా వర్ణింపబడినది. ఇది వాళ్ల ఆస్వాదన లక్షణం. రౌద్రరసాత్మక భాషణం. 1. భవన్ముండాగ్రధారోష్మ 2. గ్రోలెదన్ పాఠాంతరం.

క. న న్నిం తలయించిన ఖలు
ని న్నే బుజావిధి వధింతునే యని యార్పుల్
మిన్నందఁగ బుసకొట్టుచు
నన్నీచుఁడు దగను వెలువడు నవ్యక్తోక్తిన్. 26

నన్నున్; ఇంత; అలయించిన = అలసిపోయేటట్లు చేసిన; ఖలున్ నిన్నున్ = దుష్టుడ వైన నిన్ను; ఏన్ = నేను; బుజువిధిన్ = సూటిగా; వధింతునే = చంపుతానా; అని; ఆర్పుల్ = అరుపులు; మిన్ను = ఆకాశం; అందఁగన్ = తాకగా, బుసకొట్టుచున్ = కోపంతో నిట్టూరుస్తూ (పాములాగా); ఆ నీచుఁడు = ఆక్షుద్రుడు; దగన్ = దప్పికతో (అంగలారుస్తూ) ; వెలువడున్ = బహిర్గమిస్తున్న; అవ్యక్త = చక్కగా ఏర్పడని; ఉక్తిన్ = మాటతో.

''నన్ను ఇంత అలసిపోయెటట్లు చెసిన దుష్టుడవైన నిన్ను మామూలుగా చంపుతానా?'' అని బొబ్బలు పెడుతూ- బుసకొడుతూ- ఆనీచుడు ఇంకా ఏవో అస్పష్టంగా అంటూ.

తే. అసియుఁ బాత్రియుఁ దేఁ బంచి యాంత్రవల్లిఁ
గోలగగ్గెరఁ ద్రోయ నక్కుజముతోడ
నొరగి రక్కసుతో దైన్య విరహితముగ
ధర్మ మెఱిఁగించు సూక్తి నాతండు వలికె. 27

అసియున్ = కత్తినీ; పాత్రియున్ = పాత్రను; తేన్ = తేవటానికి; పంచి = ఆజ్ఞాపించి; ఆంత్రవల్లిన్ = ప్రేవుల లీగలతో; కోలగగ్గెరన్ + త్రోయన్ = కాళ్లను కట్టి పడవేస్తే; ఆకుజముతోడన్ = చెట్టుతో పాటుగా; ఒరగి = దాసరి క్రిందపడి; దైన్యవిరహితముగన్= దైన్యం లేకుండా; ధర్మమున్+ ఎఱిగించు = ధర్మాన్ని తెలిపే; సూక్తిన్ = సుభాషితము; ఆతండు = దాసరి; పలికెన్ = అన్నాడు.

కత్తీ, పాత్ర తెమ్మని పిశాచి కాన తిచ్చి, కోలకొక్కెర వేసాడు. వాడు ప్రక్కనున్న చెట్టుకు తగిలి దానితోపాటు వాడూ క్రిందపడ్డాడు. పడి రాక్షసునితో ధర్మమేదో చెప్పేమాట- దైన్యం లేకుండా ధైర్యంతో అన్నాడు.

విశే॥ కోలుకొక్కెర - వ్యవహారంలో ఉంది. పశువును కాళ్లు కట్టి క్రింద పడవేసినట్లు మనిషిని కాళ్లూ చేతులూ కట్టి క్రింద మూటగా పడవేయటం.

చ. విను మొకమాట రాత్రిచర, వేగిర మేటికి? నిన్ జయింతురే
యనిమిషులైన? భాజనగతాన్నము నే నిఁక నెందుఁ బోయెదన్ ?
బెనఁగక ప్రాణరక్షణ ముపేక్ష యొనర్చుట పాప, మిందు కై
కనలకు, నాకు, మేనియెడఁ గాంక్షయు లే, దిది వోవుటే యురున్ 28

రాత్రిచర = రాత్రుల్లో తిరిగే వాడా; ఒక మాట వినుము; వేగిరము+ ఏటికిన్= తొందర దేనికి?; అనిమిషులు+ ఐనన్ = దేవతలైనా; నిన్ జయింతురే = నిన్ను గెలవ గలరా?; నేను; భాజనగత+ అన్నమున్ = పళ్లెంలో ఉన్న భోజనాన్ని కదా; ఇక; ఎందున్+పోయెదన్ = ఎక్కడకు పోగలను?; పెనఁగక = పెనుగులాడకుండా; ప్రాణరక్షణమున్ = ప్రాణాలను కాపాడు కోవటం; ఉపేక్ష యొనర్చుట =

ఉపేక్షించటం; పాపము; ఇందుక్ష = పెనగినానని; కనలకుము = కోపించకు; నాకున్ ; మేని యెడన్ = శరీరం మీద, కాంక్షయున్ = కోర్కెకూడా; లేదు; ఇది = ఈ శరీరం; పోవుటే = పోవటమే; ఉరున్ = మంచిది;

ఓయీ ! రాక్షసా ! తొందర పడక ఒక మాట విను. నిన్ను దేవతలైనా జయించలేరు. నేనా, పళ్ళెంలో పెట్టిన అన్నాన్ని. మరి ఎందుకు పోట్లాడి నానంటే ప్రాణరక్షణ విషయంలో ఉపేక్ష వహించటం పాపం కనుక పెనగినానే తప్ప నిన్నోడించగలనని కాదు. నాకు శరీరం మీద కోరికా లేదు. అది పోవటమే మంచిది.

విశే॥ దాసరి మానసిక స్థాయిని- అతని జీవపరిపక్వతనూ తెలుపుతుంది. ప్రాణరక్షణముపేక్ష యొనర్చుట పాపమనటం-3-62లో అనధికారికి- అన్నమాటతో సమానం. ఇది మహాకవి పాత్రల స్థాయి.

**ఆ. హీనజన్మ మఱుట, యెవ్వఁడే నొకప్రాణి**
**సంతసిలుట, ముక్తి పొంత గనుట,**
**మేలె కాదె శిబియు మేల్బంతిగాఁడె న**
**శ్వరపుదేహ మమ్మి పరము గొనుట. 29**

హీన జన్మము = తక్కువ జాతిపుట్టుక; అఱుట = నశించుట; ఎవ్వఁడేన్ = ఎవడో; ఒక; ప్రాణి = జీవుడు; సంతసిలుట = సంతోషించుట; ముక్తి = మోక్షం; పొంత = సామీప్యం; కనుట = పొందటం , మెలెకదా!; శిబియున్ = శిబి చక్రవర్తి; నశ్వరపు దేహమున్ = అస్థిరమైన శరీరం; అమ్మి = బదులుగా నిచ్చి; పరమున్ కొనుటన్ = ముక్తిపొందటం వల్ల; మేలు బంతి = ఒజ్జబంతి; కాదె = కాదా?;

హీనజన్మం పోవటం ద్వారా ఒక ప్రాణి సంతోషించటం ముక్తిని సమీపించటమే. శిబి చక్రవర్తి అస్థిర శరీరాన్ని అమ్మి మోక్షం పొందటం వల్ల లోకాని కతడు ఒజ్జబంతి కదా.

**చ. తెవు లయినం, గ్రహం బయినఁ, దే లయినం, గర మైన, నాత్మ పెం**
**దెవు లయిన, జ్జలంబయినఁ, దెక్కలియైన, మృగాగ్నులైన, మే**
**ల్తవు లయిన, వ్రణం బయినఁ, ద్రాఁచయిన, న్పిడుగైనఁ దీర్చు పే**
**లవ తను వూరకే చెడ కిల న్కృశు నొక్కనిఁ బ్రోచు టొప్పదే. 30**

తెవులు = రోగవము; గ్రహంబు = దయ్యం; తేలు = వృశ్చికం; గరవము = విషవము; ఆత్మపెన్+తెవులు = పెద్ద మనోవ్యాధి; జలంబు = నీళ్ళు; తెక్కలి = బందిపోటు; మృగ= క్రూరజంతువు; అగ్ని = నిప్పు; మేల్తవులయినన్ = గొప్ప వ్యసనం; వ్రణంబు = పుండు; త్రాచు = నాగుబాము; పిడుగు; తీర్చు = నశింపజేసే; పేలవ తనువు = అల్పమైన శరీరం; ఊరకే = వ్యర్థంగా; చెడక = నశించక; ఇలన్ = భూమిపై; కృశున్ = ఆకలితో కృశించేవానిని; ఒక్కనిన్ = ఒకడినైనా; ప్రోచుట = రక్షించుట; ఒప్పదే = మంచిది కాదా ?

శరీరం ఈ చెప్పిన వానివల్ల దేనితోనైనా పోతుంది కదా. ఐనపుడు ఒక్కని ఆకలి తీర్చటం మంచిదే కదా !

మరణానంతరం నేత్రదానాదులను మనం చూస్తున్నాం. కానీ ఈ పనిలోకోత్తరం కదా.

ఒక మహాత్ముని గూర్చి విన్నాను. ఎముక విరిగిన రోగి వచ్చి శస్త్రచికిత్సకు ధనం యాచిస్తే సాధువు- 'నా దగ్గర డబ్బు లేదు. కానీ వైద్యుడు కొనబోయే ఎముకను దానం చేస్తానని ఇచ్చాడు. తర్వాత జీవితాంతమూ ఆ మహాత్ముడు ఆ వైకల్యాన్ని అనుభవించాడట. ఇది జరిగిందీ శతాబ్దిలోనే. పౌరాణిక దధీచి గాథ కిది తుల్యం కదా.

వ. అది యట్లుండె, నింకొక్క హితంబుసెప్పెద, నదియును బ్రాణభయంబున నాడు కార్యవశంపు మాటగాఁ దెలియక, మాధ్యస్థ్యంబ కాఁ దెలిసి వినుము, వినకున్న భూత హితంబుఁ గోరి యుచ్చరించు మాట కీశ్వరుండైన మెచ్చుఁగదా? వ్యాఘ్ర సింహ వరాహవృక జంబుకాది శరారువులయం దొక్క తిర్యక్కువుగావు; దేవయోనివి. నీకును మాకుంబలెఁ గరచరణ ముఖాపఘనంబులు గలవు, మాటలను మాయట్ల యకర్తవ్యతావిచారంబులు సమానంబ హో మఱచి యంటివి, స్థావరంబులకంటెఁ ! గీటాదులకు, వానికంటె మఱి మృగాదులకు, వానికంటె మఱి పశు పతంగాదులకు, వానికంటెను మాకును, మా కంటెనుమీకును, గరణ కళేబరాది పాటవం బెక్కుడు, విజ్ఞానంబును, ఘనం; బిట్టి నీకేకాంత కుత్సావహంబగు బీభత్స వధ్యావధ్య పథ్యాపథ్య భక్ష్యాభక్ష్య పేయాపేయ వివేకంబులు లేకునికి యుక్తమే? రుచి గాదు. శుచిగాదీదురాహారం; బిదియు సకల దురితావతంస యగు హింస నొనఁగూడునది, హింస పరలోకంబునం గదా బాధకంబు, పరలోకంబు ప్రాణాంతంబునంగదా; విరస్థిర ప్రాణులమగు మాకేల హింసా భయం బనవలదు, ప్రాణభయంబు మనుష్యుల మగు మాకు నేఁడైన, మీకు మఱునాఁడైన నవలినాఁడైనఁ దుద యుగాంతంబు నందైన నిడుపు గుఱచల నెప్పుడుఁదప్ప, దంతవత్త్వంబునకుఁ దారతమ్యం బేమి, మున్నీటనైనను మునుంగుట సరియగుటఁ బర్వతంబునకుం బరమాణువునకు నేమి యంతరంబు? మీరు విచారింప వలదే? తపోలబ్ధవరాదులం బూర్వంబునం గీర్వాణుల వదం' బడంచి హెచ్చిన హిరణ్యకశిపు దశముఖాదులు శతసహస్ర సంఖ్యాక సంవత్సరంబులు జీవించియుం బంచత్వంబుఁ బొంది తారు మున్ను జయించిన జముచేతనే చిక్కరే? యిక్కడికి మీరు ప్రబలురైన నక్కడికి వాఁడు ప్రబలుండు, సకల భూత తారతమ్యంబును నిజ నిజస్థానవిశేషంబునన వచ్చు, నచ్చండాంశు సుతుని వీట మేర (దప్పిన మాకుం దప్పునియట్ల బాధ మీకుందప్పదు, మీరు నా సౌరిముఖబర్హిర్ముఖులు జాతి (దలపోయభ్రాత; లట్లయ్యుం బరంబున మీరు వారు బాధ్యబాధకతల నొందు చున్నా రీతైజసంబగు తారతమ్యంబునకుం దమస్సత్త్వంబులు హేతువులు, వాని కాహృతులు హేతువులు, వ్యాహృతులం గ్రతువుల చరుపురోడాశాహుతుల భుక్తులం బవిత్రులై యమర్త్యత మీకంటె నతిదీర్ఘకాలంబు వారు జీవించెద, రప్పావనత చూచి కదా సదా చతుర్ముఖాంశజుం డగుసుధాంశుండు గరంగి సకల రసముల కవధియగు సుధారసంబున నాప్యాయనం బొనరించు చున్నవాఁ డేతదర్థంబు మా కుచ్చరింపరాదుగాని వేదంబు ప్రథమకక్ష

యనలుండు త్రావునని చెప్పు, మఱియు నాయాకళ లాయా వేల్పులకుం గ్రమంబునం జెప్పు, నింత విచారించి రుచించినట్ల నడవు; మనినఁ, గహకహ నవ్వి, యద్దాసరికి సురద్రోహి యిట్లనియె. 31

కార్యవశంపు మాట = పని గడుపుకోవడం కోసం చెప్పేమాట; మాధ్యస్థంబకాన్ = మధ్యస్థుని నిష్పక్షపాత వాక్యంగా, భూతహితంబు = సర్వలోక హితం; వ్యాఘ్ర = పులి; వృక = తోడేలు (కోరలతో చీల్చేది కనుక); జంబుక = నక్క; శరారువు = క్రూరమృగం; తిర్యక్కు = జంతువు; దేవయోనివి = దేవతా జాతిలోని వాడవు; అపఘనంబులు = అవయవాలు; అకర్తవ్యము = చేయరానిది, కర్తవ్యము = చేయదగినది; స్థావరంబులు = జడపదార్థాలు; కీట = పురుగు; పతంగ = పక్షి; కరణ = అవయవం; కళేబర = శరీరం; పాటవ = పటుత్వం; ఏకాంతకుత్స+ ఆపహంబు = కేవలం నిందాహేతువైనది; అభక్ష్య = తినదగనిది; అపేయ = త్రాగరానిది; పేయ = త్రాగదగిన; వివేకంబులు = విచారణలు; ఈ దుర్+ ఆహారంబు = చెడ్డతిండి; శుచి = శుభ్రం; సకల దురిత+అవతంస = అన్ని పాపాలకంటె మేలైనది; హింసన్ = ఘాతుక చర్యతో; బోధకంబు = బోధించేది; ప్రాణ+అంతంబు = ప్రాణం పోయిన తర్వాత; చిర = చిరకాలం; స్థిర = ఉండే; ప్రాణులు = జీవులు; నిడుపు = పొడవు; కుఱుచ = పొట్టి; అంతవత్త్వంబు = మృతి; మున్నీరు = సృష్టికారంభం లోని నీరు (సముద్రం); మీదు = పరలోకం; తపోలబ్ధ = తపస్సుతో పొందిన; గీర్వాణులు = దేవతలు; దశముఖుడు = పదితలలవాడు (రావణుడు); శతసహస్ర = నూరువేలు; పంచత్వంబు= మరణం; జముడు = యముడు; తారతమ్యంబు = హెచ్చుతగ్గు; నిజస్థాన విశేషంబునన= ఉన్నచోటు బలం వల్లనే; ఆచండ+ అంశుసుతుడు = తీవ్ర కిరణాలు కల సూర్యుని కొడుకు-యముడు, సూర = సూర్యుడు-తత్సంతానం = సౌరి = యముడు; ముఖ= మొదలైన; బర్హిర్ముఖులు = దేవతలు (బర్హి = యజ్ఞం, దాని ఆహుతులు అగ్ని ముఖంగా దేవతలు పొందుతున్నారు కనుక); భ్రాతలు = అన్నలు; బాధ్యులు = బాధింపబడే వారు; బాధకులు = బాధించేవారు; తైజసంబు = తేజస్సంబంధమైనది; తమస్సు = తమోగుణం; సత్త్వంబు = సత్త్వగుణము; ఆహృతులు = ఆహారములు; వ్యాహృతులు= భూఃభువః-వంటి మంత్రాలతో; చరు = అన్నం; పురోడాశ = హవిస్సు; హవిస్సులు= హవనములు; భుక్తులన్ = తినుటతో; అమర్త్యతన్ = మృతిలేక పోవటంతో; సదా = ఎల్లప్పుడు; చతుర్ముఖ+ అంశుఁడు = అమృత కిరణుడు (అనసూయకు బ్రహ్మాంశతో పుట్టినవాడు); రసములు- రుచులు- సారవంతమైన పదార్థం (రస-సార); ఆప్యాయనంబు = తృప్తి; ఏతత్+అర్థంబు = ఈ అర్థంకల మంత్రం; ఉచ్చరింపరాదు = నోటితో అనకూడదు; ప్రథమకళ = చంద్రుని కళల్లో మొదటిది; అనలుండు = అగ్ని; విచారించి = ఆలోచించి; రుచించినట్లు = ఇష్టం వచ్చినట్లు; సురద్రోహి = దేవతలకు శత్రువు.

క. చంపకు చదువుల, మేము ప
ఠింపని శాస్త్రములె? మా పఠింపని శ్రుతులే?
యింప పవి నమ్మవేఁ బ్రథ
మాం పిబతే వహ్ని, యనెడు మాటవు గాదే. 32

చదువులన్ = చదువులతో; చంపకు = వేధించకుము; పఠింపని = చదువని; శాస్త్రములా

మా = మాయొక్క; పఠింపని = చదువని; శ్రుతులే = వేదములా?; అవి = చదువులు, వేదాలు; ఇంపవు = ఇంపుకావు; నమ్మవు+ఏన్ = నీవు నమ్మక పోతే; ప్రథమాం = (చంద్రుని) మొదటి కళను; వహ్ని = అగ్ని; పిబతే = త్రాగుతాడు, అన్నమాట; అవు కాదే = అవును కదా.

ఓరి బాబు! ఈ చదువులతో చంపబోకు. మేం చదవని శాస్త్రాలా? వేదాలా? చదివినానంటే నమ్మవేమో? - ( ఈ వేషధారి- ఈ భోజనం తినేవాడు వేదం చదవటమా అని సందేహిస్తే - మంత్రమే చెబుతున్నాను) 'ప్రథమాం పిబతే వహ్నిః' అన్న మాటే కదా నీ వుద్దేశించింది.

విశే ॥ దాసరి ఏతదర్థంబు మాకుచ్చరింప రాదు- అని మంత్రాన్ని ఉదాహరించక- తాత్పర్యం చెబితే వీడు బ్రహ్మరాక్షసుడు- కనుక మంత్రాన్ని ఉదాహరించాడు.

పద్యమంతా తెలుగుదనం - కాకువుతో నిండారివున్నది. శాస్త్రములె- (ఎ). శ్రుతులు (ఏ)- ఈ చివరి అక్షరాల మీద నొక్కి చదవటం కాకువు.

మ. నిలు మోహో మము వారి భ్రాత లనుచుఁ నీ వంటి, వార ల్సుధా
శు లపూతాశులు గారటంటి, ప్రతిపత్సోమాంశము క్రోలు ముఁ
జ్వలనుం డం, టిఁక నొండు ని న్నడిగెదఁ? సర్వాశిగాఁడా, యతం
డిలఁ దన్న్యాయము చాలు, మాకు నఘమే? వృద్ధానుచారం బిఁకఁ. 33

ఓహో = అబ్బా; నిలుము = ఉండవయ్యా; మమున్; వారి = దేవతలకు; భ్రాతలు = అన్నలమని; అనుచున్ ; నీవు+అంటివి = నీ వన్నావు కదా; వారల్; సుధ+అశులు = అమృతమే ఆహారంగా గలవారు; అపూత+అశులు = అపవిత్రాహారులు; కారు+అటు; ప్రతిపత్ = పాడ్యమినాటి; సోమ+అంశమున్ = చంద్రకళను; మున్= ముందుగా; జ్వలనుండు = అగ్ని; క్రోలున్ = త్రాగుతాడు; అంటి(వి); ఇక = ఈవిషయం విన్నాక; నిన్నున్; ఒండు = ఒకటి; అడిగెదన్; అతండు = ఆ అగ్ని; సర్వ+అశి = అన్నిటినీ భుజించేవాడు; కాడా; అల=ఆ; తత్+న్యాయము = ఆనీతే; చాలున్ ; మాకున్; వృద్ధ+అనుచారంబు = పెద్దల ననుసరించటం; ఇలన్ = లోకములో; అఘమే = పాపమా?

ఉండవయ్యా తొందర దేనికి? మేము దేవతల కన్నలమనీ-వారు పవిత్రమైన అమృత భోజను లన్నావు. అగ్ని చంద్రుని మొదటి కళను త్రాగుతాడనీ అన్నావు. సరే. మరి ఆ అగ్నిదేవుడే అన్నిటినీ భక్షిస్తున్నాడు కదా! ఆ నీతి సూత్రం మాకు చాలు. పెద్దలైనవారి బాటలోనే కదా నడవాలి?

విశే ॥ ఓహో! = ఎగతాళి నిలుము = మాట్లాడ వద్దు.లోకవ్యవహారమింతే.

తే. హరికి సఖుఁడును రథమును నగు గరుడుఁడు
దొరకి నమృతంబు సురలకు మరల నిచ్చి
యహులు గూడుగ వరమున నడిగికొనఁడె?
యమృత మైనను జవుల జాత్యన్న సమమె? 34

హరికిన్ = విష్ణువునకు; సఖుఁడు = మిత్రుడు; రథమునున్+అగు = వాహనమైన; గరుడుఁడు

= గరుత్మంతుడు; దొరకిన; అమృతంబున్; మరలన్ = తిరిగి; సురలకున్= దేవతలకు; ఇచ్చి; అహులు = పాములనే; కూడుగన్ = అన్నముగా; వరమునన్ = వరంతో; అడిగి కొనఁడె = వేడుకోలేదా? (అడిగి పొందలేదా?) అమృతము; ఐనను = ఐనప్పటికీ; చవులన్ = రుచుల్లో; జాతి+ అన్న = జాతికుచితమైన అన్నానికి, సమమె = సమానమా?

శ్రీహరికి చెలికాడూ వాహనమ్మైన గరుత్మంతుడు చేతికందిన అమృతభాండాన్ని దేవతలకు తిరిగి ఇచ్చి 'నా కాహారంగా పాములను ప్రసాదించు స్వామీ' అని అడుక్కొన్నాడు. ఎందుకని?- జాత్యన్నం అమృతం కంటె రుచి కనుక.

అలం :- అర్థాంతరన్యాసం.

చ. నిదురయుఁ గూడుఁ బోఁ జదివి, నే నిటఁ గన్నది యేమి? యెవ్వఁ డీ
చదువుల యర్థవాదపు మృష ల్విని బేల్పడు, నీవు మాయెడం
జదువులమాట లాడి కనఁ జాల వొకానొక మెచ్చు, నొక్కఁ డీ
చదివిన కూర వింతచవి, చాలఁగ, దెమ్మను మెచ్చు దక్కఁగన్. 35

నేను; నిదురయున్ = నిద్రా; కూడున్ = అన్నమూ; పోన్ = పోగా; చదివి; ఇటన్ = ఇక్కడ; కన్నది +ఏమి = పొందిన దేమిటి; ఎవ్వఁడు; ఈ చదువుల = విద్యల; అర్థవాదపు మృషల్= ఉదాహరణ కోసం చెప్పే అబద్ధపు మాటలు; శాస్త్రవాదాలు; బేల్పడున్ = మోసపోతాడు, మాయెడన్ = మా విషయంలో; చదువుల మాటలు = శాస్త్రవాదాలు; ఆడి = చెప్పి; ఒకానొక మెచ్చున్ = ఒక్క మెప్పు కూడా; కనజాలవు = పొందలేవు; ఒక్కఁడు = ఒక్క; ఈ చదివిన కూర = పండితుని ఒడలి మాంసపు కూర, వింత చవి = అద్భుతరుచి కలది; చాలఁగన్ = చాలా; తెమ్ము+అను; మెచ్చు = మెప్పు; తక్కఁగన్ = తప్పించి.

పోరా ! దాసరీ ! నిద్రా కూడూ మాని చదివినందువల్ల నేను పొందిన ఫలిత మేమిటట! ఎవడ్రా ! ఈ అర్థవాదాల అసత్యాలు నమ్మి మోసపోతాడు? నీవు మా దగ్గర శాస్త్ర విషయాలు మాట్లాడితే మెచ్చుకొంటా ననుకొన్నావేమో! ఒక్కటే మెప్పు పొందుతావు - అదేమంటే ఈ దాసరి పండితుని మాంసం ఎంత రుచిగా ఉంది, ఇంకా తే- అన్న మెప్పు దక్క.

విశే ॥ అర్థవాదం = తను సాధించదలచుకొన్నదాని కోసం కథాదులను ఉదాహరించటం- తర్కంలో మాట.

రాక్షసుని మాటల్లో పాండిత్యం - మా-మేము-అనగల దర్జా ఉన్నాయి. వానిమాట వైఖరి గమనించాలి.

ఒక విధంగా చూస్తే దైవభక్తి దృష్ట్యా- ఈ చదువులన్నీ వ్యర్థమే. విష్ణు చిత్తుని లాగా- చూ. 1-78 వచనం. అక్కడ భక్తి. ఇక్కడ లేదు.

వ. అని గీష్పతి మతం బవలంబించి నిజాలాపహేళనపరుండైన రక్కసు కుతర్కోక్తులకుం గ్లిష్ట

స్మరణంబు సేసి, యిందులఁ బొందుపడు ప్రత్యుత్తరంబుల వీనిఁ గెలఁకిన, బుద్ధిక్షోభంబుగా, నింతకంటె నేమి యబద్ధంబులు వినంబడునో, మీఁదఁ గార్యంబు గల మాకు దీనిఁ గాదనం బని లే, దని యందంబుఁ గూడుకొని, ఛందోనువర్తనపరుండై, నీచ సంస్కృతికి రోసి, తన్ముఖోల్లాసంబునకు శబ్దచ్ఛలంబున నంతర్గతంబున సుగతు నిడుకొని నీవు సర్వజ్ఞుఁడ, వేను నరుఁడ, హీనకులుండ, ననభ్యస్తశాస్త్రుండ, నీ కుత్తరం బీ శక్తుండనే, మద్వచన స్ఖాలిత్యంబులు సహించి దయచేసి నమ్మి మత్ప్రార్థనంబు గావింపుము. 36

గీష్మతి = వాచస్పతి = బృహస్పతి మతము; (నాస్తికః-చార్వాక మతం); నిజ = దాసరియొక్క; ఆలాప = మాటలను; హేళన పరుండు = ఎగతాళి చేసే మనస్సు కలవాడై; కుతర్క+ ఉక్తులన్ = చెడ్డ తర్కం మాటలకు; కృష్ణస్మరణంబు = కృష్ణ కృష్ణ అన్న నామ స్మరణం; పొందుపడు = ఒనగూడు; ప్రత్యుత్తరంబులన్ = సమాధానాలతో; కెలకినన్ = కెలికితే; బుద్ధిక్షోభంబు = మనస్సు బాధపడటం; కార్యంబు = పని; అందంబుఁ గూడుకొని = వానితో ఏకీభవించి; ఛందః-అనువర్తన పరుండై = వాని యిష్టానుసారంగా ప్రవర్తించాలనుకొని; నీచ సంస్కృతికిన్ = అతని నీచమైన శాస్త్రజ్ఞానానికి, రోసి = ఏవగించుకొని; తత్ = అతని; ముఖ ఉల్లాసంబునకున్ = ప్రీతికోసం ; శబ్దచ్ఛలంబునన్ = శబ్ద మిషచేత; అంతర్గతంబునన్ = మనస్సులో; సుగతున్= బుద్ధదేవుని స్థాపించుకొని; నీవ; సర్వజ్ఞుండవు = అన్నీ తెలిసినవాడవు; ఏను; నరుండన్ = మనిషిని; హీనకులుండన్ = తక్కువ కులపు వాడిని; అనభ్యస్త శాస్త్రుండను = శాస్త్రాలు చదవని వాడిని ఉత్తరంబు = సమాధానం; ఈ శక్తుండనే = ఇవ్వగలవాడినా?; మత్ = నా; వచన స్ఖాలిత్యంబులు = మాట తప్పులు; దయచేసి = కృప వహించి; మత్ ప్రార్థనంబున్ = నా అభ్యర్థనను; కావింపు = తీర్చు.

అనవసరవాదాలతో పనిలేదను కోవటమే పండితలక్షణం. (సర్వజ్ఞ = ఈశ్వర; బుద్ధులు ఈ రెండవ అర్థం నాస్తికాగ్రేసరుడన్న నిందార్థంలోనూ వాడినాడు. చూ. 4-30)

శా. ప్రఖ్యాతుండవు దైత్యులందు మును, పాపై నొక్క నీకా యశో
భిఖ్య న్నేనును బేర్తు, మే యొసఁగుఁ దప్పింప వ్రం బొక్కఁడే
ముఖ్యంబై యొనరింతు, దాని సఫలంబు న్యజేగా లేవుగా?
'సఖ్యం సాప్తపదీన' మన్మన మిథ స్సాంగత్య మూహించుచున్. 37

మునుపు = ముందుగా; దైత్యుల+ అందున్ = రాక్షసుల్లో; ప్రఖ్యాతుండవు = ప్రసిద్ధి కలవాడవు, ఆపైన్ = ఆప్రఖ్యాతిపైన; నీకా = ఆశ్చర్యంగా నీ కోసమూ అనటం; యశోభిఖ్యన్ = కీర్తియొక్క శోభను; నేనునున్ = నేను; పేర్తున్ = ఎక్కువ చేస్తానా? ;మే= శరీరం; ఒసఁగున్ = ఇవ్వటం; తప్పింపన్ = తప్పించను, వ్రతంబు+ ఒక్కడేన్ = ఒక్కవ్రతం; ముఖ్యంబు+ఐ = ప్రధానంగా; ఒనరింతున్ = చేస్తున్నాను; దానిన్; సఫలంబున్=ఫలవంత మయ్యేటట్లు; చేయుగా లేవుగా = చేయలేవా?; సఖ్యం = స్నేహం; సాప్తపదీనం = ఏడడుగుల మేర కలది; అన్ = అన్న; మన = మన ఇద్దరి; మిథః = పరస్పర; సాంగత్యము = స్నేహం; ఊహించుచున్ = భావిస్తూ- (చేయలేవా).

నీవా రాక్షసుల్లో గొప్ప పేరు కలవాడవు. అలాంటి నీకా నేను ఇంకా యశశ్శోభను కల్గించటం- లేదా ఇంకా నీకు యశస్సు కల్గిస్తాను. నేను ముఖ్యమైన ఒక వ్రతం చేస్తున్నాను. దాన్ని నీవు సఫలం చేయలేవా? స్నేహం ఏడడుగులు నడిస్తే కల్గుతుందన్న పెద్దలమాటను - మన స్నేహాన్ని భావించి అయినా.

విశే ॥ నీకు యశస్సు నింకా కల్గిస్తాను- అన్న అర్థం కుదరదు. అప్పుడు నీకా- అన్న దీర్ఘ మనవసరం! ఇదివరకే ప్రఖ్యాతుడవు కనక నీకు నేనింకా కల్గించే యశస్సేమిటి? అంటే నావల్ల- నా తర్కాన్ని నీవు ఖండించినందువల్ల నీకు కీర్తి నిచ్చే సాటి పండితుడను కాదుకదా. పైగా ఈ 'అహం' లేనివాడు. ఇంకా హీనకులుడనని పై నన్నాడు కదా.

వ. అది యెద్ది యంటేని. 38

ఒది = ఆ వ్రతం; ఎద్ది = ఏది; అంటేని = అంటే.

క. ఈ కుఱుఁగటి యీ కురుఁగుడి
వైకుంఠునిఁ బాడి వత్తు వ్రతముగఁ దత్సే
వాకృతి కడపట నశనము
నీ కౌదు, న్ముఖ్య మిదియ నేఁ డగుఁ దుదకున్. 39

ఈ కుఱుఁగటి = ఈ సమీపంలోని; ఈ కురుఁగుడి = కురుంగుడి క్షేత్రం; వైకుంఠునిన్ = వామనస్వామిని; పాడి = కీర్తించి; వత్తున్ = (రోజూ) తిరిగి వస్తాను; వ్రతముగన్ = ఒక వ్రతంగా; తత్ = ఆ; సేవాకృతి = ఆ అర్చన; కడపటన్ = అనంతరము; నీకున్; అశనము = అన్నం; ఔదున్ = ఔతాను; ఇదియ = ఇదే, తుదకున్ = వ్రతసమాప్తికి; నేడు = ఈ రోజు; ముఖ్యము+ అగున్ = ముఖ్యమౌతున్నది.

ఇదిగో ఈ సమీపంలోనే ఉన్న కురుంగుడి వామనస్వామిని పాడి వస్తాను. ప్రతిరోజూ ఇదొక వ్రతంగా చేస్తున్నాను. ఇవ్వాళే దానికి సమాప్తి దినం. కనుక వ్రతం పూర్తి చేసుకొని తిరిగి వస్తాను. ఆహార మౌతాను

ఉ. అంచు నతండు పల్కఁ, దరహాసతఁ జెక్కిలిఁగొట్టి లెస్స పం
డించితి వోయి దాసరి, వనిం దెరవాటులు గొట్టికొట్టి మే
న్పెంచి విరక్తి దాసరివి, నిన్నఁగదా యయినాఁడ, వీ మమున్
గొంచెముఁ జేసి త్రాడ్గొఱికికోఁ దలపోసెదు, మెచ్చితి న్నినున్. 40

అంచున్; అతండు = దాసరి; పల్కన్ = అంటే; రాక్షసుడు; దరహాసతన్ = నవ్వుతూ; చెక్కిలిఁగొట్టి = చెంపమీద కొట్టి; దాసరి !; లెస్స = బాగా; పండించితివి+ ఓయి = మోసం చేస్తావురా!; వనిన్ = అడవిలో, తెరవాటులు = దారిదోపిడి; కొట్టికొట్టి= దోచుకొని; మేన్ = శరీరం; పెంచి = బలియించి; విరక్తిన్ = వైరాగ్యంతో; దాసరివిగా; నిన్నఁగదా = నిన్నేకదా; అయినాడవు; ఈ మమున్ = ఈ మమ్మల్ని; కొంచెము చేసి = తక్కువచేసి, త్రాడు; కొఱికికోన్ = కొరికికొని (తప్పించు కోవాలని); తలపోసెదు = ఆలోచిస్తున్నావు; నినున్; మెచ్చితి = మెచ్చుకొన్నాను.

అని దాసరి అనగానే రాక్షసుడు నవ్వి వాడి చెంపను చిన్నగా కొట్టి హేళనగా- బాగా కట్టుకత అల్లగలవురా! నిన్నటి దాకా దారిదోపిళ్లు చేసి చేసి విరక్తి చేత నిన్ననే కదా నీవు దాసరి వైనావు. ఇంత చదివిన మమ్మే అల్పులుగా- తెలివి తక్కువ వారిగా భావించి కట్టిన త్రాటినే త్రెంపుకొని పోవాలని ఎత్తువేస్తావు. భలే దాసరీ! నీ తెలివికి మెచ్చానురా.

విశే ॥ నేర్పుగా సంభాషించే తీరు అందంగా ఉంది. నవ్వుతూ చెక్కిలి కొట్టటం - ఎగతాళి చేయటం మంచి అభినయ విశేషం.

పండించుట- వాచ్యార్థం లేదు. తెలివితేటలను బాగా నేర్చుకొన్నావురా అన్న లక్ష్యార్థం చెప్పుకోవచ్చు. త్రాడు కొఱకటమంటే బంధముక్తి.

శా. ఏ రాజ్యంబు నరుండు నోరి కడివో నీ బోధ మాలించు ? నిం
కే రాజ్యంబు నరుండు బాసకయి మే నీఁ దాన యేతెంచుఁ ? దీ
పార న్నేఁ జననీమియు న్మగిడి నీవా రామియుం దెల్ల, మే
లా రంతు, ల్పలుపల్కు లంత్యకుల! యేల చింత, లేలా వగల్. **41**

ఏరాజ్యంబు నరుండు = ఏదేశం మనిషి; నోరికడి పోన్ = నోటిదగ్గర అన్నం పోగా; ఈ బోధము = ఈ జ్ఞానోపదేశాన్ని; ఆలించున్ = ఆలిస్తాడు, ఇంక; ఏరాజ్యంబు నరుండు; బాసకయి = ఇచ్చిన మాటకోస మై; మేన్ = శరీరం; ఈన్ = ఇవ్వటానికి; తాన+ ఏతెంచున్ = తానై వస్తాడు; తీపు+ ఆరన్ = స్నేహంతో; నేన్; చననీమియున్ = పోనీ యకుండటమ; నీవు; మగిడి = తిరిగి; రామియున్ = రాకపోవటమూ; తెల్లము= స్పష్టం; రంతులు+ ఏల = వాదోపవాదాలు దేనికి?; పలు = అనేకం; పల్కులున్ = మాటలున్నా; అంత్యకుల = చివరి కులపువాడా; ఏలా చింతలు = ఆలోచనలేలా?; వగలు ఏలా? = దుఃఖాలు దేనికి?.

ఓరీ! అంత్యకులస్థుడా! ఈ బోధలాలించి నోటి దగ్గరకు వచ్చిన అన్నం ముద్దను వదలుకొనేవాడే దేశంవాడురా? మరి ఏ దేశం మనిషి మాట కోసం శరీరాన్నివ్వటానికి తిరిగి వస్తాడు ? నేను పోనివ్వటమూ- సరే. నీవు తిరిగి రావటమూ సరే, ఈ తర్కవితర్కాలు- మాటకు మాటా- చింతలు- వగలు- దేనికి? (పోనివ్వను).

విశే ॥ పద్యమంతా సంభాషణాత్మకం. 'మన దేవూరు బాబూ'- అని అవతలివాడు చెప్పిన మాట అవిశ్వసనీయమైనపుడు అనే తీరే పద్యంలో- ఏరాజ్యంబు- అనబడినది. తెలుగువాడు మాట్లాడే వైఖరి కిది ప్రతిబింబం. నేను పోనివ్వటమూ- నీవు రావటమూ రెండూ హుళక్కి. ఈ వాక్య నిర్మాణాన్ని అనుసరిస్తున్నది పద్యం

విజయనగర రాజులకు - రాయలవారికీ - బాసదప్పు వరగండాంకా । మాట తప్పేవారిని శిక్షించేవాడా! అన్న బిరుదుంది. దీనినిక్కడ అతుక్కొనవచ్చు.

తే. అనినఁ జెవిఁ మూసి నారాయణా! యటంచు
నతఁడు నను నమ్మవేఁ బిశితాశి యొక్క!
శపథమున నమ్ము మని వాఁడు సమ్మతింప
వేనవే ల్సత్యములు పల్కి వినకయున్న. 42

అనినన్ = రాక్షసుడు అనగానే; అతఁడు = దాసరి; చెవిన్ మూసి = చెవులను మూసుకొని; నారాయణా అటంచు = నారాయణా ! అని అంటూ; పిశితాశి = పిశిత-మాంసం; అశి = అశనం = ఆహారంగా కలవాడు = రాక్షసుడు ; ననున్; నమ్మవేఁ= నమ్మవయ్యా; ఒక్క శపథమునన్ = ఒక ఒట్టుతో; నమ్ముము, అని; వాఁడు = రాక్షసుడు; సమ్మతింపన్ = ఒప్పుకోవటానికి; వేనవేల్ = అనేకం; సత్యముల్ = శపథ వాక్యాలు; పల్కి = చేసి; వినక ఉన్నన్ = వినకపోగా.

రాక్షసు డావిధంగా అనేసరికి దాసరి 'నారాయణా' అని స్వామి నామస్మరణం చేసి (పాపం పోవటం కోసం) 'ఓయీ! మాంసాహారా! నన్ను నమ్ము' అని ఎన్ని ఒట్లు పెట్టుకొన్నా వాడంగీకరించక పోగా-

1వ పాదంలో ప్లుతయతి. నారాయణ- ఆ- కు. ఆప్లుతంవల్ల బాధ ధ్వనిస్తుంది.

ఉ ॥ ''ఎవ్వనిచూడ్కిఁ జేసి జనియించు జగంబు, వసించు నిజ్జగం
బెవ్వనియందు, డిందు మఱి యెవ్వనియం దిది, యట్టి విష్ణుతో
నివ్వల నొక్క వేల్పు గణియించిన పాతకి నౌదు నేఁడ నే
నెవ్విధి నైన ని న్గదియనేని,'' యన న్విని బంధ మూడ్చినన్. 43

నేను; నేఁడ = నేడే; ఎవ్విధినైనన్ = ఏవిధంగానైనా; నిన్ ; కదియన + ఏనిన్ = సమీపించక పోతే (తిరిగిరాక పోతే); ఎవ్వని చూడ్కిన్+చేసి = ఎవని చూపుతో; జగంబు= స్థావర జంగ మాత్మక మైన విశ్వం; జనియించున్ = సృష్టింపబడుచున్నదో; ఈ జగంబు, ఎవ్వనిలోన్ = ఎవనిలో; వసించున్ = ఉంటున్నదో; ఎవ్వనియందున్; డిందున్ = అణగారి పోతున్నదో; అట్టి; విష్ణుతోన్ ; ఇవ్వలన్ = ఇటుప్రక్క; ఒక్క వేల్పున్ = అన్య దేవతను; గణియించిన = లెక్కించిన; (తూకం వేసిన); పాతకిన్+ఔదున్ = పాపి నౌతాను; అనన్ విని; బంధమున్ = కోలగ్గెరను; ఊడ్చినన్ = దూసివేస్తే ( ఊడదీస్తే).

ఎవ్వని చూపుతో సృష్టి రూపెత్తి - ఎవ్వనిలో నివసిస్తూ- తుద కెవ్వనిలో లీన మౌతున్నదో అట్టి శ్రీమహావిష్ణువుతో ఇవతల సిబ్బిలో మరొక దేవతను తూస్తే - ఎంతటి పాపాన పోతానో నేను తిరిగి రాకపోతే అంత పాపాన పోతాను. అనగానే వాడు బంధం తొలగించాడు.

విశే ॥ ''ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై
ఎవ్వనియందు డిందు పరమేశ్వరుఁడెవ్వడు మూల కారణం -

బెవ్వడు'' ... అన్న భాగవత పద్యపు టెత్తుగడే ఈ పద్యమున్నూ. కానీ - ఎవ్వని చూడ్కిఁ జేసి... ఏమిటి? బ్రహ్మ సూత్రాల్లో 'ఈక్షతి' అధికరణంలో సృష్టి కారణం పరమేశ్వరుని ఈక్షణ కర్మగా

చెప్పబడింది. 'స ఐక్షత'- అనివేదం. అతడు చూచాడు; అనేక మౌదామని. ఈ సంకల్పమే 'ఈక్షణ' కర్మగా వ్యాఖ్యానించారు భాష్యకర్తలు.

విష్ణువు = సర్వమునందూ ఉన్నవాడు. అంతటా ఆకాశం లాగా వ్యాపించినవాడు- కనుక సృష్టి స్థితి లయాలూ అతనిలోనే జరుగుతున్నాయి.

ఊఁడ్చునన్- పల్లెల్లో బంధాలు, (పశువులకు) అన్నీ దూముడి వేసేవే, అంటే ఒక కొన లాగితే బంధమంతా ఎంతో చిక్కగా కనిపించేది కూడా- అవలీలగా ఊడిపోతుంది, అదీ ఊఁడ్చటమంటే.

కవి శబ్ద ప్రయోగ వైచిత్రి సర్వత్ర ఇంతే.

చ. అతఁడు తదల్పపాపఫల మందుట సుంకము దీఱి పోయి, త
చ్ఛతదళపత్రనేత్రునకుఁ జాఁగిలి మ్రొక్కి, రణద్విపంచి యై
స్తుతికలితప్రబంధములఁ జొక్కఁగఁ బాడి, యసత్యభీభర
ద్రుతగతి వచ్చి, రాత్రిచరుతో వ్రతపూర్తి గతార్తి నిట్లనున్. 44

అతఁడు = ఆ దాసరి; తత్ = ఆ; అల్ప = కొంచెంపాటి; పాపఫలము; అందుటన్= పొందినందువల్ల; సుంకము దీఱి = శుల్కం చెల్లించి; పోయి; తత్ = ఆ; శతదళ పత్ర నేత్రునకున్ = నూరు రేకుల తామర రేకులవంటి నేత్రాల స్వామికి; చాగిలి మ్రొక్కి = సాష్టాంగ నమస్కారం చేసి ; రణత్+విపంచియై = మీటిన మాతంగ వీణ కలవాడై; స్తుతికలిత ప్రబంధములన్ = దివ్యప్రబంధ స్తోత్రాలతో; పాడి = కీర్తించి; చొక్కఁగన్ = మూర్ఛపోయేటట్లు (తానూ-హరీ); అసత్య భీభర = అబద్ధము వలని భయభారంతో; ద్రుతగతిన్ = తొందర నడకతో వచ్చి; రాత్రిచరుతో = రాక్షసునితో (రాత్రులందు తిరిగేవాడు); వ్రతపూర్తి = పూర్తియైన వ్రతం కలవాడు; గత = పోయిన; ఆర్తి = దుఃఖం (కలవాడై); ఇట్లు; అనున్.

అతని కింకా ఏదో పాపలేశ మున్నందున రాక్షసునికి చిక్కి- దాని సుంకం చెల్లించటంతో ముక్తుడై పోయి వామనస్వామిని దివ్యప్రబంధాలతో- వీణ మీటుతూ పరవశించేటట్లుగా స్తుతించి- ఆడినమాట తప్పకుండా- త్వరితగతితో రాక్షసుని సమీపించాడు. ఈ వచ్చిన దాసరి వేరు. వాడు వ్రతపూర్తి- గతార్తి= పోయిన దాసరిలో ఈ రెండూ లేవు.

విశే॥ పద్యమంతా మహావేగవంతంగా నడిచింది. అదే ద్రుతగతి. దాసరి సంతోషంతో వెళ్ళటం-పాడటం-తిరిగి రావటం-అన్నీ వేగంగా జరిగిపోయాయి. గత+ ఆర్తి-తాపత్రయం పోయింది. ఆధ్యాత్మిక- ఆధిదైవిక- ఆధిభౌతిక తాపాలు నశించాయి. కనుక మానసిక సంతోష ద్రుతగతిలో పద్యం సాగింది.

ఉ. నీ చెఱఁబాసి, పోయి, రజనీచర ! చక్రి భజింప, ముక్తి పొం
దేచెర, యే చెఱుందవులనే, నీఁక, నుండఁగఁ జూడు, పంచుచో
నే చరణంబు లేయుదర మేయుర మేశిర మేకరంబు, లీ
వా చరణంబు లాయుదర మాయుర మాశిర మాకరంబులున్. 45

రజనీచర = రాక్షసా !, నీచెఱన్ = నీ బంధం; పాసి = వదలి; పోయి; చక్రిన్ = శ్రీహరిని; భజింపన్ = సేవిస్తే; ముక్తి పొందు = మోక్షసాంగత్యం; ఏచెర = పెరిగిందిరా! ;నేను; ఇకన్; ఏచెఱన్ = ఏబంధంలోను; తవులను = చిక్కుకోను; పంపుచోన్ = నీవు నన్ను పంపిచ్చేటప్పుడు; ఏచరణంబులు = పాదాలు; ఉదరము = పొట్ట; ఉరము = వక్షము; శిరము = తల; కరంబులు = హస్తాలు, ఏవో; ఆచరణములే, ఉదరమే, ఉరమే, శిరమే, కరంబులే, ఉండఁగన్ చూడుము = ఉన్నట్లుగా ఉన్నాయో లేదో చూడు.

నీ బంధంనుండి పోయి శ్రీహరిని సేవించాను. నాకు ముక్తి పొందు కల్గింది. నేనిక ఏ చెఱలోనూ తగుల్కోను. నీవు పంపిన వేళ ఆయా అంగా లెలాయున్నాయో అలాగే అవి యున్నాయో లేదో చూచుకో

అలం॥ - వృత్త్యనుప్రాస.

విశే ॥ దాసరి ఆలయం ముందు భక్తి జనితోద్యత్తాండవ మాడు నన్నాడు కవి. ఈ పద్యమంతా ఒక చెక్క భజన చేస్తున్నట్లుంది. ఒక దేశీయ నృత్య విశేషంగా- గతిచేత భాసింపజేయటం కవి నేర్పుశిల్పం. ఒక సంతోష పారవశ్యం- భక్తిభావం ధ్వనిస్తున్నాయి, పదాల కూర్పువల్ల.

తే. అనినఁ దత్సత్యమునకు నేత్రాంబు లురులఁ
ప్రమద పులకితగాత్రుఁడై పాఱు టసుర
యినుని మధ్యందినపుటెండ దనదు పెద్ద
బట్టతల మించఁ బ్లవుఁ జేరఁ బాఱుదెంచి. 46

అనినన్ = అనేటప్పటికి; తత్ సత్యమునకున్ = అతని శపథం నెరవేర్చి నందుకు; నేత్ర+ అంబులు = కన్నీరు; ఉరులన్ = దొర్లుతుండగా; పాఱు+ అసుర = బ్రాహ్మణ జాతీయుడైన రాక్షసుడు (బ్రహ్మ రాక్షసుడు); తనదు = తన; బట్టతల = జుట్టులేనితల; మధ్యందినపు టెండన్ = మధ్యాహ్నపుటెండలో; మించన్ = తళతళమంటూ ఉంటే; ప్లవున్ = దాసరిని; చేరన్ = సమీపించటానికి; పాఱుతెంచి = పరుగెత్తి.

దాసరి అలా అనేసరికి బ్రహ్మరాక్షసుని కళ్ళవెంట నీళ్ళు తిరిగినవి, '' ఇదెక్కడి సత్యపాలన'' మని. అలా అనుకొని ఎండలో తన బోడితల మిలమిల లాడగా పరుగెత్తుకొని వచ్చి.

విశే ॥ బట్టతల విషయం వల్ల దృశ్య సాక్షాత్కృతి కల్గుతుంది. (చూ. 19వ పద్యంలో చెంబుతల)

ఉ. కొండయుఁబోలె భక్తి వల గొంచునె, వాఁడు నిజద్రుమభ్రమీ
హిండన వ్రాలు పాకలపు చేనుఁగుఁబోలె నొస ల్తదంఘ్రులం
దుండ, రొద న్మహాగిరులు హోరనఁ, బ్రస్తుతి వ్రాలి, దంష్ట్రికా
దండము లెత్తి పట్టిన పదం, బొకఁ డొక్కఁడ నెత్తిఁ జేర్చుచుఁ. 47

వాఁడు = రాక్షసుడు; కొండయున్+పోలెన్ = కొండలాగా; భక్తిన్ = భక్తితో; వలగొంచునె = ప్రదక్షిణం చేస్తూనే, నిజ = (కట్టివేసిన) తనయొక్క; ద్రుమమ = చెట్టును; భ్రమీ = చుట్టూ

తిరగడముయొక్క; హిండనన్ = ఆవృత్తులచేత (అనేక సార్లు చెట్టు చుట్టూ తిరగటం); వ్రాలు = పడే; పాకలపు+ ఏనుగు = ఆ పేరు వ్యాధికల ఏనుగు; పోలెన్ = వలె; తత్+అంఘ్రులన్ = దాసరి పాదాలపై; నొసల్= రాక్షసుని నుదురు; ఉండన్= తాకుతుండగా; రొదన్ = రొదలో; మహాగిరులు = పెద్ద కొండలు; ఘోరు+ అనన్ = ధ్వనించగా; ప్రస్తుతిన్ = మిక్కిలి స్తుతులతో; వ్రాలి = పడి; దంష్ట్రికాదండములు = కోరలన్న కర్రలు; ఎత్తిపట్టిన పదంబు=పైకెత్తి ధరించిన పాదం; ఒక్కఁడు+ ఒక్కఁడ = ఒకటొకటే; నెత్తిన్ = తలపై, చేర్చుచున్ = చేరుస్తూ.

కొండలాగా భక్తితో అతని చుట్టూ ప్రదక్షిణం చేస్తూ- పాకలపు వ్యాధిసోకిన ఏనుగు ఏవిధంగా చెట్టు చుట్టూ తిరిగి తిరిగి పడుతుందో అలాగే- తానూ దాసరి పాదాలపై నుదురు చేర్చి- కొండలు ప్రతిధ్వనించేటట్లుగా ప్రస్తుతించి- అతని పాదాలను తన కోరలన్న కర్రలతో పైకెత్తిపట్టి ఒకటొకటిగా తలపైన పెట్టుకొంటూ.

**అలం :** - ఉపమ. ఆకారంలో కొండ భ్రమణం; పోలికలు దంష్ట్రలతో ఏనుగు.

విశే ॥ రాక్షసుని భక్త్యావేశ చిత్రణం మహాద్భుతం.

శా. ''ఈ సర్వంసహ దేవదానవ మహీభృన్మౌని వాచాతప
శ్శ్రీ సర్వస్వము నేతదన్యకృతులం జెప్పంబడు న్ఘోర మౌ
ని సత్యం బురరీకృతాంత, మిల నెం తే వృద్ధ నై మంటి, నే
నా సత్యం బిఁక నిన్నుఁ బోలు కృతసంధా ధూర్వహు ల్లేమికిఁ. 48

ఈ సర్వంసహన్ = ఈ భూమిపై; దేవ; దానవ = రాక్షసులు; మహీభృత్ = రాజులు; మౌని = మునులు( వీరందరియొక్క); వాచాతపః శ్రీ సర్వస్వమున్ = వాగ్రూపమైన సర్వ తపస్సంపద; ఏతత్ = దీనికంటె; అన్యకృతులన్ = ఇతర కృత్యాలలో; చెప్పంబడున్= చెప్పబడుతుంది, నీ సత్యంబు = నీ సత్య సంధత; ఉరరీకృత+అంతను= నెరవేర్చబడిన చివర కలది- (సాంతము నెరవేర్చి నట్టిది); ఘోరము+ ఔ = మహా భయంకర మవుతున్నది; నేన్; ఇలన్ = భూమిపై; ఎంతేన్ = చాలా; వృద్ధనై = ముసలినై; మంటిన్= బ్రతికాను; ఇఁక = ఇంతటి నుండి; నిన్నుఁబోలు = నీవంటి; కృత = చేయబడిన; సంధా= అనుసంధానముయొక్క; ధూర్వహుల్= వహించినవారు; లేమికిన్ = లేక పోనటానికి; నా సత్యంబు = నాప్రతిజ్ఞ.

ఈ లోకంలో నీలాటి సత్యవ్రతపాలకులు లేరు. దేవతలు -దానవులు-రాజులు-మౌనులయొక్క; వాగ్రూప తపస్సంపద వేరే దీనికంటె ఇతర విషయాల్లో ప్రసిద్ధం కావచ్చు. కానీ ఈ ఘోరమైన సత్యసంధత అపూర్వం. ఎంతో కాలంగా బ్రతికి ముసలినై పోయాను. కానీ నీలాంటి సత్య నిర్వహణ చేసిన వారిని చూడలేదని ఘంటాపథంగా చెప్పగలను.

**అలం :** - వ్యతిరేకం

పద్యరచన భావించదగ్గది. చాలా అందమైన ఎత్తుగడ- దింపుగడ కలది. వాచాతపః- దగ్గర పాదం తెగి శ్రీతో ద్వితీయపాదం ప్రారంభం కావటంలో చాలా అందముంది. ఇది తిక్కన గారి రచనలో కన్పించే శిల్పకిరణం.

చ. ఇతరులు నీకు నీడె మఱి? యీధృతి, నీస్మృతి, నీ ఋతేరిత
స్థితగతి, నీ మురారిపద సేవన జీవనవన్మతిన్, సమా
దృత కలగాన సింధులహరీ ప్లవన ప్లవభావ భాగురు
శ్రుతితతబద్ధతుంబికిఁ గురుంగుడినంబి కృపావలంబికిన్. 49

సమాదృత = చక్కగా ఆచరింపబడిన; కలగాన = మధుర సంగీతమున్న; సింధు = సముద్రముయొక్క; లహరీ = అలలపై; ప్లవన = తేలటం కోసం; ప్లవభావ = తెప్పలక్షణం; భాక్ = పొందిన; ఉరు = పెద్ద; శ్రుతి = నాదంకల; తత = వీణకు; బద్ధ = కట్టబడిన; తుంబికిన్ = సొరకాయ బుర్రకలవానికి; కురుంగుడి నంబి = కురుంగుడి క్షేత్ర దైవముయొక్క; కృప+ అవలంబికిన్ = దయను ఆధారంగా కలవానికి; నీకున్; మఱి = ఇంకా; ఈ ధృతి = ఈ ధైర్యం ( ధీరత్వం = పరమేశ్వరుని యందు బుద్ధిని నిల్పి ఇతరాన్ని లెక్క చేయని గుణం) ఈ స్మృతి = ఈజ్ఞానం; ఈ; ఋత = సత్యం; ఈరిత = చెప్పబడ్డ మాటపై; స్థిత = ఉన్న; గతి = ప్రవర్తన (నడత) లో; మురారి = మహావిష్ణువుయొక్క; పదసేవన = పాదసేవయే; జీవనవత్ = బ్రతుకు కల; మతిన్ = మనస్సులో; ఇతరులు నీకు నీడె = ఇతరులు నీతో పోలగలరా?

నీ వీణాదండము నందున్న సొరకాయ బుర్రనే తెప్పగా చేసుకొని కైశికీ గాన సముద్రాన్ని అవలీలగా దాటినావు. నిత్యమూ కురుంగుడి స్వామి దయనే అవలంబనంగా చేసుకొన్నావు. కనుకనే నీ ధైర్యం - జ్ఞానం- సత్యభాషణంలో నిలబడి జీవించటం- హరిపాదసేవ - వాటిలో నీకు ఇతరులు సాటి రాలేరు.

**అలం:** - వృత్త్యనుప్రాస. చివరి పాదంలో అంత్యానుప్రాస.

విశే ॥ మై మరచి శివ మెత్తిన రచన. ఆ వేగం - పదాల దూకుడు- వాక్యం విరుపు- అన్నీ రాక్షసుని భక్తిభావ వ్యంజకాలు.

**తే.** అనిన నాతనిఁ గౌఁగిట నునిచి పలికె
వ్రత మొనర్పించి తని భాగవతవతంస
మోయి రజనీచరేంద్ర! నీ యురుకృపాక
టాక్షమునఁ జేసి ధన్యుఁడ నైతి ననఘ. 50

అనినన్ = అంటే- అన్నాక; అతనిన్ + కౌగిటన్ ఉనిచి = రాక్షసుని కౌగిలించి; భాగవత వతంసము = భక్తులలో మకుటప్రాయుడు; పలికెన్ ; అనఘ = పాపం లేని వాడా; వ్రత మొనర్పించితి = వ్రతం పూర్తి చేయించావు కదయ్యా!; ఓయి ! రజనీ చర+ ఇంద్ర = ఓరాక్షసశ్రేష్ఠుడా; నీ; ఉరు = గొప్ప; కృపా కటాక్షమునన్+చేసి = దయగల చూపు వల్ల; ధన్యుడ నైతిని = తరించాను కదా.

రాక్షసుడలా అనగానే అతనిని కౌగిలించుకొని అన్నాడు. ''అనఘా ! వ్రతం చేయించావు కదయ్యా ! రాక్షసోత్తమా ! నీదయ వల్లనే నేను ధన్యుడ నైనాను.''

విశే ॥ దాసరి నోటివెంట వచ్చిన మొదటి మాట 'అనఘ' ! ఎప్పుడైతే అతడూ విష్ణు స్మరణం

చేసాడో వెంటనే అతని పాపాలు దగ్ధమైనాయని అర్థం. దాసరి భాగవత వతంసం. మసిపాత మానికంబు; పేరుకొనగాని కులంవాడైనా విష్ణుచిత్తుని సరసన నిలబడ్డాడు. పరమేశ్వరుని కృప- విష్ణు చిత్తునిపై- అతని ద్వారా పాండ్య చక్రవర్తిపై- ఇప్పుడితని ద్వారా రాక్షస సముద్ధరణ, కులంలో తారతమ్యం తప్ప భక్తిలో లేదు.

ఉ. బాసలు బండికండ్లు, మఱి ప్రాణభయంబున లక్ష సేసినం,
గ్రాసము కృచ్ఛ్రలబ్ధ, ముడుగ న్వశమే ? యిది నీక చెల్లె, నో
భూసురవంశ్య, పుణ్యజన ! పుణ్యజనాంకము దావకీన మే
పో, సమకూరెడిం గులము పొత్తున దైత్యులకెల్ల నంకతన్. 51

బాసలు = ప్రతినలు; బండి కండ్లు = బండి చక్రంలోని ఆకులు ఏ కేంద్రం నుండి వెలువడుతున్నాయో ఆ కుండలు; ప్రాణభయంబునన్ = ప్రాణభీతితో; లక్షసేసినన్= అనంతంగా, లెక్కలేనన్ని చేసినా; కృచ్ఛ్రలబ్ధము = కష్టపడి సంపాదించు కొన్నది; గ్రాసమున్ = భోజన పదార్థం; ఉడుగన్ = వదలు కోవటం; వశమా? ఓ భూసుర వంశ్య = బ్రాహ్మణ కులస్థుడా; పుణ్యజన = పవిత్ర మానవా (రాక్షసా); పుణ్యజన+ అంకము = పవిత్రుడన్న నామధేయ చిహ్నం; తావకీనమే పో = నీ సొమ్మే పో; కులము పొత్తునన్ = కులంపొత్తుచే; దైత్యుల కెల్లన్ = రాక్షస జాతి వారందరకూ; అంకతన్ = పేరుగా; సమకూరెడిన్ = కల్గినది.

ఓయీ ! భూసుర వంశ్య ! పుణ్యజనుడా ! బాసలు బండి కండ్లై క్రిందకూ మీదకూ మారుతుంటాయి. ప్రాణభయంతో చేసేవవి. వాటిమాట కేమిగానీ- కష్టపడి సంపాదించుకున్న భోజన పదార్థాలను కాదని ఎవ్వడంటాడు ? నీవు పవిత్ర జీవనుడ వైనందున మీ రాక్షసులందరకూ నీ పుణ్యజన నామమే సమకూడటానికి కారణం మీరంతా ఒకే కులం వారు కావటమే. ( నీవల్ల వారూ పుణ్యజనులన్న పేరు పొందారు).

**అలం:** - నిరుక్తి. పుణ్యజనుడు = రాక్షసుడు. కానీ శబ్దార్థం పుణ్యం చేసిన జనుడు. ఈ అర్థం లో శబ్దప్రయోగం చేసినందున నిరుక్తి.

బండి కన్ను-చక్ర కేంద్రంలోని అడ్డ - ఇరుసు దానిలో తిరుగుతూ ఉంటుంది. లక్ష్యార్థంగా చక్రమనీ చెప్పవచ్చు. ఈ శబ్దం వ్యవసాయ వృత్తికి సంబంధించినది.

చ. కడుపు మహాక్షుధ న్నకనకంబడ నన్కృతకృత్యుఁ జేయఁ బో
విడిచితి, వేము జాత్యముగ వేధ విధించిన కూడు మీకు, నీ
యెడ నొక కీడు గల్గ, దిఁక నే మనిన, న్మఱి నీకు నాన సూ
బడలిక దీఱ నిత్తనువుఁ బారణసేయుము మైత్రి గల్గినన్. 52

కడుపు ; మహాక్షుధన్ = మంచి ఆకలితో; నకనకంబడన్ = నకనక లాడు తుండగా ( వ్యవహార ప్రయోగం); నన్; కృతకృత్యన్ + చేయన్ = ధన్యుని చేయటం కోసం; విడిచితివి= వదలి పెట్టావు; ఏము = మేము; జాత్యముగన్ = జాతికి తగ్గట్లు; వేధ = బ్రహ్మ; విధించిన = ఒనగూర్చిన; కూడు = అన్నం,

నీయెడన్ = నీయందు; ఒక్కకీడున్ = ఒక్క పాపమూ;కల్గదు; ఇకన్; ఏమనినన్ = ఏమంటే; మఱి; నీకున్; ఆనసూ = ఒట్టు సుమా; బడలిక =శ్రమ; తీఱన్ = తీరేటట్లుగా; ఈ తనువు = ఈ శరీరం; మైత్రి గల్గినన్ = స్నేహముంటే; పారణము సేయుము = ఆరగించు.

బ్రహ్మ మమ్మల్ని మీకు ఆహారంగా నిర్మించాడు. అయినా నీవు నన్ను ధన్యుని చేయటం కోసం విడిచి పెట్టావు. కాబట్టి నీకేపాపమూ లేదు. ఇక చెప్ప వలసిం దేమీలేదు. నీ శ్రమ- అలసట తీరి పోయేటట్లు ఈ శరీరాన్ని ఆరగించు. నాపై ఒట్టు సుమా!

విశే ॥ పారణసేయుట = వ్రతానంతరం నైవేద్యం తినటం- అన్న అర్థంలోనే ప్రసిద్ధం. నా వ్రతానంతరం నా శరీరాన్ని నీకు నైవేద్యంగా అర్పిస్తున్నాను.

క. ఈ మాట న్పొర పొచ్చెము
లేమికి నీశ్వరుఁడ కరి నిలింపవిరోధీ!
నామెయి మేదోమయ దృ
ప్తామిషములు మెసవు మన్న, నతఁ డను నార్తిన్. 53

నిలింప విరోధీ = దేవతలకు శత్రువా; ఈ మాటన్ ; పొరపొచ్చెము = పొరపాటు; లేమికిన్ = లే కుండుటకు; ఈశ్వరుడు = భగవంతుడే; కరి = సాక్షి; నామెయిన్=నాశరీరంలో; మేదోమయ = మెదడుతో నిండిన; దృప్త = క్రొవ్వెక్కిన; ఆమిషములన్ = మాంసమును; మెసవుము = తిను; అన్నన్ = అంటే; ఆర్తిన్ = బాధతో; అతఁడు+అనున్ = అతడు అంటున్నాడు.

రాక్షసోత్తమా! నేనన్న మాటలో అబద్ధమేమీ లేదు. దానికి భగవంతుడే సాక్షి. నా శరీరంలో మెదడు - క్రొవ్వు- మాంసం కడుపారా తిను.

24 లో బంబోతు- 40 లో మేన్వెంచి = లాంటిది మేదోమయదృప్తా మిషకాధారం.

శా. "ఎట్లా, యి ట్లగునయ్య పల్క దయలే? కిన్నాళ్లు నీ కూడె యీ
పొట్టం బెట్టి, మహాఘలబ్ధిఁ దనువుం బోషించి, యెన్నాళ్ల కే
నట్లైనొక్కతపస్వి యొక్కవ్రతి రాఁడే, చూడఁడే, తత్కృపన్
బుట్టు న్నీఁగెద దీని,నా నొదవి,యో పుణ్యాత్మ యెట్లంటివే! 54

ఎట్లా = ఎలాగా!; ఇట్లు+అగునయ్య = అయ్యా! ఇలా అవుతుందా? దయలేక= దయలేకుండా; వల్కన్ = అనటానికి; ఇన్నాళ్ళు = ఇన్నిరోజులు; ఈ కూడె= ఈ అన్నమే; ఈపొట్టం పెట్టి = ఈ పొట్టకు వేసి; మహా+అఘ+లబ్ధిన్ = పెద్ద పాపం పొందటంవల్ల; తనువున్ = శరీరాన్ని; పోషించి = పెంచి పెద్దచేసి, ఎన్నాళ్లకు+ ఏన్ = ఎన్నాళ్లకైనా (ఎప్పటి కయినా); ఎట్లైన్= ఎలాగైనా; ఒక్కతపస్వి = ఒక ఋషి; ఒక్క వ్రతి = ఒక్క వ్రతస్థుడు; రాడే = రాడా!; చూడడే = నన్ను దయచూడడా! తత్ = ఆ; కృపన్ = దయతో; దీనిన్+పుట్టున్ = ఈ జన్మను; ఈఁగెదన్ = పోగొట్టుకొంటాను; నాన్=అని; అనుకొంటూ ఉండగా; ఒదవి = లభించి; ఓపుణ్యాత్మా = ఓమహాత్ముడా; ఎట్లు+అంటివే = ఏమన్నావయ్యా!

పుణ్యాత్మ ! ఎంత మాటన్నావయ్యా. అంత దయచూడదగనివాడనా? ఇన్నాళ్లు ఈ పాడు తిండితోనే కదా పొట్టను నింపుకొని ఈ శరీరాన్ని పోషించుకొన్నది? ఎన్నాళ్ళకైనా ఒక తపోధనుడు, ఒక వ్రతసంపన్నుడు రాడా, దయ చూడడా అని ఎదురు చూస్తూ ఉండగా నీవు లభించావు. నేను తరిస్తాననుకొంటూ ఉంటే నీవిలా అనవచ్చునా?

విశే॥ జాలినింపే వాక్య విన్యాసం. ఎట్టూ అన్న ప్రారంభం- ట కారప్రాస- ఈ, ఏ లతో ప్రతి పదం ప్రారంభం కావటం- తన జీవన విధానం మీద రోతను వ్యంజిస్తూ, శ్రోతలో జాలిని గిలకొడుతున్నది.

క. మీవంటి భాగవతులుం
బావనులుగఁ జేయరేని మఱిగతి యేదీ
మావంటివారి కిఁక మా
యేవము వెనుకటిది చూడ కీక్షింపు కృపన్. 55

మీవంటి; భాగవతులన్ = భక్తులున్నూ; పావనులుగన్ = పవిత్రులుగా; చేయర+ ఏనిన్ = చేయక పోతే; మఱి = ఇక, మావంటి వారికిన్ = పాపాత్ములకు; ఏదీ గతి?; ఇక; వెనుకటిది = నీవు రాక పూర్వ మున్నట్టి; మా; ఏవము = అసహ్య జీవనం; చూడక= గణించకుండా; కృపన్ = దయతో; ఈక్షింపుము = చూడు.

మీవంటి మహాత్ములు మావంటివారిని దయచూడక పోతే మాకు గతి లేదు. వెనుకటి మా నీచవృత్తిని పరిగణించక దయచూడవయ్యా!

భగవంతుని దయాగుణమే భక్తుల్లోనూ ప్రతిఫలిస్తుంది. దానికై ఈ యాచన.

తే. ''స్వధితియైనను ద్విజుఁ దిన్న శస్త్ర మైన
సరియకాఁ గాంచనము చేయుఁ బరుసవేది
యీ యసాధారణన్యాయ మెన్న వలదె
మాదృశులచోటఁ గదియు భవాదృశులకు''. 56

స్వధితి = వజ్రాయుధం; ఐననున్ = అయినప్పటికీ; ద్విజున్ = బ్రాహ్మణుని; తిన్న = తినటానికి సాధనమైన; శస్త్రము+ ఐనన్ = కత్తియైనా; పరుసవేది = స్పర్శతో ఏ లోహాన్నైనా బంగారంగా మార్చే ఓషధి; సరియకాన్ = సమానంగానే; కాంచనము చేయున్ = బంగారుగానే మారుస్తుంది; ఈ; అసాధారణన్యాయము = విశేషన్యాయం; ఎన్నన్ వలదె= గణించదగ్గదికదా; మాదృశుల చోటన్= మాలాంటి వారి ప్రదేశాన్ని; కదియు = సమీపించే; భవాదృశులకున్ = మీలాంటి వారికి . (న్యాయమెన్న వలదా?)

దేవతాయుధమైన కత్తినీ, బ్రాహ్మణుని చంపి పాపం చేసిన కత్తినీ పరుసవేది సమానంగానే బంగారంగా పరిణమింపజేస్తుంది కదా! మీలాంటి మహాత్ములు మావంటి వారి విషయంలో అదే విశేష న్యాయాన్ని పరిగణించాలి కదా!

అలం : దృష్టాంతం.

స్వధితి- వజ్రాయుధానికి 20 పేర్లు. అందులో ఇదొకటి. దేవతల ఆయుధమని మోనియర్ విలియంస్- సంస్కృతాంగ్ల నిఘంటువులో ఇచ్చిన అర్థం. కనుక అది సామాన్యమైన కత్తి అన్న అర్థంలో ప్రయోగింపబడ్డదికాదు. అది లోకరక్షాధారమైనది. రెండోది పాపపంకిలమైనది. కానీ పరుసవేదికి ఉచ్చనీచభేదం లేదు. కథలో ఆపరుసవేది శ్రీమన్నారాయణుడు. ఆయనప్రతి నిధులు అళ్వార్లు - దాసరి.

తే. అనిన దేహార్పణము నొల్ల కార్తిఁ బలుకు
కృపణత కతఁ డభిప్రాయ మెద్ది యనిన,
''నిత్తుఁ దను వంట యనుకంప యే? మదాత్మ
కసటుఁ బాపుటయే యనుకంప గాక. 57

అనినన్; దేహ+అర్పణమున్ = శరీరత్యాగాన్ని; ఒల్లక = అంగీకరించక; ఆర్తిన్= వేదనతో; పలుకు = చెప్పే; కృపణతకున్ = దీనత్వానికి; అభిప్రాయము = భావం; ఎద్ది= ఏమిటి?; ఏది?; అనినన్; తనువున్ = శరీరం; ఇత్తును = ఇస్తాను; అంట = అనటం; అనుకంపయే = దయయే; మత్ = నా; ఆత్మకసటున్ = ఆత్మమాలిన్యం; పాపుటయే = పోగొట్టటమే; అనుకంపగాక = దయ యౌతుంది కాని.

రాక్షసుడలా అనగానే దాసరి అన్నాడు. దేహార్పణం వద్దనటంలో నీ ఉద్దేశ్య మేమిటి? అని రాక్షసు డన్నాడు.

''శరీర మివ్వటం దయా? కాదు. నా పాపాన్ని పోగొట్టటం- దయ కాని''-అని.

శా. ఘంటాకర్ణుని మించుకర్మ మొకొ నా కర్మంబు? మౌనీంద్రులం
దుంటల్సేయఁడె ? మాన్పి యీఁడె భగవంతుం డట్టి శ్రీ? యట్టి శ్రీ
కంటె న్భాగవతుండు మించ నొసఁగంగా లేఁడె? యా మేలు నా
కంటింప న్మఱి రాదె? పూజనము గాదా ప్రాణి మే ల్చక్రికిన్. 58

ఘంటాకర్ణుని; మించు = ఎక్కువైన; కర్మము+ ఒకొ = కర్మ-పాపకర్మా? నాకర్మంబు = నాకర్మ; మౌని+ ఇంద్రులన్ = మునిశ్రేష్ఠులను; తుంటల్ = ముక్కలు; చేయడె = ఘంటాకర్ణుడు చేయలేదా?; భగవంతుండు = శ్రీకృష్ణుడు; మాన్పి = అతని కర్మను పోగొట్టి; అట్టి = అంతగొప్ప; శ్రీ = మోక్షం; ఈడె = ఇవ్వడా?; అట్టి శ్రీకంటెన్= ఆ ఐశ్వర్యం కంటె; మించన్ = మిగులుగా; భాగవతుండు = భగవద్భక్తుడు; ఒసగంగాలేడె= ఇవ్వలేడా; ఆ మేలు = ఆ శుభం; మఱి; నాకున్; అంటింపన్ రాదె = అనుగ్రహించ కూడదా?; చక్రికిన్ = చక్రాయుధంకల స్వామికి; ప్రాణిమేల్ = ప్రాణుల శుభం; పూజనము= సేవ కాదా? అగును కదా.

నా పాపం ఘంటాకర్ణుని కంటె గొప్పదా? వాడు మునులనే తిన్నవాడు. అలాంటి పాపాన్ని కూడా చూడక భగవంతు డతనికి శుభాన్ని కల్గించాడు కదా! అలాంటి శ్రీకంటె భాగవతు డివ్వలేడా? నాకూ అలాంటి మేలు కల్గించలేవా ? ప్రాణులను రక్షించుటకు స్వామి సేవే కదా!

అలం : అర్థాంతరన్యాసము.

విశే ॥ ఘంటాకర్ణుడొక రాకాసి. అతనికి శ్రీకృష్ణుడు ఇంద్రపదవి ఇచ్చినట్లు హరివంశ కథ. భాగవతుడు భగవంతుని కంటె మహాత్ముడు.

వ. అనిన విని మాతంగుం డా తెఱం గే తెఱంగైన సంగతం బగు ననిన, నాతం''డే నొక్క బ్రహ్మరాక్షసుండఁ, గుంభజాను సంజ్ఞుండ, నుగ్రకర్ముండనై, యీన్యగ్రోధం బాశ్రయించి వంచనం బథికపంచజనచర్వణంబు సేయుచుండుదుం. పూర్వంబున సోమశర్మ యను భూబర్హిర్ముఖుండఁబ్రాగ్జనిద్విజుండఁ గాన దయనీయుండన; యొక్క దుష్కరంబున నిట్లైతి. నీవు కైటభారిం బాడిన నేఁటి పాటఫలంబు సజలంబుగా నాకిచ్చి తేని బీభత్సకుత్సార్హంబగు నీజన్మంబు వేఁగు, నీకు నార్త రక్షణంబున నగు సుకృతం బనంతంబు సిద్ధించు, నత్యంత ధర్మసాధనం బగు నిమ్మేను నిల్లుసేరు''ననిన, నమ్మేని మాటలకుఁ గలకల నవ్వి యవ్విష్ణుదాసుం డిట్లనియె. 59

మాతంగుండు = పంచముడైన దాసరి; ఆ తెఱంగు = ఆ విధం; ఏ తెఱంగు+ ఐన = ఏ విధంగా; సంగతంబు+అగున్ = కలుగుతుంది?; కుంభజాను = కుండల్లాగా ఉన్న మోకాళ్ళు కలవాడు; సంజ్ఞుండన్ = పేరుకలవాడను; ఉగ్ర = క్రూర; కర్ముండు = చేష్టలు కలవాడు; న్యగ్రోధంబు = మర్రి; వంచనన్ = మోసంతో; పథిక = బాటసారులైన; పంచజన = మనుష్యులను; చర్వణంబు = నమలటం; భూబర్హిర్ముఖుండన్ = భూసురుడను; ప్రాక్ + జనిన్ = పూర్వజన్మంలో; ద్విజుండన్ = బ్రాహ్మణుడను; దయనీయుండన = దయచూపదగ్గవాడినే; దుష్కర్మంబునన్ = పాపకర్మవల్ల; కైటభారిన్=కైటభ శత్రువైన శ్రీహరిని గూర్చి; సజలంబుగన్ = జలధారాపూర్వకంగా; బీభత్స = జుగుప్సావహమైన; కుత్స = నిందకు; అర్హంబు + అగు = తగిన; వేఁగున్ = తెల్లవారుతుంది; ఆర్తజన = బాధితులయొక్క; రక్షణంబునన్ = రక్షించటంవల్ల; అత్యంత = మిక్కిలి; ధర్మసాధనంబు = ధర్మానికి ఆధారమైన; ఇల్లు సేరున్ = విశ్రాంతి పొందుతుంది; ఆ మేని మాటలకున్ = ఆ శరీర విషయకమైన మాటలకు.

ఇల్లు చేరటం చాలా అందమైనమాట స్వస్థానం ఇల్లు. నోవాలిస్ అన్న పాశ్చాత్య తత్త్వవేత్త అన్నాడు. తత్త్వమంటే ఇంటిబెంగ. సర్వత్ర గృహభావన చేయుట' మని' .ఇల్లంటే ఆత్మ ; విశ్రాంతి స్థానం.

క. ఇటువంటివి యిట కెక్కుడు
నిట దిగుడువి యొంద నెన్ని యే, నిదియును నొ
క్కటి యొకనాఁటిద కా దొక
త్రుటి గీతఫలంబు నొసఁగుదునె యిమ్మెయికిన్. 60

ఏనున్ = నేను; ఇటువంటివి = ఇలాంటివి; ఇటకున్+ ఎక్కుడు = ఇంతకంటె ఎక్కువైనవి;

ఇటన్ దిగుడీవి = ఇంతకంటె క్రిందివి; ఎన్నియేన్ = ఎన్నో; ఒందను = పొందనా?; ఇదియునున్ + ఒక్కటి = ఇది కూడా ఒకటి ( ఆ వరుసలో); ఒక నాటిద కాదు= ఒకనాటిది కాదు; ఒక త్రుటి = ఒక క్షణం; గీతఫలంబున్ = గానఫలాన్ని; ఇమ్మెయికిన్= ఈ శరీరం కోసం; ఒసఁగుదునె? = ఇస్తానా?.

జని సాహస్రబహుళ ప్రయాణమగు సంసారంపు త్రోవన్- బాటసారి పాంథుడు. కనుక ఎన్ని జన్మలు - ఎన్ని రకాల దేహాలు- పొందలేదు. ఈ ప్రస్తుత జన్మ అందులో ఒకటి. దీని కోసం పరమేశ్వర గానఫలాన్ని ఎలా దానం చేసేది?

విశే ॥ దాసరి చిత్తస్థాయిని చెబుతున్నది.

''ఆత్మకానిమేన ఆత్మబుద్ధి, అస్వంబునందు మిగులస్వత్వబుద్ధీ'' అవిద్యాలక్షణమని ఖాండిక్యకేశిధ్వజ సంవాదంలోమాట. దాసరి అవిద్యాబుద్ధుడు కాదు కనుక ఈమాటన్నాడు.

సీ. దిక్పాలతను వెత్తి తిరిపతనువుఁ దోన
యెన్ని మార్లెత్త మీయేను నీవుఁ?
గేసరి తను వెత్తి కీట తనువుఁదోన
యెన్ని మార్లెత్త మీ యేను నీవు?
మాతంగ తనువెత్తి మశక తనువుఁ దోన
యెన్ని మార్లెత్త మీ యేను నీవు?
ధరణీశ తను వెత్తి దాస తనువుఁ దోన
యెన్ని మార్లెత్త మీ యేను నీవు ?

తే. సోమయాజుల మెన్ని మార్లౌగము, శ్వపచ
ఖగకులుల మెన్నిమాఱులు గాము, పాము
గాములము నెన్ని మాఱులు గాము, వెండి
కంసరిపుభక్తుల మొకండె కాము గాని. 61

ఈ; ఏనున్; నీవున్ ; దిక్పాల తనువున్ = దిక్కులకు పాలకులైనవారి శరీరం; ఎత్తి = ధరించి; తోన = వెంటనే; ( మరుజన్మలో) తిరిప తనువున్ = బిచ్చగాని దేహము; ఎన్ని మార్లు; ఎత్తము = ధరించము.

కేసరి తనువు = సింహదేహము; కీట తనువు = పురుగు శరీరం;మాతంగ తనువు = ఏనుగు రూపం; మశకము = దోమ; ధరణీ+ ఈశ = రాజు; దాస = దాసుడు; సోమయాజులము = సోమమన్న యజ్ఞం చేసినవారము; శ్వపచ = కుక్కమాంసం తినేవాడు; ఖగ = పక్షి; కులులము = జాతివారము; పాము, గాము = గ్రహం; వెండి = కానీ; కంసరిపు = శ్రీ కృష్ణస్వామి; భక్తులము; ఒకండె = ఒక్కటే; కాముగాని= కాలేదు తప్పు. పై జన్మలన్నీ ఎత్తుతున్నాం కదా.

అన్ని పాదాల్లోనూ ఉత్తమ- అధమ జన్మలను వర్ణించటం గమనించాలి. మానవ జీవితంలో హెచ్చు- తగ్గులన్నీ తను సంబంధాలు కనుక ఏతపు కుండల గొలుసులాగా పైదే క్రిందిదిగా, క్రిందిదే పైదిగా తిరుగుతున్నట్లు జీవుడూ ఇంతే - ఇది భారతీయ జీవన మూల ద్రవ్యం.

ఆ. ఊంతనీరు చెలఁది నేఁత మూటాయిటి
దూది యెండపసుపు దొఱ్ఱియక్క
రంబు మేను, దీని రహిఁ బుణ్య మమ్ముట
కప్పురంబు వెట్టి యుప్పు గొనుట''. 62

మేను = శరీరం; ఊతనీరు = చేపలను బట్టే ఒక విధమైన బుట్టలో నీరు (జారి పోతుంది తప్ప నిలువదు); చెలఁది నేత = సాలెపురుగు దారాలతో కట్టిన మూట; ఆయిటి దూది = బూరుగు దూది (గాలికెగిరిపోవు దూది అని వ్రాతప్రతివ్యాఖ్య); ఎండ కాలములో గాలిలో పెట్టిన దూది (వావిళ్ల); చెలది నేతమూటాయిటి దూది- సాలెపురుగు నేసిన నేతలో ముడిచిపెట్టిన బూరుగుదూది (వేదం); ఎండ పసుపు = ఎండలో పెట్టిన పసుపు (నల్లబడుతుందని); తొఱ్ఱి యక్కరంబు = బోసినోటి వాడుచ్చరించిన అక్షరం- (పురుగు తిన్న అక్షరమని కొందఱందురు - వావిళ్ళ); దూలములో పురుగు తిన్న అక్షరము- వేదం; శాసనాల్లో అక్షరాలు విరిగి-చెరిగి పోతాయి. అలాంటి అక్షరం; విషయం బోధపడని (వ్రాత); దీని రహిన్ = దీని మీది ప్రేమతో; పుణ్యమున్ = గీతఫలము; అమ్ముట = అమ్ముకొనుట; కప్పురంబు పెట్టి = కర్పూరం వెలగా పెట్టి; ఉప్పు గొనుట = ఉప్పు కొనటం (వంటిది).

శరీరం క్షణభంగుర మనటానికి పోలికలు- (1) ఊతలో నీరు (2) చెలది నేత మూట (3) ఆయిటి దూది (4) ఎండ పసుపు (5) తొఱ్ఱియక్కరము- కనుక దీనిని నమ్మి ఆధ్యాత్మిక ఫలాన్ని అమ్ము కోవటం కర్పూర మిచ్చి ఉప్పు కొనటం.

అలం : నిదర్శన.

పూతనీరు - (పాఠాంతరం) బంగారపు పూత ( నీరద్దటం అని వ్యవహారం). పూత పసిండివంటి వలపు- అని మనుచరిత్ర. సామాన్యంగా బుద్బుదమే ఉపమానంగా చెప్పటముండగా ఈ పోలికలు ఎంతో నూత్నములు.

వ. అనిన దనుజుం డిట్లనియె. 63

అనినన్ = అనగానే; దనుజుండు = రాక్షసుడు; ఇట్లనియెన్

క. ''సంగీత ఫలంబునఁ గో
సంగీ! సగమైనఁ దయ పొసఁగ నీవే; మీన్
మ్రింగిన గ్రుక్క న్వారిధి
కిం గొఱఁతయె? కొదయె విష్ణు కీర్తన'' కనినఁ. 64

గోసంగీ = దాసరీ; సంగీత ఫలంబుననన్ = కైశికీ గానఫలంలో; దయపొసఁగన్ = కృప అమ రేటట్లు; సగమైనన్; ఈవే = ఈయవే; మీన్ = చేప; మ్రింగిన= త్రాగిన; గ్రుక్కన్ = గ్రుక్కతో; వారిధికిన్ = సముద్రానికి; కొఱతయె = తక్కువా, విష్ణుకీర్తనకున్ = శ్రీహరి సంకీర్తనకు; కొదయె = తక్కువా?;

దాసరీ! కైశికీ గాన ఫలంలో సగమైనా దారపోయవా? చెప మ్రింగిన గ్రుక్కతో సముద్రం వట్టి పోతుందా? శ్రీహరి సంకీర్తనకు కొదవ ఏర్పడుతుందా?

అలం : ప్రతి వస్తూపమ.

శా. ''ఏలా నొంచె దదేహ? మిట్లడిగి, యెంతే బాస మేనం బలం
బో, లీలావటు గీత కీర్తన ఫలం బో, నీయెడ న్మున్ను? పా
తాళప్రశ్నలు మాని మే న్గొనుము; బేతాళ చ్ఛలోక్తిః రుషం
దూలింపం దలఁతేని, పుట్టు మఱి నూతుద్రవ్వ బేతాళముల్. 65

ఏలా = ఎందుకు; అదేహమున్ = ( ఆత్మను) దేహం కాని దానిని; అడిగి; నొంచెదు = బాధిస్తావు; మున్ను = ముందు; బాస = ప్రతిజ్ఞ; నీయెడన్ = నీ విషయంలో; ఎంతేన్ = ఎంతైనా; మేనన్ = శరీరంలో; పలంబో = మాంసమా; లీలావటు = వామనమూర్తి; గీత = పాట; కీర్తన ఫలంబో = కీర్తించిన ఫలమో; పాతాళప్రశ్నలు = లోతులను తరిచే తర్కం; మాని = వదలి; మేన్ = శరీరం; కొనుము= తీసుకో; భేతాళచ్ఛల+ ఉక్తిన్ = మీభేతాళ జాతికి సంబంధించిన వంకరటింకర మాటలతో; రుషన్ = కోపంతో; తూలింపన్ = మోసగించటానికి; తలంతు+ ఏని = ఆలోచిస్తావేమో; మఱి; నూతుల్ త్రవ్వన్ = బావిత్రవ్వితే; బేతాళముల్ పుట్టున్ = బేతాళాలు పుడతాయి.

అనవసరంగా దేహంకాని దాన్నడిగి నన్ను బాధించకు. నీకు నేనిస్తానన్నది శరీరమా? పుణ్య ఫలమా? నీ వడిగినదే కదా నీ కిస్తానన్నది. పాతాళం దాకా దిగే ప్రశ్నలు మాని శరీరం తీసుకో. రాక్షస మాయ మాటలతో నన్ను మోసం చేద్దామనుకోకు. బావి త్రవ్వబోతే బేతాళం పుట్టిందన్న సామెతగా చేయకు

అలం : - విషమ

విశే ॥ అదేయము = ఇవ్వరానిది (వావిళ్ల).

ఈ పాఠానికి అదేహ మన్నది- పాఠాంతరంగా వేదం కానీ - వావిళ్ల కానీ పేర్కోలేదు. కానీ వేదం వారిపాఠమిదే.

వ. అనిన సొలకటంకటేయుండు సొలఁగటకటంబడి, కార్యేచ్ఛం గన్నీరు గ్రుక్కుకొని ''కటకటా! కైటభారి కనుంగులగు డింగరీలు దయాళువులు గావలవదే? తొల్లి దర్శన ప్రవర్తకుండై వైయాసికంబు లగు సూత్రంబులు వివరించి విష్టరశ్రవు నద్వైతవైశిష్ట్యంబుఁ బ్రతిష్ఠించిన లక్ష్మణాఖ్య యోగీంద్రుండు, చిరకాలసేవా సంతుష్టుండై నిజదేశికుం డగు పూర్ణాహ్వయుం డనధికారుల కీకు మని విధియుక్తంబుగాఁ దనకుఁ బ్రసాదించిన గీతాచరమార్థంబుఁ గృపాతరంగితుండై రంగేశధామదామోదరనామ

చామీకరగోపురం బెక్కి, యుచ్చైస్స్వనంబున నుచ్చరించిన గురుం డలిగిన, "దేవా! దేవరయాజ్ఞ మీఱి యే నొక్కరుండ రౌరవంబునం బడుట మేలో? భాగవతపరిషత్తునకుఁ బరమపద మగపడుట మేలో?" యని వితర్కించి నీ వుచ్చరించుట గా నుచ్చరించితి" నని తదభినందితుం డయ్యె, నతండ నిజచ్ఛాత్ర సత్త్రంబునకుఁ బ్రత్యహంబును గల్యంబున మూల్యం బొల్లక గవ్యంబు సమర్పించి వేఁడిన వల్లవీ వల్లవులకుఁ బరమ పదంబుఁ బ్రసాదించె; నతండ బంధముక్తుం డయ్యు నవతారాంతరంబునఁ గాలాంతరంబున సంకుచితజ్ఞానులై విషయపరు లగు నరులకుం బరమునందలి తీపొదవ సుందర జామాతృ నామంబున నర్చిరాది గతి విశదీకరించె; నతండ యిటమీఁద యాదవగిరి టెంకణంబు పాషండ సంకులంబుగా వచ్చినఁ దచ్ఛృతికి శఠకోపసమాఖ్య సంభవించి నీరంధ్ర వాదంబున నంధ్రాదివిషయ విద్వజ్జనంబుల నధోక్షజవిషయవాద భిక్ష వేఁడి దిగ్విజయంబు సేసి గరుడకుధర గుహోకంఠ నృకంఠీరవంబు కుహనాత్రిదండియై బ్రుసీ కుసుంభాంబరాంభః కుండిక లోసంగ నంగీకృతాంతి మాశ్రముండై, ఫణిప, కణభు, గక్షపాద, బాదరాయణ, కపిల, జైమిని శాసనంబులు మత మహానస మహీసురులు మున్నుగా నెంతేవాసి నంతేవాసులకుఁ దెలివి పఱుపం బరమహంసానుష్ఠాన పరాకాష్ఠయై, పదయుగ ప్రపన్న భువన ప్రపంచ పంచజన హృదయ భవనంబులం బద్మాపద్మాక్షులు పల్లేర్లు దుడిచి పాడెక్క భక్తి బోధించి భూతలంబునఁబావనంబు సేయంగలవాఁడు; మఱియు హయవదన పదారాధకుండై వేంకటేశుండను నింకొక్క మనీషి మధుమథనమత ప్రతిపాదకం బగు ప్రబంధశతంబు రచించి శిలోంఛ వర్తనంబునం దపంబు సేయం దనకు జరచ్ఛదన శాకదానంబుసేయు నగస్త్యోర్వీరుహంబునకు నిర్వాణంబొసంగం గలం; డిట్టి యేష్యంబులు మదీయ దివ్యబోధంబున నెఱింగియుండు దేశాదృశం బగుత్రై కాలిక జ్ఞానంబు కలిమి నిమ్మెను మాననీయంబు గదా యంటేని యది జాత్యంబు దక్కఁ దపశమదమాది లబ్ధంబుగాదు; నిషాది భవిష్యదర్థంబులఁ జెప్పుచున్నది, అది శుచియే? కౌశికంబు, డబ్బగాటి, గబ్బులుఁగు, గౌళి, కనుంబెంటి పైఁడికంటి లోనగు తిర్యక్కులు భావి ప్రయోజన సూచకంబులై యున్నయవి; యవి తపస్వులే? యట్లు మా విజ్ఞానంబును; నెట్లనిన నాస్తిక్యంబు వలన శాస్త్రంబు లెడ నధీతిబోధంబులు దక్క నాచరణ ప్రచారంబులు లేమి ధర్మంబు దూరం, బది నిమిత్తంబుగా నిత్తెఱం గెఱుంగక భవోత్తారకంబు గాదు, గావునఁ గలుష రహిత కాయంబునంగాని కల్యాణంబు లబ్ధంబుగాదు, గాఁబట్టి యిప్పిరూపవిగ్రహం బనుగ్రహంబున నుడిపి కృతార్థుం జేయు; మని పాదంబుల వ్రాలి పాటం బాతిక పాలేని యీవే యనిన, నతండదియును నీలేనన్నఁ బోనిమ్మి ప్రభాత సమయంబునం బాడిన చరమగీతంబైన నిచ్చి ప్రసన్నుండ నగు నన్నవిపన్నుం జేయు,మని లేవకున్నం బరమదయార్ద్రుండై, 'యట్ల కానిమ్ము లెమ్మని యతని లేవనెత్తి, యత్తనుప్రాప్తి ప్రకారంబు సవిస్తరంబుగాఁ జెప్పుమనిన నవధరింపుమని యప్పొలదిండి దుఃఖార్తుండై యిట్లనియె.

సాలకటంకటేయుండు = సాలకటంకట యన్న రాక్షసి సంతానం (హేతి అన్న ఆదిమ రాక్షసుని కుమారుడు విద్యుత్కేశుని భార్య - ఉత్తర కాండలో ఆ కథ ఉంది); కటకటంబడి = దుఃఖించి, కార్య+ ఇచ్ఛన్ = పనిమీది కోర్కెతో; అనుంగులు = ప్రేమ కలవారు; డింగరీలు = శిష్యులు; దయాళువులు = దయగలవారు; దర్శన ప్రవర్తకుండు=మతప్రవర్తకుడు; వైయాసికంబులు = వ్యాసరచనలైన; సూత్రంబులు = బ్రహ్మసూత్రాలు; విష్టరశ్రవు = నారాయణుని; అద్వైత వైశిష్ట్యంబున్ = విశిష్టాద్వైతాన్ని; లక్ష్మణ+ఆఖ్య = లక్ష్మణుడన్న పేరుగల, యోగీంద్రుండు = యోగివర్యుడు (శ్రీరామానుజస్వామి); చిరకాల = దీర్ఘకాల; సేవాసంతుష్టుండై = అర్చనతో తృప్తిపడ్డవాడు; నిజ = తన, దేశికుండు=గురువు; పూర్ణాహ్వయుండు = పూర్ణులన్న పేరుగలవారు (పెరియనంబి - అని ద్రావిడ నామం); అనధికారులు = అయోగ్యులు; విధియుక్తముగాన్ = శాస్త్రప్రకారంగా; గీతాచరమ+అర్థంబున్ = గీత చివరి శ్లోకంలోని చివరి సగం తాత్పర్యం; కృపాతరంగితుండై = దయతో గిలకొట్టిన హృదయం కలవాడై; రంగ+ ఈశధామ= శ్రీరంగేశ్వరుని ఆలయం; దామోదరనామ = దామోదరమన్న పేరుకల; చామీకర = బంగారు; ఉచ్చైస్స్వనంబునన్ = ఎలుగెత్తి; ఉచ్చరించినన్ = చెబితే; దేవరయాజ్ఞ = స్వామివారి అనతి; భాగవత పరిషత్తు = భక్తుల సమూహం; పరమపదము = వైకుంఠం; రౌరవంబు = నరకం; వితర్కించి = చర్చించి; నీవు ఉచ్చరించుటగాన్ = మీరేచెప్పినట్లుగా; తత్+అభినందితుండు + అయ్యెన్ = గురువుచేత మెప్పు పొందిన వాడైనాడు; అతండ = రామానుజుడే; నిజ = తన ; ఛాత్రంబు = శిష్యుల; సత్రంబునకున్ = కూటమికి; ప్రతి+అహంబును = ప్రతిరోజు ; కల్యంబునన్ = ఉదయం; మూల్యంబున్ = వెల; ఒల్లక = తీసుకోక; గవ్యంబు = ఆవుపాలను; శిల+ ఉంఛ వర్తనంబునన్ = రోళ్ళదగ్గర రాలిన గింజల నేరుకొని జీవించటమన్న వృత్తితో; జరచ్ఛదన = పండుటాకులు ; శాకదానంబు = కూరనిచ్చే; అగస్త్య + ఉర్వీరుహంబునకున్ = అవిసె చెట్టుకు; నిర్వాణంబు=ముక్తి; ఏష్యంబులు = భవిష్యద్విషయాలు; దివ్యబోధంబు = దివ్యదృష్టి; ఏతాదృశంబు = ఇలాంటి; త్రైకాలిక జ్ఞానంబు = త్రికాలసంబంధమైన తెలివి; మాననీయంబు = గౌరవించదగ్గదే; జాత్యంబు = జాతిసంబంధం; తపః = తపస్సు; సత్యవ్రతానుష్ఠానం; శమదమ + ఆది = అంతరింద్రియ బహిరింద్రియ జయము మొ॥ గు; లబ్ధంబు = పొందినది; నిషాది = ఎరుకత; శుచియే = పవిత్రురాలా; కౌశికంబు= గూబ; డబ్బుగాటి = పక్షివిశేషం; గబ్బులుగు = గంపపిట్ట; గౌళి = బల్లి; కనుంబెంటి; పైడికంటి పిట్ట; తిర్యక్కులు = పక్షులు; భావి = భవిష్యత్తును; సూచకంబులై = సూచించేవి; తపస్వులే = తపోవంతులు కావు కదా; నాస్తిక్యంబువలనన్ = ఆత్మ లేదన్న వాదంవల్ల; శాస్త్రంబుల + ఎడన్ = శాస్త్రాలపట్ల; అధీతి = చదవటం; బోధంబులు = చెప్పటం; ఆచరణ = జీవితంలో అమలు పెట్టటం; ప్రచారంబులు = పదిమందికి చెప్పటం; దూరంబు = దూరం; అనిమిత్తంబు = అకారణంగా; భవ = జన్మను; ఉత్+ తారకంబు = తరింపజేసేది; కలుషరహిత = పాపంలేని; కాయంబునన్ = శరీరంవల్ల; కళ్యాణంబు = శుభం; లబ్ధంబు కాదు = దొరకదు; ఈ విరూప = కురూప; విగ్రహంబు= శరీరం; అనుగ్రహంబునన్= దయతో; ఉడిపి = పోగొట్టి; కృత+అర్థున్ = నెరవేరిన ప్రయోజనం కలవానిగా; పాతిక పాలు = నాల్గోవంతు; ఈవే = ఇయ్యవా?; అదియున్ = ఆ పాతికపాలు; ఈ ప్రభాత సమయంబునన్ = ఈ వేకువ జామున; చరమ గీతంబు= చివరిపాట; ప్రపన్నుండన్ =

శరణన్న వానిని; అవిపన్నుం జేయుము = ఆపదలేనివాని గావించు; పరమ = గొప్ప; దయా(ర్ద్రాడై = కృపతోమెత్తబడిన వాడై; అట్ల కానిమ్ము = అలాగే కానివ్వు; ఆ తను(ప్రాప్తి = ఆ రాక్షస శరీరం లభించిన; ప్రకారంబు = విధం; పొలదిండి = పొలసు = మాంసం; తిండి = ఆహారంగా కలవాడు (రాక్షసుడు); దుఃఖ +ఆర్తుడై = శోకంతో ఆవటిల్లి.

ఇందులో ప్రస్తావింపబడ్డ ఆచార్య పరంపర.

1. శ్రీమ(ద్రామానుజముని 2. శ్రీ సుందర జామాతముని 3. శఠకోప యతీం(ద్రుడు 4. శ్రీ వేదాంతదేశికులు.

తర్వాతివారు మొదటివారి అవతారాలుగా చెప్పటం తత్ ప్రతిష్ఠిత సం(ప్రదాయ వ్యాఖ్యలు కనుక- శ్రీ వైష్ణవ సం(ప్రదాయంగా గుర్తించాలి.

వేదాంత దేశికులు శ్రీ విద్యారణ్య యతీం(ద్రుల సహపాఠి- అంటే బుక్కరాయల కాలం నాటివారు. శఠకోపయతి అల్లసాని వారి గురువు కనుక శ్రీకృష్ణదేవరాయల కాలం నాటివారు.

అప్పొలదిండి దుఃఖార్తుండై- ఈ వాక్యం నుండి సప్తమాశ్వాసంగా వేదంవ్యాఖ్య. దీనికాధారం శ్రీ గట్టుపల్లి శ్రీనివాస వ్యాఖ్య.

ఉ. ఉండుదుఁ జోళభూమి నొకయూరఁ గళల్ పదునాల్గు నేర్చి, వా
క్చండిమఁ జర్చ గెల్తు ఘటశాసుల, శ్రౌతులఁ దప్పు వట్టుదు౯,
ఖండల ముష్టి విప్పఁ గని నవ్వుదు, వెండి ప్రయోక్తల౯ సుధీ
మండలి గ్రాంథికత్వ మవమానము సేయుదు జల్పవాదినై. 67

చోళభూమిన్ = చోళదేశంలో; ఒక ఊరన్ = ఒక గ్రామంలో; కళల్ పదునాల్గుః పదునాలుగు విద్యలు; నేర్చి; ఉండుదున్; వాక్ చండిమ = తీవ్రతర్కంతో; ఘటశాసులన్ః ఘటం-పటం-అంటూ వాదించే తార్కికులను; చర్చన్ = వాదంలో; గెల్తున్; శ్రౌతులనుః యాగవిధి నిషేధాలు తెలిసిన శ్రుతివేత్తలను; తప్పువట్టుదున్; ఖండలముష్టిన్ఃగర్భాదానాది కర్మసంబంధ గ్రంథం; విప్పన్ = తెరిస్తే; నవ్వుదున్; వెండిః ఇంకా ; ప్రయోక్తలన్ = యాగవ్రతాదులను జరిపించే; సుధీమండలిన్ = పండిత సమూహముయొక్క; గ్రాంథికత్వమున్ = గ్రంథపాండిత్యం; అవమానము సేయుదున్ః అపహాస్యం చేసేవాడిని; జల్పవాదినై = వాదంకోసం వాదం చేయటం (జయార్థం ప్రకటించే తర్కం).

చోళదేశంలో ఒక ఊరిలో ఉంటూ, వాద జయార్థమై పండితులను తప్పులు పట్టుకొంటూ, తార్కికులతో వాదిస్తూ, శ్రౌతస్మార్త వేత్తలను అవమానం చేస్తూ ఉండేవాడిని.

చోళభూమి - కథారంగం పాండ్యదేశం. రాజధాని మధుర. చోళరాజధాని తంజావూరు, పల్లవరాజధాని కాంచీపురం. పూర్వకాలంలో ఆయాశాస్త్రాల పండితులు, కళలు-విద్యలు వేరైనా ఒకటిగానే పేర్కొనటమున్నది.

ఘటశాసులు = ఘటికాస్థానా(గురుకులాలు)చార్యులని శాసనశబ్దకోశం. (చూ. కాకతీయవైభవం. పుట 81)

వ. ఇన్నడవడిం బ్రభిన్న గండం బగు వేదండంబునుం బోలె మదాంధుడనై, యల్ప విద్యాలబ్ధి విడువ ముడువ వేసరని వీసంబుగల రెడ్డియుంబోలె, నప్పుడువె పరబ్రహ్మంబై, పెద్దలం జెనకి యోడియు సరి య్యైతి ననియును, సరిపోయి జయించితి ననియు, నబద్ధంబు లాడి చిల్లర ప్రభువులం భ్రమియించుచుండి, దీక్షితులం జూచి యియక్ష వొడమి ద్రవ్యభిక్షార్థినై మధురకుం బోయి యప్పురంబున 68

ప్రభిన్న గండంబు = మదం స్రవించే దవుడలు గల; వేదండంబు = ఏనుగు; మద+ అంధుండను = గర్వంతో కళ్ళుమూసుకొని పోవటం; అల్ప = కొంచెం; విద్యాలబ్ధిన్= చదువు లభించటంవల్ల; విడువన్ = విప్పటానికి; ముడువన్ = ముడివేయుటానికి; వేసరని = విసువు లేని; వీసంబు = స్వల్పనాణెం (డబ్బు); రెడ్డి = గ్రామాధికారి; పరబ్రహ్మంబు = పరమాత్మ; పెద్దలన్ = పండితులను; చెనకి = కవ్వించి; చిల్లర ప్రభువులన్=స్వల్పమండలాధిపతులను (మహా చక్రవర్తులు కానివారిని); దీక్షితులు= యజ్ఞం చేసినవారిని; యియక్ష = యజ్ఞం చేయాలన్న కోరిక; ద్రవ్యభిక్ష+అర్థినై = డబ్బు యాచించాలన్న కోర్కెతో; మధుర = పాండ్యరాజధాని.

అల్ప పండితుల నడవడి వర్ణింపబడింది. వీరిని చేరదీసేవారు చిల్లర ప్రభువులు (మహా చక్రవర్తులు విష్ణుచిత్తులవంటి వారినాదరిస్తున్నారు. ఈ భేదం పరిగణించాలి).

సీ. బహిష్కృతద్విజున కల్పపుఁ బాచితం బిడి,
పసిఁడికై తా వాని బంతిఁ గుడిచి,
కలసి వణిక్పురోధలతోడఁ బుణ్యాహ
ముల బియ్యములకునై మొత్తులాడి,
శశిరవిగ్రహ జపస్నానాదికము లెల్ల
దొరల వాకిండ్లకే దొర్ల యిచ్చి,
పచ్చిఱ్ఱితో ల్బఱ్ఱె చుచ్చాల మెట్లంది,
కొనఁ దాన యూరెల్లఁ గుత్తవట్టి,

తే. దర్భపోటులఁ దిని, లేని తఱుల మైత్రి
నంటి పితృశేషము భుజించి, యదియు నెడల,
నక్కవాడల నరకూళ్లు మెక్కి, మీఁద
వీనిశేఖర మొకతులార్త్విజ్యము కొని. 69

బహిష్కృత = వెలివేయబడ్డ; ద్విజునకున్ = బ్రాహ్మణునకు; అల్పపు = కొంచెం; పాచితంబు = ప్రాయశ్చిత్తం; పసిఁడికై = బంగారం కోసం; తాన్ = నేను; వాని బంతిన్ = వానిపంక్తిలో; కుడిచి = భుజించి.

వణిక్ పురోధలు = వైశ్యుల పురోహితులు; పుణ్యాహ వాచముల; బియ్యమునకై = బియ్యం కోసం; మొత్తులాడి = పోట్లాడి.

శశి = చంద్రుడు; రవి = సూర్యుడు; గ్రహ = గ్రహణ కాలంలో; జప = జపం; స్నాన = స్నానం చేయటం; ఆదిక = మొదలైన; ఎల్లన్ = ఫలాలనన్నీ తిని; దొరల= ప్రభువుల; వాకిండ్లకే = ద్వారబంధాలకే; దొర్లియిచ్చి = ధారపోసి.

చంద్రసూర్య గ్రహణ కాలంలొ చేయవలసిన జపాలు- స్నానాలు మాని చిల్లర ప్రభువులవాకిండ్లలో పడిగాపులు పడి.

పచ్చి; ఇఱ్ఱి = జింక; బఱ్ఱి = గేదె; చుచ్చాల = చర్మాల; మెట్లు = చెప్పులు; అందికొనన్ = గ్రహించటానికి; తాన = నేనే; ఊరెల్లన్; గుత్తవట్టి = గుత్తకు తీసుకొని.

ఆయా చర్మాలతో చేసే పాదరక్షల దానాలను గ్రహించటంకోసం ఊరినంతా పాలికి తీసుకొన్నట్లు లోబరచుకొని

దర్భపోటులన్ = శ్రాద్ధభోజనాలు; లేని తఱులన్ = శ్రాద్ధభోజనాహ్వానం లేని రోజున; మైత్రిన్ = స్నేహంతో; అంటి = గృహస్థు నింటికి పోయే శ్రాద్ధభోక్తలతో పాటుగా; పితృశేషమున్ = శ్రాద్ధభోక్తలు తినగా మిగిలిన తద్దినపు కూడు; అదియున్ +ఎడలన్ = అదీలేనపుడు; అక్కవాడలన్ = పూటకూటిళ్లలో; అరకూళ్ళు = సగం తిండి ( పిసినారితనంతో); మెక్కి = తిని; మీదన్ = పైన; నీని శేఖరము = వీటన్నింటికి పైది; తుల +ఆర్త్విజ్యమున్ = తులాభార దానం.

ఆర్ద్ర కృష్ణాజిన దానం సర్వవ్యాధి నాశనం - ఆయుష్కరం. పాద రక్షాదానం సర్వలోకాల్లో చరించే పుణ్య ఫలదాయి.

దర్భపోటు - శ్రాద్ధ భోజనాన్ని దర్భలతో తాకిస్తారు. కనుక దర్భపోటనటం.

ఇవన్నీ పాపకృత్యాలు. భ్రష్ట బ్రాహ్మణ లక్షణాలు. దీనిఫలితమే బ్రహ్మరాక్షసజన్మ.

**ఉ. ఇట్లొనఁ గూర్చి వైశ్యునకు నిచ్చి, చన న్మఱి పుచ్చి, చౌకము**
**ల్వెట్టుచు, వడ్డి లెక్క లటు పెట్టుచు, ధారణ వాసికై కొదల్**
**వెట్టుచు, వాఁడు రేఁగి మఱి 'పెట్టుదుఁ బెట్టు' ననంగ, మిట్టఁ గూ**
**పెట్టుచు, నిట్లు పోరఁ, గనిపెట్టుచు, నొక్కరుఁ డుండి వెండియున్. 70**

ఇట్లు; ఒనఁగూర్చి = కూడబెట్టి; వైశ్యునకున్; ఇచ్చి = వడ్డీకిచ్చి; మఱి = తర్వాత; చనన్ = ఊరుపోవటానికి; పుచ్చి = విడిపించుకొని; చౌకముల్ = నాలుగురెట్లు; వెట్టుచున్ = లెక్కకట్టి (వడ్డిలెక్కలు); అటు = ఆరీతిగా; పెట్టుచున్ = లెక్క కడుతూ; ధారణవాసికై = గుర్తు లేడావల్ల; కొదల్ = తక్కువలు; పట్టుచున్ = ఎన్నుతూ; వాడున్= వాడూ; రేగి = పేట్రేగి; మఱి = ఇక; పెట్టుదున్; పెట్టను; అనంగన్; మిట్టన్ = రచ్చలో; కూపెట్టుచున్ = మొరపెడుతూ; ఇట్టు = ఈ విధంగా; పోరన్ = పోట్లాడుతుండగా, కనిపెట్టుచున్ = చూస్తూ; ఒక్కరుఁడు = ఒకానొకడు; ఉండి; వెండియున్ = తర్వాత.

ఈ పాపకృత్యాలతో సంపాదించిన డబ్బు ఒక వైశ్యుని దగ్గర వడ్డీ కిచ్చి- తర్వాత ఇంటికి పోవటానికి- వడ్డీ లెక్కలు కడుతూ- నాల్గేసి నాణాలుగా పొత్తిపెట్టి లెక్కలు చూచుకొంటూ- వ్రాతపత్రాలు లేనందున గుర్తున్నంతవరకూ తేడాలు చెబుతూ - ఇంకా నాకు డబ్బు రావాలని పోట్లాడుతుంటే వాడు కోపంతో విజృంభించి ఇస్తాను- ఇవ్వనూ అంటూ ఉంటే ఒక డిదంతా కనిపెడుతూ తర్వాత-

ధారణవాసి - బియ్యాన్ని రొక్కంలోకి మార్చుకోవటంలో వచ్చిన డబ్బు తేడా- అని పూర్వ వ్యాఖ్యాతలు. ధారణ = జ్ఞప్తి, అప్పు - అని నిఘంటువులు.

సీ. వెలివాడఁ బని క్రొత్త మలకడాల్గొని నూనె
యిడి తంగెడాకు గట్టెడు తహాతహా,
కూర్చంబుఁ గొఱిగించుకొని యుష్ణతోయంపు
టంగడిఁ దలయంటు కాడి తడవు,
వంట పూఁటింటి కెప్పంటికంటెను బాలు
పెరుగు నే గూర లంపెడు తెగువలు,
సంబెళ విదలించి తాంబూలదళ పూగ
నివహంబుఁ జాలఁగ నించు నుబ్బు,

తే. బ్రహ్మచారిభుజంబు మాత్రకు సడింపు
బ్రాలు, నాలికి మేలుచీరెలు, గొనియెడు
సంభ్రమంబును, బెఱపాంథజనులఁ బయన
మడుగు ప్రశ్నంబులను మత్ప్రయాణ మెఱిఁగి. 71

వెలివాడన్ = నగర బాహ్య మందున్న పేటలో; పని = పనితనంగల; క్రొత్తమలకడాల్ = క్రొత్త చెప్పులు; కొని = కొనుక్కొని; నూనెయిడి = నూనెరాసి (నిగనిగ కోసం); తంగెడు+ ఆకున్ = తంగెడు చెట్టు ఆకు; కట్టెడు = చెప్పులకు కట్టే (మెత్తదనం కోసం); తహాతహా = తొందర;

చెప్పులు కుట్టే వాళ్ళుండే పేట వెలివాడ. అక్కడ మంచి పనితనం గల కొత్త చెప్పులు కొని- నూనె పెట్టి తంగేడాకు కట్టే తొందర- క్రొత్త చెప్పు కరుస్తుంది కనుక మెత్తదనం కోసం ఆ ఆకు కట్టటం- నూనె రాయటం.

కూర్చంబు = గడ్డం; గొరిగించుకొని; ఉష్ణ = వేడి; తోయంపు టంగడిన్= నీరిచ్చే అంగడిలో; తలగడుగు = తలంటు స్నానం; ఆడు = చేసే; తడవు = ఆలస్యం;

గడ్డం చేయించుకొని వేడి నీళ్ళిచ్చే అంగడిలో తలంటు స్నానం చేయటంలోని ఆలస్యం.

వంటపూట+ ఇంటికిన్ = పూటకూళ్ళ ఇంటికి; ఎప్పంటి కంటెన్ = రోజు కంటె; పాలు, పెరుగు, నేయి, కూరలు. అంపెడు = పంపే; తెగువలు = తెంపరి తనం;

ప్రతిరోజుకంటె ఆ వేళ సంబారాలను పూటకూటింటికి పంపటంలో తెగువతనం.

సంబెళ = తాంబూలం తిత్తి; విదలించి = దులిపి; తాంబూల దళ = తమలపుటాకులు; పూగనివహంబు = పోకల మొత్తం; చాలఁగన్ = ఎక్కువగా; నించు= నింపే, ఉబ్బున్ = సంతోషం.

తాంబూలం తిత్తులు విదలించి ఆకులు - పోకలు సంతోషంతో నింపటం.

బ్రహ్మచారి = వటువు; భుజంబు మాత్రకున్ = బుజానికి సరిపడే సడింపు; ప్రాలు = ఎసటిలో వేసుకొనే బియ్యం; ఆలికిన్ = భార్యకు; మేలి చీరలు = మంచిచీరలు; కొనియెడు = కొనే; సంభ్రమంబునున్ = తొట్రుపాటు; పెఱ = ఇతర; పాంథజనులన్= బాటసారులను; పయనమున్ = ప్రయాణం; ఎప్పుడని; అడుగు ప్రశ్నలున్ = కని; మత్= నా; ప్రయాణమున్ + ఎఱిఁగి = ప్రయాణ సన్నాహం తెలిసి.

తోడు వటువు మోసేటన్ని ఎసటి పోతల బియ్యం సంచిలో నింపి, భార్యకు మంచి చీరలు కొనటం; ఇతర పాంథులను ప్రయాణం గురించి అడిగే ప్రశ్నలు- నాప్రయాణం - అన్నీ చూచి.

విశే॥ నాటి కాలంలో ప్రయాణ సన్నాహ వర్ణనం చేయబడింది. విష్ణుచిత్తుడు మధురా ప్రయాణ వర్ణనతో పోల్చు.

వెలివాడ = వెలి పాళెం క్రీడాభిరామంలోని మాట. నగరం బయట ఉండేపేట.

వేడి నీళ్ళ అంగళ్ళుండే వని దీనిని బట్టి తెలుస్తున్నది. పూటకూటిళ్ళ సంగతిమనకు తెలుసునుగానీ ఈ విషయం తెలియదు.

**క.** **హత్తుకొని యొక్క కొందఱ**
**నత్తెరువుం గట్టఁ బనిచి యందఱక్రియఁ దాఁ**
**దిత్తి యొకటి, గొని త్రేణి, మ**
**ఱుత్తర ముత్తర మటంచు నొక ప్రొద్దుకడన్.** **72**

హత్తుకొని = బాటసారులతో కలిసి; అత్తెరువున్ = మేము పోయే దారిని; ఒక కొందఱున్ = కొంత మందిని; కట్టన్ = అరికట్టడానికై; పనిచి = పంపించి; అందఱ + క్రియ = అందరిలాగానే; తిత్తి + ఒకటిన్ + కొని = ఒక సంచి తగిలించుకొని; త్రేణి = పండుకొని మాతోపాటు; మఱి లేచి; ఉత్తరము = ఉత్తరం దిక్కుకు పోవాలి; అట + అంచున్ = అని అంటూ; ఒక ప్రొద్దుకడన్ = ఇంకాప్రొద్దు పొడవక ముందే.

మాతో పాటు తానూ ఒక బాటసారిగా మాలో కలిసి, ముందుగానే తనవాళ్ళను తెరువు కాపలాకై ఏర్పాటు చేసుకొని, తానూ బుజాన అసిమి సంచి తగిలించుకొని మాతోపాటు నిద్రించి లేచి ఒక ప్రొద్దుకడనే ఉత్తరం దిశకు పోవాలంటూ.

విశే ॥ పద్యం క్లుప్తత - శబ్దాలు చూడాలి. రాకాసికి విముక్తి కావాలి. కథకాదు. కనుక చెప్పటంలో తొందర భావించాలి.

తే. లేచి పోవంగఁ దత్తఱ మేచి తోడి
వారు సన నేను ముడెమోపు వటున కెత్తి
పోవ వాఁ డిందు రండని త్రోవ యడవిఁ
బెట్టి యొకవాఁగు డిగ నీల వెట్టుటయును. 73

లేచి పోవంగన్ = వాడావిధంగా నిద్రలేచి పోతూ ఉండగా; తోడివారున్ = ఇతర బాటసారులు కూడా; తత్తఱము = తత్తరపాటు; ఏచి = రేగి; చనన్ = పోతే; నేనున్ = నేనును; ముడెమోపున్ = మూటబరువును; వటునకున్; ఎత్తి = నెత్తిపై పెట్టి; పోవన్ = పోగా; వాడు; ఇందున్ రండు+అని = ఇటుగా రండి అంటూ; త్రోవన్ = దారిని; అడవిన్ = అడవిలోకి; పెట్టి = తీసి; ఒక వాగున్ = పల్లంలో పారే సెలయేరు; డిగన్ = దిగుతూ ఉండగా; ఈలపెట్టుటయును = ఈలవేయటంతో.

నాటి కాలంలో అడవి ప్రయాణంలో పదిమంది కలిసిపోయేవారు. దీన్నే 'చనుప' అంటారు. దొంగలు కొట్టే చోటు- పొదలు- చెట్లూ-పుట్టా-వాగులూ-వంకలూ ఉండేప్రాంతాలు.

అంతా విచిత్ర వాతావరణం. ఈకథలో వైచిత్రి అంతా ఇదే. వర్ణనలు- భాషా విశేషాలూ సహృదయునకు కుత్తుకబంటి.

క. అఱుచేత వ్రాలు గను న
త్తఱిఁ బడె నొకయంపకట్టె, దానికి నిలువం,
బిఱుబిఱ్ఱున ఱాలువడెం
దెఱపియుఁ గనలేమి సాతు దిరుగుడువడియెన్. 74

అఱుచేతన్ = అరచేతిలో; వ్రాలు = గీతలు; కను = చూచే; అత్తఱిన్ = ఆ సమయంలో; ఒక; అంపకట్టె = బాణం; పడెన్ = పడ్డది; దానికిన్ = ఆ అంపకట్టెకు; నిలువం = బాటసారులు ఆగగా; ఱాలు = రాళ్ళు; బిఱుబిఱునన్ = వడిసెలతో విసిరేటప్పుడు వచ్చేధ్వనితో; పడెన్ ; తెఱపియున్ = సందు; లేమి = లేనందువల్ల; సాతు = చనుప; తిరుగుడు పడియెన్ = మడమలు త్రొక్కుకొన్నది ( కలత పడ్డది).

అరచేతిలో గీత లేర్పడే సమయంలో ఒక అంపకట్టె పడగా- బాటసారుల గుంపు నిలిచి పోయింది. ఇంతలో రాలు బిరుబిర్రున పడితే- సందు లేనందున సాతు కలత బడినది.

విశే ॥ 'అఱ ... ... తఱి' = తెలతెలవారుతుండగా అనటానికి ప్రౌఢ ప్రయోగం. ప్రొద్దున్నే లేవగానే అరచేతులు చూచుకోవట మున్నది కనక . అంపకట్టె - ఆగమని హెచ్చరిక.

మహాస్రగ్ధర ॥ కవిసె న్గల్పాంతజంతు గ్రసన భృశబుభుక్షాత్వరత్ర్యక్షపార్శ్వ
ప్లవమానోత్పాతభూతప్రకరపటిమహాలాహలస్పర్ధిహేతి

ఛ్ఛవి రేఖానేకరాహూచ్చలిత రవులు రక్షశ్చమూజిత్పులింద
ప్లవబృందంబు ల్వనిన్బల్గడ బోడుపోడు మన్పల్కులు న్ముల్కులున్రాన్ 75

కల్ప = యుగ; అంత = చివర; జంతు = జీవులను; గ్రసన = తినే; భృశ = అధికమైన; బుభుక్షా = ఆకలితో; త్వర = తొందరపడే; త్రి+అక్ష = మూడు కన్నుల స్వామి; పార్శ్వ = ప్రక్కన; ప్లవమాన = ఎగిరే; ఉత్పాత = ఉల్కాదుల వంటి; భూతప్రకర = బేతాళ సమూహంయొక్క; పటిమ = పటిష్ఠతతో; హాలాహల = విషంతో; స్పర్ధి = పోటీపడే; హేతి = కత్తుల; ఛవి = కాంతుల; రేఖా = వరుసల; అనేక = బహుళ; రాహు = రాహుగ్రహం నుండి; ఉచ్చలిత = పైకి దూకే; రవులు = సూర్యులు ; రక్షః = రాక్షసుల; చమూ = సేనను; జిత్ = జయించే, పుళింద = బోయల; ప్లవ = చండాలుర; బృందంబుల్ = గుంపులు; వనిన్ = అడవిలో; బల్వడిన్ = మిక్కిలి వేగంతో; పొడు పొడుము = పొడువు పొడువు; అన్+పల్కులున్ = అన్నమాటలు; ముల్కులున్ = బాణాలు; రాన్ = రాగా; కవిసెన్ = సమీపించింది.

ఆటవికుల గుంపు చుట్టు ముట్టింది. ఆ గుంపు ఎలా ఉందంటే- (1) ఆకలి గొన్న త్వరతో కల్పాంతకాలంలో జంతు సమూహాన్ని దిగమింగే రుద్రగణం పటిమ కలది. (2) హాలాహలంతో స్పర్ధ వహించే ఖడ్గకాంతుల వరుసలన్న రాహువులను చూచి భయపడే సూర్యుడు కలది. (3) రాక్షస సేనలను జయించ గలది.

విశే ॥ రుద్రానుచరులు ఉపమానం - పుళిందుల గుంపు ఉపమేయం.

హాలాహలం ఉపమానం - కత్తులు ఉపమేయం. అలంః- రూపకం.

మహాస్రగ్ధర - న,త,త,న,స,ర,ర,గ - లు. యతి 1-9-8.

**వ. ఇట్లు చెట్లు వెడలి విండ్లువంచుకొని ముంచుకొను నన్నల్లప్రజం జూచి హల్ల కల్లోలంబై విఱుగంబడు నెడ. 76.**

చెట్లు వెడలి = చెట్లచాటు నుండి బయటపడి; విండ్లు వంచుకొని = ధనుస్సు లెక్కు పెట్టి; ముంచుకొను = మూగే ; ఆ నల్లప్రజన్ = నల్లగా ఉన్నమనుష్యులు (దొంగలు); హల్లకల్లోలంబు+ఐ = క్షుబ్ధమై ; విఱుగంబడు నెడన్ = చెదరిపోయే సమయంలో.

సీ. పసలేదు నిలరోయి పాతకులా రని
దేవాయుధంబులు ఊవువారు,
పైఁడి బాసముఁ జెట్లఁ బడవైచి దుడ్డు పె
ట్లకుఁ బాఱుచునె యొలె ల్విచువారు
బరువు డించి కటారి పరుఁజించి నిల్చి యిం
దెందు వచ్చెద రని యెదురువారు,

వస్త్రంబుఁ గొండు దేవర యోయి యిది చన్నఁ
బస్తని దయపుట్టఁ బలుకువారు,

తే. కలవి మామూఁక నిప్పింతుఁ, దొలఁగుఁ, డొకటి
యాఁడుదానిఁ జే నంటకుఁ డనుచుఁ బెద్ద
తనము నభిమానమును దెంపు గనఁగఁబలికి
నిలిపి దోఁపిచ్చువారునై తొలఁగి రపుడు. 77

అపుడు = ఆ సమయంలో; పాతకులార+అని = దుర్మార్గులారా అని అంటూ; పసలేదు = సారంలేదు (దొంగ లెక్కువ మంది లేరు); నిలర+ఓయి = నిలవండిరా అని తోడి బాటసారులను హెచ్చరించుకొంటూ; దేవ+ ఆయుధంబులు = దేవతల ఆయుధాలు (యజ్ఞమందుపయోగించు రాయి- రప్ప, కొయ్య అని పూర్వ వ్యాఖ్యాతలు - కానీ దర్భలేమో) ; ఊపు వారు = విసరేవారు;

దొంగ లెక్కువ మంది లేరని తమను తాము హెచ్చరించుకొంటూ దేవతల ఆయుధాలు (శాపాలు = తిట్లు) విసరేవారు అని కొందరు.

పైడి బాసమున్ = బంగారమున్న సంచి; చెట్లన్ = పొదల్లో; పడవైచి = విసరివేసి; దుడ్డు పెట్లకున్ = కర్రదెబ్బలకు; పాఱుచునె = పరుగెత్తుతూనే; ఒలెల్ = పై పంచెలను; వైచువారు = ఏమీ లేదంటూ విసరే వారు.

బంగారున్న బొడ్డు సంచిని పొదల్లో విసరివేసి మా దగ్గర ఏమీ లేదు అంటూ దెబ్బలకు పరుగెత్తుతూ ఉత్తరీయాలను విసరేవారు.

బరువున్ డించి = బుజాన ఉన్న బరువును క్రిందపెట్టి; కటారి పరున్ = కటారి కానిని; చించి = చీల్చి; నిల్చి = ఎదురొడ్డి; ఇందున్ +ఎందు = ఇక్కడ ఎక్కడకు; వచ్చెదరు అని = వస్తారా అంటూ; ఎదురువారు = ఎదురు తిరిగేవారు- (కటారిన్ పరున్ చించి = కటారితో శత్రువును నరికి అనవచ్చు అప్పుడు కటారిఁబరున్ - అని వుండాలి)

బరువులు దించుకొని కటారికానిని చీల్చి చెండాడి ఎక్కడకు వస్తారా రండి చూద్దామని ఎదురొడ్డి నిలిచే వారు.

ఓయి = ఓయీ; వస్త్రంబున్ + కొండు = ఈ వస్త్రమే ఉన్నది తీసుకోండి; ఇది = ఈ సంచి; దేవర = కులదేవత; చన్నన్ = పోతే; పస్తని; దయపుట్టన్ = కనికరం కలిగేటట్లు; పలుకువారు;

ఈ దేవతయున్న సంచిపోతే మేము పస్తే. దయదలచి ఈ వస్త్రం మాత్రం తీసుకోండి - అని దీనంగా ప్రార్థించేవారు.

మామూఁకన్ = మా గుంపులో; కలవి = ఉన్నవేవో; ఇప్పింతున్ = ఇప్పిస్తాను కానీ; తొలఁగుడు =

పొందు; ఒకటి = ఒకమాట; ఆడుదానినిన్ = స్త్రీని; చేన్+అంటకుడు = చేతితో తాకకండి; అనుచున్; పెద్దతనమున్ = పెద్దరికం; అభిమానమునున్ = గౌరవం; తెంపున్ = తెగువదారితనం; కనగన్ = తోచేటట్లు; పలికి; నిలిపి = దొంగలనాపి; దోపు = నిలువదోపు; ఇచ్చేవారునై = ఇచ్చేవారై; తొలఁగిరి = కొందరు వెళ్ళిపోయారు.

సాతు అల్లకల్లోలం కావటమంటే ఎలాగో వర్ణిస్తున్న పద్యం.

సీ. తొడువింటివాఁడు సన్త్రోవఁ బోవక యెదు
 ర్పడువాంఁడ్రఁ దొడిఁబడఁ బదరి పొడిచి,
పీనుఁ గీక పెనఁగినఁ బెద్ద నొంపక యెట్టుఁ
 బాఱించి చేఁ గలపాటి నాఁచి,
యాయితంబై చించి యరిగెడువాఁ డేటు
 నకు మీఱి చన్న వెన్ దవులు టుడిగి,
పొదుపు చే లేకయ పుటపుటయును నైన
 వాని శోధింప నవ్వలికిఁ బనిచి,

తే. పొదలఁదూఱిన నీఁటె చాఁపుల వెడల్చిఁ,
గట్టుబట్టలు గొని ప్రాఁతబట్ట దయను
గోఁచులకు నిచ్చి, గనపరాకులు నిగిడ్చి,
చెప్పుటట్టలుశోధించి సిగలు విప్పి. 78

తొడు = తొడిగిన; ఎక్కుపెట్టిన; వింటివాడు = విల్లు కలవాడు; చన్ = పోయిన; త్రోవన్ = దారిలో; పోవక = పోకుండా; ఎదుర్పడు వాంఁడ్రన్ = ఎదురైన వారిని; తొడిఁబడన్ = తొట్రుపాటు పొందేటట్లుగా; పదరి = తిట్టి; పొడిచి;

పీనుఁగు = పీనాసి పీనుగు; ఈక = ఇవ్వకుండా; పెనఁగినన్ = పెనగులాడితే; పెద్దనొంపక = పెద్దగా బాధించక; ఎట్టున్ = నెత్తురును; పాఱించి = ప్రవహింపజేసి; చేన్= చేతిలో; కలవానిన్ = ఉన్నవాటిని; ఆఁచి = లాగుకొని;

ఆయితంబు+ఐ = సాయుధుడై ఎదురు తిరిగి, చించి = పొడిచి; అరిగెడువాడు = పోతున్నవాడు; ఏటునకున్ = దెబ్బకు; మీఱి = అందక; చన్నన్ = పోతే; వెన్ తవులుట = వెంటబడటం; ఉడిగి = మానుకొని;

చేన్ = చేతిలో; పొదుపు = ధనం; లేకయ = లేకుండానే; పుటపుటయును + ఐనవానికిన్ = లావుగా ఉన్నవానిని; శోధింపన్ = వెతకటానికి; అవ్వలికిన్ = అవతలికి; పనిచి = పంపి;

పొదలన్ = పొదల్లో; దూఱినన్ = దూరితే; ఈటె = బల్లెం; చాఁపులన్ = దోపటంతో; వెడల్చి = బయటకులాగి;

కట్టుబట్ట = కట్టిన మంచి వస్త్రాలు; కొని = తీసుకొని; దయను = దయతో; ప్రాఁత బట్టన్ = పాత గుడ్డను; గోచికిన్ = గోచీపెట్టుకోవటానికి; ఇచ్చి;

చెప్పుటట్టలు = చెప్పులు అట్టలను; గనప + ఆకులు = గన్నేరాకులవంటి అమ్ములు; నిగిడ్చి = దోపి; శోధించి = వెదకి;

సిగలు విప్పి = జుట్టుముడులూడదీసి- అక్కడ ద్రవ్యం దాస్తారు గనుక.

విల్లెక్కుపెట్టి ఎదురు తిరిగిన వానిని వదలి- ఎదురైన వారిని తిట్టి పొడిచి, పిసినారి వాడివ్వనందున రక్తం ప్రవహింపజేసి ఉన్నదంతా లాగుకొని, ఎదురొడ్డి నిలిచినవాడు ఏటుద్రేత కందకుండా పోతే వదలిపెట్టి, చేతిలో ఏమీ లేకుండానే లావైనవాడిని శోధించటానికి అవతలకు పంపి, పొదల్లో దాగినవారిని ఈటెలు చాపి బయటకు లాగి, కట్టినబట్ట లూడదీయించి గోచీకి ప్రాతగుడ్డ నిచ్చి, చెప్పుల అట్టలో గన్నేరాకుల అమ్ములు గ్రుచ్చి-వెతకి, సిగల ముడులూడ దీసి వెదికి.

లావైనవాడంటే - బట్టల్లోపల ధనాదులను దాచుకొన్నందువల్ల లావుగా ఉండటం.

ఇదంతా దొంగలు శోధించేవిధానం కాబోలు! చక్రవర్తి కనుక తెలుసుకొన్నట్లున్నాడు. (చూ. 5.30)

**వ. ఇట్లు పాటచ్చరులు పెచ్చు పెరిగి విచ్చలవిడి నుచ్చావచంబులగు సార్థంబు నర్థంబు లపహరించు సంకులంబున.** **79**

పాటచ్చరులు = దొంగలు; పెచ్చుపెరిగి = హద్దుమీరి; విచ్చలవిడిన్ = ఇష్టానుసారంగా ; ఉచ్చావచంబులు = అనేక రకాలైన; సార్థంబు = చనుపయొక్క; అర్థంబు= ద్రవ్యం; అపహరించు = దోచుకొనే; సంకులంబునన్ = సందడిలో;

**సీ. కటినుండి చనుమొఱ గడి గాఁగ బిగియించి**
**కట్టిన నిడు నీలికాసె మెఱయఁ,**
**బిల్లి గడ్డము మించఁ బెరిఁగి మీసలు కుక్షి**
**గోళంబుమీఁద నుయ్యాల లూఁగ,**
**బూఁది ద్రిమ్మంగిన మొగంబున గౌదకట్టు మై**
**నపు మైల ప్రాఁజొౌతున్నాఁజెలంగఁ,**
**జిటిద్రేలి పూసపై ఘటియిల్లు వెడఁబట్టు**
**చిమ్మెల సురియ డా ల్కుమ్మరముగ**

**తే. నూరనుండియుఁ గనుపెట్టుచున్న వాఁడు**
**దప్పిపో నన్ను డబ్బాటు దాఁ బొడగని**
**యట్టివేళఁ గాక శ్మశ్రు వనెడు నొక ప్ర**
**చండ చండాల చోరభటుండు దఱిసి.** **80**

కటినుండిః నడుమునుండి; చనుమఱి = రొమ్ము; గడిగాఁగన్ ; హద్దుకాగా; బిగియించి కట్టినః బిగుతుగా కట్టిన; నిడు = వెడల్పైన; నీలికాసె = నీలిదట్టి; మెఱయన్ః ప్రకాశిస్తుండగా;

పిల్లిగడ్డము = పిల్లిగడ్డంలాంటి గడ్డాన్ని; మించిన = దాటి, పెరిగి = పెరిగిన; మీసలు = మీసాలు; కుక్షిగోళంబు = గోలెంవంటి గుండ్రని కడుపు; మీదన్ = పైన; ఉయ్యాలలు + ఊఁగన్ = కదలుతుండగా; (గోలెం = బోర్లించిన బొచ్చె.)

బూది గ్రింగిన = బూడిదలో మునిగిన; మొగంబుగన్ = ముఖం మీద; గౌదకట్టు = దవడలపైన కట్టిన గుడ్డ; మైనఁపుమైల = మైనం మడ్డిపూసిన; ప్రాత+చౌతుః ప్రాతటోపీ; నాన్ = అన్నట్లు; చెలంగన్ = ఉండగా;

చిటిద్రేలి = చిటికెన వ్రేలియొక్క; పూసపై = కణుపు మీద; ఘటియిల్లుః వ్యాపించే; పెడపట్టు = పలుచని పట్టు రుమాలుయొక్క; చిమ్ముల = కాంతులు చిమ్మే; సురియ = చురకత్తి; డాల్ = కాంతి; ముమ్మరముగన్ = దట్టంకాగా;

ఊరన్ ఉండియున్ = ఊళ్ళో ఉన్నప్పటి నుండీ; కనిపెట్టుచున్ + ఉన్నవాడు = ఏమరక చూస్తున్నవాడు; కాకశ్మశ్రువు = కాకిమీసాలవాడు; అనెడు = అన్నపేరుగలవాడు; ఒక; ప్రచండ = భయంకరమైన; చోరభటుండు = దొంగబంటు; అట్టివేళన్ = చనుప చెదరినపుడు; తప్పిపోన్ = పారిపోగా; నన్నున్; డబ్బాటు = హఠాత్తుగా; తాన్ = కాకశ్మశ్రువు; పొడగని = నన్ను గుర్తించి; తఱిమి = వెంటపడి.

కాకశ్మశ్రువన్న దొంగ నన్ను అప్పటినుండీ చూస్తూ ఉన్నాడు కనుక- సాతు నుండి పారిపోయే నన్ను గుర్తించి వెంటపడ్డాడు. వాడి స్వరూప మిలా ఉంది.

నడుమునుండి గుండెలదాకా నీలి కాసెను బిగించి కట్టుకొన్నాడు. పిల్లిగడ్డం దాటి పెరిగిన మీసాలు గోలెం కడుపుమీద ఉయ్యాల లూగుతుండగా, పూసుకొన్న బూడిదలో మునిగిపోయిన- ముఖం మీద గవదలపై కట్టిన గుడ్డ- మైనం పూసిన పాత టోపీ లాగా ఉండగా చిటికెన వ్రేలిమీద పట్టురుమాల వ్రేలుతున్న చురకత్తి కాంతులు క్రమ్ముతుండగా - పరమ భయంకరంగా ఉన్నాడు.

**అలం:** - స్వభావోక్తి.

**విశే** ॥ 6,7 పద్యాల్లో ఈ చోరుని విషయముంది. కనిపెడుతూ ఉన్నవాడు వాడే. బ్రహ్మరాక్షసుని వర్ణనకు దీనికీ పోలికలు పోల్చుకోదగ్గవి.

చ. కవ వటు డించి యే గునుకఁగా, సురెఁ గొంకులఁ దార్చి, కూలుడు
న్నివిడిన బొజ్జపై మిగులు నిద్దపు దోవతి దట్టి డొల్లిరాఁ
దివిచి, పెనంగ, వల్లువముఁ ద్రెంచి, యనంతుని గంట్ల కూనపుం
జెవులుగ గౌదకట్టు గసెచేరుల టెక్కియు దోఁపు నొల్చిపోఁ. 81

కవవటున్ = జంటగా ఉన్నబ్రహ్మచారి శిష్యుని; డించి = వదలి; ఏన్ = నేను; గునుకగాన్ = చిన్న పరుగు తీస్తే; సురెన్ = చురకత్తి విసరి; కొంకులన్ తార్చి = కొంకులపై కొట్టి; కూలుడున్ = నేనుపడిపోతే; నివిడిన = ఉబికిన; బొజ్జపైన్ = కడుపు మీదుగా; మిగులు = వ్రేలాడే; నిద్దపు= నున్నని; దోవతి = వస్త్రం; దట్టి = కాసె; డొల్లిరాన్ = ఊడివచ్చేటట్లుగా; తివిచి = లాగి; పెనంగన్ = పెనగులాడితే; వల్లువమున్ + త్రెంచి = వరాలమూటను త్రెంచి; అనంతుని గంట్లకున్ = నాగపడగల అంటుజోడున్న చెవి తమ్ములదాకా; ఊనపుం జెవులుగన్ = మిగిలిన చెవులు కలవానిగా (చెవులు మిగిలేటట్లుగా); గౌద కట్టున్ = గౌదలకు కట్టిన వస్త్రం; కసిచేరులటెక్కియున్ = దవడల కిందుగా బొందులు కట్టిన టోపీ; దోపున్ = కొల్లగా; ఒల్చి = ఒలుచుకొని; పోన్ = పోతుంటే.

తోడుగా ఉన్న బ్రహ్మచారిని వదలి నేను చిన్న పరుగు తీసాను. వాడు తనచేతి చురకత్తిని విసరి నాకొంకులకు కొట్టాడు. నేను క్రింద పడ్డాను. నా బొజ్జ చుట్టూ కట్టిన స్నిగ్ధ వస్త్రాన్ని లాగి దట్టీలో ఉన్న వరాల సంచిని లాక్కొని నేను పెనుగుతుంటే- చెవులకున్న నాగ పడగల జంట గుంజుకొంటే- చెవితమ్మెలు తెగిపోయాయి. గౌడకట్టులో ఉన్నద్రవ్యం- కసి చేరులున్న టోపీని లాగి అక్కడున్న దాన్ని - అన్నీ ఒల్చుకొని పోతుంటే.

**అలం:** - స్వభావోక్తి.

విశే ॥ ఈ కథలో కుళ్ళాయి విషయం వస్తున్నది. నాటి కాలంలో ఈ టోపీ ధరించేవారు. **'కుళ్ళాయుంచితి'**- అని శ్రీనాథుని పద్యం. శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయంలో రాయలవారి బొమ్మకున్నదీ కుళ్ళాయే. ఈ కథలోని పదాలను నెమరు వేసుకోవాలి.

క. **నోరిసని నుండ, కే 'నో**
**రోరి, యకట ! మా సమీప పూరనె మనియుం**
**దూరము వోయితివే ! సా**
**మ్మేరీతిని నీకు దక్కునే కానీరా !** **82**

ఏను = నేను ; నోరిసని = నోటిశనివల్ల; ఉండక = ఊరుకోలేక; ఓరోరి = ఓరి- ఓరీ; అకట = అయ్యో, మా; సమీపపు +ఊరనె = మాకు దగ్గరగా ఉన్న ఊరిలోనే; మనియున్ = ఉంటూ కూడా; దూరము వోయితివే = మాకు దూరంగా పోయావా? (శత్రువైనావా); సొమ్ము = ద్రవ్యం, ఏ రీతిని = ఏ విధంగా; నీకున్ ; దక్కునే = దక్కుతుందా!; కానీరా = కానిమ్మురా.

ఆ దొంగ మా ఊరి పొరుగువాడే కనుక నోటిశని నన్ను ఊరుకోనివ్వక వాగించటం వల్ల నేనన్నాను, ' ఓరే ! మా దగ్గర ఊరివాడవై కూడా నన్నిలా చేస్తావా? ఉండు. నా సొమ్ము నీకెలా దక్కుతుందో చూస్తాను- కానివ్వురా అని.

విశే ॥ శని - కష్టప్రదాతయైన గ్రహం కనుక దూరము పోయితివె - జాతీయం. ఊరికి దగ్గర ఉండి కూడా విరోధివైనావా? - అన్న లక్ష్యార్థంలో ప్రయోగించబడ్డది.

తే. అనిన లాఁతుగఁ గోల్పోక యతఁడు రడ్డు
రాజుఁ గను నని కొదయుఁ దీర్పంగ మగిడి
యంత పరియును బై ప్రజ కలికి పాఱి
పోవవాఁడును వెడపోట్లు వొడిచి చనియె 83

అనినన్ = నేనలా అంటే; ఆ దొంగ; లాఁతుగన్ = అధికముగా (ద్రవ్యం); కోల్పోక = కోలు+ వోక = కోలుపోవటంవల్ల; రడ్డు = గ్రామాధికారిని; రాజున్ = దేశాధికారిని; కనున్+అని = నేను చూచి ఫిర్యాదు చేస్తాననుకొని; కొదయున్+తీర్పంగన్= మిగిలింది కూడా ముగించటానికి; మగిడి = తిరిగివచ్చి; అంతన్ = అంతలో; పరియునున్ = తనతో పాటున్న దొంగల గుంపు కూడా; పైప్రజకున్ = మా వెనుక వచ్చే జనానికి; అలికి = భయపడి; పాఱిపోవన్ = పారిపోగా; వాడునున్ = కాకశ్మశ్రువున్నూ; వెడ = ఇష్టం వచ్చినట్లు; పోట్లు = కత్తి పోట్లు; పొడిచి; చనియెన్ = వెళ్ళాడు.

నేనావిధంగా అనగానే - వా డనుకొన్నాడు- వీడు తన ద్రవ్యమంతా పోగొట్టు కొన్నాడు కనుక- పోయి గ్రామాధికారినీ - దేశాధికారినీ చూచి ఫిర్యాదు చేస్తాడు అని వెన్కకు తిరిగి వచ్చాడు. ఇంతలో వాడితో పాటున్న దొంగలు కూడా- వచ్చే జనంవల్ల భయపడి పారిపోయారు. వీడూ తన యిష్టం వచ్చినట్లుగా పోతూ పోతూ భయంతో కత్తితో చాలా పోట్లు పొడిచి పోయాడు.

విశే ॥ రడ్డి- రాజు- ''రేపటి రాజెవరో రెడ్డెవరో-'' సామెతలో రెడ్డి- గ్రామాధికారి. రాష్ట్ర వ్యవస్థలో రాజు దేశాధికారి కాగా దేశానికి మూలమైనది గ్రామం. దాని కధికారి రెడ్డి. మున్సిఫ్ - అని నేటిమాట. కరణం అంటే ఏ అర్థమో రెడ్డి అన్నా అధికారార్థం కలది తప్ప కులార్థకం కాదు. కాబట్టి 7-4 లో రెడ్డి అన్నా 4-134లో రెడ్డికీ ఇదే అర్థం తప్ప రాయలవారు రెడ్లను ఎగతాళి చేయటం కాదు. కొందరు పండితులీ యర్థం చెప్పటం అసంగతం. ఒక మహాచక్రవర్తి ఇంత అల్పిష్ఠ మనస్తత్వం కలవాడను కోవడం కంటె అపచార మేముంటుంది? కత్తితో శత్రువును నరికే వాడే తప్ప మాటల్తో ఎత్తి పొడుస్తాడా మహావీరుడు?

ఉ. అంతటఁ బొంతఁ బెన్దెరువునం దరుదెంచు పిఱిందిమంది మ
త్కాంత సహోదరుండును నొకం డరుదెంచుచు సాతు వడ్డ వృ
త్తాంత మెఱింగి న న్నరసి తాఁ గని యార్తి నొకండు దా నతి
శ్రాంతుని నన్నుఁ గావట దిసంతులు గొట్టుచు మోచు కేఁగుచోఁ. 84

అంతటన్ = అంతలో; పొంతన్ = సమీపంలో; పెన్ తెరువునందున్ = (Highway) రాచబాటలో; అరుదెంచు = వచ్చే; పిఱింది = వెనుక (వచ్చే); మంది = గుంపులో; మత్ = నా; కాంత = భార్యకు; సహోదరుండు = సోదరుడు; ఒకండు; అరుదెంచుచున్= వస్తూ; సాతు = చనుప; వడ్డ = పొందిన అవస్థయొక్క; వృత్తాంతమున్ = విషయమంతా; ఎఱింగి = తెలుసుకొని; నన్నున్; తాన్; అరసి

= చూచి; ఆర్తిన్ + కని = దుఃఖమందీ; అతిశ్రాంతునిన్ = మిక్కిలి అలసిపోయిన నన్ను; దిసంతులు = కేరింతలు; కొట్టుచున్= కొడుతూ; కావటన్ = కావడిలో నుంచి (నన్ను); మోచుచున్ = మోస్తూ; ఏగుచున్= వెళ్తూ ఉండగా.

ఇంతలో దాపునే ఉన్న రాచబాటలో పెద్ద గుంపు వస్తున్నది. అందులో నా బావమరది మా చనుప వృత్తాంతం తెలిసి నన్ను గుర్తించి దుఃఖించి నన్ను కావడిలో పెట్టుకొని నన్ను నవ్వించడానికి హాస్యోక్తు లాడుతూ మోస్తూ పోతూ ఉండగా.

విశే ॥ దిసంతులు = దెబ్బలు తిన్న వాడిని నవ్వించి బాధ మరిచి పోయేటట్లు పెట్టే కేరింతలు; ఏవగింపు. ఎగతాళి, నింద- అన్న అర్థాలు అప్రస్తుతం.

సీ. కొంగవా ల్నఱకు లంగుళులఁ బట్టుచు జబ్బ
లంటఁ గుట్టిడ వెజ్జు నరయువారు,
తలఁ బడ్డ గుదియ వ్రప్పులఁ బ్రాఁత మసి యిడి
యంబలి గం జిండ్ల నడుగువారు,
తమసేగిఁ జెప్ప లో దయమీఱ విని చీరఁ
జించి యియ్యంగ దీవించువారు,
నొలఁబడ్డ నెపమునఁ గలలేని సిరిఁ జెప్పి
చుట్టలపై దాడి వెట్టువారు,

తే. నైన పాంథులచేతఁ గ్రంధైన యూళ్ల
జాడగా నిటఁ దెచ్చి యిన్నీడ డించి,
పాఱు నీ రానఁ బోవ నూర్పాఱి మగిడి
వచ్చునాలోన నీరూపు వచ్చె నాకు. 85

కొంగవాల్ = కొంగ మెడవలె వంపుగల నిడుపు కత్తి; నఱుకులన్ = గాయాలను; అంగుళులన్ = వ్రేళ్ళతో; పట్టుచున్ = పట్టుకొని; జబ్బలు = బుజాలు; అంటగన్ = దాకా (అంటుకొనేటట్లు); కుట్టు+ ఇడన్ = కుట్లు వేయటానికి; వెజ్జున్= వైద్యుని; అరయువారు = వెతుకుకొనేవారు- కొందరు.

తలఁబడ్డ = తలమీద పడిన; గుదియ = గుదికర్ర; వ్రప్పులన్ = గాయాలలో; ప్రాత = ప్రాత గుడ్డ; మసి; ఇడి = పెట్టి; అంబలి గంజిన్ = ఆకలికై అంబలి గంజి; ఇండ్లన్ = గృహాలలో; అడుగువారు = అడుక్కొనే వారు.

తన సేగిన్ = తనబాధను; చెప్పన్ = చెప్పగా; లోన్ = హృదయంలో; దయమీఱన్ = ఎక్కువ దయతో; విని; చీరన్ = వస్త్రాన్ని; చించి; ఇయ్యంగన్ = ఇస్తే; దీవించువారు = సుఖంగా ఉండమని ఆశీర్వదించే పెద్దలు.

ఒలన్ పడ్డ = ఒలువబడిన; నెపమునన్ = మిషతో; కలన్ = కలలలో కూడా; లేని = లేనట్టి; సిరిన్+చెప్పి = ఐశ్వర్యం కలదని చెప్పి; చుట్టలపైన్ = చుట్టాలమీద; దాడిపెట్టువారు = గుంపులై వెళ్ళేవారు.

ఐన = ఐనట్టి; పాంథులచేతన్ = చనుప బాటసారులతో; క్రందైన (క్రందు+ ఐన) సందడి కల; ఊళ్ళ జాడగాన్ = గుర్తుగల ఊళ్ళమీదుగా; ఇటన్+తెచ్చి = ఇక్కడకు తెచ్చి; ఇన్నీడన్ = ఈ నీడలో; ఉంచి = కావడి దించి; పాఱు = ప్రవహించే; నీరు+ ఆనన్ = నీరుత్రావటానికి ; పోవన్ = పోయి; మగిడి వచ్చు ఆలోనన్ = తిరిగివచ్చేటంతలో; ఊఱ్పు = శ్వాస; అఱి = నశించి: ఈ రూపు = ఈ ఆకారం; నాకున్; వచ్చెన్ = వచ్చింది;

కొంగవాలుతో దొంగలు నరికితే ఆ చీలిన చర్మాన్ని వ్రేళ్ళతో పట్టి బుజాలకు కలిపి కుట్టే వైద్యుని కోసం వెతికే వారితో, తలను కర్రతో మోదగా పగిలి ఏర్పడ్డగాయాలకు ప్రాతగుడ్డ మసిపెట్టి ఆకలికి అంబలి కోసం యాచించే వారితో, తమపడ్డ పాట్లు చెప్పగా దయతో విని వస్త్రం చించిచ్చిన వారిని దీవించే వారితో, నిలువు దోపిడివల్ల కలలోనూ ఊహించరానంత ధనం పోయిందని చెప్పే వారితో సందడైన ఊళ్ల దారి గుండా కావడి తెచ్చి మావాడు ఈ మర్రి క్రీనీడ దించి- త్రాగటానికై ప్రక్కనున్న ఏటికి పోయి తిరిగి వచ్చే సరికి నా శ్వాస ఆగిపోయింది. ఈ రూపం సంక్రమించింది.

విశే ॥ గాయాలకైన వైద్యం చెప్పటం గుర్తించాలి. ఆనాటి కదే వైద్యమన్న మాట. దోపిడి పాలైన ప్రజల గోడు అలా ఉంటుందన్నమాట. నేటికీ ఉన్నదే కదా. మార్గ వర్ణన చమత్కారంగా ఉంది.

**వ. కయ్యంబునఁ బాఱఁబాఱ గాయంబు సేసి వెఱవేఁకి గొలిపిన కాక శ్మశ్రు నామధేయ చండాలు కరాళవేషంబు కన్నులం గట్టినట్లుండఁ గడఁ గనుట నిట్టి కరాళ వేషంబు గలిగెఁ; గైశికీగాన ఫలదానంబున దీని మానుపవే? అనిన నతం డేను ఫలం బెఱుంగ, ఫలంబు పరమేశ ముఖోల్లాసంబ యాజ్ఞాకైంకర్యంబులకు, ననుమతి కైంకర్యంబులకు ఫలపరిమాణగణనప్రపన్నుల కెక్కడియది? కాన బంధకంబగుట ఫలం బింతంత యందుఁ గొంతఁ గొమ్మన వెఱతు, భగవంతుండ రక్షించు, నూఱడిలు మన్న నన్నోరిమాట నోరన యుండ నతండు. 86.**

కయ్యంబునన్ = పోరాటంలో; పాఱన్ + పాఱన్ = పారిపోయిన కొలదీ (వెన్నాడి); గాయంబు చేసి; వెఱవేకి = వెఱ = భయం; వేకి = జ్వరం; కొలిపిన = కల్గించిన; కాకశ్మశ్రునామధేయుండు = కాకిమీసాల వాడన్న పేరుగల వాని; కరాళవేషంబు= భయంకర రూపం; కన్నులన్ = కన్నులకు; కట్టినట్లు +ఉండన్ = కట్టినట్లు కాగా; కడన్ +కనుటన్ = మరణ సమయంలో చూచాను కనుక; కైశికీ గానంబునన్ = ఆపేరుగల దాన ఫలదానంవల్ల; ఫలంబు = ఫలితం; పరమేశ = శ్రీవిష్ణువు; ముఖ+ ఉల్లాసంబ= ముఖవికాసాధీనం; ప్రపన్నులకున్ = విష్ణుదాసులకు; ఆజ్ఞా కైంకర్యంబులకున్ = వేదం విధించిన సేవలకూ; అనుమతి = ప్రపన్నుడు తానై చేసే; కైంకర్యంబులకున్ ; ఫల పరిమాణ గణన = ఫలమింత అని లెక్కించటం; ఎక్కడియది = ఎక్కడిది ? (లేదు); బంధకంబు = ముక్తి కల్గించక జన్మరూప సంసారంలోనే ఉండటం.

ఆ పోరాటంలో నేను పరుగెత్తినా మానకగాయం చేసి పోయిన కాకశ్మశ్రురూప స్మరణ మృత్యువేళ కల్గినందువల్ల ఈ రూపం కల్గింది. కనుక 'కైశికీ గానఫలం దానం చేసి ఈ రూపం పోగొట్టవయ్యా!' అని ప్రార్థిస్తే అతడు 'నేను విష్ణుదాసుడను. నాకు కైంకర్యమే తెలుసును. కానీ దాని ఫల మింత అని నాకు తెలియదు అది బంధహేతువు కనుక నే నాపని చేయలేను. కానీ సర్వ నియామకుడైన భగవంతుడే రక్షించ గలడన్న మాట నోటినుండి బహిర్గమించిందో లేదో'.

ఆ బ్రహ్మరాక్షసుని రూపం పోయి, సోమశర్మ రూపం వచ్చింది. ఆ రూపమే క్రింది పద్యంలో వర్ణింపబడుతున్నది.

ఈ కథలో నాయకు డెవరు? దాసరి తనయందు ఆరోపించుకొనక భగవంతునియందు విన్యస్తం చేసాడు కనుక- భగవంతుడు నాయకుడు. ఇత డతని చేతి సాధనం.

ఇదే రస విషయానికి మూలం. పైగా దాసరి ప్రపన్నుడు. న్యాస విద్యామూర్తి. తన సర్వస్వాన్ని భగవంతునియందు విన్యసించిన మహాత్ముడు. తాను కథానాయకు డెలా కాగలడు? ఆత్మస్వరూపుడైన నారాయణునకు శరీరం. ఆత్మస్పందన గుర్తించ గలవాడు కనుక. యామునా చార్యులన్న 4-68 చూడు.

సీ. స్నిగ్ధ త్రిభాగ ముండిత శిరశ్శిఖ తోడ,
హిమధవళోపవీతములతోడఁ,
బుణ్య షడ్ద్వితయోర్ధ్వ పుంద్రవల్లులతోడఁ,
దులసికాబ్జస్రగా వళుల తోడఁ,
గౌపీన కటిసూత్ర కాషాయయుగి తోడ,
జలపూర్ణ శుభకమండలువుతోడఁ,
బాణిస్థ దివ్యప్రబంధసంపుటితోడ
నుత్తర వాక్పూర్వ కోక్తి తోడఁ,

తే. బసిఁడిజిగితోడ బ్రహ్మ వర్చసము పొల్చు
భాగవతలక్ష్మితో ధూమపటలి నుండి
వెడలు శిఖవోలె నమ్మేను వెడలి చూడఁ
జూడ వైష్ణవుఁడై నిల్చె సోమశర్మ. 87

సోమ శర్మ వైష్ణవుడై నిల్చినాడు; ఆ వైష్ణవ వేషం-

స్నిగ్ధ = నున్నగా; త్రిభాగ = మూడు భాగాలుగా; ముండిత = క్షౌరం చేయబడ్డ; శిరఃశిఖతోడ= తలమీద పిలక జుట్టుతోడ; హిమ = మంచువలె; ధవళ = తెల్లనైన; ఉపవీతములతోడన్ = జందెపు పోగులతో; జుట్టులో మూడు పాళ్ళు క్షౌరం చేయగా ఒక పాలు మాత్రం జుట్టుగలిగి- తెల్లని మంచువంటి

జందెపు పోగులు కలిగి. పుణ్య = పావనమైన; షట్+ద్వితయ = ఆరురెండ్లు; ఊర్ధ్వ పుండ్రముల తోడన్ = పంగనామాలతో; తులసిక+అబ్జ = తులసి, తామరపూసల; ఆవళులతోన్ = దండలతో; 12 స్థానాల్లో అలంకరించుకొన్న ఊర్ధ్వనామాలతో- మెడలో తులసి పూసల తామర పూసల దండల వరుసలతో కౌపీన = గోచీ; కటిసూత్ర = ముంజిగడ్డి మొలత్రాటితో; కాషాయ యుగి తోడన్ = కావి బట్టల జంటతో; జలపూర్ణ = నీటితో నిండిన; శుభ = పవిత్రమైన; కమండలువు తోడన్ = చెంబుతో; గోచీ- ముంజి గడ్డి మొలత్రాడు కావి వన్నె జంట వస్త్రాలు కలిగి, నీళ్ళు నిండిన పవిత్ర కమండలవు కలిగి. పాణిస్థ = చేతిలో ఉన్న; దివ్యప్రబంధ = ఆళ్వార్లు చేసిన విష్ణుస్తోత్రాలున్న; సంపుటితోడన్ = గ్రంథంతో; ఉత్తర వాక్ పూర్వక = ద్వయమంత్రం చివరి భాగం ముందుకల ; ఉక్తి = మాట; తోడన్ . దివ్యప్రబంధం చేతిలో కలిగి ద్వయమంత్రంలో చివరి భాగం అనుసంధానం చేస్తూ- **ఓం నమోనారాయణాయ-** తో మాట్లాడటం మొదలుపెడుతూ.

పసిఁడి = బంగారు; జిగితోడన్ = కాంతితో; బ్రహ్మవర్చసము = బ్రాహ్మణ తేజస్సు; పొల్చు = ప్రకాశిస్తున్న; భాగవత లక్ష్మితోన్ = భక్తి సంపదతో; ధూమపటలి నుండి = పొగచాలు నుండి; వెడలు = బహిర్గతమైన; శిఖివోలెన్ = అగ్ని జ్వాలలాగా; అమ్మేను = పూర్వం వర్ణించిన రాక్షస శరీరం; వెడలి = బహిర్గమించి; చూడన్ చూడన్ = చూస్తూ ఉండగానే; సోమశర్మ అన్న పేరుగల; వైష్ణవుఁడై = సోమశర్మ రాక్షసుని స్థానంలో నిలబడ్డాడు.

విశే ॥ త్రిభాగ ముండనం - విష్ణుచిత్తాదులు పురశ్చూడులు- తలకు ముందు భాగంలో గోష్పదమంత జుట్టుముడి కలవారు.

పద్యమంతా వైష్ణవ బ్రహ్మచారి వేష వర్ణన. శరీరం మీద 12 స్థానాల్లో పుండ్రములుపెట్టుకోవటం వైష్ణవాచారం. ఫాలం- గొంతు-గుండె మీద, ఉదరం ఇరుప్రక్కలా- ఉదరం - కంఠం- బాహువులు- శిరస్సు- భుజాగ్రాలు మొ॥వి.

**అలం :** ఉపమ. మలిన శరీరం - ధూమం. బ్రహ్మ శరీరం.హిరణ్మయ పురుషుడు = శిఖ. 2-33 బ్రాహ్మణ వర్ణన చూడు.

విశే ॥ కావ్యంలో అద్భుతరసస్థానాల్లో ఇది మూడోది. దీనివల్ల పూర్వకథలో రసం వీర మని ధ్వని.

**వ. ఇట్లు భాగవత పరిచయ ప్రభావంబున బ్రాహ్మణ్యంబె కాక భాగవత శ్రీయునుం గలిగి యుప్పు చింది యినుమడియగు చందంబునం బరమహర్షభరితుండై స్వరూపాను రూపంబుగా నతనికిఁ బూజఁ గావించి.** 87

భాగవత పరిచయ = విష్ణుభక్తునితో కలిగిన పరిచయముయొక్క; ప్రభావంబునన్ = మహత్తువల్ల; ఉప్పు; చింది = పగిలి; ఇనుమడి = రెట్టింపు; అగు; చందంబునన్ = విధంగా; స్వరూప = తన ప్రస్తుత వైష్ణవ సన్న్యాసి రూపానికి; అనురూపంబుగా = తగినట్లు; పూజ; కావించి= చేసి.

సీ. జయ దురుత్తరణ సంసరణాబ్జదళనీర
జయజయ గాయక సార్వభౌమ,
జయ శౌరి గాథారసజ్ఞ పుణ్య రసజ్ఞ
జయజయ తత్త్వసంశయ లవిత్ర,
జయ జనార్వాచీన జని సంగ వంచక
జయజయ దేశిక చరణ శరణ,
జయ యుక్త వాక్ప్రతిష్ఠా తృణీకృత దేహ
జయజయ భగవదాజ్ఞా కృతిష్ఠ

తే. జయ సకలజంతు సమచిత్త జయ దయార్ద్ర,
జయ ముకుందాన్యదేవతా శాస్త్రబధిర
జయ చతుర్ద్వయ భక్తిలక్షణ చితాంగ
జయ మురారిప్రపన్నాంఘ్రి జలజమధుప. 89

దుర్+ ఉత్తరణ = దాటశక్యంకాని; సంసరణ = సంసారమన్న; అబ్జ = తామర; దళ = ఆకుపై (ఉన్న); నీర = నీటిబిందువువంటివాడా; జయజయ; గాయక = పాటగాండ్లలో; సార్వభౌమ = చక్రవర్తీ; జయమగుగాక.

తరింప శక్యం కానట్టి సంసార ప్రవాహంలోని తామరపూవు రేకుల్లో అంటీ అంటనట్లుండే జల బిందుస్వరూపుడా ! గాయక చక్రవర్తీ ! ''పద్మ పత్రమివాంభసా'' - గీతావాక్యార్థమే ఈ పాద భావం.

శౌరి = శూరసేన వంశీయుడైన శ్రీ కృష్ణు!; గాథా = కథలయొక్క; రసజ్ఞ = రసాస్వాదనం తెలిసిన; పుణ్య = పవిత్ర; రసజ్ఞ = నాలుక కలవాడా! ; తత్త్వసంశయ = ఆధ్మాత్మిక సందేహాలకు; లవిత్ర = కొడవలివంటివాడా ! జయజయ.

శ్రీకృష్ణ గాథల్లోని రసం తెలిసి పాడే నాలుక కలవాడా! అధ్యాత్మ సంశయాలు నరికే కొడవలివంటివాడా! (''కథయ రసనే గోపకన్యాభుజంగం''- శ్రీకృష్ణకర్ణామృతం.)

జన = మనుష్యుల్లో; అర్వాచీన = నీచమైన; జని = పుట్టుకయొక్క; సంగ = కూడకతో; వంచక = మోసంచేసేవాడా !; దేశిక = గురూత్తముని (శ్రీమన్నారాయణుని); చరణ = పాదాలే; శరణ = ఆశ్రయించినవాడా !

5వ పద్యంలో చెప్పినట్లు మసిపాత మానికంబైన వాడు కావటం వల్ల నీచ జన్మతో లోకాన్ని వంచించేవాడు. గురుపరంపరకు ఆద్యుడు శ్రీమన్నారాయణుడు. అతని చరణములనే శరణన్నవాడు.

ఉక్త = అన్నట్టి; వాక్ = మాటయొక్క; ప్రతిష్ఠా = నిలుపుకోవడంచేత; తృణీకృత = గడ్డిపోచగా చేయబడ్డ; దేహ = శరీరంకలవాడా ! భగవత్ + ఆజ్ఞా = భగవంతుని ఆనతిని; కృతి = పాలించడంలో; ష్ఠ = నిలిచినవాడా !

అన్న మాటకు కట్టుబడి రాక్షసునికి శరీరాన్ని అర్పించిన వాడు కనుక - తనువును తృణీకరించినవాడు (ప్ర+ లిప్త = ఉనికి)

భగవదాజ్ఞను పాటించేవాడు. (86 వ. వచనం చూడు)

సకలజంతు = అన్ని జీవరాసులపై; సమ = సమత్వం గల; చిత్త = మనస్సు కలవాడా ; దయ+ ఆర్ద్ర = దయాగుణంతో స్నిగ్ధమైన బుద్ధి కలవాడా !

ముకుంద+ అన్యదేవతా = విష్ణువుకంటె ఇతర దైవబోధచేసే; శాస్త్ర = గ్రంథాలకు; బధిరా = చెవిటివాడా !

ఆ గ్రంథవాక్యాలను చెవిని పెట్టనివాడు (43 పద్యం చూడు).

చతుర్ద్వయం = నాల్గు రెళ్ళు = ఎనిమిది; భక్తిలక్షణ = భక్తి చిహ్నాలతో; చిత = అలంకృత( రచిత); అంగ = అవయవాలున్న వాడా!

8 లక్షణాలు = భాగవతులందుప్రేమ, భగవత్పూజపైకోర్కె, భగవదర్చన, భగవంతుని విషయంలో దంభం లేక పోవడం, స్వామి కథాశ్రవణవాంఛ, కంఠస్వరం కన్నులు, అంగాలలో మార్పు (సాత్త్విక భావోదయం కల్గటం), భగవత్ స్మరణం, మాంసం తినక పోవటం- ఇనే అష్టవిధ భక్తులు.

ముర+ అరి = మురాసురుని శత్రువు-నారాయణుడు (అతని), ప్రపన్న = భక్తుల; అంఘ్రి = పాదాలన్న; జలజ = తామర పూలలోని; మధుప = తేనె త్రాగే తుమ్మెదా! 6వ పద్యం దాసరి శరీరవర్ణన. ఇది జీవాత్మ వర్ణన.

విష్ణుచిత్తుడు దశావ తారవర్ణనచేసాడు. ఇక్కడ భాగవత వర్ణన శ్రీరంగవర్ణనలోనూ భాగవత వర్ణన వస్తున్నది. 4-190 లోనూ ఇదే. ఇవన్నీ విష్ణుచిత్తుని వర్ణనలో కలిపి చదివితే శ్రీవైష్ణవ వర్ణనమౌతుంది.

**వ. అని ప్రస్తుతించి ప్రదక్షిణంబు గావించి పునర్భుభయంబున భవన భార్యాప్రముఖ సుఖవిముఖుండై బదరీవనాది పురుషోత్తమాధిష్ఠిత పుణ్యభూములఁ బౌనః పున్యంబుగం దీర్థయాత్రఁ జరించుచుఁ బరమనిర్వృతిం బొందె; నిప్పుణ్య కథ వహన సమయంబునఁ గుహనావరాహంబువలన మహీమహిళ మదీయ పూజోచితోపచారంబుల విశేషఫలదంబు గానంబ యన విని వైష్ణవియుం దాఁగావునఁ దదాకలన కుతూహలంబునం గూఁతురై నీ కొదవి యహరహంబును విప్రలంభ దంభేరితా గాథగాథార్థ సమేతగీతరసంబునం బ్రొద్దు పుచ్చుటగాని వేఱొండు గాదేమి తపంబు సేయుచున్నదియో యం టింతకంటెఁ బరమతపం బున్నదే ? యన్నియును మేలయ్యెడు, శ్రీరంగంబునకు రంగేశు సేవింపఁ దోడుకొని పోయి రమ్మనుటయుఁ బ్రసాదమ్మని ప్రణామమ్ము సేసి పసిండి పల్లకి నబ్బాలికా రత్నంబు నునిచి పరిచారికా శతంబును భాగవతపరిషత్తునుం గొలువఁ బ్రయాణ పర్యాయంబులఁ బరమానురాగంబునం బోయి.** 90

ప్రస్తుతించి = మనసారా నుతించి; ప్రదక్షిణంబు = దాసరికి వలగొని; పునర్భవ భయంబునన్ = మరల ఎత్తే జన్మను గురించిన భయంతో; భవన = ఇల్లు; భార్యా = ఇల్లాలు; ప్రముఖ = మొదలైన; సుఖవిముఖుండై = సుఖాలను కాదని; బదరీవన + ఆది = బదరీ మొదలైన; పురుషోత్తమ+ అధిష్ఠిత = నారాయణుడు అధిష్ఠించిన; పుణ్యభూములన్ = పుణ్యక్షేత్రాల్లో; పౌనఃపున్యంబుగన్ = మాటిమాటికి; పరమ = మహా; నిర్వృతిన్ = ఆనందం; పుణ్యకథన్ = ఈ దివ్యగాథ; వహన సమయంబునన్ = భూమిని ఉద్ధరించిన వేళలో; కుహనావరాహంబు = అబద్ధపు పంది అవతారం; మహీమహిళ = భూదేవి; పూజ+ ఉచిత = పూజకుదగ్గ; ఉపచారంబులన్ = సేవలలో; విశేష = విశిష్ట; ఫలదంబు = ఫలితమిచ్చేది; తత్+ ఆకలన = దానిని వినటం; కుతూహలంబు = కోరిక; అహః+ అహంబున్ = ప్రతినిత్యం; విప్రలంభ = విరహ; దంభ = మిష; ఈరిత = స్తుతింపబడిన; అగాధగాధ+ అర్థసమేత = లోతైన కథల అర్థంతో కూడిన; గీత = పాట; రసంబు = సారం; ప్రసాదము = ఆజ్ఞ; ప్రణామమ్ము = నమస్కారం; పసిండి = బంగారు, పల్లకిన్ = పల్యంకికలో; పరిచారికాశతంబున్ = వందమంది దాసీలను (దాసులను); భాగవత= వైష్ణవ; పరిషత్తున్ = సమూహం; కొలువన్ = సేవిస్తూఉండగా; పర్యాయంబులన్ = వరుసతో ( ఒక కొంత దూరం నడిచి మరలా విశ్రమించి రెండవ రోజు ప్రయాణం కొనసాగించటం) పరమ = గొప్ప; అనురాగంబునన్ = ప్రేమతో = భక్తితో.

సోమశర్మ సన్న్యసించాడు. మొదటి పాండ్య చక్రవర్తి సన్న్యసించలేదు. కవి ఇలా ఎందుకు వ్రాసినట్లు? ఇతడు బ్రాహ్మణుడు వ్యక్తి,అతడు రాజు. వ్యక్తి కాడు. రాష్ట్రస్వరూపుడు. ఇతని భూమిక రాజపాలన. అతని భూమిక ఆధ్యాత్మ విద్యారాధన. అతనికి సన్యాసం పరమధర్మం కనుక

దీన్నే ప్రాచీనుడు వర్ణధర్మ మన్నాడు. వర్ణమాశ్రమ భౌతిక రూపమే సమాజం.

## భావోన్మేషం

అవతారికలో ఇష్టదేవతాస్తుతిక్రమానికీ రంగనాథవర్ణన వ్యతిరేక క్రమంలో వర్ణితం కావటం చాలా విశేషం.

అక్కడ పర తత్త్వం క్రిందికి దిగి వచ్చి లీలావిభూతి (సృష్టి)గా పరిణమించినదని చెప్పి, ఇక్కడ సాక్షాద్వైకుంఠంగా శ్రీరంగం; శ్రీరంగపతిని సాక్షాత్పరతత్త్వంగా వర్ణితమైనందున

శ్రీరంగమంటె శ్రీమద్వేదాంతదేశికుల రచన భగవద్ధ్యాన సోపానం ప్రకారం వైకుంఠం. శ్రీరంగనాథుడంటే వైకుంఠపతి అనే అర్థం. కనుక విష్ణుచిత్తుని రంగనాథ దర్శనం భక్తుని అంతర్లోక-ఆత్మయానం. లేదా ఊర్ధ్వ ముఖ ప్రయాణం. ఇష్టదేవతాస్తుతిలో తత్త్వం క్రిందికి దిగిరావటం. ఇక్కడ దిగివచ్చిన జీవుడు తిరిగి వచ్చినచోటికి పోయేముక్తి మార్గం. కనుక అవతారికలోని 10 వ పద్యం నుండి వెన్కకు చదువుకుంటూ పోతే వచ్చే ప్రథమ పద్యం ఇక్కడి రంగనాథ వర్ణన. ఆళ్వార్లు. ఆయన శరీరావయవరూపంలో. సారూప్యంలో ఉన్నారు. ఆయుధాలున్నాయి. స్వామి ఆదిశేషుని పై నున్నాడు. గరుత్మంతుడు సన్నిధానంలో. వాకిట విష్వక్సేనుడున్నాడు. ఇది ఆరోహణ క్రమం.

ఇక ఈ దీర్ఘ విచిత్ర వర్ణనం లోకోత్తరమంటే భాషలో భావనలో. భాష ఇతరత్ర కన్పించవచ్చు. కానీ వర్ణనాధారమైన దివ్యభావన - తద్ద్వారా కన్పించిన తేజోరూపం- నాన్యతోదర్శనీయం.

శ్రీరంగ దర్శనం

మ. చని కాంచె న్విరజాభిధాంతరవపు స్సహ్యోద్భవాతీర నం
దనవాటీ వలయద్రుమావళి దళాంతర్దృశ్య పాపాళి భం
జన చాంపేయసుమాయమాన విషమస్వర్ణావృతి వ్రాత ర
శ్మి నభస్పృ క్శిఖరాళి దీపకళికా శృంగంబు శ్రీరంగమున్. 90

చని = (విష్ణుచిత్తుడు) వెళ్ళి; విరజ = విరజానది (వైకుంఠం ప్రక్క పారేనది); అభిధాంతర = మరొకపేరి; వపుః = శరీరంగల; సహ్య+ ఉద్భవ = సహ్య పర్వతాల్లో పుట్టిన కావేరియొక్క; తీర = ఒడ్డునే ఉన్న; నందనవాటీ = నందనమన్న పేరు గల ఉద్యాన వాటికల్లో; వలయ = గుండ్రంగా ఉన్న; ద్రుమ = చెట్ల; ఆవళి = సమూహంయొక్క; దళ = ఆకుల; అంతః = నడుమనుండి; దృశ్య = కన్పించే; పాప+ అళి = పాప భ్రమరాలను; భంజన = నాశనం చేయుటలో; చాంపేయసుమ + అయమాన = సంపెంగ పూవులుగా నవుతున్న; విషమ = బేసిసంఖ్య గల; స్వర్ణ = బంగారు; ఆవృతి = ప్రాకారాల; వ్రాత = సమూహపు; రశ్మి = కిరణాలతో (వెలిగే); నభస్పృక్ = ఆకాశాన్ని తాకుతున్న; గోపురాల గుంపులన్న; దీపకళికా = శిఖర + ఆళి = దీపాలజ్వాలలు గల; శృంగంబు = అగ్రభాగం గల; శ్రీరంగమున్ = ఆ పుణ్యక్షేత్రాన్ని; కాంచెన్ = చూచినాడు.

వైకుంఠం విరజానది ఒడ్డున ఉన్నట్లుగా శ్రీరంగం కావేరి ప్రక్కన ఉన్నది. శ్రీరంగం చుట్టూ వలయాకారంలో తోటలున్నాయి. వైకుంఠంలో (స్వర్గంలో) నందనవన మున్నట్లు ఆచెట్ల ఆకుల నడుమనుండి సప్త ప్రాకారాలు కన్పిస్తున్నవి. ఆప్రాకారాల కోట కొమ్మలు సంపెంగ పూల ఆకారంలో ఉన్నాయి. కనుక స్వర్ణమయమైన సంపెంగ దళాలే- దర్శించిన వారి పాపాలన్న తుమ్మెదలను మూర్ఛ పొందిస్తున్నది. ఆ కోట కొమ్మల పంక్తి దీప జ్వాలాకృతిలో ఉంది. దీపాల అలంకరణతో శోభిస్తూ ఉంది కనుక. (కోట కొమ్మలు అగ్ర భాగం కళిక లాగానే ఉంటుంది. దిగువ భాగం దీపం లాగా) ఆదీపాల వరుసలతో ప్రకాశిస్తూ ఉన్న భూలోక వైకుంఠాన్ని విష్ణుచిత్తుడు దర్శించాడు.

**అలం :-** రూపకం, అతిశయోక్తి.

**విశే॥** 2, 3,4,5 - పద్యాల్లో మధురానగరం తోట- కోట వర్ణింప బడ్డాయి. కోట కొమ్మల పంక్తి- సంపెంగ దండవోలె- పోల్చు.

దాసరి కథలో వటవృక్షవర్ణనం. దీనికీ భేదం చూచుకోవాలి. శ్రీరంగం రమ్మంటున్నది. వటవృక్షం పొమ్మంటున్నది.

ఈ కావ్యంలో శ్రీ విలుబుత్తూరు- మధుర- శ్రీరంగం మూడు పట్టణ వర్ణనలున్నాయి. వీటి ఔచిత్యం చూచుకోవాలి.

నందనవనం- శ్రీరంగాన్ని భూలోకవైకుంఠంగా చేసింది యామునాచార్యులు. ఆయన పూదోట పేరు నందనవనం. శ్రీకృష్ణ రాయలవారి పూలతోట కూడా నందనమే.

శ్రీశైల శిఖరం చూస్తే పునర్జన్మ లేదన్నట్లుగా ఉంది ఈ వర్ణనం కూడా.

క. చోళీ హల్లక చితకచ
పాళీ పాళీభవ ద్విపంచీ స్వనభృం
గాళీ కవేరదుహితృ మ
రాళీ ధ్వను లెసఁగు గాడ్పు వ్రతి వడ యుడిపెన్. 91

చోళీ = చోళ దేశస్త్రీలు; హల్లక = ఎఱ్ఱకలువలు; చిత = కూర్చబడ్డ; కచ = కేశ; పాళీ = పాశంలో (కబరీభరంలో); పాళీభవత్ = వరుసలు తీర్చినవై; విపంచీస్వన = వీణాధ్వనులు చేసే; భృంగ+ ఆళీ = తుమ్మె దల బారులయొక్క; కవేర దుహితృ = కవేరమన్న సహ్యా పర్వత శ్రేణిలో పుట్టిన( కూతురు) కావేరిలో; మరాళీధ్వనులు = హంసలస్వరాలు; ఎసఁగు = విసరే; గాడ్పు = గాలి; వ్రతి = తపస్వి విష్ణుచిత్తుని యొక్క; వడన్ = శ్రమను; ఉడిపెన్ = పోగొట్టింది.

దూరంనుండి నడచి వచ్చిన విష్ణుచిత్తుని శ్రమను కావేరిపైనుండి వీచే చల్లని గాలులు పోగొట్టినవి. ఆగాలిలో చోళదేశాంగనలు కేశపాశ మందు కూర్చుకొన్న ఎఱ్ఱ కలువలపై మూగే తుమ్మెదల ఝుంకారాలూ- నదిలోని హంసలనాదాలూ ఉన్నాయి. కనుక చెవికి కమ్మని సంగీతం కూడా లభించినందున ఆయన శ్రమ త్వరగా తొలగిపోయింది.

అలం : స్వభావోక్తి.

విశే ॥ 4-34లో విష్ణుచిత్తుని విలుబుత్తూరి ప్రజలు ఎదురేగి మేళతాళాలతో- దేవాంగనలతో స్వాగతి నెరపినట్లు ఇక్కడ కూడా మహాభక్తునికి భృంగాల సంగీతాలు- హంసరాగాలు స్వాగతం చెప్పినట్లుగా ఉంది.

గీ ॥ ఆతఁడఘమర్షణ స్నాన మమ్మరుద్వృ
థాంబువుల నాడి, మాధ్యాహ్ని కాదిఁ దీర్చి,
స్నాతయు నలంకృతయు నౌ తనయదోడు
కొనుచు వైష్ణవ పరిషత్తు గొలువ నరిగి. 92

ఆతఁడు = విష్ణుచిత్తుడు; మరుత్ +వృతా = కావేరి; అంబువులన్ = నీళ్ళలో; అఘ = పాపాలను; మర్షణ = పోగొట్టే మంత్రాలు పఠిస్తూ; స్నానమున్ +ఆడి = స్నానం చేసి; మాధ్యాహ్నిక+ ఆది =

మధ్యాహ్నమందు చేసే వైష్ణవ కృత్యాలు - (బ్రహ్మయజ్ఞ పితృయజ్ఞములు); తీర్చి = నెరవేర్చి; స్నాతయున్ = స్నానం చేసినదీ; అలంకృతవు = అలంకరించున్నదీ; ఔ = అయిన; తనయన్ = గోదాదేవిని; తోడుకొనుచున్ = వెంట బెట్టు కొంటూ; వైష్ణవ పరిషత్తు = వైష్ణవ భక్త సమూహం; కొలువన్ = పరివేష్టించి రాగా; అరిగి = పోయి;

కావేరిలో అఘమర్షణ స్నానం చేసి సైకతాల్లో మధ్యాహ్న వైష్ణవ కర్మలు నిర్వర్తించి తనతో పాటుగా స్నానం చేసి అలంకరించుకొన్న కూతురు, భక్తులు చుట్టుకొని రాగా వెళ్లి.

అసంపూర్ణ క్రియ దైవదర్శనం చేయాలన్న తపనను సూచిస్తుంది.

సీ. చరణంపు సరపణి మొరపంబు విన్నదం
  తులతోనె యెదురు నింతులకుఁ దొలగి,
యిడినట్టి మణిముష్టి గృహుల యారతి కెంపు
  టూల కలయ ద్వారాలఁ జల్లిఁ,
బ్రసవాది తావికిఁ బ్రతిగ్రహేశార్చ భ
  క్ష్యపు వల్పునకె పోలె శ్వాస ముడిచి,
నృత్త గీతోత్థ శౌరి స్తుతిఁగీర శా
  రిజయట్ల యర్థోరరీకృతి విని,

తే. వలభి రత్నాంశువులఁ గట్టు తెలుపు చిత్ర
మగుట కోర్వక దిగదిగ నరిగి ధాన్య
మడిగెడు విరక్త భాగవతాళి వలన
వెల్లదీవిని బోని యవ్వీడు సొచ్చి. 94

శ్రీరంగంలో విరక్త భాగవతుల చర్యలు

చరణంపు = పాదాల; సరపణి = గొలుసుల; మొరపంబు = ధ్వని; విన్నన్ = వినగానే; దంతులతోనె = ఏనుగులతోపాటుగా; ఎదురు = ఎదురైన; ఇంతులకున్ = స్త్రీలకూ; తొలగి = ఓసరిల్లి.

ఏనుగులు శ్రీరంగస్వామి ఆలయానివి. వీథుల్లో తిరుగుతున్నవి. వాటికాలికి కట్టిన గొలుసులుమ్రోగితే- విన్న భాగవతులు తలవంచుకొని నడుస్తున్నారు కనుక - వాటిని చూచి దారి తొలగుతున్నారు. అలాగే ఇంతులకూ తొలగుతున్నారు. వీరూ గజగమనులు కనుక. కాలికి గొలుసులు కడియాలున్నవి కనుక. దంతులకూ ఇంతులకూ తొలగిపోతున్నారు.

ఇడినట్టి = పెట్టిన; మణిముష్టిన్ = రత్నాల బిచ్చాన్ని; గృహుల = గృహస్థుల; ఆరతి కెంపురాలనే = హారతిగా ఇచ్చిన ఎర్రని రత్నాలతో; కలయన్ = కలిసిపోయేటట్లుగా; ద్వారాలన్ = ఇచ్చినవారి వాకిళ్ళనే; చల్లి = పారవేసి.

భాగవతులకు బియ్యానికి బదులు రత్నాల భిక్షవేస్తే విరక్తులు కనుక వాటిని వాళ్ళు ద్వారాల్లోనే చల్లారు. అవి గృహస్థు లిచ్చిన హారతి కెంపులతో కలిసిపోయాయి.

హారతి దీపజ్వాలతో ఇవ్వక కెంపులతో ఇస్తున్నారన్నమాట.

ప్రసవ+ ఆది = పూలు మొ॥గు; తావికిన్ = వాసనలకు; ప్రతిగృహ+ ఈశ = ప్రతి యింటి యజమాని; అర్చ = పూజాసంబంధమైన; భక్ష్యపు = నైవేద్యమైన పిండివంటల; వల్పునకు +పోలెన్ = వాసనకు లాగా; శ్వాసమున్ = గాలిని; ఉడిపి = బంధించి;

గృహాలనుండి నైవేద్యపు వాసనలు వస్తున్నవి. వీథుల్లో పూలూ ఉన్నాయి. రెంటినీ పీల్చకుండా గాలిని బంధిస్తున్నారట, భాగవతులు ప్రాణాయామాభ్యాస మున్నవారు కనుక.

నృత్త = నాట్యం; గీత = సంగీతం ద్వారా; ఉత్థ = విన్పించిన(లేచిన); శౌరిస్తుతిన్ = హరినామ సంకీర్తనను; కీరశారిజయట్లన్ = చిలుకల- గోర్వంకల మాటలుగా; అర్ధ = సగం; ఉరరీకృతిన్ = అంగీకారంతో; విని-

వాద్య సంగీతాదులు విరక్తులకు నిషిద్ధం కనుక- మరి అందులో విన్పించేది శౌరి గాథ కనుక విననూలేక మాననూలేక- ఆపాట చిలుకల గోర్వంకల పాటగా సగం అంగీకారంతోవిని;

వలభి = ఇండ్ల చూరుల్లో తాపిన; రత్న = మణుల; అంశువులన్ = కావటానికి; ఓర్వక = సహించక; దిగదిగన్ = త్వరత్వరగా; అరిగి = పోయి; ధాన్యము = బియ్యం; అడిగెడు = రత్నాలు వద్దు, బియ్యం పెట్టం డంటున్న; విరక్త = ఐహిక సుఖాలపై అనురక్తిలేని; భాగవత+ ఆళి = భక్తుల సమూహంతో; వెల్ల దీవినిన్ +పోలి = శ్వేత ద్వీపంతో సదృశమైన; ఆవీడు = ఆశ్రీరంగ పట్టణం; చొచ్చి = ప్రవేశించి;

ముంజూరుల్లోని రత్నాల కాంతులకు తమ తెల్లని వస్త్రాలు రంగు లద్దినట్లు కాగా అది విరక్తులకు పనికి రాదు కనుక త్వరగా పోయి బియ్యం యాచించే మహాభక్తులతో శ్వేత ద్వీపం వంటి ఆ పట్టణం విష్ణుచిత్తుడు ప్రవేశించి.

**అలం :** - ఉదాత్తం.

**విశే ॥** శ్రీవిలుబుత్తూరి వర్ణనలతో పోల్చుకోవాలి.

అక్కడ ఇంతులు- (59-60) - అక్కడి పణ్యారంపు కంపులు. (1-73) ఇందులో మూడవ పాదం; అక్కడ 1-51. ఇక్కడి ''వలభి రత్నాంశువులు''

ముక్తి పొందినవారు సైతం శ్రీరంగంలో భిక్షాటన కోరుకొంటారని శ్రీవైష్ణవ విశ్వాసం.

యామున - రామానుజు లలాగే చేసారట. వేదాంత దేశికులు - ఇతరులు- కనుక అదిశ్వేత ద్వీపం.

4-200 యామునాచార్యుని శ్రీరామమిశ్రుడు ప్రబోధించిన పద్యం ఈ రంగనాథునకు సంబంధించినదే.

ఉ. గోపుర కందరాళి కడకు న్శశి పుష్కరిణీ కణార్ద్ర సం
తాపహరానిలంబులు వితానరణన్మణికింకణీ కలా
లాపముల న్సుఖం బడుగ నా ఆటిటఁజొచ్చి యకాండ గాహనా
చాపల కృన్మరుద్గణముఁ జండుఁ డదల్చెడు లోనివాకిటన్. **95**

గోపురకందర+ ఆళి = దేవాలయ శిఖరాల గుహల దగ్గరకు; శశిపుష్కరిణీ = చంద్రనామం కల కోనేటి; కణ = నీటిబొట్లతో; ఆర్ద్ర = తడిసిన; సంతాపహర = శ్రమను పోగొట్టే; అనిలంబులు = గాలులు; వితాన = పైభాగాల్లో- శిఖరభాగాల్లో; రణత్ = మ్రోగుతున్న; మణికింకిణీ = రత్నాల చిరుమువ్వల; కల+ ఆలాపమున్ = శబ్దానికందని మాటలతో (అవ్యక్త భాషలో); సుఖంబున్ = యోగక్షేమాలను; అడుగన్ = అడుగుతుండగా; ఆటిటన్ = ఆరు ప్రాకారాల్లో; చొచ్చి = (విష్ణుచిత్తుడు) ప్రవేశించి; అకాండ = వేళకాని వేళలో; గాహనా = ప్రవేశించటంలోని; చాపలకృత్ = చాపల్యం ప్రదర్శిస్తున్న; మరుత్+ గణమున్ = దేవతల సమూహాన్ని; చండుడు = ఆపేరుగల ద్వారపాలకుడు; అదల్చెడు = పోవద్దు, పొండి అని అంటూ వెళ్ల గొడుతున్న; లోనివాకిటన్ = లోపలి ద్వారం దగ్గర. (సప్తమ ప్రాకార ద్వారం దగ్గర).

దేవాలయంలో (సప్తప్రాకారాలున్న గుడిలో ఒక ప్రాకారంలోఉన్న) చంద్రపుష్కరిణిలోని నీటి బొట్లతో తడిసిన గాలులు గోపురాల్లోని గూళ్ళలలో నుండి వీస్తుంటే అక్కడున్న మణికింకిణులు మ్రోగుతున్నవి. ఆమ్రోతల నుండి లోనికి ప్రవేశించే విష్ణుచిత్తుని 'సుఖంగా ఉన్నారా' అని అడుగుతున్నట్లున్నవి. దేవతులు గుంపులు గుంపులై లోపలికి ప్రవేశిస్తుంటే చండుడు అదలిస్తున్నాడు. అలాంటి ఆరు ప్రాకారాలు దాటి సప్తమ ప్రాకారంలోకి ప్రవేశించాడు విష్ణుచిత్తుడు.

విశే॥ పావన వాయువులు కుశల ప్రశ్నలు చేస్తున్నట్లుగా ఎదురుగా వస్తూ శ్రమను పోగొడుతున్నవి. మూడవ పాదంలోని యతివిశేషం :- కల + ఆలాప - ఆటిటం - ఘఞ్యతిగా ఆనందరంగరాట్ఛందంలో చెప్పబడినది. లప్ ధాతువుకు భావార్థకంలో పరమైన ' ఆ ' కు యతి - 'ఆటిట' కు బదులు 'లలాస' అన్న వేదం కల్పన అసమంజసం.

ఒక జైన్ బౌద్ధాచార్యుడు బుద్ధదేవుని సందేశాన్ని శిష్యులకు విన్పించాలను కొంటూ ఉంటే ఒక పక్షి కూసిందట. ఆయన అన్నాడట- 'నేచెప్పనక్కర్లేదు. పిట్టపాడిందదే' - అని. సృష్టిలోని పంచభూతాలూ, సర్వజీవరాసులూ- అంతర్యామి శరీరాలే కనుక మాట్లాడుతూనే ఉంటాడాయన- ఆయానోళ్లనుండి - వినగలిగితే- ఈ దృక్పథం లేనివాని కిలాంటి మాటలు అతిశయోక్తులో, ఉత్ప్రేక్షలో ఔతాయి. కానీ కాదు. అవి మరొక చైతన్య భూమికకు పోగలిగితే తోచే సత్యాలు.

ఉ. వేత్రముఁ గేలఁ బూని మణివేదిఁ గుథంబు పయి న్సితాంబురు
క్షేత్రుని ముద్రవే ల్మెఱయ నిశ్చలులై యిరుమై మనాఙ్మమ

ధ్గాత్రుల దంతివక్త్రులశతంబు వినీతి భజింప నొప్పు త
త్సూత్రవతీశు వతంసముతోఁ గని యాతఁడు భక్తి సేయఁగన్. 96

వేత్రమున్ = బెత్తాన్ని; కేలన్ = చేతిలో; పూని = తాల్చి; మణివేదిన్ = రత్నాల అరుగుపై; కుథంబు పయిన్ = పరిచిన కంబళిపైన; సిత+అంబురుట్ = తెల్లతామరవంటి; నేత్రుని = నేత్రాలవాని; (శ్రీహరి); ముద్ర = ఉంగరం; వ్రేల్ = (కల)వ్రేలు; మెఱయన్ = ప్రకాశిస్తూ ఉంటే (లేదా వ్రేలికి ముద్రిక మెరుస్తున్నది); ఇరుమైన్ = రెండుప్రక్కలా; నిశ్చలులై = చలనం లేకుండా; మనాక్ = కొంచెంగా; నమత్ = వంగిన; గాత్రులన్ = శరీరాలుగల; దంతివక్త్రుల = ఏన్గు మొగాలవారి; శతంబు = నూరు (అనేకం); వినీతిన్ = వినయంతో; భజింపన్ = సేవిస్తూ ఉండగా; ఒప్పు = వైభవంతో ప్రకాశించే; తత్ = ఆ; సూత్రవతి+ ఈశున్ = సూత్రవతీదేవి భర్త- విష్వక్సేనుని; వందనముతోన్ +కని = విష్ణుచిత్తుడు నమస్కారంతో చూచి; ఆతడున్ = తిరిగి ఆ విష్వక్సేనుడున్నూ; భక్తిసేయగన్ = భక్తిని ప్రదర్శించగా.

విశే ॥ ఇది విష్వక్సేన వర్ణన .

ద్వారం దాటి లోపలకు వస్తే ఈయన కన్పించాడు. ఆయన వ్రేలికి రాజముద్రిక ఉంది. అది రాజాజ్ఞ శాసనాధికారం కలవానికి చిహ్నం. పీఠికలో 4వ పద్యంతో పోల్చు.

తే. అవిదిత పురందరాయుధం బైన కనక
శిఖరియునుబోలె నెఱకల జిగులు దెసల
నింగి నీరెండఁ గాయు వేదాంగు వినత
సుతుని నతిఁ గాంచి మగుడఁ దన్నతియుఁ గాంచి. 97

అవిదిత = తెలియబడని (తెలియని); పురందర = ఇంద్రుని; ఆయుధంబు = వజ్రాయుధం; కలదైన; కనక శిఖరియున్+పోలెన్ = బంగారుకొండ శిఖరం లాగా ఉన్న; ఎఱకల = రెక్కల; జిగులు = కాంతులు; దెసలన్ = దిక్కుల్లో; ఈ రెండన్ +కాయున్ = లేత ఎండ కాస్తుండగా; వేద+ అంగున్ = వేదమయ శరీరుని; వినత సుతునిన్ = గరుత్మంతుని; కాంచి = దర్శించి; మగుడన్ = తిరిగి; తత్ = ఆయన; నతియున్ = నమస్కారం; కాంచి = స్వీకరించి;

ఇంకా లోపలకు పోగా స్వామి సన్నిధానంలో గరుత్మంతుడు కూర్చున్నాడు. ఆయన వర్ణన.

వజ్రాయుధం దెబ్బ తెలియని బంగారు కొండ శిఖరం లాంటివాడు; రెక్కల బంగారు కాంతులతో దిక్కులమధ్య లేతయెండలు సృష్టిస్తున్నవాడు- వేదమయాంగుడు.

ఆయనను చూచి నమస్కరించాడు విష్ణుచిత్తుడు. ఈయన కాయనా నమస్కారం పెడితే స్వీకరించి- (ముందుకు పోయాడు విష్ణుచిత్తుడు)

పీఠికలో ఖనటత్ - పద్యంతో పోల్చు. ఇందులో ఎగురుతున్న గరుత్మంతుడు- ప్రస్తుతం కూర్చున్నవాడు- కన్పిస్తారు. 4-19 పద్యం లోనూ గరుత్మంతుని చిత్రణముంది.

వ. అతనిచే విజ్ఞాపనంబు సేయించి యనుమతిం గాంచి చతుర్భుజులు జలధరశ్యాములు శతపత్రలోచనులు, చపలాపిశంగ వసనులు వనమాలికాబద్ధ బాహుమధ్యులు నైన మధుమథన ప్రతిబింబంబులం బోని పారిపార్శ్వకులఁ బరాంకుశ ప్రభృతిముక్తుల సేవించుచుఁ, దదభినందితులై చని మహావకాశంబును మణిమయ స్తంభ సంభృతంబును శాత కుంభకుంభ శోభిత శేఖరంబును నై చిత్రనేత్ర వితాన లంబమాన నానా ప్రసూనదామ ముక్తాగుళుచ్ఛచ్ఛ చామరంబును నుద్వేల కాలాగరు ధూప ధూపితంబు నగు మహావిమాన మధ్య విధుకాంత వితర్దికాతలంబునఁ జరణముఖ తత్త్రప్తీకాధిష్ఠిత ధర్మాదిసూరి పరిషదాత్మకంబును, దేజోమయంబును నగు విపుల విమల పీఠంబునఁ బరిమళాలోలరోలంబజాలంబగు నంబురుహంబు జాంబూనదత్విడుత్తమ్మర్ణ విస్తీర్ణకర్ణికోపరి వీథి నూధస్య పాథోనిధానంబునకుఁ బ్రథమహేతుభూతం బగు భూత తన్మాత్రయుం బోలెఁ బారద స్ఫటిక బటీర పాండురుచి పుండరీకంబుల పసకు మసక మసక లొసకొల్పు మిసిమిగల భోగిభోగ భాగంబునకుం బరభాగంబు మిగులఁదదాత్మకంబ యగు నుపబర్హంబున మహార్హకేయూరమణికర్బురం బగు కూర్పరం బూని, మననపరమునిమనోరాగ రస మార్జనం జేసి మిగుల నరుణిమ వహించెనోయనఁ జాలు కెంగేలు కపోలంబునం గదియం ద్రిదశ తరుకుసుమ కంచుకిత కంచుకి కంచుకాత్మకంబగు దుకూల నిచోళంబున నొత్తిగిలి యున్న వానిం, గరిం గఱకఱిం బెట్టి బిట్టు దనచేతి చక్రంబునం దెగిన నక్రంబు పూజ్యంబగు సాయుజ్యం బొందెనోయన నుపరిపరిదృశ్యమాన గండస్థలస్థ మణిమకరకుండల ప్రతిబింబ రుచిడంబరంబునం, బరమ సౌందర్య మకరందనిష్యంది యగు, ముఖారవిందంబున నందంబగువాని, నిర్నిమేషదృష్టి నెట్టుకొని చూచుతఱి నీలావదాతయు లొప్పవట్టు తఱి బిట్టెదుర్కొను కలధౌత గౌరగౌర మహామహః పూరంబున మునింగి దుర్నిరీక్ష్యయు నగు నిజరుచిరమూర్తివలనఁ దనదు సాకార నిరాకారతలు వారికిఁ జూపు రూపున దీపించు వానిఁ, గళత్రంబులగు శ్యామాచ్ఛాయలచేతఁ బ్రేముడిం బొదువంబడిన యట్లు కప్పులు దొంగలు లగు పక్ష్మకాలికల నొప్పు సోమ సూర్యాత్మకంబులగు వెడంద నిడువాలుటెత్తు సెరల కన్నులం కెందమ్మి తేకుల వెదఁజల్లువాని, మంకెన విరి బింకంబు నింకించు నధర శోణిమ నెపంబున వెలుంగు ముఖజనితహుతాశనుతోఁ దత్సఖుం డగు గంధవహుం గూర్ప నిక్కెనన నొక్కింత నిక్కి చొక్కంపుఁ బొటమలఁ జూపట్టి తిల కుసుమవిలసనాపహాసి యగు నాస భాసమానుం డగు వాని, నుదరజాత శ్వేతధామతామరసంబుఁ గనుంగొని మహదాశ్రయంబు గనిన పూర్ణిమా శశాంకుండను శంక నాతనికి నాకు వైరంబు మాన్పుమని తత్సహోదరి గావున రత్నకాంచనంబులు లంచంబులుగా నివేదించి యడుగులొత్తు నిందిరకు వరముం బడియున్న రాహువనం గేయూర కటకమణి ముద్రికాంకితంబగు దీర్ఘబాహుపరిఘంబు కటి తటోత్సంగంబున మెఱయు వాని, నురఃస్థల న్యస్త నిస్తులాస్తోక కౌస్తుభ గభస్తి మండలంబున నిండోలగంబుండు పుండరీక నికేతన తనుచ్ఛాయ యన నచ్ఛచ్ఛంబగు శ్రీవత్సంబున లోచనోత్సవంబుఁ గావించువాని, విజిత

మృగనాభి నాభి సౌరభ్యంబునకు నెగయు నుత్తుంగభృంగ మాలిక యన మెఱయు నసితపేశల తులసీ పలాశ దామంబున నభిరామ కోమలాలంకృతియగు వానిఁ, గపట కరటి విరోధియై యసుర యుసుఱుం గొని మగుడ మనుజాంగంబు నంగీకరించు నెడఁ దలపంబడమి నట్లన యుండెనన బడుగగు నడుముపసఁ గడు నొడిక మగువాని, ఘనజఘన చరమేతర ధరాధరాధిత్యకాతలంబునం గాంచన కాంచికామణిమకుట గగనమణి గాయు నీరెండ మెండనం బరఁగు మెఱుంగు పీతాంబరంబునం బొదువంబడి దాని సన్నఁదనంబునఁ దన నున్నఁ దనంబు వెలుపలం దోఁపఁ గనక పుష్య రాగంపుఁ దెరవారు వైదూర్యమణి స్తంభయుగంబునుం బోలెఁ గించిదామీలిత నీలిమంబగు నూరుయుగళంబు వానిఁ, ద్రైవిక్రమం బగు విగ్రహంబుతో నాగ్రహంబున మీఁదికిం జాచు తఱిఁ జంక్రమణరయంబునం దగిలివచ్చిన మణిమయ స్వర్భువన జాంబూనద ప్రాకార వలయం బనం దీండ్రించు నుద్దండ గండ పెండెరంబునం బొడము నఖండ ప్రభామండలంబునం బరిహిండి తంబులై మట్టిపండుల నడుపుగల మడమల బెడంగుపడి భావి నిజ కమఠావతార సూచకంబులుం బోలెఁ గొదమ తామేళ్ల మేళ్ల మీఁగాళ్లతోఁ గోకనద మృదూదరంబు లమర మెఱుఁగుఁ జుక్కల జిగి మొక్కపఱుచు నఖ చక్రవాళ చంద్రికల భక్తజన మనస్తమో విదళనంబుఁ గావించుచు హలకులిశ కలశ కమల మకరాంకుశాంకితంబులై లక్ష్మీకుచ కుంకుమాకలన నరుణారుణంబు లగు చరణంబులం దాపత్రయాపహరణంబు సేయువానిఁ నారాయణుం బురాణపురుషుఁ బురుషోత్తముఁ బ్రణతార్తిహరు వాసుదేవు హృషీకేశు నీశనుతు విభీషణవరదు ననంగజనకు రంగరమణుం గాంచి సహ సమాగత భాగవత పరిషత్సమేతంబుగాఁ దానుం దనుజాతయుం బ్రమద భయ భక్తి రసమగ్నులై జయజయ శబ్దంబులతో సర్వాంగాలింగిత క్షోణీతలంబు లగు నమస్కారంబులు గావించి నిలిచి నిటలతట ఘటితాంజలియై యిట్లని నుతియించె. 98

1. విజ్ఞాపనంబున్ = విన్నపమును; జలధరశ్యాములు = మబ్బువంటి నీలవర్ణం కలవారు; శతపత్ర లోచనులు = తామరవంటి నేత్రాలవారు; చపలా = మెరుపువంటి; పిశంగ = పచ్చని; వసనులు = వస్త్రాలవారు; వనమాలికా బద్ధ బాహుమధ్యములు = వనమాలిక ధరించిన వక్షస్థలం కలవారు; ప్రతిబింబంబులన్ పోలి = అద్దంలో కనిపించే ప్రతిబింబాలవలె; పారిపార్శ్వకులు = స్వామికి ప్రక్కనే ఉన్నవారు; పరాంకుశ = నమ్మాళ్వారు, ప్రభృతి = మొదలైన ; ముక్తులన్ = సాయుజ్యసారూప్య సామీప్య ముక్తిపొందినవారు;

చతుర్భుజులు - బాహుమధ్యులు- ఇదంతా భగవంతుని స్వరూపాన్ని ముక్తులు పొందినదశ - ఇదే సారూప్యం. (నమ్మాళ్వారు విష్ణుచిత్తునికంటె తర్వాత వచ్చినవారు.) ఇక్కడ కాలం లేదు. రాబోతున్న సృష్టికిది బీజావస్థ. కనుక దోషం కాదు.

తత్ = వారితో; అభినందితులై = ప్రశంసింపబడిన వారై;

2. మహో అవకాశంబునున్ = విశాలమైన స్థలం కలది; మణిమయ స్తంభ సంభృతంబును = రత్నాల కంబాలతో కూడు కొన్నదీ; శాతకుంభ = బంగారు; కుంభ = కుండలతో; శోభితంబు = అందగించే; శేఖరంబునున్ = శిఖరాలు కలదై; చిత్ర = రంగురంగుల; నేత్ర = వస్త్రాల; వితాన = మేలుకట్ల నుండి (చాందినీ) లంబమాన = వ్రేలాడుతున్న; నానా = అనేక; ప్రసూన = పూల; దామ = దండలు; ముక్తా = ముత్యాల; గుళుచ్ఛ = గుత్తుల; అచ్ఛ = నిర్మలమైన; చామరంబునున్ = వింజామరలు కలది; ఉత్+వేల = అధికమైన (తీరందాటిన); కాల+అగరు = నల్లని అగరుద్రవ్యం; ధూప = పొగతో; ధూపిత = వ్యాప్తమైన (పొగవేయబడిన); మహావిమాన = గొప్ప ఎత్తైన ప్రదేశంలో; విధుకాంత = చంద్రకాంత = పాలరాళ్ళు ; వితర్దికా తలంబునన్ = వేదికపై !

ఇది భగవంతుని ఆస్థానవర్ణన- విశాలశాల, రత్నస్తంభాలున్నాయి. స్తంభాగ్రాలు బంగారు శిఖరాలు- కుంభాలు కలది. రంగుల వస్త్రాలు పైభాగం నుండి వ్రేలాడుతున్నాయి. పూలదండలు- ముత్యాల వింజామరలు కలది. అగరుధూపం శాల అంతా వ్యాపించింది. అక్కడ చంద్రకాంత వేదిక ఉన్నది. దానిమీద -

(రెండవ పాండ్య చక్రవర్తి సింహాసన వర్ణనతో పోల్చు)

3. చరణముఖ = పాదాలు మొదలైన; తత్+తత్ = ఆయా; ప్రతీక+అధిష్ఠిత = అవయవాల నధిరోహించిన; ధర్మ = ఆపేరుగల; ఆది = మొదలైన; సూరి = ఆళ్వార్ల; పరిషత్+ ఆత్మకంబును = సమూహామయమైనది; తేజోమయం = దివ్యకాంతిమయం (భౌతిక పదార్థ లోకం కాని సూక్ష్మ తేజోలోకం); పరిమళ+ ఆలోల = వాసనకై ఎగిరే; రోలంబజాలంబు = తుమ్మెదల గుంపు; జాంబూనద = బంగారపు, త్విట్ = కాంతికి; ఉత్తమర్ణ = అప్పుపెట్టే; విస్తీర్ణ = విశాలమైన; కర్ణిక+ ఉపరివీధిన్ = నడిబొడ్డుపైన; ఊధన్య = పాలు; పాథోనిధి = సముద్రం; ప్రథమ = మొదటి; హేతుభూతంబు = కారణమైన; భూత తన్మాత్రయున్ +పోలెన్ = భూతసారంలాగా ( ఆకాశం భూతం- దాని తన్మాత్ర శబ్దం) భూతసూక్ష్మరూపంలాగా; పారద = పాదరసం; పటిక = స్ఫటిక; పటీర = చందనం; పాండురుచి = నిర్మలకాంతి (చంద్రుడు); పుండరీకంబు = తెల్లతామర; పసకున్ = నైగనిగ్యమునకు; మసమసకలు = మాలిన్యం; ఎసకొల్పు = ఎగసన ద్రోసే; మిసిమి = జిగులు; భోగి = ఆదిశేషుని; భోగభాగంబునకున్ = పడగలకు; పరభాగంబు = ఉత్కృష్టమైనది; తత్ + ఆత్మకంబ = శేషశరీరమయమైన; ఉపబర్హంబు = తలగడ;

చరణాద్యంగాలలో చిహ్నములై ధర్మాది సూరులుండగా కాంతిమయమైన బంగారుపద్మం నడిబొడ్డున, స్వచ్ఛమైన పాలసముద్రానికి మూలరూపం లాగా మెరిసే ఆదిశేషుని తెల్లని శరీరం మీద- అతనినే తలగడగా చేసికొని; అవయవం ఆళ్వారునకు ప్రతీక కనుక అవయవార్థం చెప్పబడినది.

4. మహోర్ణ = చక్కగా పొసగిన; కేయూర మణి కర్బురంబు = బాహుపురుల రత్నాల బంగారు కాంతులు వ్యాపించిన; కూర్పరంబు = మోచేయి; ఊని = ఆనించి (శేషునిపై అతనినే తలగడగా

చేసికొని మోచేతిపై పండుకొన్న శ్రీరంగస్వామి వర్ణన ; కేయూర మణి స్వర్ణకాంతులు అలముకొన్న మోచేయి )

5. మననపర = చింతనధ్యాన తత్పరులైన; ముని = ఆళ్వార్ల; మనో = మనస్సుల; రాగరస = భక్తిరసం ( ఎఱ్ఱని రసం); మార్జనన్ +చేసి = కడగటం వల్ల (మునగటం వల్ల); అరుణిమ = ఎరుపు; వహించెనోయన్ చాలు = తాల్చినదో యన్నట్లుగానున్న; కెంగేలు = ఎఱ్ఱనిచేయి; కపోలంబునన్ = చెక్కిలిపై; కదియన్ = చేరి యుండగా;

స్వామి చెంపపై చేయి చేర్చుకొని యున్నాడు. ఆ చేయి ఎఱ్ఱగా వుంది. ఎందుకంటే ఆళ్వార్లూ- భక్తులూ నిత్యమూ దానిని ధ్యానించటం వల్ల మనస్సుల్లోని రాగరస మంటినట్లుగా వుంది.

అలం : ఉత్ప్రేక్ష. - చూ. పీఠిక 10వ పద్యం.

6. త్రిదశ తరు = కల్పవృక్షం (దేవతల చెట్టు); కుసుమ = పూలతో; కంచుకిత = కప్పబడిన; కంచుకి = కంచుకం కలశేషుని (కంచుకం = కుబుసం); కంచుక+ ఆత్మకంబు= కుబుసమే ఐన; దుకూల = సన్నని; నిచోళంబునన్ = దుప్పటిపై; ఒత్తిగిలి యున్న వానిన్ = నడుము పై భాగం పైన లేచి యున్న శరీరంతో ఉన్నవానిని;

కల్ప వృక్షం పూలు రాలిన శేషునిపై- అతని కుబుసమే తెల్లని సన్నని దుప్పటి కాగా దానిపైన ఒత్తిగిలి యున్నవానిని;

7. కరిన్ = ఏన్గును; కఱకటిం = కష్టం; బిట్టు = మిక్కిలి; నక్రంబు = మొసలి; పూజ్యంబు = పూజనీయమై; సాయుజ్యంబున్ = స్వామి సాంగత్యం; ఉపరి = పైన; పరిదృశ్యమాన = చక్కగా చూడదగ్గ; గండస్థలస్థ = చెక్కిళ్లపై నున్న; మణి మకర కుండల = మణులతో చేసిన మకరాకృతి కుండలాలయొక్క; ప్రతిబింబరుచి = ప్రతిరూప కాంతుల; డంబరంబునన్ = ఆధిక్యంతో; పరమ సౌందర్య = గొప్ప అందమున్న; మకరంద = తేనెను; నిష్యంది = స్రవించే; ముఖ+ అరవింద = మోము తామరతో;

పై చెంపలో మకర కుండలాలు ప్రతిబింబిస్తూ ఉంటే స్వామి ముఖారవిందం సౌందర్య మకరందాన్ని స్రవిస్తున్నట్లుగా ఉంది. ఆ మకర కుండలా లెలా ఉన్నాయంటే ఏన్గును బాధించి స్వామిచక్రంతో మరణించి సాయుజ్య మందిన ఆనాటి మొసలిని గుర్తు తెస్తున్నవి. ( ఇదే ప్రతీక = అవయవ మంటే)

8. నిర్నిమేష = రెప్పపాటులేని; దృష్టి = చూపు; నెట్టుకొని = ప్రయత్నించి; చూచుతఱిన్ = చూచేవేళలో; నీల+ అవదాతయున్ = నీలి, తెలుపు రంగులు కలది; ఱెప్పవట్టు తఱిన్ = రెప్పపాటుతో చూచే టప్పుడు; బిట్టు = మిక్కిలి; ఎదుర్కొను = ఎదురయ్యే; కలధౌత = వెండిలాగా; గౌరగౌర = మిక్కిలి తెల్లనైన; మహో = గొప్ప; మహః పూరంబునన్ = కాంతిప్రవాహంలో; మునింగి = మునిగిపోయి; దుర్నిరీక్షయున్ = చూడరానిదీ; నిజ = తన; రుచిర = అందమైన; మూర్తివలనన్ = రూపంతో; స + ఆకార = రూపంతో; నిర్+ ఆకార = రూపంలేని తేజస్సుతో; దీపించువానిన్ = ప్రకాశించే వానిని;

రెప్పపాటులేకుండా చూస్తే నల్లని - తెల్లని కాంతితో సాకారంగా, రెప్పపాటుతో చూస్తే కేవలం తెల్లని కాంతిరాశిగా నిరాకారంగా - తోచే స్వామిని;

విశే ॥ ఇది చాలా ఆశ్చర్యకరమైన దర్శనం. మహాకవి ఈ వ్రాత ఆయన దర్శనానికి సంబంధించింది తప్ప వర్ణన కాదు.

9 కళత్రంబులు = భార్యలు; శ్యామా = నల్లనిరాత్రి; ఛాయ = నీడ; ప్రేముడిన్ = ప్రేమతో; పొదువం బడినయట్లు = కప్పబడినట్లు; కప్పులు = నల్లనివి; తొంగలు = నిడుదలైన; పక్ష్మ = రెప్పల; కాళికలన్ = నలుపు రంగులతో; ఒప్పు = ప్రకాశించే; సోమ = చంద్ర; సూర్య = రవి; ఆత్మకంబులు = స్వభావములైన; వెడంద = వెడల్పు; నిడువాలు = పొడవైన; ఎఱ్ఱసెరలన్ = ఎరుపు గీరలు కల; కన్నులన్ = నేత్రాలతో; కెందమ్మి = ఎర్రతామరల; ఱేకులన్ = దళాలను; వెదజల్లువానిన్ = వెదపెట్టే వానిని.

ఎర్రగీరలతో కెందమ్మి రేకులను వెదజల్లుతున్న నేత్రాలు విశాలంగా దీర్ఘంగా ఉన్నాయి. ఆనేత్రాలపై కనురెప్పలు సగం మూతపడి ఉన్నవి. అవి తమ భర్తలైన సోమ సూర్యులను పొదువు కొన్న నిశా- ఛాయాదేవుల వలె ఉన్నాయి. నిశ - నలుపు. ఛాయాంగన నిడువాలుదనానికి చిహ్నం.

విశే ॥ అద్భుతమైన వర్ణన. చంద్రార్కనేత్రుడు కనుక.

10. మంకెనవిరి = మోదుగు పువ్వు; బింకంబు = ప్రౌఢి; ఇంకించు = అడగించు; అధరశోణిమ = క్రిందిపెదవి ఎర్రదనం; నెపంబునన్ = మిషగా; వెలుంగు = ప్రకాశించే; ముఖజనితహుతాశనుతోన్ = ముఖం నుండి పుట్టిన అగ్నితో; తత్ = ఆ అగ్నికి; సఖుండు = స్నేహితుడు; గంధవహున్ = గాలిని; కూర్పన్ = చేర్చటానికి; నిక్కను +అనన్ = సాగినట్లు; ఒక్కింత = కొంచెం; చొక్కంపు = అందమైన; పొటమలన్ = పుటాలతో; తిలకుసుమ = నువ్వుపువ్వు; విలసన = అందాన్ని; అపహాసి = నవ్వే; నాసన్ = ముక్కుతో; భాసమానుండు = ప్రకాశించేవాడు;

స్వామివాతెర - ( క్రింద పెదవి) కింశుకం లాగా ఎర్రగా ఉంది. అదే అగ్ని. ఆయనతో స్నేహితుడైన వాయువును- (గంధవహుని) చేర్చటానికి కొంచెం సాగినట్లున్న నువ్వు పువ్వువంటి ముక్కు కలవాడు- అధరం వంకర మోదుగు. నాసిక నువ్వు పువ్వు. కొంచెం పొడవుగా ఉన్నది.

11. ఉదరజాత = పొట్టనుండి పుట్టిన; శ్వేత = తెల్లని; ధామ = కాంతి; తామరసంబున్ = తామరపువ్వును; మహత్+ ఆశ్రయంబు = గొప్ప ఆశ్రయాన్ని; పూర్ణిమాశశ+ అంకుండు = పున్నమినాటి చంద్రుడు (శశము = జింక; అంకము = గుర్తుగా కలవాడు); శంకన్ = సందేహంతో; అతనికిన్ నాకున్ = ఆచంద్రునకూ- (రాహువునకూ) తనకూ; వైరంబు = విరోధం; తత్ = అ చంద్రుని; సహోదరి = చెల్లెలు; రత్నకాంచనంబులు = మణులు బంగారంకాసులు; నివేదించి = అర్పించి; ఇందిరకున్ = లక్ష్మికి; వరమున్ పడియున్న = సాష్టాంగం పడిన; రాహువో యన్నట్లున్న; కేయూర = భుజకీర్తులు; కటక = ముంజేతు లందున్న కడియాలు; మణిముద్రిత = రత్నపుటుంగరాలు; అంకితంబు = చిహ్నితములగు; దీర్ఘ = పొడవైన; బాహుపరిఘంబు = ఇనుపగుదియ వంటి బాహువు; కటి తట +ఉత్సంగంబునన్ = పిరుదు పైభాగం మీద; మెఱయువానిన్ = అందమైన వానిని-

ఒక ప్రక్కకు ఒదిగి శయనించిన స్వామి తన దీర్ఘ బాహువును నడుముపైనుండి పిరుదు పైకి సాచుకొన్నాడు. అది రాహుగ్రహ మన్నట్లు దీర్ఘంగా ఉంది. ఆ రాహువు స్వామి నాభీ కమలంలో విచ్చిన తెల్ల తామరను చంద్రుడనుకొన్నాడు. ఇప్పుడాయనకు స్వామి ఆశ్రయంగా ఉన్నాడు. కనుక అతడంటే భయపడ్డాడు. పూర్వం అతనిని తానెన్నో సార్లు భయపెట్టాడు కనుక. ఇప్పుడతనిని చూచి భయపడి అతని సోదరి లక్ష్మి స్వామి పాదాల దగ్గర వున్నది కనుక ఆమెకు లంచంగా రత్నాలు- బంగారు దీనారాలు ఇస్తున్నాడో అన్నట్లుగా- బాహువు కటక కేయూరమణి ముద్రికలున్నాయి.

విశే ॥ బాహువర్ణన మహోద్భుతం.

ఆజానుబాహువును పాదాల దగ్గర ఉన్న శ్రీలక్ష్మికి లంచం ఇవ్వటానికి చాపినట్లున్నదట. పోల్చు 2-52.

12. ఉరస్స్థల = వక్షంపైన; న్యస్త = ఉంచిన; నిస్తుల = సాటిలేని; అస్తోక = అతిశయమైన; గభస్తి మండలంబునన్ = కాంతి చక్రంలో; నిండు+ ఓలగంబు+ ఉండు = పెద్ద సభ తీర్చిన; పుండరీకనికేతన = తామరపువ్వే నివాసంగా గల లక్ష్మియొక్క; తనుచ్ఛాయ = శరీరకాంతి; అనన్ = అన్నట్లు; అచ్ఛ+అచ్ఛంబు+అగు = మిక్కిలి స్వచ్ఛమైన; శ్రీవత్సంబునన్ = శ్రీవత్స మన్న పేరున్న పుట్టుమచ్చతో; లోచన+ ఉత్సవంబున్ = కంటికి వేడుక।.

ఎదరొమ్మున శ్రీవత్సాంకం కంటి కింపుగా ఉంది. అది అక్కడే ఉన్న కౌస్తుభ మణి కాంతి మండల పరివేషంలో పేరోలగమున్న లక్ష్మిలాగా ఉందట.

విశే ॥ కావ్యప్రారంభ పద్యం 1-1 చూడు.

13. విజిత = జయింప బడ్డ; మృగనాభి = కస్తూరి కల; నాభి = స్వామి పొక్కిలి; సౌరభ్యంబునకున్ = వాసనకు; నెగయు = ఎగిరే (మూగే); ఉత్తుంగ = ఎత్తైన; భృంగమాలిక = తుమ్మెదలబారు; అనన్ = అన్నట్లు; అసిత = నల్లని; పేశల = సుకుమారమైన; తులసీపలాశ = తులసి ఆకుల; దామంబునన్ = దండతో; అభిరామ = అందమైన; కోమల = మృదువైన; అలంకృతి = అలంకారం; -

కస్తూరి వాసనలను జయించే స్వామి నాభీ సౌరభాలకు మూగే తుమ్మెదల బారన్నట్లుగా మెడలో తులసి దండతో అందమైన వానిని-

14. కపట కరటి విరోధి = మాయాసింహం (కరటి = ఏనుగుకు, విరోధి = శత్రువు) నరసింహావతారం; అసుర = హిరణ్య కశిపుడన్న రాక్షసుని; ఉసురు = ప్రాణం; కొని = తీసి; మగుడన్ = తిరిగి; మనుజ+ అంగంబు = మానవ శరీరాన్ని; అంగీకరించు+ ఎడన్ = స్వీకరించే(ధరించే) సమయంలో; తలంపన్ +పడమిన్ = జ్ఞప్తికి రానందున; బడుగు+అగు = సూక్ష్మమైన; నడుముననె = నడుమువల్లనే; ఒడికము = అందము-

నరసింహావతార మెత్తి హిరణ్యకశిపుని చంపి తిరిగి మనుష్య శరీరాన్ని ధరించే సమయంలో నడుము అలాగే ఉండి పోయింది. ఆసింహమధ్యం వల్ల చాలా అందంగా ఉన్నాడు. వానిని.

15. ఘన = పెద్ద; జఘన = పిరుదు ప్రవేశం; చరమ+ ఇతర = పడమరకానిది తూర్పు; ధరాధర = కొండ; అధిత్యకాతలంబునన్ = పైభాగంలో; కాంచన = బంగారు; కాంచికా = మొలత్రాడులోని; మణిమకుట = మణులకే కిరీట మన ద్గ్గ; గగనమణి = సూర్యుడు.

16. కాయు = కాసే; ఈరెండమెండు = లేత ఎండపెల్లు; మెఱుంగు పీతాంబరంబు = మెరుపు వంటి పసిడివస్త్రంలో; పొదువంబడి = కప్పబడి; దానిసన్నదనంబునన్ = పీతాంబరం పలుచదనంతో; మన్నదనంబు = స్నిగ్ధత; వెలుపలం తోపన్ = బయటకు తోచగా; కనక = బంగారు; పుష్యరాగంపు = తెల్లనిమణి; తెరవారు = తెరలు తెరలుగా వెలిగ్రక్కే; వైదూర్యమణిస్తంభ = పసిమి రతనాల స్తంభాల వంటి; కించిత్ = కొంచెం; ఆమీలిత = మూయబడ్డ; నీలిమంబు = నీలవర్ణం కల; ఊరుయుగళంబు = తొడలజంట.

కటి ప్రదేశాన్ని ఆవరించిన పీతాంబరం తూర్పు కొండపై ఆవరించిన లేత ఎండలాగా ఉంది. ఆ వస్త్రంసన్నదనం వల్ల ఊరు యుగళం కన్పిస్తున్నది. అది నీలవర్ణం. పైన వస్త్రం బంగారు రంగు. దానిపైన రతనాల మొలనూలు. రత్న- కాంచన వర్ణాలనుండి నీలపు తొడలు కన్పిస్తున్నవి. ఎలాగా అంటే - పుష్యరాగ కాంతులు తెరలు తెరలుగా చిమ్మే పసుపు పచ్చ వైదూర్య స్తంభాలుగా తోస్తున్నవి.

ఊరువుల వర్ణన. (వైదూర్యం పులికన్నులాగా పచ్చగా ఉంటుందట)

17. త్రైవిక్రమంబు = త్రివిక్రమ సంబంధమైన; విగ్రహంబు = దేహంతో; ఆగ్రహంబునన్ = కోపంతో; మీదికిన్ = పైకి; చంక్రమణరయంబునన్ = దాటేవేగంతో; తగిలి వచ్చిన = అంటుకొన్నందున వచ్చినట్టి; మణిమయ = రత్నమయమైన; స్వర్భువన = స్వర్గలోక; జాంబూనద = బంగారపు; ప్రాకారవలయంబు +అనన్ = గుండ్రని ప్రాకారమన్నట్లు; తీండ్రించు = మెరిసే; ఉద్దండ = గొప్ప; గండపెండేరంబునన్ = పాదానికి పెట్టిన బిరుదు కడియంలో; పొడమి = పుట్టి; అఖండ = ఎడతెగని; ప్రభామండలంబునన్ = కాంతి పరివేషంతో; పరిహిండితంబులై = సమ్మిశ్రితంబులై; మఱ్ఱిపండువుల వడువునన్ = మర్రిపండు ల్లాగా; మడమలన్; బెడంగుపడి = శోభించే; భావి = భవిష్యత్తులో; నిజ = తన; కమఠావతార = తాబేటి అవతారాన్ని; సూచకంబులు = సూచించేవి; కొదమతాబేళ్ళు = యువకచ్ఛపంబుల; మేళ్ళన్ = మేల్మిని; నగు = నవ్వే; మీగాళ్లతోన్ = పాదపైభాగాలతో;

స్వామి కాలి గండపెండేరం స్వర్గ ప్రాకారంలాగా ఉంది. అది ఆయన త్రివిక్రముడై పెరిగినపుడు కాలికి తగుల్కొన్నది. ఆవలయం బంగారు కాంతులతో కలిసిపోయిన మడమలు మర్రిపండుల్లాగా ఎర్రగా ఉన్నాయి. ఈ కాంతులతో మీగాళ్ళు మెరిసిపోతూ- రాబోయే కమఠావతారాన్ని సూచిస్తున్నవి.

18. కోకనద = ఎర్రకల్వల; మృదు = మెత్తని; ఉదరంబులు = కడుపులు; అమరన్ = ఒప్పారగా; మెఱుఁగు జుక్కల = కాంతిమంతమైన నక్షత్రాల; జిగి = కాంతిని; మొక్క వఱుచు = క్రిందుచేసే; నఖ

= గోళ్ళు; చక్రవాళ = మండలములు; చంద్రికలన్ = వెన్నెలలతో; భక్తజన = భక్త సమూహముయొక్క; మనః = మానసిక; తమోవిదళనంబు = తమస్సునువిదల్చటం; కావించుచున్ = చేస్తూ; హల = నాగలి; కులిశ = వజ్రాయుధం; కలశ = చెంబు; మకర = మొసలి; అంకుశ = అంకుశం; అంకితంబులై = గుర్తులు కలిగి; లక్ష్మీ కుచ = శ్రీ స్తనాలపైని; కుంకుమ = కుంకుమతో; ఆకలన = కూడుకోవటంచేత; అరుణ + అరుణంబులు = మిక్కిలి ఎరుపైన; చరణంబులన్ = పాదాలతో; తాపత్రయ +అపహరణంబు = ఆధిదైవిక ఆధిభౌతిక- ఆదిదైవిక తాపాలను హరణం చేస్తూ ;

శ్రీరంగేశ్వర పాదాల వర్ణన.

గోళ్ళు చుక్కల్లాగ ఉన్నాయి. ఆ నఖ నక్షత్ర కాంతిరాశి భక్తుల మనస్సుల్లోని అజ్ఞానాన్ని పారద్రోలు తున్నవి. పాదాల్లో నాగలి మొదలైన భగవల్లక్షణా లున్నాయి. అవి చాలా ఎర్రగా నున్నాయి. లక్ష్మీకుచ కుంకుమ అంటినది కాబోలు! అన్నట్లు వాటితో తాపత్రయాన్ని ఎగమీటుతున్నాడు.(చూ. 4-202 యాయునుడు దర్శించిన పాదాలవర్ణన)

19. నారాయణుని; పుణ్యపురుషుని = సనాతనుడైన వానిని; ప్రణత+ ఆర్తిహరున్ = భక్తుల ఆర్తిని పోగొట్టే వానిని; హృషీక+ ఈశున్ = ఇంద్రియాధిపతిని; ఈశనుతున్ = శివునిచేత స్తుతింపబడేవానిని; విభీషణ వరదున్ = విభీషణుని కాపాడిన వానిని; అనంగ జనకున్ = మన్మథుని తండ్రిని; రంగరమణున్ = శ్రీరంగ నివాసంలో మక్కువ గలవానిని;

సహసమాగత = తనతో వచ్చిన; భాగవత = భక్తుల; పరిషత్ = సమూహం; తనుజాతయున్ = కూతురునూ; ప్రమద = సంతోషం; భయ = భయం; భక్తి రసమగ్నులై = భక్తి భావంలో మునిగి; సర్వ+ అంగ = అన్ని అవయవాలతో; ఆలింగిత = కౌగలించుకొన్న; క్షోణీతలంబులు = భూప్రదేశములు; నిటలతల = ఫాలప్రదేశంలో; ఘటిత = కూర్చబడిన; అంజలియై = దోసిలి కలవాడై; నుతియించెన్ = స్తుతించినాడు.

## వర్ణితాంశక్రమం

1. పారిపార్శ్వకులైన పరాంకుశ ప్రభృతుల దర్శనం.

2. మహావిమానం, మధ్య చంద్రకాంత వితర్దిక, దానిపై నాసీనులైన ధర్మాది సూరుల పరిషత్తు.

3. శేషుడు - అతనిపైన శయనించిన స్వామి వర్ణన - మణికుండలాలు- ముఖారవిందము - స్వామి సాకార నిరాకార మూర్తి - చంద్రార్కనేత్రాలు- నాసిక- నాభిపద్మం - ఆజానుదీర్ఘబాహువు - వక్షస్స్థలం- శ్రీవత్సం.

4. వనమాలిక - ఘనజఘనం - నడుము - పీతాంబరం లోపల మెరిసే ఊరు యుగళం - కాలికి గండపెండేరం - మడమలు - మీగాళ్ళు - నఖచంద్రికలు - అరుణ చరణాలు.

ఒక సభాశాలలో ద్వారపాలకులను దాటి లోపలకు పోవటం- సభామందిరం- అక్కడ

సమావిష్టమైన పరిషత్తు - మధ్యలో ఉన్నతాసనం - దానిపైనున్న మహాసార్వభౌముడు - తదవయవ సన్నివేశం - ఇదీ క్రమం.

రాయలవారి మలయకూట - భువన విజయ దర్శనం చేసిన 'పేయస్' వాటి వైభవాన్ని దీర్ఘదీర్ఘంగా వివరిస్తాడు. తద్వైభవ నిర్మాత - మహాచక్రవర్తి అనుభవం నుండి పుట్టిన ఆశ్చర్యకరమైన వర్ణన ఇది. విష్ణుచిత్తుడు పాండ్య రాజుని వైష్ణవుని చేసి శ్రీ విలుబుత్తూరు వస్తున్నపుడు చేసిన వర్ణన వచనం లోనే ఉంది. అది అతి వాస్తవిక లోక వర్ణన. ఇది అతిలోక వాస్తవిక వర్ణన. రెండూ మహాద్భుత వర్ణనలు.

**పరతత్త్వస్తవం**

99-105 దాకా విష్ణుచిత్తుడు చేసేస్తుతీశైలీ నిర్గుణమైన శ్రుతి శబ్దం. అవి 5 పద్యాలు. శ్రీవైష్ణవం ప్రకారం తత్త్వం పంచ ప్రకారం.

1. పర 2. వ్యూహ 3. విభవ 4. అంతర్యామి 5. అర్చావతారాలు. మొదటిది సర్వాధారం. ఈ పర తత్త్వ ప్రతిమలు శ్రీవైష్ణవ మంగీకరించినది.

1. శ్రీరంగ నాథుడు 2. తిరుమలేశ్వరుడు.

ప్రస్తుతవర్ణన మొదటి తెగకు సంబంధించినది.

**శైలి**

ఇది తిక్కనగారి ఇతిహాస శైలి. గుణబద్ధ మైతే తత్త్వంలోని అచ్ఛతలుప్తమై ఆరోపిత మూర్తిమత్వం లభిస్తుంది. కనుక ఇతిహాస కవులైన ఋషులు అచ్ఛశైలి నవలంబించారు. శాంతి, అనుశాసన పర్వాల్లో తత్త్వ కథన సందర్భంలో ఆయన ప్రయోగించిన శైలి కొక ఉదాహరణ :-

''శుచియును, హంసుండు, శుచిషత్తుం, బర ముండు
బరమేష్ఠియును నగు భవ్యు గొలుతు '' (శాం. 2-20.)

ఇది ఐతిహాసిక శైలి - 4వ ఆశ్వాసంలో దశావతార వర్ణన కావ్య, ప్రబంధ శైలి. అది విభవతత్త్వ వర్ణన. అది గుణాలంకార బద్ధం. అవతారం మానవీయం- మానవ మూర్తి కనుక.

ఇక్కడ అశబ్దమైన తత్త్వస్తుతి. వర్ణన కాదు. ఇతరత్ర వచ్చిన దైవ సంబంధ రచనలన్నీ వర్ణనలు. ఇక్క డది కాదు. అచ్ఛమైన శబ్దం. 3-19 పద్యశైలి.

3-80,81లలో పరతత్త్వ విషయం చెప్పబడ్డది. 82లో విష్ణుమూర్తి వివరణమే 6-103లో చివరిమాట. కాబట్టి 3-77 నుండి 86 దాకా ఉన్న వర్ణనతో పోల్చుకొని చదవాలి.

అక్కడ పరాపరాఖ్య లన్నవి రెండు పరతత్త్వాలని చెప్పి పరము - అమూర్తము ఉపాసన కందదనీ, అపరము - మూర్తము. ''అబ్జ గర్భాది బద్ధ నికాయంబు''- 3-78. అపరాతత్త్వం క్షేత్రజ్ఞ శక్తి కర్మ పరివేష్టితమై జీవులుగా అవతరిస్తున్నది. విష్ణుతత్త్వం పరమునకు ద్వితీయమై- సత్సంజ్ఞ కలిగి ఉందనీ

- అదే యోగిధ్యేయమనీ- అదీ అమూర్తమేననీ - అదే అవతారాలు ధరిస్తూ లోకరక్షణ చేస్తున్నదనీ 3-82లో చెప్ప బడినది- ఈ విషయాన్ని ప్రస్తుత వర్ణన కనుసంధించుకోవాలి.

తే. విధి గృహాక్షయ విత్త సేవధికి శరణు
చిరకృతేక్ష్వాకు పుణ్యరాశికిని బ్రణుతి
ధనపతి భ్రాతృకుల దేవతకు జొహారు
నత మృడాదిక సుమనస్సునకు నమస్సు. 99

విధిగృహ = బ్రహ్మయింటిలోని; అక్షయ = తరుగు పోని; విత్త = సంపద యొక్క; సేవధికిన్ = పెన్నిధియైన వానికి; శరణు = నమస్కారం.

చిరకృత = చిరకాలంగా కూర్చబడిన; ఇక్ష్వాకు = ఇక్ష్వాకు కులముయొక్క; పుణ్యరాశికిని = పున్నెపు ప్రోవైన వానికి; ప్రణుతి = స్తుతిపూర్వక నమస్కారం.

ధనపతి = కుబేరుని; భ్రాతృ = సోదరుడైన విభీషణుని; కులదేవతకున్ = ఇల వేల్పునకు జోహారు = నమస్కారం.

నత = నమస్కారం చేయటానికై వంగిన; మృడ = శివ; ఆది = మొదలైన; సుమనస్సునకున్ = దేవతలు కలవానికి; నమస్సు = నమస్కారం.

బ్రహ్మ యింటిలో ఉన్న పెన్నిధి. ఇక్ష్వాకువంశం చాలాకాలం నుండి కూడ -బెట్టుకొన్న పుణ్యరాశి, కుబేరుని సోదరుడైన విభీషణుని కులదేవత, శివాది దేవతల నమస్కారా లందుకొనేవాడు, అయిన శ్రీరంగ నాయకునకు శరణు.

శ్రీరంగేశ్వరుడు మొదట బ్రహ్మయింట అర్చింపబడి, తర్వాత హరి ఆజ్ఞతో బ్రహ్మ ఆ శ్రీరంగ స్వామిని ఇక్ష్వాకున కిస్తే - శ్రీరాముడు విభీషణున కనుగ్రహిస్తే అతడు శ్రీరంగంలో స్థాపించాడని కథ. (చూ. కవికర్ణ రసాయనం)

తే. కొలుతు సర్వేశు సర్వాత్మకుని ననంతు
నప్రకాశు నభేద్యు సమస్తలోక
సముదయాధారు నణుసమూహములకును న
ణీయు నిన్ను ననాధారు నిత్యు సత్యు 100

సర్వ+ ఈశున్ = అంతటినీ నియమించే ప్రభువును; సర్వ +ఆత్మకునిన్ = సకల జీవన వస్తుసముదాయానికి ఆత్మ యైన వానిని; అనంతున్ = మానవ ప్రమాణాల కందని వాడు; అప్రకాశున్ = కంటి కగపడని వానిని; అభేద్యున్ = మనిషి చేసే విభాగాల కతీతుడైన వానిని; సమస్తలోక సముదయ = లోక సమూహానికి; ఆధారున్ = ఆధారమైనవానిని; అణుసమూహములకును; అణీయున్ = అణువైన

వానిని; న+ ఆధారున్ = ఆధారంలేని వానిని; నిత్యున్ = నశించని వానిని; సత్యున్ = సత్యస్వరూపుని; నిన్నున్; కొలుతున్.

''అణోరణీయాన్, మహతో మహీయాన్''-అని పరమాత్మను ఉపనిషత్తులు వర్ణించాయి.

అతడు సూక్ష్మమైన అణువుల కంటె సూక్ష్మ తమమైన అణువు. గొప్పదాని కంటె గొప్పది. ఆకాశం లాగే బృహత్తు కనుక బ్రహ్మ మనిపేరు.

క. నారాయణు భూ ప్రభృతిక
గౌరవవద్వస్తువితతి కంటె మిగిలి పెం
పారు గరిష్ఠత గల పర
పూరుషు శరణంబు వేఁడి పొగడెద నిన్నున్. 101

నార+అయనుఁడు = నర సమూహమందు ఆత్మ రూపంలో ఉన్నవాడు, నార మంటే నీరు. అందులో సృష్టి బీజరూపంగా ఉన్నవాడు; భూప్రభృతిక = భూమి మొదలైన; గౌరవవత్ = పెద్దవైన; వస్తువితతి కంటెన్ = వస్తు సమూహం కంటె; పెంపారు = పెంపుగా ఉన్న; గరిష్ఠత గల = గురుత్వమున్న మిక్కిలి పెద్దవాడైన; పరపూరుషున్ = పరుడైన - లోకోత్తరుడైన పురుషోత్తముని; శరణంబు వేడి = శరణని ఆశ్రయించి; పొగడెదన్ = స్తుతిస్తాను.

భూమి మొదలైన 25 తత్త్వాలకంటె గరిష్ఠుడు, నారాయణుడు, పరుడు, పురుషోత్తముడు-అని నిన్ను నుతిస్తాను.

తే. అజ శివాదిక మగు నీ సమస్త జగము
నెందుఁబ్రభవించు వర్తించు డిందు నట్టి
మహిమ కిమ్మైన నిత్యు సమస్త భూత
మయుఁ బరులకంటెఁ బరు మహోమహునిఁ గొలుతు. 102

అజ = బ్రహ్మ; శివ = శివుడు; ఆదికము = మొదలుగా గల; ఈ సమస్త జగమున్; ఎందున్ = ఎవని వల్ల; ప్రభవించున్ = జన్మిస్తుందో; వర్తించున్ = జీవిస్తుందో; డిందున్ = అణగారుతుందో; అట్టి = అలాంటి; మహిమకున్ = మహాత్మ్యమునకు; ఇమ్ము+ ఐన = స్థానమైన; నిత్యున్ = శాశ్వతుని; సమస్త భూతమయున్ = అన్ని జీవరాసులు తానే అయినట్టి వానిని; పరులకంటెన్ = లోకోత్తరులైన దేవతల కంటె; పరున్ = పరముని; మహో = గొప్ప; మహున్ = మహస్సు (తేజస్సు) అయిన వానిని; కొలుతున్;

అజ శివాదికమైన ఈ జగత్తు ఎవని వల్ల పుట్టి - ఎవనిలో పెరిగి - ఎవనిలో లీనమౌతుందో అట్టి మహోమహుని, భూతమయుని, పరాత్పరుని సేవిస్తాను. ఇదంతా జగత్తే. నారాయణుడాత్మ.

సీ. పరపురుషునికంటెఁ బరుఁడనాఁ జనువానిఁ,
బరమాత్ము, ముక్తికై పరమయోగి
పరిషత్తుచే సదా భావింపఁబడువాని,
నెవ్వనియందుఁ బ్రాకృతములైన
సత్త్వాది గుణముల సందడి లే దట్టి ,
విమలుని; సర్వభూతములకంటె
నాద్యుఁడు శుద్ధుండు నగువాని, విభుఁ, గళా,
కాష్ఠానిమేషాది కాలసూత్ర

తే. మయిన యెవ్వానిశక్తి యింద్రియవితతికి
గోచరము గాదొ నిర్లేపుఁడై చెలఁగుట
నతివిశుద్ధుడు దానయ్యు నౌపచార
వృత్తిఁ బరమేశుఁ డగు నిన్ను విష్ణుఁ దలతు. 103

పరపురుషుని కంటెన్ +పరుడునాన్ = పరాత్పరుడనగా; చనువానిన్ = ప్రసిద్ధుడైన వానిని; పరమ+ ఆత్మన్ = సకల జీవాత్మలకు ఆశ్రయమైన వానిని; ముక్తికై = ముక్తికోసం; సదా = నిత్యం; పరమయోగి = మహాయోగుల; పరిషత్తుచేన్ = సమూహంతో; భావింపబడువానిన్ = ధ్యానించబడే వానిని; ప్రాకృతములు = ప్రకృతి సంబంధాలైన; సత్త్వ+ ఆది = త్రిగుణాల; సందడి = త్రొక్కిడి; లేదు = లేదో; అట్టి = అలాంటి; విమలునిన్ = నిర్మలుని; సర్వభూతములకంటెన్ = పంచభూతాలకన్నా; ఆద్యుఁడు = అగ్రమునం దున్నవాడు; శుద్ధుండు = పరిశుద్ధమైనవాడు; విభుని = ప్రభుని (సర్వమునందు వ్యాపించిన వానిని); కళా = 30 కాష్ఠలకాలం; కాష్ఠ = 18 రెప్పపాటుల కాలం; నిమేష = రెప్పపాటుకాలం; కాలసూత్ర = కాలక్రమ నియమం; ఇంద్రియ వితతికిన్ = ఇంద్రియ సమూహానికి; గోచరము కాదో = కన్పించదో; నిర్లేపుడు = అంటనివాడు; అతి = మిక్కిలి; విశుద్ధుఁడు = పరిశుద్ధుడు; తాను+ అయ్యున్ = తానై కూడా; ఔపచారవృత్తిన్ = ఉపచార వశాత్తూ ( ఆరోపించే మనోవృత్తి వల్ల) ; పరమ+ ఈశున్ = మహేశ్వరుని; విష్ణున్ = శ్రీమన్నారాయణుని; నిన్నున్; తలతున్ = స్మరిస్తాను.

పరాత్పరుడు, పరమాత్ముడు, మహాయోగులకు ధ్యేయమైన వాడు, త్రిగుణాతీతుడు, ఆద్యుడు, విభుడు, కాలసూత్రమైన వాడు, ఇంద్రియాల కందనివాడు, ఉపచారవృత్త్యా పరమేశ్వరుడు, విష్ణువైన వానిని నిన్ను ధ్యానిస్తాను.

**విశే ॥ ''సపర్యగాత్ శుక్రం, అకాయం, అవ్రణం, అస్నావిరం, శుద్ధం, అపాపవిద్ధం, కవిః మనీషీ, పరిభూః, స్వయంభూః, యాదాతథ్యతోఽర్థాన్ వ్యదధాత్ శాశ్వతీభ్యః సమాభ్యః.**

స్వచ్ఛం (శుక్రం) శరీరం లేనిదీ, పరిపూర్ణమైనది (వ్రణాలు లేనిది) నరాలు లేనిదీ, పరిశుద్ధం, పాప రహితము లైనవాడు సర్వము నందు వ్యాపించాడు. ( ఈశావాస్యం).

ఇది అచ్ఛమైన తత్త్వం కావటంవల్ల శుక్రం- శుద్ధం- అని చెప్పబడ్డది. Absolute అన్నమాట. అది జగత్తులో వ్యాపించటం వల్ల త్రిగుణాలు- శరీరాదికం పొందినందు వల్ల తేజో దేహ సంక్రమణం జరిగింది మానవుని సంకుచిత మనస్సులోకి ఆ తత్త్వం దిగి రావటం పేరే ఔపచార వృత్తి. తనకు తెలియని దానిని తెలిసిన నామరూపాలతో వ్యవహరించటం.

వ్యూహ చతుష్టయంలో ఇది వాసుదేవ పరతత్త్వం. అదే జీవునిగా పరిణమించటం లోని సోపానాలు 3.

1. సంకర్షణ. 2. ప్రద్యుమ్న 3. అనిరుద్ధ తత్త్వాలు.

ఈ శ్రీరంగనాథవర్ణన సాకార - నిరాకార సంధిస్థానం. అది సగుణమూ- నిర్గుణమూ. అనంత ఏకత్వస్థితి. సాకార విశ్వస్థితి నిరాకార బీజస్థితి రెండూ ఏకమైన ఒక దానిలో ఒకటి లీనమై యున్న స్థితి. '' ఈ సర్వ సమన్వయాత్మక బృహత్ స్థితిలో అనంత కోటిరూపాలు ఒదిగే ఉంటాయి. ఆబృహదాత్మ- శాంతమూ- అప్రమేయమూ. ఏకమూ. అందులోనే అనేక చలనశక్తులు- రూపాలూ. అవిభక్తంగా అవిరుద్ధంగా గూఢంగా ఉంటాయి'' ఇది శ్రీ అరవిందుల తత్త్వ దర్శనం. మయూరాండపు సొన లోనే మయూరమూ పింఛము ఉన్నస్థితి గా కాశ్మీరశివా ద్వైతం చెప్పిందీ ఇదే.

**వ. అని పరస్వరూప సురసేవ్య భవ్య దివ్యావతార లీలలం బ్రస్తుతించినఁ గౌస్తుభాభరణుండు కరుణా తరంగితంబు లగు నపాంగంబుల నమ్మనిం గనుంగొని కుశల ప్రశ్నంబుఁ గావించి కంకణాలంకార క్రేంకారంబు లంకురింపఁ బదపంకజంబులకుఁ గుసుమాంజలులు సమర్పించు సకల సీమంతినీ సీమంత ముక్తామణి యగు నాముక్తమాల్యద రూపు నెలఁ బ్రాయంబు సాభిప్రాయంబుగాఁ జూచి తనలోన. 104**

పరస్వరూప = వాసుదేవ పరతత్త్వం; సురసేవ్య = దేవతలకు పూజ్యమైన; భవ్య = శ్రేష్ఠమైన; దివ్య+ అవతారములు = తనంత తానై జన్మించేది అవతారం; కర్మబద్ధం కానిది; లీలలన్ = క్రీడలను; కౌస్తుభ+ ఆభరణుండు = కౌస్తుభమన్న నగ కలవాడు; కరుణా తరంగితంబులు = కరుణ, దయా:రసం కెరటాలుగా పొంగారే; అపాంగంబులన్ = కడకన్నులతో; కంకణ = గాజులు, కడియాలు; క్రేంకారంబులు = ధ్వనులు; పదపంకజంబులకున్ = పాద కమలాలకు; సీమంతినీ = స్త్రీ; సీమంత = పాపటలోని; ముక్తామణి = ముత్యపు మణి; ఎలప్రాయంబు = లేత వయస్సు (కన్యాదశ); స+ అభిప్రాయంబుగా = అర్థవంతంగా-

1. పరస్వరూపం - వాసుదేవ తత్త్వం - పై పద్యంలో వర్ణితం.

2. సురసేవ్యం - వైకుంఠంలో సాకార తత్త్వం.

3. అవతారం - ధర్మ రక్షణార్థం భూలోకం లోకి వచ్చేది.

విష్ణుచిత్తుని వర్ణన - స్తుతుల్లోని భావ మీ వచనంలో వివరింపబడినది.

ఆ స్తుతులకు ప్రీతుడై భక్తుని దయతో చూస్తూ ఉంటే గోదాదేవి కరకంకణాల మ్రోతతో స్వామి పాదాలపై పూవులు చల్లుతున్నది. ఆమెను శృంగార దృష్టులతో చూచాడు.

''శృంగారవంతి హృదయం గురవస్త్వ దీయాః
భోక్తుం తవ ప్రియం భవతీవ గోదే,
భక్తిం నిజప్రణయ భావనయా గృణం తః
ఉచ్చావచైః విరహ సంగమజై రుదంత్తైః ''.(గోదాస్తుతి; శ్రీవేదాంత దేశికులు)

దీనివల్ల భగవంతు డామెను సాభిప్రాయంగా చూచాడు.

ఇక్కడ గోదాదేవి అనకుండా, ఆముక్త మాల్యద - అని కవి వ్రాయటం సాభిప్రాయం. తన కావ్యాన్ని భగవంతు డనుగ్రహించాడనీ, కావ్యానికి ఇదే నామం తప్ప విష్ణుచిత్తీయం కాదనీ.

సీ. దీని చూపుదుటెక్కఁగానెకా సిరిపట్టి
కిని బోర బిరుదుఁ డెక్కెంబు గలిగె,
దీనికా నల్లాడఁ గానెకా గర్వించి
యుర్విఁ జైత్రునకుఁ గాలూఁద గలిగె,
దీని పాలిం డ్లుబ్బఁ గానెకా రతి చేతి
కిన్నెర మ్రోఁతకు వన్నె గలిగె
దీనిమో మొప్పారఁ గానెకా వాణి రా
యంచలేమకుఁ గులాయంబు గలిగె,

తే. దీని పెన్నెఱు లేపారఁ గానెకా ప్ర
పోషితమయూరికి విరాలి పొందు గలిగె
దీని యడుగులు రంజిల్లఁ గానెకా పి
పాసఁ బడుతేఁటులకు మెట్టపంట గలిగె. 105

దీనిచూపు = గోదాదృష్టి; ఉదుటు = ఉద్ధతి (గర్వం, దర్పా); ఎక్కన్ = పొందటం వల్లనే; కానెకా = కదా; సిరిపట్టికిన్ = లక్ష్మీ తనయునికి (మన్మథునికి); పోరన్ = యుద్ధంలో; బిరుదు టెక్కెంబు = కీర్తిమంతమైన జెండా; కలిగెన్ = కల్గింది ;

దీని చూపు ఉద్ధతి పొందినందు వల్లనే కదా - లక్ష్మీదేవి పుత్రుడైన మన్మథునకు యుద్ధంలో కీర్తి కల కేతనం లభించింది.(చూ. 5-7-13)

దీని; కౌను = నడుము; అల్లాడన్ +కానెకా = చలించినందువల్లనే కదా; చైత్రునకున్ = వసంతునకు; ఉర్విన్ = భూమిపై; కాలు; ఊనన్ +కలిగెన్ = పెట్టటం సంభవించింది;

దీని నడుము అల్లల నాడినందువల్లనే వసంతునకు లోకంలో కాలు పెట్టటానికి అవకాశం లభించింది.(చూ 5- 26-27)

పాలు+ ఇండ్లు = స్తనాలు; ఉబ్బన్ = ఉబ్బినందు వల్లనే; రతిదేవి = మన్మథుని భార్యయైన రతిదేవి హస్తంలోని; కిన్నెర = ఒకవిధమైన వీణ; మ్రోతకున్ = ధ్వనికి; వన్నె = వాసి; కలిగె;

దీని స్తనాలు బలిసినందువల్లనే కదా రతిదేవి చేతిలోని కిన్నెర మ్రోతకు కీర్తి వచ్చింది(5-21,22)

మోము = ముఖం; ఒప్పు+ ఆరన్ = అందగించగా; వాణి = సరస్వతి; అంచ లేమకున్ = ఆడు హంసికి; కులాయంబు = గూడు (5-12,13)

ఈమె ముఖం వికసించి చెన్నారినందువల్లనే వాణి హంసికి నిలువ నీడ- పద్మం దొరికింది.

పెన్ = పెద్ద, నెఱులు = కురులు; ప్రపోషిత = పోషించబడే; మయూరికిన్ = నెమలికి; విరాళి = ప్రేమ (విరహం); పొందు = కూటమి;

అడుగులు = పాదాలు; రంజిల్లన్ = ఎరుపెక్కటం; పిపాసన్+పడు = దప్పికకలిగిన; తేటులకున్ = తుమ్మెదలకు; మెట్టపంట = సులభమైన మెట్టతామర పంట;

ఈమె పొడవైన కురులవల్ల నెమళ్లకు ప్రేమసమాగమం కలిగింది. ఈమె పాదాలు ఎరుపెక్కినందువల్లనే తుమ్మెదలకు ఆహారమైన మెట్టతామరల పంట లభించింది. (5-34,35)

**అలం :** పర్యాయోక్తం.

విశే ॥ గోదచూపులు - బెడిస చేపలు. అదే మన్మథుని జెండా గుర్తు.

ఆమె నడుము సన్నని తీగ. కనుక వసంతుడు పుష్పవికాసహేతువై భూమిపై కాలు మోపాడు.

ఆమె స్తనాలు కిన్నెర కున్న సొరకాయలు. ఆమె ముఖం పద్మం. వికసించినందు వల్లనే హంసికి గూడు దొరికింది.

ఆమె కేశపాశం - నెమళ్ల కానందం కల్గించే మేఘాల గుంపు.. ఆమె పాదాలు మెట్ట తామరలు. (నీటి తామరలు వేరు).

ఈ ఔపమ్యం గమ్య మయ్యేటట్లు అనుకోవటం నాయకుని భావ గాంభీర్య చిహ్నం. ముఖం (చూపు) నుండి పాదాంతం నాయికా సౌందర్య వర్ణన జరిగింది. ఈ చూపు నాయకునిది.

5వ ఆశ్వాసంలో గోదాదేవి శరీర వర్ణనతో పోల్చుకోవాలి. ఉ॥ కొందీగె(28) ఆమె ముడి బ్వార్ల నిబద్ధ ఖేటకంబు (38) మొ॥ వి.

తే. అనుచు నువ్విళులూరి మురారి తమక
మాఁప లే కాత్మదివ్య శుద్ధాంతసీమ
కన్నెలఁతఁ దార్చి యొక్క మాయావధూటి
నట్ల కావించి వారున్నదనియ యుండ. 106

ఉవ్విళులు+ ఊరు = ఉవ్విళ్ళూరు; మురారి = విష్ణువు; తమకము = అతిశయమైన కోరిక; ఆత్మ = తన; దివ్య = దేవతా సంబంధమైన; శుద్ధాంత సీమకున్ = అంతఃపుర ప్రదేశానికి; ఆ నెలతన్ = ఆ స్త్రీని; తార్చి = చేర్చి; మాయావధూటిన్ = మాయావధువును; వారు = విష్ణుచిత్తాదులు; ఉన్నదనియ = ఉన్నది కదా అని; ఉండన్ = ఊరుకోగా.

అని మురారి ఉవ్విళ్ళూరి ఆమెను తన అంతఃపురంలోకి చేర్చి ఒక మాయావధువును సృష్టించి అక్కడ పెట్టాడు. తండ్రి మొదలైన వారు కూతురున్నది కదా యని ఊరుకున్నారు.

విశే ॥ ఈ మాయావధూటీ వృత్తాంత కల్పనకు బహుశః ఆధ్యాత్మ రామాయణం లోని మాయా సీత వృత్తాంతం ఆధారం కావచ్చు.

వ. పూజకులచేఁ బాదతీర్థప్రసాదపరివేష్టనంబు లిప్పించి విడిది కనిపిన గుడి వెడలి శాంబరీ తనుసంభవం బాలకిం బెట్టి గృహంబునకుం జని పంజరంబు సడలించి యచ్చంచలాక్షిం గానక. 107

పూజకులు = పూజారులు, అర్చకులు; పాదతీర్థము = స్వామి పాదజలం; ప్రసాదము = నైవేద్యంగా అర్పించిన పదార్థం; పరివేష్టనము = (స్వామి కర్పించిన) విశిష్టులైన భక్తుల శిరస్సులకు చుట్టే వస్త్రం; శాంబరీ తనుసంభవన్ = మాయా కుమార్తెను; పాలకిన్ పెట్టి = పల్లకిలో కూర్చుండ బెట్టుకొని; పంజరంబు = పల్లకి తెరను; సడలించి = తొలగించి;

మాయావధూటి కనుక విడిదికి వెళ్ళేసరికి అదృశ్యయై పోయింది.

ఈ కల్పనకు ప్రయోజనం ముందు స్పష్ట పడుతుంది.

శా. అబ్రహ్మణ్యము ! లోన వైచికొనె నన్యాయంబున న్మత్సుతం
దా బ్రహ్మాదుల మేర నిల్పియుఁ బ్రభుత్వం బూఁదియుం దోఁతురే
యీ బ్రక్కన్ ద్విజుఁ జూడ రయ్య సభవా రీరంగభర్తంచు దుః
ఖా బ్రాశిం బడి బాష్పకంఠుఁడు సముద్యద్దోః పలాలుండు నై. 108

అబ్రహ్మణ్యము = (చంపకుమని పెట్టే మొర) మోసం; ఈ రంగభర్త = ఈ శ్రీరంగధాముడు; మత్ = నా; సుతన్ = కుమార్తెను; అన్యాయంబునన్ = న్యాయం లేకుండా; లోనన్ = అంతఃపురంలో; వైచికొనెన్ = వేసికొన్నాడు; తాన్ = స్వామి; బ్రహ్మ+ ఆదులన్ = బ్రహ్మ మొదలైన దేవతలను; మేరన్ = హద్దులో; నిల్పియున్ = పెట్టికూడా; ప్రభుత్వంబు = పాలనాధికారం; ఊఁదియున్ = అవలంబించి కూడా;

దోఁతురే = దోచుకొంటారా! ఈ (బక్కన్ ద్విజునిన్ = ఈ పేదబాపని; చూడరు+ అయ్య = చూడండయ్యా, సభవారు = పారిషదులు (ముందు వచనంలో వర్ణింపబడ్డవారు) దుఃఖ+ అప్+ రాశిన్ బడి = దుఃఖసముద్రంలో పడి; బాష్పకంఠుడు = అశ్రువులవల్ల బొంగురు పోయిన గొంతుకలవాడు; సముద్యత్ = పైకెత్తిన; దోః = చేతులన్న; పలాలుండు = తృణం కలవాడు (చిగుళ్ల వంటి చేతులు కలవాడు అని అనవచ్చు కాని అందగించదు- పురుషుడు కావటంవల్ల)

''మోసం! మోసం! నాకూతురిని అన్యాయంగా లోపల వేసుకొన్నాడయ్యా, ఈ రంగభర్త! లోకాధిపతులయ్యు ఈ విధంగా పేద బ్రాహ్మణుని దోచుకోవటం ధర్మమా? సభవారంతా చూడండయ్యా!'' అని అంటూ బాష్పకంఠుడై, కృశించిన బాహువు లెత్తి మొరపెట్టాడు.

4-83 పద్యంలో బాధితులు మొరపెట్టు కొంటే ఆలించి తీర్చే రాజు నేపథ్యంలో ఉన్నాడు. 4-204,285లలో మహాచక్రవర్తి ధర్మం చెప్పబడ్డది. అందుకని ఈ పద్యంలో ప్రభుత్వంబూదియున్ - చాలా బరువైనమాట. త్రిలోకాధిపునకు ధర్మపాలన- రక్షణ స్థాపన ఆవశ్యకములు కాని ధర్మోల్లంఘనం కాదు.

రాయలవారు తన కావ్య నిర్మాణానికి వెన్నెముకగా చక్రవర్తిత్వాన్ని పెట్టడం లోతుగా చూచే వారి కాశ్చర్యం కల్గించే విషయం.

శా. అంతే వేడుకయైనఁ బెండ్లగుట కీ నా, దేహము న్బ్రాణమున్
సంతానంబు నిశాంతము న్ధనము సన్యంబు ల్పశు శ్రేణు లే
కాంత స్వస్వ జనార్చనంబునక కాదా కూర్చుటే, మీకయో
వింతే, యీ బుడు తెంత, న న్గుఱుచఁ గావింపం దను న్మెత్తురే. 109

అంతే వేడుక యైనన్ = అంతగా ముక్కువ పడితే; పెండ్లి + అగుటకున్ = వివాహం చేసికోవటానికి; దేహమున్ = శరీరాన్ని; ప్రాణమున్ = ప్రాణాన్నీ; ఈనా = ఇవ్వనా; సంతానంబున్ = సంతతిని; నిశాంతమున్ = గృహాన్ని; ధనమున్ ; అన్యంబుల్ = ఇతరములైన; పశుశ్రేణులున్ = పశువుల మందలను; కూర్చుటే = సంపాదించటం; ఏకాంత = ముఖ్యమైన; స్వ = తన; స్వజనుల = భక్తుల; అర్చనంబున కాదా = పూజకోసమే కదా; మీకున్ = మీయందరకూ; అయో = అయ్యో (నాసంగతి); వింతే = తెలియనిదా; ఈ బుడుత = ఈ నాచిన్నది; ఎంత = ఎంతది; నన్; కుఱుచన్ + కావింపన్ = హీనపరిస్తే; తనున్ = ఆయనను; మెత్తురే = మెచ్చుకోగలరా;

నాపిల్లమీద అంతగా ముచ్చట పడితే వివాహం చేయనా! నా దేహప్రాణాలివ్వనా? నాసంతతి గొడ్డూ- గోదా- ఇల్లూ- డబ్బూ అన్నీ ఆయన పాదదాసులకోసమే కదా కూడబెట్టటం. ఈ సంగతి మీ కందరకూ తెలిసిందే. ఈ చిన్న దెంత? నన్నిలాగా చిన్న బుచ్చటం వల్ల ఆయన కేమైనా యశస్సా?

విశే ॥ ప్రథమాశ్వాసంలోని విష్ణుచిత్తుని అతిథి సపర్యల దృష్ట్యా ఈపద్యార్థం చూచుకోవాలి.

చ. శివుఁడు విరించి వాసవుఁడుఁ జెప్ప నశక్తులు, కొల్చునట్టి వా
రవుట, నిరంకుశుండ నని యక్కట పాడిఁ దొఱంగఁ జెల్లునే?
భువనము లెల్ల నీ వయినఁ బొంత దయానిధి యమ్మ లేదె? భా
గవతులు లేరె? నాకొఱకుఁ గాఁగ వహించుకొనంగఁ గేశవా. 110

కేశవా = శ్రీహరీ; శివుడు; విరించి = బ్రహ్మ; చెప్పన్ = న్యాయంకాదు- అని చెప్పటానికి; అశక్తులు = సమర్థులు కారు; కొల్చునట్టివారు = సేవకులు; అవుటన్ = కావటం వల్ల; అక్కట = అయ్యో; నిరంకుశుండను = స్వతంత్రుడను; అని; పాడి = న్యాయం; తొఱంగన్ = వదలటం; చెల్లునే = తగునా? భువనములు + ఎల్లన్ = లోకాలన్నీ; నీవి; అయినన్ = అయినప్పటికీన్నీ; పొంత =(ప్రక్కన) దగ్గర; దయానిధి = కరుణానిలయ; అమ్మ = శ్రీమహాలక్ష్మి; లేదె = లేదా?; నాకొఱకుఁ గాగ = నా కోసమై; వహించు కొనంగన్ = పక్షం వహించటానికి; భాగవతులు = భక్తులు; లేరె = లేరా? ;

శివుడు, విరించి మొదలగు వారంతా నారాయణుని శరీర స్వరూపులు. కనుక వారేమి అడ్డు చెప్పగలరు కనుక! సర్వలోకాలు నా యధీనం లోనివే కదా అని చెప్పి ధర్మాన్ని ఉల్లంఘించటం న్యాయమా? నిన్ను వారించటానికి ప్రక్కన తల్లి లేదా? భాగవతులు లేరా? నాపక్షం వహించటానికి.

విశే॥ 4-51 లో బ్రహ్మరుద్రాదులు శ్రీ విష్ణువునకు శరీరస్థానీయులని చెప్పబడినది. ఆత్మ యజమాని. శరీరం కర్మ సాధనం. నియామకుడు ఆత్మ కనుక.

శరీరం ఆత్మనెలా నియమిస్తుంది? - కనుక శివుడు- విరించి వారించలేరు. తల్లి నిత్యానపాయిని. ఎప్పుడూ ఆయనతో నీడలాగా ఉంటుంది. ఆమె చెప్పగలదు.

ఉ. నెట్టన యల్ల లచ్చి యల నీళయు భూసతి యుండ, నీకు నీ
నెట్టిక సీలపై మనసు నిల్చుట కే మనవచ్చు? వెఱ్ఱి యౌ
నట్టుగఁ బేద నన్నుఁ బరిహాసము సేఁతకుఁ దక్కఁ, వింత చూ
పెట్టిది? దిద్దు నెవ్వఁ డిల నేఱులవంకలు వారిడొంకలుః. 111

నెట్టనన్ = తప్పక; లచ్చి = లక్ష్మి; నీళయున్ = నీలాదేవి; భూసతి = భూదేవి; ఉండన్ = ఉంటే; నీకున్; ఈ ; నెట్టికసీలపై = సదాచారవ్రతపై; మనసు; నిలుటకున్ = నాటటానికి; ఏమనవచ్చున్ = ఏమనాలి; వెఱ్ఱియౌనట్టుగన్ = వెర్రిబాగుల వాడనన్నట్లుగా; పేదన్ = బలంలేని వానిని; నన్నున్ = పరిహాసము = ఎగతాళి, చేతకున్ = చేయటానికి; తక్కన్ = తప్ప; వింత చూపు + ఎట్టిది = వింతగా చూచిన ఈ చూపు ఎలాంటిది?; ఇలన్ = లోకంలో; ఏఱుల = నదుల; వంకలు = వక్రతలు; వారి = నీటి, డొంకలున్ = దారులు; ఎవ్వఁడు; దిద్దున్ = సరిచేయ గలడు?

ఇదేమి వింత చూపు! ఈ పసిపిల్లమీదనా? వెర్రిబాగులవాడిలాగా। మహాలక్ష్మి- భూ నీళలుండగా ఈ పసిది కావలసి వచ్చినదా? పేదవాడినైన నన్ను పరిహాసం చేయటం తప్పించి?

అలం :- లలిత - నాల్గో పాదంలోని సామెత హేతువుగా.

విశే ॥ నెట్టికసీల - నైష్ఠికశాల పదానికి వికృతి అని శబ్దరత్నాకరం. అదే వేదం వారూగ్రహించారు. కానీ కొన్ని చోట్ల కుదరదు. ఇందుకని క్రీడాభిరామ పీఠికలో వేటూరివారు ఆభరణాల కుండే మరసీల-అడ్డిగ సీల అని అర్థం చెప్పి 'అడ్డిగ సీలంత ఉన్నదో లేదో ఎంత మాటన్నదో చూడు ఆ పిల్ల', ఇత్యాది వ్యవహారము కృష్ణా మండలమున నేడును గలదన్నారు.

నెట్టిక - నెట్టై (తమిళ శబ్దం) వ్రేలి కణుపు అని అర్థం.

నెట్టికసీల = వ్రేలి కణుపులోని సీల - అనివ్రాసారు. అంటే చాలా చిన్నదని తాత్పర్య మంటూ.

**వ. అని యిట్లు ధరణీసురుం డద వెట్ట భాగవతక్షోభంబునకు భువనభర్తయు భయంపడి తచ్ఛాందసంబునకుఁ గేలిసేయుచున్న వాఁడను భావం బతనికిఁ దోఁప మకరకుండల మండితంబు లగు గండదర్పణంబులం జిఱు నవ్వెలర్ప నిట్లనియె. 112**

ధరణీ సురుండు = బ్రాహ్మణుడు; అదవెట్టన్ = మొరపెట్టగా; భాగవత = భక్తుని; క్షోభంబునకున్ = బాధకు; భువన భర్తయున్ = లోకనాథుడున్నూ; తత్ = అతని; ఛాందసంబునకున్ = వెర్రికి (చాదస్తం); గేలిసేయుచున్నవాడు = ఎగతాళి చేస్తున్నాడు; మకర కుండల = మొసలి వా పోగులు = మొసలి ఆకారం కల చెవి పోగులు; మండితంబులు = అలంకరింపబడ్డ; గండదర్పణంబులన్ = చెక్కుటద్దాలపై; (చిరునవ్వు) ఎలర్పన్ = వికసింపగా.

**చ. ముది మదిఁ దప్పితోటు ముని ముఖ్య ! భవత్తనయ న్గృహంబునఁ**
**బదిలము చేసి వచ్చి మఱి బట్ట బయల్వెడదూరు దూరె, దా**
**సదన మింకొక్క మాటరసి చంచల లోచనఁ గాన కున్న దూ**
**రెదు మఱి కాని, బుద్ధివిపరీతతఁ బొందక పోయి చూడుమా. 113**

మునిముఖ్య - ఆళ్వార్లలో గొప్పవాడైన పెరియాళ్వారు కనుక ; ముదిన్ = ముసలితనం వల్ల ; మదిన్ = మనస్సును ; తప్పితి + ఓటు = పోగొట్టుకొన్నావా ఏమిటి ? ; భవత్ +తనయన్ = నీ కుమార్తెను ; గృహంబునన్ = ఇంట్లో ; పదిలము చేసి = జాగ్రత్త చేసి ; వచ్చి = బైటకు వచ్చి ; మఱిన్ = ఇంకా ; బట్టబయల్ = ఆరుబయట (నిండు సభలో); వెడ = వ్యర్థమైన ; దూరు = నిందను ; దూరెదు = (తిడుచున్నావు) నాపై మోపుతున్నావు ; ఆ సదనమున్ = ఇంటిని ; ఇంకొక్క మాటు = ఇంకా ఒకసారి; అరసి = వెతికి ; చంచలలోచనన్ = మెరుపువంటి కన్నులు కలదానిని ; కానక + ఉన్నన్ = చూడక పోతే; మఱిన్ = ఆ తర్వాత ; దూరెదు =తిడుదువు గాని ; బుద్ధి విపరీతత పొందక = విపరీతాలోచనలను చేయక ; పోయి = ఇంటికి వెళ్ళి ; చూడుమా-

మునివరుడా ! ముసలితనం వల్ల నీ బుద్ధి భ్రమించినట్లున్నది. ఈ విధంగా బట్టబయట నన్ను వ్యర్థంగా నిందిస్తున్నావు. నీ కుమార్తె నింట్లో భద్రం చేసికొని మరీ బయటకు వచ్చి తిడుతున్నావు. ఇంకొక సారి ఇంట్లో వెతికిరా. నీ కూతురు కన్పించక పోతే అప్పుడు నన్ను నిందించ వచ్చు. పోయిరా!

విశే। వెడదూరు దూరెదు - అపవాదను మోపుతున్నావు - అన్నఅర్థంలో ప్రయోగం.

తే. అనిన నాతండ్రి యాయెనే యనియెనే మె
ఱుంగమే యార్తిఁ గడుపు చల్లంగఁ బలికి
కరుణ చేసితి విజయివి గమ్మటంచు
బాష్ప జల మాఁగి యింటికిఁ బరువువాఱి. 114

అనినన్ = అంటే ; నా తండ్రి = ఓ నా బంగారు తండ్రీ ; నన్ను కన్నట్టి తండ్రి; ఆయెనే = అయినదే ; ఆయను = అయినది( ఐనదేమో ఐనది) ; ఏము+ ఏ = మేము ఏ; ఆర్తిన్ = దుఃఖమునూ ; ఎఱుఁగము = ఎరగము ; కడుపు చల్లంగన్ +పలికి = నీ కడుపు చల్లగా మంచి మాట చెప్పి ; కరుణ చేసితివి = అనుగ్రహించావు ; విజయివి కమ్ము ; అట+అంచున్ = అని అంటూ ; బాష్ప జలమున్ = కన్నీటిని ; ఆగి = అణచుకొని ; ఇంటికన్ ; పరువువాఱి = పరుగెత్తి .

విశే ॥ మొదటి పాదం - ''అనిన నా తండ్రి యిట్లనియె నేమె'' ( ఆ తండ్రి విష్ణుచిత్తు డిలా అన్నాడు-) ఇది వావిళ్ళ పాఠం. అధోజ్ఞాపికలో వేరే పాఠమున్నట్లు వారే

'' అనిన నో తండ్రి యాయెనే యాయనేమె - అన్న వాక్యా న్నిచ్చారు. కానీ వేదం వారు '' ఆయెనే యనియె '' అని గ్రహించారు.

పరువు వాఱి - కూతురుపై నున్న ప్రేమ ధ్వనిస్తున్నది.

ఆ. మ్రొక్కి నట్టి తనయ మూర్ధంబు మూర్కొని
ప్రమదబాష్ప మురుల బ్రాహ్మణుండు
చేత వెన్ను నిమిరి నా తల్లి నినుఁ గంటిఁ
గా యటంచు నింటి కడ వసింప. 115

బ్రాహ్మణుండు = ఆళ్వారు ; మ్రొక్కిన + అట్టి = నమస్కరించినట్టి ; తనయ = కుమార్తె; మూర్ధంబు = శిరస్సు ; మూర్కొని = వాసన చూచి (ముద్దు పెట్టుకొని); ప్రమద బాష్పము = ఆనందాశ్రువులు ; ఉరులన్ = స్రవిస్తుండగా; చేతన్ = చేత్తో ; వెన్నుపూసవెంట రాస్తూ ; నాతల్లీ ; నిన్ను; కంటి = చూచాను సంతోషం ! అని ఇంటి దగ్గర ఉన్నంతలో-

ప్రేమ చేష్టా వర్ణన పద్యమంతా.తండ్రి హృదయ సారళ్య వ్యంజక భాష.

## దివ్య కళ్యాణం:-భావోన్మేషం

ఈ వైవాహిక సంరంభవర్ణనకు ప్రేరణ 'నాచ్చియార్ తిరుమొళి'. ఈ దివ్య ప్రబంధంలో గోదాదేవి తన విరహాన్ని లోకాతిశాయిగా వర్ణిస్తుంది. తన కలలో స్వామి వివాహం చేసికొన్నట్లు చెప్పిన వైనం - రాయల ఈ వర్ణనకు భూమిక.

'' ఓ చెలీ ! ఇంద్రాది దేవతలంతా వచ్చిపెండ్లి విషయం మాట్లాడినట్టు, నా ఆడుబిడ్డ దుర్గ పసుపు బట్టలు పూల దండలతో నన్నలంకరించినట్లు కలగన్నానే''-

'' ఓ చెలీ ! నా సహోదరులు వచ్చి - సిగ్గుతో వెనుక క్రదిగిన నన్ను అగ్నివైపుకు త్రిప్పి, శ్రీ కృష్ణుని హస్తం మీద నా చేతినుంచి అగ్నిలో లాజలు వేల్పించినట్లు కలగన్నానే''.

''చెలీ ! బ్రాహ్మణోత్తములు పలువురు పలుదిక్కుల నుండి పవిత్ర తీర్థం తెచ్చి, ప్రోక్షించి,స్తుతించి పుష్పహారాలతో అలంకృతుడైన వానిచేత నాచేతికి కంకణ సూత్రం కట్టించినట్లు కలగన్నాను.''

''చెలీ !వాద్యాలు ఘోరుకొంటూ ఉంటే, రేఖల శంఖం శబ్దిస్తుండగా, ముత్యాల దండలు వ్రేలాడు పందిరి క్రింద మేనరికం కల మధుసూదనుడు వచ్చి నా పాణిగ్రహణం చేసినట్లు కలగన్నాను.''

'' ఓసీ చెలీ ! మంచికంఠస్వరంతో బ్రాహ్మణోత్తములు వేదమంత్రాలు పఠిస్తూ ఉంటే - శ్రీ కృష్ణుడు నాచేయి పట్టువొని అగ్నిప్రదక్షిణం చేసినట్లు కలగన్నానే.''

'' ఈ జన్మకేమి- ఏడేడు జన్మలకీ-తోడూ నీడా యజమాని అయిన పూర్ణ స్వరూపుడు, శ్రీమన్నారాయణుడు తన అరుణ హస్తంతో నా పాదం పట్టుకొని సన్నెకల్లు త్రొక్కించినట్లు కలగన్నాను.''

'' ఓసీ సఖీ! శరీరానికి కుంకుమ నలది,చందనం పూసి - వసంత జలంతో కలయంపి చల్లిన వీధుల్లో ప్రదక్షిణంగా - గజారూఢులమై - తర్వాత స్వామితో వసంతాలాడినట్లు కలగన్నాను.''

ఇలా 10 పాట్టలుకల '' వారణమాయిరం''(వెయ్యేన్గులు) అన్న ఖండిక ఆధారంగా ఈ ఘట్టం నిర్మించబడిన దనుకోవచ్చు. అంటే ఈ వివాహోధారం 'నాచ్చియార్ తిరుమొళి'.

తే. రంగపతి బ్రహ్మ రుద్రుల బ్రాహ్మిగౌరిఁ
దనకు నక్కన్య నడిగింప c బనుపుటయును
వారు సేనేశ సహితులై వచ్చుటయును
విష్ణుచిత్తుడు సంభ్రమా న్వితుఁ డగుచు. 116

రంగపతి = శ్రీరంగనాథుడు ; బ్రహ్మను బ్రహ్మని= బ్రహ్మసరస్వతులను ; రుద్ర గౌరులను; తనకున్ ; అక్కన్యన్ = ఆ కణ్యామణి గోదను ; అడిగింపన్ = వధువుగా అడిగించటానికి ; పనుపుటయునున్ = పంపించటమున్నూ ; వారు = ఆ ఆదిమ దంపతుల జంటలు ; సేన+ ఈశ = విష్వక్సేన ; సహితులై = కూడుకొన్న వారై ; వచ్చుటయునున్ = రావటమున్నూ ; విష్ణుచిత్తుండు; సంభ్రమ+ అన్వితుడు = సంతోషం వల్ల తొట్రుపాటు కలవాడై( ఆదరం కలవాడై) ;

శ్రీరంగనాథుడు ఆదిమ దంపతులను - తన సేనానాయకునితో పాటుగా పంపించి విష్ణుచిత్తుని కుమార్తెను వధువుగా అడిగి రమ్మన్నాడు. వారు రావటం చూచిన విష్ణుచిత్తుడు తొట్రుపాటుతో ఆదరణ కలవాడై

విశే॥ అక్కన్య = '' మూల్యమిచ్చు నప్పిన్నది'' అన్న పీఠికలోని స్వామి చెప్పిన పద్యం స్మరించాలి.

ఈ విషయం గోద వ్రాసిన 'నాచ్చియార్ తిరుమొళి'లో ఒక పాశుర భావం.

వ. విష్వక్సేన పూర్వకంబుగా వినయంబున వచ్చినవారికి నాతిథ్యంబు లొసంగి యుచితాసనంబుల నాసీనులై యున్నవారి యాగమన ప్రయోజనం బడిగి తెలిసి ప్రమదరసభరితాంతరంగుండై యిట్లనియె. 117

విష్వక్సేన పూర్వకంబుగాన్ = విష్వక్సేనుని ముందుగా ; ఆతిథ్యంబులు = అతిథి మర్యాదలు ; ఉచిత = తగిన ; ఆసనంబులన్ = పీటలపై ; ఆగమన = రాకయొక్క ; ప్రయోజనంబు = కారణం; ప్రమదరస = సంతోష రసంతో ; భరిత =నిండిన ; అంతరంగుడై = హృదయం కలవాడై;

## గోదాదేవి శ్రీరంగనాథుల వివాహం

క. ధన్యుఁడ నైతిం దన కీ
కన్యక నీఁగాంచి భృగువుగౌరవము c బయో
ధిన్యాయము నొదవె నిటే
నన్యాయంబే ? చమూప హర విధులారా . 118

ధన్యుడ నైతిన్ = కృతార్థుడనైనాను ; చమూప = విష్వక్సేనా ; హర = రుద్రా ; విధులారా = బ్రహ్మ లారా ; తనకున్ = శ్రీహరికి ; ఈ కన్యకన్ = మా అమ్మాయిని ; ఈన్ = ఇవ్వటం ; కాంచి = పొంది ; భృగువు = ఆమహర్షి గౌరవమును; పయోధి = పాలసముద్రుని ; న్యాయమున్ + ఒదవెన్ = పద్ధతి కల్గింది ; ఇటు+ ఏన్ = ఇలాగైతే ; అన్యాయంబే ? = అన్యాయం కాదు కదా .

ఇది వరకు తన కూతురును అంతఃపురంలో పైచుకోవటం న్యాయం కాదన్నాడు. కనుక ఈ విధంగా మీరు రావటం న్యాయం - లోకరీతి-

క. వినుఁ డీఁ దగు సంబంధపు
టెనయికఁ గని మోచి తెచ్చి యిచ్చెననరె చు
ల్కని నరులు; గాన మాపుర
మునకు న్విజయంబు సేయఁ బుత్త్రిక నిత్తుఁ. 119

వినుఁడు = వినండి; ఈఁతగు = ఇవ్వటానికి తగిన; సంబంధపు+ ఎనయికన్ = వివాహం చేయటానికి తగిన చుట్టరికపు పొందునకు; కని = చూచి; మోచి = నెత్తిమీద వేసుకొని; తెచ్చి; ఇచ్చెను = పరునింటికి తెచ్చి ఇచ్చాడంటారు; చుల్కని = తేలికైన; నరులు = మానవులు; కానన్ = కాబట్టి; మా పురమునకున్, విజయంబు సేయన్ = దయచేస్తే; పుత్త్రికన్ = కుమార్తెను; ఇత్తున్ = ఇస్తాను.

తగిన సంబంధం చూచి కూతురును పెళ్లికొడుకు ఇంటికి మోసుకొని మరీ తెచ్చి అప్పగించాడని తెలిక మనసుగల వారనుకుంటారు కదా. కనుక మా నగరానికి దయచేస్తే నా కూతు నిస్తాను.

తే. ప్రభుతఁ బరమేశ్వరుం డైనఁ బత్ప్రపన్న
జనమున కొసంగు మీకు నీ చనవు, శౌరి
తానె కట్టినభూమికఁ దాల్చు మాకు
ఘనత యిది మమ్ముఁ జేయుట తనదు ఘనత. 120

శౌరి = శూరసేన వంశంలో పుట్టిన వాడు; ప్రభుతన్ = దొరతనం చేత; పరమ+ ఈశ్వరుండు+ ఐనన్ = లోకేశ్వరుడైనప్పటికి; పత్ = పాద; ప్రపన్న = దాసులైన; జనమునకున్ = వారికి; మీకున్; ఈ చనవున్ = ఈ మాత్రపు చనువు; ఒసంగున్ = ఇస్తాడు; తానె = శ్రీహరి తానై; కట్టిన = నాకు కట్టిన, భూమికన్ = వేషం; తాల్చు = ధరించిన; మాకున్ = మామగారినైన మాకూ; ఘనత = గొప్పదనం; మమ్మున్; చేయుట = ఆ ఘనతకు యోగ్యునిగా చేయటం; తనదు ఘనత = తన గొప్పదనం.

సమస్త జగత్ప్రభువైనా పాదదాసులైన భక్తుల మాట తాను జవదాటడు. మామగారి వేషాన్ని తానై నాకు కట్టి దాని ఘనతను రక్షించే బాధ్యత కూడా తనదే కనక కాదనడు.

విశే ॥ భూమిక-

రాజ్య భూమిక దాల్చిన రాజునకును 3-42.

జగన్నాటకంలో విశ్వ రంగం మీద ప్రతివ్యక్తీ ఒక వేషధారి. ఆ భూమిక రాజుదీ కావచ్చు- సామాన్య వ్యక్తిదీ కావచ్చు. ఆవేషాన్ని పోషించటమే నాట్యకళ. నటనా చాతుర్యం. వర్ణమంటే ఆ భూమికయే ;పదవీ భూమికే. భూమికను ధరింప చేసింది శ్రీహరి. ఆత్మ శరీరానికి కట్టిన వేషం; భూమిక- ఇదే నేటి మనస్తత్త్వ శాస్త్రకారులు చెప్తున్న సుప్త చైతన్య వేషం. బాహ్య జాగృత చైతన్యం. ఇది యథార్థం కాదు. సుప్త చైతన్య మన్న యధార్థ సత్యం తొడిగిన వేషం. దీన్నే Mask Theory అంటారు. Mask - అంటే నటకుడు ధరించే ప్రతిశీర్షకం - ముసుగు.

వేషధారి వేరు - వేషం వేరు. ఈ ప్రజ్ఞానం రాయలవారికి పుష్కలంగా ఉంది. ఇది ప్రాచీనుని దృష్టి .

## శ్రీవిలుబుత్తూరునకు ప్రయాణం

తే. అనినఁ జని విన్నవింప దయారసార్ద్ర
చిత్తుడై విశ్వభర్త పక్షిప్రధాన
పౌప వాహ్యంబు నెక్కి బ్రహ్మాది సురులు
బలసి తమ తత్తడుల నెక్కి కొలిచి రాఁగ . 121

అనినన్ = అంటే; చని = పోయి; విన్నవింపన్ = మనవి చేస్తే; దయారస+ ఆర్ద్రః కృపారసంతో స్నిగ్ధమైన; చిత్తుఁడై = మనస్సు కలవాడై; విశ్వభర్త = లోకనాథుడు; పక్షిప్రధానప = పక్షిరాజైన గరుత్మంతుడు; ఔపవాహ్యంబున్ = వాహనమును; ఎక్కి = అధివసించి; బ్రహ్మ+ ఆది సురలు = బ్రహ్మ మొదలైన

దేవతలు; బలసి = చుట్టుకొని; తమ; తత్తడులను = వాహనాలను; ఎక్కి; కొలిచి = సేవిస్తూ; రాగన్ = రాగా-

అనగా విని వారు పోయి జగన్నాథునకు విన్నవిస్తే ఆయన గరుత్మంతునెక్కి బయలు దేరాడు. వెంటనే బ్రహ్మాది దేవతలు తమ తమ వాహనాల నెక్కి సేవిస్తూ రాగా-

క. నాసీరుఁ డగుచు సూత్ర వ
తీ సఖుఁ డుడువీథి ( బౌఁజుఁ దీర్చిన ప్రజ భూ
షాసి శతకోటి శతకో
టీ సవితృప్రభలు దిశల డెప్పర మలమన్. 122

సూత్రవతీ సఖుడు = సూత్రవతీ దేవి భర్త; నాసీరుఁడు+ అగుచున్ = సేనకు ముందు పోయేవాడుకాగా; ఉడువీథిన్ = నక్షత్రమార్గంలో; పౌజు = సేన; తీర్చినన్ = వరుసలలో నిలబెట్టగా; ప్రజ = పెండ్లి పెద్దల; భూష = నగల; అసి = కత్తుల; శతకోటి = వజ్రాయుధ; శతకోటి = నూరు కోట్ల; సవితృ = సూర్యుల; ప్రభలు = కాంతులు; దిశలన్ = దిక్కులందు; డెప్పరము = అతిశయంగా; అలమన్ = వ్యాపిస్తూ ఉండగా;

విష్వక్సేనుడు సేనకు ముందు నడుస్తున్నాడు. సేనలు బారులు దీర్చి నడుస్తున్నవి.

బంధుకోటి ధరించిన నగలు- కత్తులు- వజ్రాయుధాల నూరుకోట్ల కాంతులు సూర్య బింబాలై దిక్కులందు ప్రకాశిస్తూ ఉంటే-

వ. శ్రీవిల్లిపుత్తూరికిం జని విశ్వకర్మ మణిమయంబుగాఁ గట్టిన విడిదిపట్టున విడిసి యయ్యాదిమపరుండు దివ్యాప్సరసలు హరిద్రాదికస్నానీయ మంగళద్రవ్యమండనం బొనర్పఁ బెండిలికొడుకై దివ్యవాదిత్రంబులు నారదాది దివ్యముని గానంబులు వెలయం గలధౌత ధవళ దివ్య ధారాధరంబులు గురియు సుధాధారల నభిషిక్తుండై ముక్తావళీ కౌస్తుభాముక్త కంబుకంధరుండును గేయూరకంక ణాలంకృతుండును మకరకుండల మకుటాది భూషావిభూషితుండును దివ్యాంగరాగ రూషితుండును బీతాంబర సంవీతుండును దులసీ కల్పతరు ప్రసవస్రగాశ్రితోరస్కుండునై యుండు నంత నక్కడ నటకు మునుప గృహప్రవేశంబుసేసి సంభ్రమాయత్తుం డగు విష్ణుచిత్తు ప్రయత్నంబున. 123

విడిదిపట్టు = విడిది చేసే చోటు; విడిసి = విడిది చేసి; ఆ+ ఆదిమపరుండు = ఆ మొదలి పెండ్లి కొడుకు; దివ్య+అప్సరసలు = వేల్పుటచ్చరలు; హరిద్ర = పసుపు; ఆదిక = మొదలైన; స్నానీయ = స్నానయోగ్యమైన; మంగళద్రవ్య = శుభమైన వస్తువులు; మండనంబు = అలంకారం; దివ్యవాదిత్రంబులు = దేవతల వాద్యాలు; దివ్యముని = వేల్పులోక మందలి మునుల; గానంబులున్ = పాటలును; ధవళ = తెల్లని; దివ్య = దేవతా సంబంధమైన; ధారాధరంబులు = మబ్బులు; సుధాధారలన్ = అమృతపు సోనలతో; అభిషిక్తుండు+ ఐ = అభిషేకింప బడ్డవాడై; ముక్త+ ఆవళీ = ముత్యాలసరాలు; కౌస్తుభరత్నం; ఆముక్త =

చక్కగా అలంకరింప బడిన; కంబుకంధరుండు = శంఖం వంటి కంఠం కలవాడు; కేయూర కంకణ+అలంకృతుండు = భుజకీర్తులు, కడియాలతో అలంకరింప బడ్డవాడు; మకరకుండల = మకరాకృతికల చెవిపోగులు; మకుట = కిరీటం; ఆది = మొదలైన; భూషా = నగలతో; విభూషితుడు = అలంకృతుడు; దివ్య+అంగరాగ = దివ్యమైన మై పూతలతో; రూషితుండునున్ = పూయబడినవాడును; పీత = పచ్చని; అంబర = వస్త్రం; సంవీతుడు = చుట్టినవాడు; తులసి; కల్పతరు = కల్పవృక్ష; ప్రసవ = పూల; స్రక్ = దండలతో; ఆశ్రిత = పొందబడిన; ఉరస్కుండునై = వక్షస్థలం కలవాడై; అటకున్ మునుప = శ్రీరంగనాథుడు వేంచేయటానికి ముందే; గృహప్రవేశంబు సేసి = ఇంటికి చేరి; సంభ్రమ+ ఆయత్తుండు = ప్రేమాదరాలతో; ప్రయత్నంబునన్;

## కళ్యాణ వైభవం

క. శర్వాణీ వాణీ ముఖ
గీర్వాణీ కోటి జానకీ రఘుకుల రా
ట్పూర్వా చరిత వివాహో
ఖర్వ సుగీతములు పాడ గా విభవమునన్. 124

శర్వాణి = పార్వతి; వాణీ = శారద; ముఖ = మొదలైన; గీర్వాణీకోటి = దేవతల సముదాయం; జానకీ రఘుకులరాట్ = సీతారాములచేత; పూర్వ = ముందు; ఆచరిత = ఆచరింపబడిన; వివాహ = పెండ్లియొక్క; అఖర్వ = అధికమైన; సుగీతములు = చక్కని పాటలు; పాడగాన్ = పాడుతూ ఉండగా; విభవమునన్ = వైభవంతో;

పార్వతీ, సరస్వతీ ప్రభృతులైన దేవస్త్రీలు సీతారాముల పెండ్లి పాటలు పాడుతూ ఉంటే వైభవంగా-

తెలుగు వారిండ్లలో పెండ్లిండ్లకు సీతారాముల గాథలనే పాటలుగా పాడటం జానపద వాఙ్మయ సంపదగా నేటికీ మనకు మిగిలి ఉంది.

రాయల వారికీ జానపద చిత్తవృత్తి - జానపద జీవన విధానానురక్తి ఉంది.

వేసవి వర్ణనలో 2-55 లోని పాటల సొగసే కాక కార్మిక కర్షక జీవన విధానాన్ని అంత తన్మయుడై వర్ణించిన కవి మరొకడు లేడు. ఉన్నా తర్వాత వచ్చారు.

తే. నెమ్మి నేకావళియు స్రగ్విణియును జామ
రంబు లిరుగెడ నిడ హరిద్రాద్రవమునఁ
బెట్టిరి నలుంగు లక్కన్యఁ బెండ్లి కూఁతుఁ
జేయు ఋషి పత్నులర్థి నాశీర్యుతముగ. 125

నెమ్మిన్ = స్నేహంతో; ఏకావళి స్రగ్వణియున్ = గోదాదేవి చెల్మి కత్తెలు; ఇరుగడన్ = రెండుప్రక్కలా; చామరంబులు = వింజామరులు; ఇడన్ = వేయగా; ఋషిపత్నులు = సప్తర్షుల భార్యలు; ఆకన్యన్ = ఆ కన్నెను; అర్థిన్ = ప్రేమతో; ఆశీర్యుతముగన్ = ఆశీర్వాదపూర్వకంగా; హరిద్రాద్రమమునన్ = పసుపు కలిపిన నూనెతో; నలుంగు పెట్టిరి = నలుగు పెట్టారు.

చెలికత్తెలు వింజామరలు వీస్తుంటే రెండు వైపులా - సప్తమునిపత్నులు ఆశీస్సులతో, ఆదరణతో ఆమెకు పసుపు నూనె రాసి నలుగు పెట్టారు.

5-37 లో ఈ చెల్మి కత్తెల అవతార ప్రయోజనమిదే కనుక ఇక్కడ వారి ప్రసక్తి వచ్చింది. ఇంతటితో ఆ ప్రయోజనం ముగిసింది.

శాకుంతలంలో ప్రియంవదానుసూయుల పాత్ర నిర్మాణం శాకుంతల భర్త గృహానికి పోవటంతో ముగిసినట్లు.

తే. అట్లు వైవాహికపుదీక్ష యమరఁ గమ్మ
నూనెఁ దలయంటి నెఱులు గందానఁ బులుమ
స్వర్ణ మణికుంభ హిమవారి జలకమాడి
నట్టి జగదీశ్వరికి వేల్పు టబల యోర్తు. 126

వైవాహికపు దీక్ష = వివాహ మన్న దొక క్రతువు కనుక దాని కనువైన దీక్ష; అమరన్ = ఒప్పారగా; కమ్మనూనెన్ = వాసన నూనెతో; తలయంటి = తలంటుచేసి; నెఱులు = కేశజాలము; గందానన్ = వాసన ద్రవ్యంతో; పులుమన్ = అలదగా; స్వర్ణ = బంగారు, మణి = రత్నాల; కుంభ = కుండలతో; హిమవారిన్ = పన్నీటితో; జలకము+ ఆడిన = స్నానం చేసిన; అట్టి; జగత్+ ఈశ్వరికిన్ = జగత్తునకు పాలకురాలైన గోదకు; వేల్పు+అబల = దేవతాంగన; ఓర్తు = ఒకతె.

స్వర్ణమణికుంభ - అతిశయోక్తి లేదు. రాయలవారి సౌధమే బంగారు రేకుతో కూర్చబడినదని, దాని నిండా రత్నాలేనని- మలయు కూట వర్ణనం చేసాడు 'పేయస్.'

ప్రస్తుతం ఈ ఐశ్వర్యం భాగవద్దత్తమైన దనిమున్నే చెప్పబడినది. (4-32) దానికి ప్రయోజన మిదే.

ఈ పద్యభావం తల్లికి చేస్తున్న అభిషేక వర్ణన. అందుకే జగదీశ్వరి శబ్దం ప్రయోగింపబడినది.

క. తడియొత్తి సన్న వలిపం
బిడి మణి పీఠస్థయైన యింతి మెఱుఁగు పె
న్నిడుద కురు లార్చి ధూపం
బిడి తుఱుము ఘటించె నొక మృగేక్షణ నెమ్మిన్. 127

ఒక; మృగ+ ఈక్షణ = లేడి కన్నులు కలది; నెమ్మిన్ = ప్రేమతో; సన్నవలిపంబు+ ఇడి =

సన్నని వస్త్రంతో; తడియొత్తి; మణిపీఠస్థయైన = రత్నపీఠం మీద కూర్చున్న; ఇంతి = గోదాదేవి; మెఱుగు = కాంతివంతమైన; పెన్ = పెద్ద; నిడుద = పొడవైన; కురులు = వెంట్రుకలు; ధూపంబు +ఇడి = అగురుపొగవేసి; ఆర్చి = తడినార్చి; తుఱుమున్ = ముడిని; ఘటించెన్ = కూర్చినది.

ఆ ముడే నేటికీ దేవాలయాల్లో గోదామూర్తిలో పెద్దదిగా ప్రత్యక్ష మౌతున్నది.

సీ. యావకద్రవమున నరుణాంఘ్రి నఖపంక్తు
లభ్యక్తములు సేసె నతివయొర్తు
నయ కల వ్రేళ్ల మట్టియలుఁ బిల్లాం డ్లిడి
పాయ వట్టముఁ బెట్టెఁ బడఁతియొర్తు ?
నెఱిక వట్టి పసిండి నీటి వ్రాఁత చెఱంగు
వెలపట్టు రహిఁ గట్టె వెలఁది యొర్తు ,
కటిసీమఁ గనక మేఖలఁ జేర్చె తారహా
రములు గీలించెఁ గంఠమున నొర్తు,

తే. కటకములు హస్తసరము లంగదము లంగు
ళీయకములును బాహువల్లికల వ్రేళ్ల
నిలిపి తాటంకనాసామణుల నమర్చి
చౌనిపె సీమంత వీథిఁ జేర్చుక్క యొర్తు. 128

అతివ యొర్తు = ఒకస్త్రీ; యావకద్రవమునన్ = లత్తుక నీటితో; అరుణ+అంఘ్రి = ఎర్రని పాదాల; నఖపంక్తులు = గోళ్లసముదాయానికి; అభ్యక్తములు సేసెన్ = పూయబడినవానిగా చేసినది.

ఒక స్త్రీ ఆమె పాదాల గోళ్లకు లత్తుక నీటిని పూసినది.

పైన్+ ఒకర్తు = పైన ఒకతె - తర్వాత ఒకామె; నయకల = నయము = నాణ్యము; కల = కల్గిన; వ్రేళ్లన్ = కాలివ్రేళ్లకు; మట్టియలు పిల్లాండ్లు+ ఇది = మెట్టెలు, పిల్లాళ్లు కాలివ్రేళ్లకు వివాహవేళ పెట్టే ఆభరణాలు పెట్టి; పాయవట్టమున్ = కాలికడియమును (పాగడము); 'పైనొకరు' - నకు శర పాఠం ''పడతియొర్తు.''

మట్టెలు పిల్లాళ్ళు ; పాగడమును మరొకతె అలంకరించింది.

నెఱిక పట్టి = కుచ్చెళ్లు పెట్టి; పసిండి నీటివ్రాత = బంగారు నీటితో చిత్రించిన; చెఱంగు = అంచుగల; వెలిపట్టున్ = తెల్లని పట్టు వస్త్రం; రహిన్ = ప్రేమతో; వెలది యొర్తు = ఒక స్త్రీ; కట్టెన్ = ధరింప జేసింది.

ఒకామె బంగారు జరీయంచుగల తెల్లని పట్టు చీరను చక్కని కుచ్చెళ్ళు పెట్టి కట్టింది.

ఓర్తు - కటిసీమన్ = నడుమున; కనక మేఖలన్ + చేర్చి = బంగారు ఒడ్డాణం పెట్టి ; కంఠమునన్ = గళమున; తారహారములు = ముత్యాల సరాలు; కీలించెన్ = కూర్చినది.

ఒకామె నడుమున బంగారు ఒడ్డాణం పెట్టి కంఠంలో ముత్యాల సరాలు కూర్చినది.

ఓర్తు = ఒకర్తె; కటకములు = కంకణాలు; హస్తసరములు = చేతిగొలుసులు (మీ చేతి నగలు); బాహు వల్లికలన్ = తీగలవంటి చేతులకు; అంగదములు = బాజు బందులు (దండ కడియం); వ్రేళ్లన్ = వ్రేళ్ళకు; అంగుళీయకములునున్ = ఉంగరాలు; తాటంక = తమ్మలు; నాసామణులున్ = ముక్కరలు; అమర్చి = అమరించి; సీమంతవీథిన్ = పాపటలో; చేర్పుక్కన్ = పాపట బొట్టు; చొనిపెన్ = పెట్టినది.

ఒకతె-

బాహులతలకు కంకణాలు - చేగొలుసులు - దండకడియాలు పెట్టి, వ్రేళ్ళ కుంగరాలు పెట్టి, చెవులకు కమ్మలు, ముక్కునకు పుడక, పాపటలో పాపటబొట్టు పెట్టినది.

విశే ॥ నాటి స్త్రీల ఆభరణాలంకారాల సమగ్రత చిత్రితమైనది.

క. కలికి తెలిగన్నుఁ గవఁ గ
జ్జల రేఖలు దీర్చి మేన సారంగమదం
బలఁది లలామక మిడి చెం
గలువలు క్రొవ్వెదకు వేఱొకర్తు ఘటించెన్. 129

వేఱు + ఒకర్తు = మరొకతె; కలికి = గోదాదేవి యొక్క; తెలిగన్నుఁగవన్ = తెల్లని కంటి జంటలో; కజ్జల రేఖలు = కాటుక గీరలు; తీర్చి; మేనన్ = శరీరమున; సారంగమదంబు = కస్తూరి; అలఁది = పూసి; లలామకము = బాసికము; క్రొవ్వెదకున్ = పెద్ద కొప్పులో; చెంగలువలు = ఎర్రకలువలు; ఘటించెన్ = కూర్చినది.

విశే ॥ లలామకము = నొసట కట్టే పూల అలంకార విశేషమని 'మోనియర్ విలియంస్'.

5-8,12 పద్యాలు చూచుకోవాలి.

వ. ఇట్లలంకృతయైయుండ లగ్నం బాసన్నంబయ్యె నని విన్నవించుటయుఁ బన్నగ శయనుండు మార్తాండమండలంబులు పండ్రెండును దివియలై వెలుంగఁ, దారకల గుంపు జగజంపుగా శతపత్ర శత్రుం డాతపత్త్రత యంగీకరింప, సింధుపతి సౌగంధిక దళోపహార సహితంబుగా విపణిఁ గలయంపిఁ జిలికింపఁ, బ్రకృతికాంత క్రంతసురకాంతల ంగూడుకొని సంతరింప, హుతవహుం డగరుధూపంబు రేఁపఁ, బర్జన్యుం డుల్లెడయిడఁ, బ్రాచీన పాఠంబులు పాఠకౌఘంబులయి బిరుదప్రబంధంబులు పఠియింప, విధినందన సనందనాదులు సంగీత మాంగల్యంబున నంతరంగంబున కింపొసంగ, విహంగ పుంగవుండు మత్తమాతంగంబై ఖచితమణి కల్యాణంబగు పల్యాణం బంగీకరింప, నప్రాకృత

వైభవంబునం జని పరమ సంభ్రమంబున భాగవత వతంసంబు భక్తి కలిత బహు ప్రణామపూర్వకంబుగా నెదుర్కొని నెక్కిరింత డిగ్గి విష్వక్సేను కరం బవలంబించి కక్ష్యాంతరంబులం జంచలాక్షులు గడుగు నడుగుల జలంబులకుం బయిపయిం బడి గీర్వాణసిద్ధ సంఘంబు లహంపూర్వికఁ నుర్విని నిర్వారిగా నూర్చికొని ప్రాశింపఁ బ్రవేశించి తదీయ నిర్దిష్టం బగు జాంబూనద పీఠంబున నుపవిష్టుండై యతండు వెండియు బంగారు భృంగారుకంబులఁ గనక భాజన నిక్షిప్తంబు లగు కుశేశయపేశల పదకిసలయంబులు గడిగి షోడశోపచార సహితంబును సపరిష్క్రియంబు నగు మధుపర్కంబు నొసంగం గని యయ్యాళ్వారు చేవేరియుం దానును ధారవోయ నా కన్యకారత్నంబుఁ బరిగ్రహించె ననంతరంబు 130

పన్నగ = ఆదిశేషుడు; శయనుండు = సెజ్జగా కలవాడు; మార్తండ మండలంబులు = సూర్యబింబాలు; దినియలు = దివ్వెలు; జగజంపుగా = వ్రేలాడే కుచ్చులు కాగా; శతపత్ర = తామరపువ్వు; శత్రుండు = విరోధి = చంద్రుడు, ఆతపత్రత = గొడుగు తనం; సింధుపతి = సముద్రం; సౌగంధిక దళ = ఎఱ్ఱకలువల రేకులు; ఉపహార = కానుక; విపణిన్ = అంగడి వీథుల్లో;

ప్రకృతికాంత = పరిణామ శీలముగల పంచ భూతాత్మకమై ప్రకృతిని స్త్రీగా ఉపమించటం వేదాంత విద్యా విషయికం కనక; క్రంత = వధువు ఇంటికి వస్తుసముదాయం తీసికొని పోయే పెండ్లి కొడుకు పక్షం వారి ఊరేగింపు; సంతరింపన్ = సంఘటిస్తే; హుతవహుండు = అగ్ని; పర్జన్యుండు = వర్షదేవత; ఒల్లెడ = మేలుకట్టు (దుప్పటిని కర్రలతో పైకెత్తి పట్టుకొని పెండ్లివారు అరివేణి కుండవంటి వాటిని పట్టుకొని పోతారు); ప్రాచీన పాఠంబులు = నాల్గువేదాలు; పాఠక+ ఓఘంబులు = వందిమాగధులు; బిరుదు = రాజుగారి చరిత్ర; ప్రబంధంబులు = కైవారాలు; విధినందన = బ్రహ్మకుమారుడు నారదుడు; సనందన+ ఆదులు - సనక సనందనాదులు - నల్వురు బ్రహ్మమానస పుత్రులు; సంగీత మాంగల్యంబునన్ = శుభసంగీతంతో; విహంగ = పక్షులలో; పుంగవుండు = శ్రేష్ఠుడు; గరుత్మంతుడు; మత్త = మదించిన; మాతంగంబు = ఏనుగు; ఖచిత = కూర్చబడిన; మణి = రత్నాలు; కళ్యాణంబు = బంగారు కలది; పల్యాణంబు = హౌదా; అప్రాకృతవైభవంబునన్ = దేవతాసంబంధమైన ఐశ్వర్యంతో; పరమ = గొప్ప; సంభ్రమంబునన్ = ఆనందంతో; భాగవత వతంసంబు = భక్తశ్రేష్ఠుడు (పెరియాళ్వారు); బహు = అతిశయంబైన; ప్రణామ = నమస్కారం; ఎక్కిరింత = వాహనం; డిగ్గి = దిగి; కక్ష్య+అంతరంబులన్ = ద్వారాలనడుమ; చంచల+ అక్షులు = మెరుపు చూపులుగల అంగనలు; గీర్వాణ = దేవతలు; సిద్ధ = సిద్ధులన్న జాతి దేవతలు; అహంపూర్వికన్ = నేను ముందు నేనుముందని త్రోసుకొంటూ; ఉర్విన్ = భూమిని; నిర్వారిగాన్ = నీరులేనిదానిగా; ఊర్చికొని = ఊరించుకొంటూ; ప్రాశింపన్ = త్రాగగా; తదీయ నిర్దిష్టంబు+ అగు = ఆయన కోసం పెట్టిన; జాంబూనద = బంగారు; భృంగారుకంబులన్ = చెంబులతో; భాజన = పళ్ళెములలో; కుశేశయ - తమ్మిపువ్వుల్లాగా; పేశల = సుకుమారమైన; పదకిసలయంబులు = చిగుళ్ళ వంటిపాదాలను; షోడశ = పదునారు; ఉపచార = సేవలు (ఆవాహన, ఆసనం, పాద్యం, అర్ఘ్యం, ఆచమనం, స్నానవస్త్ర యజ్ఞోపవీతాలు, గంధపుష్పధూపదీపాలు, నైవేద్యం, తాంబూలం, ఉత్తర

నీరాజనం, మంత్రపుష్పం); సపరిష్క్రియంబును = అలంకారయుక్తమైన; మధుపర్కంబును = బెల్లం కలిపిన పెరుగు; ఆ యాళ్వారు = విష్ణుచిత్తుడు; దేవేరియు = భార్యయు = తల్లి.

(ఈ విషయం ఇక్కడా, ప్రథమాశ్వాసంలో వారి అతిథి మర్యాదల వర్ణనల్లో వచ్చింది, గోదాదేవి దొరికినపుడు విష్ణుచిత్తుడామె కిచ్చినట్లు - ఇలా మూడు సార్లు స్మరింపబడ్డది); ధారపోయన్ = ఉదక పూర్వకంగా కన్యాదానం చేస్తే; పరిగ్రహించెన్ = పాణిగ్రహణం చేసాడు.

( ఆముక్త మాల్యదను - కావ్యాన్ని - కన్నవారిద్దరూ విష్ణువునకే ధారపోసారు.)

ఇదే భూమి (సత- గోద) ఆకాశ (రామ) వివాహం ఆత్మ శరీర- భౌతిక+ ఆధ్యాత్మిక సమన్వయం. వేదంలో ఆకాశం తండ్రిగా -భూమితల్లిగా దర్శింపబడ్డారు.

మ. కలధౌతద్రవ చిత్రము ల్మెఱయ ముక్తాస్యూత మౌ మేచకాం
చలపుం బెందెర వారి లగ్నము సమాసన్నంబుగా వేల్పుఁ బె
ద్దలు వంపన్ గుడ జీరకంబులు సముద్యత్ప్రేమ నన్యోన్య మం
జుల హస్తంబుల నుంచి రర్థిఁ గనుమించు ల్చిట్టుముట్టాడగన్. 131

కలధౌత = బంగారపు; ద్రవ = నీటితో వ్రాసిన; చిత్రముల్ = బొమ్మలు; మెఱయన్ = ప్రకాశిస్తూ ఉంటే; ముక్తాస్యూత = ముత్యాలు గ్రుచ్చిన; మేచకాంచలపున్ = నల్లని అంచులున్న; పెన్ +తెఱ = పెద్దతెరను; వారి = పట్టుకొని; వేల్పుఁబెద్దలు = పెద్దలైన దేవతలు; లగ్నము సమాసన్నంబుగాన్ = ముహూర్తం దగ్గరకాగా; వంపన్ = తెరను క్రిందికి దించితే; గుడ = బెల్లం; జీరకంబులున్ = జీలకర్రా; సముద్యత్ ప్రేమన్ = ఉప్పొంగే ప్రేమతో; అర్థిన్ = ఆసక్తితో; అన్యోన్య = పరస్పర; మంజుల = కోమల; హస్తంబులన్ = చేతుల్లో; కనుమించుల్ = కంటిమెరుపుల కాంతులు; చిట్టుముట్టు+ ఆడగన్ = సందడించగా; ఉంచిరి.

బంగారు ద్రవంతో చిత్రించిన బొమ్మలు- పూలు- ఇత్యాదులు కల్గి, ముత్యాలు గ్రుచ్చిన నల్లంచు దుప్పటిని వృద్ధులైన దేవతలు వధూవరుల మధ్యపట్టుకొని - లగ్నం సమీపించగానే దించారు. వధూవరులు అత్యనురాగంతో బెల్లం జీలకర్రను కోమల హస్తాల్లో ధరించారు.

విశే ॥ వివాహంలో వధూవరుల శిరస్సులపై ముహూర్త సమయంలో గుడజీరకము లుంచటం ఆచారం. అదే ముఖ్యం. (చూ. 4-150) అంబువు తెఱవారఁగా (1-64) ఇక్కడ తెఱవారిగా ప్రయుక్తంకావటం చమత్కారం.

పూర్వకాలంలో బంగారుద్రవంతో వస్త్రాలపై వివిధాలంకారాలు చిత్రించట ముండేది, నేటి అద్దకం లాగా.

చ. మఱి వనమాలి చూడమున మానిని ముత్తెపుఁబ్రాలు వోయుచో
మెఱయుఁ దదంగుళీకిసల మేళనఁ జక్రి చెమర్చ రాలి మై

నఱిమిఱి ఘర్మబిందువులు నమ్మణులు న్మొగిలందునుండి డా
ల్గిఱిగొన జాఱు ధారల బలె న్వడగండ్ల బలె న్గనుంగొనన్. 132

మఱి = తర్వాత; మానిని = గోదాదేవి; వనమాలి చూడమునన్ = తులసిమాలను దాల్చిన శ్రీహరి తలపై; ముత్తెపుప్రాలు = ముత్యాలు కలిపిన తలంబ్రాలు; పోయుచోన్ = పోస్తున్నపుడు; అమ్మణులున్ = ఆ ముత్యాలు; తత్ = గోద; అంగుళీకిసలమేళనన్ = చిగుళ్ళవంటి వ్రేళ్ళ స్పర్శతో; చక్రి = హరి; చెమర్పన్ = చెమరిస్తే; మైన్ = శరీరం మీద; అఱిమిఱిన్ = సాంద్రంగా; ఘర్మబిందువులున్ = చెమట బొట్లు; రాలి = పడి; కనుంగొనన్ = చూడగా (చూడటానికి); మొగిలి+అందున్ + ఉండి = మబ్బులోనుండి; డాల్ = కాంతులు; గిఱికొనన్ = వ్యాపిస్తూ ఉండగా; జాఱు = పడుతూ ఉన్న; ధారలబలెన్ = వానధారల్లాగా; వడగండ్లబలెన్ = వడ గళ్ళులాగా; మెఱయున్ = మెరుస్తున్నవి.

శ్రీహరి తలపై వధువు తలంబ్రాలు పోస్తున్నది. ఆ తలంబ్రాలలో ముత్యాలున్నాయి. పోసే వేళ ఆమె వ్రేళ్ళు ఆయనకు తగిలేసరికి చెమట పట్టింది. ఆ బొట్లూ - ముత్యాలూ ఆ నల్లని శరీరం మీద నుండీ జారుతూ ఉంటే మేఘం నుండి జారే వాన ధారలు వడగళ్ళు లాగా ఉన్నాయి.

అలం : ఉపమ.

తే. ఇంతి దోయిట సేసఁ బ్రాలెత్తు చోట
గుబ్బ పాలిండ్ల క్రేవ గ్రక్కున మురారి
గన్ను వేయుటఁ గని లజ్జ గదుర బాహు
లెత్తక కరాగ్రములన పై కెగురఁ జల్లె. 133

ఇంతి = గోదాదేవి; దోయిటన్ = దోసిలితో; సేసఁప్రాలు = తలంబ్రాలు; ఎత్తుచోటన్ = ఎత్తే సమయంలో; గుబ్బపాలిండ్ల క్రేవన్ = ఉబికిన పాలిండ్ల వైపు; మురారి = శ్రీహరి; కన్నువేయుటన్ = కంటి చూపు ప్రసరించటం; కని = చూచి; లజ్జ = సిగ్గు; కదురన్ = క్రమ్ముకోగా; బాహులు = చేతులు; ఎత్తక = ఎత్తకుండానే; కర+అగ్రములనన్ = దోసిళ్ళతోనే (చేతుల పైభాగాలతో); పైకిన్; ఎగురన్ = ఎగిరిపోయేటట్లు, చల్లెన్ = చిమ్మింది.

విశే ॥ పై పద్యంలో స్వేదమన్న సాత్త్విక భావం.

ఇందులో లజ్జ - అన్న వ్యభిచారి భావం - చెప్పబడ్డాయి.

క. గళమునఁ గట్టెను హరి మం
గళ సూత్రము పులక లతిన గాత్రముఁ బొదువన్,
నెలఁతయుఁ బలియును గరముల
నలవఱిచిరి కంకణంబు లన్యోన్యంబున్. 134

హరి = విష్ణువు; గళమునన్ = కంఠంలో , మంగళ సూత్రమున్ కట్టెను; అతివ = గోదా; గాత్రమునన్ = శరీరం మీద; పులకలు = రోమాంచం+గగుర్పాటు; పొదువన్ = క్రమ్మగా; నెలతయున్ = గోదా; పతియున్ = శ్రీహరి; అన్యోన్యమున్ = పరస్పరము; కంకణంబులు = వైవాహిక వ్రత సరాలు, కరములన్ = చేతులకు; అలవఱిచిరి = కట్టారు.

సీ. లలనచే నిష్ఠతో లాజలు వేల్పించి,
శార్ఙ్గి మెట్టించెను సప్తపదులు
తెఱవఁగూడి యరుంధతీదర్శనముఁ జేసె,
బ్రహ్మరుద్రాది గీర్వాణకోటి
యర్పించు నుడుగర లనుకంపఁ గైకొని
యనిచెఁ బ్రసాద భాజనులఁజేసి
యాత్మ పట్టణమున నతివఁ దోడ్కొని విజ
యంబు సేసెను మహాహర్ష మొప్ప

తే. సహ్యకన్యాతటోద్యాన చందనద్రు
కుంజముల నీలకుంతలఁ గుస్తరించి
కంతు సామ్రాజ్య మేలించి కరుణఁ జిత్త
మొలయ జగములఁ బాలించుచున్నవాఁడు. 135

శార్ఙ్గి = శార్ఙ్గ మన్న పేరుగల ధనుస్సును తాల్చినహరి; లలనచేన్ = గోదాదేవితో; నిష్ఠతోన్ = విధ్యనుసారంగా; లాజలు = పేలాలు; వేల్పించి = హోమం చేయించి; సప్తపదులు = అగ్నిచుట్టు ఏడడుగులు; మెట్టించెను = నడిపించినాడు.

తెఱవన్ +కూడి = గోదాదేవితోపాటు; అరుంధతీ దర్శనము చేసెన్ = అరుంధతీ నక్షత్రం చూచినాడు; బ్రహ్మ; రుద్ర; అది = మొదలైన; గీర్వాణకోటి = దేవతాసముదాయం;

అర్పించు = భక్తితో ఇచ్చిన; ఉడుగరలు = కానుకలు; అనుకంపన్ = దయతో; కైకొని = అంగీకరించి; (కై = చేతితో, కొని = గ్రహించి); ప్రసాదభాజనులన్ +చేసి = అనుగ్రహపాత్రులను చేసి; అనిచెన్ = పంపించాడు;

మహాహర్షము = గొప్ప సంతసం; ఒప్పన్ = ప్రకాశిస్తుండగా; అతివన్ = గోదను; తోడుకొని = తనతో పాటు తీసుకొని; ఆత్మ పట్టణమునకున్ = ఆత్మ పురానికి ( ఆత్మయే పురం, అదే శ్రీరంగం, వైకుంఠం) విజయంబు చేసెన్ = వచ్చినాడు.

సహ్య కన్యాతట = కావేరి ఒడ్డున; ఉద్యాన = తోటల్లో; చందన = గంధపు; ద్రు = చెట్ల; కుంజములన్ = పొదల్లో; నీలకుంతలన్ = నల్లని కురులు గల గోదను; కుస్తరించి = కౌగిట లాలించి;

కంతుని = మన్మథుని; సామ్రాజ్యము = మహారాజ్యమును; ఏలించి = ఏలేటట్లు చేసి; చిత్తము = మనస్సు; కరుణన్ = దయతో; ఒలయన్ = వ్యాప్తం కాగా; జగములన్ = లోకాలను; పాలించుచున్ ఉన్నవాడు = పాలిస్తూ ఉన్నాడు.

పాలించుచున్ = నేటికీ- ఎప్పటికీ- త్రికాలసంబంధమైన పాలన తప్ప ఒకప్పుడుండి మరొకప్పుడు పోయినది లేదు.

కావ్యం '(శ్రీ) కమనీయ హారమణి' - తో మొదలై ఇక్కడ ముగిసింది.

దీనిలో ఒక వృత్తం = కథ - జగత్ భ్రమణం - పూర్తయినది.

కావ్యం వృత్తాకారం. దేశ కాల సంసారాల్లాగానే.

(దీని విషయం పీఠికలో చూచుకోవాలి).

కంతు సామ్రాజ్య మేలించి = ఆమెచేత ఏలించి ఎందుకంటె ఆమె కోరిక అదే కనుక, భగవంతునికి కోరిక లుండవు కనుక.

**''యే యథామాం ప్రపద్యంతే- తాం స్తథైవాభిజామహ్యాం.''**

ఎవరేవిధంగా నన్ను ఉపాసిస్తే వారిని నే నదే విధంగా భజిస్తానని గీతాస్వామి అభయం కనుక.

ఉ. స్కంద సరస్తటీరమణ కందర చందన కుంద వాటికా
మంద సమీరలోల వనమాలిక నిర్మల దివ్య విగ్రహా
స్పంద విభాధరీకృత నభస్స్ఫుట కాళిక,వల్లవాంగనా
బృంద మనోభిమాన ధృతి భేదన, పేశల వంశవాదనా. 136

స్కంద సరః = కుమార పుష్కరిణి; తటీ = ఒడ్డునే ఉన్న; రమణ = అందమైన; కందర = గుహల్లో నుండి; చందన = గంధపు చెట్ల; వాటికా = తోటలలో నుండి; మంద = మెల్లని; సమీర = గాలులకు; లోల = కదలుతున్న; వనమాలిక = తులసి దండ కలవాడా;

నిర్మల = స్వచ్ఛమైన; దివ్యవిగ్రహా = దేవలోక సంబంధ మూర్తియొక్క; అస్పంద = చ్యుతంకాని; విభా = కాంతితో; అధరీకృత = క్రిందుచేయబడ్డ; నభః = ఆకాశము యొక్క; కాళిక = నలుపు కలవాడా;

వల్లవ+ అంగన = గొల్లస్త్రీల; బృంద = సమూహం; మనోభిమాన = మానసికమైన గౌరవాన్ని; ధృతిన్ = ధీరత్వాన్ని; భేదన = భేదించే; పేశల = మధురమైన; వంశ = పిల్లనగ్రోవి; వాదనా = వాయించేవాడా!

తిరుమలపై స్వామి పుష్కరిణి ప్రక్కనే ఆనందనిలయమైన స్వామి కోవెల కనుక ఆ కోనేరునుండి బయలు దేరిన గాలులు గుహల్లో చందనవృక్షాల తోపుల్లో- మొల్లపొదలపై పారాడి ముందరగా వస్తుంటే- వాటికి

తన మెడలో తులసిమాల స్పందిస్తున్నది.

తన శరీరకాంతి ఆకాశందాకా వ్యాప్తమై దాని నలుపును ఆక్రమిస్తున్నది. గోపికంల ఆత్మ గౌరవమూ- ధైర్యమూ తూలిపోయేటట్లు మధురంగా వేణువు వాయిస్తున్నా డాస్వామి.

వి॥ పదాలకూర్పులో మాధుర్యం భావించాలి.

బిందుపూర్వక ద కారప్రాస, సమాస కల్పన భక్తి భావ వ్యంజకంగా ఉండటమే ఈ పద్యశిల్పం.

క. **అరిధారాఖండిత మరు**
**దరిసంఘ ! విహంగవాహనా ! యుదర మహాం**
**బుడుహ పుటభరిత మధుశం**
**బర భర జలమానుషాయమాణ ద్రుహిణా !** **137**

అరి = చక్రపు; ధారా = అంచుతో; ఖండిత = నరుకబడ్డ; మరుత్ = దేవతల యొక్క, అరి = శత్రువుల; సంఘ = సమూహము కలవాడా;

విహగ వాహనా = పక్షిరాజు రథంగా కలవాడా!

ఉదర = నాభిలోనున్న; మహాంబురుహ = గొప్ప పద్మముయొక్క; పుట = దొన్నెలో; భరిత = నిండిన; మధు = తేనెయన్న; శంబర = జల; భర = వెల్లువలో; జలమానుషాయమాణ = నీటి మనిషిలాగా ఉన్న; ద్రుహిణా = బ్రహ్మకలవాడా!

చక్రంతో రాక్షసులను సంహరించిన వాడు. పక్షిరాజును రథంగా చేసుకొన్నవాడు.

నాభీ మహాకమలంలోని తేనె యన్న నీటి వెల్లువలో బ్రహ్మను జలమానవుని వలె తేలించేవాడా !

**అలం :** ఉపమ.

స్రగ్విణి **వాలినిర్భేదనా ! వారిజాతేక్షణా !**
**శైలకన్యాస్తుతా! శార్ఙ్గచంచద్భుజా !**
**ఫాలదృక్పద్మభూ పాకభేది స్ఫుర**
**న్మౌళి మాణిక్యరుఙ్మండితాంఘ్రిద్వయా.** **138**

వాలి నిర్భేదనా = వాలిని చంపినవాడా ! వారిజాత = పద్మం వంటి; ఈక్షణా = చూపులు కలవాడా ! శైల కన్యా = పార్వతిచే;స్తుతా = స్తుతింపబడ్డవాడా ! శార్ఙ్గ = ఆపేరుకల ధనుస్సుతో;చంచత్ = అందగిస్తున్న; భుజా = భుజంకలవాడా;

ఫాలదృక్ = ఫాలనేత్రం కల రుద్రుడు. పద్మభూ = తామరలో పుట్టిన బ్రహ్మ . వీరియొక్క- పాకభేది = పాకాసురుని చంపిన ఇంద్రుడు. స్ఫురత్ = వెలుగొందే; మౌళి = శిరస్సులపైనున్న; మాణిక్యరుక్ = రత్న కాంతులతో; మండిత = అలంకృతమైన; అంఘ్రు = పాదాల; ద్వయ = జంట కలవాడా;వాలిని

భేదించినవాడు పద్మనేత్రుడు. పార్వతిచేత స్తుతింపబడేవాడు శార్ఙ్గాయుధధారి. రుద్ర - బ్రహ్మ - ఇంద్రుల మకుట రత్న కాంతులతో అలంకరింపబడిన పాద పద్మాలు కలవాడు.

మ. ఇది నైరామన యావనావనిధవాహీనాభ్రచుంబి స్ఫుర
ద్విదితాభీల మణీగృహాళి దళనోద్వేలోగ్ర హస్తి వ్రజో
ద్యదనీకాగ్రగ కృష్ణరాయమహిభృత్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాస వరేణ్య మాఱవది హృద్యంబైన పద్యంబులన్. 139

ఇది = ఈ ఆశ్వాసం; నైరామన = నిరమానూరు దగ్గర; యావన+అవనిధవ = యవన రాజుయొక్క; అహీన = గొప్ప; అభ్రచుంబి = ఆకాశాన్ని ముద్దాడే; స్ఫురత్ = ప్రకాశించే- (దూరానికి కన్పించే); అభీల = భయంకరమైన; మణీగృహ+ ఆళి = రత్నసౌధాల వరుసలను; దళన = పడగొట్టటంలో; ఉద్వేల = అతిశయించిన; ఉగ్ర = భయంకర ; హస్తి = ఏనుగుల; వ్రజ = గుంపుయొక్క; ఉద్యత్ = ముందుకు త్రోసుకొని పోయే; అనీక = సేనకు; అగ్రగ = ముందున్న; కృష్ణరాయ; మహిభృత్ = రాజు; సంజ్ఞ = పేరుకల; అస్మత్ = మా; ఆముక్తమాల్యదన్ ; ఆశ్వాసవరేణ్యము = మిక్కిలి ఉత్తమమైన; ఆశ్వాసము; ఆఱవది; హృద్యంబైన = ఆస్వాదనయోగ్యమైన; పద్యంబులన్ = పద్యాలతో; (అంతమైనది).

రాయచూరు తురుష్క రాజుతో నిరమానూరు దగ్గిర ప్రచండ యుద్ధం జరిగినదని చరిత్ర. ఆ నిరమానూరు రత్న సౌధాలను క్రిందకు కూల్చటానికి గజసైన్యం నడుస్తున్నది. దానికి ముందుండి నడిపిస్తున్న సేనాధిపతి శ్రీ కృష్ణరాయలే. ఆ ప్రభును వ్రాసిన కావ్యంలో ఇది చాలా గొప్ప ఆశ్వాసం. ఆరవది.

విశే॥ నాల్గవది వరంబు - ఆరవది వరేణ్యం- ఇంకొక ఆశ్వాసం లేదు. శ్రేష్ఠవాచకం - Superlative degree-వరేణ్యం కంటె - పైన శ్రేష్ఠవాచకం లేనట్లు.నైరామన పాఠం సరికాదనినైరావన అనే వ్రాతప్రతుల్లో ఉన్నదనీ - C.R కృష్ణమాచార్యులుగారు 1937 లో ఆంధ్రసాహిత్య పరిషత్తు పత్రికలో వ్రాసిన ఆఙ్గ్లవ్యాసం పంక్తు లుదాహరించి కీ॥శే॥ నిడదవోలు వేంకటరావుగారు నైరావన- వైశ్రవణ శబ్ద ప్రాకృత రూపమనీ - అతడుత్తర దిగధిపతి కనుక రాయలకుత్తరాన నున్న బీజాపురసుల్తాను ఆదిల్షా యవనావనీ ధవుడనీ వ్రాసారు. భారతి సంపుటం 48. సంచిక 7-1971 జూలై

మ. ఇది నీలాచల నీలచేలక సుభద్రేందీవరాభాక్షికో
ణదృగంచద్భుజ వీర్యధుర్యజయ సన్నాహోర్బటీ వాద్యభీ
త్యుదితేభేశ్వర కృష్ణరాయ మహిజాన్యుత్పాదితాముక్త మా
ల్యద నాశ్వాసము సప్తమంబలరు హృద్యంబైన పద్యంబులన్. 140

ఇది; నీల+అచల = పూరి జగన్నాథక్షేత్రంలోని; నీలచేలక = నీలవస్త్రధారి = బలరాముడు; సుభద్ర; ఇందీవర = నల్లకలువ; అభ = కాంతివంటి కాంతికల; అక్షి= నేత్ర; కోణ = కొనలందలి; దృక్ = చూపులతో; అంచత్ = ప్రకాశించే; భుజవీర్య = భుజపరాక్రమం; ధుర్య = వహించే; జయ సన్నాహ =

విజయసంరంభంతో; ఆర్భటీ = మ్రోతతో; వాద్యభీతి = భేరీధ్వనుల భయం; ఉదితుడు = కల్గిన; ఇభ+ ఈశ్వర = గజపతి కలవాడైన;

కృష్ణరాయ మహీజాని = కృష్ణరాయ భూపతి; ఉత్పాదిత = నిర్మించిన; ఆముక్తమాల్యదన్; ఆశ్వాసము; సప్తమంబు = ఏడవది; హృద్యంబైన పద్యంబులన్; అలరున్ = ఒప్పారును.

జగన్నాథ క్షేత్రంలో బలభద్ర - సుభద్ర - శ్రీకృష్ణుల దయాకటాక్షంతో ఒప్పారే భుజ పరాక్రమంతో విజయ యాత్రాసన్నాహం చేస్తున్నపుడు మ్రోగే భేరీభాంకార ధ్వనులు విని ఉదితభీతి కలవాడైన గజపతిని జయించిన శ్రీకృష్ణరాయలవారి నిర్మాణమైన ఆముక్త మాల్యద లోని ఏడవ ఆశ్వాసం- రమణీయయమైన పద్యాలతో ఒప్పారుతుంది.

విశే ॥ ఈ పద్య విమర్శకు పీఠిక చూచుకోవాలి.